కొండప్రాంతాల నివసించే ఒక వితంతు యువతి కథ ఇది. ఇందులో మనిషియొక్క అనేక రూపాలని ఎంతో నైపుణ్యంతో చిత్రించాడు రచయిత. మన సంఘంలో ప్రబలివున్న వైరుధ్యాలనీ, తారతమ్యాలనీ వేలెత్తి చూపించాడు. మనిషి పరిస్థితులకు కేవలం బానిస అనీ, పరిస్థితులే అతని జీవితాన్ని నడిపిస్తాయనీ నమ్ముతాడు రచయిత.

యశ్‌పాల్ విప్లవవాది. అతను తన జీవితంలో అనేక పోరాటలని ఎదుర్కొన్నాడు. అతని రచనల్లో సాంఘిక రాజకీయభావాలు స్పష్టంగా కానవస్తాయి. నిరుపేదలపై జరుగుతున్న దౌర్జన్యాన్ని ఎదుర్కొనేందుకు, సాంఘిక చైతన్యం కలుగజేసేందుకు అతను తన కలాన్ని శక్తివంతంగా ఉపయోగించాడు.

నేషనల్ బుక్ ట్రస్ట్,
ఇండియా.

# మనిషి రూపాలు

రచన :

యశ్‌పాల్

అనువాదము :

దిట్టకవి రామేశం



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూఢిల్లీ

1976 (1898)



రూ. 13-00

డిస్ట్రిబ్యూటర్సు :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

*Original Title:* **MANUSHYA KE ROOP** (Hindi)
*Telugu Title:* **MANISHI ROOPALU** (Telugu)

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA,
A-5, GREEN PARK, NEW DELHI-16,
PRINTED AT THE FREEDOM PRESS, MADRAS-600021.

# విషయసూచిక

# పీఠిక

## యశ్‌పాల్-వారి నవల 'మనిషి రూపాలు'

భారతదేశంలోని ఇతర భాషలవలెనే హిందీ భాషలోగూడా నవలా వికాసం పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరార్థంనుంచి ప్రారంభమయింది. ఈ పందొమ్మిదవ శతాబ్దం అనేకవిధాలుగా విశిష్టకాల మనవచ్చు. ఆంగ్లేయుల రాకతోబాటు వాళ్ళ భాష, సాహిత్యం, నాగరికతలతో భారతీయుల సంపర్కం పెరగసాగింది. హిందీ భాషలో ఆధునిక సాహిత్యవికాసానికి సంబంధించిన మొదటిభాగం భారతేందు-యుగ్ అని పిలువబడుతుంది. హిందీభాషలో వెలువడిన మొట్టమొదటి మౌలిక నవల ఏది అనే విషయంగురించి ఇప్పటికీ తర్కవితర్కాలు జరుగుతూనే వున్నాయి. కొద్దికాలం క్రిందటివరకూ లాలా శ్రీనివాసదాస్ రచించిన 'పరీక్షాగురు' (1882) అనే నవల హిందీభాషలో వెలువడిన మొదటి మౌలిక నవలగా ఎన్నుకోవటం జరిగింది. కానీ ఆచార్య రామచంద్ర శుక్ల తన 'హిందీ సాహిత్యకే ఇతిహాస్' లో శ్రద్ధారామ్ ఫిల్లౌరీ రచించిన 'భాగ్యవతి' (1877) అనే నవలను మొదటి మౌలిక నవలగా పేర్కొన్నారు. ఈ నవల చాలాకాలంవరకూ లభ్యం కాలేదు. తర్వాత చాలాకాలానికి ప్రచురింపబడింది. అయినప్పటికీ, ఇంగ్లీషుపద్ధతిలో, హిందీ భాషలో వెలువడిన మొదటి మౌలికనవల శ్రీనివాస్‌దాస్ రచించిన 'పరీక్షాగురు' అని అంగీకరించక తప్పదు.

ఈ ప్రారంభిక నవలలతర్వాత బాలకృష్ణ భట్టు, రాధాకృష్ణదాస్, లజ్జారామ్ శర్మ, కిశోర్‌లాల్ గోస్వామి, అయోధ్యాసింహ్ ఉపాధ్యాయ, 'హరిఔధ్', వ్రజనందన సహాయ్ మొదలైనవారు వ్రాసిన సామాజిక నవలలు పేర్కొనవచ్చు. సమాజంలోని దురాచారాలనుగురించి, వాటి నివారణగురించి వ్రాయటమే వీళ్ళ ముఖ్యోద్దేశము. బాలకృష్ణభట్టు రచించిన 'నూతన బ్రహ్మచారి' ద్వారా యువ విద్యార్థులలో నైతికవిలువను ప్రచారం చేయటమే వీరి ఉద్దేశ్యము. వీరు వ్రాసిన 'సౌ అజాన్ ఏక్ సుజాన్' అనే మరొక నవలలోని కథావస్తువు - దుష్టసంపర్కములనుంచి విముక్తిపొంది సంస్కారవంతులు కావటం అనేవిషయం. రాధాకృష్ణ

దాస్ రచించిన 'విస్సహాయ్ హిందూ' అనే నవల గోహత్యను సమస్యగా తీసుకుని వ్రాయబడింది. 'హరిజౌష్' రచించిన 'శేర్ హిందీ కా లాల్' చాలా ఉత్తమమైన నవల. కులాహంకారాలవల్ల పరస్పర సామరస్యంలేని వివాహాలవల్ల కలిగే దుష్పరిణామాలనుగురించి రాయటం ప్రేమ్‌చంద్‌కు పూర్వమే వీరు ప్రయత్నించారు.

ఈ సామాజిక నవలలూ, సంస్కరణాత్మక నవలలూ, ఉపదేశాత్మకమైన నవలలూ వెలువడిన కొద్దికాలము తర్వాతనే హిందీ నవలారచనలో మరో నూతన అధ్యాయం ప్రారంభమయింది. ఈ నవలలు ఆశ్చర్యం, విస్మయం, ఇంద్రజాలంతో కూడుకున్నవి. అరబీ, పారసీ రచనలు, ముఖ్యంగా 'తిలస్మి-ఏ-హోశరుబా', 'దాస్తాన్-ఏ-అమీర్ హమ్ జా' లచే ఇవి ప్రభావితమయాయి. దేవకీనందన ఖత్రీ, గోపాలరామ్ గహమరీ, కిశోరీలాల్ గోస్వామి మొదలైనవారు ఇదే వర్గానికి చెందిన నవలా రచయితలు. ఈ నవలల్లో రాజకుమారీ - రాజకుమారుల ప్రేమ గాథలు, వాళ్ళ భోగలాలసకు సంబంధించిన చిత్రవిచిత్ర వర్ణనలు వున్నాయి. మధ్యలో వదిలిపెట్టిన కథాసూత్రాన్ని కొంత వ్యవధానంతో మళ్ళీ ప్రవేశపెట్టటం చేత చదవటానికి చాలా ఆసక్తిదాయకంగా వుంటుంది. కథ ఎక్కువభాగం, వింత వింత సంఘటనలతోనూ, కుతూహలాన్ని కలిగించే వివరణలతోనూ నిండి వుంటుంది. చివరికి నాయకుడు శత్రువుని ఓడించి, మాయావరణాన్ని ఛేదించి నాయికను పొందటం జరుగుతుంది. ఈవిధంగా కుతూహలాన్ని కల్గించటం, ధారావాహిక కల్పనలతో నిండివుండటం ఈ నవల ప్రత్యేకత. కిశోరీలాల్ గోస్వామి ఇదేకోవకు చెందిన మూడవ రచయిత. ఈ కాలంలో సామాజిక నవలలూ, అపరాధపరిశోధక నవలలూ, అద్భుతాలతోనిండిన నవలలూ, చారిత్రాత్మక నవలలూ మొదలైన అనేకరకాల నవలలూ రచించినవారు వీ రొక్కరే. పూర్వీకుల నవలల వలెకాకుండా వీరి రచనలలో పాత్రపోషణ, సహజసంభాషణలపట్ల ఎక్కువశ్రద్ధ చూపటం జరిగింది. వీరు రచించిన చారిత్రాత్మక నవలలు శృంగారప్రధానంగా వున్నాయి. వీటిలో చారిత్రక సత్యాలు, సన్నివేశాలు కాకుండా ఔత్సుకతని కల్గించే ప్రణయ సన్నివేశాలు ఎక్కువగా వున్నాయి. వీటిలో పాత్రోచితమైన భాష, శైలి ఉపయోగించటం జరిగింది. వీరి రచనలలో మంచి నుడికారం వుంది. అక్క-

దక్కడా సాహెతలుగూడా వున్నాయి. ఇందుచేత హిందీభాషలోని ఖడీబోలీ వికాసానికి వీరు చేసినకృషి అద్వితీయమైనదని చెప్పవచ్చును.

వలభై-నలభై అయిదు సంవత్సరాలలో జరిగిన హిందీ నవలావికాసం కొంత కుంటుపడిందనే అనవచ్చు. ముఖ్యంగా ప్రేమ్‌చంద్ నవలలు, వారితర్వాత వచ్చిన నవలలు సాధించిన విలువలు, వాటి వికాసం, చూస్తే అలా తోస్తుంది. ప్రేమ్‌చంద్‌గురించి, వారి జీవితచరిత్ర రచించిన, కుమారుడు 'కలమ్-కా-సిపాహి (రచనాయోధుడు): ప్రేమ్‌చంద్' అన్నారు. ప్రేమ్‌చంద్ రచించిన ప్రారంభిక నవలలు మినహా హిందీభాషలో ఆయన నవలారచనాకాలం పద్దెనిమిది సంవత్సరాలు, 1918 నుంచి 1936 వరకు మాత్రమే అనవచ్చు. ఈ పద్దెనిమిది సంవత్సరాలకాలంలో ఆయన రచనలలో విప్లవాత్మకమైనమార్పును చేశారు. మనోరంజనము కల్గించటమే నవలల లక్ష్యమనేది ఖండించారు. పాఠకులలో కుతూహలాన్ని రేకెత్తిస్తూ ఆనాటి సామాజిక-రాజనైతిక ఆందోళనలను సవిస్తరంగా వర్ణించారు. రైతులకు జరిగే అన్యాయాలను, వాళ్ళపై జరుగుతున్న అత్యాచారాలను వివరిస్తూ, ప్రజల జీవితాన్నిగురించి, వజాభావనలను వర్ణించారు. వీరి ఈ రచనలను హిందీ భాషలోనేకాక భారతీయభాష లన్నింటిలోనూ ఎన్నదగినవి, అద్వితీయమైనవికూడా. వీరు రచించిన నవలలు 'ప్రేమాశ్రమ్', 'రంగభూమి', 'కర్మభూమి', 'గోదాన్' మొదలైనవి ఈ రెండుదశాబ్దాల భారతదేశపుస్థితిని, దేశంలోజరిగిన సామాజిక-రాజనైతికమార్పును, ప్రజాజాగృతిని స్పష్టపరుస్తాయి. అందుచేతనే డా॥ నామ్‌వర్ సింగ్ ప్రేమ్‌చంద్ నవలలను 'కామెడీ హ్యూమెన్' అని అన్నారు.

ప్రేమ్‌చంద్ తర్వాత హిందీ కథాసాహిత్యంలో ఈవిధంగా సామాజిక నవలని వృద్ధిపరచిన రచయితలలో యశ్‌పాల్ కృషి, ఆయన స్థానము, మహత్వపూర్ణమైనవి. ప్రేమ్‌చంద్ తన కృషిని ఎక్కడైతే వదిలిపెట్టారో, యశ్‌పాల్ తన కృషిని అక్కడనుంచి ప్రారంభించి రాజనైతికచైతన్యాన్నిగురించి, ప్రజాజాగృతిగురించి, దేశంలో జరుగుతున్న అత్యాచారాలకు వ్యతిరేకంగా, సాహిత్యకారుల పక్షాన్ని వహించి, వాళ్ళకృషిని సమర్థించారు. జైనేంద్ర్, అజ్ఞేయ్, ఇలాచంద్ర జోషీలాగ మనోవైజ్ఞానాన్ని తెల్పే సూక్ష్మమైనమార్గం ఆయన అవలంబించలేదు. వాళ్లు సృష్టించిన నాయకులవలె యశ్‌పాల్ నాయకులు అహంకారంతోనిండిన

అవాస్తవికమైన పాత్రలు కావు. విప్లవాత్మకమైన జీవితంతో యశ్‌పాల్‌కు వ్యక్తిగత అనుభవం వుంది. ఆయనజీవితం సంఘర్షణలనే నిప్పులో కాలి ఇనుముగా మారింది. భగవతిసింగ్, ఆజాద్, సుఖదేవ్, భగవతీచరణ్‌లతోకలిసి పని చేశారు. బ్రిటిష్ పరిపాలకులు మనదేశాన్ని ఆక్రమించటాన్ని తిరస్కరించి ఆ పరిపాలకుల మీద క్రోధం ప్రకటించారు. బ్రిటిష్ పరిపాలకుల్ని విరోధించి మూడుఖండాలలో 'సింహావలోకన్' అనే 'ఆత్మకథ' రచించారు. నిజంగా ఈ సంస్మరణాన్ని చదవక పోతే, యశ్‌పాల్ మనస్తత్వం పూర్తి అవగాహన కాదు.

యశపాల్ రచించిన నవలల్లో మొదటినుంచి చివరివరకూ సామాజిక రాజనైతిక చైతన్యమే ఎక్కువగా కన్పిస్తుంది. కానీ ఈ రాజనైతికచైతన్యం కారణంగా ఈయన్ని విమర్శించేవారిసంఖ్య తక్కువేం కాదు. ఈ వ్యతిరేకంలోనే గౌరమార్క్సవాదీ సిద్ధాంతం ఏర్పడింది. దానితోబాటు అనేకమంది మార్క్సవాదీ విమర్శకులుకూడా ఏర్పడ్డారు. డా॥ రామవిలాస్‌శర్మ వీరిలో ప్రముఖులు.

'దాదా కామ్రేడ్' (1941) నుంచి 'మేరీ తేరీ ఉస్‌కీ బాత్' (1972) (ఈ మహత్తరమైన నవల ఇంతవరకూ పుస్తకరూపంలో ప్రచురింపబడలేదు) వరకు ఈ సామాజిక రాజనైతికచైతన్యం ఏదో ఒకరూపంలో యశ్‌పాల్ రచనల్లో వెల్లడవుతూనేవుంది. 1929-33 మధ్యకాలంలో భారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వపు రాక్షసకృత్యాలు తారస్థాయిని అందుకున్నాయి. ఆ కాలంలోని భారతదేశపు రాజనైతిక పరిదృశ్యాల్ని 'దాదా కామ్రేడ్' నవలలో చిత్రించటానికి ఈయన ప్రయత్నించారు. విప్లవకారుల్ని ఉరిశిక్షవేయటమో, జైలుకి పంపటమో జరిగింది. తాము చేసిన ప్రయత్నాలు విఫలం కావటంచేత మిగిలిన విప్లవకారులు హతాశులై విచారించసాగారు. సత్యాగ్రహంకోసం గాంధీవాదం సూచించే పద్ధతులంటే వీళ్ళకేమీ నమ్మకం కలగలేదు. లెనిన్ విమర్శతో రూసో విప్లవసిద్ధాంతం అట్టే లాభదాయకమైనది కాదని ప్రజలు భావించసాగారు. దేశంలో వ్యాపించిన విప్లవానికి ప్రజల నిరంతర సహాయం, అండదండలు, అత్యంతావశ్యకమని అభిప్రాయపడసాగారు. 'దాదా కామ్రేడ్' లోని హరీష్ ఇటువంటి మనస్తత్వంగలవాళ్ళకి ప్రాతినిధ్యం వహిస్తాడు. హరీష్ ఆలోచనలకు అతను చేసే పనులకు వెనుక యశ్‌పాల్ అనుభవాలు స్పష్టంగా గోచరిస్తాయి. హింసావాదంనుంచి సమాజవాదంవరకు వున్న

మానసికయాత్రను వివరిస్తూ 'దేశద్రోహి' (1943). 'గీతా-పార్టీ కామ్రేడ్' (1946). 'మనుష్య-కే-రూప్' (1948) లలో యశ్‌పాల్ కమ్యూనిస్టుపాత్రలైన డా॥ భగవాన్‌దాస్ అన్నా, గీతా, భూషణ్‌లను సృష్టించారు.

ఈ నవలలద్వారా మధ్యతరగతికి చెందిన యువకుల రాజకీయ కార్యక్రమాలు స్పష్టంగా బోధపడటమేకాక కమ్యూనిస్టు నాయకుల ఆలోచనాస్రవంతుల గురించి ఆరోపించబడిన నిందలని ఎదుర్కోవటంగూడా జరుగుతుంది. యశ్‌పాల్ రచనల్లోని పాత్రలన్నీగూడా మానవసహజమైన బలహీనతలుగలవిగా కన్పిస్తాయి. వాస్తవికమైన సంకల్పాలు, రాజకీయ ఆదర్శాలు, పరస్పరసంబంధాలు ఈ పాత్రల్లో గోచరిస్తాయి. 'దివ్యా' (1945) 'అమితా' (1956) నవలలు చారిత్రక నవలలుగా చెప్పుకోదగినవి. పురుషులు అధికారం చెలాయిస్తున్న సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అంతులేని అన్యాయాన్ని ఎదిరిస్తూ, వేషచేసుకుని బ్రతికే నీచజాతి ప్రజలపై ఉన్నతవర్గానికి చెందిన ప్రజలు జరిపే దురాచారాలను వ్యతిరేకిస్తూ యశ్‌పాల్ స్త్రీ స్వాతంత్ర్యాన్ని ఉద్ఘాటించారు. నీచజాతి ప్రజలకు జరిగే అమానుష కరమైన అన్యాయంగురించిన శక్తివంతమైన రూపకల్పనలు ఇందులో ఎదురవుతాయి. 'అమితా'లో అశోకుని కళింగయుద్ధసందర్భంలో విశ్వశాంతి సమస్యని ప్రేరేపించి, దేశవిస్తారంగురించి పూర్తిగా వివరణ తెలియపరిచారు.

సామాజికనవలల్లో 'ఝూఠా సచ్' (రెండు ఖండాల్లో 1958, 1960) యశ్‌పాల్ రచించినవాటిలో ఉత్తమమైన నవల. దేశవిభజనకు సంబంధించిన దౌర్భాగ్య పూర్వక కథ ఈ నవలల్లో సవిస్తరంగా చిత్రించబడింది. మధ్యతరగతికి చెందిన ఒక యువకుని సాహిత్యాత్మక చైతన్యం, విప్లవాత్మక ఆలోచనలు, సుఖమయజీవితం లోకి దింపి తత్ఫలితంగా కలిగే ఏవగింపుని, సమాజవిరోధాన్ని ఈ నవలలోని నాయకుడైన జయదేవపురిద్వారా వివరిస్తారు యశ్‌పాల్. హిందూ-ముస్లిం నాయకుల స్వార్థం, బ్రిటిష్‌పాలకుల పన్నాగాలకి గురై భారతదేశప్రజలు అనుభవించిన ఇక్కట్టులనుతెలిపే సజీవవర్ణనలు ఈ నవలలో కన్పిస్తాయి. రెండవఖండమైన 'దేశ్-కా-భవిష్య' లో అధికారాన్ని చేబట్టిన నాయకులరూపంలో దేశంలో వ్యాపించిన వర్గంగురించి, ఆ వర్గపు వాస్తవికతనుగురించి నిష్పక్షపాతంగా తెలియపరి

చారు. 'దేశభవిష్యత్తు ఏ నాయకులచేతుల్లోనూ లేదు, దేశప్రజలచేతుల్లో వుంది' అని నవలలో వివిపించే వివాదాలతో 'ఝూఠాసచ్' నవల ముగుస్తుంది.

'మనుష్య-కే-రూప్' అనే ఈ నవలలో పర్వతప్రాంతానికి చెందిన వితంతు యువతి సోమాద్వారా విభిన్నమైన పరిస్థితులలో ఒకేమనిషి అనేకరకాలుగా మార టాన్నిగురించి యశ్‌పాల్ వర్ణించారు. సమాజంలోని అంతస్థులనుగురించి, మను ష్యులలోని అనేకరకాలైన స్వభావాలనుగురించి ఈ కథ నిండివుంది. ఈ నవల లోని కథాభూమిక చాలా విశాలమైనది. కాంగడాలోని పర్వతమార్గంతో ప్రారంభ మైన కథ బొంబాయిలో ముగుస్తుంది. మధ్యమధ్యలో ధర్మశాల, లాహోర్, సిమ్లాలుగూడా కథాభూమికలు అవుతాయి. కొండబాటమీద ధనసింగ్ ట్రక్కు క్రింద పడబోయి తప్పించుకున్న అమాయకురాలైన సోమా, అనేకరకాలైన కష్టా లను ఎదుర్కొని ప్రముఖ సినీతార షహీదన్‌గా మారుతుంది. పరిస్థితుల ప్రభా వంతో ధనసింగ్ ప్రేమలోపడి, ఇల్లు వదిలిపెట్టి, చివర ఆ ధనసింగ్‌నే గుర్తు గూడా పట్టనట్లు నటిస్తుంది. ప్రేమ ఆదర్శవంతమైనదని, శాశ్వతమైనదని, అచం చలమైనదని యశ్‌పాల్ అంగీకరించరు. ప్రేమగూడా మన సామాజికపరిస్థితుల వలన ఆర్థికపరిస్థితులవలన కలిగేదేనని, ఆ పరిస్థితులలో మార్పురాగానే ప్రేమలో గూడా తప్పక మార్పు వస్తుందనే విషయాన్ని యశ్‌పాల్ ఈ నవల్లో బలపరు స్తారు. ఇదేదృష్టితో భూషణ్ మనోరమలకు సంబంధించిన ప్రసంగంలో వర్గ మూలకమైన చైతన్యం వర్ణించబడింది. ధనవంతురాలైన మనోరమకు పూర్తిగా నమ్మకం వున్నప్పటికీ, ఈ చైతన్యమే భూషణ్‌ను దూరంగా త్రోసివేస్తుంది. ఈ కారణంగా కొద్దిమాత్రపు పరిచయాన్ని ఆధారంగా చేసుకుని మనోరమ సుతలీ వాలాని పెండ్లి చేసుకోవటానికి సిద్ధమవుతుంది. తత్ఫలితంగా కొద్ది వ్యవధిలోనే విడాకులు తీసుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. ఈవిధంగా రెండు విడి విడి వర్గాలకుచెందిన స్త్రీలద్వారా యశ్‌పాల్ సమాజంలోని స్త్రీల ఆత్మవిశ్వాసాన్ని వ్యక్త పరిచారు. ఆత్మనిర్భరం, ఆత్మవిశ్వాసంవున్న స్త్రీ మాత్రమే అన్నివిధాలా సమా జంలో జరుగుతున్న అన్యాయాన్ని ధైర్యంగానూ, శక్తివంతంగానూ ఎదిరించ గలదనే విషయాన్ని యశ్‌పాల్ బలపరుస్తారు. బారిస్టర్ జగదీశ్ నరోలా, క్లబ్బు లోని అతనిమిత్రులు, సుతలీవాలా మొదలైనవారిద్వారా 'పరువుగల మనుష్యుల

సామాజిక నైతిక విస్మారతలను ఈ నవలలో పొందుపరిచారు. వ్యంగ్య పూర్వక రచనలు చేయటంలో యశ్‌పాల్ సిద్ధహస్తులు. వ్యంగ్యపూర్వక సంఘటనల వర్ణన లలో యశ్‌పాల్ చరమస్థితిని అందుకుంటారు. ఇదేవిధంగా రెండవ ప్రపంచ యుద్ధపుసమయంలో సైన్యం, పోలీసులు చేసిన దురాగతాలు, ప్రభుత్వంచేసిన మోసాలు, సైన్యంలో నల్లవాళ్ళు-తెల్లవాళ్ళు అనే భేదాభిప్రాయాలు మొదలైన వాటిని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. యుద్ధంవలన ప్రజల్లోకలిగే భయంకరమైన పరిణామాలనుగూడా ఈ నవలలో చిత్రించారు.

పర్వతప్రాంతంలోని విస్మారమైన జీవితంలోనైనాసరే, అస్మిహాంగులా వున్న సినిమా జీవితంలోనైనాసరే, పురుషుడు ఎప్పుడూ స్త్రీ అసమర్థతని ఆసరా చేసుకుని స్వప్రయోజనం పొందటానికే ప్రయత్నిస్తాడు. భర్త యుద్ధంలో మర ణించినతర్వాత అత్తవారింట్లో పశువుకన్నా ఎక్కువగా ఒళ్ళు విరుచుకుని సేవ చేసి నప్పటికీ రెండు రొట్టెలుతిని తల దాచుకోవటానికికూడా సోమాకి ఆశ్రయం దొరక లేదు. మన్నూషాహ్ సలహామీద ఆమె అత్తగారు మామగారు ఆమెను అమ్మ టానికి సిద్ధమవుతారు. ఆర్థికదృష్ట్యా జీవితం మెరుగుపడిన తర్వాతగూడా బొంబా యిలో ఓ మాటు....'ప్రపంచం నన్ను కౌగలించుకుని, నా మెడలో చేతులువేసి ఆనందించటానికి సిద్ధమౌతోంది, కానీ నా చెయ్యిపట్టుకుని నాకు ఆధారంగా నిలబడ టానికి ఎవ్వరూ ముందుకు రావటంలేదు....' అంటుంది. ఈ విధంగా సామాజిక అసంగతాలను అంతర్విరోధాలనుగురించి యశ్‌పాల్ స్పష్టంగా వివరించారు. మనోరమ విడాకులు తీసుకునే సన్నివేశంలో పార్టీ ఆఫీసులో పనిచేసేవాళ్ళలో, ముఖ్యంగా వీతా ప్రవర్తన, యశ్‌పాల్ దృష్టికోణాన్ని మరింత స్పష్టం చేస్తుంది. విడాకులు తీసుకోవటమనే తలపు మనసులో రాగానే మనోరమకు అవమానమూ, విముక్తి దొరుకుతుందనే సంతోషమూ, రెండూ కలుగుతాయి. కానీ 'ముక్తికోసం చెడు సంస్కారాలనుంచి విముక్తి పొందటం అవసరం' అని మనోరమ తనకు తానే నచ్చచెప్పుకుంటుంది.

'మనుష్య-కే-రూప్' నవలలోని భాషనుగురించి చెప్పటంగూడా కొంత అవసరమేనని తోస్తుంది హిందీలో ఈ నవల ప్రచురించినతర్వాత, ధనసింగ్ అతని మిత్రులమధ్య జరిగిన సంభాషణలు, ట్రక్కు డ్రైవర్లు-క్లీనర్లమధ్య జరిగిన

వాద వివాదాలలోని భాష. ముఖ్యంగా మామూలు వాడుకభాషలో వ్రాయబడింది. ఆ సందర్భంలో ఉపయోగించిన తిట్లనుగురించి దోషారోపణ చేయటం జరిగింది. యశ్‌పాల్ సహజత్వానికి వికృతరూపం కల్పించారనికూడా కొందరన్నారు. కానీ ఈ తిట్లతో ఏమాత్రమూ సంబంధములేనిపాత్రలు 'మనుష్య-కే-రూప్' నవలలో చాలా వున్నాయి. ఏ వ్యక్తి మాట్లాడేభాషైనా ఆ వ్యక్తి నివసించే వాతావరణాన్ని బట్టి వుంటుంది. ఆ వాతావరణానికి జీవం పొయ్యాలంటే భాషకి వాస్తవికమైనటు వంటి రూపం ఇవ్వటం ఎంతయినా అవసరం. భాష శ్లీలమైనది కాదు, అశ్లీలమైనదీ కాదు. సందర్భాన్నిబట్టి, పరిసరవాతావరణాన్నిబట్టి భాష ఉపయోగించబడింది. పరిపాలనావిధానాన్ని చట్టంలోని దోషాల్ని నిరసించటం మొదలు భాషామూలక మైన ఆదర్శంవరకూ రచించే యువ కళాకారుడని పేర్కొనటానికి యశ్‌పాల్‌లో చాలా ప్రత్యేకతలున్నాయి. బహుశా ఈ ప్రత్యేకతలవల్లనే ఈనాటికీగూడా వారి శక్తిసామర్థ్యాలు ఎంత వృద్ధిచెందాయో అవగాహన చేసుకోగలుగుతున్నాము.

'మధురేశ్'

# కొండదారిలో

పఠాన్‌కోటకు ముందున్న పర్వతప్రాంతాల్లోగూడా రైలు నడపాలని ఆంగ్లేయప్రభుత్వం నిశ్చయించింది. కాంగ్‌దేపర్వతపు గుట్టలను తవ్వి వాటిపై ఇనుపపట్టాల మార్గాలు నిర్మించబడ్డాయి. చిన్నచిన్న ఇంజనులు తమవెనుక చిన్న చిన్న రైలుబండ్లను తగిలించుకుని ఛక్ ఛక్ మని మోతచేస్తూ పొగను వదులుతూ పట్టాల మార్గాలనుంచి విశాలమైన పర్వతాల శరీరంమీద కాళ్ళజెర్రిలా పాకటం ప్రారంభించాయి.

గర్వంతో నిండిన పర్వతాలందలి ప్రకృతి మనుష్యుని ఈ అహంకారాన్ని, దుస్సాహసాన్ని సహించలేకపోయింది. నిద్రలేచి తనపై వాలిన ఈగలను తోలు కోవటానికి కదిలే ఎద్దులాగా రైలుబండ్ల కదలిక తాకిడివలన ఆ మహాపర్వతం తన శరీరాన్ని కదల్చటం మొదలుపెట్టింది. పర్వతభాగం కొంత విరిగి పట్టాలమీద పడేది, లేకపోతే బీట్లు వారేది ప్రభుత్వం ఈ రైలుమార్గాన్ని పైజ్‌నాథ్‌నుంచి నగ్‌కోటావరకుమాత్రం నిర్మించారు.

ఇప్పుడుకూడా పఠాన్‌కోటనుంచి కుల్లూ - మనాలీవరకూ ప్రయాణీకుల వస్తుసామగ్రి రాకపోకలు రెండువందల పాతికమైళ్ళ దూరంవరకూ ఎక్కువగా బస్సులద్వారానే జరుగుతున్నాయి. ఆ మార్గంలో ప్రయాణం చేయాలంటే యాత్రీకులు బస్సులనే ఉపయోగించాల్సి వస్తోంది. మైదానప్రాంతాల్లో నివసించేవాళ్ళకి బస్సుమీద వెళ్ళటమంటే సమస్యగానే వుంటుంది. కాని అన్నిసుఖాలకు అలవాటు పడ్డవాళ్ళకిమాత్రం ఇది సమస్య కాదు. బస్సులలో వెళ్ళటమంటే ఎత్తైన ఉయ్యాలలో గంటలతరబడి ఎడతెంపు లేకుండా ఊగటం లాంటిది.

ఈ దారి ఎక్కువభాగం ఎత్తుపల్లాలతోనూ, ఏటవాలు భూములతోనూ, అడుగడుగునా మోచేతిలాగా వంకరగావుండే మలుపులతోనూ, నిండివుంది. ఒక వైపు పచ్చని మొక్కలతోనూ, పూలతోనూ నిండిన శిఖరాలు ఎత్తైన కోటగోడల్లా నిలబడి వున్నాయి. ఈ శిఖరాల అంచులు చూడాలని ప్రయత్నిస్తే తలమీదవున్న టోపీ కింద పడిపోతుంది. దారికి రెండోవైపున రాళ్ళతో నిండిన కొండవాగులు

యాభై-అరవై మూరలలోతున తెల్లని నురుగుతో పీలిరంగులో ప్రవహిస్తున్నాయి. దారి వంకరలుగా తిరుగుతూ వెళ్ళటంచేత ఒకసారి ముందు, ఒకసారి కుడివైపున, ఒకసారి ఎడమవైపున, మరొకసారి వెనుకగా కన్పించే పర్వతశిఖరాలమీద వున్న మంచు, ఎండనుంచి కాపాడుకోవటానికి పర్వతాలు తమ తలపైన అంగోస్త్రం వేసుకున్నట్లుగా వుంది.

అక్కడక్కడ దారికి పక్కనవున్న పర్వతప్రాంతపు పొలాలు వెడల్పైన మెట్లమాదిరిగా ఎక్కుతూ దిగుతూ వెళ్ళిపోతున్నాయి. ఈ ఏటవాలు పొలాల్లో గడ్డి మేపే కొండజాతి పశువులు, వేగంగా శబ్దంచేస్తూవెళ్ళే బస్సులవైపు కుతూహలంతో పెద్దపెద్ద మెరిసేకళ్ళు తెరచి, స్తంభించినదృష్టితో చూస్తూవుంటాయి. అప్పుడప్పుడూ మేకలు, ఆవులు, కంచరగాడిదలు, దారికి రెండువైపులావున్న రాళ్ళపైనుంచి దూకి, బాటమీద బస్సులతో పరిహాసం చేయటానికి వచ్చి, బస్సుల ముందు ఒక్కక్షణం ఆలోచిస్తూ నిలబడుతాయి. ఈ పశువులు బస్సు డ్రైవర్లను, డ్రైవర్లు ఈ పశువులను ఎరుగుదురు. ఆ పశువులు ఒక్కక్షణం బస్సులను చూస్తాయి. బస్సుకు కొమ్ములు చూపించి బెదిరిస్తాయి. బస్సు కొంచం కదిలి కొద్దిగా దోవ మరల్చుకోగానే రాళ్ళగుట్టలను దూకి పొలాల్లోకి వెళ్లిపోతాయి.

దోవలో కనిపించే ఈ దృశ్యాలవలన ప్రయాణీకులు ఏ ఆనందాన్ని పొందలేరు. వంకరలు తిరుగుతూ వెళ్లే బస్సు నడకవలన తలను రెండుచేతులతోనూ పట్టుకుని, బిట్ట అంచుతో నోరు కప్పుకుని కూర్చుంటారు. వారి శరీరంలోని అణువణువూ భయంతో వణుకుతూ వుంటుంది. ఒకవేళ బస్సు ఒక అంగుళం కుడివైపుకుగాని, ఎడమవైపుకుగాని దారి తప్పితే, వాళ్ళు అంతులేకుండా పోతారు. ఈ ప్రయాణాన్ని వాళ్ళు ఆపదలభయంతోనే పూర్తిచేస్తారు. ఇక ప్రతిరోజూ ఈ దారినవెళ్ళే బస్సుడ్రైవర్ల పరిస్థితి ఎట్లా వుంటుంది? జాగ్రత్తగా తమ దృష్టిని దారిమీద కేంద్రీకృతంచేసి ఏదో పాట పాడుకుంటూనో, సిగరెట్టు కాల్చుకుంటూనో వెళ్తారు. వాళ్ళకి ఇది అలవాటైపోయింది.

ధనసింగ్ సుమారు ఒకటిన్నర సంవత్సరంనుంచి ఈ దారిమీద లారీ నడుపుతున్నాడు. చలికాలపు రోజులు. అతను మధ్యాహ్నం రెండుగంటలకన్నా ముందే కుల్లూనుంచి బయల్దేరాడు. మండీదాటి సేఠీ-ధల్వానె దారిలో వైజ్‌నాథ్

వైపు విశ్చింతగా, కేవలం నేర్చుకున్న మెలకువతో వెడుతున్నాడు. రెప్పగూడా వాల్చని అతని స్థిరమైనదృష్టి దారిమీదే లగ్నమయివుంది. మిషను చక్రాలమీద పట్టా ఏవిధంగా తిరుగుతుందో అదేవిధంగా దారి అతని లారీచక్రాలక్రింద వేగంగా జారుతూ వెళుతూంది. లారీ స్టీరింగును పట్టుకున్న అతనివేళ్లు దారినిబట్టి స్టీరింగును తిప్పుతూ సంభాళిస్తున్నాయి.

దారికి ఎడమవైపున వ్యాపించియున్న కొండకనుమల పక్కనుంచి లారీ పర్వతాల గుట్టలమీద వెళుతూంది. కొండకనుమల ఆకుపచ్చనిపైరు శీతాకాలపు మంచువలన వచ్చిబడి మేలిమి బంగారపువర్ణాన్ని పులుముకుంది. సూర్యుడు అస్తమిస్తున్నాడు. కొండకనుమలకు పడమరదిక్కునవున్న చీడ్ చెట్ల పీడలతో వ్యాపించిన పర్వతాలనే తలగడలమీద తన తలవాల్చి నిద్రపోవాలని కోరుతున్నట్లుగా వుంది ఆ సూర్యబింబం. ధనసింగ్‌కు కేవలం తొమ్మిదిమైళ్ళ దూరానవున్న వైజ్‌నాథ్ వరకుమాత్రమే పోవలసివుంది. ప్రయాణీకుల గోల, తొందరపాటుతో ఏర్పడ్డబాధ అతనికి లేవు. లారీలో బంగాళాదుంపలతో నిండిన సంచులున్నాయి.

ధనసింగ్‌యొక్క సహాయకుడు, లారీ క్లీనరు అయిన కర్మూ లారీ వెనుక బంగాళాదుంపల సంచీలమధ్య ఖాళీ ఏర్పరచుకుని పడుకునివున్నాడు. అతను రెండు చెవుల్లోనూ వేళ్ళు పెట్టుకుని గొంతెత్తి బిగ్గరగా ఒక పల్లెపాట ఆలాపిస్తున్నాడు.

'దిలాం దియాం ఖుండియా, ఖులాతః కనేటో,
ప్రీతా దియాం రీతాం భులాతః కనేటో,
పత్రా బిఖోడా బందియా జో'

[మనసు తలుపుల గొళ్ళెము తెరచి,
ప్రీతి రీతిని విస్మరించి,
దాపిని పరిహరించనే వాడు]

కర్మూ కంఠధ్వని మధురంగానే వుంది. కానీ అందులో బాధగూడా మిళితమై వుంది. లారీ కుదుపువలన ఆ కంఠధ్వని కంపిస్తూగూడా వుంది. లారీ నడక, ఇంజన్ మోత కలిపి ఆ పాటకి తాళం వేస్తున్నాయి. బిగ్గరగా పాడినాకూడా పాట స్వరం లారీ నడకవలన వెనుకే పడిపోతోంది. ధనసింగ్‌కు ఆ పాట మృదువు

గానూ, దూరపు పర్వతపు కమమలనుంచి వస్తున్నట్లుగానూ వుంది. ధనసింగ్ చేతులు లారీ స్టీరింగ్‌మీద, చెవులు పాట స్వరంమీద, కాళ్ళు బ్రేకుమీద, కళ్ళు వేగంగా జారుతూపోయే దారిమీద, మనసు ఆ పాట భావంమీద లగ్నమైవున్నాయి. అతని నిశ్చలమైన చూపులో కాంతి, ముఖంమీద ఆనందం స్పష్టంగా కన్పిస్తూ వున్నాయి.

రోడ్డుమీద లారీ ఎదురుగా కొన్ని మేకలు, మేకపిల్లలు కనిపించాయి. ధనసింగ్ వేళ్లు వెంటనే హారన్ మోగించాయి. మేకలు, మేకపిల్లలు రోడ్డుమీదనుంచి కదిలి దారికి పక్కనవున్న చెట్లవైపు తప్పుకున్నాయి. కాని రెండు చిన్న మేకపిల్లలు వెంటనే రెండుకాళ్ళూ ఎత్తి మళ్లీ చెంగున లారీవైపుకు దూకాయి. అవి దూకగానే వాటిమీద నీడలాగా ఒకస్త్రీ వచ్చి పడింది.

యాంత్రికంగానూ, అతివేగంగానూ ధనసింగ్ కాళ్లు క్లచ్ మీదకు, బ్రేకు మీదకు వెళ్ళాయి. తన నడకప్రవాహంలో ఆటంకం కలగజంపలిన వెళ్ళటానికి వీలులేక, లారీ బాధగా మూలిగి, మార్గంమీద ఒక్కకుదుపు కుదిపి ఆగిపోయింది. లారీలోని అణువణువూ బాధపడింది. ధనసింగ్ శరీరంలోని అణువణువూ చమటతో నిండిపోయింది. లారీ మడ్‌గార్ తోయడంవలన ఆ స్త్రీ కిందపడింది. విలవిలా తన్నుకునే ఒక మేకపిల్ల కాలు అప్పటికీ ఇంకా ఆ స్త్రీ చేతుల్లో వుంది. రెండవమేకపిల్ల దూకి, ఆ మార్గందాటి రాతిబండమీద నుంచుని ఈ తమాషా చూస్తూ సంతోషంతో అరుస్తూవుంది. ఆ స్త్రీ తనచేతిలోవున్న మేకపిల్ల సురక్షితంగా వుందని తెలుసుకుని దాన్ని వదిలిపెట్టింది. పడిపోయిన ఆమె లేచేప్రయత్నంలో చీరకొంగు సర్దుకుని డ్రైవరువైపు చూసింది.

ధనసింగ్‌కు కోపం పొంగివచ్చింది. కళ్ళలోకి నెత్తురు ఉగివచ్చింది. కుడిచేత్తో లారీతలుపు తెరిచి, రోడ్డుమీదకు దూకి లారీముందుకు వచ్చాడు. ఆ స్త్రీని కొడదామని ఎత్తిన తనచేతిని అతికష్టంమీద కిందికి దింపాడు. ఎంతైనా స్త్రీ. అయినా తిట్టకుండామాత్రం వుండలేకపోయాడు, 'నీ అమ్మ.... నన్ను ఉరికంబం ఎక్కించాలనుకుంటున్నావా? నీ అక్క.... నువ్వు ఇంట్లో పనికిమాలిన దానివా?' కోపంలో అతడు ఎన్నో తిట్లు తిట్టాడు.

ఆ స్త్రీ ఒకచేత్తో దెబ్బ తగిలిన నుదుటిని నొక్కుకుంటూ, రెండవచేత్తో

తలకి దెబ్బ తగలకుండా అడ్డం పెట్టుకుని, భయంవలన పెద్దవైనకళ్ళతో మెదల కుండా ధనసింగ్‌వైపుచూస్తూ వుండిపోయింది. ధనసింగ్ వశంతప్పి ఆమెమీద మండిపడ్డాడు. ఇంత భయంకరమైన పనిచేసిన ఆ స్త్రీని కొట్టిగూడా తన కోపాన్ని తగ్గించుకోలేక పోయాడు.

ఆకాశపు రంగువలెవుండి, నీటితో తడిసిన ఆ యువతి పెద్దపెద్ద కళ్లు మూర్ఛత్వంవలన స్థిరంగా వున్నాయి. భయంవలన ఆయాసపడుతూ, రొప్పుతూ వుంది. ఎత్తైనవక్షోజాలు చిరిగిన రవికలోనుంచి తొంగిచూస్తూ వున్నాయి. కంగారు వలన, భయంవలన, ఆ వక్షోజాలని కొంగుతో కప్పుకోవాలన్న విషయంగూడా ఆమెకు గుర్తుకు రాలేదు. ఆమె మూర్ఛత్వం, పొంగివచ్చే ధనసింగ్‌ని కోపాగ్నిమీద నీటితుంపరలు కురిపించి చల్లార్చింది.

కర్మా అకస్మాత్తుగా ఆగిన లారీ కుదుపుకు పడబోయి తననుతాను సంభా ళించుకుని కాపాడుకున్నాడు. అతనుగూడా లారీదిగి ముందుకువచ్చాడు. భయంతో వణికిపోయే పరిస్థితిలోనూ, వంటిమీద సరిగా బట్టకూడాలేని స్థితిలోనూ ఆ యువతిని చూసి పళ్ళు బయటపెట్టి ధనసింగ్‌తో అన్నాడు—'ఆహా! మంచిబేరం దొరికింది గురూ' ఆ అమ్మాయిని బుజ్జగించడానికి నోటతో ఈల వేశాడు. ధనసింగ్‌కుకూడా నవ్వొచ్చింది.

'నీకోసం మీ నాన్నకి ఏ మగాడూ దొరక్కపోతే ఎవడితోనన్నా వెళ్ళిపో. మాలాంటి బీదవాళ్ళ గొంతెందుకు కోయాలని చూస్తావ్? రాక్షసి!' అని ధనసింగ్ ఆ అమ్మాయికి అర్థమయేలా కొండభాషలో అన్నాడు.

దెబ్బ తగలడంచేత ఆ అమ్మాయి ఏమీ ఆలోచించేపరిస్థితిలో లేదు. అందు చేత కోపంతో నిండిన ధనసింగ్ తీక్షణమైన దృష్టివలన ఇంతవరకూ ఏవిధమైన సంకోచాన్ని పొందలేదు. ఇప్పుడు తనభాషలో మాటలు విని, కర్మా సౌంజ్ఞలు అర్థంచేసుకుని ఆమె నలిగిపోయి చిరిగిపోయిన రవికలోనుంచి బయటకు తొంగి చూసే తన శరీరపు పొంగును చీరకొంగులో దాచేసుకుంది. వెడల్పయిన ఆమె కంటిరెప్పలు, నీటితో నిండి, పచ్చి పాలవలె తెల్లగావున్న కంటిగ్రుడ్డుమీదకు వాలి పోయాయి. సంకోచంవలన మెడకూడా వాలిపోయింది.

కర్మా తన చెడుకోరికను మళ్ళీ బయటపెట్టాడు. ధనసింగ్‌కూడా నవ్వి,

'ఏయ్! ఇకలే! ఈ మార్గంవదిలి ఇంటికి వెళ్లిపో....లేకపోతే లారీలో కూర్చో. నిన్నుగూడా తీసుకువెడతా!' అన్నాడు.

ఆ అమ్మాయి దెబ్బవలన వణుకుతూ లేచినిలబడి పక్కనవున్న దిబ్బవైపు వెళ్ళిపోయింది. ధనసింగ్ లారీలో కూర్చున్నాడు. అతను లారీ స్విచ్‌ని, స్టార్టర్‌ని నొక్కాడు. ఆ సూచనకు ఇంజను ఏమీ సమాధానం ఇవ్వలేదు.

'అరే కర్మా ఇటురా!' ధనసింగ్ క్లీనర్‌ను పిలిచాడు. 'చాలా ఇబ్బంది వచ్చింది. ఒకవేళ బాటరీవైర్లు తెగిపోయి వుంటాయి' అని ధనసింగ్ మళ్ళీ లారీ నుంచి దిగాడు. ఇంజనుపైన మూతతీసి చూడటం మొదలుపెట్టాడు.

కర్మా ఆ అమ్మాయి వెళ్ళినవైపు చెయ్యిపెట్టి చూపించి, 'అందమైన అమ్మాయి దృష్టి చెడ్డదిగా వుంటుంది గురూ! ఆ దృష్టి తగిలితే మనిషి చస్తాడు. ఇది ఇనుములో చేసిన లారీయే. చూడు! ఇంజను ఆగిపోయి మారాం చేస్తోంది' అన్నాడు.

ధనసింగ్ ఆ అమ్మాయివైపు చూసాడు. 'ఎటువంటి మాయచేశావు కాళీ మాతా! ఇప్పుడు రాత్రి ఇక్కడే గడపాల్సివస్తే ఏమైనా కొంచం పేయించిన శనగలు, రొట్టెలు పెడతావా, లేకపోతే ఇట్లాగే మాడ్చి చంపుతావా!'

ఆ అమ్మాయి ఏమీ సమాధానం చెప్పకుండా తలవంచుకుని దగ్గరలోవున్న రాతిబండ పక్కగావున్న కాలిబాటమీదుగా పైకెక్కి కనుమరుగైపోయింది.

ధనసింగ్ ఇంజనుపై మూతతెరచి పరిశీలించటం మొదలుపెట్టాడు. హృదయస్పందన ఆగిపోతే జీవి ఏవిధంగా చలనంలేకుండా పడివుంటుందో, అదే విధంగా లారీకూడా చలనంలేకుండా స్థిరంగా వుండిపోయింది. ధనసింగ్ తనకు తెలిసినంతమటుకు జ్ఞానం ఉపయోగించి ఇంజను బాగుచేయడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు.

క్లీనరు కర్మా దుమ్ముతోనిండిన తల గోక్కుంటూ సణగడం మొదలు పెట్టాడు. 'రాత్రి అవబోతోంది. ఈ వేళప్పుడు వెనకనుంచి ఏ లారీ రావడం లేదు. నువ్వు నన్ను మండీలో భోజనంగూడా చేయనీయలేదు. రెండుపైసల బంగాళాదుంపలు తిని మంచినీళ్లు తాగాను. నాదగ్గర కంబళికూడా లేదు' అన్నాడు.

'ఏమిటి సణుగుతున్నావ్! పంపు తీసుకువచ్చి కనక్షన్‌లో గాలికొట్టు' అని ధనసింగ్ అతన్ని కోప్పడి చెప్పాడు.

ధనసింగ్ లారీక్రిందదూరి లారీ ఆగిపోవడానికి కారణం ఏమిటో చూస్తున్నాడు. 'చచ్చాంరా కర్మా! అరే వెన్నెముకే విరిగిపోయింది. దీని యూనివర్సల్ జాయింటు విరిగిపోయింది' అని అక్కడనుంచే అరిచాడు.

ధనసింగ్ పడుకునే జరుగుతూ బయటకువచ్చాడు. అన్ని ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. ఒక పెద్దనిట్టూర్పువిడిచి నుదుటిమీద చెయ్యిపెట్టుకుని నిలబడ్డాడు. 'ఇప్పుడేం చేయాలి?' అని ఆలోచించసాగాడు.

అలసటచేత అశక్తుడైన సూర్యుడు ఎదురుగా వ్యాపించివున్న చీడ్ చెట్ల అడవుల వెనుకకుజారుతూ విశ్రాంతికోసరం, నీడ-చీకటి అనే విశాలమైన దుప్పటిని తన శరీరంమీదకు లాక్కుంటున్నాడు. క్రింద వ్యాపించిన విశాలమైన కోన ప్రాంతం శ్యామలవర్ణాన్ని ధరించింది. కేవలం ఎత్తైన భాగంలోవున్న మార్గంమీద మాత్రం సూర్యుని చివరి, వెలవెలబోతున్న, మిణుకుమిణుకుమనే కిరణాలు మిగిలి వున్నాయి.

ధనసింగ్ బాధతో గంభీరంగా అన్నాడు—'కర్మా! నేను యజమాని లారీ వదలిపెట్టి వెళ్ళలేను. మంచి బలంగల యువకుడివి. నువ్వు వెళ్లు. నీకు ఆకలి అవుతోందన్నావు గదా. ఇక్కడ రాత్రిపూట చలివలన చాలా బాధ కలుగుతుంది. నీదగ్గర డబ్బులు లేకపోతే నేనిస్తాను. రెండుమైళ్లు వెళ్ళాకంటే అక్కడ దోవలోనే రొట్టెలు అమ్మేదుకాణం వుంది. అక్కడ ఏదన్నా తిను. నీలాటి యువకులకి అంతదూరం నడచివెళ్ళటం పెద్ద కష్టంకాదు. పెద్దపెద్ద అడుగులేస్తూ వెళ్ళు. వైజ్‌నాథ్ సుమారు ఎనిమిదిమైళ్ళు వుంటుంది అంతే. రెండుగంటల్లో వైజ్‌నాథ్ చేరుతావు. అక్కడికివెళ్ళి లారీ యూనివర్సల్ జాయింటు విరిగిపోయిందని, ఇంజను కూడా చెడిపోయిందని చెప్పు. తెల్లారి మొదటి సర్వీసులోనే వైజ్‌నాథ్‌నుంచి మేస్త్రీలను పంపమని చెప్పు. ఇటు మండీనుంచయితే రేపు తెల్లారుఝామున అయిదుగంటలవరకూ ఏ సర్వీసూ రాదు.'

కర్మా కోపంతో మండిపడుతూ వైజ్‌నాథ్‌వైపు వెళ్ళిపోయాడు. ధనసింగ్ ఒక్కడూ రోడ్డుమీద నిలబడిపోయాడు. సూర్యుడు అస్తమించాడు. మైదానప్రదేశాలలోలాగా పర్వతప్రాంతాలలో సూర్యాస్తమయానికి, రాత్రికి మధ్య సంధ్యాకాలం ఎక్కువసేపు వుండదు. ఆ పర్వతప్రాంతాలలో వ్యాపించిన చీకటి ఆకాశం మీదకూడా వ్యాపించసాగింది.

ధనసింగ్‌కు దాహం వేసింది. అతనికి ఆ మార్గంతో తప్ప ఆ పరిసర ప్రాంతాలతో ఏమాత్రం పరిచయం లేదు. ఆ మార్గానికి కుడివైపున చిన్న రాతి బండలు గోడల్లా వున్నాయి. వాటిపైన చెట్లుతప్ప ఇంకేమీ కన్పించడం లేదు. ఎడమవైపున ఆ కనుమలో పొలాలు పెద్ద పెద్దవిగానూ, వెడల్పుగానూ వున్నాయి. మెట్లవలె చాలా లోతుగా దిగుతూ, వ్యాపిస్తూ దూరంగావున్న కొండమీదకు ఎక్కుతూ కనిపించాయి. ఆ కనుమ దోసిలి నగం పండిన గోధుమపొలాలతో నిండివుంది. కొన్నిపొలాలు ఖాళీగాకూడా వున్నాయి. కుడివైపున రాతిబండమీదుగా ఒక కాలిబాట వ్యాపించి క్రిందకుదిగుతూ, ఆ మార్గాన్నిదాటి ఎడమవైపునవున్న పొలాల్లోకి దిగిపోయింది. కాని రెండువైపులా గ్రామాలు ఎంతెంత దూరాల్లో వున్నాయో చెప్పడం కష్టం.

ఆ కొండ కనుమలోకి వ్యాపిస్తూ చీకటిలో దూరంగా పొగలా కనిపించడం చేత అక్కడ గ్రామం వుందని వూహించవచ్చు. కాని చీకటి దట్టంగా వుండటం చేత ఎంతదూరంలోవుందో ఊహించడం కష్టం. ఒక కొండమీదనుంచి కేకపెడితే దూరాన కొండమీదకి ఎలా వినబడుతుందో, అలా కొండమీదనుంచిచూస్తే దూరాన ఏ వస్తువయినా కనబడుతుంది. ఈ కాలిబాట సుమారు రెండుకోసులదూరం వుంటుంది. ఎంతదూరం వుందోకూడా నిశ్చయించడానికి వీలులేని ఆ గ్రామం వైపు వెళ్లాలనే ఆలోచన వదిలిపెట్టి, రాతిబండవైపువున్న కాలిబాటపై ఎక్కి చూడటం మంచిదని నిశ్చయించాడు ధనసింగ్.

ఆ రాతిబండమీదకెక్కి కాలిబాటగుండా అతను ముందుకు నడిచాడు. ఆ కాలిబాట ఒక వెదురుపొద వెనుకనుంచి మలుపు తిరిగింది. ముందు ఇంకా పొదలు కనిపించాయి. ముందుకు వెడదామా, వద్దా అని ధనసింగ్ ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆ పొదలచాటునుంచి ఒక స్త్రీ తలమీద కుండపెట్టుకునివస్తూ కనిపించింది. ఆమె ముఖాన్ని చీరకొంగుతో కప్పుకునివుంది. ఆ కొండప్రాంతాలలో స్త్రీలు తమ కుటుంబపరిచితులలోనూ, పెద్ద పదవిలో వున్నవారియందు గౌరవం ప్రకటించడం కోసం ముసుగు ధరిస్తారు. కాని ఆ చీకటిలో ముసుగు ధరించడంవలన ప్రయోజనం ఏమిటో ధనసింగ్ తెలుసుకోలేకపోయాడు. కొంచం దగ్గరగా వచ్చినతర్వాత ఆమె ముఖంమీదనుంచి ముసుగు తొలగిపోయింది. ఇంకా రెండడుగులు ముందుకు

రాగానే ఆమె ధరించిన బట్టలనుబట్టి ధనసింగ్ గుర్తుపట్టాడు. లారీముందుకువచ్చి పడిన యువతే ఆమె. ఆమె తలమీదవున్న కుండ తలక్రిందులుగా వుంది.

'నేను దాహంతో చచ్చి చెడి నీళ్ళకోసరం ఇంతదూరం వస్తే, నీ కుండ ఖాళీగా తలక్రిందులై వుందే!' పరిచయాన్ని ఆధారంగా చేసుకుని ధనసింగ్ అన్నాడు.

'కుండేమిటి! అదృష్టమే తలక్రిందులుగా వుంది' ఆ అమ్మాయి సమాధానం చెప్పి గట్టిగా నిట్టూర్చింది.

ఆత్మీయతతోనూ, బాధతోనూ మిళితమైవున్న ఆ సమాధానం విని, ఆ అమ్మాయి స్వరం దుఃఖంతో గాద్గదమై వుండటం గ్రహించి ధనసింగ్ ఆమె ముఖంవైపు పరిశీలనగా చూసి 'ఏడుస్తున్నావా!....బాగా దెబ్బ తగిలిందా!' అని అడిగాడు.

ధనసింగ్ చూపించిన సానుభూతి ఆ అమ్మాయిని ఓదార్చకపోగా దుఃఖమనే కుండమీద దెబ్బకొట్టింది. ఆ కుండ కదిలి చెదిరింది. ఆ అమ్మాయి మళ్ళీ తన ముఖాన్ని కొంగుతో కప్పుకుని మౌనంగా నిలబడిపోయింది. ధనసింగ్ ముసుగు వెనుక ఆ పిల్ల శరీరపు వణుకునూ, వెక్కి వెక్కి ఏడవడాన్ని ఊహించగలిగాడు. లారీడ్రైవర్లకుండే కఠినమైన ప్రవర్తన సానుభూతిగా మారింది. అతని గొంతు గూడా ఆర్ద్రమయింది. 'మంచిదానివే! నాకేం తెలుసు నువ్వు నా లారీ ఎదురుగా వస్తావని....నిన్ను రక్షించడంకోసరం నేను నా లారీని చెడగొట్టుకున్నాను.' అన్నాడు.

ఆ అమ్మాయి కళ్లు వత్తుకుని ముఖంమీదనుంచి చీరకొంగును తీసేసింది. ఏడుపును ఆపుకోవడంకోసరం పెదిమలని పళ్లతో నొక్కిపెట్టింది. దుఃఖాన్ని సంబాళించుకుని చెప్పడం మొదలుపెట్టింది. 'బాటసారీ! నీకు నేనంటే ఎందుకు అంతకోపం! వేగంగా నడిచే లారీని ఆపేశావు. లేకపోతే రోజూ జరిగే పోట్లాట తప్పేది.' ఏడుపువేగం హెచ్చవటంచేత ఆమె తనకొంగును మళ్ళీ ముఖంపై కప్పుకుంది.

ఆ అమ్మాయి ఏడుపుశబ్దం మూసివున్న పెదిమలమధ్య, ముసుగులోనూ వుండిపోయింది. కాని ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోందని ధనసింగ్ తెలుసుకోగలి

గాదు. ఆ అమ్మాయి కొన్నిక్షణాలు నోరు మెదపక ఏడుపు ఆపుకోవాలని ప్రయత్నిస్తూ వెక్కటం మొదలుపెట్టింది. ధనసింగ్ మనసులోనుంచి దైర్యవర్లకుండే కోపస్వభావం పూర్తిగా తొలగిపోవడం మొదలుపెట్టింది. ఆ స్థానంలో బాధ, వ్యాకులత చోటు చేసుకున్నాయి. హృదయంనుంచి గొంతువరకూ దాహంతో ఎండిపోతోంది కాని ఏమని అడగాలో అతనికి తెలియటంలేదు. 'ఇక్కడ నీళ్ళెక్కడ దొరుకుతాయి? చాలా దాహంగా వుంది' అని అడిగాడు.

ఆమె గొంతునుంచి నోటివరకూ పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుని, గుక్క తిప్పుకుని, కొంగుతో కళ్ళు తుడుచుకుని 'నీళ్ళు కావాలా? నేనూ నీళ్ళ కోసమే వస్తున్నాను' అంది.

కాలిబాటమీద ఆమె ముందుకు నడిచింది. ధనసింగ్ ఆమెను అనుసరించాడు. ఆమె వెనుకవెళ్తే ధనసింగ్ హృదయంలో సానుభూతి, కుతూహలం కలిగాయి కాని ఏవిధంగా మాట్లాడాలా అని మాటలకోసం వెతుక్కుంటున్నాడు. ఆమె రాతిగుట్టమీదనుంచి క్రిందకు దిగింది. లోకికి దగ్గరగావున్న మార్గందాటి క్రిందగావున్న పొలాలవైపు నడిచింది. 'నీళ్ళు ఇక్కడకు తీసుకువచ్చి ఇస్తావా, బావిదాకా రానా?' ధనసింగ్ అడిగాడు.

ఆమాటవిని ఆమె వెనక్కు తిరిగింది. 'కావాలంటే ఇక్కడకు తీసుకువచ్చి ఇస్తాను. నీకు ఇష్టమైతే బావిదాకా రా. ఏం మనిషివి నువ్వు?' అంది.

ధనసింగ్ కాంగ్‌డా జిల్లావాడే, ఆ ప్రశ్నకి అర్థం తెలుసుకోవడంలో అతనికి ఏవిధమైన అనుమానమూ రాలేదు. 'మంచిజాతికి చెందిన మంచి మనిషినే, రాజపుత్రుణ్ణి' అని చెప్పాడు.

'అయితే ఇకనేం! మేమూ రాజపుత్రులమే నీ కుండ ఇలా ఇవ్వు. నీళ్ళు పట్టి తెస్తాను.'

'నాదగ్గర ఏదీ లేదు. పద నీతో వస్తాను. కుండ ఓరగాపెట్టి నీళ్ళు పొయ్యి. దోసిలితో తాగుతాను,' అన్నాడు.

అయిదడుగుల గట్టుదాటి రెండవపొలంలోకి దిగగానే ధనసింగ్ అడిగాడు. 'మంచిదానివే! ఎందుకంతగా ఏడుస్తున్నావు? అంతబాధ ఏం కలిగింది?'

ఆమె సమాధానం చెప్పడంకోసరం వెనక్కు తిరగలేదు. కాని సాయంకాలపు నిశ్శబ్దతలో ఆమె హృదయంనుంచి వెలువడే నిశ్వాసపుశబ్దం ధనసింగ్‌కు

వినిపిస్తూనే వుంది.-'బాధల కేమిటి? ఎవరైతే ఈ ప్రపంచానికి భారమవుతారో వాళ్ళకి ఇటువంటిపరిస్థితి కలుగుతుంది. లేకపోతే ఏమిటి? మృత్యువుగూడా ప్రపంచంలో మంచివాళ్ళనే ఎన్నుకుంటుంది,' అని అన్నది.

తన ప్రశ్నకు సమాధానంగా ఈ సమస్య విని ధనసింగ్ ఏమీ అర్థం చేసుకోలేకపోయాడు. శరీరపుసౌష్ఠవం, అపరిపక్వమైన ముఖం చూస్తే ఆమె కన్యవలెనే కనిపిస్తోంది. కాని ఆ జిల్లాలో ఇంతవయసు వచ్చినస్త్రీ కన్యగా వుండదు.

'మీ తల్లిదండ్రుల ఇంట్లోనే వుంటున్నావు కదా!' అని ధనసింగ్ అసలు పరిస్థితి తెలుసుకునేందుకు అడిగాడు.

'తల్లితండ్రులు తమడబ్బు సరిగా లెక్కచూసి తీసుకున్నారు. వాళ్ళభారాన్ని తప్పించే పిల్ల. కసాయివాడిచేతులో పడినా, బ్రాహ్మణునిచేతిలో పడినా ఇక ఆమె అదృష్టమే.' ఆమె ఇంకొక నిట్టూర్పువిడిచి చెప్పింది. 'తల్లితండ్రుల ఇంట్లో ఎల్లకాలం ఎవరు కూర్చుంటారు? కాని కష్టసుఖాలలో అప్పుడప్పుడు నాలుగైదు రోజులు పుట్టింటిలో వుండి వస్తూవుంటారు. అత్తారింటివాళ్ళేమనుకుంటారంటే వీళ్లు నాలుగువందలరూపాయలలో పశువును కొనుక్కున్నారు. అది జీవించినంత కాలం పని జరుగుతుంది. అది చస్తే నష్టం వీళ్ళకే. కాళ్ళూచేతులూ పని చేస్తున్నంతవరకు ఎటూ వదులుతాము? తల్లితండ్రులుమాత్రం ఏ అధికారంమీద ఏమని అడగగలరు? వాళ్లు మూటకట్టి డబ్బు తీసుకోలేదా?' అంటారు.

ఆమె చెబుతూనేవుంది-'మేము ఇద్దరం అక్కాచెల్లెళ్ళం. మాకు ఒక అన్నయ్య వున్నాడు. మా నాన్న చచ్చిపోయేదాకా కొడుకుకోసరం కోడలిని తేవడానికి బదులుగా నా పెద్దకూతుర్ని ఇస్తానని, చిన్నకూతుర్ని కన్యాదానంచేసి పుణ్యం సంపాదించుకుంటానని' అనేవాడు. కాని మా అక్క పూర్వజన్మలో మంచిపనులు చేసివుంటుంది. అది పెళ్ళికాకముందే జ్వరంవచ్చి చచ్చిపోయింది. నేను దురదృష్టవంతురాలిని. అప్పటికింకా చిన్నపిల్లని. నాకుబదులుగా ఇంకెవరినీ తీసుకురాలేను. మా అన్న పెళ్ళికోసరం మా నాన్న పొలాన్ని ఒక ధనవంతునివద్ద తాకట్టుపెట్టి మూడువందలరూపాయలు అప్పు తీసుకోవలసి వచ్చింది. అన్న పెళ్ళి చెయ్యకుండా ఎలా వుంటాం! అమ్మ మా చిన్నప్పుడే చనిపోయింది. ఇంట్లోపని ఎవరుచేస్తారు? మీకు తెలుసా కూతురిమీద ఏం నమ్మకం వుందో! అది ఎలాగో పరాయి ఇంటిదే.

కోడలిని ఎలాగో ఇంటికి తీసుకురావాలి. ఆ తాకట్టునుంచి పొలం విడిపించు కోవడం కోసరం నన్ను అమ్మాలి. లేకపోతే చేసేదేమిటి?' ముందువెళ్ళే ఆ అమ్మాయి విరక్తిచెందినగొంతుతో చెపుతూ వెడుతోంది. ఆమె తన అదృష్టం పైన తప్ప ఇంకెవరిమీద నింద వేయడంలేదు. వెనుక వెడుతూవున్న ధనసింగ్ ఆలోచిస్తూ వింటూ నడుస్తున్నాడు.

వాళ్ళిద్దరూ బావిదగ్గరకు చేరుకున్నారు. ఆమె కుండను బావిగట్టుమీద పెట్టి చెప్పడం మొదలుపెట్టింది-'పెళ్ళిచేసుకుని తీసుకువచ్చారు. అంతే ఆరునెలలతర్వాత, నెలవలు పూర్తిఅయి మళ్ళీ ఆయన సైన్యంలోకి వెళ్ళిపోయారు. తొమ్మిదవ నెలలో ఆయన తుపాకీ దెబ్బతగిలి చనిపోయారని వుత్తరం వచ్చింది. ఒక ఆడ పిల్ల నా చంకలోకి వచ్చింది. భగవంతుడు ఆ పిల్లనుగూడా లాక్కున్నాడు. నా పెద్ద తోడికోడలు, చిన్న తోడికోడలూకూడా నన్ను సహించేవాళ్లు కారు. వాళ్లిద్దరూ కూడా మార్పిడిలో వచ్చారు. వాళ్ళ నేమన్నాఅంటే అక్కడ వీళ్ళ కూతుళ్ళని సరిగా చూడరు. నేను ఒక్కదాన్నే కొనబడినదాన్ని. ఇప్పుడు విధవను. నా ఎము కలు పనివలన, వాళ్ళ దెబ్బలవలనకూడా విరుగుతున్నాయి. చెప్పుకోవడానికి నా మొగుడు లేడు. నా శరీరం అంతా దెబ్బలతో నిండిపోయివుంది. ఏం చేయను? ఇక్కడ లారీకిందపడి చావబోయినదాన్నే బతికాను.'

ఆమె మోకాళ్లదగ్గర పరికిణా జానెడుమేర చిరిగిపోయివుంది. అందమైన పచ్చని తొడలు కనిపిస్తూ వున్నాయి. ఆమె తన శరీరాన్ని కప్పుకోవడం కోసరం బట్టను లాక్కుని మళ్లీ చెప్పడం మొదలుపెట్టింది—'ఈ బట్ట చిరిగిపోయింది. కొంచం కుట్టుకుందామని కూర్చున్నాను. లోపలకు - బయటకు వెళ్లాల్సి వస్తుంది. మొగాళ్ళ దృష్టిపడితే సిగ్గేస్తుంది. కుట్టుకుందామని కూర్చునేసరికి పెద్దతోడికోడలు కడుపులో గట్టిగాతన్ని 'పుట్టబోయేవాళ్ళ శవంమీధ కప్పడానికి బట్ట కుట్టడానికి కూర్చున్నావు. నీళ్లు నీ అమ్మ తెస్తుందా?' అని తిట్టడం మొదలు పెట్టింది. ఇప్పటిదాకా మేకలు మేపుతూనే వున్నానని నీకుతెలుసు. వాటిని మేపడానికి వెళ్ళక పోతే పాలుపోతాయి, దెబ్బలూ తినాల్సి వస్తుంది. ఈ చుట్టుపక్కల కుర్రాళ్లు రాక్షసులు. మేకలస్థనాల్ని నోట్లోపెట్టుకుని పాలు తాగేస్తుంటారు. వాటిని మేప డానికి వెడితే ఆ నెపం పెటుకుని స్నేహితురాంౘ్రని కలుసుకోవడానికి వెడుతున్నా

నని తిడుతుంది. అన్నివిధాలా చావే. అరే! నీకు ఇంతవరకూ నీళ్ళు ఇవ్వనేలేదు. మాటల్లోపడి మరచిపోయాను. కుండ తొలచి ఇస్తాను.' ఆమెమనసులో గూడు కట్టుకుని వున్న దుఃఖం పొంగి ప్రవహించడంచేత ఓదార్పు చెంది ఆలస్యం అయినమాట మరచిపోయింది.

బావి ఒడ్డునవున్న గట్టుపైన కూర్చుని ఆమె చెప్తూవుంటే ధనసింగ్ తన్మయత్వంతో వింటున్నాడు. అతను దాహంకూడా మరచిపోయాడు. 'ఆ! నీళ్ళు తాగుతాను' అని తల వూపాడు.

ఆమె కన్నీళ్ళతో తడిసిన తన ముఖాన్ని కడుక్కుని, కుండతొలచి, నింపి, కుండను గట్టుమీదపెట్టి ఒక చేతిని కుండక్రిందపెట్టి ధారగా పోసింది. ధనసింగ్ ఆ గట్టుక్రింద గొంతుకూర్చుని రెండుచేతులతో దోసిలిపట్టి నీళ్లుతాగాడు.

చీకటి బాగా దట్టమయింది. కాని ఆ కనుమ చీకటిలో మునికిపోలేదు. పొగ మంచుతో కప్పబడి పాలవంటి ప్రకాశంతో నిండిపోయింది. అంతకు క్రితంరోజే పూర్ణిమ. తూర్పు - దక్షిణాలుగా వున్న కొండలపైన చంద్రుడు నిండుగా చిన్న దెబ్బతిన్నవాడిలా ఉదయించాడు.

ముఖం కడుక్కోవటంచేత ఆ యువతి స్వచ్ఛమైన పచ్చనిరంగుతో కని పిస్తోంది. ఖంజనపక్షుల జంటలా రెండుకళ్ళూ మెరుస్తున్నాయి. గట్టిగా శ్వాసపీల్చి 'ఇక పదండి' అని ఆమె తనలో తాను అనుకుని, నీళ్ళునిండిన కుండవైపు అడుగువేసింది.

'ఇక్కడ రాజపుత్రుల గ్రామంవుందా?' అని ధనసింగ్ అడిగాడు.

'కొన్ని రాజపుత్రుల ఇళ్ళు, కొన్ని బ్రాహ్మణుల ఇళ్లు, కొన్ని కూలిపని చేసుకునేవాళ్ళ ఇళ్లు ఉన్నాయి.' ఆమె తనపై బట్ట చివరి అంచును గుండ్రంగా తిప్పి చుడుతూ అంది, 'కాని ఏమడుగుతావులే, ఎటువంటి ప్రజలని!'

ధనసింగ్ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు, 'ఏం మంచివాళ్లు కాదా!'

ఆమె తలతిప్పి సమాధానం చెప్పింది - 'దుర్మార్గులు, సిగ్గులేనివాళ్లు. పెదదారులు వెతుకుతుంటారు. దోవలో వెళ్లే వాళ్ళెవరితోనైనా తమ ఇంటి ఆడది మాట్లాడటం చూస్తే ఆమె తలనరికేస్తారు. తాము పరాయి ఆడవాళ్ళతో ఆడాలని చూస్తుంటారు. బీదవాళ్ళకు అప్పులు ఇచ్చే షాహుకారుగారి కొడుకు వున్నాడు.

పూర్తిగా మీసాలుగూడా రాలేదు. నేను చీడ్‌చెట్ల అడవిలోకివెళ్ళి పుల్లలు ఏరుకుంటున్నాను. దగ్గరకొచ్చి ఈలు వేయడం మొదలుపెట్టాడు. చిన్నపిల్లవాడేగదా అని నవ్వి, ఏం ఫరవాలేదని వూరుకున్నాను. వాడొచ్చి చెయ్యి పట్టుకుని అర్థ రూపాయి తీసుకో అన్నాడు. నేను చెయ్యితిప్పి చెంపమీద ఒక్క దెబ్బకొట్టాను. వాడి పళ్ళలోనుంచి రక్తంకారి బయటకొచ్చింది. అరె! ఇక వెళతాను. చాలా సేపయింది. వెళ్ళిచూస్తాను. ఏడవటానికి ఇంకా ఏం మిగిలివుందో, ఇంతసేపు ఏం చేస్తున్నావని నన్ను తప్పకుండా తిడతారు. (అయ్యయ్యో! చచ్చాను. పెద్దది పిండి కలపడానికి నీళ్లు లేక కూర్చుని వుంటుంది. చీకటిగా వుందని, అక్కడ మనుషులు ఎవ్వరూ లేరని, అందుకని స్నానంచేసి వచ్చానని చెపుతాను.' ధనసింగ్ వైపు చూసి - 'అవునంటే, ఎంతవరకు చేస్తారు ఎవరైనా!' అన్నది.

కుండ ఎత్తుకోవడానికి ఆమె వంగగానే ధనసింగ్‌గూడా లేచి 'ఇలా ఇయ్యి. ఆ దోవదాకా తీసుకువస్తాను. నీకు దెబ్బగూడా తగిలివుంటుంది' అన్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వి వద్దని తల ఆడించింది. తనకున్న అలవాటువలన చాతుర్యంగా రెండు చేతులూగూడా కుండ మూతిమీదవేసి, తర్వాత అరచేతితో కుండకింద భాగం పట్టుకుని ఒక్కవూపులో కుండని మోకాళ్ళ ఎత్తువరకు ఎత్తింది. కాళ్లు బావిగట్టుమీదపెట్టి కుండని తన మోకాలిమీద నిలబెట్టింది. పైచేయి కుండమూతి మీదనుంచి జారి గుండ్రని భాగంమీదకు వచ్చింది. రెండవ ఊపులో కుండ తేలికగా ఆమె తలమీదకు వెళ్ళింది.

'నీ పేరేమిటి?' ధనసింగ్ అడిగాడు.

వెన్నెల సూటిగా ఆమె ముఖంమీదకువచ్చి పడుతూవుంది. ఆమె ముఖాన చిరునవ్వు చిందింది. 'సోమా' సమాధానం చెప్పింది. 'మీరు చాలా మంచివారండీ. ఈ రెండు సంవత్సరాలలో నాతో ఎవరూ ఇలా మాటాడలేదు. మీకు మేలుజరగాలి. మీ ఇల్లు ఎక్కడవుందండీ?' అని అడిగింది.

'హమీర్‌పుర్ తహసీల్‌లో బడ్‌సర్ పోలీసుస్టేషనుకు దగ్గరగా.' ధనసింగ్ చెప్పాడు. పర్వతపు ఎత్తు - పల్లాలలోవున్న చీడ్‌చెట్ల అడవులలో సంయ్ - సంయ్ మనిమోత చేస్తూ గాలి వీస్తోంది. ధనసింగ్ మాఘమాసం చలివలన కలిగే వణుకు అనుభవించాడు. అతను ఆమె వెనుక నడుస్తూ ఒక సిగరెట్టు అంటించాడు.

పొగవదులుతూ 'చాలా చలిగా వుంటోంది. ఈ రాత్రి రోడ్డుమీదే గడపాలి' అన్నాడు.

'ఏమండీ! దురదృష్టవంతులకు ఎవరైనా సహాయం చేస్తే భగవంతునికి వాళ్ళమీద కోపమొస్తుంది. చూడండి! అందుకే మీ లారీ చెడగొట్టాడు. లేకపోతే ఇంకేమిటి?' సోమా అన్నది.

'అలా అంటున్నావేం?' ధనసింగ్ సిగరెట్టు పొగతో నిండిన గాలి వదిలి జాలితోనిండిన గొంతుతో అడిగాడు. సోమా ఎప్పుడూ దెబ్బలవలన, తిట్లవలన దుఃఖాన్ని అనుభవిస్తూ వుండేది. ఇప్పుడు ధనసింగ్‌కు ముందుగా వెడుతున్న సోమా సానుభూతి. ఓదార్పుల ఆశ్రయాన్ని పొందుతోంది. వాళ్ళు నడుస్తున్న దోవ, ఆ పరిసరాలలోని గుట్టలు, వాటిపైన వున్న చెట్లు, నీడలలో వున్నాయి. కాని ధనసింగ్, సోమాలపై కొద్దిగా వెన్నెల పడుతోంది. 'ఇక్కడకు దగ్గరలో ఎక్కడైనా తినడానికి ఏమైనా దొరుకుతుందా? కావలసిన డబ్బులిస్తాను.' అని ధనసింగ్ రోడ్డుమీదకు వచ్చిన తర్వాత అడిగాడు.

ఎక్కడా దొరకదని చెయ్యితిప్పుతూ సోమా అన్నది—'దొరకదండి. దోవపక్కన వున్న ఇళ్ళవాళ్ళంతా రాక్షసులైపోయారు. ఇతర వూళ్ళనుంచి వచ్చే వాళ్ళుగూడా అట్లాంటి వాళ్ళే వస్తున్నారు. ఏదన్నా కనిపిస్తే చాలు, ఎత్తుకు పోతారు. మొదట్లో దొంగతనం అన్నమాట వినిపించేది కాదని అంటూఉండే వాళ్ళు. ఇప్పుడు పొలాల్లో సొరకాయలు, బీరకాయలు, గుమ్మడికాయలు, వంకాయలు, దానిమ్మకాయలు. అరటిపళ్లు, కొంచెంగూడా మిగల నివ్వడంలేదు. దొంగలుచేతుల పడటంచేత చెట్లుగూడా ఏమీకాయడంలేదు.'

సోమా ఒకచేతిని నెత్తిమీద పెట్టుకున్న కుండకు ఆధారంగా వుంచి కాలి బాటమీదకు ఎక్కడానికి తిరిగింది. 'మీ ఇల్లు ఎంతదూరం వుంటుంది?' అని ధనసింగ్ అడిగాడు.

'దూరమేమిటి?' సోమా రాతిగుట్టపైనుంచి చేతిని చూపుతూ సమాధానం చెప్పింది.' ఇక్కడకు దగ్గరే. ఆ గుట్టపైన చెట్లవెనకాల. మాకు ఈ దారినవెళ్ళే లారీల శబ్దం వినబడుతూనే వుంటుంది. ఇదేమిటి? గేదె రంకెవేస్తున్నట్లుగావుంది. వెళ్ళి ఆ మహామారి పాలు పితకాలి. ఆ రాణులేమో గోరింటాకు పెట్టుకుని

అలంకరించుకుని కూర్చుంటారు. మా రెండవ తోడికోడలి కొడుకు మలవిసర్జన చేసి కుప్పలుపెట్టాడు. వాడి బట్టలన్నీ పుతకాలి. ముసలిమామగారు ఖంగుఖంగున దగ్గుతూవుంటాడు. మాచిన్నమరిది సైన్యంలోవున్నాడు. ఒక పెద్దదళానికి సంబంధించిన కార్యాలయంలో నౌకరు. ఇక నేను వెడతాను.' సోమా వెనక్కి తిరిగి అడిగింది 'కప్పుకోవడానికి బట్టలున్నాయా? చలివేస్తే మంట వేసుకోండి. మంచిది నే వెడతాను' అంది.

కాలిబాటమీదకు ఎక్కే సోమాని వెనుకనుంచి ధనసింగ్ మళ్ళీ పిలిచాడు - 'బాగా వెన్నెలగావుంది. మళ్ళీ ఇటేమన్నా వస్తావా, నిద్రపోతావా?' అని అడిగాడు.

వెనక్కు తెరిగి చూడకుండానే 'ఎక్కడండీ! ఇప్పుడే చచ్చేందుకు తీరుబాటు ఎక్కడుందీ?' అని సోమా ముందుకు వెళ్ళిపోయింది.

ధనసింగ్ ఆ మార్గంమీద ఒక్కడూ వుండిపోయాడు. సిగరెట్టు దమ్ములు లాగుతూ లారీచుట్టూ అనేకసార్లు ప్రదక్షిణం చేశాడు. చలిలో రోడ్డుమీద రాత్రంతా గడపాలనే బాధ అతని మనసులో లేదు. ఆ పర్వతప్రాంతాలలో డ్రయివు చేసేవాళ్ళకి రోడ్డుమీద రాత్రిగడపవలసిన కష్టం అంతపెద్ద విషయం కాదు. ఇటువంటి పరిస్థితిని వృధాపోనియ్యకుండా వుపయోగించుకునే విధానంగూడా వాళ్ళకి తెలుసు. ఇటువంటి రెండు సందర్భాలు ధనసింగ్‌కు గుర్తొచ్చాయి. ఒకసారి ఉస్తాద్ జమాల్‌తో కలిసి పాలమ్‌పూర్ దగ్గర ఒకరాత్రి అక్కడ వ్యాపారం చేసుకునే వాళ్ళదగ్గర కల్లుతాగుతూ, వాళ్ళ నాట్యం చూస్తూ గడిపాడు. రెండవసారి సాయంకాలం బజారు దుకాణాలలో పాలు కొనుక్కుని క్షీరాన్నం సుష్టుగా తిన్నారు.

ఆ సాయంకాలం జరిగిన సంఘటన అతనికి మాటిమాటికీ గుర్తుకు వచ్చింది. మేకపిల్లని రక్షించడానికి లారీ ఎదురుగా వచ్చిపడి, గాబరావలన స్తంభించిపోయిన ఆమె ముఖం, భయంవలన పెద్దవైన కళ్లు....చీకటిలో ఆమె వెక్కివెక్కి ఏడవడం, వెన్నెలలో ప్రకాశించే ఆమె పచ్చనిముఖం, వయ్యారంగా ఆమె కుండ ఎత్తుకోవడం, అమాయకత్వంతో నిండి కపటంలేని ఆమె మాటలు - 'మీరు చాలా మంచివారండి. రెండు సంవత్సరాలుగా నాతో ఎవరూ ఇలా మాట్లాడలేదు.' అన్న ఆమె మాటలు గుర్తొచ్చి మాటిమాటికి కలకండలా అతని నోరు వూరిస్తున్నాయి. తను రాజపుత్రుడని అతను సోమాతో చెప్పిన అబద్ధం ఈ తీపిదనంలో వగరు కలిగిస్తోంది.

ధనసింగ్ ఎప్పుడు ఈ అబద్ధం చెప్పినా, ఒక భయం అతని మనసులో వుంటూవుండేది. అతను పుట్టింది రాజపుత్రవంశానికి చెందిన తల్లి - దండ్రులకు కాదు, ఒక నీచజాతి శూద్రుల ఇంట్లో. జన్మతః అతనివృత్తి బ్రాహ్మణులకు, రాజపుత్రులకు, క్షత్రియులకు, వైశ్యులకు, కాయస్థులకు సేవచేయడం. వారితో సమానంగా కూర్చోవడానికి, వారి అంతస్థుకు తగిన బంధువుల మాటలు మాట్లాడ డానికి అతనికి అర్హతలేదు. అతనిపేరును ధనసింగ్ అని కాకుండా ధన్నాగానో, ధన్నూగానో చెప్పుకోవాల్సి వచ్చేది. కాని అతనిమనసు తన అల్పత్వాన్ని ఎప్పుడూ అనుభవించేది కాదు. ఆ అల్పత్వం ఇతరుల అహంకారంవలననూ, తన తల్లి - దండ్రులు ధనహీనులవడం వలననూ అనుభవించాల్సి వచ్చేది. తనకు ఆపాదించిన అల్పత్వం, అవమానం, తనమీద విధించిన దండనలకు తల ఒగ్గక, ఉచ్చజాతి వాళ్ళతో సమానత్వాన్ని పొందేందుకు, వారిపంచన కూర్చునేందుకు ఈ అబద్ధాన్ని అతను చెపుతుండేవాడు. సోమాతో అబద్ధం చెప్పిన సందర్భంలోకూడా అతని మనసులో అదే అనుభూతి, తలంపు కలిగాయి. ఎందుచేతనంటే ఆమె దృష్టిలో అతను నీచుడుగా పరిగణింపబడకూడదు. అతని ఈ మానసికమైన తిరుగుబాటు, ఈ తిరుగుబాటుకు కారణాలు, పరిస్థితుల్నీ, గడచిపోయిన అతనిజీవితాన్నీ గుర్తుకు తెస్తుంటాయి.

ధనసింగ్ తండ్రి ఒకప్పుడు లాహోర్‌లోనూ, ఒకప్పుడు అమృతసర్ లోనూ ఉద్యోగం చేస్తుండేవాడు. అక్కడినుంచి సంపాదన ఇంటికి పంపుతూ వుండేవాడు. తండ్రి డబ్బుపంపితే పోస్టాఫీసునుంచి తపాలాబంట్రోతు డబ్బు తీసుకువచ్చి ఇచ్చేవాడు. అప్పుడప్పుడూ తండ్రివ్రాసిన ఉత్తరంగూడా వచ్చేది. ఆ ఉత్తరం తపాలాబంట్రోతు చదివి వినిపిస్తూవుండేవాడు. ఆ తపాలాబంట్రోతుకు పాలు, చిలుము ఇచ్చి గౌరవం జరుగుతూవుండేది. ధనసింగ్ తల్లి చిన్నతనంలోనే జ్వరంతో మరణించింది. ధనసింగ్‌కు ఆ గడచిపోయిన రోజులు, ప్రేమతో నిండిన తల్లిమమకారం తాలూకు అస్పష్టమైన స్మృతులు, పెదతల్లిగారి కఠినమైన ప్రవర్తన గుర్తుకువస్తూ వుండేవి. మూడు నాలుగు చిన్నచిన్న పొలాలను పెద తండ్రి కవులుకు తీసుకుని చేస్తుండేవాడు.

తన తండ్రి కోరికమీద పెదతండ్రి అతనిని చదువుకోవడం కోసం

వంపటం మొదలు పెట్టాడు. పెదతండ్రికి ఇది నచ్చలేదు కాని ధన్నూ తండ్రి డబ్బు పంపేవాడు. అందుకని ఆయన చెప్పినట్లు చేయడం జరిగింది. స్కూలు వాళ్ళ ఇంటిదగ్గరనుంచి రెండుమైళ్లకన్నా ఎక్కువ దూరంలోవుంది. అతను మూడు సంవత్సరాలు స్కూలుకు వెళ్ళాడు. కానీ రెండునెలలు చదువుకోవడానికి వెళితే మూడునెలలు వెళ్ళలేకపోయాడు. మళ్ళీ కొత్తగా చదువు మొదలుపెట్టేవాడు. కొన్నాళ్ళు ఇలాగే గడిచింది. అతని పెదతండ్రి, పెదతండ్రిగారి ఇద్దరు కొడుకులు తమ పొలాలని దున్నుకుంటూ, చుట్టుపక్కలవాళ్ళ పొలాలుగూడా కవులుమీద సేద్యం చేస్తుండేవారు. ఇంటిగోడలు మట్టితో కట్టబడివున్నాయి. చూరు రెల్లుతో కప్పబడివుంది. వాళ్ళపొలాలు రాజపుత్ర ఆసామి అయిన బిజర్‌సింగ్‌వి. ఆ పక్కనే ఆ ఆసామిగారి ఇల్లు. అది రాళ్ళతో నిర్మించబడినది. దాని చూరు స్లేటుతో కప్పబడినది. ఆ చుట్టుపక్కల వాళ్లంతా ఆసామి బిజర్‌సింగ్‌గారి బాకీదార్లు. ధనసింగ్ చిన్నతనంలోగూడా ఆసామిగారిదగ్గరనుంచి పిలుపువస్తే నీళ్ళు నింపడానికి, కర్రలు మోయడానికి, ఇంకా మిగతా చిల్లర పనులేమైనా చేయడానికి అక్కడికి వెడుతూ వుండేవాడు.

ధనసింగ్ తండ్రి లాహోర్‌లో చనిపోయాడు. డబ్బురావటం ఆగిపోయింది. అతని అన్న (పెదతండ్రిగారి కొడుకు) గతేడా గ్రామంలో వ్యాపారస్తునివద్ద ఉద్యోగం సంపాయించాడు. అప్పు తీర్చలేకపోవడం వలన బిజర్‌సింగ్ వాళ్ల ఇంటిని జప్తుచేయించాడు. అతని పెదతల్లి ఒంటిమీద రెండు మూడు వెండి నగలున్నాయి. గొల్లున ఏడుస్తూ ఆమె అవి ఇచ్చేసింది. ఇంటిలోని ఇత్తడిపాత్రలు, ఒకగేదె, చూరు దూలాలనుదింపి పోలీసులు ఆసామిగారి వశంచేశారు. ఆ తర్వాత ధనసింగ్ పెదతండ్రి ఆసామి బిజర్‌సింగ్ భూమిని వదిలేసి నత్తేసాహ్‌గారి భూమి మీద వివాసం ఏర్పరచుకున్నాడు. పెదతండ్రి నత్తేసాహ్‌గారి కంచరగాడిదలను కాసే ఉద్యోగంచేయడం మొదలుపెట్టాడు.

ధనసింగ్ పెదతల్లి తన ఇద్దరుకొడుకులు ఇల్లువదిలి పారిపోవడంచేత బాధపడుతూవుండేది. 'ఈ చచ్చినాడు ముద్దయిపోయాడు పధ్నాలుగేళ్లు వచ్చాయి. పనీలేదూ, పాటూలేదు....తనపొట్ట పోషించుకోవడం కోసం తండ్రి ఇక్కడ

వదిలిపెట్టి వెళ్ళారు. ఈ వచ్చినాడు మెడమీదపడ్డాడు' అని ధనసింగ్‌ని తిడుతూ వుండేది.

కళేడా గ్రామంలో వుండే బల్లేవ్యాపారి ధన్నూని తనదగ్గర వుద్యోగంలో పెట్టుకున్నాడు. అతను బల్లే వ్యాపారిదగ్గర రెండు సంవత్సరాలకు కొంచం తక్కువగా పనిచేశాడు. కాని అతనికి మంచి జ్ఞాపకశక్తి వుంది. బల్లేదగ్గర చాలా డబ్బుందని ప్రజల నమ్మకం. కాని బల్లే ప్రవర్తన, రూపంచూసి అతనిదగ్గర డబ్బుందని ఎవరూ అనుకోలేరు. ద్వేషంతో ప్రజలు ఆయన్ని లోభి అని, వ్యాపార నిర్దయుడని అంటూవుండేవాళ్లు. పైకి గౌరవసూచకంగా ఆయన్ని 'మురికి - షాహుకారు' అని పిలిస్తుండేవాళ్ళు. అయినా ఆయన ఆడంబరాన్ని గురించి పట్టించుకోకుండా పని - పాటల్లోకి మురికి గుడ్డలతో తయారయ్యేవాడు. నౌకరు కుర్రాడు నజర్‌సింగ్ బట్టలకన్నా బల్లే బట్టలు ఎక్కువ మురికిగానే వుండేవి.

నజర్‌సింగ్ హోషియార్‌పుర్, కాంగడాలనుంచి బల్లేగారి దుకాణాల సామానుని కంచరగాడిదలమీద చేరవేసే పని చేస్తుండేవాడు. నజర్‌సింగ్ దారాలతోనూ, జరీతోనూ కుట్టిన గుండ్రని టోపీపెట్టుకునేవాడు. కాలరువున్న తెల్లచొక్కా ధరించేవాడు. చొక్కామీద ఎర్రని దారపు అల్లికలు మెరుస్తూవుండేవి. వెండి గొలుసుతోవున్న పెద్దపెద్దగుండీలు కోటుముందు కనిపిస్తూవుండేవి. నల్లని వెడల్పైన వల ఆకారంలోవున్న పైజామా ధరించేవాడు. అతని చెప్పులమీద ఆవనూనె మెరుస్తుండేది. ఆవూరి ప్రజలు అతన్ని 'పట్నం జంటిల్‌మాన్' అని పిలుస్తుండేవాళ్ల.

బల్లే షాహుకారుగారి టోపీరంగు మురికిగావుండి గుర్తుపట్టడానికి వీలు లేనట్టుగా వుండేది. ఆయన చొక్కాడికూడా ఇదే పరిస్థితి. ఎముకలుకొరికే చలిలో గూడా ఆయన పైజామా ధరించడం ఎవరూ చూడలేదు. నడుముకు కేవలం లంగోటీ వుండేది. పెద్దవాళ్ళ గోష్ఠికి వెళ్ళేటప్పుడో, విందులకు వెళ్ళేటప్పుడో మాత్రం గౌరవ మర్యాదల కోసరం కాళ్ళకి చెప్పులు, తలమీద తలపాగా ధరించేవాడు.

బల్లే షాహుకారుగారి దుకాణంలో సుమారు అన్ని వస్తువులూ వుండేవి: రైతుల చేతిపనిముట్లు తయారుచేయడానికి ఇనుముదగ్గరనుంచి ఉప్పు. బట్టలు. అద్దాలు. దువ్వెనలు. సోపు గింజలు. వాముదరకు అన్నీ దొరుకుతూవుండేవి. ఆయన ముఖ్యమైన వ్యాపారం రైతులకు వడ్డీమీద డబ్బు అప్పు ఇవ్వడం. వాళ్ళ దగ్గర నెయ్యి చౌకధరలో కొంటూవుండేవారు. సామానుని కంచరగాడిదలమీద మూటలుగావేసి నారౌన్, హోషియార్‌పుర్‌ల సంతలకు పంపుతూ వుండేవారు. ఆయన ఇల్లు రెండస్థులమేడ. రాళ్ళతో కట్టిన పెద్దగోడలతో, స్లేటుతో వేయబడిన చూరుతో నిర్మించబడింది. ఆకలితోనూ భయంతోనూ, విలవిలలాడే ఒకపిల్లిలా బల్లే ఆ ఇంట్లో కనిపిస్తూ వుండేవాడు. ఆయన రూపు - రేఖలలో భాగ్యాన్ని సూచించే ఏ చిహ్నాలులేవు. లావుగా, బోలుగావుండే చిన్నచిన్న దుద్దులమాత్రం చెవులకు వుండేవి. ఆ దుద్దుల బరువువలన చెవుల చిల్లులు పెద్దవై ఆ దుద్దులు క్రిందకు వేళ్ళాడుతూవుండేవి. అందుచేత దారంతో ముడివేసి వాటిని చెవిపైన కట్టుకున్నారు. ఆయన శరీరపుచర్మం, చేతులూ, కాళ్లూ చాలా మృదువైనవి. అవి కర్కశత్వం, కాఠిన్యం సూచించేవి కావు.

బల్లే ఇంటిబయట విశాలమైన వాకిలి వుంది. ఆయన భార్య, పిల్లలు, కోడలు, గ్రామంలోని ఇతరస్త్రీలకన్నా మంచిబట్టలు ధరించేవాళ్ళు. వాళ్ళదగ్గిర ఎక్కువ బట్టలుండేవి. వాళ్ళ ఒంటిమీద నగలుకూడా వుండేవి గ్రామంలోని ఇతర స్త్రీలు వెండినగలుమాత్రమే ధరించేవాళ్లు. బల్లే ఇంటిస్త్రీల ముక్కులకి అర్ధరూపాయంత వెడల్పైన బంగారపు ముక్కుపుడకలు, చెవులకు, మెడలలోనూ కూడా రెండు మూడు బంగారపునగలు వుండేవి. కాని, బట్టలు, షరాయిలు, చొక్కాలు, పైన కప్పుకునే బట్టలు నున్నగానూ, నల్లగానూ వుండేవి. అప్పుడప్పుడూ వాళ్ళు పరదాకూడా వేసుకునేవాళ్ళు. బావిదగ్గరకు వెళ్ళేటప్పుడు తప్ప ఇంకా ఎక్కడికి వెళ్ళాల్సివచ్చినా షరాయిలమీద మందమైన పావడాలు ధరించేవాళ్ళు, ముసుగు వేసుకునేవాళ్లు. బావినుంచి నీళ్ళు అప్పుడప్పుడు తీసుకువచ్చేవాళ్ళు కాని ఇతరస్త్రీల మాదిరిగా గడ్డి కోయడానికిమాత్రం వెళ్ళేవాళ్ళు కాదు.

ధన్నూని రెండురూపాయల నెలజీతం, రొట్టె - బట్టలు ఇచ్చే పద్ధతిమీద బల్లే ఉద్యోగంలో పెట్టుకున్నాడు. బట్టలు ధరించడంలో ధన్నూ తన యజమాని

తంటే వేరుగా వుండేవాడు కాదు. నాగలితో దున్నటం మినహా ఇతరపనులన్నీ బల్లే తీరుబడి అయినప్పుడల్లా స్వయంగా చేసుకునేవాడు. ఇంట్లోవాళ్ళు నానబెట్టిన గోధుమపిండి రొట్టెలు, అన్నమూ తింటుండేవాళ్ళు. అప్పుడు ధన్నూకు మొక్కజొన్న రొట్టెలు ఇచ్చేవాళ్ళు. దాదాపు ఇంటిపనంతా స్త్రీలబట్టలు వుతకడంతప్ప ధన్నూ చేస్తుండేవాడు. కొండప్రదేశాలలో పురుషులు బట్ట లుతకరు. పప్పు-అన్నం వండుతుండేటప్పుడుమాత్రం అతన్ని వంటింటివని ముట్టుకోనిచ్చేవాళ్ళు కాదు. దాన్ని మడివంట అనేవాళ్ళు. ధన్నూది నీచజాతి మరి.

బల్లే షాహూకారు పెద్దకొడుకు ధన్‌పత్‌రాయ్ ధర్మశాలకాలేజిలో చదువుతూ వుండేవాడు. అతను సెలవుల్లో ఇంటికి వచ్చినప్పుడు రోజూ గడ్డం చేసుకుని, తెల్లనిబట్టలు ధరించేవాడు. అతని చెవులకు బంగారపు దుద్దులుగూడా వుండేవి. ఆ గ్రామంలోగాని, ఇంట్లోగాని అతను వున్నప్పుడు, ఏదైనా తెల్లని కొంగ ఎక్కడి మంచయినా ఎగిరివచ్చి మురికి చెరువు మధ్యలో వాలిందేమో అన్నట్లుగా వుండేది. ధనపత్‌రాయ్ కసరత్ చేస్తుండేవాడు. అడవులలో షికారు చేసి అడవిపూలని చూస్తుండేవాడు. అతను విశ్రాంతి, సుఖం వదిలిపెట్టి మనస్ఫూర్తిగా శరీరానికి కష్టం ఇవ్వటం గ్రామప్రజలకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూవుండేది. అతను తొందరలోనే కలక్టరు అవుతాడని అందరకూ నమ్మకంగా వుండేది. ఇంట్లోని స్త్రీలు - తల్లి, చెల్లెళ్ళు, అతని భార్యకూడా అతనంటే చాలా భయపడేవాళ్ళు. అతను ఇంట్లో వున్నప్పుడు వాళ్ళందరూ ఏం మాట్లాడకుండా వుండేవాళ్ళు.

ధన్‌పత్‌రాయ్ కాలేజీకి వెళ్ళిపోతే, ఇంట్లో బల్లే. ధన్నూతప్ప మూడవ మగాడు బల్లేసాహ్‌గారి మూడుసంవత్సరాల చిన్నకొడుకు గజపత్ వుండేవాడు. ఆడపిల్లలు, కోడలు ధన్నూనిచూసి నవ్వుతూ, పరిహాసంకూడా చేస్తుండేవాళ్ళు. ధన్‌పత్‌రాయ్ భార్య ధన్నూని పేరుపెట్టి పిలిచేదికాదు. ఎందుకంటే ఆమె భర్త పేరుగూడా అదే. ఆమె ధన్నూని ఎప్పుడూ 'ఓయ్' అనిగాని 'ఏయ్' అనిగాని కేకేసేది. లేకపోతే 'వచ్చినావా, మొగవెధవా!' అని తిడుతూ పిలిచేది. ఈ పరిహాసం ధన్నూకుగూడా నచ్చేది. బల్లేగారి పెద్దకూతురు అప్పుడప్పుడు ధన్నూకు ఇటువంటిమాటలు చెప్పేది, సౌంజ్ఞలుగూడా చేసేది. అయినా ధన్నూ అర్థం

చేసుకోలేకపోయేవాడు. ఆడపిల్లలు ఒకళ్ళనొకళ్లు తిట్టుకుంటూ, నవ్వుకుంటూ వుండేవాళ్ళు. వాళ్లు ధన్నూని 'నువ్వు పెళ్ళి ఎప్పుడు చేసుకుంటావు? ఎటువంటి భార్యను తీసుకొస్తావు? నీ భార్యతో ఏం మాట్లాడతావు? ఏం చేస్తావు?' అని అడుగుతుండేవాళ్ళు.

అది చలికాలం. ఓరోజు రాత్రి కోడలు వంటఇంటిలో పని పూర్తిచేసుకుని. రొట్టెలు ఇవ్వడానికి ధన్నూని పిలిచింది. 'ఇది తీసుకోరా చచ్చినాడా!' అని ప్రేమతో తిట్టి మిగిలిన గోధుమరొట్టెలను ఇచ్చేసింది. రొట్టెమీద నెయ్యిగూడా రాసివుంది. కోడలు పొయ్యిదగ్గరగా కూర్చుని తింటోంది. ధన్నూ అలవాటు ప్రకారం వంటఇంటికి కొంచం దూరంగా జరిగి గోడవారగా గొంతుక్కూర్చుని తింటున్నాడు.

'చచ్చే చలి వేయడంలా? కొంచం మంటదగ్గరకు రా!' అని కోడలు అంది.

ధన్నూ పొయ్యివైపు కోడలు కూర్చున్నచోటికి దగ్గరగా జరిగాడు. కోడలు నవ్వుతూ మాట్లాడుతోంది. అప్పుడప్పుడు తన పుట్టింటిమాటలు చెప్పి నువ్వు పెళ్ళిచేసుకుంటే నీ భార్యకోసం ఇటువంటి బట్టలు, నగలు చేయించాలని అతనికి నచ్చజెపుతోంది. ధన్నూ భోజనంచేసి అంటగిన్నెల్ని తోమటం మొదలుపెట్టాడు. కోడలు అతనితో కబుర్లు చెపుతూ గిన్నెలు తోమిస్తోంది. పాలు తోడువేయడానికి వెళ్ళబోతూ 'కొంచం పాలు తాగుతావా! వంటింట్లోకి రా ఇస్తాను' అన్నది ధన్నూతో.

ధన్నూ గిన్నెతో పాలుతీసుకుని తాగుతున్నాడు. అదేసమయంలో బల్లే అతన్ని రెండుసార్లు కేకేశాడు. 'ఎక్కడ చచ్చావురా? చిలుములో నిప్పువేసి వెళ్ళు' అని పిల్చాడు.

ధన్నూ సమాధానం ఇద్దామనుకుంటూ వుండగా కోడలు ఆపేసింది– "మాట్లాడకుండా వూరుకో, ఈ ముసలి చచ్చినాడు రోజంతా అరుస్తూనే వుంటాడు'

అని ఆమె చిన్న ఆడుబిడ్డను పిలిచి 'నీళ్ళు లేవు. కుండతీసుకుని బావిదగ్గరకు వెళ్ళాడని చెప్పు' అనిచెప్పి పంపించింది.

'నీ భార్యకి నీమీద కోపం వస్తే ఏం చేస్తావు? కొడతావా? బుజ్జగిస్తావా?' అని కోదలు ధన్నాని అడిగింది.

'చంపుతాను' ధన్నా పిడికిలి బిగించి చూపించి అన్నాడు.

'నువ్వు చావు! అట్లా అనగూడదు' అని కోదలు నవ్వుతూ తెలియజెప్పి. 'నీ భార్య చచ్చిపోతే ఏం చేస్తావు?' అని అడిగింది.

'రెండో పెళ్ళి చేసుకుంటాను.''

'ఛీ' కోదలు చనువుగా కొట్టింది- 'ఇట్లా అనవా? భార్యని ప్రేమగా ఒప్పించాలి.... నీకు ప్రేమించడం వచ్చా అసలు?'

'రాదు' ధన్నా తల ఆడించాడు. అతను శరీరంలో ఓ మధురమైన పంచల వాన్ని పొందుతున్నాడు. దీపంకాంతి, పొయ్యిమంటల వెలుగులో కోదలిముఖం గులాబీలా వికసించింది. ఆమె కళ్ళు మూతలు పడిపోతున్నాయి. 'నీకు నేను తెలియజెప్పనా' అని ఆమె అడిగింది.

'ఆ, చెప్పండి' ధన్నా నోటితో చెప్పకుండా తల ఆడించాడు.

'ఇటురా.'

కోదలు గోడవారగా ఆనుకుని నిలబడింది. ధన్నా ఆమెవైపు నడిచాడు. కోదలు అతని భుజాలమీద చేతులువేసి అతనిముఖం తన ముఖంవైపుకు లాగింది. ధన్నా చేతులు ఆమెని చుట్టుకున్నాయి. అదేసమయంలో వంటింటిద్వారంనుంచి బల్లేగారి తిట్లు వినబడ్డాయి. బల్లేగారి హుక్కాగొట్టం ధన్నా భుజాల్ని తాకుతూ అతని వెనుకవున్న గోడకువెళ్ళి తగిలింది.

'అయ్యో! చచ్చాను. నామీద చెయ్యివేశాడు. నేను ఏడుస్తున్నాను....' అని కోదలు ఏడవడం మొదలుపెట్టింది.

ధన్నా బల్లేని వంటింటి తలుపునుంచి నెట్టి పారిపోయాడు. వెనకనుంచి 'పట్టుకో! పట్టుకో!' అన్న కేకలు అతను విన్నాడు కాని వెనక్కి తిరిగిచూడ

తుండా పారిపోవడం మొదలుపెట్టాడు. అతను ఎనిమిదిమైళ్ళ దూరానవున్న ముజాన్ పుర్ వెళ్లి ఆగాడు. మూడవరోజు కాంగడా చేరాడు. ఆ తర్వాత ధన్నూ చాలా నెలలు లారీస్టాండులో కూలిపని చేశాడు. తర్వాత మూడుసంవత్సరాలు క్లీనరుగా పనిచేశాడు. తర్వాత ఉస్తాద్ మజహర్‌ఖాన్ దయవలన డ్రైవరయాడు.

ధనసింగ్ చిన్నప్పటినుంచిగూడా మెల్లిగా తియ్యగా మాట్లాడి, పక్కన చేరి, వున్నదంతా అపహరించి, సమయంవచ్చినప్పుడు కాటువేసే స్త్రీలను జిత్తుల మారి స్త్రీలుగా తలచేవాడు. అనుభవంవున్న వాళ్ళనుంచి, వృద్ధులనుంచిగూడా పని అతను నేర్చుకున్నదేమంటే ఆడవాళ్ళతో జాగ్రత్తగా మెళకువగా వుండాలి. డ్రైవరు జీవితంలోగూడా ఒకవేళ ఎప్పుడైనా అతనికి స్త్రీ సాంగత్యంలో వుండ వలసిన పరిస్థితి ఏర్పడితే వాళ్ళని ఎప్పుడూ ముళ్ళపొదగా తలచి మెళకువగా తన పని తను చేసుకునేవాడు. పురుషులతో వ్యవహరించినట్లుగానే స్త్రీలతోగూడా అతను సామాజికన్యాయాన్ని అనుసరించి ఆదరంతోనూ, నిర్లక్ష్యంతోనూ వ్యవహరించే వాడు కాని స్త్రీలనుమాత్రం ప్రత్యేకం నమ్మేవాడు కాదు. కాని ఈ సోమా ఎంత మంచిస్వభావం గలది, ఎన్నిబాధలు పడుతోంది, ఆమెలో కపటంలేదు అని అతనికి అనిపించింది.

రోడ్డుమీద మిలమిలలాడే వెన్నెల వ్యాపించింది. ధనసింగ్ కొంచెంసేపు తన లారీచుట్టూ ప్రదక్షిణచేస్తూ వుండిపోయాడు. తర్వాత రోడ్డుపక్కనవున్న దిబ్బమీదకెక్కి బండపైన కూర్చున్నాడు. సర్‌మని మోతచేస్తూ చల్లటిగాలి వీస్తోంది. అతను ముడుచుకుని కూర్చుని రోడ్డుమీద రాత్రి ఎలా గడపాలా అనే విషయంగురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. అతని మనసు జీవితంలో గడిచి పోయినవిషయాలవైపు మళ్లింది. మొదట్లో చలినిగురించి పట్టించుకోలేదు. చలి వలన రోమాలు నిక్కబొడుచుకోవడం మొదలుపెట్టేసరికి లారీలోకివెళ్ళి కూర్చుం దామనుకున్నాడు. ఆకలిగూడా వేస్తున్నట్లుగా అనిపించింది. ఆ రోజు మధ్యాహ్నం అతనూ, కర్మ్యూ, వీళ్ళిద్దరే ఏమీ తినలేకపోయారు. కాస్సేపు ఆకలిని మర్చిపోవ డానికి ప్రయత్నం చేయసాగాడు. తన సీటుక్రిందనుంచి కంబళి బయటకుతీసి కప్పు కుని సీటుమీద కూర్చున్నాడు. మనసును మరిపించడంకోసం కర్మ్యూ పాడు తుండగా విన్నపాటని గుర్తుకుతెచ్చుకుని కూనీరాగం తీయటం మొదలుపెట్టాడు.

ఆ పాట ఎవరో సుందరి విరహాలాపన - ఓ పరదేశీ నీవే నా మనసు అనే తలుపు గొళ్ళాన్ని తెరిచావు. నీ మనసుతో నా మనసు కలిపింది. పరదేశీ! నా కళ్ళు సగం వయసువరకు నీ కళ్ళని చూడాలని వేచివున్నాయి. మిగిలినవయసంతా నా కళ్ళు నీ కళ్ళని చూసేందుకు వర్షిస్తాయి. ఓ పరదేశీ! శ్రావణమాసంలో భూమి, ఆకాశంగూడా నీటిధారలతో నిండిపోతాయి, నేను నీకోసం ఎదురుచూస్తూ, ఆరు బయట నుంచుని, ఆ వర్షం తలమీద పడుతున్నా ఆనందంగా సహిస్తాను. నువ్వు బయట ఎందుకు నుంచున్నావని మా అత్తగారు అడ్డగించి అడిగినప్పుడుమాత్రం నాకు బాధ కలుగుతుంది. ఓ పరదేశీ! శీతాకాలపు ఋతువులో చలి అనే బాణాల వలన తూట్లుపడటంచేత చీడ్ చెట్లు పైతం తలలువంచి సర్ సర్‌మని మోతచేస్తూ దుఃఖిస్తూ వుంటాయి. అప్పుడుకూడా నీకోసం ఎదురుచూస్తూ దారిలో సంతోషంగా నిలబడతాను. ఎప్పుడైతే మా అత్తగారు, బయట ఎందుకు నిలబడ్డావు? లోపలకు వచ్చి దుప్పటి కప్పుకుని కూర్చో అని అంటుందో అప్పుడే నాకు శూలం గుచ్చు కున్నంతబాధ కలుగుతుంది.

ధనసింగ్ ఊహించసాగాడు. అమాయకురాలైన సోమా వానలోనూ, చలి లోనూ నిరీక్షిస్తోంది. తను పరదేశి. పాట అతనికోసం నిజంగా పాడుతున్నట్లుంది. అతనిహృదయంలో పాటభావం లోతుగా నాటుకుపోయింది. ఇక పాడలేక పోయాడు. మౌనంగా వుండిపోయాడు. ఒకసారి మళ్లీ సాయంకాలపు సంఘటన అతని కళ్ళముందు సజీవరూపాన్ని ధరించింది. ఆమెమాటలు అతనిచెవుల్లో మారు మ్రోగాయి. ఒకమాటు పెద్ద నిట్టూర్పువిడిచి అతను ఆలోచించడం మొదలు పెట్టాడు. ఉదయం ఆమె నీళ్ళకోసం బావిదగ్గరకు వచ్చినప్పుడే మళ్ళీ ఆమెను కలుసుకోగలుగుతాడు. ధనసింగ్ ఆలోచన ఊహాగానంనుంచి కొంచం తొలగి పోగానే ఆకలి బాగా ఎక్కువగా వున్నట్లు అనిపించింది. కాసిని బంగాళాదుంపలు నిప్పులో కాల్చుకుని ఎందుకు తినగూడదు! అని అనుకున్నాడు. సమయంగూడా గడుస్తుంది. సెగ కాచుకోవడానికి నిప్పు దొరుకుతుంది. ఆ ఆలోచనరాగానే అతను లారీనుంచి కిందకు దిగాడు. వెన్నెలలో పుల్లలకోసం ఇటూ-అటూ చూసి వెతి కాడు. వెన్నెల తెల్లదనంలో కళ్ళని మిరమిట్లుగొలిపే కాంతి వుంది కాని స్పష్టత లేదు. అతను రోడ్డుపక్కన రెమ్మలమీద, గడ్డిమీద తడిమిచూశాడు. అవి పచ్చిగా

మంచుతో తడిపినట్లుగా వున్నాయి. చీడ్ చెట్ల అడవిలో పుల్లలు దొరుకుతాయి కాని ఆ అడివి దూరం. అక్కడిదాకా వెడితే ఎవరైనా వెనుకనుంచి దంగాళాదుంపల సంచులు ఎత్తుకుపోతే....? మంట వేసుకునే ప్రయత్నం వదిలిపెట్టి అతను మళ్ళీ కంబళి కప్పుకుని లారీలోకివచ్చి కూర్చున్నాడు. కర్మావలన విషయం తెలుసుకుని ఒకవేళ వైజ్‌నాథ్ నుంచి ఏదైనా లారీ వెంటనే రావచ్చుని అతని మనసులో ఆశగా వుంది.

ధనసింగ్ ఆకలిని సంబాళించుకోలేక పోతున్నాడు. ఎప్పుడైతే సోమాను గురించి ఆలోచించడం మొదలుపెడుతాడో అప్పుడే ఆకలిగురించిన ఆలోచన పోతోంది. సోమా దిబ్బచాటుకి దిగివెళ్ళిన కాలిబాటవైపు అతనిచూపులు మాటిమాటికి తిరుగుతున్నాయి. అతను ఆలోచించసాగాడు - నిద్ర ఎలాగో రావడం లేదు. ఒకసారి ఆమె ఇంటివరకు వెళ్ళివస్తే ఎలా వుంటుంది? వెళ్ళి పరాయి ఊరి నుంచివచ్చిన డ్రైవరులా సహాయం అడగవచ్చు. ఏమీ దొరకకపోయినా పరవా లేదు. సోమాని చూసి రావచ్చు. వెంటనే అతనికి గుర్తొచ్చింది; ఒకవేళ వైజ్‌నాథ్ నుంచి తెల్లారేలోపునే లారీవస్తే సోమాని కలుసుకోవడం కష్టం. తను వస్తూ - వెడుతూ వుండేసమయంలో కలుసుకుంటూ వుండమని ఆమెతో చెప్పాలి. సోమాతో ఈమాట చెప్పడం చాలా అవసరంగా అనిపించింది. కానీ ఒక అనుమానం వచ్చింది. ఒకవేళ వైజ్‌నాథ్ నుంచి లారీ ఇప్పుడే వచ్చేస్తే! ఇటువంటి పరిస్థితులలో రోడ్డుకు పక్కనవున్న గ్రామంలోకి వెళ్ళి సహాయంకోసం కేక వేయడానికి డ్రైవర్లకు సంకోచం వుండదు కాని ఆ సమయంలో మరో ప్రయోజనం వుండటంచేత ధనసింగ్‌కు సంకోచించాల్సి వచ్చింది.

ధనసింగ్ ఆ సంకోచాన్ని వదిలి కాలిబాటవైపు వెళ్లాడు. కొంతదూరంవెళ్ళి సోమా కాలిబాటమీద ఏడుస్తూ అతన్ని కలిసినప్రాంతాన్ని చేరుకున్నాడు. ఇంకా కొంచం ముందుకు నడిచాడు. వెదురుగుబురులు కనిపించాయి. తర్వాత అడ్డంగా- వంకరగా మూడుచూరులు, మట్టితో కట్టిన గోడలు కనిపించాయి. వీటిలో ఆమెది ఏ ఇల్లో ధనసింగ్‌కు తెలియదు. మొదటిచూరే అని సోమా చెప్పినమాట చటుక్కున గుర్తుకొచ్చింది.

ఎక్కడా ఏ వెలుతురూ కనిపించడం లేదు. పిడకలు కాలుతుండటంవలన, చీడ్‌చెట్ల కఱ్ఱల పొగవలన వచ్చే వాసన గాలిలో నిండిపోయింది. మొక్కజొన్న రొట్టెలను బొగ్గులమీద కాలుస్తున్నటువంటి సువాసనగూడా వస్తోంది. అక్కడి వాళ్లు ఇంకా మేలుకువేవున్నారు. ధనసింగ్‌కు ఊరట కలిగింది.

మొదటిగుడిసెకు ముంగిలి వంకరటింకరగా రాళ్ళముక్కలతో కట్టబడి వుంది. నాలుగువైపులా ఒత్తుగా పెరిగిన కంచె వుంది. ఆ ఆవరణలో చిన్న చిన్న మొక్కలున్నాయి. ధనసింగ్ భయం భయంగా అడుగులు వేస్తున్నాడు. ఇటువంటి పరిస్థితిలో ఎవరైనా మనుషులుగాని, కుక్కలుగాని చూస్తే దొంగ అనుకునే ప్రమాదం వుంది. అతను దగ్గి చప్పుడు చేశాడు.

వాకిలి తలుపు గడియవేసి వుంది. ధనసింగ్ ఆ తలుపును తట్టి 'ఏమండీ, ఇంట్లోవాళ్ళు మేలుకునేవున్నారా!' అని పిలిచాడు.

'ఎవరు నాయనా' స్త్రీ కంఠం ప్రశ్నించింది.

'పరదేశిని. బాటసారిని. దోవలో లారీ చెడిపోయింది.'

'అయి వుండచ్చు నాయనా, ఇక్కడ ఏమీ సంతదుకాణాలు లేవు....' ఆ స్త్రీ సమాధానం చెప్తూవుండగా ఒక ముసలావిడగొంతు వినిపించింది, 'వెళ్లు నాయనా వెళ్ళు! ఇక్కడ సత్రపులు కొట్లు ఏమీ లేవు. ఇటువంటి బాటసారులని బాగా ఎరుగుదుము. దొంగతనం, దుర్మార్గం తప్ప రెండోపని లేదు. పొలంలో పంట, పళ్ళు, కూరలు వదిలిపెట్టరు, ఇంట్లో ఆడవాళ్ళని వదలిపెట్టరు....' ముసలావిడకి దగ్గు వచ్చింది.

ధనసింగ్ విరాశతో రెండు తలుపులకు మధ్యనున్న ఖాళీలోనుంచి లోపలి చీకటివైపు చూస్తున్నాడు. ఒక దర్వాజాలోంచి వెలుగు కనిపించింది. రెండవ క్షణంలో చేతిలో దీపం పట్టుకునివస్తూ సోమా కనిపించింది. ధనసింగ్ హృదయం ఎగిరి గంతేసింది. కాని వెనుకనుంచి వినిపించిన కేకవలన సోమా అడుగులు ఆగిపోయాయి. బాగా కోపంగా, బిగ్గరగా రెండవస్త్రీ తిట్టింది - 'వంటిల్లు వదిలిపెట్టి

నువ్వెక్కడి కెదుతున్నావే దెయ్యమా। పరాయి మొగాడివానన తగలగానే రొట్టె ముక్కమీదకి కుక్క దూకినట్టుగా దూకివచ్చావు.'

ఆ కేకవలన ఒక పిల్లాడు నిద్రలోనుంచి ఉలిక్కిపడి లేచి ఏడవడం మొదలు పెట్టాడు.

'ఎవరొచ్చారో చూస్తున్నాను' సోమా సమాధానం చెప్పింది.

'ఆ, నువ్వేగా ఇంట్లో అందరికన్నా పెద్దదానివి. సిగ్గులేనిదానివి. ఎక్కడి దానివో నువ్వు। అయ్యో. చూడవే. ఎంత కష్టపడో పిల్లాడిని నిద్రపుచ్చాను. గోలచేసి లేపావు. కష్టం తెచ్చిపెట్టావే నా ప్రాణానికి. నా పాలిట దుర్మార్గురాలు దాపురించింది. రెండో ప్రాణిని సుఖంగా వుండనివ్వదు. భగవంతుడే అర్థం చేసుకోవాలి ఈ రాక్షసిని.'

సోమా తిరిగి ధనసింగ్ వైపు చూసింది. వెంటనే మౌనంగా తిరిగి వెళ్ళిపోయింది. ముసలావిడ దగ్గుతూ ఏదో చెపుతూనేవుంది. కాని అదివిని అర్థం చేసుకోవాలని ధనసింగ్ ఆలోచించనే లేదు. అతను తన మూర్ఖత్వంగురించి బాధపడి వెనక్కు తిరిగాడు. అనవసరంగా అమాయకురాలికి తిట్లు తినిపించాను అని అనుకున్నాడు.

ధనసింగ్ కంబళీలో శరీరం దాచుకుని, మోకాళ్లు ముడుచుకుని లారీలో తన సీటుమీద పడుకున్నాడు. బయట వెన్నెలలో దట్టమైనపొగమంచు వ్యాపిస్తోంది. ప్రకాశవంతమైన వెన్నెల పాలవలె తెల్లగా పొగమంచువలన మసకగా కనపడుతోంది. అతను మళ్లీ అదేవిషయం ఆలోచించడం మొదలుపెట్టాడు. అక్కడికి వెళ్లి ఎందుకు తెలివితక్కువపని చేశాను... ఉదయం ఎలాగో సోమా నీళ్లు తీసుకు వెళ్ళడానికి వస్తుంది. రెండవవిషయం గుర్తుకొచ్చింది. ఒకవేళ కర్మా వైట్‌నాద్ ఎప్పుడో చేరివుంటాడు. భోజనంచేసి వాళ్ళు లారీ తీసుకుని బయలుదేరివుంటే, ఈపాటికి వస్తూనేవుంటారు. తొమ్మిదిమైళ్ళే గదా। ఒక గంటలోగా రావచ్చు. లేకపోతే ఉదయం రావచ్చు. ప్రయాణీకులువుంటే తప్పకుండా ఈ వేళప్పుడే వస్తారు.... మండీవైపు వెళ్ళేటప్పుడు సోమాను కలుసుకోవడానికి ఇక్కడ ఆపచ్చా? కాని

ఇక్కడేగదా వుంది; ఇంజనులో నీళ్లు పోస్తాను. కాని ఎంతసేపు అలా ఆపి వుంచ గలను? పటివిముషాల అపగలను. బయల్దేరినచోట - చేరేచోటగూడా గేటుదగ్గర పైము వేసుకుంటారు. ఈ అమాయకురాలు ఎంత మంచిది! నిర్దయులైన కసాయి వాళ్ల పంజాలో చిక్కుకుని కష్టపురోజులు గడుపుకోంది. ఆమెకు ఈ మనుషుల దగ్గర ఏముంది? నేను ఆమెకోసం ఏదైనా చేయడానికి సిద్ధంగా వున్నాను. నాకు మటుకు ఈ ప్రపంచంలో ఎవరున్నారు! ధనసింగ్‌కు బద్‌గర్ గ్రామంలోవున్న తన ఇల్లు గుర్తుకు వచ్చింది. ఆ ఇల్లు పాడుపడిపోయింది. పోలీసులు ఆ ఇంట్లో నుంచి తనవాళ్ళందర్నీ బయటకు గెంటేసి, ఇల్లు ఆక్రమించుకున్నారు. అదంతా అతనిమనసులో మెదిలింది. సోమా అత్తవారింటివాళ్ళలాగా తన పెదతల్లిగూడా అతన్ని ఆప్యాయంగా చూసేదికాదు. కాని మగవాళ్ళకేముంది? మగవాళ్ళకోసం విశాలమైన ప్రపంచం వుంది. స్త్రీమాత్రం స్వతంత్రించి ఏపనీ చేయలేదు. నిస్సహాయురాలు. స్త్రీ పురుషుని ఆధారంలేకుండా జీవించలేను. నేను మగాణ్ణి కావా, నేను ఆమెకు ఆధారంగా వుంటాను అనుకున్నాడు.

పొగమంచు బాగా దట్టంగా వ్యాపించింది. చలి బాగా ఎక్కువయింది. ధనసింగ్ శ్వాస మీటరు లోహపుమూతమీద పడింది. లోహపుమూత మసకమసకగా అయింది. బయటకుచూస్తే కళ్ళకుగూడా చలి తగులుతోంది. చల్లని గాలి వీల్చడం వలన హృదయంలోపల వణుకు పుడుతోంది. ధనసింగ్ ముఖంమీదకూడా కంబళి కప్పుకుని, కళ్లు మూసుకుని అనేవిషయంగురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. తను పురుషుడు అవటంవలన, స్త్రీకి ఆధారంగా వుండాలన్న విషయంమీద అతనికి తన పెళ్లివిషయం గుర్తుకొచ్చింది. పరిచితులైనవాళ్ళకి తను ఇంతవరకు బ్రహ్మచారిగానే వున్నాడనితెలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఆ జిల్లాలో గుణవంతుడైన ఒక వ్యక్తికి ఇంతవరకు పెళ్ళికాకుండావుండటం సాధారణమైన విషయం కాదు. ఒకవేళ మనిషిలో ఏదన్నా లోపం వుండటంవలనగాని, ఆ వ్యక్తి దురదృష్టంవలన గాని అలా జరుగుతూవుంటుంది. పెళ్ళికోసం ధనసింగ్‌కు ముఖ్యంగా వుత్సాహం లేదు, కాని అవివాహితుడుగా వుండటంవలన అప్పుడప్పుడూ మనసులో బాధ కలుగుతూవుండేది. అతను ధన్‌పత్‌రాయ్ భార్య మాటలను గుర్తుచేసుకుని మనసు నుంచి ఈ బాధను దూరంచేయడానికి ప్రయత్నం చేస్తుండేవాడు. ఏ పురుషుడైతే

ఇంట్లో భార్యని సరిగా పోషించలేడో, అతనిభార్య సజ్జనురాలుగా వుండలేదు.... డ్రైవరు పలీలు నిజం చెపుతుండేవాడు - బంగారము, భార్య, ఆస్తి అనేవి అధికారం వున్నవాళ్ళవే, ఇంకెవరివీ కావు. డ్రైవరుకు పెళ్ళిచేలన లాభమేముంది? డ్రైవరుకు ఒక ఇల్లు అనేదేముంది?

ధనసింగ్‌కు దృఢవిశ్వాసం వుంది. స్త్రీ పతివ్రత - సజ్జనురాలుగా వుండాలి. కాని స్త్రీలు పిల్లులలాగా దాక్కునివుంచి పాలు, మాంసము దొంగతనంగా తింటూ పైకి చూడటానికి అమాయకంగా, పిదాపంగా వుంటారు. ధనవంతులైన స్త్రీలు తమ ఆనందంకోసం, బీదవాళ్లు తమ ఆశలు తీర్చుకోవటంకోసం ఇలా తయారవుతారు. తోటి డ్రైవర్లవలన రోజూ అతను ఇటువంటి వృత్తాంతాలే వినేవాడు. కళ్లారా చూస్తూవుండేవాడుకూడా....మనసు కావాలనుకుంటే ఆడది దొరకదా? మళ్లీ ఆమెతో సంబంధం కలుపుకుని సంఘంలోవున్న గౌరవాన్ని ఎందుకు పోగొట్టుకోవాలి? తనని తాను అగౌరవపరచుకోవటంకన్నా ఇంకొకళ్ళని అగౌరవం చేయడం మంచిది! అన్నింటికన్నా పెద్దరహస్యం వుంది. పెళ్ళి చేసుకోవడానికి తన పుట్టుపూర్వోత్తరాలు, వంశవివరాలు, చెప్పాల్సిన అవసరం వుంది. అవన్నీ చెప్పి, తనని తను కించపరచుకుని, ఇతరులదృష్టిలో లోకువ కావడం అతనికి ఇష్టంలేదు. చాలా దూరంలోవున్న తన జన్మస్థానంతోబాటు అతను ఆ అవమానాన్నిగూడా వదిలి వచ్చేశాడు. దాన్ని మళ్లీ ఎందుకు భరించాలి?

కాని సోమాలో మోసంచేసేగుణం లేదు. అమె ఎంతమాత్రం కపటం లేనిది. అమాయకురాలు. ప్రపంచంలో ఆమెకు 'నా' అన్నవాళ్లు ఎవరూ లేరు. ఈ విషయంలో అతను లోకువ అవుతాడేమోనన్న భయంలేదు. వీలున్నంతవరకు ఆమెను ప్రేమించడంలో... కునికిపాట్లు రావడంతో ధనసింగ్ ఆలోచనలు కరిగిపోవడం మొదలుపెట్టాయి. నిద్ర అనే పొగమంచులో సోమా అందం తేలుతూ కనిపించింది. దుఃఖంతో కొంగుతో కళ్ళను అద్దుకుంటోంది. తనచేతితో సోమా కన్నీళ్లు తుడుస్తున్నాడు. ఆమె నవ్వసాగింది....ఏమండీ! మీరు చాలా మంచివారండి! 'ఏమండీ ...ఏమండీ... ఏమండోయ్, నిద్రపోయారా ఏమిటి? ఓ పరదేశీ!' మగతనిద్రలోవున్న ధనసింగ్ ఇది కలలోని కల్పితమా లేకపోతే నిజంగానే

పిలుపా! ఏదో నిశ్చయించుకోలేకపోతున్నాడు. మళ్లీ అతనికి వినిపించింది. "ఏమండీ! ఓ పరదేశీ! ఇటు చూడండి.'

ధనసింగ్ కంబళిలోనుంచి తల బయటకుపెట్టి లారీ కిటికీ అద్దంలోనుంచి చూశాడు. నిజంగానే సోమా నిలబడివుంది.

'ఏమండీ, నిద్రపోతున్నారా?' అని సోమా కొంగు అంచున కట్టబడి ఘుమ ఘుమలాడుతున్న ఒక పొట్లాన్ని ధనసింగ్‌వైపు చాపింది. 'ఏమండీ, మీరు అట్లా వచ్చారు, తిట్లు తిన్నారు. వీళ్లు రాక్షసులని నేను చెప్పేవెళ్ళాను గదా! తలుపు దగ్గరకువచ్చిన పరదేశిని, అతిథిని ఎవరైన ఆకలితో పంపిస్తారా? నేను రొట్టెలు తీసుకొచ్చాను. గేదెను పితికి లేవగానే దూడ తాడును గుంజనుంచి పూడతీసి వదిలాను. ఎందుకంటే దాన్ని వెతకడానికి ఎలాగో నన్ను పంపిస్తారు' అన్నదామె.

ధనసింగ్ సోమావైపు చూస్తూవుండిపోయాడు. చేతిని ముందుకు జాపి ఆమె భుజంమీదవేశాడు. సోమా ఈ స్పర్శవలన, చలికి కొంకరలుపోయే వీపుమీద పీటిధారలు పడినట్లుగా ముడుచుకుపోయింది. ఆమె బట్టలు మంచువలన తడిసిపోవటం ధనసింగ్ చూశాడు. లారీ తలుపు తెరచి నెమ్మదిగా 'మంచులో నుంచున్నావు, లోపలికిరా' అన్నాడు.

'ఇక వెడతాను. అయ్యో! వచ్చాను. ఆ దూడనిగూడా వెతికిచూడాలి' సోమా ముడుచుకుని సమాధానం చెప్పింది.

'వద్దు, ఒక నిముషం కూర్చుందువు రా' ధనసింగ్ కోపంతో అన్నాడు.

'కాదు, ఇక వెళ్ళనీయండి' సోమా అడుగులు లారీవైపు ముందుకు వెళ్ళాయి. వెనక్కి తగ్గడానికి సంకోచిస్తూ తొట్రుపాటు పడ్డాయి.

'నామీద ఒట్టు' ధనసింగ్ పట్టుపట్టాడు.

సోమా హృదయం కరిగిపోయింది. 'అయ్యో, ఒట్టుఎందుకు పెడుతున్నారండీ! భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూడాలి. మీరు చాలా మంచివారండి.' ధనసింగ్‌ను ఒట్టునుంచి కాపాడటానికి ఆశీర్వదించడం కోసం సోమా చెయ్యి ధనసింగ్ తలవైపు జరిగింది.

ధనసింగ్ సోమాని లారీలో తనపక్కన కూర్చోబెట్టుకున్నాడు. ఆమెకు సగం కంబళి కప్పటం మొదలు పెట్టాడు. సోమా గాబరాపడింది. ఆమె ఒదిగి కూర్చుంటూ వారించింది 'వద్దు, నాకు చలివేయటం లేదు....మీరే కంబళిఅంతా కప్పుకోండి' అంది.

ధనసింగ్ ఒప్పుకోలేదు. తనచేతిని సోమా వీపుమీద వేశాడు. సోమా మంచుతో తడిసిన బట్టలలో ముడుచుకు పోతోంది. కాని ఆమెకు ధనసింగ్‌కు దగ్గరగా వుండటం అంతకన్నా ఎక్కువ గగుర్పాటు కలిగించింది.

'వద్దండి, ఇలావద్దు' అని ఆమె అన్నది కాని ప్రయత్నం చేసినాకూడా ధనసింగ్‌నుంచి దూరంగా జరగలేకపోయింది.

'సోమా! ఒకమాట చెపుతాను వింటావా?' ధనసింగ్ ఆమెను రహస్యంగా అడిగాడు.

'ఏమిటండీ?'

'నేను చెప్పినట్లు చేస్తావా?'

'మీరు చాలా మంచివారండి. చెప్పండి.'

'నాతో వచ్చేస్తావా?'

'సోమా మొదట్లో మౌనంగావుండిపోయింది. ధనసింగ్ అదేప్రశ్న మళ్ళీ అడగగానే ఏడవడం మొదలు పెట్టింది. ధనసింగ్ హృదయం మొద్దుబారి పోయింది. అతను సోమా దగ్గరకు వంగి బాధగా అడిగాడు 'కోపం వచ్చిందా? ఎందుకు?'

సోమా చీరకొంగుతో కళ్ళు తుడుచుకుంటూ బొంగురుపోయిన గొంతుతో 'ఏమండీ, మీరు చాలామంచివారండి. నా ప్రాణాలు రక్షించారు. నేను ఎక్కడకు వెళ్ళగలను? ఇక్కడే చచ్చిపోతాను. భగవంతుడు నన్ను తొందరగా తీసుకుపోతే బాగుంటుంది.' అన్నది.

సోమా ఏడుపు ఆపుకుని వెక్కటం మొదలుపెట్టింది. ధనసింగ్ తన తల పాగా అంచుతో ఆమెకన్నీళ్లు తుడిచాడు. సోమా కన్నీళ్లు ఆగటంలేదు. ఆమె

ధనసింగ్ దగ్గరనుంచి పక్కకు జరిగి కూర్చోవాలన్నమాట మరచిపోయింది. అత్తవారింటి కాఠిన్యం, నిర్దయత, శరణు ఆమెను ధనసింగ్ పీడలోకి తోస్తున్నాయి.

'ఏడవకు సోమా, నామీద ఒట్టు! నీ విరోధులు ఏడవాలి....ఏడ్చేటట్లయితే నన్ను తిన్నట్టే' అని ధనసింగ్ ఆమె తలను తన విశాలమైన వక్షస్థలంవైపు లాక్కున్నాడు. ఒట్టు పెట్టాడని భయంవలన గొంతులో పొంగి పైకివచ్చే ఏడుపును, కన్నీళ్ళని, సోమా లోలోపల అణచుకుంది. ఆమె శరీరం శిథిలమైపోయి ధనసింగ్ చేతుల్లోకి వచ్చేసింది. ధనసింగ్ గట్టిగా ఊపిరిపీల్చి సోమాని తనరక్షణ అనే కౌగిల్లో బంధించాడు. అది తెలుసుకున్న తర్వాత సోమా కౌగిలినుంచి విడివడటానికి అటూ ఇటూ కదిలింది. 'వద్దండి, ఇలా వద్దండీ' అంది కాని అడ్డుచెప్పి వారించలేకపోయింది. కొంచంసేపు వాళ్ళిద్దరూ అలానే కూర్చుండిపోయారు.

కొంతసేపటి తర్వాత సోమా ధనసింగ్ చేతుల్లోనుంచి విడిపించుకుంటూ 'ఏమండీ, ఇక వెడతాను' అని చెప్పి లేచి నిలబడింది. ధనసింగ్ ఆమెకు చేయూత నిచ్చి లారీనుంచి దింపాడు. కాలిబాటవరకూ ఆమెతో కలిసి నడిచాడు. సోమా దిబ్బపైకి ఎక్కగానే ధనసింగ్ కీచించిన స్వరంతో 'అయితే ఉదయం నీళ్ల తీసుకు వెళ్ళడానికి బావిదగ్గరకు వస్తావుకదూ!' అని అడిగాడు.

సోమా తలతిప్పి హామీ ఇచ్చింది.

ధనసింగ్ మళ్ళీ కంబళిచుట్టుకుని లారీలో కూర్చుండిపోయాడు. కాస్సేపటికి గుర్తుకు రాగా అతను నెమ్మది - నెమ్మదిగా మొక్కజొన్న రొట్టెలు, బెల్లం తీసుకున్నాడు. మళ్లీ పొగమంచుతోనూ, చలిగాలితోనూ కలసిన వెన్నెలలో పెద్ద-పెద్ద కళంకాలవలె కనిపించే చెట్లవైపు, పర్వతాలవైపు దృష్టిసారించి ఆలోచించ సాగాడు. వైజ్‌నాథ్‌నుంచి సహాయంకోసం లారీవస్తుందా రాదా అన్న విషయం గురించి అతనికి బాధలేదు. లారీ ఇప్పుడు రాకపోవటమే మంచిదని అనిపిస్తోంది. కునికిపాట్లు రావడంలేదు. మాటిమాటికి గడచిపోయిన ఆనాటి సాయంకాలపు సంఘటన మనసులో మెదులుతోంది. సోమాకు సహాయంచేయడంవలన, ఆమెను ప్రేమించడంవలననే తన జీవితాని కంతటికీ సార్థకత లభిస్తుందని అనిపిస్తోంది.

సోమా తనకోసమే పుట్టింది. తనకోసమే ఎదురుచూస్తోంది. భగవంతుని కోరిక మనకు తెలియని దారులంట సఫలమవుతుంది.

ధనసింగ్ ఆలోచించసాగాడు. సోమా తనకోసమే పుట్టింది....ప్రపంచంలో ఎవరైతే తనకోసం పుట్టివుంటారో, పురుషుడు ఆస్త్రీనే ప్రేమిస్తాడు. ఆస్త్రీకోసమే తన జీవితాన్ని అర్పించాలని వాంఛిస్తాడు. ఎవరైతే దానిని గుర్తిస్తారో, ఇదే పురుషుని దృష్టిలో స్త్రీ ప్రేమ. గడచిపోయిన స్మృతులలో ధన్‌పత్‌రాయ్ భార్య. హోషియార్‌పుర్‌లో ఉస్తాద్ మజహర్ స్నేహితురాలైన వేశ్య. గులాబో. అతని మనసులో ఎంత అసహ్యం కలిగించారో, దానికి ప్రతీకారంగా కపటంలేని, అమాయకత్వంతో నిండిన సోమాను తన జీవితపు సర్వస్వంగా అనుకుంటున్నాడు.

వెన్నెలలో పొగమంచు, గాలి బాగా దట్టంగా వ్యాపించాయి. పొగమంచు ప్రకాశం మాసిపోయి అందులో తెల్లదనం వచ్చింది. ధనసింగ్ కళ్ళు తెరిచే వున్నాయి. కాని అతను ఆ మార్పుని గురించి పట్టించుకోలేదు. దూరాన మోటారు గుర్రుమనే శబ్దంవిని అటుకేసి చూశాడు. వెనుక మార్గంమీద, దూరంగావున్న కొండలమీద బంగళాల వెనుక దాగుతూ, మళ్ళీ కనిపిస్తూవుండే నిప్పుగోళాల మాదిరిగావున్న దీపాలు కనిపించాయి. ఇది మండీ నుంచి ఉదయం నాలుగు గంటలకు వెళ్ళేబండి. ధనసింగ్ ఆలోచించాడు, కంపెనీ వైజ్‌నాథ్‌నుంచి మండీ ఫోను చేసివుంటే, ఇదేబండి తన లారీని వెనుక తగిలించుకుని తీసుకు వెడుతుంది. కాని సోమా ఇంకారాలేదు.

వెనుకనుంచివచ్చే మోటరు కాంతి ధనసింగ్ లారీమీద వచ్చిపడింది. మోటారు దగ్గరకు వచ్చి ఆగింది. వైజ్‌నాథ్‌నుంచి ఫోను అయితే వచ్చింది కాని ఇంకా చీకటిగావుంది. ఇదేమో ప్రయాణీకుల బండి, బరువు ఎక్కువ అవుతుంది. గంట తర్వాత సామానులు తీసుకువెళ్ళేలారీ వచ్చి దానిని లాక్కెళుతుంది, అని డ్రైవరు చెప్పాడు. ధనసింగ్‌కు సంతోషం కలిగింది. అంతలోపల సోమా వస్తుందా, రాదా! అని ఆలోచించసాగాడు. పొంమంచులోనుంచి వెన్నెల పచ్చదనం వేరయి తెల్లదనం వచ్చేసింది. మంచుబిందువులు రాలుతున్నాయి. ధనసింగ్ దృష్టి రాతి దిబ్బవైపు కాలిబాట మీదనేవుంది. ఒకవేళ సోమా ఆలస్యంగా

రావచ్చునని అతనికి మనసులో అనుమానంగా వుంది. అతనికి తొందరగా తెల్ల వారుతున్నట్లుగా అనిపిస్తోంది.

చలి వలచబడుతోంది. సోమా తలక్రిందులుగా వున్నకుండ నెత్తిన పెట్టు కుని కాలిబాట మీదనుంచి దిగుతూ కనిపించింది. ధనసింగ్ లారీనుంచి ఒక్కు మ్మడిన దూకాడు. సోమా దగ్గరకు వెళ్ళి 'వచ్చావా!' అని ఆమె కళ్ళల్లోకిచూశాడు. ఇప్పుడు సోమా కళ్ళు నీళ్ల కలిసిన పచ్చిపాలవంటి పింగూలా కాకుండా గులా బీలావుంది కొంచం ఉబ్బివున్నాయి. రాత్రంతా నిద్రలేమి, ఏడుపు వాటిలో ప్రస్ఫుట మవుతున్నాయి. ఆమె ధనసింగ్‌వైపు చూసి మౌనంగా వుండిపోయింది. పెద్ద పెద్ద జరీపూసలవంటి రెండు కన్నీటిబొట్లు ఆమె కనుకొలకుల్లో నిలిచాయి. ఆమె ఆగలేదు. రోడ్డుదాటి బావివైపు నడుస్తూ వెళ్ళిపోయింది. ధనసింగ్ ఆమెని ఆపి 'నాతోవస్తావా!' అని అడిగాడు.

సోమా కళ్ళనుంచి కన్నీళ్ళు ప్రవహించాయి. 'నాకు ఇక్కడే చావాల్సి వుంది. నేను మీకోసం చూస్తూవుంటాను. మీరు అప్పుడప్పుడు వస్తూ వుండండి. మీరు చాలా మంచివారండి.' అంది.

ధనసింగ్ ఇంకేమీ చెప్పలేకపోయాడు. సోమా కొంగుతో కన్నీళ్లు తుడుచు కుంటూ బావివైపు వెళ్ళిపోయింది. ధనసింగ్ అటువైపు అడుగులు వేశాడు. అంతలో మళ్లీ దూరంగా మోటారు వెలుతురు కనిపించింది. ఒకదాని వెనుక ఒకటిగా మూడు మోటార్లు వస్తున్నాయి. ధనసింగ్ లారీ దగ్గరే ఆగిపోయాడు.

ఒక ఖాళీమోటరు ధనసింగ్ లారీ దగ్గరకు వచ్చి ఆగింది. సర్దార్ బైసా ఖాసింగ్ ఆ మోటారుకు డ్రైవరు. అతను వచ్చి 'ఏమయింది? ఎలాజరిగింది?' అని అడిగి ధనసింగ్ లారీని తడుతూ తన బండిలోనుంచి ఇనుపగొలుసులు తీసాడు. తరువాత ధనసింగ్ లారీని తన బండివెనుక కట్టాడు. ధనసింగ్‌ని మెళు కువగా వుండమని చెప్పి దానిని లాగుతూ తీసుకు వెళ్ళాడు.

ధనసింగ్ మాటిమాటికి నూతివైపు చూస్తున్నాడు. తూర్పువైపున ఉదయించే సూర్యుని మొదటి కిరణాలు కొండకనుమలో వ్యాపించిన మంచుతెరను భేదిస్తు న్నాయి. అతనికి తలమీద కుండపెట్టుకుని, కాలిబాటమీదకు తిరిగి వెడుతున్న సోమా నీడకూడా కనిపించింది. కాని బైసాఖాసింగ్ లారీ అతని లారీని లాగుతూ తీసుకు వెడుతోంది.

# అత్తవారి ఆదరం

ఇంతవరకు సోమా జీవితం ఎలాగడుస్తూ వచ్చిందో, ఇప్పుడు అలానే గడుస్తోంది కాని ఆమె ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఇప్పుడామె ఎదురు వచ్చిన దానిని ఆలోచించకుండా పశువులా సహిస్తూ పోవటంలేదు. తన దుఃఖాన్ని గురించి, బాధల్ని గురించి ఆలోచించే వాళ్లెవరున్నారు అనే భావన ఆమె దుఃఖాన్ని రెట్టింపు చేయడం మొదలు పెట్టింది. తనని ఆదుకునేవాళ్ళు వున్నప్పుడు ముందునుంచి వచ్చే దెబ్బలను ఎదుర్కొనే ధైర్యాన్ని ఎలాగైతే పొందుతారో, అలా ఆమెకు కూడా ధైర్యం వచ్చింది. అందుచేత బాధల్ని ఇక సహించవల్సొచ్చేదు.

ధనసింగ్ సోమాని తనతో వచ్చేయమని బలవంతం చేశాడు. సోమా అందుకు అంగీకరించలేదు. అలాచేయటం మంచిదికాదని ఆమె నిరాకరించింది. కాని ధనసింగ్ మాట ఆమెకు పెద్ద ఆధారం అయింది. ఈ మాట ఆమె బాధల్లో సహాయంగా వుంటుందని ఆమె అనుకుంది.

సోమా ఇల్లు దారిపక్కనే దగ్గరలోవుంది. ఆమెకు ఎప్పుడైనా బస్సుల శబ్దం వినపడినప్పుడు, రోడ్డుమీదకు వచ్చి ధనసింగ్‌ను గుర్తించడానికి ప్రయత్నించేది. కాని ఆ 'మంచిమనిషి' కనిపించేవాడుకాదు. దుర్మార్గులైన డ్రైవర్లు కనిపించేవాళ్లు. దాదాపు డ్రైవర్లంతా దుర్మార్గులుగానే వుండేవారు. ఆమె తొందరపాటు చూపి కళ్ళతోనో, పెదవులతోనో, అసభ్యతను సూచించే సైగలు చేసేవారు. ఈలవేసేవారు. సోమాకు ఎప్పుడైనా క్షణం కూర్చునే తీరుబడి దొరికితే - 'నేను అంగీకరించక పోవడంవలన అతను చెడుగా తలచాడేమో, మళ్లీ రానేలేదు' అని ఆలోచించడం మొదలు పెట్టేది.

అత్తగారు సోమాను ఒక బుట్టెడు మొక్కజొన్నలు చెరిగి పిండిమిల్లుకు వెళ్లి పిండిపట్టించి తీసుకురమ్మని చెప్పింది. పర్వతప్రాంతాల్లో వర్షం ఎక్కువగా కురుస్తూ వుండటంచేత ఇంటిచూరులు ఏటవాలుగా వుంటాయి. ఏటవాలుగావున్న చూరుక్రింద తరచుగా ఒకవైపున ఎత్తైన దుంగలువేసి వాటిమీద చీడ్‌చెక్కతో చేసిన వెడల్పాటి బల్లనువేస్తారు. ఈ ఎత్తుబల్లమీద ఇంట్లోని ధాన్యం, ఇతర

సామానులు, వుంచుతారు. సోమా ఆ బల్లమీదే కూర్చుని చేటతో జొన్నలు చెరుగు తోంది. అత్తగారు తన ముసలి శరీరానికి కొంచం విశ్రాంతి ఇవ్వడంకోసరం క్రింద చాపపరుచుకుని పడుకుంది. చాటలో జొన్నగింజల ఖటఖటమనే శబ్దం. చేటతో చెరగడంవలన వచ్చే విసురు నియమబద్ధంగా శబ్దంచేస్తున్నాయి. ఈ సంగీతంవలన సోమా అత్తగారికి నిద్రవచ్చింది. మామగారు ఏదో పనిమీద బయటకు వెళ్ళారు. అత్తగారికి నిద్రపట్టడం చూసి పెద్దకోడలు. రెండవకోడలు కాస్సేపు పక్కఇంట్లో కూర్చునివద్దామని వెళ్ళిపోయారు. పెద్దకోడలు వెళుతూ వెళుతూ, జొన్నలు చెరిగిన తర్వాత నాలుగుకుట్లు కుట్టమని తన బొంత, సూది - దారం సోమా ఎదుటపెట్టి వెళ్ళింది.

సోమా ఆలోచించింది, పింతిమరనుంచి తిరిగి వచ్చేసరికి ఆలస్యమవు తుంది. 'పెద్దది' కోప్పడుతుంది. ఈ ఆలోచన రావడంవలన ఆమె జొన్నలు చెరిగి బొంతని కుట్టడం మొదలుపెట్టింది. ఈ నెపంమీద కొంచంసేపు కూర్చో వచ్చుగూడా. తరువాత పాతికశేర్ల జొన్నలతో నింపిన బుట్ట నెత్తిన పెట్టుకుని కోనలో ఒకటింబావు మైలు ఎగుడు - దిగుడుదుమీద వెళ్ళిరావాలి. ఇలా ఏకాంతంగా కూర్చోవడం సంభవిస్తే ఆమెకు చాలా సంతోషం కలుగుతుంది. కూర్చుని ఆమె పరదేశిడ్రైవరుగురించి ఆలోచిస్తూవుండేది. అలా ఎనిమిదిరోజులు గడచిపోయాయి కాని అతను మళ్ళీరాలేదు.

సోమా మామగారిదగ్గు వినపడటంవలన ముసలాయన వచ్చాడని అర్థం చేసుకుంది. ముసలావిడ పడుకునివుండగా చూసి, ఆయన ఇంట్లో ఎవ్వరూలేరని అనుకుని గొణగడం మొదలుపెట్టాడు—'అందరికీ చావువచ్చినట్లుగావుంది. కుక్కలుగాని పిల్లులుగాని దూరకుండా వుండటానికి తలుపు గడివేయాలన్న జ్ఞానం-ఇంతమాత్రంగూడా లేదు. సోమాకి చెక్కముక్కలమోత వినిపించింది. ముసలాయన పొయ్యిలోనుంచి పిడకలనిప్పు తీసుకుని చిలుముగొట్టం నింపుకున్నాడు. హుక్కా తీసుకువెళ్ళి వాకిట్లో ఇంటిగోడవారగా తయారుచేసిన మట్టిఅరుగుమీద కూర్చుని పొగపీల్చడం మొదలుపెట్టాడు.

'కేహర్‌మియాఁ నమస్కారం' సోమా వాకిట్లోని కేకవిన్నది.

సోమా మామగారు సమాధానం ఇచ్చారు—'నమస్కారం షాహుకారు

గారూ! రండి కూర్చోండి....ఏయ్ ఎవరన్నావున్నారా లేకపోతే అందరూ చచ్చారా! మనషాహుకారుగారికి కూర్చోవడానికి మోడా ఇవ్వు!'

మన్నూసాహ్ వయసులో సోమా మామగారికన్నా రెండు మూడు సంవత్సరాలు చిన్నవాదే అయుంటాడు. కోడళ్ళు ఆయన వచ్చినప్పుడు ముసుగు వేసుకుంటారు. మామగారు కేకవేయడంవలన సోమా తలమీద కొంగులాక్కుని లేవబోయింది. అంతలో క్రిందనుంచి అత్తగారి మాటలు వినిపించాయి. అత్తగారు మన్నూసాహ్ పేరువిని వి(దలేచింది. అతిధిని లోపలికే పిలిచింది.

షాహుకారుగారు ముసలావిడ పిలుపువిని లోపలకు వచ్చారు. 'మియాజీ నమస్కారం' అని ఆయన కుశలప్రశ్నలు అడగటం మొదలుపెట్టారు. మామ గారుకూడా హుక్కాతీసుకుని లోపలికి వచ్చేశారు. కేహర్ షాహుకారుగారి జాతిని దృష్టిలో పెట్టుకుని హుక్కానుంచి వానపు గొట్టాన్ని తీసేశాడు. హుక్కాని షాహుకారుగారివైపు తోశాడు 'తీసుకోండి షాహుకారుగారూ, తాగండి, చాలా బాగావస్తోంది. సొంతపొలం పొగాకు.' అన్నాడు కేహర్.

మన్నూ షాహుకారు అనేకచోట్లనుంచి నెయ్యి - ధాన్యం సమకూర్చుకుని వ్యాపారం చేస్తూవుండేవాడు. డబ్బు ఇచ్చి - పుచ్చుకోవడంకూడా చేస్తుండేవాడు. కేహర్‌సింగ్ ఇంట్లోనుంచిగూడా నెయ్యి తీసుకు వెళ్ళేవాడు. కేహర్ అతనివద్ద మంచి మూడువందల రూపాయలు వడ్డీమీద అప్పు తీసుకున్నాడు. మన్నూ అప్పు డప్పుడూ వచ్చి వడ్డీకి బదులుగా నెయ్యితీసుకువెడుతూ వుండేవాడు. పెద్దకోడలూ, రెండవకోడలూ మన్నూ అంటే మండిపడేవాళ్ళు. వెనుకనుంచి ఆయన్ని తిడుతూ వుండేవాళ్ళకూడా. షాహుకారు కారణంగా వాళ్ళు పాలు నామమాత్రంగానే తాగుతూవుండేవాళ్ళు. పాలు అన్నీ తోడుబెట్టి నెయ్యితయారు చేయడానికి దాచటం జరిగేది. ఇంట్లోవాళ్ళకి త్రాగటానికి కేవలం మజ్జిగే మిగిలేవి. మన్నూ నెయ్యి తీసుకువెళ్ళేటప్పుడు కేహర్‌కు ఉపకారం చేయడంకోసమేగాని, తన స్వలాభంకోసం ఎంతమాత్రం కాదన్నట్లుగా తియ్యటి కబుర్లు చేప్పివెళ్ళేవాడు.

ముసలావిడ మోడా వెతుకుతూవుండగా చూసి మన్నూ ఆ అడంబరం కోపం ఆమె పెద్ద అపద నెత్తిన తెచ్చిపెట్టుకున్నట్టుగా పైకి అన్నాడు. నిరాడం

బరంగా ఇంట్లో అలికిన నేలమీద కూర్చుంటూ—'అరే, నువ్వు ఎందుకు తంటాలు పడుతున్నావు ఇంటి యజమానురాలా! కోడళ్లు ఎక్కడవున్నారు? పిల్లలంతా కులాసాగా వున్నారుగా! ఉన్నది ఎక్కడవుంది?' అనడిగాడు.

'ఎక్కడికో వచ్చాయి ఆ దెయ్యాలు' ముసలావిడ రెండుచేతులూ తిప్పుతూ సమాధానం చెప్పింది. 'నాకు క్షణంగూడా విశ్రాంతి దొరకదు. చిన్నదానికేమో పిడికెడు జొన్నలు పిండి పట్టించుకురమ్మని చెప్పాను. ఆ బుట్టలోచూడు సాయంకాలానికి చిటికెడు పిండిగూడాలేదు. కొంచం నిద్రపట్టింది. అంతే ఇద్దరూ పక్కింటికి వెళ్ళిపోయారు. మళ్ళీ దీపాలువెలిగిస్తేగాని తిరిగిరారు.'

'షాహుకారు అన్నా. ఏం చేస్తాం చూస్తున్నావుగదా ఎటువంటికాలం వచ్చిందో!' కేహర్ షాహుకారు రావడంలోని ఉద్దేశం వూహించి క్షమార్పణలా అడిగాడు 'ఈ సారికిమాత్రం వడ్డీకోసరం ఆగాల్సి వస్తుంది.'

'చూస్తున్నావా వదినా, అయ్యగారి మాటలు! వడ్డీమాట ఇప్పుడు ఏ దుర్మార్గుడు తెచ్చాడు!' మన్నూ హుంకార్ని కేహర్కు తిరిగి ఇస్తూ ముసలావిడతో అన్నాడు. 'మిమ్మల్నికలిసి చాలారోజులయింది కదా అని నేను ఇలావచ్చాను. పిల్లలు కులాసా అని అడిగి వెడదామని వచ్చాను. నా పిల్లలలాంటి వాళ్ళేగదా! మీకూ తెలుసు. ఏం వదినా?'

'షాహుకారుగారూ అంతా మీ దయ,' ముసలావిడ సమాధానం చెప్పింది. 'ఈ రైతుమెడ ఎప్పుడూకూడా షాహుకారుగారిచేతుల్లోనే వుంది. మాకుమాత్రం షాహుకారుగారూ! మీరే పరమేశ్వరు డంతటివారు.'

'కొంచంగూడా మిగల్లేదా?' మన్నూ అడిగాడు. 'లగ్గాల రోజులుగదా. అణా రెండణాలు ప్రియంగానే వెడుతున్నాయి. నేనుమాత్రం అయ్యగారి దగ్గర మంచి ఎప్పుడూ ప్రియంలోనే తీసుకుంటాను. ఎందుకంటే మీకు రెండుపైసలు మిగులుతాయికదా అని. మీకు తెలుసుకదమ్మా. మోకాళ్లుమాత్రం పొట్టవైపే వంగుతాయి. ఏం!'

'ఎక్కడ మిగులుతుంది షాహుకారుగారూ!' ముసలావిడ విధికి లోబడి చేతులు చాపి చెప్పింది. 'భగవంతుడు మీకు మేలుచేస్తాడు. పిల్లలుగలవాళ్ళ ఇల్లు.

ఎప్పుడైనా రెండు-రెండున్నర పేర్లు అయితే అవుతుంది. లేకపోతే లేదు. ఎక్కువ పాలిచ్చే గేదేమో ఎండిపోతోంది. ఏమీ రావడంలేదు.'

మన్నూ హుక్కానుంచి దమ్ములాగి హుక్కాని కేహర్‌కు తిరిగి ఇస్తూ అన్నాడు-'అసలైన మంచిపొగాకు. చాలు నువ్వు తాగు. అది సరే, మురళీమాట విన్నావా!' అని రహస్యం చెపుతున్నట్లుగా అన్నాడు.

'ఆ, పిల్ల పెళ్ళి చేస్తున్నారుటగదా! పిల్లాడు బాగా వయసు వెండినవాడని, మూడవ పెళ్ళివాడని విన్నాను' అని కేహర్ పొగవలన దగ్గి హుక్కాని షాహుకారువైపు జరిపాడు.

'అయ్యో, పిల్లగూడా ఈడొచ్చినదే! ఆమె ఈడువాళ్ళకి ఇద్దరు-ముగ్గురు పిల్లలు పుట్టారు.' ముసలావిడ పెదవులమీద వేలేసుకుని చెప్పింది.

మన్నూ హుక్కాని మోకాళ్ళమీద పెట్టుకున్నాడు. రహస్యం చెప్పడం కోసరం కేహర్‌వైపు జరిగాడు. తేలికగావుండేలా ఒక్క పీల్పు పీల్చి ముసలావిడతో అన్నాడు-'కాకపోతే ఏమిటి? మురళి లెక్కపెట్టి ఆరువందలు తీసుకున్నాడన్న విషయం నీకు తెలుసా! పిల్ల ఎలాగో పరాయిఇంటి సొత్తే. నాకేమో మూడు వందలు ఇవ్వాలి. కాని చాలా మంచివాడు. 'తీసుకోండి షాహుకారుగారూ, మీకు ఇవ్వాల్సిందంతా ఈ జన్మలోనే తీసుకోండి. వచ్చేజన్మలో ఒకటికి రెండు ఇవ్వాల్సి వస్తుంది.' అని తానే స్వయంగావచ్చి చెప్పాడు. నీకు తెలుసుకదమ్మా, నేను నాలుగురూపాయలు ఇచ్చి పుచ్చుకోవడం ఇటువంటి మంచి మనుషులతోనే చేస్తుంటాను.'

ముసలావిడ నడుం విరుచుకుని చెప్పింది-'మీకు మేలు జరుగుతుంది - షాహుకారుగారూ, మేముగూడా ఈ ఛండాలురాలికోసం లెక్కపెట్టి నాలుగువందలు ఇచ్చాము. మూడువందలు మీ దగ్గరనుంచే తీసుకున్నాం గదా! పొట్ట ఎలాగో గడుపుకుంటూ ఇప్పటివరకూ వడ్డీని భరిస్తూనే వున్నాం. నా పులిలాంటి కొడుకుని అది పొట్టన బెట్టుకుంది.' ఆ బాధ గుర్తుకురాగానే ముసలావిడ ఎండిపోయిన తన కళ్ళను కొంగుతో తుడుచుకుంది. ముసలావిడ, వయసులో చనిపోయిన తన కొడుకుకోసం ఎంతో దుఃఖించివుంది. మళ్ళీ ఆ ప్రసంగంరాగానే కళ్ళలోకి నీళ్ళు వచ్చేస్తాయని అనుకుంది. 'పుదితేమాత్రం ఏమిటి పిల్ల. అదికూడా ఆరునెల్లోనే

చచ్చిపోయింది. మాకు కష్టాన్ని తెచ్చిపెట్టింది. మా అదృష్టమే బాగాలేదు షాహుకారుగారూ!'

సోమా పైన బల్లమీద కూర్చుని, ఊపిరి బిగబట్టి వింటోంది. షాహుకారు హుక్కాకి పెదవులు ఆనించి విచారంగా అన్నారు-'ఆడపిల్ల పరాయి ఇంటి తాకట్టే. ఇవ్వడం-పుచ్చుకోవడం ప్రపంచానిదే. కాని అన్నయ్యా విధవ అయిన కోడలు మాత్రం జీవితానికి చిక్కే.' మన్నూ గొంతు తగ్గించి కేహర్ వైపు వంగి చెప్పారు' దగ్గర పక్కగ్రామంలో రకరకాలమనుషు లున్నారు. అందరూ కొద్దో-గొప్పో వున్నవాళ్ళే. ఎక్కడైనా వయసులోవున్న వితంతువుకి కాస్త ఏమైనా అయితే మర్యాద కాస్తా పోతుంది, జీవితం నాశనమౌతుంది. కాకపోతే నువ్వు మెడలో తిరగలిరాయిని కట్టుకున్నావు. నువ్వు చెప్పవమ్మా. తప్పు ఏమైనా చెప్పానా ఈ మన్నూ?'

'మీరు తప్పు చెప్పిందేముంది షాహుకారుగారూ? ప్రపంచంలో జరగటం లేదా ఏమిటి!' ముసలావిడ అంగీకరించింది-'ఓజంగా అడిగితే నా హృదయం అల్లల్లాడుతూ వుంటుంది. అదిమాత్రం బలవడానికి బాగా బలిసివుంది. ఇక్కడ మా పొట్టలే నిండటంలేదు. షట్టింటికివెళ్లి చావమని నేనంటున్నా!'

'అయితే ఒకమాట చెప్పనా?' మన్నూ చాలా నెమ్మదిగా అన్నాడు. పైన కూర్చున్న సోమాహృదయం ధక్-ధక్ మంటోంది. వినడంకోసరం ఊపిరి బిగబట్టి ఆమె చెవిని బల్లదగ్గరగా వుంచింది. షాహుకారు చెప్పాడు. 'మెడకు చుట్టుకున్నబరువు వదిలిపోతుంది, కొంత అప్పుగూడా తీరిపోతుంది.'

'ఆ! కేహర్ హుక్కాని పెదవులమధ్యనుంచి తీసి మన్నూవైపు చూశాడు. ముసలావిడకూడా రెండుచేతులతోనూ నడుము నొక్కుకుంటూ మన్నూవైపు చూడటం మొదలుపెట్టింది. మన్నూ తెలియజెప్పాడు-'మండీలో ఒక పంజాబీ మనిషి వున్నాడు. రెండున్నర-మూడువందలు మామూలుమాట.'

మౌనాన్ని ముసలావిడ భంగంచేసింది-'అయ్యో, భలేవారు షాహుకారు గారూ, మేము పూర్తిగా నాలుగువందలు ఖర్చుపెట్టాము.' అని ఆమె నోటిమీద చెయ్యివేసుకుని పెద్ద నిట్టూర్పు విడిచింది.

'అయితే విను అన్నయ్యా ఆవిడ మాటలు!' మన్నూ ముసలావిడ

అమాయకత్వంచూసి నవ్వి అన్నాడు. 'ఎక్కడ కన్నెపిల్ల. ఎక్కడ వితంతువు! నేను చెప్పేదేమిటంటే ఒలికిపోయిన నెయ్యి ఎంత గిడితే అంతే.'

కేహర్ నెమ్మది నెమ్మదిగా దమ్ములు లాగుతూ ఆలోచిస్తున్నాడు. 'చెపితే మాట ఖాయం చేస్తాను. నాకు అందులో లాభమేముంది? మీకు ఎంత మేలు జరిగితే అంతే. గ్రామంలోమాత్రం పుట్టింటికి పంపించామని చెప్పేయండి.' అన్నాడు మన్నూ.

కేహర్ కొంచంసేపు తలవంచి ఆలోచించి ఇంటావిడవైపు చూశాడు— 'కాని దాన్ని మండీ తీసుకువెళ్లడం ఎలా?'

'ఇదుగో వినవమ్మా అయ్యగారి మాటలు' మన్నూ నవ్వాడు. 'పుట్టింటి దగ్గరనుంచి పిలుపు వచ్చిందని చెప్పేది. మళ్ళీ గ్రామంలోగూడా ఇదే చెప్పాలి. అరె! వితంతువుకేమిటి? అత్తవారింట్లో ఎలాగో, పుట్టింట్లోనూ అలాగే.'

సోమాకు వింటూంటటం అసహ్యం వేసింది. తల తిరిగి కళ్ళముందు చీకటి వ్యాపించడం మొదలుపెట్టింది. వెళ్ళడానికి మన్నూ తన దుప్పటి సర్దుకుని లేచాడు. కేహర్ ఆయనతో మాట్లాడుతూ వాకిటిబయటకు వెడుతున్నాడు. వెనుకనుంచి ముసలావిడ కేకేసింది-'ఎక్కడికి వెడుతున్నావ్? నేను కొంచం పక్కింటికివెళ్ళి కోడళ్ళని కేకేసి వస్తాను. ఈ దెయ్యాలు, ఎప్పుడు చూసినా బ్రాహ్మలవసారాలలోకి వెళ్ళి కూర్చుంటాయి '

'ఇక్కడవరకే. కొంచం రోడ్డుదాకా షాహుకారుగారిని వదిలివస్తాను.' కేహర్ సమాధానంచెప్పి వెళ్ళిపోయాడు.

కుక్కలు లోపలికి జొరబడకుండా వుండటానికి అత్తగారు తలుపుదగ్గరగా వేసి గొణుగుతూ కోడళ్ళని పిలవడానికి వెళ్ళింది. సోమా ప్రాణాలు గట్టెక్కాయి. సోమా తమ మాటలన్నీ విన్నదని ఒకవేళ అత్తగారు తెలుసుకుంటే వంద నెపాల మీద తిట్లు తిడుతుంది. కొడుతుంది. చంపుతుంది. ఆమె వెంటనే పై అటకమీద నుంచి దిగింది. జొన్నలున్నబుట్ట తలమీదపెట్టుకుని తొందర తొందరగా వాకిట్లో నుంచిదాటి. కాలిబాటనుంచి పిండిమరవైపు దిగి వెళ్ళింది. ఆమె చెవుల్లో మన్నూ షాహ్, మామగారు, అత్తగారు మాట్లాడుకున్నమాటలు ప్రతిధ్వనిస్తున్నాయి.

సోమాహృదయం వేగంగా కొట్టుకుంటోంది. కళ్ళల్లో పెద్దపెద్ద కన్నీటి బొట్లు పొంగి పొరలుతున్నాయి. రాళ్ళతో నిండిన ఇరుకైనదోవలో ఎదురుదెబ్బలు తగులుతున్నాయి. 'అయ్యో! ఈ దుర్మార్గుడు నన్ను అమ్మేస్తాడా? ఎవరికి అమ్ము తారో ఏం తెలుస్తుంది? ముసల్మానుకో, ఎవరైనా సిపాయికో అమ్ముతారు. ఎవరు కొనుక్కొని తీసుకువెడతారో ఏం తెలుస్తుంది! ఏమేమి చేస్తారో. ఇంతకన్నా గూడా మెడకి ఉచ్చువేసుకుని చచ్చిపోవడం మంచిది. పరదేశీ డ్రైవరుతోనైనా కలిసి వెళ్ళిపోయేదాన్ని. అతను మళ్ళీ రానుకూడా లేదు. అతనుగూడా ఏమైనా చెడుగా అనుకున్నాడేమో! నాకు పరమేశ్వరునిదెబ్బ తగులుతోంది. అయ్యో, ఎక్కడ చావను?' సోమా ఈ ఆలోచనలతోనే పిండిమరదగ్గరకు చేరింది.

ఆ పిండిమరకు దగ్గరలో తూర్పువైపునవున్న కొండమీద 'ముక్కీ' అనే గ్రామం వుంది. ఆ గ్రామంవాడైన బదల్ అనే కుర్రాడుగూడా పిండి పట్టించడానికి పిండిమరదగ్గరకు వచ్చాడు. సోమా అతన్ని గురించి పట్టించుకోలేదు. బదల్ ఆమె వైపు ఉరిమి-ఉరిమిచూసి నవ్వాడు. దగ్గరకువచ్చి 'ఓహో, అమ్మగారు ఏడుస్తు న్నారా? ఏం బుద్ధి బాగా బరువుగావుందా?' అన్నాడు.

ఇంకొకగ్రామంలో వుండే 'మధరి' అనే ముసలి బ్రాహ్మణస్త్రీ దగ్గరగా కూర్చునివుంది. 'బీదరాలైన వితంతువుకు మిగిలింది ఏడవటమేనా? కష్టపెడతారు, తిండికి సరిగా పెట్టరు!' అని ఆమె సానుభూతి చూపించింది.

మధరి పక్కనవున్న ఇంకొకస్త్రీ తన దుఃఖపూరితమైన కళ్ళను చెంగుతో అద్దుకుంటూ చెప్పింది-'ఇపుడేముంది? మొదట గ్రామంలో ఒకళ్ళో, ఇద్దరో వితం తువులు వుండేవాళ్లు. ఇప్పుడు ఈ యుద్ధంవలనమాత్రం జిల్లా అంతా వితంతువు లతో నిండిపోయింది. మొదటియుద్ధం తరువాత ఆర్యులు (ఆర్యసమాజం వాళ్లు) వితంతువివాహం చేయించుతూ వుండేవాళ్లు. ఇప్పుడు చూద్దాం, ఏం జరుగుతుందో! నా ఇద్దరుకొడుకులు ఇద్దరు వితంతువులను వదిలిపెట్టి వెళ్ళిపోయారు.' అని ఆమె బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టింది. కాని మరపట్టడానికి తనవంతు రావడంచేత సోమా దగ్గరనుంచిలేచి మరవైపు వెళ్ళిపోయింది.

'అమ్మాయిగారికి ఇంట్లో రొట్టెలు సరిగా పెట్టడంలేదా? నేనైతే నెయ్యి-

వంచదారముద్దలో ముంచేస్తా. నాతో మాట్లాడనే మాట్లాడు' బదల్ సోమాదగ్గరకు వచ్చి అన్నాడు.

సోమా ఏమీ మాట్లాడకుండా ముసలావిడదగ్గరకు జరిగి తలను కొంగులో దాచుకుని కూర్చుంది. ముసలావిడకు కోపం వచ్చింది. ఆమె ఒక పెద్ద రాయితీసి బదల్‌మీదకు గిరాటేసి తిట్టడం మొదలుపెట్టింది-'ఎముకలు విరిగాయా లేదా! సుంకరుడు బయల్దేరాడు. వ్యభిచారం చేయడానికి.' పెద్దగొంతుతో అందరికీ విన వడేలా అంది-'ఈ యుద్ధం నాశనం కానూ, ప్రభుత్వంవాళ్లు ప్రతి గ్రామంనుంచీ మొగాళ్ళందరినీ చూసి తీసుకువెళ్ళారు. వాళ్లు వున్నట్లైతే వీళ్ళపళ్లు రాలగొడుతూ వుండేవాళ్లు. ఇప్పుడు వీళ్ళకి ఎవరిభయమూ లేకుండాపోయింది.'

సోమా పిండిమరనుంచి తిరిగి వచ్చేటప్పుడుకూడా తన అదృష్టాన్ని తిట్టుకుంటూనే వస్తోంది-'బాధలనుంచి బయటపడటానికి భగవంతుడు ఒక మంచిమనిషిని పంపాడు, అతనిమాటను వినలేదు. ఎదురోజాలువస్తే ఇలాగే జరుగుతుంది.' అనుకుంది. ఇంటికి తిరిగివచ్చినతరువాత అత్తగారు ఆమెను చూడగానే 'ఏకేమయింది? ఏడుస్తున్నావెందుకు?' అని అడిగింది.

'ఎందుకనో పొద్దుననుంచీ తలనొప్పిగా వుంది' అని సోమా ఏదో సాకు చెప్పింది.

పెద్దకోడలు చెప్పటం మొదలుపెట్టింది-'ఆ, ఎముకల్లో కపటంచేరితే ఇటువంటివంకలే తడుతూవుంటాయి. సేరెడు గోధుమలు పిండిపట్టించుకు వచ్చిందో లేదో సాకు చెప్పడం మొదలుపెట్టింది.'

మరునాడు మధ్యాహ్నం సోమా వాకిట్లో మూల కూర్చుని గిన్నెలు తోముతోంది. కేహర్ ఇంటిగోడకు వీపు ఆనించి అరుగుమీదకూర్చుని హుక్కా పీలుస్తున్నాడు. అందుచేత సోమా ముఖంమీదకు ముసుగు లాక్కుంది.

కేహర్ ఇంట్లో ఏదో పనిలోవున్న ముసలావిడను సంబోధించి-'ఓ ఇంటిదానా! మళ్ళీ ఏం చెపుతావు ఆమాటగురించి?' అన్నాడు.

'ఏమాటగురించి?' లోపల్నుంచి అత్తగారు అడిగింది.

'ఏమాట గురించా? అరే, నిద్రపోతున్నావా ఏమిటి? నిన్న మధ్యాహ్నం

వేళప్పుడు మన్నూ షాహుకారు కమేలాగ్రామంనుంచివచ్చి అక్కడివిషయం చెప్పి వెళ్లాడా లేదా!' కేహర్ కోపంతో ఇంటావిడకు గుర్తుచేస్తూ చెప్పాడు.

సోమా చెవులు అటువైపునుంచి వినసాగింది. కమేలాలో తన పుట్టిల్లు వుంది. దానితోబాటు మన్నూ షాహుకారు పేరు. లోపల్నుంచి అత్తగారు సమాధానం చెప్పింది-'అందులో ఆలోచించాల్సినది ఏముంది? మంచిమనుషులు కూతుర్ని పిలిస్తే ఎలా వద్దంటావు? దాని తండ్రి యజ్ఞం చేస్తున్నాడు. యజ్ఞం అంటే ఒక్కరోజులో అయ్యేది కాదుకదా! యజ్ఞం చేసేటప్పుడు కొడుకులని-కూతుళ్ళని పిలుస్తూనే వుంటారు. వద్దని ఎలా అంటావు?'

రెండోకోడలు పెద్దకోడలితో చెప్పి ఆక్షేపించింది-'వచ్చారు పెద్దయజ్ఞం చేసేవాళ్లు. కూతుళ్ళను అమ్మేసి యజ్ఞం చేస్తున్నాడు. పెద్ద ధర్మాత్ముడు. మేము పుట్టింటిగడపతొక్కి రెండేళ్ళయింది. అదే మంచి సుగుణవంతులు కదా!'

పెద్దకోడలు అయిష్టంతో హుంకారంచేసి 'రోజంతా పిడకలు పట్టడం, పొలాల్లో చెత్త మోయడం నావంతు అవునా కాదా!' అంది.

'ఎప్పుడు చూసినా ఏదో వాగుతూవుంటారు. ఇంట్లోపని చిన్నదే గుత్తానికి తీసుకుందా ఏమిటి? దానికిమాత్రం మనసు, ప్రాణం లేవా? ఏం దానికి పుట్టిల్లు లేదా? వాళ్లు పిలిస్తే వెళ్ళకుండా ఎలా వుంటుంది?' మామగారు కోడళ్ళను తిట్టాడు.

మునలాయనను సమర్థిస్తూ అత్తగారుకూడా చెప్పటం మొదలుపెట్టింది. అత్తా-కోడళ్ళమధ్య పెద్ద పోట్లాట మొదలయింది. సోమా ముసుగులో వణుకుతూ గిన్నెలు తోముతోంది. మొదటిసారిగా ఆమె హృదయంలో తన ఇద్దరు తోడికోడళ్లకు ఆశీర్వాదపుమాటలు బయటకు వచ్చాయి. మీకు మేలు జరుగుతుంది అక్కల్లారా! మీ సౌభాగ్యం నిశ్చలంగా వుంటుంది. మీ పిల్లలు చిరంజీవులుగా వుండాలి! నన్ను వెళ్ళనీయకండి. నన్ను రక్షించండి! ఇక్కడే చచ్చిపోనివ్వండి. నేను మీకు జీవితాంతం సేవ చేస్తాను.

ఎప్పుడైతే అత్తా-కోడళ్ళ పోట్లాట బాగా పెరిగిపోయిందో, పరిస్థితి తిట్లు-చీదరింపులవరకూ వెళ్ళింది.' అత్తగారు ఒక కర్రతీసుకుని రెండోకోడలి వీపుమీద

కొట్టింది. రెండోకోడలు అరుస్తూ అత్తగారిని తిట్టడం మొదలుపెట్టింది. పెద్ద కోడలు ఇంటిలోపలికి జారుకుంది. అత్తగారు పోట్లాటకు తీర్పు ఇస్తూ తన నిర్ణయాన్ని మామగారికి వినిపించింది-'ఈ కళంకితువాళ్ళని ఏముంది? అలా వాళ్ళని అరవనీ। చిన్నది వీళ్ళ పుట్టింటినుంచీ వచ్చిన దాసీదేమీ కాదుగా। ఏమండీ, మీరు రెండు మూడు రోజుల్లో దాన్ని వాళ్ళ ఇంటిదగ్గర దింపిరండి.'

'నేను వెళ్లను, నేను వెళ్లను. నా తండ్రి నన్ను అమ్మేశాడు. ఇప్పుడు మీరు అమ్మాలనుకుంటున్నారు. తినడానికి నాకేమీ పెట్టద్దు. నేను ఇలా చచ్చిపోవడమే మంచిదిగాని నేను అమ్ముడుపోను. ఇది మోసం. నేను వెళ్ళను' అని సోమా హృదయం అరిచింది. కాని మామగారితో ఏమి చెపుతుంది? ఆమె లోపలకు వెళ్ళి వంటిల్లు అలకడం మొదలుపెట్టింది. ఆమె హృదయం బాధపడుతోంది. ఏడుపు వస్తోంది. అతి కష్టంమీద దుఃఖం ఆపుకుంది.

సోమా మూడవరూమున గేదెను, దూడను తోలి నీళ్లు పట్టడానికి బావివైపు వెళ్ళింది. భగవంతుడు ఈ రోజైనా మంచివాడైన పరదేశిని పంపిస్తే బాగుంటుంది అనుకుంది. ఆమె చాలాసేపటివరకూ మార్గానికి పక్కనవున్నపొలాల్లో నుంచుని బస్సులు వెళ్లడంకోసం నిరీక్షించింది. మొదట వైజ్‌నాధ్‌వైపు వెళ్ళేబస్సులు వచ్చాయి. తరువాత మండీవైపు వెళ్ళేబస్సులు వచ్చాయి. సోమా తలఎత్తి కళ్ల దగ్గర చేతులు పెట్టుకుని డ్రైవర్లను గుర్తుపట్టడానికి ప్రయత్నించింది. ఆమె ఈ ప్రవర్తనవలన డ్రైవర్లు నవ్వి, ఎగతాళిచేస్తూ, ఈలవేసి, కళ్ళతో సైగలుచేసి బస్సుల వేగంవలన సోమా కళ్లల్లోకి దూళినిరేపి వెళ్ళిపోయారు. సోమాకు 'మంచిమనిషి' డ్రైవరు కనుపించలేదు.

సోమా అంతులేని ఆతురతగా బస్సులు వెళ్ళేటప్పుడు రోజూ రోడ్డుమీద నిలబడి నిరీక్షిస్తూవుండేది. వెక్కివెక్కి ఏడ్చేది. అత్తమామలమధ్య రోజూ సోమా పుట్టింటికి వెళ్లడంగురించినమాటలు జరుగుతూ వుండేవి.

'ఈ రాణిగారితండ్రి ఇంట్లో యజ్ఞం జరుగుతుంది. ఈ రాణికోసం పుట్టింటి నుంచి పల్లకి వస్తుంది' అని తోడికోడళ్లు దెప్పిపొడిచేవాళ్లు. అయిదుఇళ్ల బస్తీ మధ్యురాగ్రామంలో అందరికీ, సోమా పుట్టింట్లో యజ్ఞం జరుగబోతోందని తెలిసిపోయింది.

'తోడికోడళ్ళతో నిజం చెప్పేద్దామా ఏమిటి?' అని సోమా ఆలోచించేది. కాని వాళ్ళేమిసహాయం చేస్తారు? అత్తగారితో చెప్పారంటే అది తారుమారై ఆమె ఎముకలు విరుస్తుంది....ఎవరైనా మెడలో తాడుకట్టి తనను లాగుతూ తీసుకువెళ్ళేటప్పుడు చూడచ్చు. భగవంతుడున్నాడు. అప్పుడప్పుడూ దుఃఖితురాలై ఆలోచించేది-'ఇక్కడమాత్రం ఏం సుఖం పొందుతున్నాను? వీళ్ల మంచిమను షులా ఏమిటి? నన్ను కొనుక్కుని మేకని నరికినట్లుగా నరికి నా మాంసం తినే స్తారా? తల నరికేస్తారా ఇంకా మంచిది. పోట్లాట తప్పుతుంది. కాని స్త్రీలను నరు క్కుని తినేవాళ్లు తక్కువమంది. ఇకముందు ఆలోచించేధైర్యం లేదు....అత్తవా రింట్లో ఎంతయినా గౌరవం, శీలం రక్షించబడుతాయి. వితంతువును కొనుక్కునే వాడు మనిషి అయివుండడు. పెళ్ళి చేసుకోవడానికి కన్యను కొనుక్కోవడం ఒక విషయం. కాని నేను వితంతువును. నాకు అవవలసిందేదో అయిపోయింది. ఇప్పుడు కేవలం అనవసరమే. దీనికన్నా చచ్చిపోవడం మంచిది' అనుకుంది.

అత్తగారు ఆమె ముఖంచూసి మాటిమాటికీ అడిగేది-'మహామారి, నీకే మైంది? జ్వరం ఏమీ తగలడంలేదు కదా?' సోమా శరీరం తాకినమీదట కొంచం జ్వరం వున్నట్లుగాగూడా తెలిసింది. 'బెల్లం, సోపుగింజలు మరగకాచి తాగు. సొంఠి నములు' అని చెప్పింది.

'ఏం లేదు, కొంచం తలనొప్పిగా వుంది' అని చెప్పి సోమా తప్పించు కుంది.

'ఏమండీ, చిన్నదానివి మీరు ఒకటి రెండు రోజుల్లో కమేతాలో దిగవిడిచి రండి. దానిమనసుగూడా బాగాలేదు. కొంచం గాలి, నీళ్లు మారుతాయి. అమాయకు రాలు, పెళ్ళిచేసుకుని వచ్చింది. అప్పటినుంచీ పుట్టింటికి వెళ్లనేలేదు' అని అత్త గారు సోమాకి వినిపించేలా సానుభూతితో మామగారికి చెప్పింది.

సోమా లోలోపల తన అదృష్టాన్ని తిట్టుకోవడం మొదలుపెట్టింది.

* * *

ధనసింగ్‌వలన జరిగిన లారీదుర్ఘటనకు సంబంధించిన కొట్లాట చాలా చిక్కులతో పెద్దదయింది. ఆ పొట్లాట యజమానులకు - డ్రైవర్లకు మధ్య

పోట్లాట వచ్చేందుకే కాకుండా డ్రైవర్లకు - డ్రైవర్లకు మధ్య పోట్లాటలు వచ్చేందుకుకూడా కారణమయింది. పంచాయతీలు జరిగాయి; అనేక వివాదాలు అయ్యాయి.

డ్రైవర్లు అనేది ఏమిటంటే—మొదటివిషయం ప్రయాణం చాలాపెద్దది. రోడ్డు వంకర - టింకరలుగా ఎత్తు పల్లాలతోనూ, చెడిపోయివుంది. అదీకాక, యుద్ధంవలన కొత్తమోటార్లు, కొత్తభాగాలు రావడంలేదు. అరిగిపోయిన భాగాలు, మాటి - మాటికి విరుగుతూనే వుంటాయి.

యజమానుల ఊహ ఏమిటంటే-డ్రైవర్లు చాలా నిర్లక్ష్యంగా వుంటున్నారు. ఉద్యోగాలకేమీ కొరతలేదు. కంపెనీ ఉద్యోగం లేకపోతే ఇతరచోట్ల వందఖాళీలు వున్నాయి. ఏదీ లేకపోతే యుద్ధంలోకే వెళ్ళిపోవచ్చు. సైన్యంలో డ్రైవర్లను మంచి జీతంమీద బాగా చేర్చుకుంటున్నారు. క్రితం నెలలనుంచి ట్రాన్స్‌పోర్టు కంపెనీలకు మరమ్మత్తుమీద వేలకువేలు ఖర్చు అవుతోంది. కంపెనీ మేనేజరు లంతా కలిపి ఈ ఉపాయాన్ని ఆలోచించారు. ఏమిటంటే, దుర్ఘటన ఒకవేళ డ్రైవరు నిర్లక్ష్యంవలన జరిగితే మరమ్మత్తులో సగంఖర్చు డ్రైవరు జీతంనుంచి వాయిదాలపద్ధతిప్రకారం పట్టుకుంటారు.

డ్రైవర్లలో రెండుదళాలున్నాయి. ఒకదళం మియాఁ కుందన్‌సింగ్, మోహసిన్ ఖాన్‌లది, రెండవది ఉస్తాద్ మజహర్‌ది. కుందన్‌సింగ్, మోహసిన్‌లు డ్రైవర్లకు సంబంధించిన ప్రతిమాటమీద కంపెనీవాళ్లతో పోట్లాడుతుండేవాళ్ళు. ఉస్తాద్ మజహర్‌కి ఇది ఇష్టంలేదు. అతను సాధారణంగా అల్లరులనుంచి దూరంగా వుండేవాడు. 'యజమాని-నౌకర్లకుమధ్య పోట్లాట ఏమిటి? ఎవరి వుప్పు తిన్నామో వాళ్ళతో ఎట్లా పోట్లాడుతాము? యజమాని సంపాదిస్తే నౌకర్లకుగూడా ఇస్తాడు. యజమానికి సంపాదనే లేకపోతే ఎక్కడనుంచి ఇస్తాడు? ఒకళ్లు యజమాని, ఇంకొకళ్లు నౌకరు అనేది భగవంతుని తీర్పు. భగవంతుడు యజమానిని పోషణకోసం, నౌకర్ని సేవచేయడంకోసం సృష్టించాడు. ఆయన తీర్పులో ఎవరు జోక్యం కల్పించుకోగలరు? ఈ తీర్పుగురించి ఎలా పోట్లాడగలం? ఓర్పుగా పని చేయాలి' అని అతను చెపుతుండేవాడు.

మజహర్‌ది ఏమీ అంత ప్రధానమైన దళం కాదు. అతను ఈ గుంపులో

చేరడానికి ఇష్టపడేవాడు కాదు. అతను యజమానుల పాతమనిషి. వాళ్ళమంచిని కోరేవాడు. అతని సిఫార్సుకు విలువ వుండేది. అతనిచేత సిఫార్సు చేయించుకోవాలని అనుకునేవాళ్లే మజహర్‌దళంలో చేరేవాళ్లు. ధనసింగ్ మజహర్ బండిమీద కొన్నాళ్లు క్లీనరుగా పనిచేశాడు. అతనిదగ్గిరే పని నేర్చుకున్నాడు. అతని సిఫార్సు ద్వారానే డ్రైవరు అయాడు. మొదట్లో ధనసింగ్ మజహర్‌మీదవున్న గౌరవం చేత కుందన్‌సింగ్ - మోహసిన్‌ఖాన్‌ల పంచాయతీలనుంచి దూరంగానే వుండేవాడు కాని ఈ కొట్లాటలో మేనేజరు అతనిజీతంనుంచి పదిరూపాయలు ప్రతినెలా తగ్గించడానికి నిర్ణయంచేసరికి కుందన్‌సింగ్ రక్షణలోకి వెళ్ళాల్సి వచ్చింది.

మియ్యా కుందన్‌సింగ్ కంపెనీవాళ్ల తల్లి-అక్కలని పెద్ద పెద్ద తిట్లు తిడుతూ చెప్పాడు - 'ఈ అమ్మా మొగుళ్లు, యజమానులు, ఇటువంటి దుర్మార్గాలు ఎలా చేస్తారో చూస్తాను. రెండురోజులపాటు లైనుమీద బళ్లు ఆపేస్తే అరవై ఏమిటి, అరవై వేలు నష్టం వస్తుంది.' కాని యూనియన్‌కుచెందిన మిగతా డ్రైవర్లు ధనసింగ్‌కోసరం పోట్లాడటానికి సిద్ధంగా లేరు. ఎందుకంటే అతను యూనియన్ మెంబరు కాదు. లేద్‌రామ్ డ్రైవరు శలవువిషయంగురించి జరిగిన పోట్లాటలో కూడా అతను కలవలేదు.

నాలుగైదురోజులు ఇలాగే గడచిపోయాయి. పోట్లాటవలన ధనసింగ్‌కు డ్యూటీ ఇవ్వడం ఆగిపోయింది. ధనసింగ్ వుద్యోగం ఎక్కడ పోతుందోనని భయపడ్డాడు. ధనసింగ్ మజహర్‌దగ్గరకు వెళితే అతను గంభీరంగా సలహా ఇచ్చాడు - 'నాయనా, యజమానితో పోట్లాడటం భగవంతునితీర్పును తిరస్కరించడం అవుతుంది. దేముడు అంతా సరిగా చూస్తాడు. ఓర్పుపట్టు. యజమానిని క్షమార్పణ అడుగు. వాళ్లు వేసినశిక్షను సహించు. దేముడు న్యాయం చేస్తాడు. యజమానిహృదయంలో అనుగ్రహం కలిగేలాగా చేస్తాడు.' ధనసింగ్ మనస్సు ఇటువంటి అవమానాన్ని సహించడానికి సిద్ధమయేది కాదు.

మియా కుందన్‌సింగ్ ధనసింగ్ గాబరా పడుతుండగాచూసి దానికి విరుద్ధంగా తిట్టి చివాట్లు పెట్టాడు-'నీ అక్క....ఒకవేళ నువ్వువెళ్లి కంపెనీని క్షమార్పణ అడిగితే నిన్ను నరికి గోతిలో పాతిపెట్టేస్తా. ఎక్కడా అయిపులేకుండా పోతావు. రోజూ నీ లారీకి ఏక్సిడెంటు చేయిస్తాను. అక్క మొగుళ్లు, యజ

మామలు, ఇతర డ్రైవర్లగొంతులమీద కత్తిపోట్లు వేయిస్తారా। ఇవ్వాళ నువ్వు. వాళ్ళకు వంగుతావు. రేపు ఇంకొకళ్ళకి వంగుతావు. మేము ఎక్కడా అయిపు లేకుండా పోతాం.'

కుందన్‌సింగ్ మీసం మెలేసి చెప్పాడు-'ఒకవేళ నీకు ఈ పోట్లాటలో శిక్ష పడితే దీనిని మూత్రంతోతడిపి తీయించుకుంటాను. యూనియన్ అంటే ఏమి టనుకున్నావు? వందమంది మనుషులు ఒకటైపోతాము.' కుందన్‌సింగ్ పిడికిలి బిగించి చూపించాడు. 'పర్వతాన్ని బద్దలుచేస్తాం. కంపెనీ నా కొడుకులు మన సంపాదన తింటారు. ఈ అమ్మా మొగుళ్లు యజమానులుమాత్రం ఆడవాళ్ళని పక్కలోవేసుకుని పడుకుంటారు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, వానలో తడుస్తూ, కొండలమీదుగా మనుషులను చేరవేస్తుందేదిమాత్రం మనమే. నేను ఈ కంపెనీలో ఉద్యోగంలో చేరినప్పుడు ఆరుమోటర్లు వుండేవి. ఆరు। కేవలం ఆరు. అర్థమయిందా బాబూ। ఇప్పుడు నూటఅరవై వున్నాయి. ఎక్కడనుంచి వచ్చాయి? యజమానులలో నుంచా? కొడుకుల్లారా। ఈ కుందన్‌సింగ్ రక్తం అంతా చమట. అతను తన వక్షస్థలాన్ని కొట్టుకున్నాడు. 'నీ అమ్మ, నా కొడకల్లారా, ఇది నువ్వు సంపాదించినదా। మళ్ళీ ఒక్కొక్క డ్రైవరేముంది, చెరుకుముక్కను పీల్చిపారేసి నట్లు పారేయి. నీ అక్కడి....తనతోటివాళ్ళను ఎవడైనా మోసంచేస్తే ఖబడ్దార్। అబ్బాయి, ఉత్సాహంగా వుండు' అని ధనసింగ్‌తో అన్నాడు. ధనసింగ్ ఓదార్పు పొందుతూ, సంతోషంగా కుందన్‌సింగ్ తిట్లు వింటున్నాడు. రక్షణనుంచి ఓదార్పు పొందుతున్నట్లుగా అనిపించింది. ఈ తిట్లు చాలా తక్కువ. ఇవన్నీ మియాగారి మనసులో నాటుకుపోయిన మాటలు.

డ్రైవరు బాబూలాల్ ధనసింగ్‌తో సమానమైన పదునున్నాడు. 'ఎందుకు గాబరా పడుతావోయ్, కంపెనీ అమ్మది ఇలాగే వుంటుంది. సైన్యంలో ఇంకా ఖాళీలున్నాయి. నా తమ్ముడు అక్కడే వున్నాడు. ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు నిన్ను అక్కడ చేరుస్తాను. తిండి-బట్ట పూరికినే ఇస్తారు. ముప్పైఆయిదు రూపా యలు జేబులో వేసుకోవచ్చు.' అని అతను ధనసింగ్‌కు ధైర్యం చెప్పాడు.

డ్రైవర్ల పంచాయతీలో కామ్రేడ్ భూషణ్‌గూడా వచ్చిచేరాడు. అతను ధనసింగ్‌కు తెలియచెప్పాడు—'మిత్రుడా నువ్వు యూనియన్‌ని నమ్ము. బాబూ

లాల్ చిక్కులో పడకు. ఈ ఇద్దరు అన్నదమ్ములూ యువకులను సైన్యంలోచేర్చి కమీషన్ తింటారు. వీళ్ళని అడుగు. సైన్యంలో చాలా ఖాళీలువుంటే నీ అంతట నువ్వు ఎందుకు చేరలేవు? వెళ్ళిన వాళ్ల రక్తం కన్నీళ్లుగా కారేలా ఏడుస్తున్నారు. మనం విదేశప్రభుత్వానికి సహాయం చేయడం ఎందుకు? ప్రభుత్వం, యజమానులు ఒకటే. ఇంగ్లీషువాళ్లు మనమీద గుళ్లు కాల్చనీ, మనల్ని దోపిడీ చేయనీ, మనం వీళ్ళకోసం మనప్రాణాల్ని ఇద్దాము. నువ్వే చెప్పు. ప్రభుత్వం నీకు ఏం మంచి చేసింది? ప్రభుత్వం ఏమిటి? ఈరోజు యజమానితో మనం పోట్లాడితే ప్రభుత్వం తన పోలీసులను తీసుకుని యజమానులపక్షం అవుతుంది.'

సలహాలు ఇచ్చేవాళ్లు ఇంతమంది అవడంచేత ధనసింగ్ విసిగిపోయాడు. వీళ్ళందరికన్నా సలహా-గిలహా ఏమీ ఇవ్వకుండా, తిన్నగా ఆజ్ఞాపించే కుందన్ సింగ్ మంచివాడు. అతను చెప్పగానే డ్రైవర్ల పంచాయతీ గుమిగూడింది. 'మొదట మాతో సహకరించనివాళ్ళకోసం మే మెందుకు చావాలి?' అని బోధ్ రామ్, అతని మిగతామిత్రులూ అన్నారు.

ధనసింగ్‌కుకూడా కోపమొచ్చింది. అతను లేచినిలబడి 'మియాగారూ, అలాగే కానివ్వండి. నాకోసం ఎవరూ చావద్దు. నాదోవ నేను చూసుకుంటాను' అన్నాడు.

భూషణ్, కుందన్‌సింగ్ మధ్యలో సర్దారు. భూషణ్ కూలీలు, పరిశ్రమ చేసేవాళ్ళ ఐకమత్యాన్ని బలపరిచాడు. ఇద్దరు డ్రైవర్లు అంగీకరించనే లేదు. కుందన్‌సింగ్ భూషణ్‌చేతిని లాగి అతన్ని కూర్చోబెట్టాడు. తిట్టితిట్టి అన్నాడు- 'వీళ్ళ అమ్మలకి నేను చెపుతాను. ఎవడి అమ్మామొగుడు, యూనియన్‌కు నాయకుడవుతాడో చెప్పమను నా ఎదుట। యూనియన్ డ్రైవరుసోదరులందరిదీ। యూనియన్ అంటే నువ్వేమనుకుంటున్నావు? నౌకరకు, యజమానితో జరిగే పోట్లాటకు కందకం లాంటిది. తెలిసిందా। ఎప్పుడు యజమాని దుండగం చేస్తాడో, అప్పుడు యూనియన్ తయారవుతుంది. ఎలాగైతే గుర్రాలన్నీ గడ్డితింటాయో, అలా యజమానులంతా దుండగాలు చేస్తూనేవుంటారు. అమ్మామొగుడు యజమానితో ఎవడైతే చేతులు కలుపుతాడో వాడు కార్మికులశత్రువు. యజమాని నా బాబు అనుకునే నాయాలమీదగూడా యజమాని దుండగం చేస్తాడు. అప్పుడు వాడు

కూడావచ్చి యూనియన్‌లో చేరుతాడు. తన సోదరులమీద అవిశ్వాసం వదిలిపెట్టి నమ్మకస్తుడుగా అవుతాడు. కార్మికులకు సోదరుడవకుండా అపదానికి ఎవడి అమ్మా ....ఉన్నాడో రమ్మను, నా ఎదుటికి. ఎవడి అమ్మా.... మన కార్మికుడు, యజమాని ....లో దూరేవాడు? నిలబడమను అటువంటి ద్రోహిని!'

ఎవరూ నిలబడలేదు.

కుందన్‌సింగ్ బిగ్గరగా అరిచాడు—'ఇక చాలు. అందరు సోదరులు ఒకే మాటమీద నిలబడటానికి అంగీకరించినట్లే. ధనసింగ్ జీతం ఎవరూ తగ్గించలేరు. యజమానులకు ఈ సమాచారం మోసుకెళ్ళి చెప్పేవా డెవడన్నా కూర్చునివుంటే వెళ్ళి వాళ్ళబాబుతో చెప్పమను. ధనసింగ్ జీతంతగ్గిస్తే సమ్మె జరుగుతుంది. లైనుమీద ఒక్క బండిగూడా నడవదు.'

బంసీలాల్ డ్రైవరు లేచినిలబడి చెప్పాడు—'సోదరులారా, మియాగారి మాటలు, కామ్రేడ్ మాటలు మనమందరమూ ఒప్పుకున్నాం. కాని యజమానులు తప్పుడుమాటలు నేర్పుగా చెపుతున్నారు. మేనేజరు చెప్పేదేమిటంటే—ధనసింగ్ లారీకి ప్రమాదం ఎందుకు జరిగిందంటే అతను నిర్లక్ష్యంగా లారీ నడిపాడట. మేకలు మేపే అమ్మాయితో అతను పరిహాసాలాడాడట. ఈ వివరాలను మేనేజరుకి కర్మూ క్లీనరు చెప్పాడు. పంచాయతీ దీన్నిగూడా నిర్ణయించాలి.'

ధనసింగ్ నిలబడి చెప్పాడు—'కర్మూ నా ఎదురుగావచ్చి గంగాజలాన్ని ఎత్తి చెప్పమనండి. నేను గంగాజలం ఎత్తి ప్రమాణం చేస్తాను. కర్మూ చెప్పింది పచ్చి అబద్ధం.'

'ధనసింగ్ రోడ్డుమీద ఇటువంటి నీతితక్కువపని చేసినట్లైతే యూనియన్ అతన్ని చెప్పుదెబ్బలు కొడుతుందికాని, యజమానుల ఎదుట మనం, మనం ఒకటి' అని మోహసిన్ లేచి నిలబడి అన్నాడు.

ఎప్పటివరకూ కర్మూ పంచాయతీని క్షమార్పణ కోరడో, అప్పటివరకూ అతనిని ఏ డ్రైవరు బండిమీద క్లీనరుగా వుంచుకోకూడదని పంచాయతీ నిర్ణయించింది.

మేనేజరు తెలివైనమనిషి. పరిస్థితి గమనించి ఆయన ఆశ్చర్యాన్ని ప్రకటించారు. ఈ పోట్లాట అంతా ఏమిటి! మేము కేవలం ధనసింగ్‌ను కాంగడా-కుల్లూ

లైనునుంచి తీసేసి పఠాన్‌కోట-ధర్మశాల లైనుమీదకు మార్చాము. ఎందుకంటే కాంగడా-కుల్లూ మార్గం చెడిపోయివుంది. ఆ లైనుమీద పనిచేసే పాతడ్రైవరు గుల్‌జారీ వచ్చారు.

ధనసింగ్ జరిమానానుంచయితే తప్పించుకోగలిగాడు, కాని అతను లారీ నడపాల్సినమార్గం మారిపోయింది. అది అతనికి నచ్చలేదు. మండీవైపు వెళ్లాల్సిన అవసరం లేకపోవడంవలన సోమాను చూడటానికి వీలులేకపోయింది. కాని లైను మారిన దానిమీద ఫిర్యాదు ఎలా చేస్తాడు? యజమాని ఇష్టం. ఎక్కడ పని చేయ మనిచెపితే అక్కడ పని చేయాల్సిందే. సేవ ఏమిటి, హుందాతనం ఏమిటి! ఫలానావిషయంలో అన్యాయం జరిగిందని చెప్పడం కష్టం. డ్రైవర్లంతా ఎగుడు-దిగుడులతోవుండే అరణ్యమార్గాన్ని కాకుండా 'పఠాన్‌కోట-కాంగడా', 'పఠాన్‌కోట-ధర్మశాల' లైనును ఎక్కువగా ఎన్నుకునేవారు. పఠాన్‌కోట, ధర్మశాలలు మంచి పెద్దవైన పట్టణాలుగా వుండటంచేత తినడానికి, ఉండటానికి, మనోవినోదానికి వీలుగా వుంటూవుండేది. అవసరానికి కావలసిన అన్నివస్తువులు దొరుకుతూ వుండేవి. చెమటకంపుకొట్టే మూర్ఖులయిన ప్రయాణీకులు కాకుండా నవనాగరీకంగా, నభ్యతగల ప్రజలతో సంబంధం వుండేది. కొంచం మనోరంజనంకూడా కలుగుతూవుండేది. కాని ధనసింగ్ ఈ మార్పుకి సంతోషించలేదు.

పఠాన్‌కోట, ధర్మశాలలలో అనేక కంపెనీలకు సంబంధించిన, అనేక లైనుల డ్రైవర్లు కలిసేవారు. మోటర్లు బయలుదేరడానికి ముందు శీతాకాలపు ఎండలో పొగ్గై వేరుశెనగకాయలు తింటూనో, సిగరెట్లు కాల్చుకుంటూనో కబుర్లు చెప్పుకునేవారు. రోడ్డుమీద జరిగిన సంఘటనలగురించి మాట్లాడుకునేవారు. కొందరు చదువువచ్చిన డ్రైవర్లద్వారా పత్రికలోపడిన యుద్ధవిశేషాలు చదివించుకోవటం, యూనియన్‌పోట్లాటల గురించిగాని, లేకపోతే బండిలో ఎక్కే స్త్రీలను గురించిగాని మాట్లాడుకునేవారు. డ్రైవర్లు ధనవంతులైన స్త్రీలనుచూసి, గొంతు తగ్గించి, వాళ్ళరూపం, శరీరంగురించి, బట్టలు, ప్రవర్తనగురించి విమర్శ చేస్తుండేవారు. బీదస్త్రీలనుగురించి నిర్భయంగా మాట్లాడుకునేవారు. ఇటువంటి సంభాషణలు జరిగేటప్పుడు వాళ్ళకు తమ సంకేతాన్ని సూచించే శబ్దాలున్నాయి. ఎవరైనా చాలా ధనవంతురాలుగా కనిపించే అందమైనస్త్రీని చూస్తే 'రోల్స్' వస్తుంది అనేవారు.

లావుగా, భారీగావున్న స్త్రీనిచూసి 'తప్పుకో-తప్పుకో ట్రక్కు వస్తుంది' అనేవారు. ఒకామె పేరు 'విమానం' అని, ఒకామెపేరు 'ద్వాబే గుర్రం' అని, ఇంకొకస్త్రీని 'బార్ గేదె' అని అనేవాళ్లు. ఎవరైనా అమ్మాయిని 'పటంగి' అనో 'గాలిపటం' అనో అంటూ దారం కట్టడానికి, లాగడానికి, పట్టుకోవడానికి కేకలేస్తూ వుండేవారు. ధనసింగ్‌గూడా ఇటువంటి విమర్శలలో పాల్గొనేవాడు. కాని ఇప్పుడు అతనికి ఇది నచ్చడం లేదు. ఇలా ఎవరైనా సోమాని ఎగతాళి చేస్తే? అని ఆలోచిస్తూ వుండేవాడు.

* * *

మండీ-వైజ్‌నాధ్‌మార్గంమీద రైతుపిల్లతో ధనసింగ్ జరిపిన ప్రేమ—వృత్తాంతం డ్రైవర్లలో వ్యాపించిపోయింది. ఆ అమ్మాయి రోడ్డుపక్కన నిలబడి నిరీక్షిస్తూవుండగా, ఆ లైనులో లారీలునడిపే డ్రైవర్లందరూ చూశారు. ఇహ ధనసింగ్‌ను ఎగతాళి చేయడం మొదలుపెట్టారు.—'చెప్పరా అబ్బాయి. పెద్ద భక్తుడివై పోతున్నావు! మేమైతే కళ్ళతోచూసి తృప్తిపడుతున్నాము. నువ్వు మాత్రం చేతులుగూడా వేడి చేసుకుంటున్నావు.' ఇంకొకడ్రైవరు అన్నాడుకదా—'అసలైన వేటగాడు ఎగిరేపిట్టని పడగొట్టాడు.' ఇంకొకడు అడిగాడు, 'ఒట్టేసి నిజం చెప్పాలి మిత్రుడా, రాత్రి ఎలా గడిచింది?' అలాఅని వ్యంగ్యంగా మాట్లాడేవారు. చేతులు తిప్పేవారు.

'మిత్రుడా, నువ్వు చెప్పు, మ....ని ఒకరోజు సామానుల ట్రక్కులోవేసి పంచల్లో దాచి తీసుకురానా?' అని యాసీన్ అడిగాడు.

మొదట్లో ధనసింగ్ సిగ్గుపడి మౌనంగా వూరుకునేవాడు. కాని తరువాత మండిపడటం మొదలుపెట్టాడు. డ్రైవరు గురుచరన్ ఎక్కువ అశ్లీలకరమైన పరిహాసం చేసేసరికి ధనసింగ్ అతన్ని కొట్టాడు. అంతటితో మిగతాడ్రైవర్లు అతనిపైన కోపాన్ని వెలిబుచ్చారు.

'కొట్టడానికి అసలు ఈ నా కొడుకు ఎవడు? దానమ్మా, అదేం పీడింటిదా? మనం ఆ అమ్మని ఎగతాళిగూడా చేయగూడదా? ఈ నా కొడుకు అక్కడ రాత్రంతా గడిపివచ్చాడు. మనం మాటలుగూడా చెప్పుకోగూడదా? వీడేం దానితో కలిసి

ప్రదక్షిణచేసి పల్లకీలో కూర్చోబెట్టుకుని తీసుకువచ్చారా? ఎవరి అమ్మా-డ్రైవరు ఎగతాళిచేయకుండా వుంటాడు? మనం దీని అమ్మా.... కోసం యజమానులతో పోట్లాట తలమీద పెట్టుకున్నాం. వీడు పెద్ద 'ప్రపంచ చంద్రుడు' అయాడని మేకలు మేపుకునే కొండపల్లితో ఏమని మనసయింది. దానిని రాణిగా చేసుకుని కూర్చున్నాడు। అరే తమ్ముడూ నీ అమ్మనిగాని, అక్కలనిగానీ, ఇంటిస్త్రీనిగానీ. ఏమన్నా అంటే మేము నీచులం. డ్రైవర్లందరమూ ఇలా నోటికి కళ్ళకు గుడ్డలు కట్టుకోవడం, ప్రతిమాటకీ దడపటం, బాధపడటం మొదలుపెడితే రెండురోజుల్లో చచ్చిపోతాము. ఇదికూడా ఒక జీవితమేనా। నీ అమ్మ. వూరికి-ఇంటికి దూరమై. పొద్దున ఇక్కడవుంటే సాయంత్రానికి రెండువందలమైళ్లు అవతల వుంటాం. ప్రతినిముషం దుమ్మూ-ధూళీ. వేళకు భోజనం వుండదు. నిద్ర వుండదు. ఇంటావిద మొహంచూసి నెలలతరబడి గడచిపోతుంది. వూళ్ళోవున్న అప్పురసలనీ-పాకీవాళ్ళని వెంటేసుకుని తిరుగుతూ వుంటాము. గుండెలమీద కత్తులు గుచ్చుకుంటాయి. రెండుమాటలు చెప్పుకుని మనసు తేలికచేసుకుంటూ వుంటాము. ఇంకేమిటి।'

డ్రైవరు బ్లాకీరామ్‌గూడా హమీర్‌పుర్ జిల్లాలో నివసించేవాడే. వయసులో అతను ధనసింగ్‌కన్నా దాదాపు ఇరవైఏళ్లు పెద్దవాడు. మిగతాడ్రైవర్లు ధనిసింగ్‌ని బాధపెడుతుండగా చూస్తే మధ్యలో అపుతుండేవాడు. ఎవరూ లేనప్పుడు అతను ధనసింగ్ భుజాలమీద చెయ్యివేసి, 'తమ్ముడూ, ఇదంతా పిచ్చితనం. ప్రేమ వ్యవహారం పెంచుకోవడం తీదడ్రైవర్లశక్తికి సరైన మాటకాదు. డ్రైవర్లది ఏమిటి? బుతుపక్షి. ప్రతిక్షణం ప్రాణాలు ఆపదలోనే వుంటాయి. విషాదంలోనూ, స్త్రీ వలంలోనూ పడటం పొరపాటు. కావలసినంత సమయం వుంది; వీలు వుంది, డబ్బు వుంది. జల్సా చేసుకో కాని చిక్కుకోవద్దు। డబ్బు, భార్య, భూమి అనే వాటిపైన ఎవరైతే తిష్ఠవేసుకుని కూర్చోగలుగుతారో, వాటిని వాళ్ళే నిభాయించుకోగలరు. డ్రైవరు ఇలాటివాటికి తగడు. డ్రైవరు ఎగిరేపక్షిలాంటివాడు. ముక్కునిండా తిండి-నీళ్ళు దొరికితే అదే అదృష్టం. రెక్కలు ఏపుగా తెరుచుకుని. దృఢంగావుంది. వలలో చిక్కుకోకుండా వున్నంతవరకే పక్షి ఎగరగలుగుతుంది. ఒకసారి కావాలనుకుంటే ఎంతైనా తినిపించు. తిర్చుపెట్టు కాని జీవితాంతం వుండే

రోగాన్ని తెచ్చిపెట్టుకోవద్దు. మేము జుట్టుని ఎండలో తెల్లబరచుకోలా. తెలిసిందా తమ్ముడూ! ఇక్కడ ఇంటివి, బజారువి, గ్రామానివి, పట్టణానివి అన్నీ చూశాము. అన్నీ సారాలా ఆనందాన్ని ఇస్తాయి. తెలిసిందా! ఎప్పటివరకూ వీవశంలో నువ్వు వుంటావో అప్పటివరకూ వాటి ఆనందం నీకు వుంటుంది. ఎప్పుడైతే వాటివశంలో పడతావో. నాశనం అయినట్టే.'

'ఉద్యోగం వదిలిపెట్టి యుద్ధంలోకి వెళ్ళిపోతే ఎలా వుంటుంది?' అని ధనసింగ్ ఆలోచించేవాడు కాని మళ్లీ సోమా ఎలా కలుస్తుంది?

ధనసింగ్ పఠాన్‌కోటనుంచి మూడవరూము సర్వీసు తీసుకుని ధర్మశాల వెడుతున్నాడు. ప్రయాణీకులు ఎక్కడానికి—దిగడానికి బండిని నూరుపుర్‌లో ఆపి అతను రోడ్డుపక్కనవున్న దుకాణందగ్గర ఒక గ్లాసు మజ్జిగ తాగడం మొదలు పెట్టాడు. తన భుజంమీద ఎవరివో చేతులు పడటంతోటే వెనక్కి తిరిగిచూశాడు. మండీలైను డ్రైవరు బాబూలాల్.

'ఒకమాట చెప్తాను విను' బాబూలాల్ ధనసింగ్ చేయిపట్టుకుని ఒకివైపుకు తీసుకెళ్ళి చెప్పాడు. 'నీ లాకీ పక్కిదెబ్బలు పాల్టా అంతలవున్న చిన్న ఎగుడు మీద జరిగింది కదూ! దిబ్బమీద ఉమ్మిలా చెట్లు, వెదురుపొద వున్నచోటనేనా?'

ధనసింగ్ అవునని తల తిప్పాడు.

'ఆ అమ్మాయి ఏదైనా కష్టంలో వుందో, లేకపోతే పిచ్చి ఎక్కిందో అని అనిపిస్తోంది. ఎప్పుడూ రోడ్డుపక్కన కనిపిస్తుంది. మోటార్లలోకి తొంగిచూస్తూ వుంటుంది. ఏడుస్తున్నట్లుగా, ఏదో పోగొట్టుకున్నట్లుగా కనిపిస్తుంది. తమ్ముడూ, పేరుమాత్రం చెప్పనుగాని ఆమెను ఎత్తుకొద్దామని ఆలోచించే దుర్మార్గులుగూడా వున్నారు. ఆమెను మండీ తీసుకుపెడదామా, ధర్మశాల తీసుకువెడదామా అని వాళ్లు ఆలోచిస్తున్నారు. అది చెడ్డపని. నా కొడుకులు, దుర్మార్గులు. నాలుగురోజులు ఆమెతో ఆడతారు, ఆ తరువాత మళ్లీ అమ్మేస్తారు. నీదగ్గర దాచడం దేనికి, నా కొడుకు, ఆ బిహారీ, అఫ్‌జల్ ఈ పన్నాగం పన్నుతున్నారు. ఇందుకే బిహారీ తన డ్యూటీని సామానుల లారీమీద వేయించుకునే ఆలోచనలో వున్నాడు. నా పేరు మాత్రం చెప్పద్దు. అంతే నీకు చెప్పాను. ఎందుకంటే ఏదో ఒక ఏర్పాటు చేసుకుంటావని' అని బాబూలాల్ తెలియజెప్పాడు.

బాబూలాల్ చెప్పినమాటలు విన్నదగ్గరనుంచి ధనసింగ్ సరిగా మోటరు నడపలేకపోయాడు. ఎలాగో అలా ధర్మశాల చేరాడు. బండిని బసవద్ద వదిలేసి కంపెనీ ఆఫీసులోకి వెళ్ళాడు. నాలుగురోజుల శెలవుకోసం దరఖాస్తు ఇచ్చాడు. ధనసింగ్ కాస్సేపు ఈ కాలిమీద, కాస్సేపు ఆ కాలిమీద బరువువుంచి నిలబడి ఒక గంటసేపటివరకు నిరీక్షిస్తూనే వున్నాడు కాని మేనేజరు అతనివైపు చూడనేలేదు. చివరకు ధనసింగ్ అన్నాడు—'అయ్యా, శెలవు కావాలండీ!'

'ఎందుకు?' మేనేజర్ ధనసింగ్ ఇచ్చిన కాగితాలమీద దృష్టిసారించి అడిగాడు.

'రేపు ఉదయం వూరు వెళ్ళాలండీ, అవసరమైన పని వుంది.'

'ఉద్యోగం అనుకున్నావా లేకపోతే తమాషా అనుకున్నావా?' మేనేజరు ధనసింగ్‌వైపు చూశాడు, 'ఇవ్వాళ సాయంత్రంవచ్చి రేపుపొద్దున శెలవుకావాలని ఆజ్ఞాపిస్తున్నారు, దొరగారు. నీపని అవసరమైనది. అయితే కంపెనీపని అవసరమైనది కాదా? అయ్యాగారూ. ఇక్కడ ....లో వందరూపాయలు కొట్టుకుపోతాయి. నోటీసు ఇచ్చావు శెలవుకి, ఈవిషయం ముందే తెలీదా?'

'అయ్యా ఏం తెలుస్తుందండీ. ఇంటిదగ్గరనుంచి ఇలాంటివార్త వస్తుందని' ధనసింగ్ బ్రతిమాలాడు.

'ఇటువంటి శెలవు కావాలంటే నీకు బదులుగా పనిచేసేవాళ్లు ఎవరన్నా వుంటే చెప్పు' మేనేజరు మళ్ళీ పనిలో నిమగ్నమయాడు.

'అయ్యా నేను ఎక్కడినుంచి ఎవరిని తీసుకురాగలను! ఇప్పుడే పఠాన్ కోటనుంచి రాగానే ఇంటిదగ్గర జ్వరంగావుందని తెలిసింది. ఎవరికి ఏం తెలుస్తుంది చెప్పండి ఇలా జ్వరంవచ్చి పడుతుందని.'

'విసిగించకుబాబూ. ఒకసారి చెప్పానుగా. చూడటంలా, కుల్లూ వెళ్లాల్సిన ఏభై బళ్ళ లెక్క పడుంది. నీపనే ముఖ్యమైపోయింది. నువు పెట్టే రొట్టెముక్కలే తింటున్నాం. ముఖ్యమైన పనులున్న పెద్దదొరగారు వచ్చాడు.' మేనేజరు మళ్లీ ధనసింగ్‌వైపు చూడలేదు. ధనసింగ్ ఒక అరనిముషం నుంచున్నాడు. తర్వాత పళ్ళునూరుతూ బయటకు వచ్చేశాడు. దగ్గరలోవున్న దుకాణందగ్గర మోహసిన్

ఖాన్ తలపాగాచుట్టుకుని గాజుగ్లాసు పట్టుకుని టీ చప్పరిస్తూ శమ్సుల్‌తో మాట్లాడు తున్నాడు. ధనసింగ్ బాధగా ఫిర్యాదు చేశాడు—'ఏమండీ ఖాన్‌గారూ. ఎవరి ఇంట్లోనన్నా జ్వరమొస్తే శలవు దొరకదా?'

'ఏం జరిగింది?' మొహసిన్ అడిగాడు.

ధనసింగ్ మేనేజరుతో జరిగినమాటలు, మేనేజరు జామీనుగురించి వత్తిడి చేయటంగురించి చెప్పాడు. శమ్సుల్ వేళాకోళం చేశాడు—'ఇప్పుడసలు నీ ఇంటావిడ ఎక్కడుంది? ఇంట్లో జ్వరం రావడానికి.'

మోహసిన్‌ఖాన్ మిగతావాళ్ళకి వినపడేలా సమాధానం చెప్పాడు—'నీ అమ్మ. ఇంటిది లేకపోతే మటుకేం. ఇతని ఇల్లువుంది. అక్క....చివరికి ఇతనే ఆకాశంనుంచి ఊడిపడ్డాడా. మనిషి ఎక్కడ పుడతాడో అదే అతని ఇల్లు అవు తుంది' అని ధనసింగ్‌వైపు చూశాడు—'ఏరా. వంకపెడుతున్నావా లేకపోతే నీ అమ్మ....నిజమైన మాటేనా? అబ్బాయి నీమీద ఎందుకో అనుమానం వస్తోంది. ఆ రోజు లాకీ యూనివర్సల్ జాయింటు విరక్కొట్టి తెచ్చావురా. కంపెనీవాళ్ళ.... ....లో వందంబాతిక రూపాయలు నష్టంచేశావు. ఇవ్వాళ జామీనులేకుండా శెలవు కావాలంటావు. నా కొడకా. ఒకటే దుర్మారం' మోహసిన్ ఆత్మీయతతో నవ్వాడు.

'ఖాన్‌గారూ, ఇది వేరే గత్యంతరం లేనిది. ఇందులో ఎవరుమటుకూ ఏం చేయగలరు?' ధనసింగ్ చాలా అణకువగా సమాధానం చెప్పాడు.

'కాని తమ్ముడూ, నీకు బదులుగా పనిచేసేవాళ్ళు కావాలి........కంపెనీ నాయాళ్ళు మనిషిలేకుండా మోటరువాళ్ళ....తో నడిపిస్తారా? ఈ నాకొడుకులు. కంపెనీవాళ్ళు స్పేయర్‌గూడా వుంచరు' మోహసిన్ అన్నాడు.

'స్పేయర్ అయితే వున్నాడు' శమ్సుల్ మధ్యలో చెప్పాడు.

'అయితే ఎవరికిబదులుగా పని చేస్తున్నాడు? ఎవడున్నాడు శెలవుమీద?'

ఉస్తాద్ తన మీసాలను తిప్పుకుంటూ 'మాకు బదులుగా' అన్నాడు.

'నువ్వు శెలవుమీద వెడుతున్నావా? నీకే పనుంది?' మోహసిన్ అడిగాడు.

'ఉస్తాద్, ఒక పనుంది. చాలా ముఖ్యమైన పని' శమ్సుల్ కనురెప్ప లాడించాడు.

మోహసిన్ ఖాళీచేసిన టీ గ్లాసును బల్లమీద పెట్టి, తలపాగా చివరి అంచుతో మీసాలు తుడుచుకుంటూ అడిగాడు, 'ఇంతకీ మేం తెలుసుకోవచ్చా ఏం ముఖ్యమైన పనో?'

'ఉస్తాద్, ఆరోగ్యం కొంచెం చికాకుగా వుంది' శమ్‌సుల్ చిరునవ్వు నవ్వాడు. శమ్‌సుల్ వెనుక హర్‌నామ్ నవ్వి 'ఉస్తాద్. నేను చెప్పనా వీడికేం పనుందో।' అన్నాడు.

శమ్‌సుల్ ఆపేశాడు, 'నాయాలా నోరు మూసుకో, నీకేం తెలుసు? నాకు ప్రైవేటు పనుండి. ఉస్తాద్ వీడు అబద్ధం చెప్తాడు. వీడికి తెలీదు.'

మొహసిన్ హర్‌నామ్‌వైపు చూశాడు.

'ఉస్తాద్ వీడు బటాలేలోవుండే మీరన్ వేశ్యదగ్గరకు వెడుతున్నాడు. ఇవ్వాళ మండీనుంచి దేసీ సారాసీసా తీసుకొచ్చాడు.' హర్‌నామ్ రహస్యాన్ని బయటపెట్టాడు.

శమ్‌సుల్ అత్యాచారాన్ని తిరస్కరిస్తున్నట్లుగా బిగ్గరగా కేకేశాడు—'ఒట్టు ఉస్తాద్, వీడు అబద్ధం చెపుతున్నాడు. వీడికేం తెలీదు.'

మోహసిన్ ఒక్క ఊపులో నాలుగైదుతిట్లు గట్టిగా తిట్టాడు. 'నీ అమ్మ .... నీతండబ్బు చాలా పోగైంది. దుర్మార్గుడు, వేశ్యలదగ్గర కెడతాడు. అరే హర్‌నామ్, నాయాల సీసాని లాక్కువి తీసుకురారా। వేశ్యకి తాగిస్తావా। దానమ్మ.... వాళ్లేమో నాయాళ్ళు నిన్నే తాగేస్తారు. ఒక స్నేహితునికి సహాయం చేయవు, నీ సంపాదన వేశ్యలకి ఇస్తావా। సుఖరోగం అంటుకుంటుంది, తర్వాత ఆ అక్క....చేతూకి మల్లే చేత్తోపట్టుకుని తిరగాలి।'

శమ్‌సుల్ చేతులు నలుపుకుంటూ వుండిపోయాడు. మోహసిన్‌ఖాన్ సైగ చేసినమీదట హర్‌నామ్, జవాహర్‌లు సీసాని బయటకు తీశారు.

మొహసిన్ ధనసింగ్‌ని ఓదార్చాడు—'అబ్బాయి, బాధపడకు. ఆ నా కొడుకు మేనేజరుతో చెప్పు, మోహసిన్‌ఖాన్ పనిచేస్తాడని. ఈ నాయాల శమ్‌సుల్ చేస్తాడు, ఒకట్రిప్పు మేం వేస్తాం, ఎల్లుండి బ్లాకికి రెస్టు, అందుచేత ఎల్లుండి నీపని అతను చేస్తాడు. మంచివాడివిగాని ఎవరిసహాయంలేని ఈ రోజుల్లో నువుమాత్రం ఎక్కడా

వారాలతరబడి చేయద్దు, అలా చేశావంటే మియాఁ కుందన్‌సింగ్‌తో చెప్పి నీ చెవి కోయిస్తాను తెలిసిందా!'

ధనసింగ్ రాత్రంతా బాగా ఆలోచించి తన పథకం తయారుచేసుకున్నాడు - పోస్టాఫీసులో అతనికి డెబ్బై రూపాయలున్నాయి. కాని రాత్రిపూట అవి తీసుకోవడం కుదరదు. అతను ఒకళ్లదగ్గర రెండు, ఇంకొకళ్ళదగ్గర అయిదు చొప్పున ఇరవై రూపాయలు డ్రైవర్లనుంచి అప్పు తీసుకున్నాడు. అంతాకలిపి నలభై రూపాయలు చేశాడు. మర్నాడు ఉదయమే వైజ్‌నాథ్ వెళ్ళే ఇంకొక కంపెనీవాళ్ళ బస్సులో ప్రయాణం అయాడు. ఈ బండి తర్వాత అతను పనిచేసే కంపెనీవాళ్ల బండి పఠాన్‌కోటనుంచి కుల్లూ సరాసరి వెళ్ళేబండి వెడుతుంది. అతను ఆలోచిస్తూ వెడుతున్నాడు. బస్సులువెళ్లే వేళప్పుడు సోమా రోడ్డుమీదకువస్తుంది. అతను కొంచం ముందుగానే చేరుతాడు. ఆమెను కలుసుకుంటాడు. ఒకవేళ ఆమె తనతో రావడానికి ఒప్పుకోకపోతే - 'నువ్వే నాప్రాణం. ఇప్పుడు చావడం బతకడం నీతోకలిసే' అని ఒట్టేసుకుని చెపుతాడు.

ధనసింగ్ ఎక్కిన బస్సు ఇంజను సరిగాలేదు. అందుచేత బండి వైజ్‌నాథ్ అరగంట ఆలస్యంగా చేరింది. అతను వెంటనే కాలినడకని పాల్‌టావైపు బయల్దేరాడు. చాలా తొందరగా నడుస్తున్నాడు. ఆ ప్రాంతంలో రోడ్డు ఇరుకుగా వుండటంవలన బస్సులు ఒకసమయంలో ఒకవేపే వెడతాయి. మొదట మండీనుంచి వైజ్‌నాథ్‌వైపు, తరువాత వైజ్‌నాథ్ నుంచి మండీవైపువెళ్ళే బస్సులు వస్తున్నాయి. దారి పర్వతాలపక్కనవున్న ప్రాంతాలపక్కనుంచి తిరుగుతూ వెడుతుంది. అందుచేత ఏ ప్రాంతంలోనైనాసరే కళ్ళు దారిమీద కేవలం కొన్ని అడుగులవరకే చూడగలుగుతాయి. మరికొన్ని చోట్లనుంచిచూస్తే దారి కొన్ని మైళ్ళవరకూ నిర్లక్ష్యంగా పడేసిన తాడులా కనిపిస్తుంది.

ఎదుటినుంచి బస్సు వస్తోంది. ధనసింగ్ దుమ్మునుంచి, ఎరుగున్నవాళ్ళ కళ్ళనుంచి తప్పించుకోవడానికి పొలాల్లోకి దిగిపోయాడు. బస్సు దాటిపోయిన తర్వాత మళ్ళీ రోడ్డుమీదకు వచ్చాడు. రోడ్డు ఎక్కడంచేత అతనికి చెమట పడుతోంది. గంటన్నరనుంచి నడుస్తున్నాడు. ఇప్పుడు వైజ్‌నాథ్‌నుంచి పైవైపువెళ్ళే బస్సుల వేళ అవుతోంది. ఒకవేళ అతను ఎక్కిన బస్సు ఆలస్యంగా వచ్చివుండకపోయి

నల్లయితే ఈపాటికి మఘేరా చేరివుండేవాడు. మాటిమాటికీ కళ్ళదగ్గర చేయి పెట్టుకుని ఎత్తుమీద ఆ దిబ్బని గుర్తుపట్టడానికి ప్రయత్నం చేస్తున్నాడు. దిబ్బ కనిపించసాగింది. కాని ఆ ప్రాంతం ఇంకా రెండుమైళ్ళకన్నా తక్కువదూరంలో లేదు. రోడ్డు స్పష్టంగా కనిపిస్తోంది. సున్నంపూయబడివున్న రాళ్ళు ఎండలో మెరుస్తున్నాయి. వెనుకనుంచి వచ్చే బస్సుఇంజన్ల మోత వినిపించసాగింది. అతను ఇంకా తొందరగా నడవటం మొదలుపెట్టాడు. ఆయాసం వస్తోంది. నుదుటి నుంచి చమటకారి కాళ్ళు, చెప్పులు తడిసిపోవటం మొదలుపెట్టాయి.

వెనుకనుంచి పరుగెత్తుకు వచ్చేబస్సులు దగ్గరకు చేరుతున్నాయి. ఎదురుగా రోడ్డుమీద దిబ్బక్రింద అతనికి ఒకస్త్రీగూడా కనిపించింది. ఆ స్త్రీ కళ్ళను ఎండ నుంచి కాపాడుకోవటానికి చేతినీడను చేసుకుని ఆ వైపే బస్సులను చూస్తోంది. ఒకవేళ ఆమెకు అతనుగూడా కనిపిస్తూ వుండివుండచ్చు. అతను రావటం తెలుసుకుంటేమాత్రం గుర్తిస్తుంది కూడా. కేకేసి పిలుద్దామని ధనసింగ్ అనుకున్నాడు. కేక అంతదూరం వినపడదు. సమంజసం కాదుకూడా. ధనసింగ్ రొప్పుతున్నాడు. అతను ఇంకా తొందరగా నడవటం మొదలుపెట్టాడు. ఒక బస్సు దుమ్ము లేపుతూ పక్కనుంచి దాటిపోయింది. బస్సు బస్సుగావుంది. మనిషి మనిషిగా. బస్సు ఇనుముతో చేసిన శ్వాసకోశాలతో గాస్ పీలుస్తుంది. రక్తమాంసాల శ్వాసకోశాలతో గాలిపీల్చేమనిషి దానితో పోటీ ఎలాచేయగలడు? కొంచెం తేడాగా మిగతా బస్సులు వచ్చాయి. ధనసింగ్ బలహీనతమీద దుమ్ముకొడుతూ అతన్ని వెనకాల వదిలేసి వెళ్ళిపోయాయి. అతను ఎప్పుడూ బస్సుగాని, లారీగాని నడుపుతూ వెడుతూ - వస్తూ వుండేవాడు. కాలినడకన వెళ్ళేవాళ్ళమీద ఇలాగే దుమ్ము రేపుతూ వుండేవాడు. దారి తన అసలైన సామర్థ్యాన్ని మరచిపోయి లోపలివైపుకు తిరిగింది. ఇప్పుడు ధనసింగ్‌కు దిబ్బ కన్పించటంలేదు. అతని హృదయం అనుమానంతో దక్ - ధక్ మంటోంది. బస్సులు దాటి వెళ్ళిపోగానే సోమా వెనక్కితిరిగి వెళ్ళిపోదు కదా! ఇంటికి వెళ్ళిపోతే అక్కడికి ఎలా వెళ్ళగలడు?

ధనసింగ్ పక్కదారినుంచి పైరోడ్డుమీదకు వచ్చేసరికి బస్సులు దిబ్బదాటి చాలాదూరం ముందుకు వెళ్ళిపోయాయి. రోడ్డుమీదలేచిన దుమ్ముతెరకూడా గాలి ఊపులవలన చెల్లాచెదరైపోయి స్థిరంగావుంది. సోమా ఇప్పుడు అక్కడలేదు.

కొండచాటున వుండటం చేత సోమా ఏవైపు వెళ్ళిందీకూడా ధనసింగ్ తెలుసుకో లేకపోయాడు. ఇప్పుడు ఇక తొందరగా నడవటం అనవసరం. ధనసింగ్ నడక వేగం తగ్గిపోయింది. తొందరగా నడవటంచేత అతనికి దాహంకూడా వేస్తూంది. అడుగులో అడుగేసుకుంటూ నడుస్తూ ఆలోచించడం మొదలెట్టాడు. సోమా మళ్ళీ రోడ్డుమీదకు వచ్చేంతవరకూగాని, నీళ్ళకోసరం బావిదగ్గరకు వచ్చేంతవరకూగాని ఎక్కడ వెతకగలడు? బావిదగ్గరకు వెళ్ళి నీళ్ళుతాగటం, రోడ్డుమీద చెట్టుక్రింద నిలబడి ఎదురుచూడటం – ఇదే చేయగలడు.

ధనసింగ్ బావిదగ్గరకు చేరేసరికి 'ధవ్ - ధవ్, - ధవ్ - ధవ్' మన్న చప్పుడు బావిగట్టుమీద నుంచి వినపడింది. ఎవరో స్త్రీ బండతో బాదుతూ బట్టలు వుతుకుతోందని అనుకున్నాడు. తనరాకని తెలియపరచడంకోసం మెల్లిగా దగ్గాడు. తర్వాత తలఎత్తి చూశాడు. వయసులోవున్న ఒకస్త్రీ తన శరీరాన్ని మురికి అనే బట్టతో కప్పుకుని ఒక భుజంమీద తలపెట్టుకుని, విచారంగా నెమ్మదిగా తడిసిన మురికిబట్టలను బాదుతోంది. రెండవచేతి దోసిలితో నీళ్ళు చల్లుతోంది. ఆమె జుత్తు చిక్కులుపడి చింపిరిగావుంది. వంగివున్న ముఖం కన్పించటంలేదు.

ఆమెకు ధనసింగ్ దగ్గు, చెప్పుల చప్పుడు వినపడలేదు. ఆమెను ఈ స్థితిలో చూసి ధనసింగ్ సిగ్గుపడ్డాడు. మళ్ళీ గట్టిగా దగ్గి వంటిమీద బట్ట సరిచేసుకో మన్నట్లు ఆమెకు సూచన ఇచ్చాడు. బండతో బట్టలు బాదేశబ్దంవలన ఆమెకు ఈ హెచ్చరికగూడా వినిపించలేదు. మళ్ళీ దగ్గబోయాడు కాని సోమా కాదుగదా అని అతనికి అనిపించింది. భుజాలు, ఆకారం, చూస్తే సోమా అనే అనిపిస్తోంది. ధనసింగ్ ఎంతో ఉత్సాహాన్ని పొందాడు. అతని అడుగులు భూమిమీద వేగంగా శబ్దం చేశాయి.

సోమా వెంటనే త్రుళ్ళిపడింది. ఆమె కళ్ళు వస్తున్న వ్యక్తివైపు తిరిగాయి. ఒక్కక్షణం భయపడింది. తర్వాత అతన్ని గుర్తించగానే ముఖం గులాబీపువ్వులా వికసించింది. కళ్ళు తడి అయాయి. తనపైబట్టలో పూర్తిగా ముడుచుకుపోయింది. సిగ్గువలన తలను మోకాళ్ళమధ్య దాచేసుకుంది.

ధనసింగ్ ఒక్కవురుకులో బావిగట్టునుంచి నీళ్ళతొట్టె దగ్గరకిచేరాడు. సోమా చింపిరి జుత్తుమీద చేయివేసి విందుగా 'సోమా' అని పిలిచాడు.

'ఏమండీ, బట్టలుకట్టుకునిలేను. అయ్యో, ఇంకెవరన్నా వస్తారు' అన్నది.

ధనసింగ్ బట్టలవైపుచూసి తెలుసు కున్నాడు - కుప్పగా తడిసివున్న మురికి బట్టలు ఒక కడవలో పడేసివున్నాయి. రెండుమూడు బట్టలు సోమాచేతిలో వున్న బండిదెబ్బలు తింటున్నాయి. ఎండలో ఆరేద్దామని ఆమె మొదట తను కట్టుకోవలసిన బట్టలు వుతుకుతోంది. మిగతా బట్టలు వుతికేసరికి ఎండేసిన బట్టలు ఎండిపోతాయి.

'అయితే కట్టుకో తొందరగా' ధనసింగ్ అన్నాడు.

'ఇవయితే వుతికేశాను. ఎండలో ఆరేస్తాను. కొద్దిగా ఎండగానే కట్టు కుంటాను.' ఆమె తనలోనే ముడుచుకుపోయింది. తాబేలులాగా మెడ కొంచం పైకెత్తి 'ఏమండీ నేను మీకోసం చాలా రోజులనుంచి ఎదురుచూస్తున్నాను' అన్నది.

'నే నొచ్చేశాముగా'

'ఏమండీ మీరు చాలామంచివారండీ! మీరు కొంచం చాటుకి వెడితే నేను ఈ బట్టలు ఎండటానికి ఆరేస్తాను.' ధనసింగ్ గట్టిగా గాలిపీల్చి మజానూ చెట్ల వైపు వెళ్ళాడు. సోమా తడిసిన తన బట్టలవి ఎండపడుతున్న బావిగట్టుమీద పరి చింది. మిగిలిన బట్టలవి వుతకడం మానేసి బావిగట్టుచాటున ముడుచుకుని కూర్చుంది.

ధనసింగ్ బావిదగ్గరికి తిరిగివచ్చి సోమాకి కొంచం దూరంగావున్న నీటి తొట్టెదగ్గర కూర్చుని దోసిలితో నీళ్ళు తాగాడు. 'నిన్ను తీసుకువెళ్ళడానికి వచ్చాను' అన్నాడు నెమ్మదిగా.

సోమా తలవంచుకుని తొట్టెలోని నీళ్లవైపు చూస్తూ చెప్పింది - 'ఏమండీ, మా మామగారు నన్ను అమ్మడానికి మండీ తీసుకు వెడదామనుకుంటున్నారు. మన్నూసాహెబ్ని అడిగి ఆయన సలహాతీసుకున్నారు.' ఆమె కళ్ళలో నీళ్లు పొంగి వచ్చాయి. 'అందుకనే మీకోసం ఎదురుచూస్తూ రోజులు గడుపుతున్నాను' అంది.

ధనసింగ్ ఆశ్చర్యంగా సోమావైపు చూస్తూ వుండిపోయాడు. క్షణం

ఆలోచించి అన్నాడు. 'ఈ తచ్చినబట్టలని ఒడిలిపెట్టేసెయ్. నీ బట్టలు కొంచం ఆరగానే తొందరగా కట్టుకుని బయలుదేరు. వెడదాం. పొలాల్లోని దిగుడు దారి గుండా నడచి వెడదాం. రోడ్డుమీద వాళ్లు నిన్ను ఎరుగుంది మరవచ్చు. పాల్‌టా దాటినతర్వాత బస్సు ఎక్కుదాం.'

సోమా పైబట్టకొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. చిక్కుపడిన జుత్తుతో చెరిగిపోయిన ఆమె తలవెక్కిళ్ళవలన కదులుతోంది.

'సోమా, నేను నిన్ను తీసుకువెడతాను. నీకోసం ప్రాణాలిస్తాను గాని నిన్ను ఈ కసాయివాళ్ల చేతులలో ఇక వుండనివ్వను.' అని ధనసింగ్ బాధగా అన్నాడు.

సోమా ఏమీ చెప్పలేకపోయింది. అలానే ఏడుస్తోంది. ధనసింగ్ మళ్ళీ చెప్పాడు 'ఇకలే, అవకాశం పోగొట్టుకోకు. పద. మూడవఝామున మండీనుంచి తిరిగివచ్చే బస్సుని దేన్నైనా పాల్‌టాదగ్గర ఆపి ఎక్కుదాము'.

'ఏమండీ నేను మీతోరాకపోతే ఎక్కడికెడతాను?' సోమా అసహాయురాలై చెప్పింది.

'లేకపోతే ఇంకొకరిచేతికి అమ్ముడు పోతావా!' నాతోనే రా! గుండె వేగంగాకొట్టుకుంటూ వుండటంచేత ధనసింగ్‌గొంతు వణుకుతోంది.

సోమా లేచినిలబడింది. బావిగట్టుమీద ఆరేసిన తనబట్టలు తీసుకుని మజానూ చెట్లగుబురులోకి వెళ్ళింది. రెండునిముషాలలో తడిసి బరువుగావున్న బట్టలు కట్టుకుని వచ్చేసింది. వాళ్ళిద్దరూ బావినీళ్ళతో ప్రవహించే కాలువ ఒడ్డునుంచీ దిగుడు వైపు దిగి వెళ్ళారు.

ధనసింగ్‌కు ఆదారితో పరిచయంలేదు. సోమా కొంగుతో కళ్లు తుడుచుకుంటూ దోవచూపిస్తూ ముందు నడుస్తోంది. ఎండ, గాలివలన ఆమె బట్టలు ఎండిపోయాయి. పాల్‌టానించి అరఫర్లాంగు ముందుకువెళ్ళి వాళ్లురోడ్డుమీదకు వచ్చారు. రోడ్డుమీదనుంచికాకుండా ఎత్తు - పల్లాలమీదకు తొందరగా ఎక్కడం చేత ఇద్దరూ అలసిపోయారు. ఆదేసమయంలో మండీవైపునుంచి వెళ్ళేబస్సుల మోత వినిపించింది. ఆ స్థలంలో రోడ్డు ఒక దిబ్బచుట్టూ తిరిగింది. అందుచేత వెనుక

మంచివచ్చే బస్సులు కనిపించడంలేదు. రోడ్డుమీద దిబ్బపీడ పడుతోంది. అక్కడే వాళ్లు ఆయాసం తీర్చుకోవడానికి ఆగారు. ధనసింగ్ సోమాముఖంమీద పట్టిన చమటను, ఆమె ఆయాసాన్ని చూసి 'బస్సు ఎక్కుదాము' అన్నాడు. అతను ఆలోచించిందికూడా ఏమిటంటే బస్సు ఎక్కకుండా నడిచి వెళ్ళేటట్లయితే చీకటి పడకముందు ఏవిధంగానూ వైట్‌నాడ్ చేరలేరు.

మొదటి బస్సుదగ్గరకురాగానే ధనసింగ్ దారిన నడిచే బాటసారిలా చేయెత్తి బస్సు ఆపేందుకు సౌంజ్ఞచేశాడు. ఆ బస్సు అతను పనిచేసే కంపెనీదే. ధనసింగ్ భయపడ్డాడు. కాని అతను చేయి ఎత్తేశాడు. బస్సు ఆగుతోంది. అతను ముందున్న అద్దంలోంచి డ్రైవరును గుర్తుపట్టడానికి ప్రయత్నం చేశాడు. కానీ రోడ్డుకు ఎడమవైపున వుండటంచేత, ప్రయాణీకుల చాటునవున్న డ్రైవర్ని చూడలేక పోయాడు. బస్సు కొద్దిదూరం వెళ్ళింది. అతను బస్సువైపుకు కదలగానే మియా కుందన్‌సింగ్ బస్సునుంచి దిగి తనవైపు రావటం చూశాడు.

ధనసింగ్ భయపడి 'మియాగారూ, మా ఇద్దరికి చోటుకావాలి' అన్నాడు.

మియా ధనసింగ్‌వైపు కోపంగాచూసి తిరుతూ, 'ఈ అమ్మాయి ఎవరు?' అని అడిగాడు.

ధనసింగ్ సమాధానంగా 'మియాగారూ నాకు వదినవుతుంది. ఈమెను వెంట బెట్టుకుని ఇంటి కెడుతున్నాను' అన్నాడు.

కుందన్‌సింగ్ కొంచం గట్టిగా అన్నాడు-'నీ అమ్మది....మమ్మల్ని మోసం చేస్తావా, అక్క....దీనికోసం ఇంటిదగ్గర జ్వరంగావుందని వంకపెట్టి శెలవు తీసుకున్నావు. ఇంకొకడేమో నీకు జామీను ఇచ్చిచావాలా? నువ్వు ఈ అమ్మాయితో కులుకుతూ తిరుగుతావా, దుర్మార్గపు పురుగా!'

'ఉస్తాద్....' ధనసింగ్ తన నిర్దోషిత్వాన్ని తెలియపరుద్దామనుకున్నాడు. కాని కుందన్‌సింగ్ గట్టిగా అరిచాడు. 'నోరుమూసుకో, నీ అమ్మ....నీ బాబుకు నేర్పుతావురా! ఏ బస్సులోనన్నా కాలుపెట్టావా జాగ్రత్త! నా కొడకా, కాళ్ళు విరక్కొడతా. మిగతా డ్రైవర్లని చిక్కుల్లో పడేస్తావా! నడిచివెళ్ళు. ఈ అమ్మని తీసుకెళ్ళి దాని ఇంటిదగ్గర విడిచిపెట్టి రా.'

రెండుబస్సులు ఒకదానివెనుక ఒకటిగా వస్తున్నాయి. బస్సులవేగం తగ్గటం చూసి కుందన్‌సింగ్ వాళ్ళని వెళ్ళిపొమ్మని సౌంజ్ఞ చేశాడు. ధనసింగ్ చెప్పేదేమీ వినకుండా తన బస్సువైపు వెళ్ళిపోయాడు. ఇంకా చాలాబస్సులు వచ్చాయి, వెళ్ళిపోయాయి. చేయెత్తి బస్సులను ఆపడానికి ధనసింగ్‌కు ధైర్యం చాలలేదు. అతని హృదయం బాధతో నిండిపోయింది. చివరికి సోమాతో అన్నాడు-'ఇక్కడ బస్సులలో చోటు దొరకదు. వైజ్‌నార్ వెళ్ళి బస్సెక్కుదాం.'

సోమా మౌనంగా ధనసింగ్‌కు ఒక అడుగు వెనకగా కలిసి నడుస్తోంది.

ధనసింగ్, సోమా రోడ్డుమీద అయిదుమైళ్ళు నడిచి వెళ్ళిపోయారు. సూర్యుడు పడమరవైపున కొండలవెనుకకు జారిపోయాడు. వెంటనే చీకటి దట్టమైంది. చల్లగాలి వేగంగా వీచటం మొదలైంది. నడవటంచేత ఇద్దరికీ చమట పడుతోంది. చమటతో తడసినబట్టలలోకి గాలి పోవటంచేత వణుకు బయలుదేరుతోంది. చీకటి పడటంచేత ధనసింగ్‌కు అనుమానంగానీ భయంగానీ లేవు. కంకర రాళ్ళతో వేసిన రోడ్డుమీద ఇంతదూరంనుంచి చెప్పులేమి వేసుకోనికాళ్ళతో, మెదలకుండా నడిచివచ్చే సోమానిగురించి అతనిమనసు కరిగిపోతోంది. బాధపడకుండా వుండటానికి, అలసటగురించి ఆలోచించకుండా వుండటానికి మాటిమాటికి ఆమెకు ధైర్యం చెపుతున్నాడు. తన మామగారు, మన్సూసాహెబు పన్నిన పన్నాగంగురించి సోమా ఆయాసంతో రొప్పుతూ సవిస్తరంగా చెప్పింది. కళ్ళు తుడుచుకుని ధనసింగ్‌తో అన్నది-'మీరు చాలా మంచివారండి, నాకు మీరే ఆధారం. కావాలంటే చంపండి. కావాలంటే బ్రతికించండి.'

ధనసింగ్ ధర్మశాల, కుల్లూ, పఠాన్‌కోటలలో ఇంగ్లీషువాళ్ళని, పెద్దపెద్ద వాళ్ళని, తమ భార్యలచేతులు పట్టుకుని, చేతిలో చెయ్యేసుకుని కలిసి వెడుతుండగా కూడా చూశాడు. ఇదిచూసి అతనిహృదయంలో చక్కిలిగిలి పెట్టినట్లయేది. అతను మిగతా డ్రైవర్లతోకలిసి ఆదృశ్యంగురించి అసభ్యకరమైన వేళాకోళంచేస్తూ కేకలు వేసేవాడు. చప్పట్లు చరిచేవాడు. కాని ఇప్పుడు సానుభూతి, కర్తవ్యంల తలంపువలన సోమాకు అదేప్రకారంగా చేతినిఇచ్చి సాయం చేయడానికి ప్రయత్నం చేశాడు. అలా చేయటంవల్ల సోమా సిగ్గుతో ముడుచుకుపోయి 'ఏమండీ ఇలా చేయకండి, మీరు చాలా మంచివారండి' అంది.

ధనసింగ్ ఆమెను బుజ్జగించి 'మంచిదానివే। ఇందులో భయమేముంది? ఎవరు చూస్తారు? నువ్వు అలసిపోయావు. కొంచం సాయం తీసుకో' అని నచ్చ జెప్పాడు. కాని సోమా అందుకు ఒప్పుకోలేదు. ఆమెకు ఈవిధంగా నడుస్తుంటే అలస్యమవుతోంది. సిగ్గుతోనిండిన తన కళ్ళని చీకటిలో ధనసింగ్‌వైపు తిప్పి. ముడుచుకుపోతూ 'వద్దండి' అన్నది. కొంచం ఎడంగా జరిగి తొందర తొందరగా అడుగులేస్తూ ధనసింగ్‌తో సమానంగా నడవసాగింది.

వైజ్‌నాధ్ 'పున' 'బినియా'ల దిగువ కొండగుట్టలమీదవుంది. అక్కడ ఎత్తుగా వ్యాపించిన సారవంతమైనభూమివుంది. 'పున' దిగుడువంతెనలమీదనుంచి పైకి బస్సుమార్గం వంకరటింకరులుగా తిరుగుతూ వెడుతుంది. కాని కాలినడకన వెళ్ళేబాటసారులు రాళ్ళతోకట్టిన మెట్లమీద ఎక్కి వెడతారు. ధనసింగ్, సోమా రొప్పుతూ మెట్లమీద ఎక్కుతున్నారు. చీకటి, నిర్మానుష్యత, చల్లగాలులను చీలుస్తూ వైజ్‌నాధ్ పోలీసుస్టేషను గడియారం గంటలుకొట్టే శబ్దం వినిపించింది. ఏడుగంటలయింది. దూరంనుంచి తొందరతొందరగా నడిచిరావడంచేత, ఎత్తైన మెట్లు ఎక్కడంచేత సోమా, ధనసింగ్, ఇద్దరూగూడా బాగా అలసిపోయారు. తీవ్రమైన చలిగాలిలోకూడా వాళ్ళనుదుటినుంచి చమటకారి ప్రవహిస్తోంది. ధన సింగ్ తన అలసటకన్నా ఎక్కువగా సోమాగురించి ఆలోచించి 'ఒక్కక్షణంసేపు కూర్చో' అన్నాడు.

దూరంగా క్రింద తెల్లటిరాళ్ళతోనిండి, వర్షంలో ప్రవహించడంకోసం వెడల్పైన కొండరాతిమీద సిగ్గుపడి, ముడుచుకుపోయిన 'పున' కలకలమని శబ్దం చేస్తూ ప్రవహిస్తూంది. ఎత్తుమీద పక్కపక్కల చీడ్ అడవులతో నిండిన కొండల నుంచి సరసరమంటూ గాలి వీస్తోంది. ఎత్తైన ఆ మెట్లమీద ధనసింగ్, సోమా కూడా సిగ్గుపడి ముడుచుకుపోయి ఒకళ్ళనొకళ్ళు అంటిపెట్టుకుని కూర్చునివున్నారు. ధనసింగ్‌పక్కన, అతని స్పర్శవలన సోమా ఇంకా సిగ్గుపడుతూనేవుంది. ఇప్పుడు అతనొక్కడే తనకి ఆధారమనికూడా ఆమెకుతెలుసు. కుందన్‌సింగ్ కఠినమైన చివాట్లు ధనసింగ్‌మనసుని బాధపెడుతున్నాయి. కాని సోమాని సమీ పంలో పొంది ఒకవిధమైన సాఫల్యాన్ని పొందుతున్నాడు. తన ఈ సాఫల్యం. నిండుతనంకోసం అతనేదైనా సరే చేయడానికి సిద్ధంగా వున్నాడు.

'నేనొకటి చెపుతాను విను!' ధనసింగ్ సోమాతో అన్నాడు. సోమా వంగి తలతిప్పి వింటున్నానన్నట్లు హామీఇచ్చింది. 'ఈ దగ్గరలోనే ఒక బజారువుంది. తినడానికి ఏమైనా దొరుకుతాయి. నువ్వు బాగా అలిసిపోయావు. రాత్రికి ఇక్కడే సత్రంలో వుండిపోదాం. లేకపోతే ఏదైనా దుకాణంలో నాలుగుఅణాల అద్దె ఇచ్చి మంచాలు తీసుకుందాం. ఇది జాగ్రత్తగా విను—బజారులో మనుషులు మంచి వాళ్ళుకాదు. ఎవరన్నా అడిగితే మనిద్దరం భార్యా-భర్తలమని చెపుతాను. తెలిసిందా! నువ్వుగూడా అలాగేచెప్పాలి. తెలిసిందికదూ!'

సోమాకి ఈ మాటలవలన రోమాలు నిక్కబొడుచుకున్నాయి. కాని ఆమె తలాడించి ఒప్పుకుంది. ఇప్పుడు ఈ మాటలు చెడుగా అనిపించటంలేదుకూడా. ఆమె ఇంతకన్నా ఇంకేమి చెప్పగలదు.

'మనఇల్లు హమీర్‌పుర్ తహసీల్‌లో, బడ్‌సర్ పోలీసుస్టేషనుకు దగ్గరగా వుందని చెప్పాలి. మనం ఇక్కడ మండీకి చుట్టాలను చూడటానికి వెళ్ళామని, ఇక్కడనుంచి బస్సులో పాలంపూర్ వెళ్ళి ఇంటికి తిరిగి వెళతామనిచెప్పాలి.' ధనసింగ్ వివరించాడు. ఇద్దరూ బజారువైపు వెళ్ళారు.

బజారులో కొన్ని ఇళ్ళలోనుంచి అస్పష్టమైన కాంతి బయటకువస్తోంది. దుకాణాలు సుమారుగా అన్నీ మూసేసివున్నాయి. కొన్ని దుకాణాలలో మటుకూ లాంతరు, కిరసనాయిలుదీపం, ప్రమెదలు వెలుగుతున్నాయి. ధనసింగ్, సోమా ఎక్కువదూరం వెళ్ళలేకపోయారు. ఎందుకంటే రోడ్డుమీద పచార్లుచేసే, పొడవైన కోటు వేసుకున్న ఒకమనిషి ధనసింగ్‌ని ఆపి 'ఎవరునువ్వు? ఎక్కడికెడుతున్నావ్?' అని అడిగాడు.

అతను పోలీసుసిపాయి అని ధనసింగ్ తెలుసుకున్నాడు. ఆ సిపాయిని ఎప్పుడైనా రోడ్డు డ్యూటీమీద చూశాడాలేదా అనే విషయం తెలుసుకోవడానికి అతనిముఖం వైపొకసారి చూశాడు. గుర్తుపట్టలేకపోయేసరికి సంతోషంగా సమాధానమిచ్చాడు - 'బాటసారులం దొరా!'

'బాటసారి!' సిపాయి పరిశీలనగా దగ్గరలోవున్న దుకాణంనుంచి వచ్చే లాంతరువెలుగులో ధనసింగ్ ముఖంవైపు చూశాడు. 'ఎటువంటి బాటసారివి? ఈ వేళప్పుడు ఎక్కడనుంచి వస్తున్నావ్?'

'మండీనుంచి.'

'మండీనుంచా? పెద్దప్రయాణంచేశావ్ తమ్ముడూ! ఆవిడిని తీసుకెడు - తున్నావ్. ఏదైనా మూట - ముల్లె, పెట్టే - బేడా?'

'కానిస్టేబులుగారూ ఇలానే వచ్చేశాము. సామాను మాతోబాటువచ్చిన మనిషి చేతికిచ్చాము.' ధనసింగ్ ఆలోచించి చెప్పాడు. 'పక్కవూళ్ళో బంధువుల్ని కలుసుకోవటానికి బస్సుదిగాము.'

'అలాగా' సిపాయి అపనమ్మకంగా అడిగాడు 'ఈమె ఎవరు?'

సోమా ధనసింగ్‌చాటున నిలబడింది. కానిస్టేబులు ధనసింగ్ చెయ్యి పట్టుకుని ఒకపక్కకి తోసాడు. సోమామీద లాంతరువెలుగు పడినమీదట ఆమెను పరీక్షగా చూశాడు. కళ్ళమీద వెలుగుపడటంచేత సోమాముఖం పక్కకి తిప్పింది. నుదటిమీదనుంచి కొంగును క్రిందకు లాక్కుంది. సిపాయి ధనసింగ్‌ని మళ్ళీ ఒకసారి తలనుంచి కాళ్ళవరకు పరీక్షగా చూశాడు. అతనికోటు పైజమావైపు చూస్తూ ప్రశ్నరెట్టించాడు - 'నువ్వు పెద్ద జంటిల్‌మాన్‌లా వున్నావు. ఏం చేస్తుంటావు?'

'ధర్మశాలలో పని చేస్తుంటాను.'

'పని చేస్తుంటావా? ఏం పని తమ్ముడూ?'

'ఇదేనండి బాబూ. ఒక పంజాబీ బాబుదగ్గర సేవ చేస్తుంటాను.'

'ఈ మెవరు?'

'మా ఇంటిదండి.'

'ఇక్కడ రాత్రి ఎక్కడ గడుపుతావు? ఎవరైనా బంధువులు ఇక్కడ గూడా వున్నారా!'

'లేరండి. ఎక్కడైనా దుకాణంలోనో, సత్రంలోనో పడివుంటామండి అయ్యా.'

'అలా అయితే రా, మాతోబాటే రా. పోలీసుస్టేషనులో విశ్రాంతి తీసుకోవడానికి చోటు దొరుకుతుంది.'

'వద్దండి బాబూ!' ధనసింగ్ చేతులుజోడించి చెప్పాడు. 'అయ్యగారి దయ. ఇక్కడే ఎక్కడైనా పడుంటామండి. బీదవాళ్ళం.'

'బీదవాడివా, పోలీసుస్టేషనులోకి బీదవాళ్ళే వెడతారు. ధనవంతులెందుకు వెడతారు! పదండి ఇద్దరూ' సిపాయి చేత్తోపట్టుకున్న లాఠీతో ఆజ్ఞాపించాడు.

ధనసింగ్ పోలీసులశక్తితోనూ, వాళ్ళ ప్రవర్తనతోనూ బాగా పరిచయం వున్నవాడు. ఆ సంబంధంలోకి అతను ఎక్కువగా రాలేదు. కేవలం పుష్యమాసం నుంచే అతను బంగాళాదుంపలు చేరవేయడంలో ఈ రోడ్డుమీద లారీ నడుపుతున్నాడు. కాని పఠాన్‌కోట, కాంగడా, కుల్లూ, ధర్మశాల, హోషియార్‌పుర్‌ల లైనులమీద రెండున్నర సంవత్సరాలు డ్రైవరుగా పనిచేసి అతను పోలీసులతో పరిచితుడయ్యాడు. పిల్లి తనవశంలోకి వచ్చిన ఎలుకను ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు చంపేస్తుంది. ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు వదిలిపెడుతుంది. అలాగే పోలీసులు డ్రైవర్లతో ఆడుతూవుంటారు. చట్టం ఏమిటి? పోలీసుల ఇష్టం. వాళ్ళ ఆజ్ఞే చట్టం. పైకి చెప్పడానికి రాజ్యం ఇంగ్లీషువాళ్ళది కాని అసలురాజ్యం పోలీసులది.

హోషియార్‌పుర్ స్టాండుదగ్గర పోలీసు సిపాయిలకు ప్రతిడ్రైవరు ఒక రూపాయి నెలసరి ఇవ్వాల్సివుంది. ఇలాగే పఠాన్‌కోట, కాంగడా, ధర్మశాలలలో కూడా ఏర్పాటు వుంది. లేకపోతే ప్రతిదానికీ రసీదు కావాలి. కంపెనీవాళ్లు బస్సులకు, లారీలకు రసీదు తీసుకోవడానికి ఇష్టపడరు. కంపెనీవాళ్లుకూడా స్వయంగా పోలీసులకు పూజ చేస్తూవుంటారు. కాని అది బక్షీసుగా గాని, బహుమానంగా గాని పైకి చెపుతుంటారు. ప్రతిపనికీ డ్రైవరు నమస్కారం చేయాల్సివుంటుంది. కానిస్టేబులుకు నెలసరిగా డబ్బు ఇవ్వకపోతే దానికి జరిగేఫలితం, నెలలో నాలుగు రోజులు కోర్టులో నిలబడాల్సి వస్తుంది. ఒక్కొక్కసారి ఎక్కువవేగంగా నడిపిన తప్పుమీద, ఒక్కొక్కసారి కుడివైపున నడిపిన తప్పుమీద, బరువు ఎక్కువగా వేసి తీసుకువెడుతున్నందుకు, కోర్టులో నిలబడాల్సి వస్తుంది. బరువు ఎక్కువగా లేకపోయినాగూడా ఒకవేళ సిపాయి పరీక్షచేయడానికి నిలబడితే రోజంతా గడచిపోతుంది. పోలీసులనుంచి తప్పించుకుని మనిషి ఎక్కడికి వెళ్లగలడు? ఇక్కడ బలం, సాహసం అన్న ప్రశ్న లేదు. చేయి వదిలించుకుని, తోపుతోసి, దెబ్బలు

కొట్టి పారిపోయినా ఎంతదూరం పారిపోగలుగుతాడు? పదిమైళ్ళు, ఇరవై మైళ్ళు, ముప్పై మైళ్ళు. పోలీసులు అంతకుముందుకూడా వున్నారు. పోలీసులు లేనిదెక్కడ? పోలీసులకోపంనుంచి తప్పించుకోవడానికి ఒకటే ఉపాయం. దైన్యంగా వుండటం. తన సంపాదనతో వాళ్ళని పూజచేయటం. పోలీసులకు ఏ డ్రైవరూ డబ్బులు ఇవ్వద్దని యూనియన్‌వాళ్ళు చాలాసార్లు చెప్పారు. కాని ఇవ్వకుండా కాలం ఎలా వెళ్లబుచ్చటం? వాళ్ళు మండీనుంచి వచ్చేటప్పుడుగాని మండీ వెళ్ళేటప్పుడుగాని పారా వెతకటంకోసం ప్రతివారికీ లారీలు, బస్సులు ఆపేస్తుండేవారు.

ధనసింగ్ విధిలేక సిపాయితోకూడా వెడుతున్నాడు. సోమా తలవంచుకుని అతనివెనకనే వుంది. సోమాకి పోలీసులతో ఎప్పుడూ పరిచయం కలగలేదు. కాని పోలీసు సిపాయి, పోలీసు ఆఫీసరు ఏది కావాలనుకుంటే అది చేయగలరని ఆమెకు తెలుసు. వాళ్లకన్నా పెద్దశక్తి ఏదీ లేదు. భగవంతుడున్నాడు కాని ఆయన్ని ఎప్పుడూ చూడలేదు అని ఆమె అనుకునేది. ఆవు మెడలో తాడుకట్టి తీసుకువెడు తుంటే దూడ ఎలా దానంతట అదే ఆవువెనక వెడుతుందో అలా సోమా ధనసింగ్ వెనక వెడుతోంది.

ధనసింగ్ హృదయం వేగంగా కొట్టుకుంటోంది. కాని పైకిమటుకు ధైర్య వంతుడిలా వున్నాడు. దారిపొడుగునా సిపాయిని బ్రతిమలాడుతూ, పొగడుతూ నడుస్తున్నాడు. 'కానిస్టేబులుగారూ, మా అత్తగారికి చాలా జ్వరంగా వుంది. అందు చేత నేను నా భార్యని తీసుకువెళ్ళడానికి మండీ వెళ్లాను. నేనక్కడికి వెళ్లటం చాలా అవసరం. మీరు మండీలో, హమీర్‌పూర్‌లో విచారణ చేసుకోవచ్చు. మమ్మల్ని వెళ్లనివ్వండి' అన్నాడు.

'ఏం లేదు, భయపడాల్సినవిషయం ఏముంది? మేము కూలీ-నాలీ చేసుకునే వాళ్ళమని పోలీసుస్టేషన్లో ఆఫీసరుగారికి చెప్పు. మా చేతుల్లో ఏముంది?' అని సిపాయిగూడా ధైర్యం చెప్పాడు.

వేరే ఉపాయంతోచక ధనసింగ్ అన్నాడు—'కానిస్టేబులుగారూ! మీరు ప్రభువులు, నేను చాలా బీదవాడిని. అయ్యో బీదవాడి గౌరవం మట్టిలో కలిసి పోతుంది' అని జేబులోనుంచి పదిరూపాయలనోటు తీసి సిపాయిచేతిలో పెట్టాడు.

కానిస్టేబులు నవ్వాడు-'భలేవాడివి. నువ్వు చాలా అమాయకుడివి. పది రూపాయలు ఇచ్చి అడవాన్ని తీసుకుని పారిపోతావా!' అని అతను నోటు తీసుకోవడానికి నిరాకరించాడు. ధనసింగ్ జేబులో మొత్తమెంతవుందో అంతా కానిస్టేబులుకు బహుమతిగా చేశాడు. కానిస్టేబులు అతన్ని రెండుతిట్లుతిట్టి కోప్పడ్డాడు. అ రేయ్....ఎవడిని మూర్ఖుణ్ణి చేస్తావు!'

ధనసింగ్ మనసులో సిపాయిమెడ నలిపేద్దామని, దగ్గరలోవున్న పెద్ద రాతితో సిపాయితల పగలగొడదామని అనిపించింది కాని ఇంతచేసినాకూడా తప్పించుకోలేడు. సిపాయి కేవలం మూడున్నరమూరల ఒక మనిషిమాత్రమే కాదు. అతనే ప్రభుత్వం. ధనసింగ్ తన టోపీతీసి సిపాయి కాళ్ళమీద పెట్టాడు. శక్తి-అధికారం ఎదుట ఆత్మసమర్పణ చేశాడు. కానీ సిపాయి కరగలేదు.

ధనసింగ్ ఒక్కడే అయితే ఆ చీకటిలో కలిసిపోయి నుంచునేవాడు. కాని సోమానివదిలి ఎలా వెడతాడు! సిపాయితోబాటుగా వాళ్ళుగూడా పోలీసుస్టేషను ఆవరణలో ప్రవేశించారు. అతనూ, సోమా బయటపడటానికి ఏవిధమైన ఉపాయమూలేని మనుషులకోసం తయారుచేసిన 'ఎలుకలబోనులో' చిక్కుకున్నట్లుగా ధనసింగ్‌కు అనిపించింది. ఆ పంజరంలో కాళ్ళు పెట్టవద్దని అతనిమనసు ఒకసారి హెచ్చరించింది కాని సోమాతో కలిసివెళ్ళటం అవసరం. అవమానం, దెబ్బలు, జైలుగురించి తలచుకుని అతనిహృదయం వణుకుతోంది.

పోలీస్‌స్టేషను బాగా వెడల్పుగావుంది. వాకిట్లో ఎదురుగా వసారావుంది. వసారాలో ఒకమంచంమీద లావుగావున్న ఇనస్పెక్టరుగారు వంటిమీద కంబళి కప్పుకుని పడుకుని ఒక పెద్దగొంతుతో హుక్కాపీలుస్తున్నారు. మంచానికి దగ్గరగా ఒక కుంపటిలో బొగ్గులు మండుతున్నాయి. మంచానికి రెండువైపులా రెండుకుర్చీపీటలమీద హారికేన్ లాంతర్లు కాంతిని వ్యాపింపజేస్తున్నాయి. డ్యూటీ సిపాయి ఇనస్పెక్టరు కాళ్ళు పిసుకుతున్నాడు.

విశ్రాంతి తీసుకునే ఈ సమయంలో ఒక స్త్రీని, ఒక పురుషుణ్ణి వెంటబెట్టుకుని పోలీసుస్టేషనులోకి వస్తూన్న సిపాయిని చూడగానే ఇనస్పెక్టరు నుదటి మీద కోపంతో ముడతలు పడ్డాయి. గొంతులో నిండివున్న కొవ్వుతో గుర - గుర

మనే స్వరంలో తిరుతూ—'ఏ అమ్మ....హరిరామ్, ఈ వేళప్పుడు ఏంరోగం పట్టుకు తీసుకొచ్చావ్?' అని అడిగారు.

హరిరామ్ ధనసింగ్‌ని, సోమాని వాకిట్లోనే నిలబెట్టి, వసారాకి క్రిందనే నిలబడి ఇనస్పెక్టరుగారికి అభివందనం చేశాడు. తర్వాత మంచందగ్గరకువెళ్ళి 'అయ్యా ఈ రాజపుత్రుడు ఆ అమ్మాయిని లేవదీసుకు పోతున్నాడు' అని నెమ్మదిగా చెప్పాడు.

ఇనస్పెక్టరుగారు పడుకునేవున్నారు. క్రిందవున్న హుక్కా-నుంచి నెమ్మదిగా దమ్ములాగి బలహీనమైన స్వరంతో 'ఈ అమ్మాయికేమీ పనీ-పాటా లేదా?' అని అడిగారు.

'అయ్యా, అచ్చంగా కన్నెపిల్లే. ఇంకా పెళ్ళికానిది కాని ఆమె నా పెళ్లామని అత నంటున్నాడు. ఆమె ముక్కుకి బులాకీలేదు, సిలలేదు. ఒకవేళ పెళ్ళయివున్నా ఇప్పటికీ కన్యనే విధవయిందనిపిస్తోంది. మొగడు యుద్ధంలో చచ్చిపోయి వుంటాడు. మొగుడి చావువార్త విన్నది, అంతే సీయమ్మ పారిపోయి వచ్చేసింది.'

సిపాయి మాటలువిని ధనసింగ్ గుండె వేగంగా కొట్టుకోవటం మొదలెట్టింది.

ఇనస్పెక్టరుగారి కాళ్ళుపిసుకుతున్న సిపాయి ఆగంతకులవైపు తిరిగి 'ఇక్కడికిరా, వసారాలోకి' అని బిగ్గరగా కేకేసాడు.

సోమా ధనసింగ్‌చాటున నిలబడింది. ధనసింగ్ వసారావైపు నడవగానే సోమాగూడా అతని వెనుక వెనుకగావెళ్ళి అతని చాటున తలవంచుకుని నిలబడింది.

ఇనస్పెక్టరు ధనసింగ్‌ని సంబోధనచేశారు—'ఈ అమ్మాయి ఎవరు?'

'నా ఇంటావిడ అయ్యా.'

'సరే, ఎవరు మీరు?'

'అయ్యా రాజపుత్రులం.'

'ఈమె ముక్కుబులాకీ ఎక్కడ పడిపోయింది?'

'అయ్యా' ధనసింగ్ ఆగి చెప్పాడు. 'అయ్యా. షాహుంకారిదగ్గర నగలు తాకట్టుపెట్టానండి. బీదవాళ్ళం బాబూ।'

'అరేయ్. దీన్నిగూడా తాకట్టు పెడతావా। చూద్దాం.' ఇనస్పెక్టరుగారు ధనసింగ్వైపు తిరిగి అన్నారు.

సిపాయి నఫీస్ కుర్చీపీటమీదనుంచి లాంతరు పైకెత్తాడు. అతను ధనసింగ్ని చెయిపట్టుకుని ఒకపక్కకు తోసి లాంతరును సోమా ముఖానికి దగ్గరకు పెట్టాడు.

సోమా సిగ్గుచేత తలతిప్పుకుని నుదటిపైనుంచి కొంగును ముఖంమీదకు లాక్కుంది.

'అరే, ఇలా సిగ్గుపడితే ఎలా జరుగుతుంది?' ఇనస్పెక్టరుగారన్నారు 'చూద్దాం. అయితే సరయింది ఎవరో।'

నఫీసు సోమా వీపువెనుకనుంచి పైన కొంగులాగేసాడు. సోమాముఖం బయట పడటంచేత సిగ్గువలన ముఖం చేతులలో దాచుకుని కూర్చుండిపోయింది. తల మోకాళ్ళమధ్య దాచుకుంది. ధనసింగ్ వుండబట్టలేకపోయాడు. అతను బలంగా నఫీసు మెడమీద గుద్దాడు. లాంతరు నఫీసు చేతుల్లోనుంచి దూరంగా పెళ్ళిపడింది. విరిగిపోయింది.

హరీరామ్, నఫీస్, జవాహర్, ముగ్గురు సిపాయిలూ ధనసింగ్మీద విరుచుకు పడ్డారు. అతన్ని కర్రలతోనూ, చెప్పుదెబ్బలతోనూ కొట్టి వాకిట్లోపడేశారు. సోమా బిగ్గరగా కేకేసి దనసింగ్ని కాపాడటంకోసం ముందుకు వెళ్ళింది. నఫీసు ఆమెనుతిట్టి మణికట్టుపట్టుకుని వెనక్కి లాగాడు.

ఇనస్పెక్టరు ఆజ్ఞవల్ల ధనసింగ్ని మరమ్మత్తుచేసి ఖైదులో వుంచటం జరిగింది. వసారాలో కూర్చునివున్న సోమా కొంగుతో ముఖం కప్పుకుని ఏడుస్తోంది. ఈ సంఘటనవలన ఇనస్పెక్టరు మనసు బాధపడింది. పంజాబునుంచి ఆయనకు కొద్దిరోజులక్రితమే ఈ ప్రాంతానికి బదిలీ అయింది. ఆయనకుటుంబం ఇప్పుడుకూడా పంజాబులోనే వుంది. ఆయనమనసు సరిగా వుండదు. మనసుకు చికాకు కలిగినప్పుడు ఆయన ఈ ప్రాంతాన్ని తిట్టడం మొదలుపెడతారు. బాగా

తాగుతారు. ఈ సంఘటనవలన ఆయనమనసుకు చికాకు కలిగింది. బాధగా అన్నారు- పీ అమ్మ....ది మనసు చెడగొట్టింది. ఈ జిల్లాఅంతా నాయాల ...ఇట్లాగే వుంది. వట్టి దురలవాట్లు। ఏమీ వినోదం లేదు. ఏమీ సొసైటీ లేదు.'

జవాహర్ సిపాయి ముఖస్తుతికోసం సమర్థించాడు—'అయ్యా. పంజాబును గురించి వేరే చెప్పాలా। ఇది చాలా బీద జిల్లా.'

'సాయంత్రం ఆరుగంటలనుంచే నీ అక్క....ఇక్కడ రాత్రయిపోతుంది. ఏ మనిషయినా ఏం చేస్తాడు? పగలు నిద్రపోతే రాత్రి గడవదు. నాయాల. జవాహర్. నువ్వు ఈ బుడ్డీకూడా ఏది తెచ్చావ్? పీ అక్క....వట్టి నీళ్ళు. నాయాల ఆ కాంట్రాక్టరుని పట్టుకుని రేపు తీసుకురా. నీళ్ళుకలిపి అమ్ముతాడా?'

జవాహర్ తన నిర్దోషిత్వాన్ని చెప్పాడు—'అయ్యగారిఎదటే సీలుతీసి బిరడా తెరిచాను. అయ్యా ఫారిన్‌సరుకులో అమా ఎక్కడా? ఫారిన్‌వాళ్ళు నా కొడుకులు నీళ్ళకి డబ్బులు తీసుకుంటారు. అయ్యా దేసీసరుకు తాగితే వుంటుంది. అబ్బ....గుటక కిందకి దిగిందా అంతే మనిషి బెలూనయాడన్నమాటే.'

'అరేయ్ జవాహర్. అయ్యగారికి ఇంకొంచం వేయరాదూ।' అని కరీమ్ ఇనస్పెక్టరుగారి బాధనుగురించి సానుభూతిగా చెప్పాడు. ఇనస్పెక్టరుగారు అర్థ గించలేదు. జవాహర్ గుమాస్తా గదిలోనుంచి బుడ్డీ తీసుకొచ్చాడు.

ఇనస్పెక్టరుగారు సోమావైపుచూసి 'అరే. ఇక ఆపు। ఏడుస్తూనేవుంటావా? అయిపోయిందా ఏడుపు। మంచిది. నీ మనిషిదగ్గరకు తీసుకెళతాము. పీయమ్మ .... ఏడుపు ఆపు' అని ఆయన ఆవలించి ఒళ్ళు విరుచుకుని హరిరామ్‌కు కళ్ళతో సౌంజ్ఞ చేశారు. 'హరిరామ్. నువ్వు నచ్చచెప్పు ఆ అమ్మాయికి। నీళ్ళివ్వు. ముఖం కడు క్కోమను. తినడానికి ఏమన్నా పెట్టు. అక్కడికి తీసుకెళ్ళి కొంచం నచ్చచెప్పు. ఓదార్చు. ఎంతవరకు ఏడుస్తూవుంటుంది?'

హరిరామ్ సోమా చెయపట్టుకుని బుజ్జగిస్తూ వసారానుంచి అవతలికి తీసుకెళ్ళాడు.

జవాహర్ లాంతరువెలుగులో ఇనస్పెక్టరుగారికి చూపించి గ్లాసులోపోసి. ఆయన ఇష్టానుసారం నీళ్ళుకలిపి గ్లాసు ఆయనచేతికి ఇచ్చాడు. ఇనస్పెక్టరుగారు

గుటకవేసుకుని. 'ఈ హుక్కాకిగూడా బుద్ధిలేదు. నిద్రపోయింది. దీనక్క—దీన్నిగూడా కొంచం లేపు' అని ఆయన మళ్ళీ ఆ జిల్లాని తిట్టడం మొదలుపెట్టారు.

కరీం ఇనస్పెక్టరుగారి జిల్లాకు సంబంధించిన వాడవటంచేత ఒప్పుకున్నాడు. ముఖస్తుతిలో అన్నాడు—'అయ్యా మొత్తం జిల్లాఅంతా వితంతువులతో నిండి పోయింది. ఈ నెల్లో ఇది మూడవకేసు. పంజాబులో స్త్రీలకేం కరువుంది చెప్పండి? జాట్‌లు ఎటువంటిస్త్రీలను లేవదీసుకెళుతుంటారు? వాళ్ళనిచూస్తే ఎంత మంచి వాడైనా తల తిప్పాల్సిందే. కాని ఇక్కడ ఒకళ్ళని చూస్తేనే అర్థమైంది.... అయ్యా ఇక్కడ మనుషులు కొంచం ఆశ్చర్యాన్ని కలిగిస్తారు. యుద్ధమంటే దడవరు. గొర్రెలమందలాగా యుద్ధంలో చేరతారు. కాని ప్రభుత్వం చూసే ఒక్క చూపుతో వీళ్ళపని మోసం అయిపోతుంది.'

ఇనస్పెక్టరుగారు గొంతునిండా నింపుకుని మింగి చెప్పారు—'నీకు తెలీదు. ఇక్కడ మనిషి పిరికివాడుకాదు. గాని తెలివితక్కువవాడు. నీ అక్క....తుపాకి గుండు అంటే దడవడుగాని చట్టానికి దడుస్తాడు. ఎందుకంటే చట్టమంటే ఏమిటో వాడికి తెలీదు.'

'అయ్యా పఠానుని చూడండి. ఎవరికీ దడవడు.'

'అది వేరేవిషయం. అక్కడ మనుషులు దొంగతనంచేసి పొట్ట పోసుకునే రకం. వాళ్ళజీవితాలు నేరాలతో నిండివుంటాయి. ఆ ప్రాంతంగూడా బాగా ఎండి పోయిన పనికిరాని భూమి. దోపిడీచేసి బ్రతికేవాళ్ళు దొంగతనం చేయకపోతే ఏం చేస్తారు? ఇక్కడిమనిషి శాంతి కోరుతాడు. ఇందుకే నీయక్క....దడుస్తాడు. పాపి ఎప్పుడూ దడవడు, పెద్దమనిషి ఎప్పుడూ దడుస్తాడు.'

నఫీసు హుక్కాని కొత్తగా తయారుచేసి తీసుకొచ్చాడు. దమ్ములాగి ఇన స్పెక్టరుగారు అన్నారు—'ఇప్పుడు కొంచం బాగుంది. నఫీసూ, నువ్వెళ్ళి కాసేపు విశ్రాంతి తీసుకో. ఇవ్వాళ గస్తీతిరిగే డ్యూటీ ఎవరిది?'

హరిరామ్ ఇనస్పెక్టరుగారి దృష్టిని తనవైపు ఆకర్షించుకోవటానికి సెల్యూట్ చేసి 'అయ్యా' అన్నాడు.

ఇనస్పెక్టరుగారు అతనివంకచూసి 'సరే అలాగే' అన్నారు.

సిపాయి జవాహర్‌సింగ్, గుమాస్తా డ్యూటీమీద వున్నారు. అతనుకూడా గోడకు వీపు ఆనించి కూర్చుని కునుకు తీస్తున్నాడు. ఇనస్పెక్టరుగారు అతనివైపు చూపి 'ఏం మనుషులో ఈ జిల్లావాళ్ళు. సూర్యుడు అస్తమించనేలేదు. అడవి జంతువుల్లాగా గుహల్లోకి దూరటానికి ప్రయత్నం చేస్తుంటారు. వెళ్ళు గుమాస్తా. నువ్వుగూడా వెళ్ళు' అన్నారు.

'అయ్యా కాస్త విశ్రాంతి తీసుకోరా?' జవాహర్ అడిగాడు.

'విశ్రాంతెక్కడుంది?' ఇనస్పెక్టరుగా రన్నారు—'ఇక్కడ పడున్నారు. ఇంటికెళ్ళిగూడా పడుండాలి.'

హరిరామ్ సోమాచేత ముఖం కడిగించి వసారాలో ఒకమూల కూర్చోబెట్టాడు. ఆమె మోకాళ్ళమీద తల ఆనించి నావరాళ్ళపలకలవైపుచూస్తూ మౌనంగా కూర్చుంది. వెక్కిళ్లవలన ఆమెశరీరం కదులుతోంది. ఆమెవైపు సౌంజ్ఞచేసి జవాహర్ అన్నాడు—'అయ్యా ఈమె ఇక్కడే వుంటుందా, లేకపోతే కొల్లో పెట్టి రానా? వీళ్ళవిగురించి వ్రాసేది రేపే గదండీ?'

'అవుతుంది.' ఇనస్పెక్టరుగారు సమాధానం ఇచ్చారు—'కరీం కూర్చుని వున్నాడుగదా. చేస్తాడు. లేకపోతే రేపవుతుంది.' జవాహర్‌సింగ్ ఖైదు తాళం చెవులు కుర్చీసీటమీద లాంతరుదగ్గర పెట్టి వంగి నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

మర్నాడు మధ్యాహ్నం రెండుగంటలతర్వాత ఇనస్పెక్టరుగారు పోలీసు స్టేషనులో తిష్ఠవేశారు. రిపోర్టు వ్రాయించడంకోసం ఆయిదారుగురు కూర్చుని వున్నారు. గుమాస్తా వాళ్ళదగ్గరకువచ్చి చెప్పాడు—'అయ్యా. ఆ అమ్మాయి మామగారు. కేహర్ అనే రాజపుత్రుడు మయూరా గ్రామంనుంచి పహారాజవానుని వెంటబెట్టుకుని రిపోర్టు వ్రాయించడానికి వచ్చాడు. నిన్నమధ్యాహ్నం రెండుగంటలనుంచి వితంతువైన అతనికోడలు జాడలేకుండా పోయిందని చెపుతున్నాడు.'

'ఏమంటున్నాడు?' ఇనస్పెక్టరుగారడిగారు.

'అయ్యా. సిపాయిలకోసం కొంచం ఖర్చుచేస్తే వెతికించడంకోసం పంపిస్తానని నేనన్నాను. ఎవరిమీద అనుమానముందని అడిగితే నగలుతీసుకుని పారి

పోయిందని చెపుతున్నాడు. నేను పేదవాణ్ణి. నా కొడుకులు ప్రభుత్వపు వుద్యోగులని పూర్తిగా రెండురూపాయలు చూపిస్తున్నాడు.'

ఇనస్పెక్టరుగారు అది వినడానికి అంగీకరించక బిగ్గరగా అరిచి ఇంకొక పనిలో నిమగ్నమయారు.

రోజంతా నిరీక్షించి సూర్యుడు అస్తమించేవేళప్పుడు కేహర్ అయిదు రూపాయలిచ్చి రిపోర్టు వ్రాయించాడు. అతని కేసుగురించిన వివరాలన్నీ వ్రాసుకోబడ్డాయి. ఆమెకోసం వెతుకుతామనీ, కొంచం జాడ తెలిసినతర్వాత అతనికి సమను (హాజరునోటీసు) పంపిస్తామని పోలీసులు చెప్పారు. మూడవరోజు వుదయం ధనసింగ్, సోమాలను పట్టుకున్నట్లు రిపోర్టు డైరీలో ఎక్కించబడింది.

* * *

కేహర్‌సింగ్ అయిదురోజులతర్వాత పోలీస్‌స్టేషనునుంచి వచ్చిన సమను తీసుకుని వైజ్‌నాథ్ తాలూకాలో హాజరయాడు. ధనసింగ్‌ని, సోమాని తహసీల్దారుగారి కచేరీలో ప్రవేశపెట్టారు. ధనసింగ్ చేతులకు బేడీలున్నాయి. ధనసింగ్‌నిచూసి సోమా ఏడ్చింది. సోమాని చూడగానే ధనసింగ్‌కళ్లల్లో నీళ్ళు నిండాయి. వారం రోజులు గడ్డం చేసుకోకపోవటంచేత అతని గడ్డం బాగా పెరిగివుంది. అతని రంగు నల్లబడిపోయింది. జ్వరపడిన అడవి ఎలికలాగా తయారయ్యాడు. జ్వరపడి చాలా లంఖణాలు చేసినవాళ్లకిమల్లే సోమా బాగా సన్నబడి పాలిపోయివుంది. వాడి కేహర్‌సింగ్ ఆమెను గుర్తించాడు. కేహర్‌సింగ్‌పక్షాన్ని బలపరచటంకోసం ఒక అధికర్త పెద్ద తలపాగాచుట్టుకుని, కళ్లకు కాటుకపెట్టుకుని, కోటువేసుకుని హాజరయ్యారు.

కేహర్‌సింగ్ వాఙ్మూలం ఇచ్చాడు—'అతని కోడలు ఇంట్లో నగలు తీసుకుని పారిపోయింది. కోడలిని అతను ఆరువందలరూపాయలు ఇచ్చి కొనుక్కున్నాడు. సాక్ష్యం చెప్పటంకోసం మన్నూసాహ్ సిద్ధమయ్యాడు. ఒకరూపాయి ప్రయాణానికి, భోజనఖర్చు ఇచ్చి అతన్ని పిలిచారు.

'నేరస్థుడు అతనికోడల్ని తీసుకుపోయి అతనిగౌరవాన్ని నాశనం చేశాడు. ఆమెను మళ్ళీ బంధువులలో కలపాలంటే అయిదువందలు ఖర్చుపెట్టి యజ్ఞం

చేయాల్సి వస్తుంది. న్యాయస్థానం ఆ మొత్తాన్ని నేరస్థునిచేత నష్టపరిహారంగా ఇప్పించవలసింది. సోమాని ఇంటికి తీసుకువెళ్ళడానికి అతను సిద్ధంగా లేడు. ఎందుకంటే అతని గౌరవం ఆమెవలన చెడిపోయింది' అని కేహర్ చెప్పాడు.

పోలీసులకి సోమామీద దయ కలిగింది. ధనసింగ్‌ని కాపాడాలని అను కుంటూవుంటే ఈవిధంగా వాఙ్మూలమివ్వమని వాళ్ళు సోమాతో చెప్పారు— అత్తవారింట్లో ఆమెకు రోజూ దెబ్బలు తగులుతూవుండేవి. తినడానికి ఏమీ పెట్టే వాళ్ళు కాదు. క్రితంరాత్రి అత్త-మామ ఆమెను మండీ తీసుకువెళ్ళి అమ్మేయాలని నిశ్చయించారు. ఈ భయంచేత తెల్లారగానే బావినుంచి నీళ్ళు తీసుకురావడానికి వెళ్ళి అటునుంచి అటు పారిపోయి వచ్చేసింది. ధనసింగ్ ఆమెకు రోడ్డుమీద కలి శాడు. ఆమె ధనసింగ్‌ని మండీవెళ్ళే దోవగురించి అడిగింది. అతనితోకూడా కలిసి మండీ వచ్చేసింది. దోవలో ధనసింగ్‌తో తన అత్తారింట్లో తను పడినకష్టాలను గురించి చెప్పేసరికి, నా ఇంటికి వచ్చేసెయ్. అక్కడ ఎంతోమంది ముసలమ్మ లున్నారు, నువ్వు వాళ్ళతో కలిసివుండచ్చు అని ధనసింగ్ సానుభూతితో చెప్పాడు. ఒకరాత్రి వాళ్ళిద్దరూ మండీలో సత్రంలో వున్నారు, తర్వాత అక్కడనుంచి వైజ్ నాథ్ వచ్చారు. పోలీసు సిపాయి ఇద్దరినీచూసి పోలీసుస్టేషనుకు తీసుకెళ్ళాడు. కావాలంటే నరికి ఆమెను ముక్కలు చేసినాసరే, ఆమెమాత్రం మామగారితోబాటు వెళ్ళదు.'

ధనసింగ్, సోమాలను పట్టుకున్న పోలీసుసిపాయి హరిరామ్ వాఙ్మూలంగా- 'మఝురా గ్రామంనుంచి ఒక రాజపుత్రుని విధవకోడలు ఇంటోనుంచి పారిపోయిం దని పోలీసుస్టేషనులో వ్రాసివుంది. అందుచేత నేను గస్తీడ్యూటీమీద చాలా జాగ్రత్తగా వున్నాను. చీకటపడినతర్వాత నేను ఈ దోషిని ఒకస్త్రీతో కలిసి వస్తుం డగా చూశాను. స్త్రీ ముక్కుకి బులాకీ లేకపోవడంచేత ఆమె విధవని నాకు అను మానం కలిగింది. దోషిని నేను స్త్రీగురించి ప్రశ్నించాను. ఎప్పుడైతే అతను విధవని తన భార్యగా చెప్పాడో, నా అనుమానం మరింత ఎక్కువైంది. నేను ఇద్దరినీ పోలీస్‌స్టేషనుకు తీసుకెళ్ళాను. తర్వాత కేహర్‌సింగ్‌కు తెలియబరిచాము. అతను తనకోడల్ని గుర్తుపట్టాడు. పట్టుకున్నసమయంలో దోషిదగ్గరగాని, స్త్రీ దగ్గరగాని డబ్బు, నగలూ ఏమీ దొరకలేదు. దోషిజేబులో చిల్లరఅంతా కలిపి

రెండురూపాయల తొమ్మిదిన్నర అణాలున్నాయి. అవి పోలీస్ స్టేషనులో జమ కట్ట బడినాయి.' అని చెప్పాడు. న్యాయస్థానం ఎదుట సోమా వాఙ్మూలంలో మండీ వెళ్ళేవిషయం విని. ఇది పోలీసులు నేర్పిన మాటేనని ధనసింగ్ తెలుసుకున్నాడు. సిపాయి హరిరామ్ ఖైదులో ధనసింగ్‌తోగూడా ఇటువంటి వాఙ్మూలమే ఇవ్వమని చెప్పాడు. ఇటువంటి వాఙ్మూలం ఇస్తేనే వదిలిపెడుతారని, లేకపోతే ఏడు సంవత్సరాల శిక్ష పడుతుందనికూడా చెప్పాడు.

సోమా ఇచ్చిన వాఙ్మూలంలో ధనసింగ్ విధవని ఆమె ఇంటినుంచి ప్రేరేపించి తీసుకువచ్చాడన్న ఋజువు లేకపోయినప్పటికీకూడా దోవలో వెళ్లే స్త్రీని భ్రమింపజేశాడనటానికి కావలసినంత ఋజువు ఉంది. పారిపోయే స్త్రీనిగురించి పోలీస్‌స్టేషనులో చెప్పకపోగా ఆమెను దొంగతనంగా మండీ తీసుకువెళ్లాడనటానికి కూడా స్పష్టమైన ఋజువు దొరికింది. ముఖ్యంగా పోలీస్‌స్టేషనులో తనవిగురించి తప్పుడుసమాచారం ఇవ్వటంచేత అతని చెడునడతను ఋజువుచేస్తూ న్యాయస్థానం దయతలచి అతనికి కేవలం ఆరుమాసాల శిక్ష విధించింది.

వయసులోవున్న వితంతువుని ఎవరి అధీనం చేయాలి అనేది న్యాయస్థానానికి సమస్య అయింది. తనని అమ్మేసిన తండ్రిదగ్గరకు వెళ్ళటానికి ఆమె ఒప్పుకోలేదు. కావాలంటే కొడవలితో నరికినా సరే పుట్టింటికిమాత్రం వెళ్ళనని సోమా చెప్పింది. అత్తారింటికి వెళ్ళటానికిగూడా అంగీకరించలేదు. సోమా ధనసింగ్‌తో కలిసి వెళ్ళటానికే ఒప్పుకుంది. ధనసింగ్‌తోబాటే తననుగూడా జైలుకు పంపించమని ఏడుస్తూ చెప్పింది. మూర్ఖురాలైన ఆ స్త్రీకి చట్టంగురించి తెలియదు. శిక్షవిధించకుండా ఎవరూ జైలుకు పంపబడరు. జైలులో స్త్రీలని-పురుషులని ఒకచోట కలిసివుండనివ్వరు. ఆమె న్యాయస్థానం గోడలకి తల బాదుకుని ఏడిచింది.

ఆర్యసమాజం మంత్రి నిర్భయరామ్ చౌధరిగారికి జిల్లాలో మంచి పేరుంది. ఆయన వందలకొలది పారిపోయినస్త్రీలని రక్షించారు. అనేకమందిని తిరిగి వాళ్ళ వాళ్ళ ఇళ్ళకి చేర్పించారు. అనేకమందిని దుర్మార్గుల పంజానుంచి కాపాడి వితంతు ఆశ్రమంలో చేర్పించారు. కొంతమంది వితంతువులవివాహాలు వేదోక్తంగా జరిపించారు. న్యాయస్థానం నిర్భయరామ్ చౌధరిని పిలిపించి సోమా కేదైనా ఏర్పాటు చేయవలసిందిగా చెప్పింది.

న్యాయస్థానం న్యాయమేమిటో సోమా కొంచంగూడా అర్థం చేసుకోలేక పోయింది. ఏమనిషితో కలిసి వెళ్ళటానికి, ఏమనిషితో కలిసివుండటానికి ఆమె కోరుతోందో, న్యాయస్థానంమనుషులు అతనితో కలిసి వెళ్ళనివ్వరు. ఎవరినైతే ఆమె ఇంతకుముందు ఎరగదో, ఆమెకు ఇంతకుముందు పరిచయంలేదో, వాళ్ళతో కలిసివెళ్ళడానికి ఆమెను నిర్బంధిస్తున్నారు. సోమా తలమీద చేయిపెట్టుకుని గట్టిగా నిట్టూర్చింది. ఆమె ఏదైతే కోరుతుందో అది జరగదు. ఇంతకుముందు కూడా ఆమె కావాలనుకున్నది జరగలేదు. ఇక ఆమెకు ఇది కావాలని అనుకునే ధైర్యంగూడా లేదు. కాని పరిస్థితులు ఆమె కోరికను తీర్చడానికి సహాయంచేస్తే ఆమె మనసుకు ఏది నచ్చితే అది చేసేది. ఏదైనా కానీ, ఆమెకు న్యాయస్థానం, పోలీసులు, నిర్భయరామ్ చౌధరి కలిసి తనని అమ్మేశారని ఆమెకి అందరిమీదా సందేహంగా వుంది. ధనసింగ్‌ను వదిలిపెట్టి చౌధరిగారితో కలిసివెళ్ళడానికి ఆమె ఇష్టపడలేదు. కాని పోలీసులు ధనసింగ్‌ని తాళ్ళతోకట్టి జీపులో కూర్చోబెట్టి ధర్మశాల తీసుకువెడుతుంటే, ఏడుస్తూ, తల బాదుకుంటూ రోడ్డుమీద నిలబడిపోయిన ఆమెకు చౌధరిగారితో వెళ్లటం తప్ప వేరే వుపాయం కనిపించలేదు.

చౌధరి నిర్భయరామ్ సోమా తలమీద చేయివేసి బుజ్జగించారు 'కూతురా' అని సంబోధించి వెంట తీసుకువెళ్లారు. ఆయన వెక్కి-వెక్కి ఏడుస్తున్న సోమాని చూసి ఓదార్చేవారు. అమ్మాయి, ఇలా ఎందుకు బాధపడతావు. ఆరునెలలే గదా! ఆరునెలలు ఆరురోజుల్లా గడిచిపోతాయి. ధనసింగ్ ఇక్కడ కొద్దిదూరమేగా వెళ్లాడు. ఇక్కడే ధర్మశాలలో వుంటాడు. ఆరునెలలతర్వాత వస్తాడు. ఆయన ఎప్పుడైనా సోమా కొంచం శాంతంగా వుండగాచూసి 'అమ్మాయి, ఇలా జీవితం పాడుచేసుకోవటంచేత లాభమేమిటి? పురుషులవెనక పరుగెత్తటం మంచి కుటుంబం లోని స్త్రీలకి తగదు. ఎవరైనా మంచి డబ్బు-దస్కంవున్న పెద్దమనిషితో మేము నీ పెళ్ళి చేయించగలం' అని తెలియజెప్పేవారు. మొదటిభార్య ఇద్దరు పిల్లలను వదిలిపెట్టి చనిపోయిన ఒక వంజాబీ స్కూలుమాస్టరు గుణగణాలని ఆయన వర్ణించి చెప్పారు. సోమా ఈ ప్రసంగంవిని ఏడవటం మొదలుపెట్టేసరికి ఆయన రెండొం దలు-రెండొందలఏభై సంపాదించే మంచి ఆస్తిపరుడైన ఒక స్టేషనుమాస్టరు గురించి చెప్పారు. 'పంజాబు ప్రజలు కొండప్రాంతపు మనుషులకుమల్లే నీచమైన

M—6

వాళ్ళు కాదు. ఇక్కడ గొప్పఇంటివాళ్ల వితంతువులకి, ధనవంతులైన వితంతువులకికూడా పెళ్ళిళ్ళు అవుతుంటాయి' అని సోమాకి నచ్చజెప్పారు. సోమా ఏడవటం మొదలుపెట్టింది. 'వితంతువివాహం నేను ఎప్పుడూ విననైనాలేదు' అని సోమా చెప్పింది. ఏవిషయం అయితే ఆమెజాతిలో ఎప్పుడూ జరగలేదో అది ఎలా చేస్తుంది?

కాంగడేలోవుండే ఇంకొక ఆర్యసమాజంవాడూ, సత్పురుషుడూ అయిన లాలా గోపీచంద్ షరాబు ఇంట్లో సోమా వుండేందుకు నిర్భయరామ్ చౌధరిగారు ఏర్పాటుచేశారు. లాలాగారుకూడా సోమాకి మొదట చాలారకాలుగా చెప్పి వితంతువివాహం చేసుకోమని సలహా ఇచ్చారు. అమ్మాయి కొద్దిరోజులలో దోవలోకి వస్తుందని ఆశపడ్డారు కాని ఆయన ఇంటి ఆడవాళ్ళు సోమా ఆ ఇంట్లో వుండటానికి చాలా కట్టడి చేశారు. ఇటువంటి పాపంచేసిన స్త్రీని పీటకుండనిగాని, ఇంకొకవస్తువునిగాని ముట్టుకోనిచ్చేవాళ్ళు కాదు వాళ్లు.

'ఏమైనా ఈపిల్ల హిందువు. ఈమెను ఇంట్లో వుంచుకోకపోతే ఏ మహమ్మదీయుడి చేతుల్లోనయినా పడిపోతుంది. ధర్మంనుంచి దిగజారిపోతుంది, జాతినుంచి గూడా' అని లాలాగారు ఇంట్లోవాళ్ళకు నచ్చజెప్పారు. కాని ఆయన ఇంట్లో మున లమ్మలకు మిగిలిన హిందూస్త్రీల జాతి-ధర్మం గురించిన ఆలోచనకంటె తమ వ్యక్తిగతమైన పుణ్యం - స్వర్గం గురించిన ఆలోచనే ఎక్కువగా వుండేది. వాళ్లు సోమాని తమవద్ద వుండనివ్వలేదు

నిర్భయరామ్ చౌధరి ఆలోచించారు. ధర్మశాల జిలాకి ముఖ్యస్థానం అవటంచేత, అక్కడ చదువుకున్న పంజాబీలగ్రామం వుండటంచేత కాంగడాకంటె ధర్మశాల ఎక్కువ చదువుకున్నవాళ్ళకి, ఉదారస్వభావంగలవాళ్ళకి చోటయివుంటుంది. సోమాకి ధర్మశాలలో ఎవరైనా మంచి గృహస్థునివద్ద కొంతకాలంపాటు ఏర్పాటు జరుగవచ్చు. తర్వాత ఆమె వివాహం జరిపించేయవచ్చు. లేకపోతే పంజాబులో ఏదైనా వితంతు ఆశ్రమానికి పంపించవచ్చు. సోమా మహమ్మదీయుల చేతుల్లో గాని, క్రైస్తవులచేతుల్లోగాని పడుతుందేమోననే అనుమానంతో చౌధరిగారు. లాలా గోపీచంద్, మిగతా హిందూసమాజ సేవకులు బాధపడసాగారు. కాని ఏ మంచి హిందూగృహస్థుడూ కూడా లేచిపోయిన స్త్రీకి ఇంటో స్థానం ఇవ్వడానికి

ముందుకు రాలేదు. చివరికి అంటూ - మైలా లేని ఒక దయగల ప్లీడరుగారి ఇంట్లో సోమాని వుంచడం జరిగింది.

ఇరుగుపొరుగు స్త్రీలు సోమాని చూడటానికి కుతూహలంగా గుమికూడటం మొదలుపెట్టారు. పరస్పరం భయంగా చేతులు తిప్పుకుంటూ చెప్పుకునేవారు. 'అయ్యో, చచ్చాను, ఎంత ధైర్యంగల ఆడది! తన ఇష్టంవచ్చిన మొగాడితో బాటు వెడతానంటోంది'. ఇంకొకావిడ సిగ్గుతో ముక్కుమీద వేలేసుకుని 'చావాలి ఇటువంటి సిగ్గుమాలినది. ఇదికూడా ఒక ఆడదేనా!' అనేది. కొంతమంది జైలుకు వెళ్ళిన పురుషుని భార్యని చూడటానికి వచ్చేవాళ్ళు. ప్లీడరుగారు ఒక్కనెలలో ఈ తమాషాచూసి గుంపువల్ల భయపడటం మొదలుపెట్టారు. ఇంటిలో వయసు వచ్చిన ఆడపిల్లలున్నారు. వాళ్ళకి లేచిపోయివచ్చిన స్త్రీ సాంగత్యం మంచిది కాదని ఆయన చెప్పేవారు.

ధనసింగ్ జైలునుంచి విడుదల కావటానికి ఇంకా నాలుగునెలలుంది. సోమా రెండునెలలు సలహాలు పొందికూడా ధనసింగ్‌నివదిలి వితంతువివాహం చేసుకుని మంచిస్త్రీ అవటానికి ఒప్పుకోలేదు. సమాజం మేలు, సదాచారంగురించి ఆలోచించే సత్పురుషులు ఆలోచించారు—దుర్మార్గుడయిన డ్రైవరు విడుదల కాగానే ఈ స్త్రీ మళ్లీ అతనిదగ్గరకు వెళ్ళిపోతుంది. అనవసరంగా పనికిమాలిన దవుతుంది. అంతకుముందే ఈమెను పంజాబులోవున్న వితంతు ఆశ్రమానికి దేనికైనా పంపించడమే మంచిది. కాని సోమాని సురక్షితంగా ఆశ్రమంలో చేర్చడానికి పంజాబు తీసుకువెళ్ళే విశ్వాసపాత్రుడైన వాళ్లెవరున్నారన్నదే ప్రశ్న.

చౌధరిగారు ధర్మశాలలో పోలీసు అధికారుల బజారులోవున్న మోటారు స్టాండుదగ్గరనుంచి వెడుతున్నారు. ఆయనదృష్టి కామ్రేడ్ భూషణ్ మీద పడింది. అతన్ని సంబోధించి 'నువ్వు క్రిందకు (పంజాబు) ఏమైనా వెడుతున్నావా?' అని అడిగారు.

తండ్రిగారి స్నేహితుడు, గౌరవనీయుడైన చౌధరిగారినిచూసి కామ్రేడ్ తన చేతిలోని సిగరెట్టునైనా పారేయలేదు. కాంగడాలోవున్న ఆచారాన్ని అనుసరించి గురువుగారిపాదాలు తాకటానికి వంగే కష్టమూ పడలేదు. 'చెప్పండి బాబాయిగారూ, ఏదైనా పనుందా?' అనడిగాడు.

భూషణ్‌ది మొరటుప్రవర్తన అయినప్పటికీ అతను విశ్వాసపాత్రుడైన వాడని చౌధరిగారు అనుకునేవారు. పంజాబునుంచి వచ్చివెళ్ళేవాళ్ళతో భూషణ్‌కు బాగా పరిచయం వుంటుందని ఆయనకు తెలుసు. ఆయన భూషణ్‌కు సోమా కథ నంతా వినిపించారు. ఆమెను ఏదో ఒకవిధంగా లాహోర్‌గాని, ఫిరోజ్‌పుర్‌గాని చేర్చటానికి ఏర్పాటుచేయమని బలవంతపెట్టారు.

'ఆమె ఎక్కడికి వెళ్ళటానికి ఇష్టపడుతోంది?' భూషణ్ అడిగాడు.

'ఆమె ఎక్కడికి వెళ్ళటానికి ఇష్టపడుతుంది!' చౌధరిగారు విసుగుతో అన్నారు—'ఆమె ఆ దుర్మార్గుడిదగ్గరకే వెడతానంటోంది. అతను నాలుగునెల్లో జైలునుంచి విడుదలవుతాడు. అంతకుముందే ఆమె ఇక్కడనుంచి వెళ్ళిపోవటం మంచిది. ఇక్కడ ఆమెను వుంచడానికికూడా ఎక్కడ కుదురుతుంది?'

'అయితే అతనిదగ్గరకే వెళ్ళనీయరాదా!' కామ్రేడ్‌కు ఇంత అమర్యాద కరమైనమాట చెప్పటానికి సంకోచంకూడా లేదు. చౌధరిగారు బాధపడి చెప్పారు. మీ సమయంవస్తే అదే జరిపిస్తారు. కాని మేముమాత్రం ఇటువంటి దురాచారం చూడలేము. ఇక్కడ ఆమెను నాలుగునెలలు వుంచుకునే దెవడు? ఎవరైనా మంచి మనిషి ఇటువంటి పోగరుబోతుస్త్రీని తన కుటుంబస్త్రీలతో ఎలా అట్టే పెట్టుకో గలడు?'

చౌధరిగారి బాధను లెక్కచెయ్యకుండా భూషణ్ వత్తిడిచేశాడు. బాబాయి గారూ, ఎవరైనా స్త్రీ-పురుషులు ఒకచోట కలిసివుండాలనుకుంటుంటే వాళ్ళని బల వంతంగా వేరుచేసి దూరంగా వుంచితే అలా కలుసుకోవాలన్నకోరికలో వాళ్ళు దుర్మార్గులవుతారుగూడా. వాళ్ళని ఒకచోట వుండనిస్తే దుర్మార్గం అడుగంటి పోతుంది. చివరికి ఆమెను ఎవరివశం చేసినా సరే! ఆమె ఎవరినైతే కోరుతోందో, ....అలా కోరటమేం చెడ్డదా?'

'అరే బాబూ, పెళ్ళికూడా అయిపోయిందంటే ఇంకేమన్నా వుందా!' చౌధరిగారు తన చేతికర్రని ఆసరాగా తీసుకుని తెలియజెప్పారు. 'చివరికి మన ఋషులు ఆలోచించి - విచారించే శాస్త్రాలు వ్రాశారు!'

'అతన్నే పెళ్ళి చేసుకుంటుందా ?' కాన్రేడ్ మాట మార్చేసి అడిగాడు. "అప్పటివరకూ ఆమె వుండటానికి ఏర్పాటుచేయనా ?'

కాన్రేడ్ చౌధరిగారి ముఖంమీద సందేహం, ఆశ్చర్యాలతోకూడిన భావం చూసి, ఆయన ఇంకా ఏమీ అనలేకముందే 'లాలా జ్వాలాసహాయ్‌గారి భవనంలో ఏర్పాటు చేయనా ? ఆయన గౌరవనీయులైన వృద్ధులు. ఆయనమీదైతే నమ్మక ముంచుతారు గదా !' అనడిగాడు.

• • •

# పెద్ద మనుష్యులు

లాలా జ్వాలాసహాయ్ సరోలా ధర్మశాలలో నివసించే పంజాబీలలో ప్రముఖుడు. ఆయన కాంట్రాక్టువ్యాపారం జిల్లా అంతటిలో వ్యాపించింది. అడవిలోని కర్రల కాంట్రాక్టులు, వంతెనలు, రోడ్లు నిర్మించే కాంట్రాక్టులు, యుద్ధపువమయంలో ఇతరదేశాలనుంచి వచ్చే యుద్ధఖైదీల కాంపులు నిర్మించే కాంట్రాక్టులు, అన్నిపనులూ చేస్తుండేవారు. మధ్యతరగతి పంజాబీ వ్యాపారస్థుని పద్ధతిలోనే వుండటానికి ఇష్టపడేవారు. కాని సంతానంమటుకు పశ్చిమ వాతావరణాన్ని, ఆధునిక భావాల్ని, జీవితపద్ధతిని అవలంబించారు. నలుగురు కొడుకులతర్వాత ఒకే కూతురు వారి ఇంట కలిగింది, చాలా గారాబంగా పెరిగింది. మనోరమ లాహోర్ కాలేజీలో బి. ఏ. చదువుతోంది. విదేశాలకు వెళ్లటానికి ఉవ్విళ్ళూరుతోంది.

మనోరమ పంట్లాము ధరించి, తలమీద ముసుగులాంటిదేమీ లేకుండా, పెద్దకుక్కని తోలుబెల్టుతో పట్టుకుని, కర్ర ఊపుకుంటూ నిర్మానుష్యమైన రోడ్లమీద షికార్లుచేస్తూ తిరుగుతూవుండేది. ధర్మశాలలో నివసించే కొండజాతిప్రజలు ఆమెనుగురించి విమర్శ చేసేవాళ్లు కాదు. తమ జిల్లాలోగాని, బంధుసమూహంలోగాని ఎవరైనా ఆ అమ్మాయిని ఇటువంటివేషంలో చూపినట్లయితే బహుశా ఆ అమ్మాయి తల నరికేందుకే సిద్ధపడేవాళ్లు. కాని మనోరమని వాళ్లు 'ఈ అమ్మాయి ఎంత సాహసం గలది ! ఎవరికీ దడవదు' అని పొగడేవాళ్లు. ఇది ఎలావుందంటే ఇంగ్లీషు పరిపాలనలో పరాయివ్యక్తి కొడుకు దేశభక్తికోసం జైలుకు వెళుతుండగానో, వురికంబం ఎక్కుతుండగానో చూసి జయజయధ్వానాలు చేస్తుండేవాళ్ళు - అలా వుంది. స్వయంగా తమ సంతానం ఇలా చేస్తుండగా చూస్తే దుఃఖంతో కుమిలిపోతూ తల బాదుకునేవారు.

మనోరమ, మనోరమ తల్లి, మనోరమ వదినగారు ఒకసారికలిసి బజారు బయలుదేరితే మార్పుచెందుతున్న సమాజంలోని మూడుతరాలు ఒకచోట కలిసినట్లనిపించేది. తల్లిగారు బరువైన వల్ల సిల్కుపావడా ధరించి, తలమీద రెండు మల్లుగుడ్డ దుప్పట్లుకలిపి కప్పుకుని అరజానెడు ముసుగులాక్కుని, కాళ్ళకు చెప్పులు

తొడుక్కొని వెళ్ళేవారు. జ్వాలాసహాయ్‌గారి బారిస్టరు కొడుకుభార్య పిల్కాచీర కొంగు తలమీద వేసుకునేది. తలమీదనుంచి ముసుగు లాక్కునేదికాదు. కాళ్ళకి చెప్పులు తొడుక్కునేది. మనోరమ తలమీద ఏమీ కప్పుకోకుండా, మెడమీద బరువైన జుట్టు ముడివేసుకుని, వదులుగావున్న పంట్లాము ధరించి, భుజాలకు పర్పు వేళ్ళాడేసుకుని నడిచేది.

భూషణ్, మనోరమలకు లాహోర్‌నుంచే పరిచయం వుంది. భూషణ్ కాంగడాజిల్లాలో నివసించేవాడు. కాలేజి చదువుకోసరం లాహోర్‌లో వుంటూ వుండేవాడు. నాలుగుసంవత్సరాలక్రితం మనోరమ సోదరుడైన జగదీశ్‌సహాయ్, భూషణ్‌లు బి. ఏ. లో చదువుతుండేటప్పుడు మనోరమకూడా కాలేజిలో చేరింది. భూషణ్, జగదీశ్‌లలో ఒకే భావాలు. స్నేహం ఏర్పడ్డాయి. ఇద్దరూ కమ్యూనిస్టు భావాల్ని ప్రచారం చేసేవాళ్ళు. అక్కడనుంచీ, ఇక్కడనుంచీ పుస్తకాలుతెచ్చి విద్యార్థులచేత చదివించేవాళ్ళు. ఎప్పుడైనా మార్క్సువాదం వర్ణనకోసరం క్లాసులు గూడా నడిపించేవాళ్లు. సోదరుని ప్రోద్బలంవల్ల మనోరమకూడా ఈ క్లాసుల్లో కలిసేది.

జగదీశ్ బి. ఏ. పాసై విదేశాలకు వెళ్ళిపోయాడు. భూషణ్ లాహోర్‌లోనే ఎమ్. ఏ. లో చేరాడు. అతను మనోరమని కలుసుకుంటూనే వుండేవాడు. మనోరమ విద్యార్థి-సంఘం (స్టూడెంటు-పెడరేషన్)లో పాల్గొనేది. లాలా జ్వాలా సహాయ్ కూతురి చురుకుదనంగురించి హెచ్చరికగూడా చేస్తుండేవారు. ఆమె సాహసం, సామర్థ్యంచూసి లోలోపల సంతోషపడేవారు కూడా.

భూషణ్ తత్వశాస్త్రంలో డిస్టిన్‌క్షన్‌తో (ఘనతతో) ఎమ్. ఏ. పాసయాడు. బాంకులో గుమాస్తా వుద్యోగంలో చేరాడు. బాంకువుద్యోగం, కమ్యూనిస్టుపార్టీపని కలిపి చేస్తుండేవాడు. రెండుపనులూ సరిగా కుదరలేకపోతుండేవి.

1939 వ సం॥ లో యూరప్‌లో యుద్ధం ప్రారంభమయింది. భారత దేశంలోవున్న ఇంగ్లీషు అధికారులు భారతదేశాన్నిగూడా యుద్ధంలోకి ఈడ్చారు. రాజనైతికంగా జాగ్రత్తగల భారతీయులు ఇంగ్లీషుప్రభుత్వం చేసిన ఈ నిర్ణయాన్ని తిరస్కరిస్తుండేవారు. భూషణ్‌కు బాంకిపనికన్నా భారతదేశాన్ని యుద్ధంలోకి లాగ

టాన్ని తిరస్కరించటం ఎక్కువ అవసరం అనిపించింది. అతను వుద్యోగం వదిలిపెట్టి రాజనైతికకార్యంలో నిమగ్నుడై పోయాడు.

కాంగడే గ్రామంలో నివసించే భూషణ్ తల్లి - తండ్రీ కుమారుని సాధ్యమైనంతవరకూ లాహోర్‌లో పెట్టి చదివించాలనీ, చదువు పూర్తిచేసినమీదట కొడుకు పెద్ద ఆఫీసరవుతాడనీ ఆశపెట్టుకున్నారు. అతను పదహారేళ్లు చదివి బాంకిలో డెబ్బైఅయిదురూపాయల వుద్యోగంలో చేరగానే వాళ్ళహృదయాలు శృంగిపోయాయి. అతను ఆ వుద్యోగంకూడా వదిలిపెట్టేసరికి తల్లీ-తండ్రీ అతన్ని పూర్తిగా నిష్ప్రయోజకుడిగానూ, దేశద్రిమ్మరిగానూ భావించారు. ప్రభుత్వ వుద్యోగం, ప్రభుత్వసేవ చేసేప్రజలు గొప్పవాళ్ళవుతుంటారు. ఆ అవకాశం తిరస్కరిస్తే పరిణామం ఏమవుతుంది?

మధ్యతరగతి గృహస్థుడయిన పట్టణవాసికి బ్రతుకుతెరువు చూచుకోవటం, కుటుంబనిర్వహణకు మార్గాలు వెతుక్కోవటంలాటి అనేక కార్యభారాలుంటాయి. భూషణ్‌కు, అతని స్నేహితులకు, దేశస్వాతంత్ర్యంకోసం, యుద్ధాన్ని తిరస్కరించే ఆందోళన నడపటంకోసం విద్యార్థిసమూహంమాత్రమే సహకరిస్తుండేది. ఆ ఏర్పాటులో అతను మనోరమని కలుసుకోవటంకోసం సరోలాగారి బంగళాకు వెడుతూవుండేవాడు. మనోరమ యుద్ధాన్ని తిరస్కరించేపోట్లాటలో ఎక్కువగా పాల్గొనలేకపోయినాగూడా భూషణ్‌ని చాలా గౌరవించేది, నమ్మేది కూడా.

జగదీశ్ సహాయ్ సరోలా ఇంగ్లండునుంచి బారిష్టరై తిరిగివచ్చాడు. అతడు తిరిగివచ్చినమీదట ఒక నేర్పుగల స్నేహితునిసాయం దొరుకుతుందని భూషణ్‌కు ఆశ కలిగింది. కాని ఇప్పుడు బారిష్టర్‌కి అనారోగ్యకరమైన లాహోర్ రోడ్ల దుమ్ము పీల్చడం, అనాగరికులగుంపుతో భుజాలు రాసుకుంటూ తిరగటం నచ్చలేదు. ఇంగ్లండులో వుండేటప్పుడు జగదీశ్ సరోలా ఏ కొత్తజీవితపు ఆశయాలనీ, మానసికానందపు పరిచయాలని పొందాడో, వాటిప్రభావం అతనిమీద బాగా పడింది. అతనిభావాలు సమాజవాదానికి సంబంధించిన సిద్ధాంతాల్లోకి, తత్వశాస్త్రపు ధారల్లోకి లోతుగా పాతుకుపోయాయి. ప్రజలకు సంబంధించినపని చేయటంలో కన్నా ట్రాట్‌స్కీ, లెనిన్‌ల భావాల్ని పోల్చిచూడటంలోనే అతను ఎక్కువ

ఆనందం పొందేవాడు. ట్రాట్‌స్కీ, లెనిన్‌ల కార్యక్రమాలను, వాళ్ళ వాదాలను పోల్చి చూసేవాడు. ఈ తర్కమే అతనికి సరిపోయేది.

కమ్యూనిస్టుల కార్యక్రమంలో భావస్వాతంత్ర్యం ఆక్రమించినస్థానాన్ని శబ్ద ప్రమాణం (Dogmatism) తీసుకుందని జగదీశ్ తెలుసుకోనాగాడు. వాళ్ళ ప్రవర్తనలో విమర్శకు సంబంధించిన లోటు అతనికి చాలా అసంతృప్తిని కలిగించేది. ఈ దేశంలోని కమ్యూనిస్టులు వాళ్ళ అధ్యయనాన్ని గౌరవించటంలేదని అతనికి చాలా బాధగా వుంటూవుండేది. ఈ ఆందోళనగురించి సానుభూతి తెలియపరచటంలోగాని, అందులో పాల్గొనటంగురించిగాని జగదీశ్ మనోరమని ప్రత్యక్షంగా విరోధించేవాడు కాదు. 'ఏముంది ఇదంతా మూర్ఖత్వం. అనవసరంగా శక్తిని ధారపోయటం....' అని సలహా ఇచ్చేవాడు.

జగదీశ్ ప్రవర్తనలో మార్పు రావటంచూసి భూషణ్ అతనివద్దకు రావటం చాలా తగ్గించేశాడు. ఏదైనా కొంచెం స్నేహం, కలయిక మిగిలివుంటే అది భావాల సమన్వయంవలన కాదు, పాత స్నేహంవలన మాత్రమే. ఆ స్నేహంకూడా బారిస్టర్ సరోలాకు అణకువ, భూషణ్ పట్ల దయ వున్నప్పటికీ క్రమంగా తగ్గిపో సాగింది. భూషణ్ దృష్టిలో ఆ మాటలకు చెప్పుకోదగిన విలువలేదు. అతనికి వాటి ఆనందం చవిచూసేందుకు వ్యవధిలేదు. భూషణ్ ఎదురుపడగానే మనోరమ తమ ఇంటికి రానందుకు అతన్ని నిందించేది. భూషణ్ వాళ్ళ ఇంటికి వెళ్ళినాకూడా జగదీశ్‌తో కలిసి చర్చించటంలో వుత్సాహం చూపించేవాడు కాదు. తలతిప్పి వూఁ-వూఁ అంటూ మౌనంగా వుండిపోయేవాడు. సిగరెట్టుపొగ పీల్చకుండానే యాష్ ట్రేలో దులుపుతూ వుండేవాడు. ఆ చర్చలలో మనోరమ సోదరునిపట్ల కాకుండా భూషణ్ పట్ల సానుభూతిచూపుతూ వుండేది. మనోరమ ఆ సానుభూతి తెల్పటానికి కారణం చర్చలోని అంశంకాదు, భూషణ్ మీదవున్న గౌరవమేనని బారిస్టర్ నమ్మకం.

ఇరవైయేళ్లు నిండిన కూతురు ఇంటోవుండగా ఆమె వివాహంగురించిన ఆలోచన చేయకుండా వుండటమనేది సంభవం కాదు. కాని మనోరమను ఎమ్. ఏ. వరకూ చదివించి, ఇంతవయసువరకూ స్వతంత్రంగా వుండనిచ్చి, ఇప్పుడు ఆమె వివాహం తమ నిర్ణయాన్నిబట్టి చేసేటటువంటి అధికారాన్ని తల్లీ-తండ్రీ పోగొట్టుకున్నారు. ప్రస్తుతం ఆవిషయం ఆలోచిస్తూవుండటమే వారు చేయగలిగింది.

జగదీశ్ విదేశాలకు వెళ్ళిపోయాడు. భూషణ్ ఎమ్.ఏ. లో చేరాడు. మనో రమ అప్పుడు ఎఫ్.ఏ.లో వుంది. భూషణ్ మంచిమార్కులతో బి.ఏ. పాసయ్యాడు. అదే సామర్థ్యంతో ఎమ్.ఏ. కూడా పాసై ఏదైనా కాలేజీలో ఉపాధ్యాయుడి వుద్యోగం పొందాలని అతనికి ఆశగా వుండేది. ప్రొఫెసరు జీవితంలో డబ్బు ఎక్కువగా వస్తుందన్నమాట నిజంకాదు. కాని గౌరవం. విశ్రాంతిమటుకు ఎక్కువగా వుంటాయి. మనిషి సరైన మెట్టుమీద కాలుపెట్టినతర్వాత దారిద్ర్యపు వరద మంచి సురక్షితమైనస్థానంలోకి చేరగలడనటంలో సందేహంలేదు. అటువంటి ఆశలపొంగులో భూషణ్ సంకోచిస్తూ సంకోచిస్తూనే. చూపులతోనూ. మాటల తోనూ తన అనురాగాన్ని మనోరమకు స్పష్టపరిచాడు. చిన్నప్పటినుంచీ ఇంగ్లీషు స్కూళ్లలో చదివిన మనోరమ ఆ స్నేహపు తలంపువలన భయపడలేదు. తటాలున అందులోపడి కొట్టుకుపోనూ లేదు.

భూషణ్ ఎమ్.ఏ. పాసై బాంకిలో డెబ్భైఅయిదురూపాయల వుద్యోగం చేయాల్సి వచ్చేటప్పటికి అతని భావాల్లోనూ. ప్రవర్తనలోనూ తీవ్రమైన మార్పు వచ్చింది. అతను హీనతకు గురి అవుతూవుండేవాడు. అతని ఈ హీనతకు. పోట్లాట. సమాజవాదం. హృదయపూర్వకమైన దయ. బుద్ధివికాసం. ఎదురీదలేవు. అతని జీవితాన్ని విఫలం చేసేటటువంటి చట్టాన్ని ఎదిరించటం. చట్టంతో పోట్లా డటంతప్ప అతనికి మిగతావిషయాలన్నీ అనవసరం. భూషణ్ 'ఆత్మగౌరవం' గురించిన తలంపువలన 'ఈర్ష్య'ని అసహ్యించుకునేవాడు. కాని జగదీశ్‌తో తనని పోల్చుకోకుండా వుండలేకపోయేవాడు. ఆ అన్యాయానికంతటికీ కారణం ఏమిటి? సమాజంలో అవకాశాలు అందరికీ సమానంగా అందకపోవటమే! అతను జీవి తంలో తియ్యటికోరికలని ఎన్నో వదిలిపెట్టేశాడు. మనోరమ స్నేహం పొందాలనే ఆశగూడా.

భూషణ్ చాలారోజులు రాకపోయేసరికి మనోరమకు కష్టమనిపించింది. భూషణ్‌వంటి మనిషిగూడా మోసంచేసి వెళతాడా, అన్న అనుమానం కలిగింది. నిర్మల. సత్య ఆ రోజుల్లో ఫెడరేషన్‌లో ఎక్కువగా పాల్గొంటూవుండేవాళ్ళు. భూషణ్‌నిగూడా ఇలా అనుమానించాలా అని మనోరమ ఆలోచించసాగింది. ఇందులో ఆమెకు తనే అవమానం పొందుతున్నట్లుగా అనిపించింది.

కొద్దిరోజులు మనోరమ భూషణ్ కోసరం ఎదురుచూసి, ఆ తర్వాత విషయం అటో ఇటో తేల్చుకోవటమే మంచిదని నిశ్చయించుకుంది. ఆ తర్వాత కొన్నాళ్ళకి భూషణ్ రోడ్డుమీద కలిశాడు. మనోరమ వెంటనే కారు ఆపించి 'మీరు ఎక్కడ వుంటున్నారు?' అని అడిగింది. మాట్లాడినమాటలైతే అవే కాని ఆమెచూపులు ఇంకా ఎన్నో విషయాల్ని అడిగాయి.

మనోరమ కారులో భూషణ్‌ను తన బంగళాకు తీసుకువెళ్ళింది. అతను మనోరమతో స్పష్టంగా ఏమీ చెప్పలేదు. కాని ఆత్మగౌరవంచేత, తనలోవున్న అనురాగపు తలంపుతో, తిరస్కారంగూడా చేయలేకపోయాడు. తనతో మాట్లాడటంలేదనే నేరాన్ని మనోరమ అతనిపై మోపింది. దానికి తన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోవటం అవసరమనుకున్నాడు. భూషణ్ ఎటువంటి అస్పష్టమైన సూచనలతో అనురాగాన్ని తెలియపరచాడో అలాగే నిర్దోషిత్వాన్నిగూడా ఎరుకపరిచాడు.

'.........సిద్ధాంతంకన్నా వ్యక్తిగతమైన అనుభవం శక్తివంతమైనదిగా వుంటుంది. నా కలలు భగ్నమైపోయాయి. చేసినపొరపాటుని నిజమని నిరూపించటంకోసం ఇంకొక పెద్దతప్పు చేసేకంటే ఆ తప్పును తప్పుగా ఒప్పుకుని మళ్ళీ ఆ పొరపాటు చేయకుండావుండటం ఎంతో మంచిది. నావంటి బీదవాళ్ళు రోజులు గడపటానికి భయపడతారు. ఇప్పుడున్న సమాజపు ఏర్పాటులో నాకోసం, నావంటి వాళ్ళకోసం, ఒక స్థానాన్ని పొందలేను. అణచివేయబడికూడా బ్రతికి వుండటంలో ఏ ఆనందాన్నీ పొందలేను. నాకు జీవించడానికి అవకాశం ఇవ్వనటువంటి చట్టానికి వ్యతిరేకంగా నేను ప్రాణాలకి తెగించి పోట్లాడతాను. మీకు తెలుసు, నా విలువ రెండొందలయిదురూపాయల నెలజీతం!' అతను ఇంగ్లీషులో చెపుతున్నాడు. ఆమెకళ్ళు తడిసిన గులాబీలలా ప్రకాశిస్తున్నాయి. 'రెండొందలయిదు రూపాయల నెలజీతంతో జీవితం ఏం గడుస్తుంది? నన్ను నేను మోసం చేసుకోలేను, ఇంకొకళ్ళని నేను మోసం చేయలేను.'

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూవుండగానే సూర్యాస్తమయం అయిపోయింది. వాళ్ళు బంగాళాకు ముందున్నతోటలో కూర్చునివున్నారు. బారిస్టరు సరోలా భూషణ్‌నిచూసి అక్కడికి వచ్చారు. అతను వాళ్ళకి వెనకవైపు వుండటంచేత భూషణ్, మనోరమ అతన్ని చూడలేకపోయారు.

'క్షమించాలి. నేను రావచ్చా!' మాటలు విని వాళ్ళు వెనక్కి తిరిగిచూశారు. పెదవుల్లో చుట్ట పెట్టుకుని నిలబడివున్న బారిస్టర్ కనిపించాడు.

'ఆ, ఆ! తప్పకుండా' అన్నాడు భూషణ్. బారిష్టరు రాకవలన సంకోచించ కుండా అతను చెప్పుకుపోతూనే వున్నాడు. 'నిజానికి ఈ పోట్లాట అంతస్థులకు సంబంధించినది. నేను డబ్బులేని బీదవాళ్ళవర్గంలో చెందినవాడిని. ఈవిధంగా చూసినట్లయితే నేను మీ అంతస్థుకు శత్రువుని.'

బారిష్టరు నవ్వి వాళ్ళకు దగ్గరగావచ్చి కూర్చున్నాడు. చుట్ట నోటిలో పెట్టుకుని ఒక పెద్ద దమ్ములాగి వదిలిపెట్టాడు. శ్రేష్ఠమయిన పుగాకు వాసనతోనిండిన పొగలో తియ్యని - పదునైన మత్తుమందు వాసనగూడా వుంది. నరోలా ఇంగ్లీషులో అన్నాడు—'భూషణ్, నీ మాటల్లోవున్న నిజాన్ని నేను సామాజికదృష్ట్యా ఒప్పు కుంటాను. కాని నువ్వూ, మేము మంచి మనుషులం. ధర్మంకోసం జరిపే పోట్లా టలోవున్న నీతిబద్ధమైన నియమాల్ని మనం ఆచరించగలం. మనం శత్రుత్వపు కందకాలలో వున్నామనేది కేవలం ప్రకృతిబద్ధమైన కలయిక. దీని జవాబుదారీ నీపైనగాని, నాపైనగాని లేదు. సమాజంపైన వుంది. మనం మన పద్ధతులతో సమాజంలోని చట్టంతో పోట్లాడగలం. మనలో మనం ఎందుకు పోట్లాడుకోవాలి? ఏం మనో!'

మనోరమ సోదరుని రాకవలన తనని తాను సంబాళించుకుంది. మెడమీద వూగే జడని కదలిస్తూ, నవ్వుతూ 'యుద్ధంగురించి నేను ఈయనతో పందెం వేయటం లేదు' అంది.

బారిష్టరు ఇంకొక పెద్దదమ్ములాగి తనమాటని సమర్థించాడు—'పూర్తిగా యథార్థం, ఇదే మంచితనం.'

మంచితనం అనేమాట వినగానే భూషణ్ నుదుటిపైన ముడుతలు పడ్డాయి —'ఈ బంగళా వాతావరణంలో' అతను గట్టిగావున్న బంగళా గోడలవైపు వేలు పెట్టి చూపుతూ చెప్పాడు. 'మంచితనం ప్రకాశించగలుగుతుంది' అతను బంగ ళాకు ఒకవైపున పనిచేసేవాళ్లకోసం కట్టించబడిన చిన్నచిన్న గదులవైపు చేత్తో చూపించి, 'ఒకవేళ అక్కడ ప్రకాశించలేకపోవచ్చు' అన్నాడు. అక్కడ కేవలం

భయం వ్యాపించివుంది. ఈ మంచితనానికి విలువ ఏముంది? అసలు సమాజంలో మంచి అనేదేముంది? అదంతా లాక్కొని మీ పెద్దమనుషులసమాజం నిర్మించ బడింది. ఇది ఎలా వుందంటే, కాశ్మీర్‌లోనో, కుల్లూలోనో వుండే ఓ ఆపిల్ తోటలోవున్న చెట్లన్నిటిమంచి పళ్లుకోసి, వాటి కండ, రసము, సువాసనల సారాన్ని లాగేసి, పది-పదిహేను కుండీలలో కొత్త మొక్కలకోసం పాతిపెట్టబడినట్లుగా వుంది. మిగిలిన భాగమంతా సారం లేనిదై, కుళ్ళిపోయి, ఎండిపోయి, వికృత రూపంతో, శక్తి - కాంతి అనేవి లేనిదిగా అయిపోతుంది. పెద్దరికం అంతస్థులో ఖరీదైన పూలకుండీలలో పాతిపెట్టబడి, మంచితనంతో పరిమళించే మీ సమాజం తనలో తాను ఎంతైనా సంతోషించనీ. కాని అది మా సమాజానికి భరించలేని అన్యాయం.

బారిస్టరు వేళ్ళమధ్యవున్న సిగార్‌నుంచి ఇంకొక దమ్ములాగి చెప్పాడు— 'మిత్రుడా, నీ తీక్షణమైన ఉపమానం అతకలేదు. నువ్వు ఒకమాట మరచిపో తున్నావు. ఈ పెద్దమనుష్యులు క్రమంగా వికసించే సమాజానికి ఒక అవసరమైన గొలుసు. వీళ్ళే సమాజపు పెద్దరికాన్ని కాపాడుతారు. తోట కాలిపోతే మిగిలివున్న పది-పదిహేను కుండీలే కొత్తసమాజంకోసరం అంటుమొక్కలనీ, విత్తనాలనీ ఇస్తాయి, తెలిసిందా!'

'కాదు, కాదు, మాకు సమాజమంతటికీ అవకాశం ఇవ్వాలి.' భూషణ్ కోపంతో అన్నాడు—'పది-పదిహేను కుండీలపొగడ్తతో తోటంతటికీ కలిగిన దుర వస్థ సహింపరానిదవుతుంది. మా నాగరికత, మీ సమాజపు పెద్దరికానికన్నా ఎక్కువ వికాసం పొందుతుందని లెనిన్ అన్నారు.'

బారిస్టర్ పట్టుదలతో అన్నాడు, 'నేటి ధనికవర్గంలో చాలా అందమూ, శ్రేష్ఠత వున్నాయనీకూడా లెనిన్ చెప్పారు. అదంతా కార్మికుల సంస్కృతిలో కలిపి వుంటుంది. ఈ పరిస్థితిలో మేము ప్రపంచంలోవున్న పెద్దరికాన్ని తాకట్టుగా పెట్టు కుని కాపాడుతున్నాం.'

భూషణ్ మధ్యలో ఆపాడు, 'మీరు చేస్తున్నది తాకట్టుసొమ్మును కాపా డటం కాదు, అపహరించటం.'

బారిస్టరు, భూషణ్‌ల చర్చ చాలామటుకూ రాజనీతికి సంబంధించినదై పోయింది —'నువ్వు భారతదేశంనుంచి బయటకువెళ్ళి చూస్తే తెలుసుకుంటావు. భారతదేశంలో అయితే ఇంకా పరిశ్రమలు నెలకొల్పలేదు. ఇక్కడ ఇంకా కార్మిక సమాజ విప్లవానికి సరైన వికాసమే జరగలేదు. ఈ విప్లవం కేవలం రాష్ట్రాంతర పరిస్థితుల ఆధారంమీదనే జరగవచ్చు. ఇంగ్లండులో సమాజవాదానికి సంబంధించిన విప్లవానికి ఫలితంగా భారతదేశంలో విప్లవం జరగవచ్చు. ఇప్పుడు నాజీవాదంతో పోట్లాడే ఇంగ్లండులోని ప్రజాతంత్రపు శక్తిని మీరు వ్యతిరేకిస్తున్నారు. ఇది చాలా పెద్ద పొరపాటు' అని బారిస్టరు ఒత్తి పలికారు.

భూషణ్ మళ్ళీ తిరస్కరించాడు—'ఇంగ్లండు ప్రజాతంత్రంకోసం పోట్లా డటంలేదు. నాజీవాదానికివున్న సామ్రాజ్యకాంక్షకు వ్యతిరేకంగా, తన రాజ్యాన్ని కాపాడటంకోసం పోట్లాడుతోంది. దానికి సామ్రాజ్యమేముంది, మన బలహీనత. మనం మన విముక్తికోసం పోట్లాడుతున్నాం.'

మనోరమకి తనమాట చెప్పటానికి అవకాశం దొరకటం లేదు. మెదలకుండా వుండటంకన్నా ఇంకొకవుపాయం దొరకలేదు. లేచి తన గదిలోకివెళ్ళి పడుకుంది. కొంచంసేపటితర్వాత భూషణ్ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోవటం మనోరమ తనగది కిటికీలోంచి చూసింది. ఆమె విస్మయురాలయింది. భోజనం చేయటం కోసం లేవటానికి వుత్సాహంలేదు. ఒకవేళ ఆమె భోజనంచేయటానికి తిరస్కరిస్తే అనవసరంగా పెద్ద కారణాలను అందరిఎదుటా చెప్పాల్సి వస్తుంది.

మనోరమ అర్ధరాత్రివరకూ రెండుచేతులూ తలకింద పెట్టుకుని ఇంటి కప్పు వైపు చూస్తూ తనకున్న సమస్యనుగురించి ఆలోచిస్తూ వుండిపోయింది. భూషణ్ 'ఇంకొకళ్ళని' దృష్టిలోపెట్టుకుని తనని మరచిపోలేదని తెలుసుకున్నతర్వాత కొంచం ఓదార్పు కలిగింది. ఆమెకు ప్రత్యేకం అవమానం జరగలేదు కాని భూషణ్ మ ఆమెనుంచి వేరుచేసే కందకంగురించి ఆమె పెద్దగా ఊహించసాగింది. జీవితపు ప్రవాహం స్వభావసిద్ధంగా ప్రవహించాల్సిన దోవలో భూషణ్ అడ్డువేసి అటంకాన్ని కలిగిస్తున్నాడని నిశ్చయించుకుంది. ఆ అటంకానికి తల ఒగ్గితే పిరికితనం ఆవహించి జీవితపుమార్గం ఓ మలుపు తిరుగుతుంది. తను తన జీవితాన్ని నాశనం చేసుకోదు.

వఫలం చేసుకుంటుంది. సమయం వచ్చినతర్వాత ఏది ఉచితమనితోస్తే అదే చేస్తుంది.

మనోరమ తన ఆలోచనల్ని దుఃఖాన్ని దిగమింగుకుంది. బుద్ధిగా చదువుతూ అప్పుడప్పుడూ షికారుకు వెడుతూవుండేది. ప్రజలకు సంబంధించిన పనుల్లో ఆమె సాయం తక్కువైపోయింది బారిస్టరుకు ఆ సేవ మూర్ఖత్వం అనిపించేది. బారిస్టరుతో అభిప్రాయభేదం వచ్చినతర్వాత భూషణ్ అతనిదగ్గరకు రావటం మానేశాడు. 'నాయింటికి రానప్పుడు, నాతో మాట్లాడనప్పుడు, నా హోదా-అంతస్థు కారణంగా నామీద నమ్మకం లేనప్పుడు, ఎవరివెనకాలైతేమాత్రం నే నెందుకు పరుగెత్తాలి?' అని మనోరమ అనుకుంది.

భూషణ్ తన జిల్లాలో పార్టీని కలపటంకోసం, పార్టీ మీటింగులు నిర్వహించటంకోసం ధర్మశాలలో వుండేవాడు. ఆ రోజు మనోరమని కలుసుకున్న తర్వాత ఒకటి రెండుసార్లు ఆమెదగ్గరకు వెళ్ళాడు. ఎప్పుడైనా రోడ్డుమీద కలుసుకోవటం జరిగితే పరస్పరం తప్పించుకుని పోయేవాళ్లు కాదు. అయిపోయిందేదో అయిపోయింది అనుకునేటటువంటిది భూషణ్ తత్వం, నువ్వు ఎలావుంటే నేనూ అలాగే వుంటాను అనేటటువంటిది మనోరమ తత్వం.

ఒకరోజు మధ్యాహ్నం రెండుగంటలతర్వాత సమాజం చేస్తున్న అత్యాచారానికి ప్రమాణరూపంగా వెక్కి-వెక్కి ఏడుస్తున్న సోమాని తీసుకువచ్చి మనోరమ ఎదుట నిలబెట్టాడు భూషణ్. మనోరమ తన సమాజంచేసే అత్యాచారానికి ప్రతీకారంగా తన ఉదారత్వాన్ని ప్రదర్శించ సిద్ధమయ్యింది. భూషణ్ స్నేహం పేరిట అనుచితమైన లాభాన్ని పొందకూడదనేభావంతో 'నువ్వు అమ్మగారితో ముందే మాట్లాడు. తర్వాత ఏదైనా తగవైతే లాభమేముంది?' అని స్పష్టంగా చెప్పాడు.

'అడిగితే వాళ్లు పదిమాటలు అని అభ్యంతరం పెడతారు. ఈమెను వుంచుకుంటే మెదలకుండా వుండిపోతారు' అన్నది మనోరమ. జరిగిందికూడా అదే.

సోమాని బంగళాలోని ఒక గదిలో ప్రవేశపెట్టగానే మనోరమ తల్లిగారు మండిపడ్డారు-'మనో్నీ, నీ బుద్ధి ఏమయింది? ఎవరినీ అడగవు, విచారించవు?

ఎవరో పరువు-ప్రతిష్ఠలూ లేని సిగ్గుమాలినదాన్ని తీసుకొచ్చి ఇంట్లో ఎలా వుంచుకో గలుగుతాము! ఏం మనం ప్రపంచంలో వుండనక్కరలేదా! మీ నాన్నగారితో చెపుతాను....'

మనో్న ఈ అత్యాచారానికి వ్యతిరేకంగా విప్పారినముఖంతో అన్నది— ఏం చేస్తుందీ ప్రపంచం? ఏం సిగ్గులేనిపని చేసిందా అమ్మాయి? ఈ రోజుల్లో ఆడ పిల్లని అడగకుండానే ఏ పెద్దమనిషి వాళ్ళపెళ్ళి చేస్తారు? ప్రపంచం సతీపార్వతిని పూజిస్తుంది. ఏం చేసింది పార్వతి? శివుడినే వివాహం చేసుకుంటానని మొండిపట్టు పట్టింది. ఆ మొండిపట్టుదలతోనే మండిపోయి చచ్చిపోయింది. ఈ అమ్మాయి ఏ అనర్థం చేస్తుంది? ఇంతేగదా, ఈమె పేదరాలు.'

తల్లిగారు మెదలకుండా వుండిపోయారు. లాలాగారికి, అమ్మగారికి, వాళ్ళ సంతానం లోకానుభవంలో మూర్ఖులైనప్పటికీ చదువుకున్నవాళ్ళు, బుద్ధిమంతులు, సమాజంలో గౌరవం వున్నవాళ్లు అని గట్టిగా నమ్మకం వుంది. దుఃఖంతో వడిలి పోయి, జ్వరపడినట్లుగావున్న సోమా ముఖాన్నిచూసి అమ్మగారి హృదయంకూడా కరిగిపోయింది.

సోమాకు ఈ ఇల్లూ, పరివారం కొత్త ప్రపంచంలా అనిపించింది. మనో్న సరిగ్గా తన వయసుదే. ఆమెదికూడా తన శరీరంవంటి శరీరమే. కాని ఇటువంటి స్త్రీని సోమా ఇంతకుముం దెప్పుడూ చూడలేదు. ఎలాగైతే తల్లి జ్వరపడిన పిల్లల గురించి జాగ్రత్త వహిస్తుందో, అలా మనో్న సోమానిగురించి ఆలోచిస్తూ వుండేది.

సోమా మధురానుంచి పారిపోయి వచ్చినతర్వాత పోలీసులచేతుల్లో పడింది. తర్వాత కాంగడా, ధర్మశాలలసమాజాల్లో ఆమె కుక్కలు తరుముతుంటే భయపడే మేకలాగా అనుభవించింది. కలలోగూడా వూహించలేనిని ఆమె ఆ ఇంట్లో చూసింది. ఆ ఇంట్లో ఆమెకు సానుభూతి, దయ కనిపిస్తున్నాయి. అక్కడకు రావటం తన దురదృష్టమని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. అపరాధానికి, అసహ్యా నికి సంబంధించిన చీదరింపులు అక్కడ లేవు. ఆ ఇంట్లో ఎవరికీ ఏ వస్తువుగురించి గాని, డబ్బుగురించిగాని చింతలేదు. సోమాకు ఆ ఇంట్లో ఒకవేళ ఈర్ష్యతోకూడిన

ఛాయలు ఎక్కడైనా కనిపిస్తే, నౌకర్లు - జగ్గూ, మోహనా, పనిమనిషి జీవాలోనే కనిపించేవి. సోమా అంతగా వాళ్లనుగురించి పట్టించుకునేది కాదు.

సోమాకు చిన్నతనంనుంచీ కష్టపడి పనిచేయటం, ఊరికే కూర్చోకుండా ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూనేవుండటం అలవాటు. ఇక్కడకూడా ఆమె ఏదో ఒకపనిచేస్తూ నౌకర్లకు పనుల్లో సాయంచేస్తూ వుండేది. అందుచేత అమ్మగారికి ఆమెమీద దయ, నమ్మకం ఇంకా ఎక్కువ అయ్యాయి. వాళ్లు ఆమెకు ఇన్ని బట్టలుగూడా ఇచ్చారు. మన్నో ఆమెకు శుభ్రంగానూ, పద్ధతిగానూ బట్టలు కట్టుకోమని ఆప్యాయంగా చెపుతుండేది. ధనవంతులైన ప్రజలు నిజంగా దేవతల్లాంటి వారు, అనుకునేది సోమా. బీదవాళ్ళు ఎంత నీచులుగా వుంటారు! ఇందుచేతనే దేముడు వాళ్ళకి బాధలు కలిగిస్తుంటాడు.

భూషణ్ సోమా వుండటానికి మనోరమ ఇంట్లో ఏర్పాటు చేశాడు. తన సంరక్షణలోకి తీసుకున్న ఆమె పరిస్థితిగురించి తెలుసుకునేందుకు బంగళాకువెళ్లి విచారిస్తూ వుండేవాడు. మనోరమ సోమా సమస్యగురించి భూషణ్‌తో మాట్లాడింది. ఈ సమస్య వాళ్ళ స్వంతవిషయానికి పరదా అయిపోయింది. మాటా మాటా పెరిగి మనోరమ మనసు చాలా బాధపడింది. ఇంట్లోవాళ్ళకి బాధతోనిండిన తన ముఖాన్ని, తడిసిన కళ్ళని చూపటం ఆమెకు ఇష్టంలేదు. 'పద కొంచెం అలా బయటకు వెళ్దాం. అక్కడే మాట్లాడుకుందాం' అని భూషణ్‌తో చెప్పింది.

మనోరమ, భూషణ్ మక్‌లోడ్‌గంజ్ ఎత్తుమీదకు ఎక్కుతున్నారు. భూషణ్ తటస్థంగా చెప్పుకుపోతున్నాడు. ఒప్పుకోకుండా వుండటానికి వీలులేనటువంటి నిందకి సమాధానం ఇస్తున్నాడు. అతను మనోరమతో ప్రణయమార్గంమీద వెళ్ళేటటువంటి ప్రసంగం చేశాడని ఒప్పుకున్నాడు. జీవితానికి ఎటువంటి రూపాన్నయితే వూహించి అతను ఈ మార్గాన్ని వాంఛించాడో, ఆ వూహంతా భ్రమ అని ఋజువయి పోయింది.

మనోరమ ఈ నిజాన్ని ఒప్పుకోవటానికి ఇష్టపడకపోతే అతనేం చేస్తాడు?

'మంచితనం జీవితానికి కాంతిని ఇస్తుంది. ఈ అమ్మాయి మన సమాజ జీవితపు పరిస్థితులతోనూ, అలవాట్లతోనూ నిండిన స్వతంత్రమైన వస్తువుకాదు.

మీ కుటుంబంలో ఆమెకు ఈ కారణంచేతనే చోటు దొరకగలిగింది. ఎందుకంటే మీరు ఏ లోటుకోనూ బాధపడటంలేదు. ఎవరికీ రెండుమాటలు చెప్పటంచేత మీ స్థితి ఏమీ దిగజారిపోదు' అని భూషణ్ అన్నాడు.

మనోరమ ఒక దీర్ఘమైన నిట్టూర్పువిడిచి మౌనంగా వుండిపోయింది. భూషణ్ రోజురోజుకు కటువుగా తయారవుతున్నాడు. కమ్యూనిజంలోని అంతస్థు పోట్లాటమధ్య జనించే ద్వేషం అతనిహృదయాన్ని రాటుదేల్చిందని ఆమెకు అని పించింది.

భూషణ్ చెప్పుకుపోతున్నాడు—'నువ్వు మంచితనాన్ని, న్యాయాన్ని, సమ ర్థించటంచేత గౌరవాన్ని పొందగలుగుతావు. జీవించటానికి ఏ మార్గాలు, సాధనాలు లేనివాళ్ళకి ఇది సంభవమేనా? కష్టాలతోనూ, భయాలతోనూ నిండివున్న జీవితంలో జాలి ఎలా మొలకెత్తుతుంది? మేము జీవితాన్నిమాత్రం పొందాము।' 'మేము' అని తమని తాము మనోరమనుంచి, మనోరమ సంబంధించిన పెద్దమనుష్యుల సమాజాన్నుంచి వేరుగా తలచేవాడు.

మనోరమ మళ్ళీ నిట్టూర్చి మెదలకుండా వుండిపోయింది. ఆమె ఇంతకన్నా ఎక్కువ అవమానం పొందటానికి సిద్ధంగా లేదు.

భూషణ్ అన్నాడు-'నీవంటి నాజూకుతనం, బుద్ధి ఈ అమ్మాయిలో సామా న్యంగా అయినా ఎలా వుంటుంది? నీ నాజూకుతనం, మంచితనం, మీ కుటుం బంలో అనేకతరాలనుంచి వస్తున్న పవిత్రమైన సంపద. మంచి గులాబీచెట్టును పెట్టుకుని దానికి అంటుమీద అంటుకడ్తూ వుండినట్లుగా వుండాలా? కాని మిగతా సమాజమంతా సోమాయే అయివుండాలా? కేవలం మంచితనానికి ముఖం వాచి వుండాలా?'

'చాలు, ఇంతవరకు అయింది చాలు, ఇక వెళదాం పద.' మనోరమ మధ్యలో ఆపేసింది.

భూషణ్‌లో కఠినంగా మాట్లాడేతత్వం, కర్కశత్వం వుంది. అందుకే అతని నోటినుంచి మనోరమనిగురించి ఇటువంటిమాటలు వెలువడుతుండేవి. వాటిని దాచుకున్నడబ్బును బయటకుతీసి లెక్కపెట్టుకున్నట్టుగా మనోరమ గుర్తు చేసు

కునేది-'నీ తెలివితేటలు, నీ అందం, నీ నాజూకుతనం, నీ ధైర్యం, నీ మంచితనం ....' ఆ మాటల్లో కాఠిన్యత, నిరాశ వున్నప్పటికీ భూషణ్‌కువున్న ఆత్మనిగ్రహపు వేడి ఏదో ఒకరోజున తప్పకుండా చల్లారిపోతుందని మనోరమకు ఒక నమ్మకం వుంది.

ఒకవేళ మనోరమ తల్లి-తండ్రులదగ్గరకు తమ కుమార్తెకోసం వరుని రూపంలో భూషణ్ వస్తే ఎన్నటికీ ఒప్పుకోరు. వారిదృష్టిలో మనోరమని పెళ్ళి చేసుకో తగినవాళ్లు చాలామంది వున్నారు. కాని మనోరమకు ఇతరులవ్యక్తిత్వం కొంచెంకూడా నచ్చదు. ఎవరిముందయితే స్త్రీ వంగివుండగలుగుతుందో, అతనే పురుషుడు. 'అయ్యో, నేను అతని మొండిపట్టుదలని నెగ్గించగలిగితే!' అప్పుడు తనస్థితిని మనోరమ ఇలా ఊహించుకునేది—వేసవికాలంలో ధర్మశాలలోని కొండ మీద, తుంపరలతో తడిసిన వాతావరణంలో ఉన్నిదుస్తులు ధరించి, మంచి మంచి పుస్తకాలు చదువుకునేందుకు వెల్వెట్ కార్డ్ స్లాక్ (పంట్లాము) వేసుకుని, కుక్కని వెంటబెట్టుకుని కొండదారిమీద తిరగటానికి బదులుగా ఆమె మామూలు చీరలో, చెప్పులు తొడుక్కుని, చంకలో కాగితాలకట్ట పట్టుకుని ఎండలో లాహోర్ రోడ్ల మీద తిరుగుతూ వుంటుంది. ఆమె ముఖంమీద రోడ్డుమీదరేగే సన్నని ధూళి చేరు కుంటుంది. శరీరమంతా చమట కారటంచేత, దుమ్ము పేరుకుపోవటంవల్ల ముఖం పేలగా తయారవుతుంది. ఇటువంటి పరిస్థితిలోనే చాలామంది కామ్రేడ్‌లు కూర్చుని గోలచేస్తూవుండే పార్టీ ఆఫీసులోకి అడుగుపెడుతుంది. ఎక్కడా బట్టలు మార్చు కోవటానికి ఏకాంతస్థలంగూడా వుండదు. కాని ఆమెకు ఇటువంటి అవసరమే వుండదు. రోజంతా బట్టలు మార్చుకుంటూనేవుంటే ఎలా? అంతకంటె అవసర మైన మిగతాపను లుంటాయి....నిర్మల పార్టీకోసం చందా అడగటానికి ఆమె దగ్గరకు ఎలా వస్తుందో అలాగే తనుకూడా రోజంతా పార్టీపనిలో తిరగాల్సి వుంటుంది. ఆమె ఇంటికి తిరిగి వచ్చేసరికి భూషణ్ కూడా నంచీ పట్టుకుని ఇంటికి వస్తాడు. అత నంటాడు:దా—'యూ ఆర్ టైర్డ్ మన్నో' (నువు అలసిపోయావు మన్నో.) తను నవ్వుతూ జవాబిస్తుంది, 'ఏమాత్రం కాదు' అని. తన ఈ వ్యూహా చిత్రంతో ఆమెకు కష్టజీవితం, శక్తివలన అహంకారం అనుభవానికి వచ్చేవి కాని భూషణ్ మాత్రం ఎప్పుడూ ఈ షరతుకికూడా ఒప్పుకునేవాడు కాదు.

లాలాగారి ఇంట్లో నాలుగునెలలు గడిపి సోమా ఎన్నో కొత్త అనుభవాలు పొందింది. విశ్రాంతితోకూడిన అనుకూలమైన జీవితంవలన సోమా రూపంలోనూ, ప్రవర్తనలోనూ, ఎండ, మంచు, చీకటిలో పెరిగిన అడవిచెట్టుకువుండే కఠోరత; కర్కశత్వం మాయమవసాగాయి. ఆమె ముఖంలో, చూపులో వ్యాకులపాటువలన కలిగే దీనత్వం తొలగిపోయింది. తోటలో నాటిన మొక్కలా నాజూకుగా తయారవసాగింది. ఆమె ప్రవర్తనమటుకు సంకోచం చెందినట్లు, అణకువగా వుంటూ వుండేది. మనోరమ పోషణలో రోజూ స్నానంచేస్తూ, బట్టలు మార్చుకుంటూ సోమా కొత్తవ్యక్తిలా మారిపోయింది. ఆమె ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూ వుండేది. సానుభూతి చూపిస్తూ, ఆమెను పనీ-పాటులకోసం అనవసరంగా శ్రమ పడద్దని మనోరమ చెపుతుండేది, ఓదారుస్తూకూడా వుండేది. సోమా అనుభవించే బాధలోతును తెలుసుకునేందుకు ఆమె ప్రయత్నం చేసేది.

సాహసపూరితమైన ఒక ప్రేమగాథకు సోమా నాయకురాలు. 'తన జీవితంలోగూడా ఇదే జరగాల్సివుందా?' అని మనోరమ ఆలోచించేది. సోమా పడే బాధలో ఆమెకు ప్రేమవలనకలిగే దుఃఖమూ, త్యాగంవలనకలిగే మాధుర్యం కనిపిస్తూ వుండేవి. దుఃఖపూరితమైన సోమా జీవితమనే నాటకాన్ని తన ఊహాగానంలో మరింత దుఃఖపూరితంగా చిత్రించుకునేది. ఒకవేళ ఆమె ప్రియుడు ఎప్పటికీకూడా జైలునుంచి విడుదల కాకపోతే, లేదా అతను జైలుకు వెళ్ళకముందే ప్రమాదంలో చచ్చిపోయివుంటే? ప్రేమకు ప్రతిఫలంగా సోమా జీవితాంతం వైధవ్యాన్ని, దుఃఖాన్ని పొందుతుంది. కాని ఇది ఎంత పెద్ద త్యాగం! ఆకలి నింపుకోవటానికి రెండు రొట్టెలకోసమే ఈమె వెతుకుతూవున్నట్లయితే ఇంతబాధ పడాల్సిన అవసరం ఈమెకేముంది? చదువురానివాళ్ళయినా, సభ్యత-సంస్కారం లేనివాళ్ళయినప్పటికీ వీరిలో శీలము, పవిత్రత అనేవి వున్నాయి. ఇవే మనిషి న్యాయాన్ని, ఔచిత్యాన్ని వెల్లడి చేసేవి.

సోమా సంకోచించినప్పటికీకూడా మనోరమ ఆమెను బలవంతంగా మంచం మీద, సోఫామీద కూర్చోబెట్టేది. గడచిపోయిన సోమా జీవితాన్నిగురించి అడుగుతూ వుండేది. ఆ సంభాషణలవల్ల సోమాకు మరింత సంకోచం కలిగేది. తన చరిత్రవిని అందరూ తనని అసహ్యించుకున్నారు. కాని మనోరమ ప్రవర్తన అలా

లేదు. మనోరమ ఆమెను తన దగ్గరకు లాక్కొని భుజాలమీద ప్రేమతో నిము రుతూ, 'నీకు ఈ మాటలు గుర్తుకురావటంచేత సుఖం, అహంకారం కలగటం లేదా?' అని అడిగేది. సోమా బాధతో కూడిన ఆమె కళ్ళల్లోకిచూస్తూ మౌనంగా వుండిపోయేది.

'ఒకవేళ ధనసింగ్ రాకపోతే నువ్వు ఇంకొకరిని పెళ్ళి చేసుకుంటావా?' అని మనోరమ సోమాని అడిగింది. సోమాతల వాలిపోయింది. ఆమె కళ్ళనుంచి కన్నీటిబొట్లు జారిపడ్డాయి. కొంగుతో కన్నీళ్లు తుడుచుకుని ఆమె తల అడ్డంగా తిప్పింది.

'ఒకవేళ ధనసింగ్ రాకపోయినా, అతను నిన్ను మరచిపోయినాకూడా నువ్వు అతన్నే ప్రేమిస్తూ వుండు. ఇది ఎంతో సంతృప్తి సంతోషాలనిస్తుంది' అని మనోరమ నచ్చచెప్పింది.

'అయ్యో. నేను ఎక్కడ వుంటాను, ఏం చేస్తాను?' అని సోమా వెక్కి వెక్కి ఏడ్చింది.

మనోరమ సోమాచేతిని తన చేతిలోకి తీసుకుంది. ఇంటి కప్పువైపుచూస్తూ వుండిపోయింది—'ప్రేమలో సుఖంవుందా? బాధవుందా? ప్రేమపాత్రుణ్ణి పొంద లేకపోతే ప్రేమ బాధాకరమే. ఆ బాధలో సుఖం ఏముంది?' మనోరమ అదే విధంగా ఆలోచిస్తూ వుండిపోయింది. సోమా ఎప్పుడు లేచి వెళ్ళిపోయిందో ఆమెకు తెలియలేదు. భర్తకు తన విలువతెలుసుకోని, తననిగురించి ఆలోచించని ఈశ్వ రుణ్ణి ఎలా సేవిస్తాదో. అలా మనోరమ సోమా విలువని అంచనావేసి అభినం దించేది.

చాలారోజులతర్వాత భూషణ్ సోమాగురించి తెలుసుకోవడంకోసం వచ్చాడు. సభ్యతా సంస్కారంలేని సోమా మంచితనంగురించి, బుద్ధితోపాటు సౌందర్యాన్నిగురించి మనోరమ వర్ణించిచెప్పి, 'ఒకవేళ జైలునుంచి విడుదలయిన ఆ డ్రైవరుజాడ తెలియకపోతే ఈ అమ్మాయిగతి ఏమవుతుంది?' అని బాధగా అడిగింది.

భూషణ్ సిగరెట్టుపొగను వదులుతూ సమాధానం చెప్పాడు—'ఒకవేళ

ఆ మనిషి దడిసిపోయిగాని, వేరే ఇతర కారణంచేతనైనాగాని తిరిగి రాకపోతే ఆ అమ్మాయికి సమస్య నిజంగా భయంకరమైనదిగా పరిణమిస్తుంది. బహూశా కాలం గడచినమీదట, మనసు పడిన అలసట తీరినతర్వాత, ఎక్కడైనా, ఎవరైనా ఇంకొక యోగ్యుడైనమనిషి దొరికితే ఈమె వివాహం చేసుకోవటమే మంచిది. ఎవరైనా పురుషుని వివాహం చేసుకుని కాపురం చేయకపోతే, జీవితం గడుపుకోవటంకోసం ఇంకేం చేయగలదు?'

మనోరమకు ఈ భూషణ్ ప్రవృత్తి, వ్యాపారపద్ధతిలో కూడినమాటలు నచ్చలేదు. 'నువ్వు ఇటువంటివిషయాలు ఎలా ఆలోచిస్తావు? ప్రేమ అనేది అసలు లేనేలేదా? ఒకవేళ ఏ వ్యక్తిఅయినా ఒక ఆదర్శాన్ని ఎంచుకుంటే ఆ వ్యక్తిని ఎందుకు పడదోయాలి?' అనడిగింది.

'ఆమె ఆదర్శాన్ని సఫలం చేయటంకోసం ఇంటినుంచి పారిపోయి వచ్చిందా? ఆ ఇంట్లో బ్రతకటం సంభవం కాదు. ఆమె జీవించాలనుకుంటోంది. ఇంట్లోనుంచి బయటకు వచ్చేయటానికి ఆమెకు ప్రేమ ఆధారమయింది. ప్రేమ జీవితంలో సహాయంచేసే వస్తువు. జీవితంలో అదే ఆటంకాన్ని కలిగించేటట్లయితే ప్రేమ ఇక ముందుకువెళ్ళలేదు' అన్నాడు భూషణ్.

మనోరమ ఒప్పుకోలేదు- 'మనుషులు ప్రేమకోసం జీవితాన్ని త్యాగం చేశారని ఋజువుచేసేందుకు చాలా వుదాహరణ లున్నాయి. నీదృష్టిలో అదంతా పిచ్చితనం, మూర్ఖత్వం, అస్వాభావికమూ, ప్రకృతివిరుద్ధమూనూ.' మనోరమ స్వరంలో కొంచం కటుత్వం ధ్వనించింది. అవమానానికి ప్రతీకారం తీర్చుకున్నట్లుగా వుంది.

భూషణ్ ఈ కటుత్వాన్ని గుర్తించాడు. దాన్ని అవమానించలేదు, తిరస్కారంగూడా చెయ్యలేదు. నెమ్మదిగా సమాధానం చెప్పాడు—'అన్నింటిలాగానే జీవితంలో ప్రేమ నడకగూడా ద్వంద్వాత్మకమైనది. ప్రేమ జీవితఫలితాన్ని, సహాయతని తీసుకుంది. ప్రేమ గాఢంగా లేకుండా తేలికగా వున్నట్లయితే అది ఇష్టానుసారం సంస్కారమాత్రంగా అయిపోతుంది. జీవితంలో ప్రేమ, ఆకర్షణలవలన విగ్రహం లేకపోతే అవి జీవితాన్ని నాశనంచేసేవిగాకూడా అవుతాయి. నీళ్ళు చూశావుగదా! నీళ్ళలోనుంచి వేడి పూర్తిగా పోయినట్లయితే అది మంచులా గడ్డ

కట్టుకుపోతుంది. అందులో అప్పుడు చలనం వుండదు. నీళ్ళలో వేడి ఒక హద్దు దాటి ఎక్కువ అయితే నీళ్ళు ఆవిరిగామారి పై కెగిరిపోతాయి.'

'ఎగిరిపోతే ఎగిరిపోనీ. ఎందుకూ పనికిరాని జీవితంవలన లాభమేముంది?' నిరుత్సాహంగా మనోరమ సమాధానం ఇచ్చింది.

భూషణ్ సిగరెట్టు అంటించాడు-'ఎగిరిపోయినా అప్పుడుకూడా ఒకవిషయం మరిచిపోకూడదు. ఇప్పుడు ఈ అమ్మాయిజీవితం వున్నట్లే వుంటుంది. ఈమెకు ధనసింగ్‌మీద ప్రేమకలగటం కొన్ని సంఘటనలపరిణామం. కొన్ని సంఘటనల కారణంకూడా. ఈమె భర్త బ్రతికివున్నట్లయితే బహుశా ఈ ప్రేమవృత్తాంతం జరగకనే పోను. ఒకవేళ ఈమెకు అతనిమీద ప్రేమకలిగినా నీకు ఆమెపట్ల సానుభూతి కలగదు. ప్రేమ శరీరంలోకలిగే అనుభూతికి, శరీరావసరానికి సంబంధించినది. కాకపోతే ఇంకేమిటి?'

భూషణ్ కొంచం ఆలోచించి మళ్ళీ అన్నాడు—'తీవ్రమైన విరహావేదనలో ప్రాణాలు బలిచేయటమనేది ఒకవిషయం. కాని ఎప్పుడైతే ప్రేమ నిత్యజీవితంలో అసహ్యమైన పరిస్థితిని సృష్టించటం మొదలుపెడుతుందో, అప్పుడు ప్రేమ జీవితాన్ని బాధపెట్టేదై దానంతట అదే అంతరించిపోతుంది. దానిస్థానంలో జుగుప్స ఏర్పడుతుంది. జరిగిన ఓ సంఘటన చెప్పనా?'

మనోరమ చెప్పమన్నట్లు తల వూపింది.

భూషణ్ చెప్పటం మొదలుపెట్టాడు—'నాకు తెలిసినవ్యక్తి ఒకడున్నాడు. ఒక అమ్మాయిని ప్రేమించాడు ఆ అమ్మాయి తల్లీ-తండ్రి అతనితో వారికుమార్తె వివాహం చేయటానికి ఒప్పుకోలేదు. ఆ అమ్మాయి ఈ అత్యాచారాన్ని భరించలేక విషం తీసుకుంది. చివరికి ఎలాగో ఆమెను రక్షించి ఆమెవివాహం చేశారు. ఆరు సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నవ్యక్తి అంత మంచి వాడు కాదు. ఆ అమ్మాయి ఇప్పు దే పరిస్థితిలోవుందంటే భర్తతో కలిసివుండటం కన్నా నూతిలోదూకి చావటం మంచిదనుకుంటోంది. అతనిప్రవర్తన ఎంత దిగజారిపోయిందంటే అతని పేరువింటే ఆ అమ్మాయి పరుగెత్తిపారిపోతోంది. నేను ఎవరినైనాసరే కావాలంటే గాఢంగా ప్రేమిస్తాను. కాని వాళ్ళవలన నా మనసుకు

బాధ కలిగితేమాత్రం నాకు వాళ్ళమీద విరక్తి కలుగుతుంది. సోమా అమితమైన కష్టంలో వుండకపోయినట్లయితే, ధనసింగ్ ఓదార్పు నిస్సహాయురాలైన ఆమెకు ఒకే ఒక్క ఆధారం అయివుండకపోయినట్లయితే, అతన్ని ఈమె ప్రేమించేదా? ధనసింగ్ ఈమె జీవితానికి భౌతికఆధారం.'

మనోరమ మౌనంగా వుండిపోయింది. మనం పరస్పరం ఎప్పటికీ ఒకటి అవలేము, సహాయకులం కాలేము, అని భూషణ్ సూచిస్తున్నట్లుగా అనిపించింది ఆమెకు. ఆరోజు రాత్రిగూడా ఆమె చాలాసేపటివరకు మేలుకుని ఆలోచించింది- 'నేను అవమానం ఎందుకు పొందాలి?' అని నిశ్చయించుకుంది.

• • •

ధర్మశాల జిల్లా జైలులో బంధించబడేటప్పుడు ధనసింగ్ అసహాయుడై ఎంత నిరుత్సాహంతో లజ్జితుడై వున్నాడో జైలునుంచి విడుదలయేటప్పుడుకూడా అంతే నిరుత్సాహంతోనూ, అవమానంతోనూ వున్నాడు. అతనిచేతుల బేడీలు, అతన్ని బంధించివుంచేగోడలు అయితే దూరమయ్యాయి కాని, అతనికి ప్రపంచంలో ఏ మార్గమూ కనిపించలేదు. అతన్ని దుర్మార్గుడిగానూ, శిక్షార్హుడిగానూచేసి, గౌరవాన్నిపొందే అధికారాన్ని అతనినుంచి దూరంచేసి అతన్ని జైలునుంచి పంపించివేయటం జరిగింది. అతను ఎక్కడికి ఎవరిదగ్గరకు వెళ్ళగలడు? జైలునుంచి విడుదలై స్వాతంత్ర్యాన్నిపొందటం ఎలావుందంటే రెక్కలన్నీ కత్తిరించి ఒక పక్షిని పంజరంనుంచి బయట పిల్లులముందు పడేసినట్లుగా వుంది. మోసగాడు, దుర్మార్గుడు అనే కళంకాన్ని అంటగట్టుకుని వుద్యోగంకోసం ఇప్పుడు మళ్ళీ కంపెనీకివెళ్ళటం సంభవంకాదు. ఇది ప్రారబ్ధమే. అవమానాలు పొందటంకోసం పుట్టినవాడు గౌరవమర్యాదలని ఎలా పొందగలడు? అతనుగూడా ఇతర నీచజాతి పిల్లలలాగా పెరిగివుంటే అదే కులస్థురాలైన అమ్మాయితో వివాహం జరిగివుండేది. కాని అతను రాజపుత్రుడై రాజపుత్రస్త్రీని వివాహం చేసుకునేవిషయంగురించి ఆలోచించాడు... బ్లాకీ చాచా చెపుతూనేవుండేవాడు. అడదానివుచ్చు ప్రమాదకరమైనదిగా వుంటుందని.

ధనసింగ్ మోసం చేయాలని ఎప్పుడూ అనుకునేవాడుకాదు. మోసం చేయాలన్న ఆలోచనే అతను చేసివున్నట్లయితే ఇంత అవమానం పొందేవాడు కాదు.

తర్వాత ఇంకా చాకచక్యంతో మోసం చేసేవిషయం ఆలోచించివుండేవాడు. కాని ప్రజలంతా అతన్ని మోసగాడనే అనుకుంటారు. ఎరుగున్నవాళ్ళకి ఏం ముఖం చూపిస్తాడు! సోమాయే అతన్ని నమ్మగలుగుతుంది. ఆ మనుషులు సోమాని ఎక్కడికి తీసుకువెళ్లివుంటారో ఏం తెలుస్తుంది? ఆమె మనసుగూడా ఇప్పుడు ఎలా మారిందో? ఎంతైనా ఆడది ఆడదే!

పరాయిస్త్రీలతోటి, వేశ్యలతోటి చెడు సంబంధాలు పెట్టుకున్నవాళ్లని ధనసింగ్ ఒకళ్ళిద్దరిని కాదు, అనేకమంది డ్రైవర్లని, ఇతర్లని ఎరుగున్నాడు. ఇటువంటివాళ్ళకి సమాజంవలన ఏ భయమూ లేదు. ఎందుకంటే, వాళ్లు ఆ తప్పువల్ల ఎప్పుడూ జైలుకు వెళ్ళలేదు. అతను స్వయంగా జైలులోగడిపి బయటికి వస్తున్నాడు. జైలులో గడిపిన ఆరునెలలు విపరీతమైన మానసికవేదనలో గడిచాయి. అతనికి పోలీసులమీద కోపంగావుంది. పోలీసులు అతన్ని చిన్నప్పటినుంచీ బాధలు పెడుతూనేవచ్చారు. చిన్నతనంలో వాళ్ళఇల్లు లాక్యానడంలో మియాం బజర్ సింగ్‌కు పోలీసులు సాయంచేశాడు. లారీ నడిపేటప్పుడు దొంగకేసు బనాయించి లారీని న్యాయస్థానంలో పెడతామని బెదిరించి, లంచం తీసుకునేవాళ్ళు. ఠాణాలో పోలీసులు అతన్ని కొట్టారు. సోమాని మందీ తీసుకువెడుతున్నట్లుగా ఆమెచేత అబద్ధపు వాఙ్మూలం ఇప్పించారు. ఆ అబద్ధం చెప్పిస్తుండకపోయినట్లయితే తనకి శిక్ష పడేదికాదు. పోలీసుఠాణాలో సోమాని అయిదురోజులు ఏమేమిచేశారో తెలియదు. సోమా ఇప్పుడు ఎక్కడవుందో ఏం తెలుస్తుంది?

అనేకసార్లు కోర్టులు ఎక్కి, జైలులో అనుభవాన్ని గడించినవాళ్లు కొందరు అతనికి జైల్లో చాలాసార్లు చెప్పారు—'పోలీసులు ఖైదులో స్త్రీని చెడగొట్టకుండా వుండటమనేది జరగనే జరగదు. తోటిఖైదీలు ధనసింగ్‌తో ఇంకా వివరంగా చెప్పారు—ఆ అమ్మాయి మామగారు రిపోర్టు వ్రాయించడానికి వచ్చినప్పుడు మీరు ఠాణాలోనే వున్నారు. పోలీసులు అతన్ని ఎందుకు మభ్యపెట్టారు? నువ్వు ఆమెను మందీ తీసుకువెడుతున్నావన్న వృత్తాంతాన్ని ఎందుకు కల్పించారు? నువ్వా, ఆ అమ్మాయి పోలీసుఠాణాలో మొదటి రెండురోజులు వున్నవిషయాన్ని ఎందుకు దాచేశారు? ఆమె మామగారు రిపోర్టు ఇచ్చినతర్వాత మిమ్మల్ని ఖైదుచేసినట్లుగా ఎందుకు చూపించారు? ఇదికూడా తెలుసుకోలేవా? అబ్బాయ్, ఇప్పుడు నువ్వు

జైలునుంచి బయటపడి ప్రపంచంలోకివెడితే నీ నంబరుకూడా వెంటవస్తుంది. పోలీసులు ఎప్పుడూ నీమీద కన్నేసి వుంచుతారు తెలిసిందా! ఎంతవరకయినా మొదట్లోనే తప్పించుకుని పారిపోవటం మంచిది. లేకపోతే నాయనా! నెల తిరిగేలోగానే మళ్ళీ ఇక్కడికి వస్తావు' అనిగూడా హెచ్చరించారు.

సోమాతో పోలీసుల దుర్వ్యవహారంగురించి వూహించుకున్నప్పుడు ధనసింగ్ రక్తం ఉడికిపోయేది. మందీ తీసుకువెళ్ళటంగురించిన అబద్ధంచెప్పి సోమా తనకి జైలుశిక్ష వేయించింది. అతనికి సోమామీదకూడా చాలా కోపంవచ్చింది. కాని న్యాయస్థానంలో సోమా ఏడుపు గుర్తుకురావటంతో ఆ కోపం ఎక్కువ సేపుండలేదు. న్యాయస్థానం సోమాని చౌధరి నిర్భయరామ్‌గారికి అప్పగించింది. చౌధరిగారి ఇంటికివెళ్ళి సోమాజాడ తెలుసుకోవచ్చు అని అనుకున్నాడు. ఒకవేళ పోలీసులు ఆమెను అవమానించినట్లుగా తెలిస్తే తనువెళ్ళి పోలీసుఅధికారి ప్రాణాలు తీస్తాడు. ఈసారి ఎవరూ తన్ని పట్టుకోలేరు. అప్పుడయితే తను సోమాతోపాటుగా తనంతట తను పోలీసుస్టేషనుకు వెళ్లాడు. పోలీసులనుంచి తప్పించుకోవటానికి, పారిపోవటానికి జైల్లో అనుభవం వున్నవాళ్ళనుంచి అనేకఉపాయాలు నేర్చుకున్నాడు. అన్నింటికన్నా అతను తెలుసుకున్న గొప్పవిషయం ఏమిటంటే, తప్పుచేసిన వాళ్ళని అసహ్యించుకుంటూ, స్వయంగా తప్పులుచేసే సమాజంగురించి ఆలోచించకూడదు.

ధనసింగ్ జైలునుంచి విడుదలై తన నిర్ణయంప్రకారం చౌధరి నిర్భయరామ్ గారిజాడ తెలుసుకునేందుకు వెడుతున్నాడు. వీలైనంతవరకు ఎరుగున్నవాళ్ళెవరూ తనని చూడకుండావుండేందుకు మెళకువగానే వున్నాడు. బజారులో వెంటనే తనని పేరుపెట్టి పిలవటం వినిపించింది. వెనక్కి తిరిగిచూశాడు. కామ్రేడ్ భూషణ్ కనిపించాడు. పరిచితుడైనవ్యక్తిని చూడగానే చిరచింపులు, తిట్లు తినాల్సివస్తుందేమోననే అనుమానంతో ధనసింగ్ భయపడ్డాడు. కాని భూషణ్ ముఖంలో ఆ ఛాయలు కన్పించలేదు.

భూషణ్ ధనసింగ్ భుజాలమీద చేతులువేసి 'నేను నీకోసమే ఎదురుచూస్తున్నాను. ఎప్పుడు వచ్చావు? మీవాళ్ళని కలుసుకోవటానికి కంపెనీ ఆఫీసుకు వెడుతున్నావా!' అని అడిగాడు.

తన మనసులోనిమాట ఎవరితోనూ చెప్పగూడదని ధనసింగ్ జైలునుంచి నిశ్చయించుకుని వచ్చాడు. భూషణ్ అడిగినదానికి సమాధానంగా—'కాదు ఇలాగే ఇక్కడివరకే వెడుతున్నాను. ఇప్పుడే వచ్చాను' అన్నాడు.

'అయితే కాంగడే వెడుతున్నావా?' భూషణ్ అడిగాడు.

ఆ ప్రశ్నలోవున్న అభిప్రాయాన్ని ధనసింగ్ తెలుసుకున్నాడు. అతను తప్పించుకోవటానికి—'చూడండి, ఇప్పుడేం చెప్పగలను?' అన్నాడు.

'కాంగడాలో చౌధరిగారింటికి వెళ్ళాలనుకుంటున్నావు కదూ?' అని భూషణ్ అడిగి అతని సమాధానంకోసం ఎదురుచూడకుండానే 'ఆ అమ్మాయి ఇప్పు డక్కడ లేదు' అన్నాడు.

ధనసింగ్ ముఖంమీద నిరాశ తొంగిచూసింది. భూషణ్ అతని భుజాలమీద మళ్లీ చేతులువేసి—'రా, కొంచం ఏదైనా తింటావా? పోనీ టీ త్రాగు, తర్వాత వెళ్దాం' అన్నాడు.

జైల్లోవున్న ఆరునెలల్లో ధనసింగ్‌కు మిఠాయి, పళ్ళు తినాలన్నకోరిక చాలాసార్లు కలిగింది. ఇవంటే అతనికి చాలా ఇష్టమనికాదు, కనీసం చూడటానికి కూడా అవి అక్కడ కనిపించవు. జైలునుంచి విడుదలైనతర్వాత అవన్నీ తృప్తిగా తినవచ్చని అనుకున్నాడు. కాని కాస్మేప్ టీ మాత్రమే త్రాగమనేసరికి ధనసింగ్‌కు ఏమీ నచ్చలేదు. సోమా ఎక్కడవుందో తెలుసుకోవాలని అతనికి కుతూహలంగా వుంది. ఆమెవిషయం ఏమయిందో?

దుకాణంనుంచి బయటకువచ్చి భూషణ్ రహస్యంగా చెప్పాడు—'విను, ఆ అమ్మాయి ఇక్కడే ధర్మశాలలో లాలాజ్వాలా సహాయ్‌గారి బంగళాలో వుంది. ఆమె ఎంతో సుఖంగా వుంది. పద, ఆ అమ్మాయిని చూపిస్తాను. ఇప్పుడు నువ్వు జాగ్రత్తగా మసలాలి, తెలిసిందా! జరిగిపోయిందేదో జరిగిపోయింది' అన్నాడు.

ధనసింగ్ సరోలాగారి బంగళాకువెళ్ళి సోమాని మూడు-నాలుగురోజులు కలిశాడు. అతనూ, సోమా బంగళావసారాలో కలుసుకుంటూ వుండేవారు. ధన సింగ్‌కు సోమా, సోమాకు ధనసింగ్ కొంచం మారినట్లుగా అనిపించారు. ధన

సింగ్ మొద్దుబారినట్లుగా అనిపించాడు. ముఖంమీద కోపం స్పష్టంగా కనిపిస్తోంది. సోమా అదిచూసి భయపడేది.

ధనసింగ్‌కు సోమాకూడా మారినట్లుగా అనిపించింది. ఆమెలో పట్నవాసపు కళలాంటిది వచ్చింది. ముఖంమీద నిరుత్సాహంవున్నా రంగు ఇంతకుముందుకన్నా నిర్మలంగా వుంది. కళ్లు ఇంకా ఎక్కువలోతుకు పోయాయి.

ధనసింగ్ మనసులోరేగిన ప్రశ్నని అణచివేసి అడిగాడు—'ఎలా వున్నావు? నీకు చాలా ఇబ్బంది కలిగివుంటుంది.'

'ఏమండీ, మీరు వచ్చేశారుగదా, ఇక అంతా బాగానేవుంటుంది. మిమ్మల్ని జైల్లో పోలీసులు ఎక్కువగా కొట్టలేదుకదా।'

సోమా కళ్లు తడి అయాయి.

'నిన్ను పోలీసువాళ్ళు బాధలు పెట్టి వుండివుంటారు.' ధనసింగ్ గంభీరంగా అడిగాడు.

సోమా తలవంచుకుని మౌనంగా వుండిపోయింది.

ధనసింగ్ ప్రశ్నని రెట్టించినమీదట ఆమె కళ్ళల్లో నీళ్లు నిలిచాయి—'గడచి పోయినదానినిగురించి ఇప్పుడు ఏడ్చినా లాభమేముంది? మిమ్మల్నిమటుకూ వాళ్లు ఎంతబాధ పెట్టలేదు। నేనయితే ఏడ్చి-ఏడ్చి చచ్చిపోయాను. పట్కారుకాల్చి మీ వంటినిండా ఎర్రగా వాతలు పెడతామని వాళ్ళు నన్ను బెదిరించేవాళ్ళు. మిమ్మల్ని బాధపెట్టరని, ఏది కావాలనుకుంటే నన్నదిచేయమని వాళ్ళ కాళ్ళమీదపడి, చేతులు జోడించి బ్రతిమలాడాను. ఇక ఇప్పుడు దాన్నిగురించి ఏడవటం దేనికి? బ్రతికుండగా మిమ్మల్ని చూశాను. నా కింకేమీ అక్కరలేదు' అన్నది.

ఆ ప్రదేశంలో అంతకన్నా ఎక్కువ మాట్లాడటానికి అవకాశంలేదు. ధనసింగ్ రక్తం మరిగిపోతోంది. కాని అతను కొంచంకూడా అర్థం చేసుకోలేక పోతున్నాడు. సోమా మాట్లాడినమాటలకి అనేక అర్థాలు తీయటానికి ప్రయత్నం చేశాడు. పోలీసులు ఈమెనుకూడా కొట్టి బాధపెట్టారా? లేకపోతే....? అతను ఆలోచించాడు. దుర్మార్గులయిన ఆ పోలీసులు నన్ను కొడతామని సోమాని ఎందుకు

బెదిరించివుండివుంటారు? ఆమెను భయపెట్టి వశంచేసుకుని వుండివుంటారా? వాళ్లు అలా చేసివున్నట్లయితే ఈ అమ్మాయితో నాకు సంబంధమేముంది?'

అతను వైక్‌నాథ్ వెళ్ళి పోలీసుఠాణా అధికారిని, హరీరామ్‌ని, కరీమ్‌ని, నఫీస్‌ని హత్యచేసి పంజాబ్ పారిపోవాలని రోడ్లమ్మట తిరుగుతూ అతను ఆలోచిస్తున్నాడు. తన జీవితానికి ఇంకేప్రయోజనమూ కన్పించలేదతనికి.

సోమా సుమారు నాలుగునెలలు లాలా జ్వాలాసహాయ్ సరోలాగారి బంగళాలో వుండిపోయింది. నెమ్మది-నెమ్మదిగా ఆమెకథ లాలాగారివరకూ పాకింది. ఈమె చెడ్డదికాదని, దిక్కులేని దౌర్భాగ్యురాలని ఆయనకు నమ్మకం కలిగింది. ధనసింగ్ మంచివాడని, నమ్మదగినవాడని ఆయనకు అనిపించలేదు. అటువంటి మనిషిచేతిలో తన పది-పదిహేనువేల కారును, తన ప్రాణాన్ని అప్పగించటం ఆయనకు తెలివైనపనిగా అనిపించలేదు. కాని మనో్ని అతనికి మాట ఇచ్చేశానని చెప్పింది.

లాలాగారు ధనసింగ్‌ని వూరికే కూర్చోబెట్టి పదిహేనురోజులజీతం అనవసరంగా ఇచ్చారు. తర్వాత పదిహేనురోజులు అతనిచేత ఆ పనులూ, ఈ పనులూ చేయించుతూ వచ్చారు. మనోరమ ఎప్పుడైనా వంటరిగాగాని, తల్లిగారితో కలిసిగాని క్రిందకు బజారుకు వెళ్ళాల్సివస్తే కారు నడపటానికి ధనసింగ్‌నే పిలిచేది.

కొద్దిరోజులతర్వాత ధనసింగ్, సోమాల బాధ్యత మనోరమమీద ఇంకా ఎక్కువగా వచ్చిపడింది. యుద్ధానికి వ్యతిరేకంగా గొడవలు చేశారన్న నేరంమీద భూషణ్‌ని, ఇంకొక ఇద్దరు కామ్రేడ్‌లతోబాటు పోలీసులు ఖైదుచేసి లాహోర్ తీసుకెళ్లారు భూషణ్ ఖైదుచేయబడిన విషయంగురించి మనోరమకు చాలా బాధ కలిగింది. కాని కొంచంగూడా బైటికి ఏమీ అనలేదు.

సరోలాగారి బంగళా ఎత్తైన ప్రదేశంమీద వుంది. అక్కడ ఒక కారు పెట్టేంతవరకే గారేజివుంది. మిగతాకార్లు, లారీలు పెట్టడానికి క్రింద ఒక ఫర్లాంగు దూరంలో, పోలీసు అధికారులువుండే బజారుకు దగ్గరగా గారేజిలున్నాయి. అక్కడే కొన్నివాటాలు నౌకర్లకోసం వున్నాయి. ధనసింగ్ సోమాలకోసంగాను మనోరమ ఒక వాటా ఏర్పాటు చేసింది.

ధర్మశాలలో ఆగస్టు జడివానలు మొదలు అయాయి. ఆ గదిలో వాళ్ల కలిపి వుండే మొదటిరాత్రి వచ్చింది. సోమా వంట చేసేసింది. ఇద్దరూ తిన్నారు. మధ్యాహ్నం రెండుగంటలకు మొదలుపెట్టినవాన ఇంకా కురుస్తూనే వుంది. ధన సింగ్ మళ్ళీ సోమాని వైజ్‌నాథ్ ఠాణాలో పోలీసులప్రవర్తనగురించి అడిగాడు.-
'అయ్యో, అంతా చెప్పేశానుగదా! ఇప్పుడు మళ్ళీ అదంతా గుర్తుచేసి నన్ను బాధ పెడతా రెందుకు?' అన్నది సోమా.

'నువ్వు మంచి తెలివిగలదానివై పోయావు. మాటలు దాచేస్తావు. జరిగింది చెప్పకుండా దాచావంటే నా శవాన్ని చూస్తావు' అని ధనసింగ్ మండిపడ్డాడు.

సోమా వణికిపోయింది. ఆమె ఏడుస్తూ చెప్పింది—'నేను చెప్పానుగదా. ఒప్పుకోకపోతే పట్కారుతో ఎర్రగాకాల్చి మీకు వాతలు పెడతామని ఎప్పుడైతే వాళ్లు నన్ను బెదిరించారో అప్పుడు నేను వాళ్ళ కాళ్లమీదపడి కావాలంటే నన్నే దైనా చేసుకోమనీ, మిమ్మల్నిమాత్రం ఏమీ చేయద్దని బ్రతిమలాడాను. వాళ్లు నన్ను ముట్టుకోగానే ఏడవటం మొదలుపెట్టాను. దాహంతో నా గొంతు ఎండిపోయింది. ఒకమనిషి చెంబుతో నీళ్లు తెచ్చిఇచ్చాడు. కొంచం చేదుగా వున్నాయి. సారావంటి వాసన వచ్చింది. ఇక్కడ బావిలో ఆకులుపడి కుళ్ళిపోవటంచేత నీళ్లు అలా వున్నా యని వాళ్లు చెప్పారు. ఆ నీళ్లు తాగగానే తల తిరగటం మొదలెట్టింది.... మెళకువ రాగానే జరిగింది తెలుసుకుని ఏడుస్తూ వుండిపోయాను.'

ధనసింగ్ తల తిరిగిపోయింది. అతను లేచి నిలబడి గట్టిగా నిట్టూర్చి. 'అందుకనేనా నువ్వు దాస్తున్నావు? నాకు ఇప్పుడు నీతో ఏ సంబంధమూ లేదు. నేను ఆ పోలీసువాళ్లని ఖూనీచేసి అప్పుడు మంచినీళ్ళు తాగుతాను. నీ ధర్మం. గౌరవం నువ్వు చూసుకో!, అన్నాడు.

ధనసింగ్ వెళ్లబోతూవుంటే సోమా అతనికాళ్ళను గట్టిగా చుట్టేసుకుంది. ధనసింగ్ ఆమెను తిట్టాడు. కసితీరా కొట్టాడు. సోమా కాళ్లు వదలకపోయేసరికి చావబాదాడు. సోమా తన శక్తినంతా కూడగట్టుకుని ధనసింగ్ కాళ్లుపట్టుకుని అలాగే వుండిపోయింది. 'నాతో సంబంధం లేకపోతే నన్ను చంపేసి వెళ్ళండి. నా మెడ నరికేసి వెళ్ళండి!' అన్నది. ధనసింగ్ ఏం చేయాలో తెలియక తల

గోడకేసి బాదుకున్నాడు అతనుగూడా చాలా సేపటివరకూ ఏడుస్తూ వుండి పోయాడు.

ధనసింగ్ గోడకు వీపు ఆనించి కూర్చున్నాడు. సోమా అతనికాళ్ళకు బేడీల మాదిరిగా బిగుసుకుపోయివుంది. ధనసింగ్ వదిలించుకోవటంకోసం ఆమెను గుద్దాడు. దెబ్బలవలన సోమా భుజాలూ, నడుమునొప్పి పెట్టసాగాయి. సోమా ఆ నొప్పినిగురించి పట్టించుకోలేదు. ధనసింగ్ ఈ పోట్లాటలో అలసిపోయాడు. గోడకి తల ఆనించి ఆలోచిస్తున్నాడు. ఈమెను ఇప్పుడేం చేయాలి? ఎవరిదగ్గర వదలి వెళ్ళాలి? ప్రపంచం ఎలా వుందంటే, ఈమెను తప్పకుండా బాధపెడుతుంది.... లాలాగారు ఏమంటారు? భూషణ్‌గారు ఏమంటారు?

ధనసింగ్ సోమా చేతుల్ని తన కాళ్లనుంచి తప్పిస్తూ హామీ ఇచ్చాడు—

'మంచిది. నేను వెళ్ళను సరేనా!'

కన్నీళ్ళతో అసహ్యంగా తయారైన ముఖాన్ని, ఎర్రని కళ్ళని ధనసింగ్ ముఖంవైపు తిప్పి సోమా అడిగింది—'ఏమండీ నామీద ఒట్టు?'

ధనసింగ్ ఒప్పుకున్నాడు.

సోమా మళ్ళీ కోపగించింది—'ఏమండీ, ఇక నన్ను వదిలిపెట్టి వెళ్ళే టట్లయితే నన్ను చంపేసి వెళ్ళండి. లేకపోతే నేను ఉరేసుకుని చచ్చిపోతాను.'

* * *

వర్షాలు బాగా ఎక్కువగా కురుస్తున్నాయి. లాలాగారు తరుచుగా బయటకు వెళ్ళటం మానేశారు. ధనసింగ్ డ్యూటీ ఆయనకారు నడపటం. లాలాగారు చాలా అవసరంమీద ఎక్కడికైనా వెళ్ళినాకూడా వానవలన రాత్రిపూట ప్రయాణం చేయటంలేదు. రాత్రి బయటవూళ్ళల్లోనే వుండిపోతున్నారు. ఇటువంటి పరిస్థితిలో సోమా రాత్రిపూట గదిలో ఒంటరిగా అనుమానంతో పచార్లుచేస్తూ వుండేది.

ధనసింగ్ లాలా జ్వాలాసహాయ్‌గారిదగ్గర తనపనిని చాలా ఉత్సాహంగా చేస్తున్నాడు. ఇటూ-అటూ ఎక్కడికీ వెళ్ళేవాడుకాదు. తన ఇంటిదగ్గర వుండ టానికి అతనికి చాలా సమయం దొరికేది. కాని, అతను సోమాతో చాలా తక్కు

వగా మాట్లాడేవాడు. మాట్లాడినాకూడా ఏదైనా పనినిగురించి రెండుముక్కలు. అతను ఆమెను ముట్టుకునేవాడు కాదు. కష్ట-సుఖాలు మాట్లాడేవాడు కాదు. ఆమెలో ఏదో దోషం వున్నట్లుగా ప్రవర్తించేవాడు. సోమా ఈ ప్రవర్తనగురించి అతనితో ఏమీ అనలేదు. కాని ఒక్కొక్కప్పుడు ఈయనస్వభావమే ఇటువంటిదై వుండచ్చు అని అనుకునేది. ఇదివరకు అప్పుడప్పుడూ నవ్వుతూ వుండేవారు, ఇప్పుడు ఆమె గూడా మౌనంగా, నిరుత్సాహంగా వుంటూంది. 'అత్తవారింటిదగ్గరనుంచి వచ్చేశాను. కాని నేను పొందిన లాభమేముంది. ఇంకొకళ్ళకి బరువు నయాను. అమాయకుడయిన మంచిమనిషి సహిస్తున్నాడు.' అని అప్పుడప్పుడూ అనుకుంటూ వుండేది. ఇటువంటి ఆలోచనలనుంచి తప్పించుకోవటానికి ఆమె రోజంతా ఏవో ఒకపని చేస్తూవుండేది. ఖాళీగా కూర్చునే అలవాటు ఆమెకు ఎన్నడూ లేదు.

ఎప్పుడైనా వర్షం లేనప్పుడు మనోరమ తల్లిగారు సోమాని పనీ-పాటల కోసం బంగళాకు పిలిపించేది. లేకపోతే తమదగ్గరనుంచి పాతపరుపులమీదినో, ఊలునో ఆమె ఇంటికి పంపించేది. ఒక రాట్నంగూడా వాళ్లు ఆమెకు పంపించారు. ధర్మశాలలో వర్షాకాలపు నాలుగునెలలు అంతులేనివానలు కురుస్తూవుంటాయి. సోమా తన ఇంట్లో రాట్నంతో తల్లిగారికి నూలు వడుకుతూవుండేది. లేకపోతే వంటపనిలో నిమగ్నురాలై వుండేది. ఆమెజీవితం నెమ్మదిగా నడిచే కొయ్యగానుగలా తయారయింది

లాలాగారు కొద్దిరోజులపాటు లాహోర్ వెళ్ళారు. ధనసింగ్‌కు కారు తీసుకుని ఎక్కడికీ వెళ్లాల్సినపని లేదు. ఆ రోజు వానకూడా జోరుగా కురుస్తోంది. అతను గదిలో మంచంమీదపడుకుని వాన కురిసేవైపుచూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. సోమా మంచం తలాపు దిక్కువైపుకూర్చుని ఏదో పనిలో నిమగ్నురాలై వుంది. ధనసింగ్‌కు తన తలాపుదిక్కున వెక్కి-వెక్కి ఏడుస్తున్నశబ్దం వినిపించింది. అతను అటు తిరిగిచూశాడు. సోమా ఒకచేతిని మంచంపట్టెమీదవుంచి, ముఖాన్ని కొంగులో దాచుకుని ఏడుస్తోంది.

'ఎందుకు ఏడుస్తున్నావు?' అని ధనసింగ్ అడిగాడు.

'ఏమండీ మీరు చాలా దిగులుగా వుంటున్నారు. నాకు అవాల్సిందంతా అయిపోయింది. మీరు చక్కగా పెళ్ళిచేసుకుని, మీ ఇల్లాలిని తీసుకురండి. మీ

మనసు కుదుటపడుతుంది. మీరు సుఖంగా వుండండి. నాకన్నా మీరు ఎక్కువ బాధపడుతున్నట్లుగా అందరితోనూ చెపుతుంటారు.' సోమా వెక్కి-వెక్కి ఏడుస్తూ చెప్పింది.

'నేను నిన్నేమంటున్నాను?'

'మీరు చాలా మంచివారండి. భగవంతుడు మీకు మేలుచేయాలి. మొదట్లో మీరు ఎంతబాగా మాట్లాడేవారు. అప్పుడుమటుకూ నాదగ్గర వున్నదేముంది. నేనెలాగో విధవని. మీరు నాగురించి బాధపడతారెందుకు?' సోమా వెక్కి-వెక్కి ఏడ్చింది.

ధనసింగ్ నోటినుంచి మాటలు బయటకు వచ్చాయి. 'అందరూ నీకు చెడే చేశారు. నీ తప్పేముంది?'

ధనసింగ్ మనసులో సిగ్గుపడ్డాడు. సోమా అన్నమాట అతనికి ముందుగా ఎందుకు తోచలేదు. అతను సోమా చేయిపట్టుకుని 'పిచ్చిదానా! ఏడుస్తావెందుకు?' అని ఆమెను దగ్గిరికి తీసుకుని మంచంమీద కూర్చోబెట్టాడు.

సోమా ఇంకా బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టింది.

ధనసింగ్ ఆమెను బుజ్జగించి 'ఏడ్చినట్లయితే నిన్ను చంపుకుని తిన్నట్లే. నావాళ్ళుకూడా ఈ ప్రపంచంలో ఎవ్వరూ లేరు' అని బాధగా అన్నాడు. ఆమెను ఓదార్చటం మొదలుపెట్టాడు.

సోమా గాబరాపడి అతన్ని అడ్డగించింది—'అరె, చూడండి తలుపులు తెరిచి వున్నాయి' అన్నది.

ఆ రోజు వాళ్ళిద్దరిమధ్య అనేక నెలలనుంచి వుంటూవచ్చిన దూరం మాయమయింది. ధనసింగ్ సోమాని తన మంచంమీద కూర్చోబెట్టి- 'ఆర్యవివాహం చేసుకుందాము, చౌధరిగారు చేయిస్తారు' అన్నాడు.

సోమా సిగ్గుపడింది—'నే నెలాగో మీదాన్నే. విధవలకి ఎక్కడన్నా పెళ్ళి జరుగుతుందా ఏమిటి?' అన్నది.

ధనసింగ్ బిగ్గరగా అరిచాడు- 'ఏమంటున్నావు. ఏం నేను చచ్చిపోయానా? నేను చచ్చిపోయినట్లయితే నువ్వు విధవవని చెప్పుకో!' అన్నాడు.

సోమా దేవుణ్ణి తలచుకుంది.

సెప్టెంబరునెల వచ్చింది. ధర్మశాల పైవుండే మేఘాలు విడిపోయి గాలిలో కలిసిపోయాయి. శరదృతువు చల్లటిగాలి, గట్టిపడేలా చేయటానికి మంచుతో కూడిన శిఖరాలవైపు వాటిని విసిరేసింది. ధర్మశాలలో ఎండ పకపకా నవ్వింది. మనోరమకి కాలేజి శెలవులు అయిపోయాయి. ఆమె లాహోర్ వెళ్ళిపోయింది. వెళ్ళేముందు కలుసుకోవటంకోసం వాళ్లు సోమాని పిలిపించారు. ధనసింగ్ మనోరమని కారులో పఠాన్‌కోటవరకూ తీసుకెళ్లాడు. ఈ వీడ్కోలు సోమాని చాలా బాధపెట్టింది. తల్లిని వదిలిపెడుతున్నట్లుగా ఆమెకు అనిపించింది.

సోమాకు అప్పుడప్పుడూ ధర్మశాల వూళ్ళోకి వెళ్ళినప్పుడుగాని, సాయంకాలంపూట పక్కఇళ్ళల్లోనుంచిగాని పాటలు వినిపిస్తూ వుండేవి. ఎప్పుడైనా పాట వినగానే ఆమెకు ఆశ్చర్యం కలిగేది. ఆ పాటలు గ్రామ్‌ఫోన్‌నుంచి వినిపిస్తున్నాయని తర్వాత ఆమెకు తెలిసింది. సోమాకి ఆ పాటలు నచ్చేవి కాని, పాటల అర్థం మాత్రం తెలిసేది కాదు. చేతులు పనిలో మణిగివున్నాకూడా ఆ పాటలను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించేది. అప్పుడప్పుడూ మనోరమ పాడుతుండగా విన్న పాటలుగాని, గ్రామ్‌ఫోన్‌నుంచి విన్న పాటలుగాని కూనిరాగం తీయటం మొదలు పెట్టేది. ఒకరోజు బంగళానుంచి వచ్చి, ఇలాగే నూలువడుకుతూ పాడటం మొదలు పెట్టింది. ఏదో చప్పుడువిని ఆమె వెనక్కి తిరిగిచూసింది. ఇద్దరు మొగాళ్ళు ఆ యింటిముందు నిలబడి ఆమె పాట వింటూండటం కన్పించింది. ఆమె సిగ్గుతో చచ్చిపోయింది. పుట్టింట్లోగాని, అత్తవారివూళ్ళోగాని ఎవరైనా ఆడవాళ్ళు ఆరుబయట పొలాల్లో పాడుతున్నాగూడా ఎవరూ పట్టించుకునేవాళ్లు కాదు. పట్టణాల్లో పెదఇంటి స్త్రీలు బిగ్గరగా పాడరని ఆమె ఆ రోజు తెలుసుకుంది.

సోమా చేతులు ఎప్పుడూ ఖాళీగానే వుంటూవుండేవి. పనిచేస్తూవుండటం ఆమె స్వభావమే. పుట్టింటిలోనూ, అత్తవారింటిలోనూ ఆమె పిడకలు కొడుతూనో, ధాన్యం దంచుతూనో, నీళ్లు నింపుతూనో, బట్టలు వుతుకుతూనో, పశువులు మేపుతూనో, లేకపోతే పొలంపనో చేస్తూవుండేది. ఇప్పుడు నీళ్ళు వాళ్ళ ఇంటికులాయి నుంచి వచ్చేస్తాయి. పిండి, ధనసింగ్ బజారునుంచి తీసుకొచ్చి ఇస్తాడు. తోటపేరు మీద రెండు-మూడు మొక్కలు ఇంటిగుమ్మం ఎదురుగా వున్నాయి. ఇద్దరు మనుష

లకి అంట్లగిన్నెలవలె పెద్దగా వుండదు. సోమా ఎండలో కూర్చుని దంగళాలో నేర్చుకున్న అల్లికలుగాని, ఏదో ఒకటి కుట్టటంగాని చేస్తూవుండేది. మొదట్లో ఆమెకు వాలుగురోజులు కట్టుకున్న బట్టలుకూడా మురికిగా అనిపించేవి కాదు. ఇప్పుడు పరోలాగారి ఇంటి ప్రభావంచేత రోజుకు వాలుగయిదుసార్లు వుతకటం మొదలు పెట్టింది. ఇవేకాక ఆమె అలంకరించుకోవటంగూడా నేర్చుకుంది.

మన్నోనిగాని, ఇతర ఆడవాళ్ళనిగాని చూసినప్పుడు, తన జుట్టునుగూడా వాళ్ళ జుట్టుకుమల్లే ముడివేసుకోవాలని సోమాకి కోరిక కలుగుతూవుండేది. కాని అంతధైర్యం కలగలేదు. సిగ్గువేసింది. పెద్దమనుషుల్ని చూసి అలా అనుసరిస్తే అది పేదలకి కాంతి నివ్వదు. ధనసింగ్ విదేశీసబ్బు తెచ్చి ఇచ్చాడు. కొండలమీద వీచే తడిలేని చల్లటిగాలివలన బుగ్గలు పగలటం మొదలుపెడితే నునుపుకోసం ముఖానికేదైనా వ్రాసుకోవటం అవసరమవుతుంది. అత్తారింట్లో ఆమె అత్తగారి కళ్ళల్లో పడకుండా నేతికుండలోనుంచి వ్రేలితో నెయ్యితీసి వ్రాసుకునేది. ధనసింగ్ క్రీము, పౌడరు తెచ్చిఇచ్చాడు. తనభార్య అలంకరించుకోవాలన్న కోరిక మిగతా మొగవాళ్ళకిమల్లేనే ధనసింగ్‌కు కలిగింది. సోమా మిసమిసలాడుతూ, నాజూకుగా తయారవసాగింది. ఇరుగు పొరుగుల మొగవాళ్ళు అటుమందునుంచి వెళ్ళేటప్పుడు ఆమెవైపు కన్నార్పకుండా చూస్తే ఆమెకు అనుమానం కలిగేది. ఆమె గదిగుమ్మానికిదగ్గర ఒక తడిక పెట్టించింది, ఎండలో కూర్చోవలసివస్తే రోడ్డువైపు మంచం అడ్డుగాపెట్టి దోవలో వెళ్ళేవాళ్ళనుంచి చాటు చేసుకునేది. గౌరవనీయులైన స్త్రీల ఆచారం ఇదే.

* * *

పర్వతప్రాంతాల్లో వేసవికాలపు ప్రారంభంలో రాకపోకలు చాలా పెరిగి పోతాయి. పంజాబునుంచి ప్రజలు రావటం మొదలుపెడతారు. నిర్మానుష్యమై పాటు పడి కునికిపాట్లు పడుతున్నట్లుగావుండే ధర్మశాల నిద్రలేచి పెద్దగా ధ్వనులు చేస్తూంటుంది. 1942 వ సంవత్సరంలో యుద్ధకారణంగా జిల్లాలో చాలా కేంపులు తెరువబడ్డాయి. కెలవులమీద వచ్చిన సైనికులవలన అన్నివైపులా ఖాకీదుస్తులు ధరించిన మనుష్యులు కనిపిస్తున్నారు. ఈ సైనికులకు జీవితంలో ఆశ అనేది లేదు. వీళ్ళకి ఏ బాధ్యతా లేదు. ఎవరిభారమూ లేదు. వీళ్ళు మృత్యువును లక్ష్యపెట్టగూడ

దనే ఆలోచనతో ఉచితానుచితాలను త్రోసిపుచ్చసాగారు. వీళ్ళ నిరంకుశత్వంవలన ధర్మశాలలో గౌరవనీయులైన స్త్రీలకి దుకాణాలున్న బజారుల్లోకి రావటమనేది సంభవంకాకుండా పోయింది. ఇంగ్లీషుస్త్రీలంటే ఈ సైనికులు భయపడేవాళ్ళు. వేసవికాలం ప్రారంభంలోనే మనోరమ లాహోర్‌నుంచి వచ్చేసింది. ఆమెతోబాటు ఆమె చిన్నవదిన, వదినగారి ఇద్దరు పిల్లలు, బారిస్టర్ జగదీశ్ సరోలాగూడా వచ్చేశారు. బంగళాలో పని చాలా ఎక్కువయింది. ధనసింగ్‌కు పగలంతా ఉద్యోగ రీత్యా ఇంటిబయటనే వుండాల్సివచ్చేది. అప్పుడప్పుడూ రాత్రిపూటగూడా ఇంటికి చేరేవాడు కాదు.

ఒకరోజుసాయంత్రం సోమా ధనసింగ్‌తో చెప్పింది—'రకరకాల మనుషులు వస్తున్నారు। రాత్రిపూటవచ్చి తలుపు తడతారు. చెడుమాటలన్నీ అంటున్నారు. నాకు చాలా భయమేస్తోంది. మీరు రాత్రిపూటకి ఇంటికి వచ్చేస్తూవుండండి.'

ధనసింగ్ ఆలోచనల్లో పడ్డాడు. 'పరాయివాళ్ళదగ్గర ఉద్యోగం చేయటం అంటే ఇంతే। నేను ఒకవేళ చీకటిపడేలోపున రాకపోతే నువ్వు గదికి తాళంవేసి రాత్రికి బంగళాకు వెడుతూవుండు. పగటిపూటకూడా బయట కూర్చోవద్దు. మన గౌరవం మనకే వుంటుంది. ఈ సైనికులు, ట్రక్కు డ్రైవర్లు పశువులు. అవీకాక ఎవరితోనని పోట్లాడతాం।' అన్నాడు.

సంవత్సరం పూర్తయి మళ్ళీ ఆగస్టు వర్షాకాలపురోజులు వచ్చేశాయి. ధనసింగ్ పొద్దున్న తొమ్మిదిగంటల వేళప్పుడువచ్చి చెప్పాడు—'నేను లాలాగార్ని తీసుకుని లాహోర్ వెళుతున్నాను. రాత్రికిమాత్రం తిరిగి రాలేను. అందుకని నిన్ను పైన బంగళాదగ్గర దిగబెట్టిరానా?' అనడిగాడు.

'ఇప్పుడే వెడితే ఇంట్లో పనంతా అలాగే వుండిపోతుంది. రాత్రికికూడా అక్కడే వుండాల్సి వస్తుంది. చాలారోజులతర్వాత ఎండ వచ్చింది. కొంచం బట్టలు పుతుక్కుంటాను. రెండుగంటలతర్వాత నేనే వెడతాను' అన్నది సోమా.

తన ఇంటిపని వదిలిపెట్టి బంగళాపని చేస్తూవుండటం సోమాకు నచ్చదు. ఇప్పుడు బంగళాలో పనిగూడా చాలా ఎక్కువయింది. మనోర్మకి, లాలాగార్కి తప్ప మిగతావాళ్ళందరికీ ఏదో ఒకపని చేయాల్సివస్తుంది. ఆమెకాళ్ళే ఆమెకు

బరువవుతున్నాయి. సిగ్గువలన ఈవిషయం ఆమె ఎవరితోనూ చెప్పలేకపోయేది. నాలుగవనెల వచ్చింది. నౌకర్ల చేత పనులు శుభ్రంగా చేయిస్తుందని తల్లిగారు ఆమె రాకకోసం ఎదురుచూస్తూ వుంటారు.

మనోరమ చిన్నవదిన. బారిస్టర్ జగదీశ్ సరోలాగారి భార్య పూర్తిగా బారిస్టర్‌గారికి వ్యతిరేకం. బాగా లావుపాటిమనిషి. నడకలో నెమ్మది. ఆమె ఇద్దరు పిల్లలు - తారాకి, ఖూపీకి సోమాయే ఆలనా పాలనా చేస్తుండేది. ఈ పిల్లలకోసం ఏదో ఒక అల్లికపనో, కుట్టుపనో సోమాచేతుల్లోకి సిద్ధంగా వుంటుంది. సోమా బంగళాలో వున్నట్లయితే పిల్లలకు అన్నం తినిపించటం, వాళ్ళబట్టలు మార్పించటం, పనిగూడా ఆమే చేయాలి. మొదట్లో సోమా ఓపికగా, ముద్దుగా ఈ పనులన్నీ తనే చేస్తుండేది. ఇప్పుడు వాళ్ళపనులు చేస్తూవుంటే ఆమె ఇంటికి తిరిగి వెళ్ళటానికి చాలా ఆలస్యమైపోతోంది. ఈ పని కాకపోతే ఇంకొకటి. బారిస్టర్‌గారి కోపాన్ని అదుపులో పెట్టేపనిగూడా సావిత్రీ వదినగారు సోమాకే అప్పగించారు, సోమాకి తన ఇంటికి సంబంధించిన ఏ చీకూ-చింతా లేనట్లుగా !

బారిస్టరుగారు మొదటినుంచీ కొంచం కోపిష్టిమనిషి. శుచి, శుభ్రత అనేవి ఆయన విదేశాలనుంచి నేర్చుకొచ్చారు. సావిత్రి వదినగారు అవి నిర్వహించలేకపోయేవారు. ఆయనపనులు చేసేనౌకరు ఊధమ్‌సింగ్ శెలవుమీద వున్నాడు. ఇందు చేతనే ఆయనకు టీ, బట్టలు, వేళప్రకారం అందటం లేదు. ఆయన కోప్పడుతూ వుండేవారు. మూర్ఖులైన ఆ నౌకర్లని తిడుతూవుండేవారు. మొదటివిషయం సోమా వాళ్ళ నౌకరుకాదు. రెండవది ఆమె స్త్రీ. సిగ్గుపడుతూ, ముడుచుకుపోతూ, కళ్ళు క్రిందకు వంచుకుని పనిచూసుకునే శాంతమైన ఆమె ఆకారమంటే బారిస్టర్‌గారికి చాలా ఇష్టం. ఆమెచేసే కొన్ని అమాయకపు పనులనుగూడా ఆయన నవ్వి సహించేవారు.

సావిత్రి వదినగారికి, తల్లిగారికి బారిస్టర్‌ను సంతృప్తిపరచటానికి ఈ మంచి వుపాయం దొరికింది. కళ్ళు నెత్తిమీదకొచ్చిన ఆ దుర్మార్గుడు ఊధమ్‌సింగ్ ఎప్పటిదాకా శెలవుమీదవుంటాడో అప్పటివాకా ఇదే మంచిదని వాళ్ళు ఆలోచించారు.

మధ్యాహ్నం రెండుగంటలు దాటినతర్వాత సోమా బంగళాలో వుండేటట్లయితే బారిస్టర్‌గారికి సాయంత్రపు 'టీ' ఇచ్చిరావల్సి వచ్చేది. ఒకవేళ ధనసింగ్

పూళ్ళో లేనప్పుడు సోమా రాత్రిపూట బంగళాలో గదిపేటట్లయితే ఆయనకు ఉదయం వేకువఝాము 'టీ' (బెడ్-టీ) తీసుకెళ్లాల్సి వచ్చేది.

ధనసింగ్ లాలాగార్ని తీసుకుని లాహోర్ వెళుతున్నాడు. పఠాన్‌కోట వెళ్ళినతర్వాత. పి.డబ్ల్యు.డి. చీఫ్ ఇంజనీయర్‌గారు అక్కడికే వచ్చివున్నారని తెలిసింది. లాలాగారు ఆయన్ని కలిశారు. ఇక లాహోర్ వెళ్లాల్సిన అవసరం లేదు. వర్షం విలిచిపోయింది. ఇంకా పొద్దుకూడా వుంది. లాలాగారు ధర్మశాల తిరిగి వెళ్ళిపోదామని ధనసింగ్‌తో చెప్పారు.

ధనసింగ్ కారుతీసుకొచ్చి బంగళాకు చేరేసరికి సాయంకాలం ఎనిమిదిన్నర కొట్టారు. చీకటి పడిపోయింది. బంగళా గారేజ్‌లో ఇంకొక కారేదో వుంది. లాలాగారికారుని క్రిందనున్న గారేజ్‌లో పెట్టాల్సివచ్చింది. అతను నౌకరు బద లూతో చెప్పి సోమాకి వార్త పంపించాడు. సోమా అప్పుడు లోపల ఎక్కడో పనిలో వుంది.

ధనసింగ్‌కు ఆకలి వేస్తూంది. సోమా ఎప్పుడు ఇల్లు చేరుతుంది. ఎప్పుడు వంట చేస్తుంది! బజారుకువెళ్లి హోటల్లో ఏదన్నా తినేసి, ఆ తర్వాత ఇంటికివెళ్ళి పడుకోవటం మంచిదనుకున్నాడు. 'ఆలస్యమైపోయింది, బంగళాలోనే వుండమని, వుదయంవచ్చి తీసుకువెళతావని అతను బంగళా కాపలాదారుతో సోమాకు కబురు పంపాడు. కారు తీసుకుని బజారువైపు వెళ్లాడు. బజార్లో డ్రైవర్లంతా భోజనం చేసే రామ్‌జీ హోటల్లో భోజనం చేశాడు. బండిని గారేజ్‌లో పెట్టేసి గదికివెళ్ళి మంచంమీద పడుకున్నాడు.

ధనసింగ్‌కు అలసటవలన కునికిపాట్లు వస్తూన్నాయి. ఉన్నట్లుండి తలుపు మీద ఎవరో చప్పుడు చేస్తున్నట్లనిపించింది. మొదటయితే బయట గాలి అయి వుంటుందని అశ్రద్ధ చేశాడు. కాని నోటితో ఈలవేసిన శబ్దం, కొన్ని మాటలూ గూడా వినిపించాయి. రాత్రిపూట ఎవరో దుర్మార్గులు తలుపులు తడుతున్నారని సోమా చెప్పినమాట ధనసింగ్‌కు వెంటనే గుర్తుకొచ్చింది. ఇవ్వాళ నా కొడుకులు ....కి బుద్ధివచ్చేలా చేస్తాను అనుకున్నాడు.

ఈల, చప్పుడు మళ్ళీ వినిపించాయి.

ధనసింగ్ చప్పుడుచేయకుండా మంచంమీదనుంచిలేచి తలుపుసందుదగ్గర చెవిపెట్టి విన్నాడు. బయటనుంచి—'ఏయ్ నా ప్రేయసీ, తలుపులు తెరు. ఈ బీద వాళ్ళతోగూడా రెండుమాటలు మాట్లాడు. పెద్ద పెద్ద వాళ్ళదగ్గరికి చేరుతూవుంటే ఏమయింది? మేముగూడా నిన్ను ప్రేమించేవాళ్ళమే. మా రూపాయలేం చిరిగి పోయినవా? ఇది తీసుకో పదిరూపాయలు' అన్నమాటలు వినిపించాయి.

తలుపుసందులోనుంచి ఒక కాగితం జారుతూ కనిపించింది.

తను బయటకు వెళ్ళాడని అనుకుని వాళ్ళు తన సోమాని బాధపెట్టడానికి వచ్చారు. ఆ కంఠాలు అతనికి ఎరుగున్నవిగా అనిపించాయి. అతను గుర్తుపట్టాడు. 'ధారీ–ధార్' కంపెనీలో పనిచేసే డ్రైవర్లు శమ్‌సుల్, జగ్గీ. అతనిరక్తం ఉడికి పోయింది. 'మంచివేళప్పుడు వచ్చారు. ఇవ్వాళ అక్కడ ..ల అంతు చూస్తాను' అని మనసులో అనుకున్నాడు.

బయటవాళ్లు ఈలలువేస్తూ చెడుపనులతోకూడిన సౌంజ్ఞలు చేస్తున్నారు. దానితోపాటు వాంతివచ్చేలాచేసే సారావాసన తలుపుసందుల్లోనుంచి లోపలకు వస్తూంది. ధనసింగ్ మూలగావున్న ఇనపకర్రతీసి ఒకచేత్తోపట్టుకుని, రెండోచేత్తో తలుపుగడియ తెరిచాడు. వాళ్లు నిలగదొక్కుకునేలోపునే రెండుచేతులతోనూ ఇనప కర్రనిపట్టుకుని ఇద్దరిమీదా విరుచుకుపడ్డాడు.

'అయ్యో' అని మూలుగుతూ ఒకమనిషి కళ్ళుతిరిగి కిందపడ్డాడు. రెండో వాడు పరుగెత్తాడు కాని తూలుతూ కిందపడిపోయాడు. ధనసింగ్ అతని తలమీద కూడా రెండుదెబ్బలు బలంకొద్దీ గట్టిగా కొట్టాడు. మొదట కిందపడ్డమనిషి దగ్గరకు వచ్చి అతన్ని మళ్ళీ మూడు-నాలుగు దెబ్బలు కొట్టాడు.

ధనసింగ్ రొప్పుతూ తన మంచంమీదకూర్చున్నాడు. క్షణంతర్వాత అతనికి తట్టింది, ఎక్కడా వాళ్ళకి గట్టిదెబ్బలు తగల్లేదుగదా! అక్క....గుమ్మందగ్గరే పడ్డారు. ఇది మంచిదికాదు అనుకున్నాడు.

రాత్రి నిశ్శబ్దతలో చల్లటి తీవ్రమైనగాలి రంయ్‌మని మోతచేస్తూ వీస్తోంది. చుట్టుపక్కల కుక్కలు మొరుగుతున్న శబ్దాలు వినిపిస్తున్నాయి. ఆకాశంలో అక్కడక్కడా మేఘాలు వ్యాపించివున్నాయి. చంద్రుడు కనిపించటం లేదు.

బజారు రోడ్లమీద విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. చీకటి దట్టంగా వున్నట్లని పించటంలేదు. ధనసింగ్ ఇంటిముందు పడినమనిషి దగ్గరకువెళ్ళి చూశాడు. తల నుంచి చాలా రక్తంకారి చుట్టుపక్కల నేలంతా చీకట్లో ఎర్రగా కనిపిస్తోంది. ఒంగి చూశాడు, ఆ పడినవాడు జగ్గి. శ్వాస ఆడుతున్నట్లుగా అనిపించలేదు. ధన సింగ్ భయపడ్డాడు. రెండవమనిషి పడినచోట తలదగ్గరనేలగూడా రక్తంవలన ఎర్రబడుతోంది.

ధనసింగ్‌లోనికోపం మాయమైపోయింది. కోపంస్థానంలో భయంకలిగి గుండె దడదడలాడింది. అతని ఉద్దేశం వాళ్ళని చంపాలనికాదు. కాని చచ్చి పోయారు. ఒకడు చస్తే ఏ శిక్ష పడుతుందో ఇద్దరు చచ్చినా అంతే. ఖైదు, జైలు ఉరి! అతను ఒణికిపోయాడు. మనసుని అదుపులోవుంచి ఆలోచించ ప్రయత్నిం చాడు. శవాలని ఎత్తుకెళ్ళి దూరంగావున్న గోతుల్లో పారేసిరావచ్చు. కాని రెండు వైపులా దోవల్లో గ్రామాలున్నాయి. రక్తంతో తడిసిననేలని ఏం చేయాలి? తవ్వేస్తే! ఇంతలో వచ్చే-పోయేవాళ్ళు చూస్తారేమో! వీళ్ళ శవాలు దొరుకుతాయి. విచారణ-తనిఖీ జరుగుతుంది.

పారిపోవటంతప్ప వేరే వుపాయం అతనికి కనిపించలేదు. ధనసింగ్ శరీరం భయంతో వణకసాగింది. లాఠీలంటే, కత్తులంటే అతనికి భయం లేదు. పోలీ సులు, ప్రభుత్వం అంటేమటుకు భయం. వాళ్ళనుంచి తప్పించుకోవటం చాలా కష్టం. సోమాకి ఈ వార్త చెప్పివస్తే!....భయపడుతుంది. బంగళాలో గోల మొద లవుతుంది....బ్రతికివుంటే మళ్ళీవచ్చి కలుసుకోవచ్చు. ఈసమయంలో ఏదో ఒక విధంగా పోలీసులనుంచి ప్రాణాలు కాపాడుకోవాలి అని ఆలోచించి అతను గది లోపలకువెళ్ళి డబ్బు తీసుకున్నాడు. ఆత్మరక్షణకోసం ఇనుపకడ్డీని చేతిలోకి తీసు కున్నాడు.

ధనసింగ్ దోవనుంచి తప్పుకుంటూ, కాలిబాటలనుంచి దిగుతూ కాంగడే వైపు వెళ్ళిపోయాడు.

* * *

సోమా బదలూతో వంటపాత్రలు ఎత్తిస్తుండగా లాలాగారు తిరిగివచ్చా రన్నవార్త తెలిసింది. ధనసింగ్ తనకోసం బయట ఎదురుచూస్తున్నాడేమోనని

అనుకుని తొందరగా వెళ్ళటానికి ప్రయత్నం చేసింది. కాని ఇంతలో వదినగారు పిలిచి—'చాలా మంచిదానివిగానీ సోమా, లాలాగారు వచ్చారు. కూరలు వుండనే వున్నాయి. రెండురొట్టెలు ఆయనకోసం నీ చేత్తో నువ్వు చేయమ్మా. ఇంతలో బదలూ లాలాగారికి వేడినీళ్ళు పెడతాడు' అన్నది.

సోమా లాలాగారికోసం రొట్టెలుకాల్చి బయటపడేసరికి, రేపు వుదయం వచ్చి తీసుకువెడతానని ధనసింగ్ పంపినవార్త అందింది. సోమాకు చాలా బాధ అనిపించింది. పొద్దున ఆకలితోనే వెళ్లారు. ఇప్పుడు వచ్చినాగాని బజారులో తింటారు. నిజంగా డబ్బున్నవాళ్ళు ఇతర్ల బాధల్ని కొంచంగూడా అర్థంచేసుకో లేరు. ముసలివాడైన తోటమాలిని వెంటబెట్టుకుని వెళ్ళిపోదామా అనుకుంది కాని అనుమానపడి వుండిపోయింది. తల్లిగారు, వదినగారు చెడుగా భావించవచ్చు. ఇంటిపెద్దలనుంచి ఏవిధమైన ఆదరం లభిస్తుందో, ఆవిధమైన ఆదరం ఆమెకు లభిస్తూవుండేది కాని వాళ్ళంటే ఆమె భయపడుతూగూడా వుండేది.

సోమాని రాత్రి బంగళాలో వుంచడంలో వాళ్ళవుద్దేశ్యం ఏమిటంటే ఉదయం బారిష్టర్‌గారికి, మనోర్మకి 'బెడ్ టీ' వాళ్ళగదుల్లోకి తీసుకెళ్ళి సోమా ఇచ్చి రావాలి. వాళ్ళిద్దరూ ఉదయం తొందరగా ఆరుగంటలకే లేచేవాళ్లు. ధనసింగ్ ఉదయం ఆరు-ఆరున్నరకు ముందుగా రాడు. అందుకని సోమా రాత్రి అక్కడ వుండటంలో ఏ ప్రమాదమూ లేదు. ఆమె చాలా తొందరగా లేస్తూవుండేది.

మనోరమ, బారిష్టరూ, ఇద్దరూకూడా టీ వాళ్ళ మంచాలదగ్గరపెట్టి, వాళ్ళని నిద్రలేపాలని కోరుతూ వుండేవాళ్లు. మనోరమనయితే సోమా పిలవకుండా, చేతులు కదిల్చి నిద్రలేపేది. బారిష్టర్‌గారి గదిలోకివెళ్ళగానే ఆమెకు భయం వేసేది. ఎలా పిలుస్తుంది?

ఆమె కప్పులో చెమ్చాతో చప్పుడుచేసి ఆయన్ని లేపేది. ఆయన కళ్లు తెరవగానే పారిపోయేది. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా కన్పించే ఆ అమాయకత్వం, భయంతోనిండిన ఒయ్యారం ఆయన్ని సంతోషపెట్టేది. ఆయన వెంటనే 'లవ్‌లీ' అనేవారు. ఆ రోజు అలా పారిపోతున్న సోమానిచూసి ఆయన "మిసెస్ సింగ్, ఒక కప్పు టీ కలిపి వెళ్ళరాదూ!' అన్నారు. ఆయన సిగరెట్టు అంటించుకోవటం మొదలుపెట్టారు.

ఆయన మిసెస్ సింగ్ అని పిలవటంచేత సోమా సిగ్గుపడింది. మనోరమ కూడా అప్పుడప్పుడు మిసెస్ సింగ్ అని పిలుస్తూవుండేది కాని అది వేరే విషయం. సోమా కళ్లు కిందికివాల్చి టీ తయారుచేయటం మొదలుపెట్టింది. ఆ ఇంట్లో వాళ్ళం దరూ బారిస్టర్‌గారిని తృప్తిపరచటం చాలా గొప్పవిషయంగా అనుకునేవారు. సోమా ఈ సార్థకతవలన గర్వపడుతూకూడా వుండేది. సోమా వూపిరి బిగబట్టి కప్పులో టీ తయారుచేసింది. తర్వాత బయటకువెళ్ళి వసారాలో నుంచుని గాలి పీల్చుకుంది.

ధనసింగ్ తనని తీసుకువెళ్ళటానికి వస్తున్నాడేమోనని క్రింద బజారునుంచి బంగళావైపువచ్చే కాలిబాటవైపు, రోడ్డువైపు ఆమె చూస్తూ నిలబడింది. వదిన గారూ, పిల్లలు నిద్ర లేవకముందే వెళ్ళిపోవటం మంచిది. లేకపోతే మళ్ళీ ఏదో ఒకపనిలో ఇరుక్కుపోవాల్సి వస్తుంది అనుకుంది. ధనసింగ్ వస్తున్న జాడలేమీ కనిపించలేదు. పొద్దు ఇంకా చాలా వుంది. సూర్యుడు అప్పుడే తూర్పుదిక్కున వుదయించాడు.

సోమా ఆలోచిస్తోంది, ఆయన తొందరగావచ్చేస్తే బాగుంటుంది. ఎంత సేపని ఏపని చేయకుండా కూర్చుంటుంది! ఆమె మనోరమ గదిలోకివెళ్ళి మంచాన్ని సర్దటం మొదలెట్టింది. సూర్యుడు పైకెక్కాడు కాని ధనసింగ్ రాలేదు. వసారాలో నిలబడి రోడ్డువైపు చూస్తూవుండటం మంచిదికాదు. ఎవరన్నాచూస్తే ఏమనుకుం టారు? సోమా క్షణంసేపు లోపలికెళుతూంది, క్షణం వసారాలోకి వస్తూంది.

ఎండ తీక్షణత హెచ్చింది. ఆకాశం రాత్రంతా నిర్మలంగా వుంది. వన స్పతిచెట్లమీద బాగా మంచు కురిసింది. బంగాళా కప్పునుంచి మంచుబిందువులు బొట్లు-బొట్లుగా పడుతున్నాయి. వానవలన తడిసినపైరు ఎండలో మెరుస్తోంది. మబ్బుతునకలు వర్షించటం మానేసి ఎత్తుగా ఎగిరిపోయి కొండలమీద ఆడుకుం టున్నాయి. తక్కువజాతిస్త్రీలు కుండలు తీసుకుని ఇళ్ళదగ్గరవున్న పంపులవైపో, నూతులవైపో వస్తూ-పోతూ కనిపిస్తున్నారు. గొప్పఇంటి స్త్రీలు ఇంతకాలం వర్షం కారణంగా కనిపించని ఎండనుచూసి తడిసిన సామాన్లని ఎండలో డాబామీద వేయ డానికి ఏర్పాట్లు చేస్తున్నారు. బంగళాల్లోవుండే స్త్రీలు మంచాలమీద ఒళ్లు విరుచు

కుంటూ కూర్చుని నౌకర్లని పిలుస్తున్నారు. సోమా మనసు విలవిలా తన్నుకుంటోంది. తనగూడా వెళ్ళి ఇల్లు సర్దుకునేది కాని ధనసింగ్ ఇంతవరకూ రాలేదు.

పిల్లలు నిద్రలేచారు. భూపీ కారుబొమ్మని చేతిలో పెట్టుకుని పడుకుని నిద్రపోయాడు. ఆ కారుబొమ్మ తీసుకొచ్చి ఆ కుర్రాడు సోమా మోకాళ్ళమీద కూర్చున్నాడు. 'పిన్నీ ఈఖిన్ని నడిపించవూ!' అన్నాడు.

ఆమె ఆ కుర్రాణ్ణి వడిలోకి తీసుకుంది. కాలిబాటవైపు చూస్తూవుండిపోయింది. ఆమె మనసు వ్యాకులపడుతోంది. ధ్యానని అటునుంచి మళ్ళించటానికి భూపీ కాళ్ళూ-చేతులూ కడగటానికి వెళ్ళిపోయింది.

ఎనిమిది గంటలయింది. ధనసింగ్ రాలేదు. వదినగారు పిలిచారు-'సోమా. కొంచం భూపీకి పాలు త్రాగించు. వాడు ఇంకెవరిమాటా వినడు.'

సోమా ఆలోచిస్తోంది. 'ఏమిటి, ఈయన పొద్దున్నే ఎక్కడికైనా డ్యూటీ మీద వెళ్ళిపోయారా!' ఈ అన్యాయం ఆమెకు కోపం తెప్పించింది. భూపీకి పాలు త్రాగించటం అంత తేలికైనపనికాదు. ఒకగుక్క పాలుత్రాగి బంగళాఅంతా తిరుగుతాడు. రెండవగుక్కత్రాగి కారుబొమ్మని తాళంచెవిపెట్టి తిప్పి నడిపించి చూస్తాడు. తొమ్మిదికూడా అయిపోయింది.

సోమాకి ఏడుపొచ్చినంతపనయింది. ఉదయమే డ్యూటీకి వెళ్తానని రాత్రి చెప్పివెళ్ళారేమోనని బదలూచేత మాలీని అడిగించింది. ఇక ఒక్కతీవెళ్ళి ఇల్లు ఊడ్చి - కడుక్కుందామని అనుకుంది. మనసులో బాధగా వుండటంచేత తల్లిగారినీ, వదినగారినీ ఏమీ అడగలేకపోయింది. వెళ్ళేముందు దీపాకి గౌనుమార్చి, తలదువ్వి రిబ్బను పెడుతోంది. ఇంతలో బదలూవచ్చి—'ధనసింగ్ భార్యా! బయట పోలీసుఠాణా సిపాయిలు వచ్చారు. పోలీసు ఇనస్పెక్టరుగూడా వచ్చారు. మిమ్మ పిలుస్తున్నారు' అని కంగారుగా చెప్పాడు.

సోమా విభ్రాంతురాలై కళ్ళు పెద్దవిచేసి అతనివైపు చూసింది. నోటినుంచి 'ఏమిటి' అన్నమాటగూడా బయటకు రాలేదు. దీపా తలకుకట్టే రిబ్బను చేతిలోనుంచి జారి కింద పడిపోయింది.

పోలీసులు బంగళాదగ్గరకువచ్చి సోమాని పిలుస్తున్నారు. బంగళాలో

గల్లంతు వ్యాపించింది. వదినగారు కంగారుపడి 'ఏమయింది? ధనసింగ్ ఎక్కడున్నాడు? అతను పొద్దున్న రాలేదా? ఎక్కడయినా కారుకి ప్రమాదం జరిగిందా, ఎవరికన్నా దెబ్బలు తగిలిందా?.... అయ్యో, ఏం జరిగింది? పోలీసులు ఏమంటున్నారు?' అని సోమాని అడిగారు.

తల్లిగారు పెరుగుచిలికి వెన్న తీస్తున్నారు. ఈ వార్త వినగానే ఆశ్చర్యంతో లేచివచ్చారు. 'అమ్మాయి, అతనుమటుకూ చాలా ప్రమాదకరమైన మనిషి. నేను మొదటనుంచీ అతనంటే భయపడేదాన్ని. కైలు-గైలు గురించినమాటేమి కాదు గదా! వెళ్ళి లాలాగారితోగాని, జగదీశ్‌తోగాని చెప్పు' అన్నారు.

మనోరమ సోమా భుజాలమీద చేతులేసి 'సరిగా ఏం దాచకుండా చెప్పు, ఏం జరిగింది?' అని అడిగింది.

సోమా ఏడవటం మొదలెట్టింది—'నేను నిన్నసాయంత్రంనుంచి ఇక్కడే వున్నానని మీకు తెలుసు. ఆయన రాత్రి ఎప్పుడొచ్చారో, ఏం చెప్పివెళ్లారో నాకేమీ తెలీదు. పొద్దున్నుంచి ఎదురుచూస్తున్నాను' అని చెప్పింది.

'నువ్విక్కడే కూర్చో. నేను వెళ్ళి అన్నయ్యతో చెప్పివస్తాను' మనోరమ బాధగా అని లోపలకు వెళ్ళింది.

బారిస్టరుగారువచ్చి 'మిసెస్ సింగ్, మొదట మేము పోలీసులతో మాట్లాడుతాము. ఆతర్వాతనే నువ్వు వాఙ్మూలం ఇవ్వాలి. నువ్వు పోలీసులతోపాటు వెళ్ళద్దు. ఒకసారి పోలీసులచేతుల్లోపడితే మళ్ళీ బయటకురావడం కష్టమవుతుంది' అని సలహా ఇచ్చారు.

సోమా మోకాళ్ళమధ్య తలపెట్టుకుని కూర్చుని ఏడుస్తోంది. పోలీసుల చేతుల్లో పడటంకన్నా ప్రాణాలిచ్చేయడం మంచిదని అనుకుంది.

బారిస్టర్ పరోలా పోలీసులతో మాట్లాడారు. పోలీసు అధికారిద్వారా తెలిసిందేమిటంటే ధనసింగ్ గదిఎదురుగా ఒకశవం దొరికింది. రెండవమనిషిగూడా ప్రమాదకరమైనస్థితిలో వున్నాడు. ఇద్దరితలలూ పగిలివున్నాయి. ధనసింగ్ గది తలుపు తెరిచివుంది. అతను అయిపులేకుండా పోయాడు. పోలీసుఅధికారి విచారణకోసం సోమాని పోలీసుఠాణాకు తీసుకువెళ్లాలని కోరుతున్నాడు.

బారిస్టర్ సరోలా అధికారితో చెప్పారు-'మిసెస్ పింగ్ నిన్న సాయంత్రం నుంచి ఈ బంగళాలోనే వున్నారు. రాత్రి ధనసింగ్ లాలాగార్ని తీసుకువచ్చి నప్పుడు తొందరలో ఇక్కడనుంచి వెళ్ళిపోయాడు. అతనిభార్యని అతను కలుసు కోలేదు. ధనసింగ్ ఈ హత్య చేశాడో లేక పోతే ఆ దురాక్రమణ చేసినవాళ్ళల్లోనే ఇద్దరు దెబ్బలుతిని పడిపోయి, మిగతావాళ్లు ధనసింగ్‌ని చంపి శవాన్ని ఎత్తుకెళ్ళి పోయారేమో. మనం ఏం చెప్పగలం? మిసెస్ సింగ్‌మాత్రం ఈ విషయంలో ఏం చెప్పగలరు? నేనుగూడా బారిస్టర్‌నే. మీరు చట్టాన్ని అనుసరించి న్యాయవిచారణ చేయండి. చట్టానికి న్యాయంచేయడం మా కర్తవ్యంకాన మిసెస్ ధనసింగ్‌ని మీరు ఖైదుచేయటానికి తీసుకువెళ్ళలేరు. ఆమెని న్యాయవిచారణ చేయవచ్చు. ఆమె మర్యాదస్థురాలైన స్త్రీ. మిస్టర్ ధనసింగ్ మా గారేజి మానేజరు. ఒకవేళ మిసెస్ ధనసింగ్ పారిపోతుందని మీకు అనుమానంగావుంటే మేము ఆమెని కారులో కూర్చోబెట్టి మీతోబాటు డిప్యూటీ కమీషనర్‌గారి బంగళాకు తీసుకురావటానికి సిద్ధంగా వున్నాం. వారుచెపితే మేము జామీను ఇవ్వటానికికూడా సిద్ధంగా వున్నాం. మీరు ఏవిధమైన జామీను కావాలంటారు. మీరు మిసెస్ ధనసింగ్‌ని అడగాలను కున్న ప్రశ్నలు మా ఎదుట అడగవచ్చు. ఆమె హాజరవటం అవసరమైతే మేము ఏ న్యాయస్థానంలో కావాలంటే అక్కడయినా, మేజిస్ట్రేట్ ఎదుటకుగాని, న్యాయ స్థానంవారి ఆజ్ఞానుసారం ఆమెను ప్రవేశపెడతాము.'

బారిస్టర్ సరోలాగారి సలహాప్రకారం మనోరమ లోపలికివెళ్ళి సోమా ముఖం-చేతులూ కడిగించింది. తలదువ్వి, కట్టుకోవటానికి తనబట్టలు ఇచ్చింది. ఆమెను పోలీసు అధికారి కూర్చున్నచోటికి తీసుకువచ్చింది. ఆమె వచ్చినమీదట బారిస్టరు, ఒకస్త్రీకి గౌరవం ఇవ్వటంకోసం కుర్చీలోనుంచి లేచినిలబడ్డాడు. పోలీసు అధికారికూడా ఆయనతోబాటు లేవాల్సివచ్చింది. వాబ్కాలం ఇవ్వటంకోసం సోమా కుర్చీలో కూర్చుంది. ఆమెకు ఒకవైపున మనోరమ, రెండోవైపున బారిష్టరుగారు కూర్చున్నారు.

పోలీసు అధికారి చాలావినయంగా మిసెస్ సింగ్ అని సంబోధన చేశాడు. బాధను కలిగించే ఏ మాటా అడగలేదు. సోమా బాధతోపాటు ఆయనగూడా బాధ పడుతూ ఆమె భర్తను వెదకటానికి పూర్తిగా సహాయం చేస్తానని మాటిచ్చారు.

'ధనసింగ్ రాత్రిపూట ఉద్యోగరీత్యా ఇంటికి రాకపోతే ఇంట్లో తనొక్కతీ వుండటంచేత ఆమెకు భయమేస్తుండేది. అటువంటి పరిస్థితుల్లో ఆమె ఎప్పుడూ బంగళాకు వచ్చేస్తూవుండేది. ఇలా ఒక్కసారికాదు. ఎప్పుడూ జరుగుతూనేవుంది. అందుకు ఇక్కడున్న వీళ్ళంతా సాక్షులే. ఆమె క్రితం సాయంకాలం సూర్యుడు అస్తమించకముందే బంగళాకు వచ్చేసింది. తర్వాత ఆమెకు ధనసింగ్‌గురించి పోలీసులద్వారానే సమాచారం తెలిసింది' అనిమాత్రమే సోమా చెప్పగలిగింది.

బారిస్టరు, మనోరమల సహాయంచేత సోమా ఎలాగో-అలాగా పోలీసుల ముందు వాఙ్మూలం ఇచ్చింది కాని ఆమె శరీరం, మనసు సరిగా లేవు. ఆమె కడుపులో తీవ్రంగా నొప్పి ప్రారంభమయింది. అది ఎటువంటినొప్పో ఆమెకు అర్థమయింది కాని ఎవరితో చెప్పుతుంది. ఆమె తల్లిగారు, వదినగారు అంటే భయపడుతుండేది. మనోరమ పెళ్ళికానిది. క్రితం సంవత్సరం మనోరమ సోమా వుండటానికి ఏ గదినయితే ఏర్పాటు చేసిందో, ఆ గదిలో ఇద్దరుపిల్లలూ నిద్రపోతున్నారు. సోమాకి నొప్పి బాగా ఎక్కువయింది. నొప్పివలన బిగ్గరగా అరవాలని అనిపించింది. ఆమె శాలువఅంచు నోటిలో కుక్కుకుని వీపు గోడకుఆనించి కూర్చుంది. మనోరమ సోమాని చూడగానే ఆమె భుజాలుపట్టుకుని తనగదిలోకి తీసుకెళ్ళింది. మనోరమ కేమీ అర్థం కాలేదు. ఆమె తల్లిగారినీ, వదినగారినీ పిల్చింది.

తల్లిగారు, వదినగారు తమలో తాము నెమ్మదిగా మాట్లాడుకుని, 'మన్నో నువ్వు వేరేగదిలోకి వెళ్ళిపో. లేకపోతే ఈమెని వేరేగదిలోకి చేర్పించు' అని మనోరమతో చెప్పారు.

'ఈమెని ఇక్కడే వుండనివ్వండి' అని మనోరమ తనే బయటకు వెళ్ళిపోయింది.

బారిస్టర్ జగదీశ్ విషయం పసిగట్టి లాలాగారి గుమాస్తానిపిల్చి 'మనకారు తీసుకెళ్ళి వెంటనే లేడీడాక్టరును తీసుకురా।' అని ఆజ్ఞాపించారు.

సాయంకాలం అవుతూవుండగా సోమా నాలుగునెలలగర్భము పోయింది. ఆమె ముఖందాచుకుని శారీరికబాధవలన, మానసిక ఆవేదనవలన ఏడుస్తూ వుండిపోయింది. మనోరమ మాటిమాటికీవచ్చి ఆమె తలమీద చేయివేసి ఓదారుస్తోంది.

మనోరమ మాటిమాటికీ సోమాడగ్గరకు వెళ్ళటంచూసి వదినగారు నెమ్మదిగా తిట్టారు—'ఏం పిల్లవి నువ్వు। ఆ జోలికి వెళ్ళద్దని నేను నీతో చెప్పానుగదా। ఇది నువ్వు అర్థం చేసుకోగలిగిన విషయంకాదు' అన్నారు.

మనోరమ బెంగగా రెండవవైపుకు వెళ్ళిపోయింది. వసారాలో నేలమీద పరచివున్న తివాచీమీద కూర్చుంది. రెండుచేతులూ దిండులా తలవెనుక పెట్టుకుని ఆనుకుంది. ఆకాశం నిర్మలంగావుంది. నిశ్చలమైన మనోరమదృష్టి మంచుతో కప్పబడిన 'త్రియూద్' పర్వతశిఖరాలమీద వుంది. తెల్లటి పర్వతశిఖరాలు సూర్యాస్తమయం అయేటప్పుడు వ్యాపించిన కిరణాలవల్ల గులాబీరంగు పులుముకున్నాయి. ఆ శిఖరాలు ఏప్రిల్‌లో మంచుతో కప్పబడినగోడల్లా కనిపిస్తూవుంటాయి. వర్షాల వలన కొండలమీద చాలావరకు మంచు కరిగిపోయింది. అయినాకూడా సూర్యుని కిరణాలను ప్రతిబింబింపచేయటానికి కావలసినంత మంచువుంది. మంచుతోనిండిన శిఖరాలు, వాటిపై తిరిగే మేఘాలతునకలు, గులాబీవర్ణాన్ని ధరిస్తున్నాయి. సూర్యాస్తమయపు ఆ శోభను చూడటానికి మనోరమ చాలాసార్లు ఆ ప్రదేశంలో కూర్చునేది.

క్రితం సంవత్సరం భూషణ్ ఖైదు అవటానికిముందు మనోరమ ఆ ప్రదేశంలో కూర్చుని తన భవిష్యత్తుగురించి ఆలోచించింది. రచయిత అయి తన జీవితంలో ఆత్మ-తృప్తిపొందాలని ఆమె ఇక్కడే కూర్చుని నిశ్చయించుకుంది. సూర్యునికి, సూర్యకిరణానికి మధ్య వియోగంకూడా ఎంత అందమైనసృష్టి। ప్రేమమీదవున్న విశ్వాసంలో విరహంవల్ల కలిగేదుఃఖం అమూల్యమైన ధనరూపంలో హృదయానికి ఊరట కలిగిస్తుంది. దిక్కులేని సోమాదుఃఖం ఆమె లోలోపల దాగివున్నసుఖాన్ని గుర్తింపచేయటం లేదు. ప్రతి సంధ్యాకాలమూ కొత్త సూర్యోదయం వస్తుందనే ధైర్యాన్ని ఇస్తుంది. ఇదే జీవితం। అని మనోరమ ఆలోచిస్తూ వుండేది.

మనోరమ ఆ సాయంకాలం ఆలోచిస్తూంది——స్త్రీకి ప్రేమవల్లకలిగే ఫలం త్యాగమే. అది ఆత్మత్యాగం కావచ్చు లేదా శారీరకత్యాగం కావచ్చు. పురుషుడు కేవలం మోసగించి వెళ్ళిపోతాడు. భూషణ్ అంతే, ధనసింగ్ అంతే। ఉదాసీనుడై పడమటిదిశలోవెళ్ళి దాక్కునే సూర్యుడు అంతే। కాని సూర్యాస్తమయం సమ

యంలో భూమిమీదవ్యాపించే సూర్యుని కాంతినీడలు ప్రకృతిని కొత్తశోభతో నింపుతాయి. స్త్రీ జీవితమూ ఆ భూదేవి జీవితంలాంటిదే. అలా మిగిలిపోయివ శోభతోనే ఆమెజీవితం ధన్యమవుతుంది. ఆమెకు గౌరవం చేకూరుతుంది.

ఆ సంఘటనతర్వాత మనోరమ, బారిష్టరూకూడా సోమాని బంగళానుంచి వెళ్ళనీయలేదు. సోమా తనంతటతాను వెళ్ళటానికి కూడా ఇష్టపడలేదు. పోలీసుల రెండురూపాల్నికూడా ఆమె చూసింది. వైక్‌నాథ్ పోలీసుఠాణాలో మంచంమీద పడు కునివున్న పోలీసు అధికారి ఎదురుగా నుంచుని ఆమె వణుకుతూవున్నప్పుడు, కుతూ హలంతో ఆమె తలమీద ముసుగులాగి, ముఖంమీద లాంతరువెలుగు వేయటం, ఆమె ఏడుపుకూ, తిరస్కారానికి ఏమీ అర్థం లేకపోవటం ఆ పోలీసుఠాణాగదుల్లో గడిపిన అయిదురాత్రులూ ఆమెజీవితంలో అన్నింటికన్నా భయంకరమైన స్మృతులు. సోమా వాటిని ఒక భయంకరమైన పీడకలగాతలచి మరచిపోవటానికి ప్రయత్నం చేస్తూవుండేది.

ఆమె చూసిన పోలీసుల రెండవరూపం సోమా కుర్చీలో కూర్చునివుండగా పోలీసు అధికారి ఆమె ఎదురుగానిలబడి నౌకరులాగా క్షమాపణ అడుగుతూ వంగి వంగి మాట్లాడటం. అది కేవలం మనోరమ, బారిష్టర్ పరోలాల దయ. లేకపోతే తనదేముంది! మిఠాయి తిన్నతర్వాత ఆ కాగితాన్ని మడిచివేసి చుట్టిపారవేసినట్లుగా వుంది ఆమె పరిస్థితి. ఒకవేళ ఆ రాత్రి ఆమెగదిలోనే వుండివున్నట్లయితే, పోలీ సులు ఆమెను పట్టుకుని జైలుకు తీసుకువెడితే ఏం జరిగేది? ధనసింగ్ లేకుండా జీవించటం అసంభవం కాని ధనసింగ్ లేకుండా ఖైదుజీవితం అనుభవించటం లోనూ, బారిష్టరు, మనోరమల నీడవున్న జీవితంలోనూ తేడా వుంది. సోమా ఈవిషయం గ్రహించింది.

తనవలన లాలాగారు, తల్లిగారు బాధపడుతున్నారనిగూడా సోమా తెలుసు కుంది. 'అనవసరంగా ఆఫీసర్లతో తగవు తెచ్చుకోవటం మంచిదికాదు. సోమా యౌవనంలోవున్న స్త్రీ. ప్రజలు రకరకాలమాటలూ అల్లుతారు' అని వాళ్ళన్నారు గూడా. కాని మనోరమ, బారిష్టరు, ముఖ్యంగా తన స్థితికన్నా తక్కువస్థితిలో వున్నవాళ్ళ మాటల్నిగురించి ఏం పట్టించుకుంటారు? తక్కువజాతివాళ్ళుగాని, మధ్య తరగతివాళ్ళుగాని వీళ్ళనిగురించి ఏం విమర్శిస్తారు? తక్కువజాతిప్రజలు తమస్థితిలో

వున్నవాళ్ళ విరంకుశత్వాన్ని, దురాచారాన్ని సహించలేరు. గొప్పవాళ్ళకోసం వేరే నియమాలు, ఆదర్శాలు వున్నాయని అనుకుంటారు. రోడ్డులో వెళ్ళేటప్పుడు ఎవరైనా గుప్పెడుదుమ్ము విసిరితే సహించలేము కాని గాలిదుమారంవలన పేర్లకుపేర్ల దుమ్మువచ్చి తలమీద, కళ్ళల్లోనూపడితే అదృష్టాన్ని తిట్టుకుని మెదలకుండా వుండి పోతాం. గాలిదుమారాన్ని వ్యతిరేకించలేం.

సోమా చాలా విరుత్సాహపడి ఆలోచిస్తూవుండేది. ఏవిధమైన అధికారమూ లేకుండా ఆమె ఆ ఇంట్లోవాళ్ళదయమీద ఆధారపడి బతుకుతోంది. ఆ దయకి అర్హురాలవటంకోసం, తన దుఃఖాన్ని మర్చిపోవటంకోసం. ప్రతిక్షణమూ ఏదో ఒక పనిలో నిమగ్నురాలై వుండేది. వదినగారుకూడా ఆమె గుణాల్నిగురించి పొగడకుండా వుండలేకపోయేవారు. వదినగారికయితే సోమా భగవంతుని ప్రసాదమే అనుకోవచ్చు. మనోరమకు ఈ మాటమీద కోపమొస్తూవుండేది. అనేకసార్లు సోమాని అంట్లు తోముతుండగా వారించి ఆమె భుజంపట్టుకుని లేపేది. చేతితో బొక్కెన, మురికి బట్టలు లాగేసి పారేసేది. సోమాచేత బలవంతంగా మురికిబట్టలు వూడదీయించి కట్టుకోవడానికి తనబట్టలుఇచ్చి 'నువ్వు నౌకరువికావు, మా అతిథివి' అని చెపుతూ వుండేది.

సోమా కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి. అతిథి ఎవరైనా ఎన్నిరోజులవరకూ వుంటాడు? బంధుత్వమనేది సమవుజ్జీగల ప్రజల్లోనే వుంటుంది.

మనోరమ సోమా మనసును సంతోషంగా వుంచటంకోసం తరుచుగా ఆమెను వంటరిగా కూర్చోనిచ్చేది కాదు. తనపక్కనే కూర్చోబెట్టుకునేది. సోమా ఏదన్నా చదువుతుంటే వారించేది. మనోరమ జీవితంలో నిండిన సమస్యలకు కారణాల్ని, వాటిసంబంధాల్ని అర్థం చేసుకోగలగటం సోమాకు సంభవం కాదు. సోమా అర్థం చేసుకోవటానికి వీలుండేవిషయాలనే మనోరమ మాట్లాడటానికి ప్రయత్నించేది. అప్పుడప్పుడూ మనోరమ బయటకు షికారుగా తిరగటానికి సోమాని వెంట రమ్మనేది. సోమాకి తన స్వంతఅభిప్రాయాలు, కోరికలూ అంటూ ఏమీ లేవు. ఆమె భయపడుతూ మనోరమవైపుచూసి, మీరు ఎలా చెపితే అలా చేస్తాను అనేది. ప్రతిమాటకి సోమా అంగీకరించటంవలన, ఏ విషయానికీ అభ్యంతరం చెప్పక పోవటంవలన మనోరమ బాధపడేది.

సోమా మొదట్నుంచీ మనోరమని గౌరవించేది కాని అప్పుడప్పుడూ మనోరమ ఆమెను షికారుకు రమ్మన్నప్పుడుమాత్రం సోమా జంకేది. నవ్వు వచ్చేది. పేదవాళ్ళు బీదలు ఎప్పుడన్నా షికారుకు వెళ్తారా? ఆమె ఇంతకుముం దెప్పుడూ షికారుకి వెళ్ళలేదు. షికారు చేస్తుండగా ఎవరినీ చూడలేదు. మనసుకు విశ్రాంతి కల్గించటం, ఉల్లాసం సమకూర్చటంకూడా ఒక పనా? ఇది ఆమెకు తెలియదు. పెళ్ళిళ్ళల్లో స్త్రీలు పాటలు పాడుతుండగా ఆమె చూసింది. తనుకూడా పాటలు పాడింది కాని అవయితే చాలా అవసరమైనవి. ముఖ్యమైనసమయాల్లో ఇతర పనుల్ని వదిలేసికూడా పాటలు పాడాల్సివస్తుంది.

మనోరమకి సోమా రూపం, అందం చాలా నచ్చేవి. ఒకరోజు ఆమె నాజూకైన, అందమైన సోమా శరీరాన్ని చూసి మాస్టరుగారి సలహాప్రకారం తనచీరను సోమాకిచ్చి కట్టుకోమని అడిగింది. సోమా సిగ్గుతో కృంగిపోయింది. ఆమెముఖం సిగ్గుచేత ఎర్రబడింది. 'ఇదికూడా ఏమైనా కట్టుకునేదేనా? పలచగా, శరీరమంతా కనబడుతుంది....చచ్చిపోయేటప్పుడుకూడా కట్టుకోలేను' అన్నది.

మనోరమకు వినయం తక్కువని సోమా అనుకునేదికాదు. డబ్బున్నవాళ్ళ మాట వేరు. కాని ధనసింగ్ పారిపోయినరోజున పోలీసుల ఎదుటికి వెళ్ళటానికి మనోరమ తనకు చీరకడితే ఆమె ఏమీ అభ్యంతరం చెప్పలేదు. అప్పుడామెకు సిగ్గుగురించిగాని, అనుమానం గురించిగాని, తన మనసులోని మంచి-చెడూ, ఉచితానుచితాలను గురించిగాని చెప్పడానికి అవకాశం లేదు. ఇప్పుడామెని ఎలా చెయ్యమని చెపితే అలా చేస్తోంది. ఇదే విషయం మనోరమని బాధపెట్టేది. ఆమె సోమా మీద పడి ఏడ్చేది. సోమా కృతజ్ఞతతో కళ్ళు తుడుచుకునేది.

బారిస్టర్ సక్సేనాగారు సోమాని ఓదారుస్తూవుండేవారు—'మిసెస్ సింగ్ గాభరాపడద్దు. ఏదో పోట్లాట అయివుండచ్చని తెలుస్తోంది. ధనసింగ్ ముందే నిశ్చయించుకుని హత్యచేసి వుండకపోవచ్చు. కొద్దిరోజుల్లో పోట్లాట అణిగిపోతుంది. ధనసింగ్ తిరిగివస్తాడు. అప్పటివరకూ నువ్వు ఇది నీ ఇల్లే అనుకుని వుండు' అనేవారు.

అక్టోబరుమాసపు చక్కనిరోజులు మళ్ళీ వచ్చాయి. నీలి ఆకాశం, ధర్మశాలలో ప్రతిచోటా వికసించినపూలు, జీవంతో ఊగిసలాడుతున్న గాలి ఎంతో

ఆనందాన్ని కలిగిస్తాయి. న్యాయాలయాలు, సెలవులతర్వాత తెరుచుకున్నాయి. వాళ్ళు లాహోర్ వెళ్ళిపోయేమాట అప్పుడప్పుడూ తలఎత్తుతూ వుండేది. కాని కొండప్రాంతంలో ఈ ఋతువే ఆరోగ్యానికి ఎక్కువ లాభదాయకంగా భావించ బడుతోంది. అందుచేత కొండప్రాంతంనుంచి తిరిగి వెళ్ళేవిషయం ఎల్లుండి— ఆ తరువాత, అని వాయిదా పడుతోంది. వాళ్ళు వెళ్ళిపోయినతర్వాత తల్లిగారు, లాలాగారు, సోమావిషయం ఏం చేస్తారనేది చెప్పటం కష్టం. ఆమెను అట్టే పెట్టు కోవచ్చు లేదా బాధ్యతగా ఎంచి తన ఏర్పాటు తను చూసుకోమని చెప్పవచ్చు అని బారిస్టరుగారు మనోరమతో చెప్పారు. 'అలావద్దు. మనం ఆమెను మనతోబాటు లాహోర్ తీసుకువెళ్దాం' అన్నది మనోరమ.

మనోరమ వదినగారు లావుపాటిమనిషి కావటంవలన, సోమరిగా వుండటం చేత, కష్టపడి పనిచేసే సోమా స్వభావంమీద, ఆమె పేదరికంపట్ల ఆసక్తురా లయారు. ఇద్దరు పిల్లల్ని, జంజాటంతోనిండిన కుటుంబాన్ని సర్దటం ఆమెకు వీలు కావటంలేదు. సోమాని ఆమె అర్థం చేసుకున్నారు. ఆమె వెడల్పాటిముఖాన్ని తిప్పుతూ, 'అయ్యో, ఆమె లేకుండా పిల్లలు ఎలా వుంటారు? ఎప్పుడూ ఆమెనే తల్చుకుంటూ వుంటారు. ఇక్కడ ఆమె చేయాల్సిన పనేముంది?' అన్నారు.

పరాయిస్త్రీ బరువుని తమ తలలమీదకు తీసుకుని భరించటం తల్లిగారికీ, లాలాగారికి అంత తెలివైనపనిగా అనిపించలేదు. కాని ఎప్పుడయితే పరివారమంతా సోమాని లాహోర్ తీసుకువెళ్ళటానికి ఆతురతగావుందో, అప్పుడు వాళ్ళుగూడా, 'మేము చెప్పేదేముంది, మీరందరూ బుద్ధిమంతులు. ఆలోచించి ఏది మంచిదని తోస్తే అలా చేయండి' అన్నారు.

సోమాని ఎవరూ ఆమె అభిప్రాయంగురించి అడగలేదు. మన్నో, వదిన గారు, పిల్లలతోబాటు తనూ లాహోర్ వెళుతుంది అని నెమ్మదిగా అనుకుంటూ వుండగా సోమా చాలాసార్లు విన్నది.

కొండప్రాంతంలో సోమాకి ఇప్పుడు 'తనది' అనుకునేది ఏదీ లేకుండా పోయింది. కొండలనుంచి ఆమె కేవలం దుఃఖపూరితమైన స్మృతులను వెంట తీసుకుని వెళ్తూవుంది. తనప్రాంతం వదిలివెళ్ళేటప్పుడు ఎలా కారుకొండలనుంచి

క్రిందకు దిగుతూ వెళుతున్నదో అలా సోమా మనసుకూడా బాధలో మునిగి తేలు తూంది. ఆమె ఎవరూ చూడకుండా కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

సోమా తనప్రాంతంవదిలి వెళ్ళిపోతోంది. ఆమె ప్రపంచం మారిపోతోంది. భూమిమీదనుంచి కాళ్లు ఒకసారి కదిలిపోయినతర్వాత ఎక్కడికివెళ్ళి నిలబడగలుగు తాయో, ఏం తెలుస్తుంది! కాని ఆమె అంతకన్నా ఏం చేయగలదు? ప్రపంచ మంటే భయంచేతనూ, ఆ వేడినుంచి తనని తాను కాపాడుకోవటానికి, మన్నో, బారిస్టరుగార్ల నీడలో రక్షణ పొందుతోంది. కాలం మార్పువలన ఆ నీడప్రదేశం మారిపోతే, దానితోపాటు సోమాప్రదేశంకూడా మారటం తప్పనిసరికదా.

# జైలు తప్పించుకుని మళ్ళీ జైలు

సముద్రమట్టంనుంచి ఏడువేల అడుగుల ఎత్తున, మేఘాలలో దాక్కొని వున్న ధర్మశాల గ్రామంనుంచి ధనసింగ్ ఆ రాత్రిసమయంలో కాలిబాటనుంచి వేగంగా దిగి వెళుతున్నాడు. పైనుంచి క్రిందపడినరాయి ఎలా వేగంగా క్రిందకు దొర్లిపోతుందో, అలా కొండపైనుంచి వేగంగా దిగుతూ వెళ్ళిపోతున్నాడు. అంతరిక ప్రేరణవలన తను ముందే నిర్ణయించుకున్న మార్గంవైపు అతను వెళ్ళిపో తున్నాడు. దోవలో రెండు మూడుసార్లు నిలబడి వెనక్కి తిరిగిచూశాడు. వెనుక నుంచి ఎవరూ రావటంలేదు. కాని అతని నడకలో మార్పు రాలేదు. ఏ శత్రువు నుంచి తప్పించుకోవటానికి అతను పారిపోతున్నాడో అతని అందుబాటుకి. శక్తికి హద్దులేదు. ప్రభుత్వం, పోలీసులు, అయిదుమైళ్ళు ఏమిటి, ఏభై మైళ్ళవరకు తమ చేతుల్నిచాపి తన మెడను పట్టుకోగలరు. ప్రభుత్వము, పోలీసులశక్తి, వాళ్ళ అగో చరమైన చేతులు తన మెడని తాకుతున్నట్లు అతనికి అనిపిస్తోంది. అతను ఇంకా వేగంగా పరుగెత్తటం మొదలుపెట్టాడు.

ధనసింగ్ తన గౌరవానికి, తన భార్య గౌరవానికి దెబ్బ తగలటంచేత పిచ్చివాడయాడు, తన గౌరవాన్ని రక్షించుకోవడంకోసం, తనకు జరిగిన అవమానా నికి ప్రతీకారం తీర్చుకోవడంకోసం దేన్నీ లక్ష్యపెట్టలేదు. తను గదిలోవుండగా వచ్చినవాళ్ళు ఇద్దరు, తను ఒంటరిగావున్నాడు. వాళ్లదగ్గర కత్తులు వుండచ్చు. కాని తను భయపడలేదు. ఇప్పుడు వాళ్లు చచ్చిపోయినతర్వాత తను భయపడు తున్నాడు. ఇప్పుడు ప్రభుత్వం వాళ్లవైపు వుంది. రోడ్డుమీదనుంచి వెళ్లడం తేలి కగా వుంటుందికాని కాలినడకకన్నా రోడ్డు ఒకటిన్నర-రెండురెట్లదూరం అవు తుంది.

ధనసింగ్ కాంగడాగ్రామంనుంచి తప్పించుకుని బయటపడ్డాడు. ప్రతిచోట అతని కాలిచప్పుడు పసిగట్టి కుక్కలు మొరగటం మొదలుపెట్టాయి. అతను గ్రామాలనుంచికాకుండా వాటిపక్కనుంచి నడవసాగాడు. ధనసింగ్‌కు ఆ సమ యంలో అడవి ఎలుగుబంట్లవలన, పులులవలన, తోడేళ్ళవలన భయంలేదు. అతనికి

భయంగావున్నది మనుష్యులవలన. కాని అడవులలోనూ, గుహలలోనూ దాక్కొని వుండి అతను రోజులు ఎలా గడపగలడు? అతను మనిషి. అతనికి అడుగడుగునా మనుష్యుల అవసరం వుంది.

ఆగస్టునెల. కాని ధనసింగ్ అదృష్టంవలన ఆ రాత్రి వర్షంలేదు. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. అప్పుడప్పుడూ వలువనిమేఘాలు నక్షత్రాలని క్షణం పాటు కప్పేసి వెళ్ళిపోతున్నాయి. గాలిలో చెమ్మ, చల్లదనం వున్నాయి. ధనసింగ్ వేగంగా నడుస్తున్నాడు. అతని శరీరంనుంచి చమట కారుతోంది. దాహంవేసి గల గల ప్రవహించే కొండ సెలఏరుని ఒడ్డున ఆగి రెండుమాట్లు నీళ్ల త్రాగాడు. మళ్ళీ నడవటం మొదలుపెట్టాడు. ఎత్తైన కొండలు, చిన్నచిన్న గుట్టలూ ఎక్కుతూ దిగుతూ వెళ్ళిపోతున్నాడు. గాలిలో చల్లదనం తగ్గిపోతూంది.

కొండలలో దాక్కొని ప్రాణాలు కాపాడుకోవటానికి వీలుందే ఏ ఉపాయమూ ధనసింగ్‌కు తోచటంలేదు. ప్రతిచోటా రకరకాల మనుష్యులు ఎదురయారు. ఈ ప్రజలు పది పన్నెండు కోసులదూరంలోవున్న పక్కప్రాంతాలలోగూడా ప్రతిమని షినీ, అతని కుటుంబాన్నీ, వాళ్లుచేసే పనినిగురించి ఎరుగుదురు. ఎవరైనా కొత్త వ్యక్తిని చూడగానే ఇతను ఎవరు? ఇక్కడకు ఎందుకు వచ్చాడు? అని వులిక్కి పడతారు. ధనసింగ్‌కు ఈ ప్రశ్నవలన భయం కలుగుతోంది. డ్రైవరు లైసెన్సు రూపంలో ధనసింగ్ వూరు-పేరు, అతని రూపం, అతనిఫోటోసహితంగా అతని జేబులో వున్నాయి. ఒకచోట సిగరెట్టు అంటించుకునేసమయంలో అతను తన గురుతును కాల్చేశాడు. తనని ఎవరైనా గుర్తించే అవకాశం రూపుమాపటం అవసరం.

సూర్యోదయం అయేసమయంలో ధనసింగ్ వానలమూలంగా బాగా నిండి మధురమైన నీళ్ళతో ప్రవహిస్తున్న 'వ్యాస' నదిదగ్గరకు చేరుకున్నాడు. అవతలి ఒడ్డున ఎదురుగా దేహరా-గోపీపుర్ గ్రామమూ, పోలీసుఠాణా వున్నాయి. ధనసింగ్ పోలీసుఠాణావైపు వెళ్ళకుండా హోషియార్‌పూర్ వెళ్ళేవైపు నడిచాడు. వర్షాకాలపు ఋతువులో ఈ మార్గాలమీద బస్సుల రాకపోకలు నిలిచిపోతాయి. రోడ్డు దాదాపు అంతా ఇసుకతో నిండిపోయింది. నదులమీద, కాలువలమీద వంతెనలు లేవు. ధనసింగ్ వెళుతూనేవున్నాడు. అతనికాళ్లు అలిసిపోయి చైతన్యంలేని జడపదార్థా

లుగా అయ్యాయి. కాని అతను వెళుతూనేవున్నాడు. రోడ్డుమీద ప్రతిచోటా కంచర గాడిదలమీద బరువులువేసి తీసుకెళ్ళేవాళ్లు, చిన్నచిన్నమూటలు ఎత్తుకునివెళ్ళే ప్రయాణీకులు కలుస్తున్నారు. కొందరు ప్రయాణీకులు కోర్టులో తమ దావాను ప్రవేశపెట్టడంకోసం తాలూకాలకు వెళుతున్నారు. దావాకు సంబంధించిన కాగితాలు రేకుడబ్బాలో భద్రంగా మూటపెట్టి చేత్తోపట్టుకునో, చంకలో పెట్టుకునో వెళ్లు తున్నారు. ఆ కాగితాలని వాళ్ళు చదవలేరు, అర్థం చేసుకోనూలేరు. ఈ కాగితాలలో వాళ్ళ అదృష్టానికి సంబంధించిన సమస్యలు వున్నాయి. కాని వాటిని వాళ్ళు చదవ లేరు వాటి వకీళ్లుగాని, న్యాయస్థానంగాని, పోలీసులుగాని చదవగలరు. వారు మటుకు ఆ నిర్ణయం ముందు తోలుబొమ్మలలాటివారు.

కొంతమంది ప్రయాణీకులు పొడూ-పొడవూగా యువకులు. వాళ్లు బాగా మొనదేరివున్న తలపాగాలు చుట్టుకున్నారు ఇంగ్లీషుప్రభుత్వానికి సంబంధించిన సైన్యంలోని డోంగరే సైనికులు. కొద్దిరోజుల సెలవుమీద ఇంటికి వస్తున్నారు. కొంతమంది సెలవుపూర్తయి తిరిగి వెళ్ళిపోతున్నారు. సెలవులమీద వచ్చేవాళ్ళ ముఖాలు సంతోషంగానూ, తిరిగి వెళ్ళేవాళ్ళముఖాలు నిరుత్సాహంగానూ కనిపిస్తు న్నాయి. యుద్ధం జరుగుతోంది. ఇంటినుంచి వెళ్ళేటప్పుడు సైనికులమనసుల్లో తిరిగి రాగలుగుతామా లేదా అనే అనుమానం వుండివుంటుంది. రోడ్డుపక్కన ఎత్తుగా పెరిగిన మొక్కజొన్నచేలని మమకారమూ, దుఃఖమూ మిళితమైన చూపులతోచూస్తూ వెళుతున్నారు తమ పొలాలలో ఇటువంటి చేలనే వదిలిపెట్టి వెళు తున్నారు. సెలవులసమయంలో వాళ్లు ఆ పొలాలని స్వయంగా దున్ని ధాన్యాన్ని నాటారు. తాము వెళ్ళిపోయినతర్వాత ఇతరులు ఆ పంటని కోస్తారు. గింజలు నాటే టప్పుడు మట్టి, బురద, ఎరువు వాళ్ల శరీరాలకి అంటుకునేవి.

సైనికులు తమ శిబిరాలకువెళ్ళి బూట్లు, దుస్తులు ధరిస్తారు. కార్లలో ప్రయాణమైవెళ్ళి తుపాకులు, మెషీన్‌గన్‌లు కాలుస్తారు. కాని మట్టిమీద, పంటలమీద వున్న వ్యామోహం, భార్యాపిల్లలమీదవుండే మమకారం వాళ్ల అడుగులని కదల నీయకుండా చేస్తాయి. వాళ్ళగ్రామంలో దైన్యంతోకూడిన జీవితం వుంది. సైన్యంలో ప్రచండమైన మృత్యుభయం వుంది. ఆ భయం వుండడంచేత వాళ్లు శిబిరంలోకి విధీ అంటూ వస్తారు. తమ కుటుంబాన్ని రక్షించడంకోసం మృత్యు

వుతో పోరాడే ఈ వూడిగం చేయక తప్పదు. వాళ్ళకి డబ్బు కావాలి. ఆ డబ్బుని వాళ్ళ పొలాలు, భూములు ఇవ్వలేవు. కానీ ఈ వుద్యోగం ఇస్తుంది. ఇంటికి తిరిగి వచ్చినా కూడా ప్రభుత్వ అధికారానికి తలఒగ్గి తిరిగి వెళ్తున్నారు. ప్రభుత్వప్రభావం ఎంతో చేదుగానూ, కఠోరంగానూ వుంది. ధనసింగ్ కూడా ఇదే కారణంగా వరు గెత్తుతూ పారిపోతున్నాడు.

ధనసింగ్ సుమారు ఇరవై గంటలలో అరవై ఆరుమైళ్ళునడిచి దూరంగా వున్న హోషియార్‌పూర్ చేరాడు. అలసటవలన అతని శరీరంలోని అణువు-అణువూ ఇటునటు విరిగి పడిపోతున్నట్లుంది. ఎక్కడైనా పడుకుందామని అతనికి అనిపించింది. ఆ పట్టణంతో అతనికి పరిచయం వుంది. ఆ లయామమీద కొన్ని నెలలు బస్సు నడిపివున్నాడు. బస్సు స్టాండుదగ్గర ఎవరైనా పరిచయం వున్నవాళ్ళు కనుపించవచ్చు. అందువల్ల అటు వెళ్ళలేదు. మనస్సును దిటవుచేసుకుని కొంచం ఆహారం తీసుకున్నాడు. పడుకోవటానికి ధర్మసత్రంలోకి చేరాడు. నాలుగణాలు ఇచ్చి మంచం అద్దెకు తీసుకుని పడుకున్నాడు. కొండప్రాంతంనుంచి కిందకు రావటంతో ధనసింగ్ శరీరం వేడెక్కి చెమటతో నిండిపోతోంది. కష్టపడినతర్వాత చమటపట్టి శరీరం తేలికవుతుంది కాని అతనిశరీరంమీద చమట నూనెలా అంటు తుంది. చుట్టుపక్కల పడుకున్న ప్రయాణీకులు సుమారు వంటిమీద బట్ట లేనట్లుగానే మంచాలమీద పడుకున్నారు. విసనకర్రతోనో, తుండుగుడ్డతోనో విసురుకుంటూ వేడినుంచి, దోమలనుంచి తప్పించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. స్త్రీలు ఈ వేడిలోకూడా చుట్టుకుని, ఒంటినిండా కప్పుకుని పడుకునివున్నారు.

ధనసింగ్‌కు వేడివలన ఊపిరి నిలిచిపోయినట్లుగా అనిపించింది. అతని తల తిరుగుతోంది. అలసటవలన అతనికి నిద్ర రావటంలేదు. నిన్న ఇదేసమయంలో తను ఆ ఇద్దరు దుర్మార్గులను చంపి పడగొట్టాడు. పోలీసులు తనకోసం ధర్మశాల, కాంగడా, పఠాన్‌కోట, హమీర్‌పూర్‌లలో బహుశః వెతుకుతూ వుండివుంటారు. తను తప్పించుకుని బయటపడ్డాడు. ఒకవేళ పట్టుబడిపోయినట్లయితే ఈ వేళటికి ఖైదులో బంధింపబడివుండేవాడు. వైజ్‌నాథ్‌లో సుమారు ఇదేవేళప్పుడు పట్టుబడి పోలీసుఠాణాలో బంధింపబడినవిషయం అతనికి గుర్తుకు వచ్చింది. అక్కడ తను దెబ్బలుతిన్నవిషయంకాక సోమాకు జరిగిన అన్యాయం, ఆ దుర్వ్యవహారమే ఎక్కు

వగా గుర్తుకు వచ్చింది. అతను ఆలోచిస్తున్నాడు. 'ఒకవేళ ఇప్పుడు ఆ ఠాణా అధికారి కనిపిస్తే ఒకసారి ఆ దుర్మార్గానికి ప్రతీకారం అంతకన్నా బాగా తీసుకుంటాను. ఆ అక్క....నన్ను మనిషిగా అనుకోలేదు.'

ధనసింగ్‌కు సోమా గుర్తుకు వచ్చింది. ఒకవేళ ఆమె పోలీసులచేతుల్లో పడిపోతే ఏమవుతుంది? తను పారిపోయి తనప్రాణాన్ని కాపాడుకుంటేమాత్రం లాభమేముంది? సోమాని తన నీడలోకితీసుకుని పోలీసులతో పోట్లాడుతూ చచ్చిపోతే ఇంతకన్నా బాగుండేదేమో। వైజ్‌నాథ్‌లోని పోలీసుఅధికారి, అతని భయంకరమైన ఆకారం ధనసింగ్‌కు మాటిమాటికీ గుర్తుకు వస్తున్నాయి. ఆ పోలీసుఠాణా అధికారి పర్వతప్రాంతపు గ్రామాలని తిట్టాడు. ఇది ఆ ఠాణా అధికారి ప్రాంతం ఊపిరిగూడా ఆడటంలేదు. ఎగిరి మళ్ళీ ధర్మశాల చల్లదనాన్ని చేరుదామని ధనసింగ్‌కు అనిపించింది. అక్కడ మనిషిశ్వాస పీల్చుకోగలుగుతాడు.

ఒకమనిషి కంఠం కొంతసేపటిగా అతనిచెవులకు వినిపిస్తోంది. ఆ మనిషి ఇప్పుడు ఇంకా గట్టిగా మాట్లాడుతున్నాడు. ధనసింగ్ పక్కకు తిరిగి పడుకుని అతనిమాటలు వినడం మొదలుపెట్టాడు. ఆ వ్యక్తి సైన్యంగురించి, యుద్ధంగురించినమాటలు మాట్లాడుతున్నాడు—సైన్యంలో సుఖంగురించినమాటలు చెపుతున్నాడు. దుస్తులు, బూట్లు పూరికెనే దొరుకుతాయి. తినడానికి మాంసం, పాలు, పళ్లు దొరుకుతాయి. జీతం అంతా జేబులోకే. అక్కడ అందమైన అమ్మాయిలు వున్నారు. చక్కగా మాట్లాడుతూవుంటారు అని ఆ వ్యక్తి చెపుతున్నాడు.

ఒక నడివయస్సుగలవ్యక్తి అతన్ని తిట్టడం మొదలెట్టాడు—'నువ్వు యుద్ధం చూశావా ఎప్పుడన్నా? నువ్వు పల్లెవాసుల్ని శిక్షణసిబ్బందిలో చేర్పించి కమీషన్ తింటావు. మేము 'ఫ్రాంసు' 'మెసపుటోమియా'ల యుద్ధాల్ని చూశాము. మూడు-నాలుగురోజులు మాకు నీళ్ళు దొరకలేదు. కంచరగాడిదలు మమ్మల్ని చంపుకుతిన్నాయి....।'

చుట్టుపక్కల కూర్చున్నవాళ్ళు వీళ్ల ఇద్దరి పోట్లాటమాని నవ్వటం మొదలుపెట్టారు. సత్రవతలుపు తెరుచుకుని నలుగురు మనుష్యులు లోపలికొచ్చారు. ఇద్దరి చేతుల్లో లాంతర్లు వున్నాయి. ఒకతను బాటరీలైటు పట్టుకున్నాడు. ఒకతనిచేతిలో

రిజిస్టరు వుంది వాళ్లు అక్కడున్నవాళ్ళందరినీ పరీక్షగా చూస్తున్నారు. వాళ్ళపేర్లు అడిగి రిజిస్టరులో ఎక్కించుకుంటూ వెళుతున్నాడు.

సైన్యంలోవున్న సుఖాలనిగురించి వివరించేవ్యక్తి ఈ మనుష్యులదగ్గరికి వెళ్ళి—'హవల్దారుగారూ! ఇతన్ని చూడండి. ఇతను విప్లవం లేవదీసేమనిషి. ప్రజలను సైన్యంలో చేర్పిస్తానని తప్పుత్రోవలో పెడుతున్నాడు' అని ఫిర్యాదు చేశాడు.

వీళ్ళు మామూలుబట్టలు కట్టుకున్న పోలీసులని ధనసింగ్ గ్రహించాడు. తననే వెతుకుతూవచ్చారేమోనని అతనిహృదయం ధక్-ధక్ మని వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది.

ఆ పోలీసులు ధనసింగ్‌వైపు పరిశీలనగా చూడలేదు. వాళ్లు సైన్యంలో చేరవద్దంటూ ప్రజలను మోసపుచ్చేవ్యక్తిని పట్టుకున్నారు. సిపాయిపక్షాన వున్న ఆవ్యక్తి తన నిర్దోషిత్వాన్ని తెలియచెపుతున్నాడు. అదేమంటే అతను 36వ నంబరుగల డోగరా రైఫిల్ సైనికుడు. తన కాగితాలను చూపించాడు. పోలీసులు అతన్ని విప్లవం లేవదీసే నేరంక్రింద అరెస్టుచేసి వాళ్ళతోరమ్మని ఆదేశించారు.

ధనసింగ్ నిర్లక్ష్యంగా పడుకుని పోలీసులమాటలని జాగ్రత్తగా వింటున్నాడు. వాళ్ళు పారిపోయిన సైనికులను, రాజ్యానికి సంబంధించిన (రాజకీయ) దుర్మార్గులను వెతుకుతున్నారు. మర్నాడు ఉదయం ధనసింగ్ నిద్రనుంచి లేచేసరికి శరీరంలోని కీళ్ళుఅన్నీ నొప్పి పుడుతున్నట్లుగా అనిపించింది. అతను బజారులో కాస్త అలా తిరగడానికి వెళ్ళిపోయాడు. పోలీసులను చూసినప్పుడు అతనిమనసు కంగారుపడేది. పోలీసుల దుస్తులపద్ధతి ధర్మశాల, కాంగడాలలో ఎలావుందో అలానే వుంది.

ధనసింగ్ ఆలోచిస్తున్నాడు. అతను ఏదో ఒకపని చేయాల్సివుంటుంది. అతనికి ఒకపని వచ్చు. అది బస్సు నడపడం. హోషియార్‌పుర్‌లో అతన్ని గుర్తించేవాళ్ళు వుండచ్చు. అతనిజిల్లా ఇక్కడనుంచి ఎంతోదూరంలో లేదు. బస్సుమీద కొన్నిగంటల ప్రయాణం. ఎక్కడికైనా దూరంగా వెళ్ళినప్పుడే ఏ బాధా లేకుండా విశ్రాంతగా వుండచ్చు అని అతను నిశ్చయించుకున్నాడు. అతను ఆలో

చిస్తూ స్టేషనువైపు వెళ్ళాడు. ఎక్కడికి వెళ్ళాలి ! లాహోర్ వెళ్ళటమా, అమృత సర్ వెళ్ళటమా ! అమృతసర్, లాహోర్‌లవరకు అతను జ్వాలా సహాయ్‌గారి కారు తీసుకువెడుతూ వుండేవాడు. ఇంతవరకూ అతను ఎప్పుడూ వెళ్ళివుండనిచోటే అతనికి అన్నిటికన్నా సురక్షితమైన స్థలం.

ఇరవై గంటలు ఎడతెరిపిలేకుండా కాలినడకన నడిచివచ్చినతర్వాత రైల్లో కూర్చుని ప్రయాణంచేయడం ధనసింగ్‌కు ఎంతో సుఖమనిపించింది. తను ప్రమాదంనుంచి దూరంగా వెళ్ళిపోతున్నాడు అని సంతోషించాడు. సోమానిగురించి అతనికి బాధగావుంది. ఆమెకు ఏమి జరుగుతుంది ! లాలాగారు, ముఖ్యంగా మనోరమబీబీ తప్పకుండా సహాయం చేస్తారని అతనికి నమ్మకంగా వుంది. మనోరమబీబీ మొదటే ఆమెకు సహాయం చేసింది. అతను ఏం చేయగలడు ? ఆ పెట్టెలో ఒక స్త్రీ ఆమె భర్తపక్కన కూర్చునివుంది. జనం ఎదురుగా కూర్చోవడంవలన సిగ్గుపడి ఇద్దరూ తమలో తాము మాట్లాడుకోవటం లేదు. ఒకవేళ మాట్లాడుకున్నాకూడా చాలా నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. ధనసింగ్ ఆలోచిస్తున్నాడు, ఒకవేళ తను సోమాని తీసుకువచ్చినట్లైతే ఇలానే వెంటబెట్టుకుని తీసుకువెళ్ళేవాడు. కాని ఆమెను ఎక్కడికి తీసుకువెళ్తాడు తనయితే సత్రంలో గడుపుకోగలడు. కాని సోమానిచూసి పోలీసువాళ్ళు అడుగడుగునా ఆపుతారు.

బండిలో కూర్చున్నవాళ్ళలో ఇద్దరు వ్యక్తులు ఖద్దరువస్త్రాలు ధరించారు. వాళ్లు వార్తాపత్రిక చదువుతున్నారు. కాసేపటతర్వాత తమలో తాము మాట్లాడుకోవటం మొదలెట్టారు. ఇంగ్లీషువాళ్ళు యుద్ధంలో ఓడిపోతున్నారు. జపానువాళ్లు ముందుకు ఆక్రమించుకుంటూ వస్తున్నారు. ఇందుచేత ఇంగ్లీషుప్రభుత్వం భయపడి కాంగ్రెసు నాయకులను పట్టుకుని జైలులో వేసింది. కాని ఇంగ్లీషువాళ్ళని వెళ్ళగొట్టే ఆందోళన ఆపడం జరగదు.

ధనసింగ్ ధర్మశాలలోగూడా ఇంగ్లీషువాళ్లు ఓడిపోతారనేవార్తలు వింటూ వుండేవాడు. ఇంగ్లీషువాళ్ళు ఓడిపోవాలని అందరూ కోరుతుండేవారు. లాలాగారు ప్రభుత్వంనుంచి లక్షలరూపాయలు సంపాదించేవారు. కాని వారింటిలోకూడా ఇంగ్లీషువాళ్ళు ఓడిపోతున్నారని తెలియగానే అందరూ సంతోషించేవాళ్లు. ఇంగ్లీషు ప్రభుత్వం, పోలీసుల అత్యాచారాలవలన అందరూ బాధపడుతున్నారు. న్యాయంగా

ఇంగ్లీషువాళ్ళని ఎదుర్కొనే సామర్థ్యం లేకపోవటంవల్ల అందరూకూడా, జర్మనీ వాళ్ళు, జపానువాళ్ళు ఇంగ్లీషువాళ్ళని చంపి, హిందూదేశాన్ని స్వతంత్ర్యం చేయాలని కోరుతుండేవాళ్లు. ఇంకొకవైపున అనేకమంది ప్రజలు ఇంగ్లీషువాళ్ళ ఉద్యోగం చేసి, వాళ్ళకి సహాయంకూడా చేస్తుండేవాళ్లు. ఈ ప్రజలు ఇలా చేయకపోతే ఇంకేమి చేయగలుగుతారు?

కాౖమేడ్ భూషణ్ డ్రైవర్లకు నెమ్మదిగా తెలియచెపుతుండేవాడు-దుర్మార్గులైన ఇంగ్లీషువాళ్ళకొలువులో ఉద్యోగం చేయటం తమ కాళ్లమీద గొడ్డలితో కొట్టుకోవటమే అవుతుంది. చెట్టుకర్ర కట్టెలు కొట్టేవాని గొడ్డలిపిడి అయి స్వయంగా ఎలా చెట్లను నరికిస్తుందో ఇంగ్లీషుప్రభుత్వంతో చేరితే అలానే వుంటుంది—ధనసింగ్ కేవలం ఒకమాట తెలుసుకున్నాడు. ఇంగ్లీషుప్రభుత్వం, పోలీసులు దుర్మార్గులు. అందరికన్నా దుర్మార్గులు పోలీసులు. పోలీసులే ఇక్కడ ప్రభుత్వం.

జలంధర్‌వెళ్ళ ధనసింగ్‌కు లాహోర్‌నుంచి ఢిల్లీవెళ్ళేబండిలో కూర్చోవలసి వచ్చింది. రైలుబండిలో గుంపులుగా మనుష్యులు చాలామంది వున్నారు. బండిలో ఎక్కువగా ఖాకీదుస్తులు ధరించిన సైనికులు కూర్చునివున్నారు. ఆ బండ్లలో ప్రవేశించటానికి ఇతరులు సాహసం చేయటంలేదు. సైనికులు ఎక్కడ కావాలనుకుంటే అక్కడ దూరిపోతున్నారు. సామాన్యప్రయాణీకులతో క్రిక్కిరిసి నిండిన బండ్లలో చోటులేదు. అయినాకూడా ప్రజలు అక్కడే ప్రవేశించటానికి ప్రయత్నిస్తున్నారు. ముందేవచ్చి కూర్చున్నప్రజలకు, కొత్తగావచ్చినప్రజలకు మధ్య పోట్లాట జరుగుతోంది. కానీ ఒకవేళ సైనికులు ఆ పెట్టెలలోకి కూర్చోవడానికి వచ్చారా, వాళ్లని ఎవరూ ఆపటం లేదు. ధనసింగ్ అతికష్టంమీద ఒకపెట్టెలో దూరగలిగాడు. అతను మనసులో బాధపడుతున్నాడు, జనం సైనికులంటే ఇంతగా దడుస్తారెందుకు? ఎందుకు దడవరు। వాళ్ళు పరిపాలకుల దూతలు.

బండి కదిలినపిమ్మట అందరూ ఎటువంటిచోటు దొరికితే, దానితో తృప్తిపడి పరస్పరతగవులని మరచిపోయి మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. మాటలు యుద్ధానికి సంబంధించినవే. ఆ జనం పత్రికలలో చదివిన వార్తలమీద ఊహాగానం చేస్తూ మాటలు అల్లుకుపోతున్నారు ...బర్మాలో ఇంగ్లీషువాళ్ళు ఓడిపోయారు....

కలకత్తాలో జపానువాళ్లు బాంబులు వేశారు....కాంగ్రెసు నాయకులని ఖైదుచేసిన దానికి నిరసనగా ప్రతిచోటా తిరుగుబాట్లు జరిగేటటువంటివార్తలు వస్తున్నాయి. ధనసింగ్ మౌనంగా కూర్చున్నాడు. ఈ మాటలవలన అతనికి ఆశాకిరణాలు పొడ సూపుతున్నాయి. ప్రభుత్వం ఓడిపోవాలి. పరిపాలన మారిపోవాలి. అప్పుడు పోలీసులభయం వుండదు. తను మళ్ళీ ధర్మశాలకు తిరిగివెళ్లి సోమాతో కలిసి వుండ గలుగుతాడు.

ధనసింగ్ సోమాదగ్గరకు ధర్మశాల చేరేవిషయం ఆలోచిస్తూ ఢిల్లీ చేరి పోయాడు. స్టేషనులోనూ, బయట అన్నివేపులా పోలీసులే కనిపిస్తున్నారు. ధన సింగ్ ఎవరినీ దారి అడగలేదు. ఇతరప్రయాణీకులతో కలిసివెళ్లి అతను దగ్గర లోనేవున్న ఒక బజారులోకి చేరాడు. అది పెద్దబజారు. దుకాణాలు సుమారు అన్నీ మూసివున్నాయి. ప్రజలు చిన్నచిన్న గుంపులుగాచేరి మాట్లాడుకుంటున్నారు. అన్ని వైపులా ఆయుధాలు ధరించిన పోలీసులు జాగ్రత్తగా నిలబడివున్నారు. కొంతమంది గస్తీ తిరుగుతున్నారు. అంతకుక్రితంరోజానే ఇరవైగంటలు నడిచివుండటంచేత, తర్వాత రైలులో ముడుచుకుని కూర్చునివుండటంచేత, అలసటవల్ల ధనసింగ్‌కు చాలా నీరసంగా వుంది. ఎక్కడైనా కొంచంసేపు పడుకుందామని, శరీరానికి విశ్రాంతి ఇద్దామని అనుకున్నాడు.

ధనసింగ్ ఒక దుకాణందగ్గర కూర్చునివున్నవ్యక్తిని ధర్మసత్రం విలాసం అడిగాడు. ధర్మసత్రం దగ్గరలోనే వుంది. ఈ ధర్మసత్రం అతని కొండప్రాంతపు ధర్మసత్రంమాదిరిగాలేదు. అక్కడయితే వచ్చినవాళ్లు ఒకవైపు కొంతస్థలాన్ని శుభ్రంచేసుకుని పడుకోవటానికి వీలుగా వుండేది. అక్కడ ఒకవైపు కంచరగాడి దలు, గాడిదలు, ఎద్దులు కట్టివేయబడివుండేవి. జనంకూడా విశ్రాంతి తీసుకుంటూ వుండేవాళ్లు. ఈ ధర్మసత్రం ఎర్రరాళ్ళతో కట్టబడిన విశాలమైన పెద్దభవనం. ముఖ ద్వారం కప్పుమీదకు దృష్టిని మరలిస్తే తలనుంచి టోపీజారి క్రింద పడిందన్న మాటే. ముఖద్వారందగ్గర ఒక గట్టుమీద జంపఖానా పరుచుకుని రిజిస్టరు, కలం-సిరాబుడ్డి పక్కనపెట్టుకుని, ఒక గుమాస్తా కూర్చునివున్నాడు.

'ఏయ్, ఎక్కడికి దూసుకుపోతున్నావ్?' అని గుమాస్తా ధనసింగ్‌ని అడ్డ గించాడు.

'పక్కవూరువాడిని. కాసేపు పడుకుంటాను.'

'ఎక్కడనుంచి వస్తున్నావు?'

'హోషియార్‌పుర్, పంజాబునుంచి.'

గుమాస్తా ధనసింగ్‌ను తలనుంచి కాళ్ళవరకు పరీక్షగా చూశాడు. వ్యాకులతతో నిండిన అతని ముఖాన్ని చూసి పసిగట్టాడు—'వంటరిగా వున్నావా?' అనడిగాడు.

'అవును.'

'సామానుగాని, ఏమైనా మూటలు—పక్కబట్టలుగాని, పెట్టెలుగాని వున్నాయా?'

'ఏమీ లేవు.'

గుమాస్తా ఆలోచించి—'లేదు, చోటు ఖాళీగాలేదు. బయటకువెళ్ళు' అన్నాడు.

ధనసింగ్ విశాలమైన ఆ ధర్మసత్రం ముంగిలిని, వసారాలో ఖాళీచోటును, చూస్తూ నిలబడ్డాడు. ఒకవైపు కుళాయినుంచి నీటిధార పడుతూంది. అక్కడ ఒక వ్యక్తి 'హరి' నామం జపిస్తూ స్నానం చేస్తున్నాడు. కాని గుమాస్తా తిరస్కరించడంవలన ధనసింగ్‌కు తిరిగి వెళ్ళిపోక తప్పలేదు.

ధనసింగ్ బజారువైపు బయలుదేరాడు. ఒక రొట్టెల (తందూరు) దుకాణం నుంచివచ్చే రొట్టెల రుచికరమైనవాసన అతన్ని ఆకర్షించింది. తినటానికి లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. చాలాసేపటివరకూ కొట్టులోనే గడిపాడు. తర్వాత లేచి బజారులలోని గుంపులతోకలిసి తిరగటం మొదలెట్టాడు. భోజనం చేసినతర్వాత శరీరం ఎక్కువ బరువెక్కినట్లు అనిపించింది. 'ఘంటాఘర్' దగ్గరకు చేరాడు. అక్కడ దుకాణాలు మూసివున్నాయి. ఒక దుకాణందగ్గర నిలబడి కొంతమంది మాట్లాడుకుంటున్నారు. వాళ్ళకి పక్కగావున్న ఇంకొకదుకాణం అరుగుకి ఆనుకుని కూర్చున్నాడు. వాళ్ళమాటలు వినడం మొదలెట్టాడు.

వాళ్ళు అతనిభాషలో మాట్లాడుకోవటంలేదు. వాళ్ళు మాట్లాడుతున్నభాష వేరుగావుంది. కాని కాంగడా, పఠాన్‌కోట, ధర్మశాలలలో ప్రతిచోట అనేకప్రదేశాలనుంచి వచ్చిన ప్రయాణికులతో వ్యవహరించివుండటంవల్ల అతను వారిమాట

లను చాలామటుకు అర్థం చేసుకుంటున్నారు. రైలుబండిలో విన్నమాటలే ఇక్కడ కూడా వినబడుతున్నాయి—నాయకులందర్నీ పట్టుకోవడం, జపాన్ గెలుపు. నాయకులను ఖైదుచేయడానికి వ్యతిరేకంగా పట్నంలో జరుగుతున్న సమ్మె. ఇలాంటి విషయాలు నాయకులను ఎక్కడికు తీసుకెళ్ళారో ఏమీ తెలియటంలేదు. గాంధీ గారిని విదేశాలకు తీసుకెళ్ళారని ఒకరంటారు. మరొకరు నెహ్రూగారిని ఆఫ్రికా తీసుకువెళ్ళారని అంటున్నారు. కాంగ్రెసు యుద్ధం చేయడానికి ఆదేశించిందని. ఆయుధాలు లేకుండా ఎలా పోట్లాడతాము అని ఇంకొకరంటున్నారు. జపానువాళ్ళే ఈ నా కొడుకుల అంతు తేలుస్తారు. నువ్వు చూస్తూవుండు. ఏం జరుగుతుందో! అని ఇంకొకళ్లు వ్యతిరేకించారు.

అల్లకల్లోలంగా వుంది. పోలీసులూ, సైన్యమూ ఊరేగింపును ఆపుతుంది. కాంగ్రెసు ఊరేగింపు తప్పక జరుపుతామంటుంది. ఢిల్లీనాయకులనిగూడా ఖైదు చేశారన్నవార్తలు వచ్చాయి. ధనసింగ్ ఇదంతా వింటున్నాడు. రాత్రికి ఎక్కడ గడపాలి అని ఆలోచిస్తున్నాడు.

'విప్లవం వర్ధిల్లాలి' అన్న కేకలు వినిపించాయి. ఈ పిలుపు పర్వతాలు మొదలు సముద్రాలవరకు భారతదేశంలోవున్న అన్ని భాషలలోనూ ముక్తకంఠంతో వినబడింది. అక్కడ వున్నవాళ్ళంతా తుళ్ళిపడి ఆ కేకలు వినపడినవైపు పరుగెత్తారు.

'విప్లవం వర్ధిల్లాలి! ఇంగ్లీషుప్రభుత్వం నశించాలి! మహాత్మాగాంధీకి జయ్!' మళ్ళీ కేకలు వినిపించాయి. మూడురంగుల జండానుపుచ్చుకుని ఒక గుంపు ఘంటాఘర్ వైపు నడుస్తోంది. పోలీసులు వెంటనే ఊరేగింపును చుట్టుముట్టారు. పోలీసాఫీసరు ఆజ్ఞ ఇచ్చాడు. గుంపుమీద లాఠీదెబ్బలు పడటం మొదలుపెట్టాయి. చాలామంది ప్రజలు పారిపోయారు. కాని కొంతమంది లాఠీదెబ్బలను లక్ష్యపెట్టక కేకలు వేస్తూనేవున్నారు—'విప్లవం వర్ధిల్లాలి! నాయకులను వదిలిపెట్టాలి! ఇంగ్లీషు ప్రభుత్వం నశించాలి!'

ప్రజలు కేకలు ఆపకుండా లాఠీదెబ్బలను సహిస్తున్నారు. కాని చుట్టుపక్కల వున్న ప్రజలు, చేతిలో ఆయుధాలులేని ప్రజలు, వాళ్లు దెబ్బలు తినడంచూసి మెదలకుండా వుండలేకపోయారు. పోలీసులమీద రాళ్ళువిసరడం మొదలుపెట్టారు. ధనసింగ్‌కుకూడా ఉత్సాహం పుట్టింది. పోలీసులు అనేకమాట్లు అత్యాచారాలు చేస్తుం

దగా అతను చూశాడు. పోలీసులు వీరివాళ్ళకు శత్రువులు అనుకునేవాడు. ముందుకు వచ్చి ఏది దొరికితే అదితీసి, దెబ్బలు తినేవాళ్ళపట్ల సానుభూతిగా పోలీసులమీద విసరసాగాడు.

అప్పటివరకూ పోలీసుల రెండుదళాలు ఒకవైపు వూరికే విలబడివున్నాయి. ఆ దళాలవాళ్లుకూడా ఒక్కుమ్మడిన గుంపుమీద విరుచుకుపడ్డారు. అదేసమయంలో తుపాకుల పేల్చేధ్వనులు వినిపించాయి. గుంపు లాఠీదెబ్బకు సమాధానం రాళ్ళతో ఇవ్వడానికి సిద్ధంగా వుంది. లాఠీ కేవలం గాయపరుస్తుంది. కానీ తుపాకీగుండు ప్రాణాలే తీసుకుంటుంది.

గుంపు పారిపోయింది. ధనసింగ్‌కూడా పారిపోయాడు. భయపడికాదు. యుద్ధంలో ముందుకు వెళ్ళడం, పారిపోయి ఆత్మరక్షణ చేసుకోవటం వేరువేరు విషయాలు. తుపాకులు తీసుకున్నవాళ్లని రాళ్ళతో ఎదుర్కొనేటప్పుడు పారిపోవటం, దాక్కొని రాళ్లు విసరటం అతను పిరికితనంగా భావించలేదు. ధనసింగ్ వాళ్ళని మళ్ళీ ఎదుర్కొనేందుకు ముందుకువచ్చాడు. కానీ భుజంమీద లాఠీదెబ్బ పడటంతో క్రింద పడిపోయాడు.

ధనసింగ్‌ను ఖైదుచేయటం జరిగింది. చాలామందిజనం ఖైదు అయారు. ధనసింగ్‌నుకూడా వాళ్లతోబాటు నుంచోబెట్టారు. ఖైదుచేయబడినవాళ్లు—'విప్లవం వర్ధిల్లాలి! ఇంగ్లీషుప్రభుత్వం నశించాలి! మా నాయకులని వదిలిపెట్టు!' అని కేకలు వేస్తున్నారు. ధనసింగ్‌కూడా కేకలువేయడం మొదలుపెట్టాడు.

నల్లరంగు వానులు వచ్చాయి. వాటికి కటకటాలున్నాయి. ఖైదు అయిన జనాన్ని బస్సులలో ఎక్కించి జైలుకు చేర్చారు. ధనసింగ్ ఖైదులో బంధించబడ్డాడు. కాని అతను భయపడటంలేదు. అతనితోపాటు ముప్పైఇద్దరు వ్యక్తులు ఇంకా వున్నారు. వాళ్ళు పోలీసులని తిట్టడం మొదలుపెట్టారు. మనం ఏం మనుషులం కాదా? ఇక్కడ చాలా వేడిగావుంది. గాలిలేదు. మేము బయట గాలివీచే చోట వుంటాము, అన్నారు.

సాయంకాలానికి అనేకచోట్లనుంచి ఖైదు చేయబడినవాళ్ళు ఇంకా అనేకమంది జనంవచ్చి చేరారు. వాళ్ళసంఖ్య దెబ్బైఅయిదుకన్నా ఎక్కువ వుంటుంది.

ఖైదుఅయినవారి రూపురేఖలు, చిరునామాలు వ్రాసుకోబడ్డాయి. వాళ్ళలో చాలా మంది తండ్రిపేరు, ఇంటి అడ్రసు అడిగితే అన్నిటికీ-'విప్లవం వర్ధిల్లాలి' అని ఒకే సమాధానం ఇచ్చారు.

ఈ సమాధానం ధనసింగ్‌కు ఎక్కువ వీలుని కలుగజేసింది. అతనుగూడా ప్రతిప్రశ్నకు 'విప్లవం-వర్ధిల్లాలి' అనే సమాధానం ఇచ్చాడు. సాయంకాలం అతన్ని, అతని తోటివాళ్ళని ఢిల్లీజైలుకు చేర్చారు.

ధనసింగ్ పోలీసులచేతుల్లోపడి జైలుకు వెళ్లాలన్నభయంతో సోమాను వదిలిపెట్టి ప్రాణాలకుతెగించి పారిపోయివచ్చాడు. అతనికి ఎక్కడా ఆశ్రయం దొరకలేదు. చివరకు ఖైదుఅయి, జైలుకు వెళ్లాడు. కాని ఇప్పుడు ఖైదు, జైలు అంటే అతనిహృదయం భయంతో కంపించటంలేదు. అతను స్త్రీని లేపుకుపోయి నటువంటిగాని, హత్యచేసినటువంటిగాని అపరాధి కాదు. కాని వీరత్వము, త్యాగముల ఆవేశంతో రొమ్ము విరుచుకుని, దాస్యాన్ని, అత్యాచారాన్ని ఎదిరించి పోట్లాడే సైనికుడు.

• • •

ధనసింగ్‌ను ఎప్పుడయితే వైజ్‌నాథ్‌జైలులో బంధించడం జరిగిందో, ప్రభుత్వం కాళ్ళూ-చేతులూ కట్టివేసి చీకటినూతిలో పడవేసినట్లుగా అతనికి అని పించింది. ఢిల్లీజైలులో అతను గర్వంతో తల పైకెత్తి, ప్రభుత్వపు అధికార్లని అనాదరకరమైనదృష్టితో చూసేవాడు. ఈమాటు జైలులో బంధింపబడటం అతనికి విజయం లభించినట్లు, ప్రభుత్వానికి పరాజయం లభించినట్లు అనిపించింది. ధర్మ శాల జైలులో అతను గొలుసుతో కట్టివేయబడి దెబ్బలుతిన్న కుక్కలాగా జైలు వార్డర్ల బెదిరింపులకు, దెబ్బలకు, తిట్లకూ భయపడుతూవుండేవాడు. ఢిల్లీ జైలులో అతనితోటివారు జైలు ఆఫీసర్లని లక్ష్యపెట్టడంలేదు. పైగా వాళ్ళని తిడుతూవుండే వారు. జైలు ఆఫీసర్లు ఈ వ్యక్తులని తిట్టడం, చీదరించుకోవడం చేయక, గౌర వంగా మాట్లాడుతూ వుండేవారు.

ధనసింగ్‌కు, అతని తోటివాళ్ళకు ఖైదీల దుస్తులు—సగం చేతులున్న పొడుగాటి చొక్కాలు, పొట్టి పైజామాలు, తొడుక్కోవటానికి ఇచ్చారు. ఆ బట్టల

మీద ఎర్రనిదారంతో కుట్టారు. దుస్తులు ఒకటిగానే వున్నప్పటికి, నీతిపథంనుంచి తప్పిన అపరాధులను (విప్లవ ఖైదీలుగానూ) రాజకీయవ్యవహారములకు సంబంధించిన అపరాధులను (రాజకీయ ఖైదీలుగానూ) విభజించి వాళ్ళలోని భేదం వాళ్ళు ధరించిన దుస్తులవలన స్పష్టంగా తెలిసిపోయేలా చేశారు. రాజకీయఖైదీల ముఖాలు, మాట్లాడే తీరు, ప్రవర్తనలో నిర్భయం వుంది. నైతిక ఖైదీల ప్రతి కదలికలోనూ సిగ్గు, దైన్యత వున్నాయి.

ఏ వ్యక్తులైతే ఒకసారి జైలుశిక్షపొంది రెండవసారి తప్పుచేసి జైలుకు వస్తారో వాళ్ళని 'అలవాటుపడిన' వాళ్ళు (హేబిట్యుయల్) అని పిలుస్తారు. ఈ వ్యక్తులు బాగా ఆరితేరిన దుర్మార్గులుగా భావించబడుతారు. వీళ్ళని ఇతర 'మామూలు' (కేజూఅల్) ఖైదీలనుంచి, ఎవరినైతే బాగుచేయగలమన్న ఆశ వుంటుందో, వారిని విడిగా వుంచడం జరుగుతుంది. 'అలవాటుపడిన' ఖైదీల బట్టలమీద నల్లనివి గాని, నీలపురంగువి గాని గీతలుంటాయి. ఆ వ్యక్తులనుచూసి ధనసింగ్ అనుకునేవాడు— ఒకవేళ తను ముందొకసారి జైలుశిక్ష పొందినవిషయం ఇక్కడివాళ్ళకు తెలిసిపోతే తనుగూడా 'అలవాటుపడిన' ఖైదీగా ఎన్నబడుతాడు. ధనసింగ్ తన ఆ రహస్యాన్ని ఎవరికీ తెలియపరచలేదు.

ధనసింగ్ జైలులో రెండవవర్గంవారైన రాజకీయఖైదీలలానే వుండేవాడు. పుట్టుక, ప్రాంతము, భాష, వేరైనా అభిప్రాయాలు కలవటంతో అతను ఇతర రాజకీయఖైదీలతో కలిసిపోయాడు. కొద్దిరోజులలోనే అతను వారి ఆత్మీయతను పొందటం మొదలుపెట్టాడు. జైలు అధికారులను ఎదురుకునేందుకు ముందుకు వచ్చేవాడు. అతనితోటివాళ్ళు అతన్ని నమ్మి గౌరవించటం మొదలుపెట్టారు. ఢిల్లీ జైలులో అతనికి పిండి విసురుతూ, తాళ్ళు పేనుతూ, కొండప్రాంతపు జీవితంలా రోజులు గడపటం దుర్భరంగా వుండేది. రాజకీయఖైదీలు జైలు ఆఫీసర్ల ప్రయత్నాన్ని, బెదిరింపుల్ని, వినికూడా జైలుపనులలో కష్టపడటానికి నిరాకరించేవాళ్లు. అలావున్నప్పటికీకూడా వాళ్ళకు కాలం గడపటం భారంగా వుండేది.

రాజకీయఖైదీల బుద్ధి, ప్రయత్నం, జైలు అధికారులకళ్లు కప్పించి బయట నుంచి వార్తాపత్రికలు, బీడీలు, పొగాకు, పంచదార, ఇతరవస్తువులు తెప్పించుకోవడంలో నిమగ్నమై వుండేవి. కొందరు దొంగతనంగా పేక తెప్పించుకుని ఆడు

కుంటూ వుండేవాళ్లు. కొందరు కట్టుకథలు చెప్పుకుని హస్యం కొట్టడంలోనూ, బట్టలు వుతుక్కోవటంలోనూ కాలం గడుపుతూవుండేవాళ్లు. కొందరు వ్యక్తులు పుస్తకాలు చదువుతూ వుండేవాళ్ళు. జైలు అధికారి సుమారు - నూటముప్పాతిక మంది రాజకీయఖైదీలు ఒకే ఆదర్శంతో మసలడంతో కొంచం భయపడుతూ వుండేవాడు. చిక్కుల్లో పడకుండా వుండటంకోసం సామాన్యంగా వాళ్ళమాటలు అంగీకరించేవాడు, జైలుచట్టాన్ని వాళ్లు దిక్కరిస్తున్నప్పటికీ నిర్లక్ష్యం చేసేవాడు. ఆ పరిస్థితిచూసి ధనసింగ్‌కు సంతోషం, విజయం, పొందిన అనుభూతి కలిగేది. దీన్ని అతను ధర్మశాలజైలులో అనుభవించిన దుర్గతికి ప్రతీకారంగా భావించే వాడు. జైలు ఆఫీసరు, రాజకీయఖైదీలలో ఏ కొంచం అభిప్రాయభేదం పొడ సూపినా తను మంచితనాన్ని మరచిపోయి వారిని అదమాయించి కఠినంగా ప్రవర్తించడానికి సిద్ధమయేవాడు, ఒకళ్ళకు బేడీలువేసి, ఇంకొకళ్ళకి ఏకాంతవాస శిక్ష, విధించడం మొదలుపెట్టేవాడు. రాజకీయఖైదీలలో పరస్పర మతభేదాలకు, పోట్లాటలకు ఏమీ తక్కువలేదు. సామూహికంగా వాళ్లు ఆఫీసర్లతో పోట్లాడుతూ వుండే వాళ్లు. పరస్పరం వాళ్లుకూడా రాజనీతినిగురించి, కాంగ్రెసు పనులనుగురించి చర్చించుకుంటూ వుండేవాళ్లు. ఈ చర్చలు అప్పుడప్పుడూ కొట్టుకోవడం, దెబ్బ లాడుకోవడంవరకూ వెళ్తూవుండేవి. ధనసింగ్ ఈ చర్చలలోతును తెలుసుకోలేక పోయేవాడు. అందుచేత మౌనంగా వుండిపోయేవాడు.

ధనసింగ్ జైలులో తన బాధలనుంచి విముక్తి పొందాడు. రాజకీయ ఖైదీల సాంగత్యమువలన అతను విరక్తికి దూరమయాడు. ఎంతో నేర్చుకునేం దుకు సమయంవున్నా, ఎప్పుడైనా ఏకాంతం దొరికితేసరి,- ఆరునెలలతర్వాత జైలునుంచి విడుదలయి తను ఏంచేస్తాడు? సోమాగతి ఏమయివుంటుంది? ఆమెను అలా అసహాయస్థితిలో వదిలిపెట్టివచ్చి తను జరిగినది మరచిపోగలడా? అనే విష యాలు ఆలోచించడం మొదలుపెట్టేవాడు.

జైలు నాలుగుగోడలగుండా వార్తలు లోపలికి వస్తూవున్నాయి. ధనసింగ్ ప్రశ్నలకు సమాధానాలు వాటంతట అవే లభిస్తూవుండేవి. ఇంగ్లీషువాళ్ళు బర్మాలో ఓడిపోయారని, నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఆజాద్-హింద్-సేనను తీసుకుని భారతదేశానికి స్వాతంత్ర్యం చేకూర్చేందుకు వస్తున్నారని తెలుస్తూవుండేది. నెల-

రెండు నెలలమాట. యూ. పి.లో. బీహార్‌లో. దక్షిణ భారతదేశంలో ఇంగ్లీషు వాళ్ళకి వ్యతిరేకంగా తిరుగుబాట్లు జరుగుతున్నాయి. రైళ్లు పడగొడుతున్నారు. పోలీసుఠాణాలు తగలబెడుతున్నారు. అన్నివైపులా హిందూదేశం తమ ప్రభుత్వాన్ని స్థిరపరచుకుంటోంది అని వార్తలు వస్తూవున్నాయి.

ధనసింగ్ మనసు విలవిలా తన్నుకునేది. ఇటువంటిసమయంలో అతను కాంగడాజిల్లాలో వున్నట్లయితే వైక్‌నాథ్‌లోని పోలీసుఠాణాని కాల్చి నాశనంచేసి ఆ దుర్మార్గుడైన పోలీసుఠాణా అధికారిమీద ప్రతీకారం తీర్చుకునేవాడు. అతని హృదయంతోబాటు చాలామంది ఇతరమిత్రులహృదయాలు ఉత్సాహంతో ఎగిరి గంతులు వేస్తున్నాయి. ఎందుకంటే వాళ్ళకి జైలుశిక్ష పూర్తిగా అనుభవించాల్సిన అవసరం వుండదు. ఏదో ఒకరోజున ఢిల్లీ ప్రజాసీకంవచ్చి జైలు ముఖద్వారాన్ని విరగగొట్టి వాళ్ళని స్వతంత్రులుగా చేస్తారు. తను తిన్నగా కాంగడావైపు వెళ్ళి పోతాననే సుఖమయమైన ఊహాగానంలో ధనసింగ్ మైమరచిపోయేవాడు.

ఇంగ్లీషుభాష వచ్చినవాళ్ళకి ఎక్కువగా గౌరవం జరుగుతూవుండేది. అప్పు డప్పుడూ ఢిల్లీకి చుట్టుపక్కల గ్రామాల్లోవున్న జాట్ జాతివాళ్లు ఇంగ్లీషు అర్థం చేసుకోలేక, తమతోటివాళ్ళను, కార్యకర్తలను, ఇంగ్లీషులో మాట్లాడుతున్నారని తిరస్కరించడం మొదలుపెట్టేవాళ్ళు. రోథక్‌కు చెందిన భూరేసింగ్ పాత నాయ కుడు. గ్రామీణప్రజలలో అతనికి మంచి పలుకుబడి వుంది. అతను ఖంజీరా మ్రోగించి హరియానాభాషలో ఇంగ్లీషువాళ్ళని నిరసిస్తూ విద్రోహకరమైన పాటలు పాడేవాడు. ప్రజలు ఆనందంతో వూగిసలాడిపోయేవారు. పెద్దనాయకులసభకన్నా ఎక్కువగా ప్రజలగుంపు ప్రోగయేది. ఎప్పుడైనా ఇంగ్లీషులో చర్చలు జరిగితే, బాధపడి—'ఇదేమిటి, గజిబిజి చేస్తున్నారు? సూటిగా మీ భాషలో మాట్లాడుకోండి. మాకుగూడా అర్థమవుతుంది. మన మాతృభాష మీకు ఏ విషయంలో అడ్డు అనిపించింది? మనవాళ్ళే మనభాషని కొత్తభాషగానూ, పరాయిభాషగానూ అనుకుంటూ వుంటే ఇక ఇంగ్లీషు నాకొడుకులు ఏమనుకుంటారు?' అని తిట్టేవాడు భూరే సింగ్.

ధనసింగ్‌కూడా ఇంగ్లీషు అర్థం చేసుకోలేడు. అతనికి భూరేసింగ్ బోధన బాగా నచ్చేది. అతనుగూడా హిందూస్థానీలో మాట్లాడడానికి ఇష్టపడేవాడు, కాని

హిందూస్థానీలో వాదించడం జరిగినాకూడా ఎక్కువగా అర్థం చేసుకోలేకపోయే వాడు. అందరికన్నా ఎక్కువగా వాదానికి దిగేవాళ్లు కమ్యూనిస్టు మిత్రులు.

అభిలాషాపరులై వువ్విళ్ళూరే తోటివాళ్ళకన్నా ధనసింగ్‌కు స్వరాజ్యం అవసరం కొంచం ఎక్కువగా కనిపించేది. అతను ఆ ఆశమీద జీవిస్తున్నాడు. ఇంగ్లీషురాజ్యం అంటే అతని అభిప్రాయం - తనవి జీవితాంతం బైరాగిలాగా ఇంటినుంచి పారిపోయేలా బయటకు తోయడం. సోమాసుంచి విడిపోవడం. పట్టుకోబడటం అంటే అతని అభిప్రాయం జీవితాంతంవరకు జైల్లో పడుండటం. ఇంగ్లీషువాళ్ళ పరాజయం గురించి వినటంకోసం అతని ఆతురత వెర్రిగా తయారయింది. అతను వార్తలకోసం గిలగిల్లాడిపోయేవాడు. రాజనైతిక ఖైదీల ఆవరణ దాటి బయటకువెళ్ళి వచ్చేటటువంటి ఖైదీలను వార్తలు అడిగేవాడు. ఉర్దూ వార్తా పత్రిక తెప్పించుకోవడానికి ఎంతకయినా తెగించేవాడు.

జైలు నియమంప్రకారం 'సి' క్లాసు ఖైదీలకు వార్తాపత్రిక ఇచ్చేవారు కాదు. కాని రాజకీయఖైదీల ఆవరణలోకి వార్తాపత్రికలు చేరుతూనే వుండేవి. రాధే చౌధరికి వార్తాపత్రిక చదవాలనే అభిలాష ఎక్కువ. ప్రభుత్వం ఏమయినా చేయనీ. పత్రికలను మూసివేయలేదు అనే విషయం జైలు అధికార్లకు తోటి ఖైదీలకు నిరూపించ ప్రయత్నించేవాడాయన. ఆయన ఇల్లు ఢిల్లీలోనే వుంది. జైలు వార్డర్లతో చాటుమాటువ్యవహారం చేసేవాడు. వార్డర్లకు ఒక రూపాయమీద నాలు గణాలు కమీషను ఇచ్చి జైలులోకి దొంగతనంగా డబ్బు తెప్పించుకునేవాడు. డబ్బు, అధికారంవల్ల ఏది కావాలనుకుంటే అది జైలులోకి తెప్పించుకునేవాడు. ఇరవై, పాతికరూపాయల నెలజీతంపొందే జైలువార్డర్లకు నెలకు ముప్ఫై-నలభై రూపాయలు లంచమిచ్చే ఖైదీ, వాళ్ళకు యజమానితో సమానం. వార్తాపత్రికలలో జైలులో జరిగే అత్యాచారాల వార్తలు ప్రచురింపబడుతున్నాయి. ఇందుచేత ఆఫీసర్లు జైలులోకి వార్తాపత్రికలు రాకుండా కట్టుదిట్టం చేశారు. ఎంతోకాలం రాధే చౌధరికి, అణా వార్తాపత్రికను జైలులోకి తెప్పించుకోవటానికి రెండురూపాయలు ఇవ్వాల్సి వచ్చింది. కాని ఆయన తన మర్యాదని కాపాడుకోవటంకోసం అందుకుకూడా సంకోచించలేదు.

కొందరు కమ్యూనిస్టులు జైలులో కొద్దినెలలక్రితమే ఖైదీలు అయారు. ఈ

వ్యక్తులు తమ పరస్పరవ్యవహారాలు రహస్యంగా వుంచారు. కమ్యూనిస్టులు వార్తా పత్రికలు, పుస్తకాలు లేకుండా వుండలేరు. రాధే చౌధరిగారి పత్రికలు రాలేకపోయినా కూడా కమ్యూనిస్టుల వార్తాపత్రికలు వస్తూండేవి. ఏదోవిధంగా ఈ వార్త జైలు కార్యాలయ అధికారులవద్దకు చేరింది. రాజకీయఖైదీలకు సంబంధించిన ఆవరణలో పనిచేసే పోలీసు అధికారిని బదిలీచేయటం జరిగింది. జైల్లో అందరికన్నా నిర్దయుడూ, నిజాయతీపరుడు అయిన హెడ్ కానిస్టేబులు నిహాల్‌సింగ్‌ను ఆ స్థానంలో డ్యూటీమీద వేయడం జరిగింది.

సాయంకాలం అవుతోంది. జైలు కార్ఖానాలలో పని ముగియటానికి గంట మోగింది. ఆ సమయంలో జైలుకార్ఖానాలలో, తమ సత్ప్రవర్తనవల్ల తక్కువశిక్ష పొందిన ఖైదీలు, పనిలోకి జైలునుంచి బయటకువెళ్ళే ఖైదీలు, వాళ్ళవాళ్ళ ఆవరణలలోకి తిరిగి వస్తున్నారు. వీరిద్వారా బయటివార్తలు కొరుకుతూవుండేవి. రాధే చౌధరిగారి వార్తాపత్రిక రెండురోజులుగా రావటంలేదు. ధనసింగ్ విసుగుచెంది ఈ ఖైదీలకోసం నిరీక్షిస్తూ గుమ్మానికి ఎదురుగా పచార్లు చేస్తున్నాడు. గుమ్మంలో నుంచి రోడ్డువైపు తదేకంగా చూస్తున్నాడు.

కమ్యూనిస్టు రాజకీయఖైదీ అయిన దివాన్‌చంద్ ధనసింగ్‌దగ్గరకువచ్చి 'మహాశయా, ఇవ్వాళనుంచి తమాషా జరుగుతుంది' అన్నాడు.

'ఏమిటి?' ధనసింగ్ అడిగాడు.

'రెండురోజులనుంచి చౌధరిగారి వార్తాపత్రిక రావటం లేదుకదా. ఇవ్వాళ మా పత్రికనిగూడా తప్పకుండా పట్టుకుంటారు. ఒకవేళ మా పత్రిక పట్టుబడితే తర్వాత జైలులోకి పత్రిక రానేరాదు. జైలువార్తలు బయటకు వెళ్ళడం, బయట వార్తలు లోపలికి రావడం ఆగిపోతుంది' దివాన్ విచారంగా అన్నాడు.

'ఎట్లా?' అనుమానంగా ధనసింగ్ అడిగాడు.

దివాన్‌చంద్ ధనసింగ్‌ని చాటుగా తీసుకువెళ్ళి తెలియచెప్పాడు—'నేను విన్నదేమంటే, ఈ హెడ్ కానిస్టేబులు, నిహాల్‌సింగ్ రోడ్లు వూడ్చే పాకీవాళ్ళ డబ్బాలనిగూడా వెతుకుతాడట. ఇతను మూడవనంబరుశాఖలో రోడ్లువూడ్చే పాకీవాడి డబ్బాలోనుంచి బీడీకట్టని పైకి లాగాడు. ఇందుకే ఇతన్ని ఇక్కడికి పంపడం

జరిగింది. ఎవరితోనూ చెప్పవద్దు. మన వార్తాపత్రిక కుందన్ మేహతర్ తెస్తాడు. ఒకవేళ అతన్ని పట్టుకుంటే తర్వాత ఎనభై ఏడుగురి ఖైదీలగురించి ఒక్క కాగితం ముక్క కూడా రాలేదు. మన మనిషి పట్టుబడకుండా వుండాలి!'

'అయితే ఏం చేద్దాం?' ధనసింగ్ అడిగాడు.

దీవాన్‌చంద్ చేతితో సౌంజ్ఞచేస్తూ ధనసింగ్‌కు ఏదో తెలియబరిచాడు. ఒక వైపు నంబరుధరించి నిలబడినతనివైపుగూడా సౌంజ్ఞతో చూపించాడు.

కార్ఖానాలలోనూ, ఇతర చోట్లా పనిచేసే ఖైదీలగుంపులు (దళాలు) గాలల లోకి తిరిగివస్తున్నాయి. హెడ్ కానిస్టేబులు నిహాల్‌సింగ్ ఇద్దరు నంబర్లు ధరించిన సిపాయిల సహాయంతో ఒక్కొక్క ఖైదీ పక్కభాగాలు, నడుంబెల్టు నాలుగువైపులా తడిమి చూస్తున్నాడు. కొందరిచేత పైజామాలు, లంగోటీలు వూడదీయించి వెతుకుతున్నాడు. రోజూ వెతకాలనే నియమం వున్నప్పటికీ ఖైదీలదగ్గర ఏదో ఒక ఆపద కల్గించేవస్తువు బయటపడుతూ వుంటుంది. ఒక ఖైదీదగ్గర పదును చేయబడిన ఆకులాంటి ఆయుధమో, జేబులు కత్తిరించేందుకు బ్లేడు, ఇంకొకని దగ్గర పొగాకు వుంటాయి. ఈ వస్తువులనన్నింటిని హెడ్ కానిస్టేబులు ఒక నంబరుధరించిన సిపాయికి అప్పగిస్తూ పోతున్నాడు.

రోడ్లు వూడ్చేవాళ్ళదళం వెతకటంకోసం నిరీక్షిస్తూ నుంచునివున్నారు. ఈ దళంలో నుంచునివున్న మొదటిమనిషి కుందన్ మెహతర్ ముందుకు వచ్చాడు ఇంతలో ఆ ఆవరణలో చాలా భయంకరమైన కేక వినిపించింది—'చంపేస్తు న్నాడు! చంపేస్తున్నాడు!' ఆ తర్వాత సన్నగా నీరసంగావుండే దీవాన్‌చంద్ భయంతో కాళ్ళకి బుద్ధి చెప్పినట్లుగా పారిపోవటం కనిపించింది. ఒక పోలీసునుంచి చిన్నకర్ర లాక్కొని ధనసింగ్ తిట్లు తిడుతూ అతన్ని వెంబడిస్తున్నాడు. ధనసింగ్ వెనక ఒక పోలీసు పరుగెత్తాడు. రెండోవైపునుంచి దీవాన్‌చంద్‌ను కాపాడ టానికి వాజిద్ బిగ్గరగా అరుస్తూ మధ్యలోకి వచ్చాడు. బిగ్గరగా అరుస్తూ, అతన్ని కేకలేస్తూ బెదిరించసాగాడు.

'ఏమిటి? ఏమిటి?' అంటూ ఇతర రాజకీయఖైదీలుగూడా వచ్చారు.

హెడ్ కానిస్టేబులు నిహాల్‌సింగ్ ద్వారందగ్గర తనిఖీచేసేపని వదిలిపెట్టి

ఈల ఊదుతూ, అక్కడికి పరుగెత్తుకువచ్చారు. రాజకీయఖైదీలపట్ల కఠినంగా వుండమనీ, వాళ్ళతప్పు ఎత్తిచూపేందుకోసం ప్రయత్నించమనీ జైలరు ఆతన్ని హెచ్చరించారు. రౌడీమూకగానూ, దుర్మార్గులుగానూ, బుజావుపరచాలి. హెడ్ కానిస్టేబులుగారి ఈలవిని అన్నివైపుల ఈలలు వినిపించాయి. జైలుద్వారందగ్గర వేలాడదీసివున్న గంట టంగ్ ! టంగ్ ! మని మ్రోగింది.

'పిచ్చి ! పిచ్చి ! పిచ్చెక్కిపోయింది !' అన్నగోల వ్యాపించింది.

ఖైదీలు తమ కొట్లల్లోకివెళ్ళి దాక్కోవటానికి పరుగెత్తడం మొదలు పెట్టారు. రోడ్లు వూడ్చేవాళ్ళ దళంకూడా తమతమ తట్టలు, ఢబ్బాలు తీసుకుని లోపలికి వచ్చేసింది. అయిదారు నిముషాలలో జైలులోవున్న రెండున్నరవేలమంది ఖైదీలు తాళాలువేసి బంధింపబడ్డారు.

రాజకీయఖైదీల కొట్లో కల్లోలం వ్యాపించింది. 'ఒకవేళ నా కొడుకులు, కమ్యూనిస్టువాళ్ళు ధనసింగ్‌కి శిక్ష పడేలాచేస్తే వాళ్ళ అంతు చూస్తాం' అని రాధే చౌధరి, ఆయనతోటివాళ్లు అన్నారు.

'ఆ వెధవలకి బుద్ధివచ్చేట్లుగా చేయాలి' అన్నారు అనేకమంది.

'వీళ్ళని మనతో కలవనివ్వకుండా విడిగా వుంచాలి !'

సూపరింటెండెంటు, జైలరు, మిగతా ఆఫీసర్లు, శాంతిని నెలకొల్పటం కోసం, తుపాకులు తీసుకుని, పోలీసులతోపాటు రాజకీయఖైదీల కొట్టుదగ్గరకు వచ్చారు. ధనసింగ్, దీవాన్‌చంద్, వాజిద్‌లను విచారణ చేయడంకోసం అధికారి ఎదుటకు పిలిపించారు. ధనసింగ్, వాజిద్, దీవాన్‌చంద్‌లకు బేడీలు తగిలించారు. ఆ గొడవలో ధనసింగ్‌కు రెండు మూడుచోట్ల దెబ్బలుకూడా తగిలాయి.

ఇది కమ్యూనిస్టు-కాంగ్రెసు ఖైదీల కొట్లాట అని జైలరు అధికారికి తెలియ జెప్పారు. అధికారి ఓదార్పు స్వరంలో ధనసింగ్‌వైపు చేతితోచూపించి 'ఈ దుర్మార్గుడు నిన్ను కొట్టాడా ?' అని దీవాన్‌చంద్‌ని అడిగాడు. దీవాన్‌చంద్ సమాధానంగా 'లేదు, నన్నెవరూ కొట్టలేదు' అన్నాడు.

అధికారి పెదిమలు బిగించి దీవాన్‌చంద్‌వైపు కోపంగా చూశాడు. 'నిన్ను ఇతను కొట్టాడా ?' అని ధనసింగ్‌ని అడిగాడు.

అసిస్టెంటు జైలరు ముందుకువచ్చి, ధనసింగ్ దీవాన్‌చంద్‌ను కొడుతుంటే చూశానని అన్నాడు. పోలీసు చెప్పటం ఆపినమీదట, ధనసింగ్ పోలీసుదగ్గరనుంచి కర్ర లాక్కున్నాడు. పోలీసును కొట్టాడు. దీవాన్‌చంద్‌ని తరుముకుంటూ వెళ్లాడు. వాజిద్‌నుకూడా కొట్టాడు. పోలీసు కిరపాల్‌ను వారించినమీదట అతన్నిగూడా కొట్టాడు. ఎంతోమంది ఇతర కాంగ్రెసు ఖైదీలుగూడా పోలీసులను కొట్టడానికి పరుగెత్తుకువచ్చారు. పోట్లాటలో ఎవరెవరో గుర్తించటం కష్టమయింది.

అధికారి ఈ గొడవంతా విన్నాడు. కాని దీవాన్‌చంద్‌నుగాని ధనసింగ్‌ను గాని ఏమీ ప్రశ్నించలేదు. 'వీళ్ళు చాలా తిరిగేరినవాళ్ళు. వాళ్ళలో వాళ్లు ఒడంబడిక చేసుకున్నారు' అని అధికారి జైలరుతో ఇంగ్లీషులో చెప్పాడు.

'అయ్యా, ఇప్పుడయితే వీళ్ళు ఒడంబడిక చేసుకుంటున్నారు కానీ గదులన్నీ మూసినతర్వాత రాత్రిపూట కొట్లాడుకోవచ్చు. అయ్యగారి అనుమతిఇస్తే వీళ్ళముగ్గురిని విడివిడిగా గదులలోకి పంపవచ్చు' అని అసిస్టెంటుజైలరు తన అభిప్రాయాన్ని చెప్పాడు.

దీవాన్‌చంద్ తిరస్కరించాడు. 'అయ్యగారూ, మీరు రాజకీయఖైదీలకు చెడుపేరు ఆపాదించడానికి అనవసరంగా అల్లరులు చేస్తామన్న కళంకం ఆపాదిస్తున్నారు. మేము కసరత్తు చేయడంకోసం కబడ్డీ ఆడుతున్నాం. పోలీసులు మమ్మల్ని కర్రలతో కొట్టడం మొదలుపెట్టారు. ఇదంతా ఈ హెడ్ కానిస్టేబులు చేసిన దుర్మార్గమే. జైలరు ఇతన్ని మమ్మల్ని బాధ పెట్టడంకోసం ఇక్కడికి పంపించారు. ఈ కానిస్టేబులు ఈ ఆవరణలోకి వచ్చినప్పుడల్లా ఏదో ఒక ఉపద్రవం తలెత్తుతూనే వుంది. తప్పుడు నేరారోపణచేసి మాకు అమర్యాదచేయటం జరుగుతోంది. యోగ్యులైన మీరే ఏదో ఒకటి నిశ్చయం చేయాలి. లేకపోతే మేము పట్టణంలోవున్న అధికారులతో ఫిర్యాదు చేస్తాం.'

అధికారి కోపాన్ని ప్రకటించడంకోసం ఏ సమాధానమూ ఇవ్వకుండా తిరిగి వెళ్ళిపోయాడు. కొన్ని అడుగులువేసి ఆగి, 'వీళ్ళని కలిసివుండనిచ్చి వాళ్ళల్లో వాళ్ళని కొట్టుకోనీ, పోట్లాడుకోనీ. ఏదన్నా ప్రమాదం జరిగితే బైట న్యాయస్థానానికి ఈ కొట్లాటవిషయం ఫిర్యాదుచేసి వీళ్ళకి శిక్ష వేయించటమే సరైనపని' అని జైలరుతో చెప్పాడు.

జైలు ఆవరణలో అలా గోలచేసికూడా రాజకీయఖైదీలు ఏమాత్రమూ శిక్ష పొందకుండావుంటే జైలుప్రతిష్ఠ పూర్తిగా అంతరించిపోతుంది. అందుచేత అధికారి దీవాన్‌చంద్, ధనసింగ్, వాజిద్‌లను ఓ రెండురోజులు ఒంటరిగదులలో బంధించే శిక్ష వేశారు.

రాజకీయఖైదీలకొట్టులో మరోవిధమైన ఆందోళన బయలుదేరింది. 'వాళ్ళలో ఏవిధమైన కొట్లాట జరుగలేదని దీవాన్‌చంద్, ధనసింగ్ స్పష్టంగా చెపుతూవుంటే వాళ్ళకి ఎలాటిశిక్ష వేయబడుతోంది? జైలువాళ్లు ఈవిధంగా మనల్ని అవమానం చేస్తే మనం అందరం నిరాహారదీక్ష చేద్దాం' అని కమ్యూనిస్టు అయిన జైరామ్, సోషలిస్టు అయిన అర్జునలాల్ అన్నారు.

ఈ విషయమై రాజకీయఖైదీలసభ ఏర్పాటయింది. రాజకీయఖైదీలలో అందరికన్నా ఎక్కువమర్యాద సోమనాథ్‌గారికి జరిగేది. పట్టణంలోగూడా వారికి గౌరవం వుంది. ఆయన పూర్వం కాంగ్రెసులో పనిచేసిన నాయకుడు; వారి కార్యకర్త. ఆయనకి చాలినంత సంపద వుంది; కాని భక్తిమార్గమైన జీవితాన్ని అవలంబించారు.

ప్రభుత్వపు ఆజ్ఞప్రకారం సోమ్‌బాబుకు 'ఎ' క్లాసు ఇచ్చారు. కాని అది ఆయన సిద్ధాంతాలికి వ్యతిరేకం. తాను 'సి' క్లాసులోనే వుండటానికి నిశ్చయించుకున్నారు. జైలులో భోజనం చేసేవారుకాదు. సొంతఖర్చుమీద రెండుశేర్ల పాలు, కొన్ని పళ్లు తెప్పించుకునేవారు. మిల్లునూలుతో తయారుచేసిన జైలుబట్టలుగూడా ధరించేవారుకాదు. శ్రేష్ఠమైన ఒక ఖద్దరు అంగోస్త్రాన్ని నడుముకు చుట్టుకుని, ఉన్నిశాలువా కప్పుకునేవారు. రోజంతా నూలు వడుకుతూనో, ఏదైనా చదువుతూనో వుండేవారు. దొంగతనంగా వార్తాపత్రిక తెప్పించుకుని చదవటం ఆయన అవినీతిగా తలచేవారు. వార్తలుమాత్రం వినేవారు.

జనం ఎంతో ప్రాధేయపడి బలవంతపెట్టాక సోమ్‌బాబుకూడా సభలోకి వచ్చారు. యువకమిత్రులైన అర్జునలాల్, జైరామ్‌ల నిరాహారదీక్షకు సంబంధించిన ప్రసంగంలో పాల్గొన్నారు. ఆయన జైలు అధికారుల అవమానాన్ని నిరసిస్తూ పోట్లాడాలని కోరేవారు. కాని రాధేచౌధరి అందుకు వ్యతిరేకులు. ఆయన చెప్పే

దేమిటంటే, ఈ అవమానానికి ప్రతీకారం తీర్చుకోవడంకోసం జైలరుమ నాలుగు దులిపికొట్టాలి. మనం ఆకలితో ఎందుకు చావాలి? 'అడవాళ్ళకిమల్లే అలగడంచేత ఏమవుతుందంటే మనం తిండి తినడం మానేస్తాం. ఇలా అయితే అనుకున్నది తలక్రిందులై ప్రభుత్వం గింజలు మిగులుతాయి' అని ఉద్ఘాటించారు. కోపంగా తిడుతూ 'ఎవరైనా.........మాకు శిక్షవేస్తే మేము ఆ దుర్మార్గులతల పగులగొట్టే స్తాం! మేముమాత్రం నేతాజీ మాటల్ని అనుసరిస్తాం. పోట్లాడి మా హక్కుల్ని కాపాడుకుంటాం' అన్నారు.

రాధేచౌధరితోబాటు ఇంకా నలుగురయిదుగురు కలిసి పల్లటిపానీయాలు త్రాగేవాళ్ళు. శరీరానికి మర్దనచేసుకుని కసరత్తు చేసేవాళ్ళు. మహాత్మాగాంధీకి, నేతాజీకి జయ్ అని అరిచేవారు. బయటనుంచి మిఠాయి, పొగాకు తెప్పించుకుని సేవించేవారు. వాళ్ళంతాకూడా ఆయన్ని సమర్థించారు.

'అధికారినిగాని, జైలరునుగాని తిట్టు తిట్టి కొట్టటంచేత పరిస్థితి చక్క బడదు, పైపెచ్చు చెడుతుంది. జైలువాళ్ళకి మనమీద లాఠీ-ఛార్జి చేయటానికి వంక దొరుకుతుంది. ప్రజలుగూడా మనల్ని ఆవేశపరులుగా తలపోస్తారు. నిరాహారదీక్ష పిరికితనం కాదు. ఇది మహాత్మాగాంధీగారు మనకు ఇచ్చిన సత్యాగ్రహమనే ఆయుధము' అని అర్జునలాల్, జైరామ్ తెలియజెప్పాలనుకున్నారు.

రాధేచౌధరిగారి తోటివాళ్ళు చప్పట్లు చరిచి హే! హే! అని అరిచి గోల చేయటం మొదలుపెట్టారు. 'అసమర్థత! అసమర్థత!' అన్నారు. ఇలా జరిగినా కూడా అనేకమంది యువకులు జైలులో అవమానాన్ని భరించలేక నిరాహారదీక్షని కోరుతున్నారు. వాళ్ళ నాయకుడు సోమ్‌బాబు వాళ్ళతరపున అధికారికి నిరాహారదీక్ష నోటీసు ఇవ్వాలని వాళ్లు ఆయన్ని ప్రార్థించారు. సోమ్‌బాబు ఇది అంగీకరించక పోయేసరికి అర్జునలాల్, జైరామ్ నోటీసు ఇవ్వడానికి సిద్ధమయారు. కాని సోమ్ బాబుకూడా సమ్మెలో వాళ్ళకి చేయూతనిస్తే బాగుంటుందని వాళ్ళు కోరారు.

సోమ్‌బాబు కమ్యూనిస్టుల తెలివితేటలు, సోషలిస్టుల నేర్పరితనం తెలుసు కున్నారు. వాళ్ళు తమమీదే కేంద్రీకృతమయే ప్రభావాన్ని తప్పించేందుకు తెలివి తేటలుగా మాట్లాడుతారని ఆయనకు తెలుసు. 'ఒకవేళ జైలువాళ్ళు వాళ్ళ నియ

మాన్ని అనుసరించి ఏదైనా శిక్ష విధిస్తే మనం ఆ శిక్షను శాంతంగా అనుభవించాల్సి వుంది. ఇదే మన ఆత్మబలం. దురాచారాన్ని పెరగనిస్తూ ఉండనివ్వటం వల్లనే అది నాశనం అవుతుంది. ఎప్పుడైతే ధర్మానికి అంతులేనిబాధ కలుగుతుందో అప్పుడే భగవంతుని శక్తి అవతారమెత్తి న్యాయాన్ని స్థాపిస్తుందని 'గీత'లో వ్రాసివుంది. ఒకవేళ మనం ఉపవాసం చేయాల్సివుంటే జైలువాళ్ళని విరసిస్తూ చేయగూడదు. ఆత్మశుద్ధికోసం చేయాలి. గాంధీగారు ఎప్పుడూ నిరసన ఉపవాసం చేయరు. ప్రాయశ్చిత్తంకోసమే ఉపవాసాలు చేస్తారు. మీ ప్రవర్తన హింసకు సంబంధించినది. మీరు జైలువాళ్ళని భయపెడదామని అనుకుంటున్నారు. గాంధీగారి ఆదేశానుసారం మనం జైలులోకివెళ్ళి తపస్సు చేయాలి. జైలునియమాలని పాటించాలి. కాని మీరు దొంగతనంగా వార్తాపత్రికలు తెప్పించుకుంటున్నారు' అని ఆయన బోధన చేశారు.

'బాబుగారూ! ఒకవేళ జైలులో అత్యాచారముతో కూడిననియమాల్ని పాటించాల్సివుంటే, జైలుబయట చట్టాన్ని ఎందుకు వ్యతిరేకించాలి? ఇంగ్లీషు ప్రభుత్వం పెట్టిన నియమం ఏమిటంటే హిందూదేశప్రజలంతా విశ్వాసపాత్రులైన బానిసలుగా వుండాలి. మీరు ఇదేనియమాన్ని పాటించండి. స్వరాజ్యం ఎందుకు కోరుతున్నారు? స్వరాజ్యాన్ని కోరడం ప్రభుత్వాన్ని వ్యతిరేకించడమే అవుతుంది. మాకు వార్తాపత్రికలు రావాలని మేము ప్రభుత్వాన్ని కోరుతాము. రాకపోతే నిరసన ప్రకటిస్తూ నిరాహారదీక్ష చేస్తాము. మేము పశువులం కాదు, మనుష్యులం' అని అరుసలాల్ అడుపలికాడు.

సోమ్‌బాబు నెమ్మదిగా సమాధానం ఇచ్చాడు—'ఒకవేళ మీరు గాంధీగారి ఆదేశాన్ని తిరస్కరించి అందుకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే నేను ఉత్తరం వ్రాసి మహాత్మాగాంధీగారికి, నాయకులందరికి ఈ విషయంగురించి తెలియజేస్తాను. మీరు అందరూ కాంగ్రెసుసభ్యులు అవటానికి తగినవారు కాదు. అవసరమైతే నేను జైలువాళ్ళకు మీవలన జరిగిన ఈ అన్యాయానికి పశ్చాత్తాపంగా ఆమరణనిరాహార దీక్ష చేస్తాను. ఎన్నడైనా హిందూదేశస్థులు ఇంగ్లీషుప్రభుత్వంపట్ల హింస, అన్యాయకరమైనధోరణి అవలంబిస్తే మహాత్మాగాంధీ ఎప్పుడూ ఉపవాసంద్వారా దానికి ప్రాయశ్చిత్తం చేస్తుంటారు. నేనుకూడా అలానే చేయాల్సివుంటుంది.'

జైరామ్, అర్జునలాల్, వాజిద్‌లు సోమ్‌బాబుకు సమాధానం ఇదామనుకున్నారుగాని ఇంతలో 'మహాత్మాగాంధీకి జై!' అని రాధేచౌధరిగారి మనుష్యులు కేకలు వేశారు. వాళ్ళు ఎవ్వరినీ మాట్లాడనివ్వలేదు. ఎవరైనా కొంచం మాట్లాడుదామని నోరు కదిపితే మహాత్మాగాంధీకి జై అని బిగ్గరగా కేకలువేయడం మొదలుపెట్టారు. వాళ్ళు స్పష్టంగా ముఖంమీద ఇలా అని. 'ఏ వెధవ, స్టాలిన్ పుత్రులు చెప్పారని ఉపవాసం చేస్తాడో వాడిమీద కంబళికప్పి మూసేయడం జరుగుతుంది!' అని బెదిరించారు.

'కంబళి వేయడం' అన్నది జైలులో దెబ్బలు కొట్టడానికి విశేషార్థం. ఇందులో దెబ్బలు కొట్టేవాడికి ఊపిరి తీసుకోవడంకూడా కష్టమవుతుంది. దెబ్బలు తినేవాడు తనని ఎవరు కొడుతున్నారోకూడా తెలుసుకోలేకపోతాడు. నమ్మె జరగలేదు. ధనసింగ్‌కు ఢిల్లీజైలులో ఈ సంఘటనలవలన ఎంతో బాధకలిగింది. రాధే చౌధరిని చితకబాది అంతు చూద్దామనుకున్నాడు కాని దీవాన్‌చంద్, అర్జునలాల్, వాజిద్‌లు అతన్ని అడ్డగించారు. జైలువాళ్ళఎదుట రాజకీయఖైదీలస్థితి హీనపరచటం మంచిదికాదని బోధించారు. ధనసింగ్ సోమ్‌బాబు త్యాగంమూలాన ఆయన పట్ల శ్రద్ధగలిగి వుండేవాడు. వాళ్ళముఖంమీద ఉమ్మేద్దామని అతనికి అనిపించింది.

రాజకీయఖైదీల ఆవరణలో పోట్లాట బయల్దేరింది. జైలువాళ్లు వాళ్ళపట్ల కఠినంగా ప్రవర్తించటం మొదలుపెట్టారు. ఇదివరకు ఏ మామూలు నియమాలకు భంగం వాటిల్లినాకూడా జైలువాళ్ళు నిర్లక్ష్యం చేసేవాళ్ళు. ఇప్పుడు ఆ విషయాలకే రాజకీయఖైదీలకు శిక్షలుపడటం మొదలయాయి. రాజకీయఖైదీలు పిండి విసరటం, త్రాళ్లు పేనటం మొదలయానపనులు చేయాల్సివచ్చింది.

తన వార్తాపత్రిక రావటంగురించి, ఆ రోజు పోట్లాట రహస్యంగురించి ఎవరికీ తెలియచెప్పద్దని దీవాన్‌చంద్ ధనసింగ్‌కు చెప్పాడు. రాజకీయఖైదీలలో కూడా చాలామంది గుప్తచారులు వున్నారు.

ఆవరణలో పోట్లాటలు, ఆఫీసర్ల కాఠిన్యం పెరిగిపోవటంచేత దీవాన్‌చంద్ వార్తాపత్రిక రావటంకూడా ఆగిపోయింది. ధనసింగ్‌ను ఈ లోటు చాలా బాధపెట్టేది. బయటదేశంలో విద్రోహం వ్యాపించడం, ఇంగ్లీషువాళ్ళు జపానువాళ్ళ చేతుల్లో ఓడిపోయి పారిపోవటం - వీటికి సంబంధించినవార్తలు రావటం ఆగి

పోయాయి. తత్ఫలితంగా స్వరాజ్యమనేద్వారము వెంటనే మూసుకుపోయిందేమో అన్నట్లుగా అనిపించింది. భావిజీవితంగురించి స్వప్నం, సోమాని మళ్ళీ కలుసుకునే ఆశ అతనిలో క్రమంగా నశించడం మొదలుపెట్టాయి.

వార్తాపత్రికకు సంబంధించిన సంఘటన ఫలితంగా ధనసింగ్, దీవాన్ చంద్, వాజిద్ మొదలైనవారికి స్నేహితుడుగా అయ్యాడు. జైలులోకి వస్తూనే వాళ్ళు కమ్యూనిస్టు కామ్రేడులని తెలుసుకుని, సానుభూతిపరుడైన భూషణ్ ప్రవర్తన గుర్తుకు రావడంతో ధనసింగ్‌కి వాళ్ళపట్ల కొంత ఆకర్షణ కలిగింది. కామ్రేడ్‌వ్యక్తులు కూలివాళ్ళకు సహాయకులు అని అతనికి తెలుసు. కాని జైలులోకివచ్చి అతను విన్నదేమంటే కమ్యూనిస్టులు, మన శత్రువులైన ఇంగ్లీషువాళ్ళతో పోట్లాడుతున్న జపానువాళ్ళకు వ్యతిరేకులు. కమ్యూనిస్టు రష్యానుంచి అనుమతివచ్చిన కారణంగా ఇంగ్లీషువాళ్ళ సహాయకులు అయారు. ధనసింగ్‌కు ఆ భేదమంతా అర్జునలాల్ చెప్పాడు.

అర్జునలాల్ అంటే ధనసింగ్‌కు విశేషమైన శ్రద్ధవుంది. అతను అర్జునలాల్‌ని చాందనీ చౌక్‌లో చిక్కుకుని లాఠీదెబ్బలు తింటుండగా చూశాడు. అర్జునలాల్ బాగా చదువుకున్నవాడు. అర్జునలాల్ అతనికి తనగురించి అంతా చెప్పాడు. అతను మొదట కాన్పూరులో కూలివాళ్ళలో పనిచేసేవాడు. ఢిల్లీ మిల్లులలో కార్మికుల నాయకుడు. కమ్యూనిస్టులతో అతనికి ఇదే విషయంమీద పోట్లాటవచ్చింది. వాళ్ళు ఇంగ్లీషువాళ్ళతో కలిసిపోయారు. కమ్యూనిస్టులు కాంగ్రెసువాళ్ళను ఖైదు చేయించసాగారు. అతను ధనసింగ్‌ను కమ్యూనిస్టుల డాంబికపుమాటలు, ఉపాయాలు వినటంనుంచి వారించాడు. ఒకవేళ ఆరునెలల్లో స్వరాజ్యం రాకపోతే అతను ధనసింగ్‌ని తనవెంట తీసుకునివెళ్ళి విప్లవ ఉద్యమాలలో పాల్గొనేటందుకు అవకాశం కల్పిస్తానని హామీఇచ్చాడు.

రాధేచౌధరిగారికి కడుపులో నొప్పిరావడం మొదలుపెట్టింది. ఆయన కొద్ది రోజులు జైలు ఆస్పత్రిలో ఉన్నారు. తర్వాత విడుదలయారు. ఆసరణలో మళ్ళీ ఐకమత్యము చేకూరింది. వార్తాపత్రికలు మళ్ళీ రహస్యంగా రావడం మొదలుపెట్టాయి. ఇప్పుడు ఇంకా ప్రచండమైనవార్తలు వస్తున్నాయి. జపాను, బర్మానంతటినీ జయించి అస్సాందగ్గరకు చేరింది. బెంగాలులో అనేకచోట్ల, కలకత్తాలో

కాండులు పడుతున్నాయి. ఖైదీలు చాలా ఉత్సాహం పుంజుకున్నారు. ఇంగ్లీషువాళ్ళు జపానుసైన్యంవల్ల, ఆజాద్-హింద్-సేన దెబ్బలవల్ల తప్పక పారిపోతారు. వాళ్ళకు జైలునుంచి విముక్తులయి వెళ్ళిపోయే ఆశ కలిగింది.

అర్జునలాల్, ధనసింగ్‌లు ఎదురుదలయేసమయం ఆసన్నమయింది. గాంధీగారు ఉపవాసం ప్రారంభించారు, అని వార్త అందింది. ఉపవాసం చేయటానికి కారణం ప్రజలు తెలుసుకోలేకపోయారు. దీవాన్‌చంద్, వాజిద్ మొదలైన కమ్యూనిస్టులు విడుదలై వెళ్ళిపోయారు కాని వాళ్ళశిష్యులు కొంతమంది వెనుక వుండిపోయారు. ఇంగ్లీషుప్రభుత్వం కాంగ్రెసుమీద హింసాకాండచేసిన నేరారోపణను నిరసిస్తూ గాంధీగారు ఉపవాసం చేస్తున్నారని వాళ్లు చెప్పారు.... మేము మొదట్నుంచీ చెపుతూనేవున్నాము. కాంగ్రెసునాయకులు, శత్రువులు పైనుంచి ఎదుర్కొంటూవుండగా వాళ్ళతో తలపడేందుకు తమశక్తిని నష్టం చేసుకునే తెలివితక్కువవాళ్ళుకారు? ఇది ఇంగ్లీషు శాసనపద్ధతి చేసినమోసం. నాయకులులేనప్పుడు ప్రజలను అధికారంచూపి భయపెట్టారు. ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించటానికి నెపం వెతికారు. సోషలిస్టులు ఈ మాయలో ఇరుక్కొని మూర్ఖులయిపోయారు.

యువకులు ఈ మాటలువిని విశ్వాసులవసాగారు. తాము ఆందోళనలో పాల్గొని జైలుకి రావడం మూర్ఖత్వమే అయింది అనిపించింది. గాంధీగారు దీనిని హర్షించారు. ధనసింగ్‌గూడా బాధపడసాగాడు. అందుకు అన్నిటికన్నా ముఖ్య కారణం తను జైలునుంచి విముక్తుడయి మళ్ళీ బానిసదేశం, ఇంగ్లీషువారి అధికారంలోకే అడుగుపెట్టాలి. తన కొండప్రాంతానికి వెళ్ళి సోమాని కలుసుకోవటానికి ఇక ఏవిధమైన ఆశా లేదు.

* * *

అర్జునలాల్, ధనసింగ్ జైలునుంచి విడుదలయేసరికి అన్నివైపులా భయం, నిరుత్సాహం వ్యాపించాయి. ప్రజలు మహాత్మాగాంధీగారి ఉపవాసాన్నిగూర్చి సరిగా అర్థం చేసుకోలేదు. తాము జైలునుంచి విడుదలయి మళ్ళీ ఆందోళన నడిపించవచ్చునని మహాత్మాగాంధీగారు ఉపవాసం చేశారని వాళ్ళ ఊహ. ప్రభుత్వం నిరంకుశపరిపాలన ప్రజలను భయభ్రాంతులుగా చేసేసింది. స్వాతంత్ర్యంకోసం ఆందోళనగాని, ప్రభుత్వాన్ని తిరస్కరించే ఏవిధమైన ప్రదర్శనలుగాని ఎక్కడా కను

పించకుండాపోయాయి. సామూహిక సర్వప్రజానీక సంబంధమైన ఆందోళనలు, ప్రదర్శనలు అణిగిపోయాయి. కాని ఇంగ్లీషుప్రభుత్వంపట్ల అసహ్యం ప్రజల హృదయాలలో లోతుగా నాటుకుపోయింది. ప్రభుత్వంచేసే ప్రతిపనిలోనూ ప్రజలకు అనుమానం కలిగేది. ఆ ప్రజానీకానికి అన్నివైపులా ప్రభుత్వపు బలహీనత కానవస్తూవుండేది. ధాన్యంలేనిలోటు, దోపిడీలు - దొంగతనాలు జరుగుతున్నాయన్న అనుమానం తొలగించేందుకు ప్రభుత్వం రేషనింగ్‌పద్ధతిని ఏర్పాటుచేసింది. ప్రభుత్వం యుద్ధంకోసం ధాన్యాన్ని సమకూర్చుకోవాలని తమకు తక్కువ భోజన పదార్థాలని ఇస్తోందని ప్రజల నమ్మకం.

జనవరినెలలో, జపానువాళ్ళ విమానం కలకత్తాలో రాత్రి మూడుసార్లు బాంబులు వేసింది. ఢిల్లీలో ప్రభుత్వపు బంగళాలను ఇసుకబస్తాలతో కట్టుదిట్టం చేశారు. ప్రతిచోటా బాంబుల ప్రమాదంనుంచి కాపాడేందుకు రక్షణకేంద్రాలు కట్టించారు. ఆకాశంనుంచి పడే బాంబులకు గురికాకుండా వుండటంకోసం ప్రభుత్వం పెద్దపెద్ద పట్టణాలలో రాత్రులందు దీపపుకాంతిని తగ్గించాలని ఆజ్ఞాపించింది. శత్రువులవిమానాలు సమీపిస్తూనే నగరాలలో తక్షణం పూర్తిచీకటి (బ్లాక్ అవుట్) పద్ధతినికూడా ఏర్పరచింది. అప్పుడప్పుడూ 'బ్లాక్ అవుట్' అభ్యాసము, వాటి పరీక్షలు చేస్తూవుండేవారు. ప్రజలకు ఇందులో ప్రభుత్వం పిరికితనం కనిపించేది. ప్రజలు, ప్రజలరక్షణనిమిత్తమై ప్రవేశపెట్టిన ఈ ప్రభుత్వపు ఆజ్ఞలను వాళ్లు అనాదరం చేసేవాళ్లు. అందువల్ల వారికి సంతోషం కలిగేది. ప్రజలహృదయాలు ప్రభుత్వంమీద అసహ్యంతో రగిలిపోతూవుండేవి. కాని ఆ అసహ్యం పైకి కనబరిచేవాళ్ళు కారు.

అర్జునలాల్ ధనసింగ్‌ని వెంటబెట్టుకుని తనమిత్రుల్ని, పరిచితవ్యక్తుల్ని కలుసుకునేందుకు వెళ్ళాడు. యువకులు క్రిందటి ఆగస్టు-ఆందోళనను మళ్ళీ నడిపించాలని కోరుతుండేవారు. అర్జునలాల్ ఒక సమాజవాద నాయకునిదగ్గరకు వెళ్ళారు. ఆయన తన సమస్యల్నిగురించి తెలియచెప్పి అసమర్థతను వెల్లడించారు. 'ఇంకా కొన్నాళ్ళు నిరీక్షించు। గాంధీగార్ని నమ్ము। గాంధీగారు ఉపవాసం తర్వాత ప్రభుత్వంతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతారు. అప్పుడే మనం ఒక నిశ్చయానికి రాగలం. అని గాంధీవాదులు సలహా ఇచ్చారు.

ఢిల్లీలో రైల్వేకూలీలలో అర్జునలాల్‌కు విశేషమైనప్రభావం వుంది. జైలు నుంచి విడుదలైనతర్వాత వారిపరిస్థితి తెలుసుకునేటందుకు అతను కూలివాళ్ళ నివాసప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ కమ్యూనిస్టులు ప్రభుత్వం నెలకొల్పారు. అర్జునలాల్ జైలుకు వెళ్ళటానికిపూర్వం కమ్యూనిస్టుపార్టీకి విడిగా చట్టం అనేది లేదు. కమ్యూనిస్టులు కూలీలసభలు. ఇతర అనేక సమావేశాలచాటుననే పని చేసే వాళ్ళు. ఇప్పుడు వాళ్లు బాహాటంగా ప్రచారం చేస్తున్నారు. ఒక కొత్త 'రేడికల్ డెమోక్రెటికల్ పార్టీ' కూడా తయారయింది. ఈ పార్టీ ఎర్రజండా తీసుకుని ఇంగ్లీషు వాళ్ళసైన్యంలో చేరటంగురించి ప్రచారం చేస్తోంది. ఈ పార్టీ ఇంగ్లీషువాళ్ళని ప్రజాతంత్రానికి రక్షకులుగా రూపొందించి యుద్ధంలో సంపూర్ణసహాయం ఇవ్వమని సలహా ఇస్తోంది.

జపాన్ ఆక్రమణసమయంలో శత్రువులపోటీ, పటుత్వం లేకుండా చేయటం కోసం ఏవిధమైనటువంటి సమ్మెలు జరుగకుండా వుండాలని కూలివాళ్ళకు సలహా లిస్తున్నారు కమ్యూనిస్టులు. దేశరక్షణకోసం యుద్ధంలో సాయం చేయటానికి అవకాశం ఇవ్వమని ప్రభుత్వాన్ని కోరుతున్నారు. ఒకేవిధమైన జండాలు తీసుకుని నడిచేటటువంటి ఈ రెండుపార్టీలలో భేదం ఏమిటో ప్రజలు తెలుసుకోలేకపోతున్నారు. ఇంగ్లీషువాళ్ళకి సహాయం చేయాలని అరిచేవాళ్ళమీద అసహ్యం చూపించడం మొదలుపెట్టారు.

కాంగ్రెసు సమాజవాదీనాయకులు దాదాపు అంతా పరారీ అయారు. వాళ్ళని వెతకటానికి అర్జునలాల్‌కు రెండురోజులు పట్టింది. అర్జునలాల్ డబ్బు ఖర్చు, ఇబ్బందికూడా పడుతున్నాడు. యుద్ధానికిపూర్వం పన్నెండు అణాలు, రూపాయతో రోజు గడిపేవాడు. ఇప్పుడు వస్తువులు ప్రియం అవటంవల్ల రూపాయన్నర, రెండురూపాయలతోకూడా ఏమీ జరుగుబాటు అవటంలేదు. రూపాయకు పద్దెనిమిది శేర్లు అమ్మేధాన్యం రూపాయకు నాలుగుసేర్ల ధరమీద అమ్ముడవుతోంది.

ఒకరాత్రి అర్జునలాల్, ధనసింగ్‌లు ఆజాద్-హింద్ రేడియోవార్తలు తగ్గుస్థాయిలో విన్నారు. "ఎలాగయినాసరే ఆగస్టు 42 విప్లవాన్ని జరిపించాల్సిందే. జపాన్ వస్తోంది. అది ఇంగ్లీషువాళ్ళని తలక్రిందులు చేస్తుంది. అదేసమయంలో

భారతదేశం స్వతంత్ర్యం అవుతుంది. దెబ్బలు తింటున్న ఇంగ్లీషువాళ్ళకి ఇంకా వత్తిడి కలిగించి మనం మనరాజ్యాన్ని లాక్కోవాల్సివుంది. ప్రభుత్వానికి సహాయం చేయవద్దని ప్రజలకు తెలియజెప్పండి. ప్రభుత్వానికి సైన్యంకోసం, రేషన్‌కోసం ధాన్యం ఇవ్వద్దని రైతులకు చెప్పండి. దీనివల్ల ప్రభుత్వానికి విరుద్ధంగా అలజడి జరుగుతుంది. ప్రజల తిరుగుబాటు, జపాను దాడి, వీటిమధ్యన ఇంగ్లీషుప్రభుత్వం అంతమైపోతుంది. గ్రామాలలో ఆందోళన చేయండి. ఒకవేళ గ్రామాలనుంచి మిల్లులకు ముడిసరుకు, సైన్యానికి ధాన్యం అందకపోతే ఇంగ్లీషుప్రభుత్వం వారం రోజులుకూడా నిలువలేదు' అని రేడియోలో సమాజవాదీనాయకులు సలహా ఇచ్చారు.

'సైగాన్' రేడియోనుంచి సుభాష్‌బాబు చెప్పిన సందేశం వినిపించింది— 'భారతదేశంలోని కోటానుకోట్ల గ్రామీణప్రజలు ఈ సమయంలో విప్లవమార్గాన్ని చూపించే యువనాయకులకోసం నిరీక్షిస్తున్నారు. భారతదేశవాసులైన పోలీసుల లోనూ, సైన్యంలోనూ ఈ సమయంలో ఇంగ్లీషువాళ్ళకు వ్యతిరేకంగా ద్వేషము, విరోధము అనే అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి. వాళ్లు ప్రజల తిరుగుబాటు ప్రారంభించటంకోసమే నిరీక్షిస్తున్నారు....'

దారుణమైన పరిస్థితులలో భయంకరమైన ఘర్షణ జరుగుతోంది. దేశం అదృష్టం ఎలావుందో నిర్ణయం జరిగేసమయం ఇది. కాని ఢిల్లీనగరవాసులు మటుకూ నిరాశతో తలవంచుకుని వున్నారు. అంతా మరచిపోయి ఏదో ఒకవిధంగా కాలక్షేపం చేస్తున్నారు. బజారులలో డబ్బులు ఎక్కడనుంచి వర్షిస్తున్నాయో ఎవరికీ తెలియదు. రూపాయివిలువ పడిపోయింది. రూపాయలు ఉత్తినే దొరుకు తున్నాయా అన్నట్లుగా ప్రజలు డబ్బు ఖర్చుపెడుతున్నారు. కుంభోత్సవసందర్భంలో పుణ్యస్థలాలవద్ద గుంపులు గుంపులుగా చేరినటు సినిమాహాలులదగ్గిర ప్రజలు గుమి కూడుతున్నారు.

అర్జునలాల్, ధనసింగ్‌లకు ప్రభుత్వం దండనముందు తలవంచుకుని నిల బడే ప్రజలమీద అసహ్యంగావుంది. 'ఆజాద్ హింద్' రేడియో వినిపించిన సందేశంవిని వాళ్ళహృదయాలు ఆనందంతో పరవశించిపోయాయి. గ్రామాలలోకి

వెళ్ళి విప్లవానికి సంబంధించిన కార్యక్రమం నడిపించడానికి వాళ్లు నిశ్చయించు కున్నారు.

'గ్రామంలో పనిచేయడం ఎక్కువ తేలికగావుంటుంది. అక్కడే పని చేయాల్సిన అవసరంకూడా వుంది. భారతదేశపు గ్రామాలలో ఇంకా మానవత్వం, మన ప్రాచీనసంస్కృతి మిగిలివున్నాయి. రైతులలో అతిథి-సత్కారం చేయా లన్న మర్యాదకూడా వుంది. అందరూ తమ తమ పొట్టలు నింపుకునేటటువంటి పట్నవాసపు పరిస్థితి అక్కడలేదు. ఎక్కడికివెళ్ళినా రెండురొట్టెలు, గ్లాసుడు మజ్జిగా తప్పక దొరుకుతాయి' అని అర్జునలాల్ చెప్పాడు. అతను ఢిల్లీ చుట్టుపట్ల ఆందోళనల ఉద్యమాలలో పనిచేశాడు. ధనసింగ్‌కు తమ గ్రామజీవిత అనుభవాల్ని వినిపిస్తున్నాడు. మారువేషాలలో పోలీసులు వాళ్లని వెంబడించలేకపోయారు. అందుచేత వాళ్ళు రాత్రిపూట మధురవెళ్ళేబండిలో ఢిల్లీనుంచి వెళ్ళిపోయారు. హథరస్‌జిల్లాలోవున్న గ్రామానికి వెళ్ళాలని వాళ్ళ ఆలోచన. ఆ గ్రామంతో అర్జునలాల్‌కు కొద్దిగా పరిచయం వుంది.

అర్జునలాల్ కొద్దిరోజులు హథరస్ బజారులో షాహుకారువద్ద గుమాస్తాగా పనిచేసి వున్నాడు. అతనికి వ్యవసాయంలో అభిలాష వుంది. ధనసింగ్‌ను తీసు కుని ఆ బజారుకు వెళ్ళాడు. ధాన్యంవచ్చే ఋతువు కాకపోయినా కాని సంతబజారు చాలా హడావుడిగా వుంది. ప్రభుత్వ ఏజంట్లు ధాన్యం కొంటున్నారు. నగరంలోని బోకు వ్యాపారస్థులు వాళ్ళకన్నా ఎక్కువధరఇచ్చి కొంటున్నారు. పట్టణాలలో రేష నింగ్‌కోసం, సైన్యంకోసం ఏ ధరమీద ధాన్యం దొరికితే ఆ ధరమీద ప్రభుత్వం కొనేస్తుంది. ఇవిగ్రహించి గాదెలలో నిలవవుంచుకునే జనం సరుకులు ఎగబడి కొంటున్నారు. వైశాఖ, జ్యేష్ఠమాసాలబేరం ఇంకా ఎక్కువయేట్లుగా వుంది. కాంగ్రెసుప్రభావంచేత ప్రజలు ప్రభుత్వానికి సరుకులు ఇవ్వటంలేదు అన్న వదంతి పుట్టింది. అందుచేత ప్రభుత్వం గ్రామాలలో ప్రభుత్వాధికార్ల చే ధాన్యం కొని పిస్తోంది. 'ఇప్పుడు గ్రామంలోకివెళ్ళి ప్రభుత్వానికి ధాన్యం ఇవ్వడానికి వ్యతిరేకంగా ప్రచారం చేయాలి. ప్రభుత్వానికివచ్చే డబ్బురాబడి తగ్గిపోవాలి' అని అర్జునలాల్ అన్నాడు. అర్జునలాల్, ధనసింగ్‌లు సిధేరా గ్రామంవైపు వెళ్ళారు. వాళ్ళిద్దరూ తెల్లవారుఝాముననే కాలినడకన బయలుదేరారు. పొలాలలో పైరు మోకాళ్లవరకు

పెరిగివుంది. విస్పారమైన రోడ్లదుమ్ము పైకి లేస్తూంది. చలికాలపు ఎండ దుర్భరంగా లేదు. కాని దాహంవేసి గొంతు ఎండిపోతోంది. వాళ్ళిద్దరూ చెరుకుపొలాల్లో నుంచి కాలిబాటమీదుగా సిధేరావైపు వెళ్తున్నారు. ఎదురుగా తలపాగా చుట్టుకున్న ఒకరైతు వస్తూ, కనిపించాడు.

రైతు కొత్తవాళ్ళనిచూసి. 'ఏయ్ బస్తీవాళ్ళల్లారా, ఎక్కడికి వెడుతున్నారు!' అని అడిగాడు.

'గ్రామానికి వెళుతున్నాం' అర్జునలాల్ సమాధానం ఇచ్చాడు.

'అలాగే కనిపిస్తావుంది, ఎవరికాడకి ఎల్తావుండారు? ఎవరు మీరు?' రైతు కోపంగా అడిగాడు.

'తాతా కోప్పడతావెందుకు! నీ గుమ్మందగ్గరకే వచ్చి కూర్చుంటామని అనుకో. మావాళ్లెవరూ, పరాయివాళ్లెవరూ! కాంగ్రెసు మనుష్యులం. దేశం పరిస్థితిగురించి చెప్పటానికి వచ్చాం' అన్నాడు అర్జునలాల్.

రైతు చేతికర్ర పైకెత్తి వెళ్ళిపొమ్మని సౌంజ్ఞచేస్తూ, 'తిరిగివెళ్ళిపో. ఏడనుంచి వత్తుండావో, అడకే ఎల్లు. లేకపోతే నీ తల ఖూనీలకు ఇత్తవ్. చాలామందిని సూశాం. నీలాగా టోపీలెట్టకుని కాంగ్రెసులమని చెప్పుకునేవాళ్లని. గ్రామాలన్నిటినీ దోచుకుని తినేశారు. ఇయ్యాళ రైతుగాళ్లకు ఎక్కువ వెలమీద నాలుగుపైసలొస్తున్నాయని దాన్ని అందకుండా ఎత్తుకుపోవటానికి వచ్చావ్. తిరిగి ఎళ్ళిపో! తల పగలగొడతాం. ఊళ్ళో అడుగుపెట్టావంటే' అని బెదిరించాడు.

అర్జునలాల్‌కి ఆశ్చర్యం, భయం కలిగాయి. అయినాకూడా ధైర్యం తెచ్చుకుని 'తాతా కోప్పడతావెందుకు! ఎనిమిదిమైళ్లు కాలినడకన నడిచివచ్చాం. ఎక్కడైనా ఒక చెంబునిండా నీళ్ళన్నా తాగనివ్వు. ఆకలికూడా వేస్తూంది. రెండురొట్టెలు తిని వెళ్ళిపోతాం. కోపం వస్తోందికదా, అందుకని ఉపన్యాసాలేమీ ఇవ్వము' అని ప్రాధేయపడ్డాడు.

ముసలాడు ఏమాత్రం ఒప్పుకోలేదు. 'గ్రామంవైపు కదిలావంటే కాళ్ళిరక్కొట్టేస్తా మంతే!' అని మళ్ళీ బెదిరించాడు. కర్ర వూగిస్తూ, 'వెళ్ళిపో తూర్పున

వున్న 'మసురియా'లోకి. అక్కడ నీలాంటి కాంగ్రెసాళ్ళు చాలామంది వున్నారు' అని ఆగ్రహం ప్రకటించాడు.

అర్జునలాల్ ఎంత బ్రతిమలాడి ప్రార్థించినాకూడా ముసలాడు వాళ్ళని గ్రామంవైపు వెళ్లనీయకపోయేసరికి తిరిగిపోవలసి వచ్చింది. కాలిబాటమీదుగా మైళ్ళకొద్దీనడిచి రోడ్డుమీదకు వచ్చారు. గుర్రపుబండీ ఎక్కి జలేసర్ చేరారు. గ్రామంలో ఏదో కొంచం దొరికింది తిన్నారు. రాత్రి ధర్మశాలలో గడిపారు. రెండోరోజు మళ్ళీ మధ్యాహ్నం కొంచంతిని గ్రామానికి వెళ్ళటానికి బయల్దేరారు. సాయంకాలం అవుతూవుండగా జగ్‌వాడాకు చేరారు. అక్కడకూడా ఒక లాఠీ పట్టుకున్నవ్యక్తి వాళ్ళకి గ్రామం పొలిమేరలలోనే స్వాగతం ఇచ్చాడు. అతను ఇరవైరెండేళ్ల యువకుడు. 'మేము ఇల్లూ, వాకిలీ వదిలిపెట్టి మీకోసమే కష్టాలు పడుతున్నాం. గ్రామంప్రజలు స్వతంత్రులు కావాలి. రైతులకు ఏవిధమైన భూమి శిస్తు ఇవ్వాల్సిన అవసరం వుండకూడదు. జమీందారుల దుండగాలు అరికట్టాలి. నువ్వు మా తలలే పగలకొట్టడానికి తిరుగుతున్నావు!' అని అర్జునలాల్ ఆ యువకుడికి నచ్చజెప్పాడు.

ఆ యువకుడు కొంచం మెత్తపడ్డాడు—'రోడ్డు దాటినతర్వాత పొలాలలో గుడిసె వుంది. అందులోకివెళ్ళి దాక్కోండి, చీకటి పడినతర్వాత వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం. ఈ సమయంలో గ్రామంలోకి వెళ్ళావంటే గొడవ జరుగుతుంది. ఆగ్రా దగ్గరగా కొన్ని లయిన్లు గియిన్లు పెళ్ళగించివున్నాయి. గొడవ జరిగింది. అప్పటినుంచి తహశీల్దారుగారు గ్రామంవాళ్ళతరపునే కాపలా ఏర్పాటు చేశారు. ఇతరప్రాంతంమనిషి ఎవరైనావస్తే గ్రామంలో ప్రవేశించనీయరు. గ్రామంలో ఎవరైనా పరాయివ్యక్తినిచూస్తే పోలీసులు తిష్ఠవేసుకు కూర్చుంటారు. గ్రామంమీద జరిమానా పడుతుంది. ప్రజలంతా భయపడుతున్నారు' అన్నాడతను.

యువకుడు రాత్రయినతర్వాత ఒక చెంబు పట్టుకునివచ్చాడు. శాలువలో నుంచి రెండురొట్టెలుకూడా బయటకుతీసి వాళ్ళిద్దరికీ ఇచ్చాడు. చెంబులో పాలున్నాయి. 'రాత్రిపూట ఆరుబయటకు వెళ్లాలన్న వంకపెట్టి చెంబు చేతిలో పట్టుకుని వచ్చాను. లయినుమీద రాత్రిపూట టూండలానుంచి సైనికులు గస్తీ తిరుగుతారు. తూర్పువైపున ఎక్కడెక్కడయితే లయిను పెళ్లగించారో, ఏ ప్రాంతంలో

ప్రజలు పోలీసులని బాధపెట్టారో, అక్కడ ప్రభుత్వం గ్రామాన్ని తుడిమట్టం చేసింది. ప్రజలు భయంతో వణుకుతున్నారు. రైతుసభకు సంబంధంచిన ఎర్ర జండావాళ్ళు ఇద్దరుమనుషులుకూడా వచ్చారు. వాళ్ళని ప్రజలు చుట్టుముట్టి పోలీసుల వశం చేశారు.' అని ఆ యువకుడు చెప్పాడు.

అర్జునలాల్ ఆ యువకునికి నచ్చజెపుతూ ఇలా అన్నాడు:—'ఇప్పుడు భయ పడాల్సిన అవసరంలేదు. దేశం స్వాతంత్ర్యాన్ని పొందేసమయం వచ్చేసింది. జపాను నేతాజీగారికి సహాయం చేస్తోంది. నేతాజీ హిందూదేశం సరిహద్దుదగ్గిరకి ఆజాద్-హింద్ సేనను తీసుకునివచ్చి చేరారు. మీరు ప్రభుత్వానికి ధాన్యం ఇవ్వడం పూర్తిగా ఆపుచేయండి.'

యువకుడు మధ్యలో అందుకున్నాడు. 'అయ్యా. ఎర్రజండాలు పట్టుకునే రైతు-సభ ప్రజలు పాతరలు నింపుకునే కోమట్లకు ధాన్యం అమ్మద్దని చెపుతున్నారు. ఈ బీదవాళ్ళ పొట్టలు కొడుతున్నారు. వీళ్ళు బెంగాలుని ఆకలితోమాడ్చి చంపారు. సైనికులు తమ దేశాన్ని రక్షించుకునేందుకు జపానువాళ్లతో పోట్లాడుతున్నారు. వాళ్ళకోసం ప్రభుత్వానికి ధాన్యం అమ్మ అని అంటారు. ధాన్యం ఇవ్వకపోతే పట్టణంలో కూలివాళ్ళు ఆకలితో చచ్చిపోతారు. బట్టలు, ఇతరవస్తువులు తయారు చేసేదెవరు?'

'ఎర్రజండావాళ్ల కమ్యూనిస్టు రష్యాకు సంబంధించిన లంచగొండులు. రష్యా ఇంగ్లీషువాళ్ళతో కలిసిపోగానే ఎర్రజండావాళ్ళుకూడా ప్రభుత్వంతో కలిసి పోయారు. జపానువాళ్ళు మన మిత్రులు. హిందూదేశం స్వాతంత్ర్యంపొందాలని ఆ దేశం నేతాజీకి సహాయం చేస్తోంది. ఇంగ్లీషువాళ్ళు ఇప్పుడు వెళ్ళటానికి ప్రయత్నం చేస్తున్నారు. అందుచేతనే వాళ్ళు దేశంనుంచి వెండి, బంగారాలంతా పోగుచేసి తీసుకుని, వట్టి పనికిరాని నోట్లని వాడకంలోకి తెచ్చారు. ఆ నోట్లు తీసుకుని ప్రభుత్వానికి ధాన్యం ఇచ్చావంటే చిల్లిగవ్వకూడా చేతికి దొరకదు. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళిపోతే వాళ్ళనోట్లు చింపిరికాగితాలుగా తయారైపోతాయి. మనదేశానికి సంబంధించిన సైనికులు కాంగ్రెసుతో కలిసిపోయారు. నేతాజీతో కలిసి అయిదులక్షల మంది హిందూదేశపు సైనికులు ఇంగ్లీషువాళ్ళకి వ్యతిరేకంగా పోట్లాడుతున్నారు.

గ్రామప్రజలు ఎదుర్కోవటం ప్రారంభిస్తే వాళ్లు ఆ ఆయుధాన్ని తీసుకుని అటు వైపు కలిసిపోతారు' అని అర్జునలాల్ అన్నాడు.

అది హేమంతఋతువు. ఆ గుడిసె కప్పుకింద సరియైన దుస్తులు లేకుండా. చలిరాత్రి గడపడం చాలాకష్టం. 'రాత్రికి నాలుగవయామున హథారసేనుంచి బండి టూండలా వెళ్తుంది. రోడ్డువోవనవెళ్తే మీర్‌వాలా స్టేషను మూడుమైళ్ళువుంటుంది. రోడ్డు రైలులైను పక్కగా వెళుతుంది. అనేకమంది ప్రయాణీకులు ఆ బండిఎక్కి టూండలా వెళుతారు. చీకటిరాత్రులేకాని అర్ధరాత్రి దాటితే చంద్రుడు బయటకు వస్తాడు. ఇక్కడనుంచి ప్రయాణీకులు బయల్దేరుతారు. మీరుకూడా వాళ్ళతోకలిపి వెళ్ళండి' అని యువకుడు సలహా ఇచ్చాడు.

ఆ యువకుడు వెళ్ళిపోయినతర్వాత అర్జునలాల్ కొంత నిరాశ చెందాడు. అలసటచే అతనిశరీరం తూట్లుతూట్లుపడినట్లు బాధగావుంది.—'ఇక ఇప్పుడు మనం కాన్పూరు వెడదాం. అక్కడవాళ్ళని కలిసినతర్వాతే ఏదో ఒకటి నిశ్చయం చేద్దాం' అని అతను ధనసింగ్‌తో చెప్పాడు.

చీకటి బాగా దట్టంగా అలుముకుంది. చలి బాగా తీవ్రంగా వుంది. అర్జునలాల్, ధనసింగ్ నెమ్మదిగా మాట్లాడుకుంటూ స్టేషనువైపు వెళ్ళే ప్రయాణీకుల కోసం నిరీక్షిస్తున్నారు. అర్ధరాత్రి దాటినతర్వాత రోడ్డుమీద ప్రయాణీకుల అడుగుల చప్పుడు వినిపించింది.

ధనసింగ్ వెళ్లటానికి హడావిడిగా లేచి నిలబడ్డాడు—'ఆగు' అర్జునలాల్ అరిచాడు. 'మనల్ని ఇలా గుడిసెలోనుంచి బయటకువస్తూండగా చూసి దొంగలు అనుకుని అరవచ్చు, కర్రతెచ్చి కొట్టినా కొట్టచ్చు, వీళ్ళని ముందు వెళ్ళిపోనీ, మనం వీళ్ళవెనకాల వెళ్దాం.'

రోడ్డుమీద నలుగురు ప్రయాణీకులు వస్తున్నారు. ముగ్గురు మగవాళ్ళు. వాళ్ళతోపాటు ఒకస్త్రీ వుంది. ఇద్దరు మొగవాళ్ళు చలినుంచి కాపాడుకోవటానికి బూడిదరంగు రజాయిలు కప్పుకున్నారు. ఒకళ్లు తెల్లరంగు దుప్పటి. స్త్రీకూడా ఏదో రంగుబట్ట కప్పుకుంది. వాళ్ళకు ఇరవై-పాతిక అడుగులవెనుకగా, చప్పుడు చేయకుండా అర్జునలాల్, ధనసింగ్‌లు రోడ్డుమీదకు వచ్చారు. ఇద్దరూ ఢిల్లీనుంచి

బూడిదరంగులోవున్న మెత్తనిశాలువలు వెంట తెచ్చుకున్నారు. అవే కప్పుకున్నారు.

హేమంతఋతువు పొగమంచుతో నిండిన ఆకాశంలో నక్షత్రాలు అక్కడక్కడా మిణుకుమిణుకుమంటున్నాయి. రోడ్డుమీద దట్టమైన చీకటి వ్యాపించింది. ఆ చీకట్లో చెట్లు ఇంకా నల్లగా అగుపిస్తున్నాయి. పైన సన్నని పొగమంచు వ్యాపించడంవల్ల కింద రోడ్డుమీద ధూళి కొంచం బూడిదరంగులో వున్నట్లుంది. రోడ్డుపక్కనవున్న చిన్నచిన్న పొదలుకూడా స్పష్టంగా కన్పించటంలేదు. అర్జునలాల్, ధనసింగ్‌లకన్నా ముందుగానడిచే ప్రయాణీకులుగూడా అస్పష్టంగా నీడలులా కదులుతున్నారు. తెల్లని ముతకదుప్పటి కప్పుకున్నమనిషి, ఓ ఎత్తైన స్తంభం ముందుకు కదిలి వెడుతున్నట్లుగా అనిపించాడు. ఆ స్తంభం సరిహద్దు సూచిస్తున్నట్లుగా వుంది.

చలికాలపు తీవ్రతనుంచి తమదృష్టిని మరల్చుకోవటంకోసం అర్జునలాల్, ధనసింగ్‌లు తమలో తాము మాట్లాడుకుంటూ వెళ్తున్నారు. ఇంతలో అర్జునలాల్ 'వాళ్ళెవరూ?' అని అడిగాడు. రోడ్డుకు ఎడమవైపున నేలకన్నా ఎత్తుగావున్న ఓ దిబ్బమీద రైలులైను వుంది. ఆ లైనుమీదనుంచి కొన్నినీడలు రోడ్డువైపు దిగుతూ కనిపించాయి.

ధనసింగ్ అర్జునలాల్ చేతులు పట్టుకుని—'సైనికులులా కనిపిస్తున్నారు' అన్నాడు. వాళ్ళిద్దరూ రోడ్డుపక్కనవున్న ఒక చెట్టుక్రింద నీడలోనుంచి నడుస్తున్నారు. 'లైనుమీదకు పద' అన్న సైనికుల తిట్లు, బెదిరింపులు వినిపించాయి.

అర్జునలాల్, ధనసింగ్‌లు చెట్టునీడలోనే నిల్చునిపోయారు. తర్వాత ఒక పెద్ద పొదచాటుకు వెళ్లారు. రైలులైను రోడ్డునుంచి నలభై అడుగులకన్నా ఎక్కువ దూరంలేదు. ముందు ప్రయాణీకులు, వాళ్ళవెనుక సైనికులు లైనువైపు వెళ్ళసాగారు. వాళ్ళు లైనుమీదకు వెళ్లారో, లేదో అతివేగంగా తుపాకులు ప్రేలిన శబ్దాలు వినిపించాయి. మూడు తుపాకీగుళ్ల పేలాయి. కేకలు వినపడ్డాయి. ఆ తర్వాత రెండుగుళ్ళు మళ్ళీ పేలాయి.

అర్జునలాల్, ధనసింగ్‌లు ఊపిరి బిగబట్టి, పొదవెనుక దాక్కుని, ఒకళ్ళ భుజాలు ఒకళ్లు పట్టుకుని, దడదడలాడే హృదయాలతో, కళ్ళు పెద్దవిచేసుకుని

చూస్తున్నారు. ఏడుస్తున్న శబ్దం వినిపించింది. అది ఆ స్త్రీగొంతు. సైనికుల నవ్వులు వినిపించాయి.

ఒక సైనికుడు బిగ్గరగా పరిహాసంచేసి 'దుర్మార్గురాలా! ఎందుకు ఏడుస్తున్నావ్? నీకోసం అంబోతుల్లాంటి అయిదుగురం మొగాళ్ళం సిద్ధంగా వున్నాం. మెదలకుండా వుండు. గొడవచేశావంటే ప్రభుత్వం తుపాకీగుండు ఇంకొకటి పేలుతుంది' అని తూర్పు పంజాబీభాషలో అన్నాడు.

రెండవసైనికుడు ఇంకా బిగ్గరగా నవ్వాడు.

అర్జునలాల్ సైనికుల మాటలను అర్థం చేసుకోలేకపోయాడు. ధనసింగ్ అటుపైపు చెవులుపెట్టి అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేశాడు—'అరేయ్, అనవసరంగానే ప్రయాసపడ్డాం. ముగ్గురికి దగ్గరాకలిపి పదిహేసురూపాయలు బయట పడ్డాయి' అని మాట్లాడుకుంటూ సైనికులు నవ్వుతున్నారు.

ఒకడు బిగ్గరగా మాట్లాడటం వినిపించింది—'ఏను తమ్ముడూ, ఈ డబ్బు కొల్లగొట్టి సంపాదించినది. ఖుర్షేద్ దగ్గర దాచివుంచు. రేపు ఖుర్జానుంచి అయిదు సీసాలు వస్తాయి.'

ఇంకొకడు తిట్టి—'ఈ అమ్మాయిని ఇక్కడి లయినుమీద పడేయ్. దీనితో కొంత సమయం గడుస్తుంది' అని చెప్పాడు.

'అరేయ్ నా కొడుకుల నడుములు వెతుకు. వీళ్ళ నడుములో డబ్బులు కట్టుకుంటారు.'

సైనికులు ఆ స్త్రీనిగురించి అశ్లీలమైన పరిహాసం చేయసాగారు. ఒక సైనికుడు అగ్గిపుల్ల వెలిగించి పైకి ఎత్తాడు. పెదిమలమధ్య సిగరెట్టు పట్టుకునివున్న అతనిముఖం ధనసింగ్‌కు అత్యంతభయంకరంగా కన్పించింది. అతను తర్వాత మిగిలిన సైనికులకుగూడా సిగరెట్లు ఇచ్చాడు. సైనికులు సిగరెట్టుదమ్ములు పీల్చటం మొదలుపెట్టారు. చచ్చిపోయిన మనుష్యుల చితులమీద నిప్పురవ్వలు పడి అంటుకుని కాలుతున్నట్లుగా వుంది.

చెట్లకొమ్మలు కాంతివంతం కాసాగాయి. రైలులైను ఎత్తుగా వుంది. దాని మీద నిలబడ్డ సైనికులముఖాలు ఆ వెలుగులో కనిపించసాగాయి. ఒక సైనికుడు

తన రైఫిల్‌ను నేలమీదపడేసి, పోట్లాడుకుంటున్న ఇతర సైనికులకన్నా గొంతెత్తి 'పోట్లాట ఎందుకు? లాటరీ వెయ్యి. ఎవడినంబరు వస్తుందో!' అన్నాడు.

వెన్నెల సైనికులమీద పడుతోంది. వాళ్ళదుస్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఒక సైనికుడు తన రైఫిల్‌ను లైనుకు ఆనించిపెట్టాడు. దెబ్బతినిపడివున్న ఇద్దరు గ్రామస్థుల శరీరాలమీదనుంచి రజాయిలుతీసి అతను లైనునుంచి దిగి ధనసింగ్, అర్జునలాల్ దాగివున్న పొదవైపునడిచి రాసాగాడు. వాళ్ళిద్దరూ శ్వాస బిగబట్టి తలలు వంచుకుని కూర్చున్నారు.

పొదలమధ్యన ఖాళీచోటులో సైనికుడు ఒకదానిపైన ఒకటి రజాయిలు పరిచాడు. తిరిగివెళ్ళి లైనుదగ్గర చేతులలో ముఖం దాచుకుని కూర్చునివున్న స్త్రీ చేతులు పట్టుకుని అక్కడికి లాక్కురావటం మొదలుపెట్టాడు.

స్త్రీ చేతులువిడిపించి ఏడవసాగింది. సైనికుడు బిగ్గరగానవ్వుతూ తిట్టాడు, 'ఇప్పుడే కాల్చిపారేస్తాను....' అని బెదిరించాడు. రెండవసైనికుడు ఆ కొత్త తిట్టుతోబాటు నవ్వు కలిపాడు.

సైనికుడు ఆ స్త్రీని చేతులతో పట్టుకులాగి రజాయిలు పరిచివున్నచోటికి తీసుకువచ్చాడు. వెన్నెలతో ఆ స్త్రీ చెక్కిళ్ళమీదకు కారిపోతున్న కన్నీళ్ళు కనిపిస్తు న్నాయి. సైనికుడు ఏడ్చే ఆ స్త్రీని చేతులమీదవేసుకుని ఎత్తుకొచ్చి పొదలమాటున పరచివున్న రజాయిలమీద పడేశాడు. ఆ స్థలం అర్జునలాల్, ధనసింగ్‌లకు మూడు అడుగులదూరంలోమాత్రమే వుంది. స్త్రీ వెక్కివెక్కి ఏడవటం, సైనికుడు వాగే వాగుడు వాళ్ళిద్దరిచెవులకు వినిపిస్తూనే వున్నాయి.

మంచుతోగూడి సర్ సర్‌మని వీచే గాలిలోకూడా ధనసింగ్ శరీరం చెమటతో తడిసిపోయింది. వాళ్ళకు వినిపిస్తుందన్నభయంతో అతను అర్జునలాల్‌తో ఏమీ చెప్పలేకపోతున్నాడు. శరీరంలో భరించరాని వ్యాకులత, కోపం, దుఃఖం కలుగుతున్నాయి. ఊపిరి ఆడటం లేదు. అతను అర్జునలాల్ భుజం నొక్కాడు. అర్జునలాల్ చూపినమీదట అతను సైనికునివైపు సౌంజ్ఞచేసి తన గొంతు రెండు చేతులతోనూ పట్టుకుని సిపాయిని చంపటానికి, ఆ స్త్రీని విడిపించడానికి ప్రయత్నిద్దామని సౌంజ్ఞచేసి చెప్పాడు.

లయనుమీద నుంచునివున్న సైనికులు బిగ్గరగా అరుస్తూ అశ్లీలకరమైన పరిహాసం చేస్తున్నారు-'అరేయ్ పెళ్ళికొడకా. మా వంతుకూడా వస్తుందని గుర్తు పెట్టుకో. జాగ్రత్త! మొదట అందరం ఒక్కొక్కసారి వెళ్దాం! తొందరగా కానియ్య. లేకుంటే వచ్చి నీ నడుంమీద ఒక్కదెబ్బ వేస్తాం!'

అర్జునలాల్ వారివైపు చూపించి తుపాకులు కాలుస్తాన్న సౌంజ్ఞచేసి-'వాళ్లు గుళ్లు పేలుస్తారు' అని చెప్పాడు.

స్త్రీని పట్టుకుని తీసుకొచ్చిన సైనికుడు తిట్లు తిడుతూ లేచినిలబడి పంట్లాము నడుంమీదకు లాక్కుంటూ లయనువైపు వెళ్ళిపోయాడు. అటునుంచి రెండవసైనికుడు 'నావంతు' అని అరుస్తూ ఈవైపు పరుగెత్తుకువచ్చాడు. ఇదే విధంగా ఒకరితర్వాత ఒకరుగా అయిదుగురు సైనికులు వచ్చారు. స్త్రీ కేకలు, అయ్యో-అయ్యో అన్న అరుపులు హీనస్వరంలో వినపడుతున్నాయి.

అయిదవవ్యక్తి ఇంకా తిరిగివెళ్ళలేదు. ఇంతలో లైనుమీద నుంచునివున్న సైనికులు బిగ్గరగా అరిచారు—'అరేయ్ కాసిమ్, గస్తీ వస్తోంది. తొందరగా రా!'

లైనుమీద తూర్పువైపు నక్షత్రంలా ఓ పెద్దకాంతి వెలిగింది. అతివేగంగా టార్చిలైటు కోణాలు వ్యాపిస్తూ ముందుకు వస్తున్నాయి.

కాసిమ్ పంట్లాము సర్దుకుంటూ లైనువైపు పరుగెత్తుకువెళ్లాడు. సైనికులు తమతమ బ్రాంకెట్లు, సంచులు తగిలించుకోవటం మొదలుపెట్టారు. కొద్దినిముషాల తర్వాత లైనుమీదకు ఒక ట్రాలీవచ్చి ఆగింది. అయిదుగురు సైనికులూ ఉత్సాహంగా లైనులో నిలబడి ట్రాలీపైనకూర్చున్న ఆఫీసర్లకు సెల్యూట్ చేశారు.

ట్రాలీనుంచి ఇద్దరు ఆఫీసర్లు దిగారు. ఒకతను ఆంగ్లేయుడు, రెండో అతను భారతీయుడు. ఇద్దరు ఆఫీసర్ల చేతుల్లోనూ పెద్దపెద్ద టార్చిలైట్లు వున్నాయి. టార్చివెలిగించి ఆఫీసర్లు తమలోతాము మాట్లాడుకున్నారు.

భారతీయ ఆఫీసరు సైనికులని 'ఏం పోట్లాట జరిగింది?' అని అడిగాడు.

ఒక సిపాయి అడుగు ముందుకువేసి 'అయ్యా, ఈ దుర్మార్గులు లైను అతుకులు ఊడతీస్తున్నారు. మేము అక్కడికి రౌండుమీద వెళ్లాం. ఒక స్తంభం చాటునుంచి తుపాకీగుండు కాల్చాం' అని చెప్పాడు. ఇంగ్లీషు ఆఫీసరు టార్చివెలుగును

లయనుకు చుట్టుపట్ల వేసిచూస్తున్నాడు. టార్చి వెలుగు ధనసింగ్, అర్జునలాల్‌లు దాక్కునివున్న పొదలవైపు పడింది. ఆ టార్చిలైటు కిరణాలు వాళ్ళకళ్ళల్లో ముళ్ళలా గుచ్చుకుంటున్నాయి. వాళ్ళు ఆ పొదల్లో ఇంకా క్రిందగా దాక్కున్నారు. ఇద్దరు ఆఫీసర్లు ఆ పొదవైపు దిగివచ్చారు.

ధనసింగ్, అర్జునలాల్‌ల గుండెలు దడదడలాడుతున్నాయి. ఆంగ్లేయ ఆఫీసరు పొదలచుట్టూ, ఇసుకదిబ్బలచుట్టూ తిరుగుతూ అటువైపునడుస్తూ ముందుకు వస్తున్నాడు. ధనసింగ్, అర్జునలాల్‌ల శరీరాలు చమటతో తడిసిపోయాయి. వాళ్ళనిగూడా లయనుమీదకు తీసుకెళ్ళి తుపాకిగుళ్ళతో హతమారుస్తారని వాళ్ళ కనిపించింది. ధనసింగ్ చేతివేళ్ళతో పిడికిలిబిగించి, ఆఫీసరు వాళ్ళపొదవైపు అడుగువేస్తూనే అతనిముక్కుమీద బలమంతా వుపయోగించి గుద్ది, శక్తినంతా కూడదీసుకుని పారిపోవాలని నిశ్చయించుకున్నాడు. వెనుకనుంచి తుపాకులు కాల్చనీ, అతను ఏమైనా ప్రాణాలు ఒడ్డదలచుకోలేదు.

ఆంగ్లేయ ఆఫీసరు, అతనివెనుకే భారతీయ ఆఫీసరు పొదలవైపు వస్తున్నారు. వాళ్ళ టార్చివెలుగు పొదలనుంచి దాటిపోయి నేలమీద పరచివున్న రజాయిలమీద పడింది. పొదలలో దాగివున్న ధనసింగ్‌కు కనిపిస్తోంది. రజాయిమీద స్త్రీ వెల్లకిలగా పడివుంది. మొద్దునిద్రలో వుందో, స్పృహలేనిపరిస్థితిలో వుందో, లేకపోతే చచ్చిపోయిందోకూడా తెలియటంలేదు. స్త్రీ చేతులు పక్కలకు చాపి వున్నాయి. పావడా నడుమునుంచి పైకి తోయబడి తిరగేసివుంది.

ఆంగ్లేయ ఆఫీసరు స్త్రీ శరీరంమీద దృష్టిపడగానే కళ్లు తిప్పుకున్నాడు. టార్చివెలుగును మరోవైపుకు తిప్పాడు. భారతీయ ఆఫీసరు టార్చి ఆర్పేశాడు. ఇద్దరు ఆఫీసర్లు చర్చించటం మొదలుపెట్టారు. ఆంగ్లేయ ఆఫీసరు బిగ్గరగానూ, కోపంగానూ మాట్లాడుతున్నాడు. భారతీయ ఆఫీసరు అతనికి తెలియపరుస్తున్నాడు.

ఇద్దరు ఆఫీసర్లు తిరిగి వెళ్ళిపోయారు. ఆంగ్లేయ ఆఫీసరు కోపంతో పళ్లు కొరుకుతూ చీదరించుకుంటూ వెళ్ళాడు. వెళ్ళి ఏమీ మాట్లాడకుండా ట్రాలీలో కూర్చున్నాడు. భారతీయ ఆఫీసరు సైనికులనుపిల్చి—'మీరంతా ఇప్పుడే ఒక్కసారి ఇక్కడనుంచి మార్చ్ చేసి స్టేషనుకు వెళ్లండి. లయన్‌ను కాపలా కాయండి.

ఉదయంవెళ్ళే బండిఎక్కి టూండలాచేరి స్టేషన్ ఆఫీసులో రిపోర్టు చేయండి' అని ఆజ్ఞాపించాడు.

ఆఫీసరు జేబులోంచి ఒక నోట్‌బుక్‌తీసి ఏదో వ్రాసి, చీటీ చింపి, ఆ సైనికుల నాయకుడికి ఇచ్చాడు. 'ఈ కాగితం ఆఫీసులో ఇవ్వండి' అని చెప్పాడు. సైనికులు అతినేర్పుగా ఒక వరుసలో నిలబడ్డారు. రైఫిళ్ళు భుజాలమీదకు ఎత్తుకున్నారు. భుజాలు, అడుగులూ కలిపినడుస్తూ తూర్పువైపు వెళ్ళిపోయారు. భారతీయ ఆఫీసరు గూడా ట్రాలీలో కూర్చున్నాడు. ట్రాలీఇంజను గుర్రుమని శబ్దం చేసింది. వేగంగా ముందుకు వెళ్ళిపోయింది.

అర్జునలాల్, ధనసింగ్‌లు పొదలవెనుకనుంచి లేచి నిలబడ్డారు. ముడుచుకుని కూర్చునివుండటంచేత వాళ్ళశరీరంలోని కీళ్ళు కొంతసేపూ కదలలేనిస్థితిలో వున్నాయి. కాళ్ళూ, చేతులూ సాపుచేసుకుని, ఒళ్ళు విరుచుకున్నారు. ఎదురుగా రజాయిమీద న్పృహలేక పడివున్న స్త్రీ కన్పించింది. వాళ్ళతలలు సిగ్గుతో ఒంగిపోయాయి. ఒళ్లు విరుపు ఒక్కసారి ఆగిపోయింది. సంకోచంలో పరస్పరం చూసుకోలేకపోతున్నారు. ఈ దిక్కులేనిదాన్ని ఏం చేయాలి అని వాళ్ల ఆలోచనలో పడ్డారు. ఇలాగే ఎలా వదిలివెళ్తారు? కాని ఆమెవైపు చూడటానికి, ఆమెను తాకటానికి ధైర్యం కలగలేదు.

బొంగురుపోయిన ఆ స్త్రీ కంఠంనుంచి నిట్టూర్పు వినిపించింది. కొద్దిగా మూలిగినధ్వని వచ్చింది. ఆమె పక్కకి వత్తిగిలింది. పావడా సర్దుకుని సిగ్గుతో ముడుచుకుపోయింది. మోచేతి ఆధారంతో మెడ పైకెత్తి నాలుగువైపుల చూసింది.

అర్జునలాల్ ధైర్యంచేసి బాధగా—'చెల్లెమ్మా, పద నిన్ను ఇంటిదగ్గర దిగబెట్టి వస్తాం' అన్నాడు.

ఆమె బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టింది.

అర్జునలాల్ ఆమెను ఓదార్చి, ఇంటిదగ్గర దిగబెట్టటంగురించినమాట మళ్ళీ ఎత్తాడు. కానీ ఆమె తలమీద చేత్తో కొట్టుకుంటూ, 'అయ్యో, నేను చచ్చిపోయాను. ఎక్కడికి వెళ్తాను? నేనుకూడా ఇక్కడే చచ్చిపోతాను. ఆ చచ్చిపోయిన శవాలతోబాటు కలిసిపోతాను' అని వెక్కివెక్కి ఏడవసాగింది.

అర్జునలాల్, ధనసింగ్‌లకు ఏమీ గత్యంతరం లేకపోయింది. ఆ స్త్రీని అలాగే వదిలి వెళ్ళటానికి కాళ్లు కదలటంలేదు. అక్కడే వుంటారా అంటే దేని కోసం! రైనుమీద రైలు వచ్చేవేళ అవుతోంది. విధిలేక, బాధపడుతూనే కళ్ళల్లోకి వుబికివచ్చే కన్నీళ్ళని ఆపుకుంటూ, రోడ్డుమీదకువచ్చి, వేగంగా స్టేషనువైపు నడవ సాగారు. రైలుబండి ముందుభాగంవెలుగు దూరంనుంచే కనిపించింది. వాళ్లు స్టేషనువైపు పరుగెత్తారు. అతి కష్టంమీద రైలుబండిలోకి ఎక్కి కూర్చోగలిగారు.

టూండలా స్టేషనునుంచి సైనికులను తూర్పు పడమరలకు తీసుకువెళ్ళే రెండు స్పెషల్‌ట్రెయిన్‌లు సిద్ధంగా వున్నాయి. ఖాకీదుస్తులు ధరించినవాళ్ళతో స్టేషను నిండిపోయింది. ధనసింగ్‌కు వీళ్ళలో ప్రతిఒక్కరూ దేశాన్ని నాశనంచేసే క్రూరమైన ఘాతకులుగా కనిపిస్తున్నారు. అతనిమనసు కోపంతో వుడికిపోతోంది.

టూండలాలో రైలుబండి గుంపుతో క్రిక్కిరిసిపోయింది. అర్జునలాల్, ధన సింగ్‌లు గుంపులో కలిసిపోయి ఇరుకుగా కూర్చునివున్నారు. ప్రయాణీకులు లోపలికి దూరటానికి ప్రయత్నం చేస్తున్నారు. కిటికీలోనుంచి ఒకతను రెండు మూడుసార్లు పిలిచాడు—'గురూ, ఓ గురూ! అర్జున్ తమ్ముడూ, అరే గుర్తుపట్టా లనికూడా అనుకోవటంలేదా? అరే, నేను మహపూజ్‌ని, మాకోసం చోటువుంచు.'

అర్జునలాల్ చేతినిచాపి మహపూజ్‌ని కిటికీలోనుంచి లోపలికి లాగాడు. మొదటినుంచే కష్టంగా కూర్చునివున్న జనం దానికి అభ్యంతరం తెలపటం మొదలు పెట్టారు. అర్జునలాల్ వాళ్ళని వూరుకోపెట్టేందుకు, 'అరేయ్ తమ్ముడూ ఇత నెవరో తెలుసా, ప్రభుత్వపుమనిషి. కావాలనుకుంటే మనల్నందర్నీ దింపించివేయ గలడు.

'సి. ఐ. డి. అయివుండచ్చు.'

'ఇప్పుడు ఏం చెప్పులతో కొడతారా మిత్రులారా!' మహపూజ్ తన ముఖం మీదపడిన జుట్టును చేత్తో సరిచేసుకుంటూ అన్నాడు.

'ఏమిటి అంటున్నావ్!' అర్జునలాల్ నవ్వాడు. 'ఎప్పుడు వచ్చావ్ దేవలీ నుంచి? ఎలా గడిచింది?'

'అంతా చీకటిగావుంది మిత్రుడా, నాదేముంది, బయట వున్నట్లయితే ప్రభు

త్వంతో పోట్లాడుతూవుండేవాళ్లం. జైల్లోవున్నా పోట్లాడుతూనేవున్నాం. ఇప్పుడు కూడా సి. ఐ. డీ వాళ్లు తరుముకువస్తున్నారు.' చుట్టుపక్కలజనం, ధనసింగ్ అతని మాటలు ధ్యాసగా వింటున్నారు.

అర్జునలాల్ మళ్ళీ నవ్వటం మొదలుపెట్టాడు. 'పోలీసులు అనవసరంగా నీ వెనుక పడ్డారా? నువ్వేమో యుద్ధంలో ఇంగ్లీషువాళ్ళకు సహాయం చేస్తున్నావు. దీన్ని 'పీపుల్స్‌వార్' అంటావు. మహఫూజ్ బిగ్గరగా అన్నాడు 'అలాగనే చెపుతున్నాను. ఇంగ్లీషువాళ్ళకి సహాయం నీ గాంధీఖండాన్ చేస్తోంది. వాళ్ళు కంబళీలు సప్లయి చేస్తున్నారు. మేముమాత్రం జపానువాళ్లచేత ఈ దేశాన్ని రక్షించుకోమని చెబుతున్నాము. యుద్ధం మాని, మా నాయకుల్ని జైలునుంచి వదిలిపెట్టు, మేము స్వయంగా జపానుతో పోట్లాడతాము అని మేమంటున్నాము. ఇంగ్లీషువాళ్ళు మాత్రం దేశాన్ని అనవసరంగా నాశనం చేస్తున్నారు. వాళ్ళు సరిగా యుద్ధమే చేయలేదు.'

రాజనీతికి సంబంధించిన చర్చ ప్రారంభమయింది. అర్జునలాల్ ఉత్తేజితుడై 'యుద్ధంలో ఇంగ్లీషువాళ్ళకు సహాయం చేయమని నువు చెపుతున్నావ్. ఇదుగో విను' అని అతను క్రితంరాత్రి చూసినసంఘటన వినిపించాడు.

ధనసింగ్ మెదలకుండా వింటున్నాడు. హిందూదేశపు సేనలు ఇంగ్లీషువాళ్లతో తిరుగుబాటుచేసి దేశంతరపున పోట్లాడదానికి సిద్ధంగా వున్నాయి అన్న రేడియోలో నేతాజీమాటలు అతనికి గుర్తుకు వస్తున్నాయి. అర్జునలాల్‌గూడా గ్రామంలో ఇదే బోధించి వస్తున్నాడు. ఇదే హిందూదేశపు సేనల దేశభక్తి! అతనిమనసు ఆ చర్చనుంచి కొంతప్రాంతంలో వదిలిపెట్టివచ్చిన సోమామీదకు మళ్ళింది. ఆ రాత్రి నేను ఆ దుర్మార్గులను చంపివుండకపోతే....సోమా గదిలోనే వుండేది. పొరపాటున తలుపు తెరిచివుంటే సోమాకి ఏం జరిగేది?

అంతకుక్రితం రాత్రి జరిగినసంఘటన సమయంలో ఆంగ్లేయ ఆఫీసరుకు, భారతీయ ఆఫీసరుకుమధ్య చర్చ ఇంగ్లీషులో జరిగివుండటంచేత ధనసింగ్ అర్థం చేసుకోలేకపోయాడు. అర్జునలాల్‌వల్ల ఆ సంభాషణవివరాలు తెలిశాయి - ఆంగ్లేయ ఆఫీసరు హిందూదేశపు సైనికుల దుష్ప్రవర్తనకు ఆగ్రహంపొంది వాళ్ళకి

అక్కడే శిక్ష వేయాలని అన్నారు. భారతీయ ఆఫీసరు 'నెలనుంచీ వీళ్ళు ఈ లైను మీదనే పని చేస్తున్నారు. ఒకవేళ వీళ్ళు గ్రామీణులతో సోదరభావం పెంచుకుంటే పరిస్థితి చెయ్యిదాటిపోతుంది. వీళ్లుగూడా తిరుగుబాటు చేసేవాళ్ళతో కలసిపోతారు' అని వాళ్ళని సమర్థించాడు.

మహఫూజ్ అడిగాడుకదా-'ఇదేనా నీ విప్లవపు కార్యక్రమం! ఇప్పుడు చెప్పు!'

ఒక ముసలాయన తల ఆడించి, 'తమ్ముడూ నువ్వు ఏమైనా చెప్పు, ఇంగ్లీషుప్రభుత్వంమాత్రం న్యాయమే చేస్తుంది' అన్నాడు.

మహఫూజ్ అభ్యంతరం పలికాడు. 'ఇంగ్లీషుప్రభుత్వమే ఒకవేళ న్యాయం చేసేదయితే ఇతరుల రాజ్యంమీద ఎందుకు అధికారం చెలాయిస్తుంది? మీలాంటి వాళ్ళబుద్ధి తప్పుదారిన పట్టించటంకోసం మీ ప్రజలమనసుల్లో గౌరవాన్ని, నమ్మకాన్ని ఏర్పరచటంకోసం, అది ఇటువంటిన్యాయం చూపిస్తుంది. మీరు ఇంగ్లీషు వాళ్ళ బానిసకుక్కలై వాళ్ళుచేసే ఉపకారానికి బదులుగా స్వదేశస్థుల నడవడికను అంచనావేసి చూస్తారు. నిజంగా ఏంబుద్ధి మీది! తమని మనుష్యులుగా కాకుండా, ప్రజలమీద దుండగంచేసే ఉద్యోగులుగా భావించేందుకు ఈ సైన్యం ఇటువంటి దుండగాలు కావాలని చేస్తుంది.

మహఫూజ్ అర్జునలాల్ భుజంమీద చెయ్యివేసి—'ఈ సైన్యంమీద నమ్మకం వుండబట్టేకదా మీరు 4౽ లో ఇంగ్లీషువాళ్ళమీద తిరుగుబాటు చేయటానికి వెళ్లారు?' అని అడిగాడు.

అర్జునలాల్ ఇంకొకవిషయాన్నిగురించి మాట్లాడటం మొదలుపెట్టాడు. ఢిల్లీజైలు వృత్తాంతం వినిపించాడు. మహఫూజ్ దేవలీకాంపు వృత్తాంతం వినిపించాడు. ధనసింగ్ మౌనంగా కూర్చున్నాడు.

కాన్పూరులో అర్జునలాల్ మూడురోజులు ధనసింగ్‌ని వెంటేసుకుని తిరిగాడు. కాన్పూరులో అతను తన రాజనైతిక జీవితపు తొలిరోజులు గడిపాడు. కాంగ్రెసుతరఫున మ్యునిసిపాలిటీ ఎన్నికలలో పాల్గొన్నాడు. అక్కడ అతన్ని ఎరుగున్నవాళ్ళు చాలామంది వున్నారు. చాలా నమ్మకంతో అతను కాన్పూరు వచ్చాడు కాని ఆ నమ్మకం నిరాశగా మారిపోయింది.

కాన్పూరులో పోలీసులు పన్నే వల ఢిల్లీకన్నా ఏమీ తక్కువ కాదు. కాంగ్రెసుకు కొద్దిగా అనుకూలురైన కొందరు వ్యక్తులు ఖైదు చేయబడ్డారు. మరికొందరు పరారి అయ్యారు. కమ్యూనిస్టులు కాంగ్రెసువాళ్ళను పట్టిస్తున్నారన్న వదంతిమాత్రం బాగా వ్యాపించిపోయింది. అర్జునలాల్ మోతీదగ్గరకు వెళ్ళాడు. 38 వ సంవత్సరంలో జరిగిన మ్యునిసిపల్ ఎన్నికలలో అతను మోతీకి చాలా సహాయం చేశాడు. మోతీకూడా అప్పుడప్పుడూ కమీషన్‌మీద అర్జునలాల్ పేరుతో ఒకటి-రెండు బేరాలు చేసి, అతనికి కొంత సహాయం చేసేవాడు. అదే ఆధారంతో అర్జునలాల్ నిశ్చింతగావుండి, రాజనీతికి సంబంధించిన పనులుచేస్తూ వుండేవాడు. ఢిల్లీలో రామూదగ్గర మోతీ అడ్రెస్ని కుదిర్చాడు.

మోతీ అప్పటిదేశపు పరిస్థితిని దృష్టిలోవుంచుకుని, అర్జునలాల్‌కు, అతని మిత్రునకు చోటివ్వటానికి తిరస్కరించాడు—'ఎవర్ని చూసినా తెలుస్తుంది మమ్మల్ని ఎలా తినేస్తున్నారో! బజారంతా పూర్తిగా నాశనమైపోయింది. ప్రభుత్వం అన్నీ నాశనం చేసేసింది. మీరు చేయదలచుకుంటే, గ్రామాలలోకివెళ్ళి రైతులను ప్రభుత్వానికి సహాయంచేయకుండా వారించండి. ఇలా సరుకు ఆపటం కాంగ్రెసుకు తగ్గపని కాదు. ఇందుచేతనే గాంధీగారు ఉపవాసం చేస్తున్నారు' అన్నాడు.

అర్జునలాల్, ధనసింగ్‌లు నిరాశచెంది మోతీదగ్గర నుంచి లాహీ-మొహాల్ వెళ్ళేదారిలో నడుస్తున్నారు. తోవలో ఒకరిద్దరు కమిషన్ వ్యాపారస్థులు కలిశారు. వాళ్ళు పట్టణపోలీసుఠాణా సిపాయీలకి పెట్టావుంటారు. కాంగ్రెసుమీద చాటుమాటు సానుభూతిగూడా ప్రకటిస్తారు.

అర్జునలాల్ వాళ్ళని 'నమస్కారమండి' అని పలకరించాడు. వాళ్ళు కొంచం తటపటాయించి, తర్వాత అర్జునలాల్‌ను ధనసింగ్‌నుంచి కొంచం పక్కకి తీసుకు వెళ్ళి, 'మంచివాడివే. నువ్వు ఇలా తిరుగుతున్నావ్. పోలీసులు నిన్ను వెతుకుతున్నారు' అని చెప్పారు.

'నేను ఇక్కడికి మొన్ననే వచ్చాను. ఏం జరగలేదుకదా! ఏమన్నా వారంటు వుందా?' అని అడిగాడు అర్జునలాల్.

'వారంటు లేకపోవచ్చు కానీ, పోలీసుఠాణాలో ఆఫీసుదగ్గర నిన్ను గురిం

చిన చర్చ జరుగుతోంది. నువ్వు పట్టణంలో వున్నావు. కాంగ్రెసుతరఫున సమ్మెలు చేయిస్తూవుంటావు. ఎంతైనా కాన్పూరు నీకు క్షేమంకాదు '

'ఎక్కడికి వెళ్ళిపోను .....? ఇప్పుడే ఢిల్లీ జైలునుంచి వస్తున్నాము.'

'అరే ఎక్కడికైనా వెళ్ళిపో. బొంబాయి వెళ్ళు. మంచిరోజులు వచ్చేంత వరకూ ఏదో రోజుకూలైనా చేసుకో. భగవంతుడున్నాడు. బొంబాయిలో మనకి మా స్వంతమనుష్యులు వున్నారు. వాళ్ళ కమీషన్ వ్యాపారంలో చేరు.'

'మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను' అన్నాడు అర్జునలాల్ అటూ ఇటూ చూసి.

'ఇంటిదగ్గరకుమాత్రం రావద్దు. బొంబాయిలో శేఖ్ మేనన్ స్ట్రీట్ లో 69 వ నంబరు ఇల్లు వుంది. ఆయనపేరు జగ్ జీవన్. నువ్వు కాన్పూరునుంచి వెళ్ళిపో. ఇక్కడి వాతావరణం సరిగాలేదు. తెలిసిందా?' అనిచెప్పి వాళ్ళు ముందూ వెనుకా బెరుగ్గా చూసుకుంటూ వెళ్ళిపోయారు.

అర్జునలాల్ తిలక్ హాల్ దగ్గర ఆగిపోయాడు. ఆ స్థలానికి తిరిగిరాకూడదు. కాని ఎక్కడికి వెళ్ళటం? అని ఆలోచించాడు. సందులలోనుంచి తిరుగుతూ కార్నేల్ గంజ్ లోవున్న పాతస్నేహితుడిదగ్గరకు వెళ్దామనుకున్నాడు. సందు మలుపుదగ్గర గణేష్ కలిశాడు. అతను సైకిలు నెట్టుకుంటూ నడిచివస్తున్నాడు. ఇటువంటిసమయంలో కమ్యూనిస్టుతో కలవటం అర్జునలాల్ కు మంచిదిగా అని పించలేదు. కాని ఎదురయాడు. 'చెప్పు నేస్తం! ఏమిటి విశేషం' అంటూ గణేష్ అర్జునలాల్ ని ఆప్యాయంగా దగ్గిరకు తీసుకున్నాడు.

గణేష్, అర్జునలాల్ ది పాతస్నేహం. ఇద్దరూ 1935 లో జరిగిన సమ్మెల్లో కలిసి పనిచేశారు. మళ్ళీ ఎన్నికలలో ఒకళ్ళకొకళ్ళు ఎదురుగా పోటీకి నిలిచారు.

'చెప్పు సోదరుడా, స్టాలిన్ ఏదైనా ఉత్తరం వ్రాశాడా? ఇప్పుడు ఏ ఫ్రంటుకు మారాలని ఉత్తరువు వచ్చింది?' అనడిగాడు అర్జునలాల్.

'తోడోగారి ఉత్తరం వచ్చింది. ఇంగ్లీషువాళ్ళని వెళ్ళగొట్టి జపానువాళ్ల శాసనాన్ని నెలకొల్పటంలో ఎందరు సోషలిస్టులు, కాంగ్రెసువాళ్ళు సహాయం

చేస్తారో. వాళ్లందరికీ పోలీసులతోబాటు అధికారులుగాగానీ, రేషన్‌షాపు పర్మిట్‌గాని ఇస్తామని ఆయన వ్రాశారు' అని గణేష్ సమాధానం చెప్పాడు.

'కాంగ్రెసువాళ్ళని ఖైదుచేయించిన కమ్యూనిస్టులకు ఇంగ్లీషువాళ్ళు తహశీల్దార్‌గిరి ఇస్తారు. అంతేగా!'

'ఏ వెధవ ఎవణ్ణి ఖైదు చేయించాడు!' గణేష్ అర్జున్‌చేతిని తన చేతిలోకి తీసుకుని నొక్కిపట్టుకుని, చెవిలో రహస్యంగా అన్నాడు—'విన్నంతా సబ్ ఇనస్పెక్టర్ చౌబే పీగురించి అడుగుతూనేవున్నాడు. మాకు అతనితో సంబంధమేముంది! అని మేమన్నాం. అరే అయ్యగారు ఊళ్ళోకి వచ్చేశారు, మీతో కలవరా! అని ఆయన అన్నారు. ఆ రోజుల్లో అయితే వాళ్లు మిమ్మల్ని తిట్లు తిడుతూ వుండేవారు. ఎంతమందిని దేవలీ పంపించారో లెక్కలేదు. పైకిమాత్రం మాకు అందరూ సమానమే అంటూ తప్పించుకుంటారు.'

'ఆ వెధవని తిట్టాం. మేము నిన్ను బాగా ఎరుగుదుము. కమ్యూనిస్టులు కాంగ్రెసువాళ్ళని పట్టిస్తారని నువ్వు అంటావు. కాంగ్రెసువాళ్ళు కమ్యూనిస్టులను పట్టిస్తారని మాతో చెప్తావు. మీ ముఖ్యనాయకుడు ఎక్కడ దాక్కునివున్నాడో చెప్తాను. కలుసుకునే ఏర్పాటు చేస్తాను....కలుసుకుంటావా?' అనడిగాడు.

'ఆ, కలుసుకుంటాం' అన్నాడు అర్జునలాల్. కొంచెం ఆలోచించాడు. ఆయన్ని కలుసుకుని మాట్లాడితే ఒకవేళ మంచిమార్గమేదైనా లభించవచ్చు' అని అనుకున్నాడు.

గణేష్ అర్జునలాల్‌ని రెండు అడుగులు పక్కకి తీసుకెళ్ళాడు. చిరునామా ఇచ్చి, 'అక్కడవాళ్ళ పేరుపెట్టి పిలు. 'తాతగార్ని' కలుసుకోవాలి అని. ఆయనతో పనివుందని చెప్పు' అన్నాడు. అర్జునలాల్ గణేష్ సైకిలు తీసుకున్నాడు. ధనసింగ్‌ని గణేష్‌తోకూడా వెళ్ళమనిచెప్పి అతను రెండోవైపు వెళ్ళిపోయాడు.

ధనసింగ్ గణేష్‌తోకలసి మెదలకుండా సందులు-గొందులు తిరుగుతూ వెళ్తున్నాడు. గణేష్ జేబులోంచి రెండు బీడీలుతీసి 'కామ్రేడ్, బీడీ తాగు!' అన్నాడు. ధనసింగ్‌కు బీడీ ఇచ్చి 'నువ్వు వీళ్లతోనే వున్నావా! ఢిల్లీనుంచే వచ్చావా! ఢిల్లీలో పరిస్థితి ఎలావుంది?' అని అడిగాడు.

'అక్కడ పరిస్థితిగూడా ఇలాగే వుంది. ఇప్పుడు ఇంగ్లీషువాళ్లతో ఎవరూ పోట్లాడటం లేదు. వాళ్లలో వాళ్ళు పోట్లాడుకుంటున్నారు. లీడర్లు ఎక్కడా కన్పించటంలేదు. మీ మిత్రుడు దీవాన్‌చంద్ మాతోబాటే జైలులో వుండేవాడు' ధనసింగ్ నిరుత్సాహంతో సమాధానమిచ్చాడు.

'అలాగా. దీవాన్‌చంద్‌ను ఎరుగున్నావా? అతను ఇక్కడే వున్నాడు. అలహాబాదు వెళ్ళాడు. పది పదిహేనురోజుల్లో వస్తాడు. ఇప్పుడు నువ్వు ఏం చేయాలనుకుంటున్నావు? కానీ ఏదీ, ఇప్పుడేగదా జైలునుంచి వస్తున్నావు. కొద్ది రోజులుచూసి, పరిస్థితి అర్థం చేసుకో' అని గణేష్ అన్నాడు.

ధనసింగ్ బీడీ పూర్తిచేసి 'అవును. అర్జున్ అన్న ఎలా చెపితే అలా చేస్తాను' అన్నాడు.

అర్జునలాల్ తిరిగివచ్చేసరికి అతని నిరాశ అలాగేవుంది.

'అలా వున్నావేం? ఏం జరిగింది?' అడిగాడు గణేష్.

'ఇప్పుడే గాంధీగారి ఉపవాసం పూర్తయింది. గాంధీగారు ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవరకూ నిరీక్షించడం మంచిదని ఆయన అన్నారు. అప్పటివరకు గ్రామాలలోకివెళ్ళి ప్రభుత్వానికి ధాన్యం అమ్మకం నిలపమని ప్రచారం చేయమని చెపుతున్నారు' అర్జున్ నిరుత్సాహంగా సమాధానమిచ్చాడు.

'నిజమే, కాన్పూరులో పరిస్థితి చూస్తూనేవున్నావు కదా. ధాన్యంకోసం ఏరోజైనా దోపిడీ జరగవచ్చు. నువ్వు పట్నంలోకి ఇక ధాన్యం రానీయకు. దోపిడీలు ఎక్కువవుతాయి. అస్సాములోకి సరుకు చేరదు. జపానువాళ్ళు ముందుకు సాగుతూ వస్తారు. కలకత్తాలో మూడుసార్లు బాంబులు పడ్డాయి. తూర్పునుంచి నలభై లక్షలమంది ప్రజలు పారిపోయివచ్చారు. రేపు ఇక్కడ బాంబుపడితే ఎక్కడికి వెడతాం? ఇంగ్లీషువాడు ఒకడు చస్తాడు. హిందూదేశస్థులు పదివేలమంది చస్తారు. బర్మా జపానువాళ్ళకి-స్వాగతం పలికింది. జపానువాళ్ళు వచ్చినప్పటినుంచి అక్కడ మార్షల్ లా అమలులోకి వచ్చింది. ప్రజలు పారిపోయి అడవుల్లోకివెళ్ళి దాక్కున్నారు. తమ ప్రాణాలు కాపాడుకోవటంకోసం పోట్లాడుతున్నారు. కాని అక్కడి ధనవంతులు ఇప్పుడు జపాన్‌ని ముఖస్తుతి చేస్తున్నారు. మీ సింహానియా.

గుప్తా. బిర్లాలుకూడా తోటోకి అందరికన్నా ముందు నమస్కారం చేద్దామని వేచి వున్నారు' గణేష్ చెప్పుకుపోయాడు.

అర్జునలాల్ చాలా బాధపడ్డాడు. ఒకచాప పరుచుకుని మెదలకుండా పడుకున్నాడు. నిద్రపోయాడో, ఆలోచిస్తున్నాడో తెలియటంలేదు. గణేష్ అతని పక్కన పడుకుని గురకపెట్టడం మొదలుపెట్టాడు. ధనసింగ్ ఇంకొకచాపమీద పడుకున్నాడు. అతనికి తనజీవితం నిరాధారంగానూ, నిస్సారంగానూ అనిపించింది. ఏదన్నా చేయపూనుకోవడానికి ద్వారాలన్నీ బంధించివున్నాయి. దురాచారాన్ని తిరస్కరిస్తే ప్రభుత్వము, పోలీసులు దండిస్తారు. ప్రభుత్వంతోనూ, పోలీసులతోనూ పోట్లాడేందుకు ఏ ఉపాయమూలేదు. ప్రజలు ప్రభుత్వంతో పోట్లాడటం లేదు. సరికదా తేలిగ్గా అటులా ప్రవర్తిస్తారు. తనకిమాత్రం ఇది జీవన్మరణసమస్య. తను సోమాని వదిలివచ్చాడు. తనులేకుండా సోమాపరిస్థితి ఏమయిందో! లైను మీద రాత్రిపూట చూసినసంఘటన అతని స్మృతిపథంలో సజీవరూపంతో ఎదురయింది. సోమాకికూడా బహూశః ఇలాగే జరిగివుండచ్చునేమో? ఆమె సమీపంలో వున్నట్లయితే రక్షించేందుకు తన ప్రాణాలయినా ఇవ్వగలడు.

క్రిందటిరాత్రి తను ఏం చేయగలిగాడు? అతనిహృదయం సిగ్గుతోనూ, బాధతోనూ నిండిపోయింది. తనయితే ఆమెను కాపాడటానికి సిద్ధమయాడు. కాని అర్జునలాల్ ఆపేశాడు. అర్జునలాల్ పట్ల అతనికి ఏవగింపు కలిగింది. ఇతను పిరికి మనిషి. నాయకుడు అయినా చిన్ననాయకుడు. పెద్దపెద్ద నాయకులున్నారు. ఖైదు చేయబడకుండా వుండటానికి దాక్కున్నారు. వీళ్ళు పోట్లాడుతారా? అందరికీ తమ తమ ప్రాణాలమీద తీపివుంది. తాపీగా చూస్తున్నారు. దరిద్రులు!

ధనసింగ్‌కు మళ్ళీ సోమా గుర్తుకువచ్చింది. సరోలాగారిదగ్గర వున్నది. ఒకవేళ లాలాగారు పోట్లాటల్లో ఇరుక్కుంటామన్న భయంచేత ఆమెను ఇంటి నుంచి పంపించేశారేమో! రోజులు ఎలా గడుపుతోందో! ఆ దుర్మార్గులు ఆమె వెనుక పడివుండవచ్చు. నేను ఇక్కడ దాక్కుని ఏం సాధిస్తున్నాను! ఉదయం అర్జునలాల్‌తోకలసి మూల్‌గంజ్‌నుంచి బయల్దేరాను. అక్కడ ఇంటిగోడలపైన, చూరులమీద కూర్చున్నస్త్రీల ముఖాలు గుర్తుకు రాసాగాయి. వాళ్ళు అందవికారంగా,

పేలవంగా వున్నారు. వాళ్ళల్లో ఎంతమందిని వాళ్ళపురుషులు వదిలిపెట్టేశారో ! ఏం చేస్తారు ఈ దిక్కులేనివాళ్ళు.

ఉదయం ధనసింగ్ నిద్రలేచేసరికి గణేష్ కనిపించలేదు. అర్జునలాల్ మౌనంగా కూర్చుని ఆలోచిస్తున్నాడు. ధనసింగ్ లేవటంచూసి, 'ధనసింగ్ తమ్ముడూ, ఇప్పుడు ఉన్నపళాన వెళ్ళలేము. రెండుమూడు రోజులకోసం మేము గ్రామంలోవున్న మా ఇంటికి వెళుతున్నాం. తర్వాత ఏదోఒకటి ఆలోచించి బొంబాయి వెళ్ళిపోతాను. ఇక్కడ మళ్ళీ జైలులో వెళ్ళికూర్చుంటే లాభమేముంది? మనం ఒకళ్ళమూ ఏం చేయగలం ? ఇప్పుడు నువ్వుగూడా ఉద్యోగమో-పనో చూసుకో. కాన్పూరులో పనికేమీ తక్కువలేదు. నిన్ను ఇక్కడ గుర్తుపట్టేవాళ్ళు గూడా ఎవరూ లేరు' అన్నాడు అర్జునలాల్.

'మా పల్లెకిపోయే బస్సు ఉదయమే బయలుదేరుతుంది. నీకు అవసరం అయితే లాఠీమెహల్‌లో మోతీబాబుని కలుసుకో. మేము నీ విషయం ఆయనతో చెప్పివుంచాం' అంటూ లేచి అతను చొక్కాతీసి లోపలిజేబులోనుంచి రెండు అయిదురూపాయలనోట్లు బయటకుతీసి ధనసింగ్‌వైపు చాచాడు. 'తీసుకో, అప్పటి వరకు ఇవి పనికివస్తాయి. రెండుమూడురోజుల్లో ఏదో పని దొరుకుతుంది' అని అర్జునలాల్ ఎక్కువ మాట్లాడకుండా ఇరుకుమెట్లు దిగి కిందికి వెళ్ళిపోయాడు.

ధనసింగ్‌కి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. వాటిని అతికష్టంమీద ఆపుకున్నాడు. అర్జునలాల్ ఇచ్చిన డబ్బు తీసుకోవటం అతనికి అవమానంగా తోచింది. కాని తీసుకోకపోతే వేరేగతిలేదు. ఆ దూరదేశంలో అర్జునలాలే తనకి ఆధారం. కఠినమైనమార్గంలో అలసిపోయినతర్వాత, పనికిరాని బరువును ఎలా విసరివేస్తారో, అలా అర్జునలాల్ తన్ని వదిలివెళ్ళిపోయాడు. ధనసింగ్‌చేతులలో శక్తివుంది. హృదయంలో ధైర్యం వుంది కాని చేతుల్లో సామర్థ్యం, గుండెధైర్యం వున్నా అవకాశం లేకపోతే ఏం చేయగలడు ? ఈ సమయంలో ఈ డబ్బే భోజనము, ఆశ్రయము. ఎక్కడికైనా వెళ్లటానికి ఈ డబ్బే తనకి సహాయం.

ధనసింగ్ గదిలోనుంచి లేచి వరండాలో గచ్చుమీద కూర్చున్నాడు. ఫాల్గుణ మాసపుఎండ కాంతివిహీనమై పచ్చగా అవుపడుతోంది. గాలి సంయమని వీస్తుంది.

కాంగడాలో వైశాఖ-జ్యేష్ఠమాసాలలో వాతావరణం అలాగే వుంటుంది. చుట్టు పక్కల పెద్దపెద్ద ఎత్తయినఇళ్ళు వున్నాయి. టకటకమనే చప్పుడువిని, ధనసింగ్ తలతిప్పి కుడివైపుకు చూశాడు. పక్కఇంటిలో డాబామీద ఒకస్త్రీ తడిసిన చీరని కిందకుదులిపి నీళ్ళు పిండి, ఎండటానికి ఆరేస్తోంది. ఆ స్త్రీ వంటిమీద నిర్లక్ష్యంగా పడివున్న ఆ చీర అందుతప్ప ఇంకా ఏమీలేవు.

ధనసింగ్ తన కొండప్రాంతం స్త్రీలని ఇలా వంటిపై ఏమీ ఆచ్ఛాదనం లేకుండా ఎన్నడూ చూడలేదు. ఆ స్త్రీ గోడమీద మోచెయ్యి ఆనించి, వంగి క్రింద వాళ్ల వాకిట్లోకి చూస్తోంది. పైకి చూడటంవల్ల ధనసింగ్‌కు ఆ స్త్రీ ఎత్తయినస్థనాలు కనిపించాయి అతనికళ్ళు కిందికి వాలిపోయాయి. ఆమె ఎవరితోనో మాట్లాడు తోంది. మాటలను ధనసింగ్ అర్థం చేసుకోలేకపోయాడు. రెండవగొంతుకూడా ఎవరో స్త్రీదిలాగానే వుంది. పైకి అలా చూడటం ఉచితంకాదు అనుకున్నాడు తను. దగ్గరలోనే టపటపమని నీళ్లు పడుతున్నట్లుగా శబ్దం వినిపించింది. అతను అటువైపు చూశాడు. పైనుంచి తమలపాకుల ఉమ్మి అక్కడ పడింది. అతను మరోవైపుకు తప్పుకున్నాడు.

ధనసింగ్ తనగురించి పరిహాసపుమాటలు, కిలకిలనవ్వులు వినగానే కోపంలో కళ్లు వాటంతటవే పైకి చూశాయి. చీర ఆరవేసిన స్త్రీతోపాటు మరో యువతికూడా వుంది. ఇద్దరూ గోడమీద మోచేతులు ఆనించి, తమలపాకులు నములుతూ, అతని మీద ఛలోక్తులు విని నవ్వుతున్నారు. ధనసింగ్‌కు వాళ్లవి చివాట్లు పెడదామా అని పించింది. కాని పైన ఏ అడ్డూ లేకుండా స్పష్టంగా కనిపించేవారి శరీరపువంపులు చూసి అతనిదృష్టి కిందకు దింపుకున్నాడు. అసహ్యంతో పళ్ళునూరుతూ, మౌనంగా వుండిపోయాడు.

'ఏమో ఎక్కడినుంచివచ్చారో దౌర్భాగ్యులు! వెధవలు పోగయారు పేటలో! దుర్మార్గులు. ఎక్కడినుంచి వస్తున్నారో ఏమో! రోజూ కొత్తకొత్తవాళ్ళు వస్తు న్నారు!' ఒకస్త్రీ అతనికి వినిపించేలా అంది.

'మంచివాళ్ళే అయితే పెళ్ళాలు వుండరా వీళ్ళతోపాటు, తప్పక దుర్మార్గులే' అంది రెండోస్త్రీ.

ప్రేలనోటినుంచి తిట్లు, రెచ్చగొట్టడం, ధనసింగ్‌కు డ్రైవరు అభ్యాసం గుర్తుచేశాయి. దెబ్బలాడుదామనుకున్నాడు. కానీ పరాయిదేశంలో చిక్కుకుని వుండటం గుర్తుకొచ్చింది. పెదవులవరకు వచ్చినమాటలు అక్కడే ఆగిపోయాయి. వ్యాకులతతో కృంగిపోయాడు. అక్కడ కూర్చుని అవమానాన్ని సహించటం అతనికి భరించరానిదిగా తోచింది. లేచి నిలబడ్డాడు. మెట్లమీదనుంచి కిందకు దిగి, వెళ్ళిపోయాడు.

బజారులోకి వచ్చాక ధనసింగ్‌కు తినుబండారాలు దొరికేచోటు చూద్దామని అనిపించింది. రాత్రికి ఎక్కడ గడపాలి అనే ఆలోచన కలిగింది. అంత పెద్ద నగరంలో ఎవరి ఆశ్రయంలో వుండటం? అర్జునలాల్ నమ్మకం కల్గించి, వెంట తీసుకువచ్చాడు. కానీ తన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. ధనసింగ్‌కు అయితే ఇల్లూ వాకిలీ లేనేలేవు; వున్నా వాటికి ఎప్పుడో దూరమయాడు. కమ్యూనిస్టులతోనే కలిసిపోదామా అని అనుకున్నాడు కానీ వాళ్ళు ఇంగ్లీషువాళ్ళ ఏజంట్లు అయిపోయారని, వాళ్ళని తప్పించుకునివుండమని అర్జునలాల్ చెప్పాడు.

అర్జునలాల్ ధనసింగ్ నే స్తంవదిలి వెళ్ళిపోయాడు. అతనిమాటలమీద ధనసింగ్‌కు శ్రద్ధకూడా పోయింది కానీ కమ్యూనిస్టులనుంచి తను ఏమి ఆశిస్తాడు? అర్జునలాల్ పురానా మనుష్యులతో తన స్నేహాన్ని, వాళ్ళమీద తనకుగల ప్రభావాన్ని ఎంతో చెప్పాడు. కాంగ్రెసు వాలంటీరుగా సైన్యంలో చేరుస్తానని హామీ ఇచ్చాడు. ధనసింగ్‌కి తెలిసినదేమిటంటే కమ్యూనిస్టులదగ్గర పడుకోవటానికి మంచాలుకూడా లేవు. వాళ్లు తనకి ఏమి ఒరిగిస్తారు?

ధనసింగ్ మనసును గట్టిచేసుకుని మోతీదగ్గరకు వెళ్ళాలని, లాల్ మెహల్ చేరుకున్నాడు. అవసరమొస్తే షాహుకారుగారు తప్పక సహాయం చేస్తారు అని అర్జునలాల్ చెప్పినమాటలు చెప్పి ప్రాధేయపడ్డాడు. తమ ఆందోళనసమయంలో ఆరునెలలు కాంగ్రెసుతరపున జైలులో గడిపివచ్చానని, తనకి ఏదైనా ఉద్యోగం దొరకవచ్చునని చెప్పాడు.

'ఏదైనా గుమాస్తాగా చేద్దామంటే ఏమాత్రం చదువుకున్నవాడివి కాదు. ఏదైనా కాపలాదారుగానో, పహరాజవానుగానో ఇప్పిద్దామంటే, ఏవిధమైన జామీను

గావి, నీ పరిచయంగానీ నాకు లేదు. ఉద్యోగం చేయాలనివుంటే ఏదైనా సర్కారు ఉద్యోగం చెయ్యి. భగవంతుడు నీకు మంచి ఆరోగ్యకరమైన శరీరం ఇచ్చాడు. బజారులో పనికి ఏం తక్కువలేదు. కొద్దిరోజులు ధాన్యపుమూటలు మోసేపని చేసుకో। కాంగ్రెసులో పనిచేసేవాళ్ళందరూ నాయకులైతే పని ఎలా జరుగుతుంది।' అని షాహుకారుగారు సలహా ఇచ్చారు.

ధనసింగ్ మోతీబాబుదగ్గరనుంచి మౌనంగా తిరిగివచ్చాడు. ఆ అవమానంతో అతనికి వైజ్‌నాథ్ పోలీసుఠాణా అధికారిమీద ఎంతకోపం వచ్చిందో మోతీబాబుమీద అంతేకోపం వచ్చింది. తను స్వాతంత్ర్యంకోసం పోట్లాడే సైనికుడుగా అవాలని కోరుకున్నాడు. బరువులుమోసే కూలీ అవమని, లేకపోతే సర్కారు ఉద్యోగం చేయమని అతనికి సలహా లభించింది.

ధనసింగ్ రోజంతా కాన్పూరు బజారుల్లో తిరుగుతూనే వున్నాడు. జనం రద్దీవల్ల భుజాలకి భుజాలు రాసుకుంటూ తిరగవలసి వచ్చింది. సినిమాప్రదర్శనశాలలఎదుట కుంభోత్సవంలా జనసమూహం వుంది. ప్రజలందరూ ఆనందంతో తమపనుల్లో నిమగ్నులై వున్నారు. ఇంగ్లీషువాళ్ళని తిరస్కరిస్తూ స్వాతంత్ర్యంకోసం చేసే తిరుగుబాటులు కనిపించే ఏ చిత్రమయితే ఢిల్లీజైలులో అతని ఊహలో మెదిలిందో అదంతా అసత్యమని ఋజువవుతోంది. అతను రాత్రి పన్నెండుగంటల వరకూ అలా తిరుగుతూనే వున్నాడు. రాత్రి గడపడం ఎలాగా అన్నప్రశ్న ఎదురయింది. ఒకే ఒక్కచోటువుంది. కమ్యూనిస్టుల బసదగ్గరకు వెళ్ళటం, చాపమీద పడుకోవటం అని నిశ్చయించుకున్నాడు.

ధనసింగ్‌కు నిద్ర రావటంలేదు. అలసిపోయి బడలికగా పడుకునివున్నాడు. ఒకవైపు గణేష్, ఆతనిముందు కాసిం పడుకునివున్నారు. కాసిం ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలో ప్రవేశించాడు. ఏ వెధవాకూడా నిజం తెలుసుకోవటానికి విచారణ చేయలేదు. ప్రభుత్వానికి మనుష్యుల అవసరం వుంది. లక్షమందిఅయినా సరే ప్రవేశించగలుగుతారు అంటున్నా డతను.

'కామ్రేడ్' అని పిలిచాడు గణేష్.

'ఏం చేయాలని ఆలోచిస్తున్నావు ?'

కొంచం ఆలోచించి ధనసింగ్ సమాధానమిచ్చాడు. 'ఎక్కడైనా ఉద్యోగం దొరికితే చేద్దామని అనుకుంటున్నాను. నేను డ్రైవరుగా పని చేయగలను.'

'లైసెన్సు వుందా?'

'లేదు, లైసెన్సుమటుకు లేదు.'

పంజాబు అల్లరులలో అన్నీ విరక్కొట్టి పాడుచేశారా? పత్రికలలో ఆ వార్త కొంచంగూడా రాలేదే?'

'తెలియదు. నేను అర్జునలాల్‌తో కలిసి అప్పుడు ఢిల్లీజైలులో వున్నాను.'

'నువ్వు ఢిల్లీలోనే వున్నావా? అక్కడి పంజాబు-పార్టీ కామ్రేడ్‌లను ఎరుగున్నావా? పంజాబులో మా రైతుల ఫ్రంట్ బాగుందా?'

'నేను ఎవరినీ ఎరగను.'

'ఉద్యోగం చేయాలంటే లైసెన్సు తీసుకోవాల్సి వుంటుంది. దొంగతనం జరిగిపోయిందని చెప్పు.'

'పోలీసులదగ్గరకు వెళ్లటం మంచిదికాదు.'

'ఏం ఏదన్నా పోట్లాట జరిగిందా?' గణేష్ పక్కమీద ధనసింగ్‌వైపు తిరిగి 'అయితేమాత్రం నీ ఫోటో పట్టుకుని ఎవరు కూర్చునివున్నారు? మరోపేరు చెప్ప టమే. లేకపోతే ఇప్పుడు మరేదన్నా పని చేసుకో. ఏ పని చేయాలనుకుంటున్నావ్?' అనడిగాడు.

'నేను ఏమీ చదువుకున్నవాడిని కాదు' ధనసింగ్ అన్నాడు.

ధనసింగ్ గొంతులో దుఃఖం నిండివుండటంచేత గణేష్ ఇతరవిషయాల గురించి మాట్లాడటం మొదలపెట్టాడు. గణేష్ కొద్దిసేపుముషాలలో నిద్రపోయాడు. ఎవరిమాటలూ వినకుండా తనమనసెలా చెపితే అలా నడుచుకోవాలని ధనసింగ్ నిశ్చయించుకున్నాడు.

• • •

ధనసింగ్ మర్నాడు ఉదయమేలేచి దారి అడుగుతూ ఛావనీ చేరాడు. యుద్ధంలో చేర్పించే ఓ వ్యక్తి కలిశాడు.

'సైన్యంలో చేరే కార్యాలయం ఎక్కడ వుంది?' అని ధనసింగ్ అడిగాడు.

'చేరుతావా?'

'డ్రైవరు ఉద్యోగంలో చేరుతాను.'

'లైసెన్సు వుందా?'

'సామానుతోబాటు దొంగలు ఎత్తుకుపోయారు.'

'ఆ వ్యక్తి ధనసింగ్‌వైపు ఒక సిగరెట్టు చాపాడు. తనుకూడా ఒక సిగరెట్టు అంటించుకుని 'మేము అంతా చేయిస్తాము. చెప్పు, ఏమిస్తావు?' అని అడిగాడు.

ధనసింగ్ నవ్వాడు—'అయ్యా, ఇందులో ప్రవేశిస్తే బహుమతి లభిస్తుందని విన్నాను. నువ్వు మమ్మల్నే అడుగుతున్నావ్. మేమే స్వయంగా చేరిపోతాం' అన్నాడు.

ఆ వ్యక్తి ధనసింగ్‌ను పైనుంచి కిందివరకు చూశాడు—'పంజాబీవి కదూ! అందుకే. నువ్వే స్వయంగా చేరిపోతావా! గురూ లైసెన్సు లేదు. రకరకాల పోట్లాటలు అవుతాయి. నిజం తెలుసుకోవటానికి విచారణ జరుగుతుంది. పోలీసులు ఇంటివరకు వస్తారు. తెలిసిందా గురూ! నీ జేబులోనుంచి కొద్దిగానే అడుగుతున్నాం, బహుమతిలోనుంచి పదిరూపాయలు ఇవ్వాలి.'

ధనసింగ్ సరేనని అంగీకరించాడు.

'ఆఫీసరు లైసెన్సుకోసం అడిగితే ఏం చెపుతావు?'

'నిజం చెప్పేస్తాను. రైలులో సామానుతోపాటు దొంగతనం జరిగిందని.'

'బాబూ, ఇంత సూటిగా పోయేమనిషివి కాబట్టే ఇక్కడ చేరటానికి పంజాబునుంచి కాన్పూరు వచ్చావు. ఇక్కడ ప్రతిరోజూ ఇదేపని. పరారి అయి వచ్చినవాళ్ళని ఎంతమందిని చేర్పించామో లెక్కలేదు.'

ధనసింగ్‌కు అనుమానం కల్గింది కాని పైకి నవ్వేశాడు—'తమ్ముడూ. మేము నిన్ను మోసం చేయటం లేదు. నువ్వు పది కాదు, పదిహేను తీసుకో. లైసెన్సు పోగొట్టుకున్నాను. అయితే ఏం చేయను?'

'కలకత్తాలో ఉద్యోగంచేస్తూ వుండేవాణ్ణని, టాక్సీ నడిపేవాణ్ణని చెప్పాలి తెలిసిందా? సంపాదించినడబ్బు ఇంట్లోవాళ్లకు ఇచ్చి సైన్యంలో చేరుదామని గ్రామం వెడుతుంటే, దోవలో సంపాదన అంతా రైల్వేస్టేషన్లో దొంగతనం జరిగిపోయింది అని చెప్పు.'

ధనసింగ్ అంగీకారంలో తల పంకించాడు.

'ఏ జిల్లా నీది?'

'హోషియార్‌పుర్.'

'వంశం?'

'రాజపుత్రులం.'

'మంచిది, అయితే అర్థం చేసుకున్నావా?'

'ఆ.'

# పరువుగల మనుష్యులు

సోమా, బారిస్టర్ సరోలాగారు, ఆయన భార్య, మనోరమ, భూపేదీపా, అంతాకలిపి లాహోర్ వచ్చేశారు. సోమా ధనసింగ్ పరారీ ఐనతర్వాత రెండున్నర నెలలు లాలాగారి బంగళాలో వుంది. ఆ క్రితం సంవత్సరంకూడా ఆమె నాలుగు నెలలు వుంది. గౌరవప్రదమైన కొత్తజీవిత పద్ధతులతో పరిచయం కలిగించుకుంది. లాహోర్ బంగళాకివచ్చి ఆమె ఇంకా ఎంతో చూసింది. ధర్మశాలలోని బంగళాలో కొత్త పాత పద్ధతులు మేళవించివున్నాయి. పరివారం జీవనరీతి, నడవడికలమీద కొంతమేర లాలాగారి కట్టుబాటు, తల్లిగారి కట్టుబాటు వుండేది. లాహోర్ బంగళాలో యజమాని లాలాగారు కాదు. బారిస్టరుగారు. ఇక్కడ అంతా కొత్తపద్ధతిగా వుంది. పాతపద్ధతి కొంతమేర, వదినగారి చుట్టుపక్కలమాత్రమే వుండేది. ప్రవర్తనలోనూ, వాతావరణంలోనూ ఒకవిధమైన స్వేచ్ఛ వుండేది.

బారిస్టరుగారు, మనోరమా, సోమాని తమతోబాటు అతిథిగా లాహోర్ తీసుకువచ్చారు. ఆమెను గౌరవంగాచూస్తూ వుండేవాళ్ళు. దురదృష్టంపట్ల సిగ్గు, బారిస్టరుగారు, మనోరమపట్ల కృతజ్ఞతలతో సోమా మనసు నిండివుండేది. బారిస్టరుగారు ఆమె విశ్రాంతిగురించి, గౌరవంగురించి శ్రద్ధవహించేవారు. సోమా వాళ్ళ ఇంట్లోనూ, పరివారంతోనూ తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించేది. తనస్థితికి అనుగుణంగా ఆ కుటుంబంలో ఒక నౌకరుగానే వుండాలని అనుకునేది. ఆమె దృష్టిలో అదే తన నిజమైన స్థానం. సరోలాగారు, మనోరమ ఆమెకు ఆశ్రయమిచ్చి అతిథిగా చేసి, ఇంట్లో ఒక మనిషిగా మసలాలని కోరుకునేవారు. ఈ సంఘర్షణలో సోమాకు అంత బాధలోగూడా మనసు ఎంతో తేలికగా వున్నట్లుగా అనిపించేది.

కార్తీకమాసం వచ్చింది. వాతావరణం బాగా చల్లబడిందని అనేవారు లాహోర్ ప్రజలు. కానీ సోమాకు చాలా వేడిగా వుంది. ఆమె రోజంతా చమటతో తడిసిపోయేది. కొంగుతో ముఖం తుడుచుకుంటూవుండేది. ఒకరోజు సాయం సమయంలో బారిస్టరుగారు, మనోరమ టీ కోసం వసారాలో కూర్చొనివున్నారు.

సోమా ట్రే తీసుకువచ్చి కప్పులలో టీ కలుపుతోంది. మనోరమ ఆమెవైపు చూసి నవ్వి 'అరే, చూడు ఈ వేడిలో ఈమె ఎలా శుభ్రంగా తుడుచుకుంటోందో!' అంది.

'అవును, ఎన్నిసార్లు కొంగుతో ముఖం తుడుచుకుంటే రంగు అంత స్పష్టమవుతుంది' అని బారిస్టరుగారు సమర్థించేశారు.

సోమా ముఖం సిగ్గుతో ఎర్రబడింది. ఆమె కెటిల్ ట్రేలో వుంచేసింది. టీ కలపడంమానేసి తలవంచుకుని వెళ్ళిపోయింది. కాని సిగ్గువలన ఆమెకు కోపం, అవమానం కలగలేదు. హృదయంలో ఒక గుగుర్పాటుకలిగి చక్కిలిగిలి పెట్టిన ట్లయింది. చిరునవ్వుకూడా వచ్చింది. బారిస్టరుగారున్నచోటికి వెళ్ళటానికి సంకోచం కలగటం మొదలయింది. బారిస్టరుగారు ఏదో ఒకటి అంటూనే వుండేవారు. ఆయన సమర్థించటంలో మనోరమ నవ్వేసేది. సోమాకూడా నవ్వకుండా ఎలా వుంటుంది! ఆయన చెప్పినమాటని తృణీకరించటం ఎలా కుదురుతుంది! కొద్దిరోజులతర్వాత మళ్ళీ సాయంసమయంలో బారిస్టరు, మనోరమ సినిమాకు వెళ్ళడంకోసం సిద్ధమై, టీ త్రాగుతున్నారు, సోమా టీ కలుపుతోంది. ఈవిధంగా బట్టలు కట్టుకుంటే ఎంత బాగుంది!' అన్నది మనోరమ.

'ఈమెనుగూడా సినిమాకు తీసుకువెళ్ళు' బారిస్టరుగారు ఇంగ్లీషులో అన్నారు. 'ఎలా త్రుళ్ళిపడుతుందో చూడాలి, ఆనందం కలుగుతుంది.'

మనోరమకు మనసులోని మాటల్ని దాచేఅలవాటు లేదు. ఆమె లేచివిల బడింది. 'సోమా, సోమా' అంటూ సోమాను చేతితోపట్టుకుని వంటింటినుంచి తన గదిలోకి లాక్కెళ్ళింది. సోమా ఏమీ తెలుసుకోలేకపోయింది. మనోరమ తన అల్మారాతెరిచి ఒకచీర, బ్లౌజు. బయటకుతీసి పడేసి 'తొందరగా బట్టలు మార్చుకో' అని చెప్పేసరికి గాభరా చెందింది.

సోమా చేతులుజోడించి 'అయ్యో ఒద్దు అక్కయ్యగారూ, ఇది తొడుక్కో వటం నాకు రాదు. మీ కాళ్ళు పట్టుకుంటాను' అంది.

'వాట్ నాన్సెన్స్ (ఏం పిచ్చితనం)!' మనోరమ ప్రేమగా కోప్పడింది. తనే ఆమెబట్టలు మార్చసాగింది. సోమా సిగ్గుతో ముడుచుకుపోయి మోకాళ్ళలో

తల దాచుకుని కూర్చుండిపోయింది. మనోరమ కోపంతో ఎగిరిపడింది. ఆమె కోపంతో గదిలోనుంచి వెళ్ళిపోతూవుంటే సోమా భయపడి క్షమార్పణ కోరు కుంది.

'నువ్వు పిచ్చిదానివి. ప్రపంచం అంతా ఏం బట్టలు కట్టుకోవటంలేదా?' మనోరమ ప్రేమగా అంది.

'నేను పంజాబీదుస్తులు కట్టుకుంటాను' అన్నది సోమా వినయంగా.

చీర ఆమె ఒకేసారి, ధర్మశాలలో పోలీసులదగ్గరకు తీసుకువెళ్ళబోయే సమ యంలో, సగం స్పృహలేనిపరిస్థితిలో కట్టుకుంది. కాని ఆ దుస్తుల్లో నడవడం ఆమెకు వీలుకాలేదు. ధర్మశాలలో పంజాబుప్రాంతపు స్త్రీలను చీరకట్టుకునివుండగా చూసి కొంతప్రాంతపుస్త్రీలు ఆశ్చర్యంతో చూస్తూ, 'అయ్యో, ఇదికూడా ఏమైనా కట్టుకోతగిందేనా? కాళ్ళకు గట్టిగా చుట్టుకునివుండదు?' అని చర్చించటం మొదలు పెట్టేవారు. అందుచేత సోమా తను చీరకట్టుకోవటం అసంభవమనే తలచేది.

మనోరమ సోమామాట అంగీకరించింది. సోమా బట్టలు మార్చుకుంది. కాని మొదటిసారిగా కట్టుకుందన్నవిషయం కొట్టవచ్చినట్లు తెలుస్తోంది. మనోరమ కొద్దిగా పౌడరు, కాటుక పెట్టుకోమని సౌంజ్ఞ చేసింది. సోమాకు ఇది మరీ కష్ట మయింది. ఆమె ధర్మశాలలో ఈ వస్తువులను కొద్దో-గొప్పో వాడుతూనేవుండేది. ధనసింగ్‌కోసం అలంకరించుకోవటం ఆమెకు సంతోషం కలిగించేది. ఇప్పుడు ఎవరికోసం అలంకరించుకుంటుంది? మనోరమ ఆమెను తలమీద కొంగు వేసుకో కుండా, తల ఎత్తుకుని, జంకులేకుండా నడవమని చెప్పేసరికి ఇంకా ఇబ్బందయి పోయింది ఏడుపుముఖం పెట్టింది. సరోలాగారి ఎదుటికిరాగానే ఆమె సిగ్గుతో కుంచించుకుపోయింది.

బారిష్టరుగారు నవ్వి 'ఇదేం తమాషా?' అన్నారు.

మనోరమ తన ప్రయత్నాలలో విఫలమై 'బాగానేవుంది, వుండనీ....' అంది.

వదినగారుకూడా వసారాలోకి వచ్చారు. 'అరే బాగానేవుంది. ఈమెనుకూడా తీసుకువెళ్ళరాదూ?' అన్నారు తృప్తిపడి సంతోషంతో.

మనోరమ వద్దని తల ఆడించి అన్నగారితో కలిపి వెళ్ళిపోయింది.

మనోరమ, బారిస్టరుగార్లు వెళ్ళిపోయినతర్వాత సోమా వెక్కి వెక్కి ఏడ్చింది. తనమీద ఎటువంటి దురాచారం జరుగుతోంది! కాని ఇది ప్రేమ, ఆదరమే. తను కృతజ్ఞతతో వాళ్ళకోసం ప్రాణాలు ఇచ్చేయాలని అనుకునేది.

బంగళాలో ఎవరైనా నౌకరు మురికిదుస్తులలో కనపడితే బారిస్టరుగారికి అవమానంగా అనిపించేది. బహూరే ఊధమ్‌సింగ్ దృష్టి అయ్యగారి పాతబట్టలమీద వుండేది. డ్రైవరు బరకత్ షోకుచేసుకుని వచ్చేవాడు. సోమా ఎప్పుడూ మురికి లేకుండా శుభ్రంగా వుండేది. కాని ఎప్పుడైనా నిరుత్సాహంచేతనో, పని వత్తిడి చేతనో బట్టలు మురికిగా నలిగిపోయి కనిపిస్తే బారిస్టరుగారు మిసెస్ సరోలాతో పోట్లాటకు దిగేవారు—'ఈమె కట్టుకోవటానికి ఇంట్లో ఇంతకన్నా మంచిబట్టలు లేవా? ఈమె పిల్లలతోటి గడపాలిసివుంటుంది. వాళ్ళు ఏం నేర్చుకుంటారు?'

మిసెస్ సరోలా తన మృదుస్వభావంతో 'మార్చుకుంటుంది' అని సమాధానం ఇచ్చేది. తనకారణంగా వదినగారు మాటలు పడాల్సివచ్చిందని సోమా సిగ్గు పడిపోయేది. కానీ రోజంతా ఇంటి పని-పాటలు చేయక, బట్టలకు గంజి పెట్టుకుని, ఇస్త్రీ చేసుకుంటూ ఎలా కూర్చోగలుగుతుంది! ఈమె ఇంట్లో పనంతా చూస్తూ వుండేది. ఎంతపని ఇతరులు భారంవహించి చేసేస్తే అంతమంచిది అనుకునేటటు వంటిది వదినగారి స్వభావం. కొద్దిరోజులుగా ఆమె ఆరోగ్యంకూడా చెడిపోయింది. మళ్ళీ పూర్తిగా బాగుపడలేదు. భూప్, దీపాల ఆరోగ్యంకూడా ఇలానే అయింది. మరుసటినెలనుంచీ వాళ్ళు నీళ్ళనుకూడా జీర్ణించుకోలేకపోయారు.

తల్లిగారు ఇంటిదగ్గర లేరు. బాధ్యత అంతా సోమామీదే పడింది. మనోరమకు ఈ విషయాలతో ఏమీ సంబంధంలేదు. మొదట ఆమెకు కాలేజీవల్ల తీరుబడి చిక్కేదికాదు. ఇప్పుడు కొద్దో-గొప్పో 'సోషల్ లైఫ్' (సాంఘికజీవనం) 'పబ్లిక్ వర్కు' వుంది. ఉప్పు-చింతపండుల లెక్కలు, చాకలిపద్దులు రాయటానికేనా ఆమె ఎమ్. ఏ. ప్యాసయింది!

బారిస్టరుగారి పనులన్నీ, 'బెడ్ టీ' దగ్గరనుంచి రాత్రి పడుకునేముందు పీక్లు త్రాగేవరకు—ఆయన బట్టలను జాగ్రత్తపరచటం, గది శుభ్రంచేయటం మొద

లైనవనులన్నీ సోమామీదే పడ్డాయి. ఒకవేళ ఆయన అతిథులతో కలిసి, ఆఫీసు గదిలో టీ తీసుకునేటట్లయితే, ఊథమ్‌సింగ్‌కు డ్యూటీ పడేది. ఇంట్లో మనో రమతో కలిసి కాక, వంటరిగాగాని తీసుకునేటట్లయితే సోమా ట్రే తీసుకువెళ్ళేది. ఇటువంటిసమయాల్లో బారిష్టరుగారు, 'రా, నువ్వుగూడా తాగు' అనేవారు. ఆమె కోసం ఒక కుర్చీ తెప్పించేవారు. మనోరమ దానిని సమర్థించేది. కాని సోమాకు ఆయనతోనూ, మనోరమతోనూ సమానంగా కుర్చీమీద కూర్చోవటం ఇబ్బందిగా వుండేది.

పరినగారికి బారిష్టరుగారితో కలిసి కూర్చుని టీ త్రాగటం ఇష్టముండేది కాదు. పీటకలిగేది కాదు. పగరుగావుండే టీ రుచి ఆమెకు నచ్చేదికాదు. ఆమె జలుబు చేసినప్పుడయితే మందు తాగినట్లుగా పాలలో టీ పోసుకుని త్రాగేసేది. రోజురోజుకీ లావవుతున్న తన అనారోగ్యకరమైన శరీరాన్ని, బలహీనతని కాపాడుకోవటంకోసం టీ కన్నా పాలు, మజ్జిగ త్రాగటానికే ఆమె ఎక్కువ ఇష్ట పడేది. నిత్యం కుర్చీమీద ముడుచుకుని కూర్చోవటం ఆమెకు ఇబ్బందిగాకూడా వుండేది.

బారిష్టరుగారు అప్పుడప్పుడూ మనోరమ లేనప్పుడుకూడా సోమాను తనతో పాటు కలిపి టీ త్రాగమని పట్టుపట్టేవారు. 'టీ, మద్యం, ఒంటరిగా తాగడంలో ఆనందం వుండదు' అనేవారు. సోమా సిగ్గుతో కుంచించుకుపోయేది. ఆమె శరీరం తత్తరపాటుతో వణికిపోయేది. ఏమీ జవాబు ఇవ్వకుండా, తల వంచుకుని నిలబడి, ఆయనకోసం కప్పులో టీ కలిపేది. కాని నవ్వొచ్చేది. కప్పులో టీ తొందర పాటువల్ల కొంచం ఎక్కువో తక్కువో అయేది. పాలబొట్లు ఒకటి రెండు బల్లమీద పడేవి. పంచదార పలుకులు కొన్ని అటూ ఇటూ చిందిపడేవి.

ఆయనకు ఇటువంటి అసమర్థత గిట్టదని సోమాకు తెలుసు. కాని ఆమె చేతిమీదుగా పొరపాటు జరిగినా ఆయన నవ్వేసేవారు. ఇటువంటి ఆయనప్రవర్తన సోమాకు సరిగా బోధపడేది కాదు. అప్పుడప్పుడూ ఆయనస్వరం గంభీరంగా వున్నట్లుకూడా అనిపించేది. ఆమెకు చెమట పట్టేది. చేతులూ కాళ్లూ బిగుసుకు పోయేవి. ముఖంమీద గులాబీరంగు పులుముకునేది. ఎక్కడికైనా పారిపోయి దాక్కోవాలని అనిపించేది. అక్కడినుంచి వెళ్ళిపోయి మరోపనిలో నిమగ్నురా

లయేది. టూపీనికాని. టీపాయిగాని పిలిచి వాళ్ళచేత బట్టలు మార్పించటం మొదలు పెట్టేది. కాని మనసు దేనిమీదా లగ్నమయేదికాదు.

సోమాకు తెలుసు, తను రూపవతి. బారిస్టరుగారికి తను నచ్చుతుంది. మనోరమ పెద్దమనిషి. ఎంతో చదువుకున్నది. రంగు పసిమికాదు అందంగా వుండదు. పెదిమలు కొంచం లావుగా వుంటాయి. కళ్ళు ఎంతో బాగుంటాయి. నుదురు కొంచం ఎత్తుగా వుంటుంది. వసినగారిముఖంలో అమాయకత్వం వుంది. బాగుంటుంది కాని బాగా ఊరిపోయింది. బట్టలు వేసుకుంటే ఇంకా లావుగా కనిపిస్తుంది. అదీకాక ఎప్పుడూ జబ్బుతో ముక్కుతూ మూలుగుతూ వుంటుంది.

........రూపవతి అవటంలో ఎంత భయం ఇమిడివుంది! అది గర్వకారణం కూడాను. ధర్మశాలలో ఆమె గది చుట్టుపక్కలనుంచి వచ్చే పోయేవాళ్ళకి. రాత్రి పూట ఆమె గది తలుపు దగ్గరకువచ్చి గోలచేసేవాళ్ళకికూడా ఆమె ఎంతో బాగుండి వుండివుంటుంది. కాని దానికి ఎటువంటిఫలితం జరిగింది?....మరొకాలోని కుర్రాడికికూడా ఆమె బాగుండేది. ఆమె అకుర్రాణ్ణి లాగి చెంపదెబ్బ కొట్టింది. ఇన్నాడు ఎవరినీ చెంపదెబ్బ కొట్టలేదు. వైజ్‌నాథ్ పోలీసుఠాణాలో ఆమె ముఖందగ్గరకు లాంతరుఎత్తి చూడటం జరిగింది. ఆ పోలీసుఠాణా అధికారికి, పోలీసువాళ్ళకి ఆమె అందగత్తె అవిపించివుంటుంది. అలాటిఊహతో రక్తం గడ్డకట్టుకుపోవటం ప్రారంభించేది. బారిస్టరుగారికి తను నచ్చటం అనే ఆలోచనవలన ఏ మధురానుభూతి, భీతి కలిగేవో, అవి భయమూ, అనుమానంగా మారిపోయేవి. మళ్ళీ ఆలోచించి అయ్యగారు అయితే మంచిమనిషి, పెద్దమనిషి, దయగలవారు అనుకునేది.

ధనపింగ్ జ్ఞాపకంరాగానే సోమాకు బాధ కలిగేది. నిరుత్సాహం పొందేది. తనబాధ ఎవరితోనూ చెప్పుకోనుగూడా లేదు. ఆమె దిగులుగా వుండటంచూసి మనోరమ పసిగట్టేది. సోమా చేతిలోనిపనివి విడిపించి, తన గదిలోకి లాక్కుపోయేది. మూడు నాలుగుసార్లు మనోరమ ఆమెను సినిమాకుకూడా తీసుకువెళ్ళింది. మొదటిసారి మనోరమ, బారిస్టరుగార్లతో కలిసి బయటకువెళ్ళటం ప్రస్తావన వచ్చాక చిన్నపోట్లాట జరిగింది కాని అలా మరెన్నడూ జరగలేదు. బారిస్టరుగారుకూడా వుండకపోవడంవల్ల సోమాకు సంకోచంకూడా కలిగేదికాదు.

మనోరమ సోమాను తన గదిలోకి తీసుకువెళ్ళి తన సోఫామీదగాని మంచం మీదగాని కూర్చోబెట్టి మాట్లాడటం ప్రారంభించేది. ధనసింగ్ ధర్మశాలనుంచి పారిపోయి వచ్చివుండవచ్చు అని ఓదారుస్తూ వుండేది. ఆరునెలలు గడిచిపోయాయి. ఈ ప్రదేశం అతను ఎరుగును. ఏదో ఒకరోజున ఇక్కడకు రావచ్చు.... అని నచ్చ చెప్పేది.

మనోరమ ఇంట్లో ఇంకెవరితో మాట్లాడగలదు, వదినగారు ఆమె సమవయస్కురాలే కాని స్వభావరీత్యా మితభాషి. అంతేకాదు తాను వివాహిత, ఇద్దరు పిల్లలతల్లి అని భావించేవారు. మన్నూని కన్యగా ఎంచేవారు. ఎప్పుడైనా మనసు పుడితే సోమానే దగ్గర కూర్చోబెట్టుకుని మాట్లాడేవారు. మనోరమ ఇటువంటి మానసిక స్థితిలో ఓ మాటు అన్నగారిమీద సానుభూతిని, వదినగారిమీద విరక్తిని వెల్లడించింది సోమాతో—అన్నయ్య ఇంకో అమ్మాయిని ఇష్టపడేవాడు. ఆమె కూడా ఈయన్ని ఇష్టపడేది కానీ అమ్మ ఈ సంబంధం వెతికి తీసుకువచ్చింది. వదిన తల్లితండ్రులు ధనవంతులు. ఒక్కసారిమటుకు తమ పిల్లని చూపించడానికి ఒప్పుకున్నారు. అన్నయ్య ఆ సమయంలో ఆమె రూపంచూసి సంతృప్తిచెందాడు. అప్పట్లో వదిన సన్నగా—నాజూకుగా చూడటానికి ఎంతో అందంగా వుండేది. కానీ రూపమే అంతా కాదుకదా. అన్నయ్యతో కనీసం రెండుమాటలైనా మాట్లాడ లేదు. ఎనిమిదవతరగతివరకు చదివింది. ఇంటిదగ్గర ఇంగ్లీషు చదివిస్తున్నామని ఆమె పుట్టింటివాళ్ళు చెప్పారు. శరీరం చూడు! ఇద్దరుపిల్లలు కలిగారు కాని అన్నయ్యా, వదినా పరస్పరం మాట్లాడుకుంటూవుండగా చూడలేదు.

బారిస్టరుగారు కోర్టుకుమటుకు నిత్యం వెడతారు. కాని ఆయన ప్రాక్టీసు అంత చెప్పుకోతగ్గది కాదు. ఏ కేసులు దొరికితే వాటిని ఆసక్తితో సాధించేవారు కానీ కక్షిదారులు చాలా తక్కువమంది వచ్చేవారు. కక్షిదారులను ఆకర్షించే పద్ధతి ఆయనకు అవమానకరంగా తోచేది. న్యాయాధిపతులఎదుట వంగి సలాములు చేయటం ఆయనకు నచ్చేదికాదు. ఆయనదర్పం అలానే జరుగుతూపోయేది. ప్రాక్టీసు నడవకపోయినాగూడా ఆర్థికంగా ఇబ్బంది పడాల్సివస్తుందన్నబాధ లేకపోవటంవల్ల ఆయనకి జరుగుబాటు అయేది.

జగదీశ్ సహాయ్‌గూడా తన ఇరువురి అన్నలలానే వ్యాపారం చేయాలని

లాలాగారు కోరుతుండేవారు. వ్యాపారంలో వున్నలాభం బారిస్టరువృత్తిలో వుండటమనేది కల్ల. పెద్దపెద్ద బారిస్టరులుగూడా వ్యాపారస్థులదగ్గ్రే తింటారు. కాని జగదీశ్ సహాయ్‌కు వ్యాపారరంగంలో జరిగేకుట్ర నచ్చేదికాదు. గౌరవంగా వలుకుబడితోవుండాలని ఆయన కోరేవారు. కాని యుద్ధం వచ్చినవల్ల ఇంటి వ్యాపారం బాగా పెరిగిపోయింది. తండ్రిగారు దాదాపు ధర్మశాలలోనే కాలం గడిపే వారు. పెద్దన్నగారు కృష్ణసహాయ్ కలకత్తాలో. రెండవఅన్నగారు విష్ణుసహాయ్ కరాచీలో వుండేవారు. అందుచేత లాహోర్‌లో వ్యాపారం జగదీశ్ చూడాల్సి వచ్చేది. అయినప్పటికీ, లాలా జ్వాలాసహాయ్‌గారి విశ్వాసపాత్రుడైన మేనేజరు పండిత్ లజ్జారామ్, అన్నిపనులూ తనే నిర్వహించేవాడు. బారిస్టరుగారి పనల్లా పై తనిఖీచేయటం. కానీ గత మూడుమాసాలుగా ఆయన స్వయంగా ఒక కాంట్రాక్టు పుచ్చుకున్నారు.

క్లబ్బులో విస్కీ తాగుతూ జగదీశ్ మిత్రుడు, మేజర్ బాసూ తనబాధని తెలియపరిచాడు. మిసెస్ బాసు గుర్రపుపందాలలో నాలుగువేలు ఓడిపోయి వచ్చింది. మేజర్ జీతం నెలకు రెండు వేలు. నెలసరిఖర్చు అంతకన్నా తక్కువ వుండేదికాదు. బారిస్టర్‌ని నాలుగువేలు అప్పిమ్మని మేజర్ అడిగాడు. అప్పు తీర్చే బాధ్యత మిసెస్ బాసూమీద వుంది. అందుచేత జగదీశ్ తన మంచితనం నిరూపించాలని ఎంతో తహతహ లాడుతుండేవాడు. విస్కీ తాగుతూ అతను ఆలో చిస్తున్నాడు. తనదగ్గిర రొఖ్ఖం చాలినంతవుంది... మిసెస్ బాసూవైపు దృష్టి మరలగానే నవ్వి 'ఏదో ఒకటి చేయాలిసిందే' అన్నాడు.

మిసెస్ బాసూ తన తప్పిదానికి అవమానంతో కించపడింది. 'మీకు ఎంతో కృతజ్ఞురాలిని' అన్నది ఇంగ్లీషులో.

మేజర్ బాసూ డ్రైబ్రాన్డీపొంది తన గ్లాసు టేబులుమీద వుంచాడు. 'నువ్వు ఇంతపెద్ద వ్యాపారస్థుని కొడుకువి. నువ్వే ఎందుకు కొంచం సహాయం చేయవు? ఇటువంటిసమయం ఎప్పుడూ రాదుకదా!' అన్నాడు.

మేజర్ బాసూ లాహోర్‌లోని సైనికుల శిబిరాలలో డాక్టరులకు ఉపయోగ కరమైన సామగ్రిని పంపిణీచేసే ప్రధాన అధికారి. వందలమంది ఆయనవెనుక

తిరుగుతూ వుండేవారు. కాని పరస్పర స్నేహం వున్నప్పటికీ, జగదీశ్ ఆయనతో ఎప్పుడూ ఇటువంటి విషయాలు మాట్లాడలేదు.

'నావల్ల ఏమవుతుంది?' జగదీశ్ అయిష్టాన్ని తెలియపరిచాడు.

మేజర్ బాసూ జగదీశ్ వైపు తిరిగి 'నువ్వు పిల్లి పేగులు సరఫరా చెయ్యి.... రెండు-రెండున్నర లక్షల రూపాయలకు ఆర్డరు రేపే ఇవ్వగలను' అన్నాడు.

'రెండు-రెండున్నర లక్షల రూపాయల పిల్లి పేగులా?' జగదీశ్ నవ్వాడు. 'పిల్లులను చంపడం నాకు చేతకాదు. అన్ని పిల్లులు ఒకవేళ దేశం మొత్తంలో కూడా దొరకవు. ఇన్ని పిల్లి పేగులతో ఏం చేస్తారు?'

మేజర్ నెమ్మదిగా బోధపరిచాడు—'గాయాలను కుట్టడంకోసం పిల్లి పేగులు పనికివస్తాయి. ఇప్పుడు పాశ్చాత్యదేశాలనుంచి రావటంలేదు. బ్రిటన్ మనల్ని అడుగుతోంది.'

'కాని ఇన్ని పేగులు ఎక్కడనుంచి వస్తాయి?'

'వాటి బరువు తక్కువ, ధర ఎక్కువగా వుంది. తర్వాత ఏదైనాకాని, ఏది పేగపిపిస్తే అది సరఫరా చేసెయ్.'

'కాని గాయాలలో ఇటువంటి ప్రమాదకరమైన పదార్థం చేరటంవల్ల ఎంత మంది మనుష్యులు చచ్చిపోతారు!' జగదీశ్ భయాన్ని వ్యక్తపరిచాడు.

'నువ్వు వుత్తి అమాయకుడివి. నాకు భగవంతుడంటే భయం లేదనుకుంటున్నావా? ఇటువంటి పాపాన్ని నేనుమాత్రం ఎలా చేయగలను? పేగులు గిడ్డంగులలోకి వచ్చేస్తాయి. పీ బిల్లు పదిహేను రోజాలలోపున చెల్లిస్తాము. ఆ పేగులు గిడ్డంగులనుంచి ఆస్పత్రికి వెళ్ళవు. అర్థం అవలా? గిడ్డంగులలో పేగులకట్టలు వృధా అయిపోతాయి. వాటిమీద బిడ్డుపదార్థం చేరుతుంది. నేను వాటిని తృణీకరించి నీ ఎదుటనే తగలబెట్టిస్తాను. నువ్వు కావాలనుకుంటే కుళ్ళిపోయివున్న పేగుల తోగులను జిగురుపదార్థంలో ముంచి సరఫరా చెయ్యి. కానీ మా ఏర్పాటు ప్రకారం ఇందులో పదిశాతం స్టాఫ్‌కు చెందుతుంది. ఇలా మామూలుగా రోజూ జరుగుతుంది.'

జగదీశ్ 'ఆలోచిస్తాను' అనిచెప్పి క్లబ్బునుంచి తిరిగివచ్చేశాడు. రాత్రి ఆలోచించాడు. ఎక్కువడబ్బు సంపాదించలేకపోవటంతో ఇద్దరు సోదరులదృష్టిలో తనకి గౌరవం ఏమీలేదు. అందుకు ఇది తేలికయిన ఉపాయం కావచ్చు. ఒకసారి కృతకృత్యంతో ప్రారంభిస్తే పని జరిగిపోతుంది. జగదీశ్ మర్నాడు ఫోనులో మేజర్ బాసూకు తన అంగీకారం తెలిపాడు. పేరులు ప్రోగుచేసేఏర్పాటు పండిత్ లజ్జారామ్ చేతికి అప్పగించటం జరిగింది. తర్వాత జగదీశ్ ఇంకా ఎన్నో కాంట్రాక్టులు - కొయ్యపలకలు, ఇతరసామగ్రి సరఫరాచేయటం ప్రారంభించాడు. పని చాలా తేలికయినది. జామీను జమచేసి పెద్ద కాంట్రాక్టు మంచి ధరమీద తీసుకోవడం, చిన్నచిన్న గుత్తదార్లకు అమ్మెయటం. అయిదులక్షల కాంట్రాక్టులో నూటికి అయిదురుపాయలు మిగిలితే పోయిందేముంది. తనుమాత్రం బాధపడాల్సింది ఏమీలేదు. సాహచర్యం అతన్ని వ్యాపారస్థునిగా చేసింది.

బారిస్టర్ జగదీశ్‌కు సాయంకాలం డిన్నర్‌కోసం క్లబ్బుకు వెళ్లాల్సివుంది. సోమా నల్లటి సూటు, సూటుతోబాటు గంజిపెట్టి ఇస్త్రీచేసివున్న చొక్కా, చెప్పులు, అన్నీ ఆయనగదిలో మంచందగ్గర పెట్టింది. జగదీశ్ సాయంకాలం ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. తొందర తొందరగా బట్టలు మార్చుకోవడం మొదలుపెట్టాడు. చొక్కా వేసుకుని చూశాడు. చొక్కా చేతికి గుండీలులేవు. గంజిపెట్టిన చొక్కాకి ఒకచేత్తో గుండీలు పెట్టుకోవటం తేలికకాదు.

'బట్టలు - ఇక్కడ ఎవరుపెట్టారు? గుండీలు పెట్టలేదే?' అని జగదీశ్ మండిపడ్డాడు. ఈకోపం వదినగారిమీద లేకపోతే ఊథమ్‌పింగ్‌మీద ప్రకటించారు. నిజానికి అంతా సోమాయే చేసేది. సోమా పక్కనేవున్నగదిలో ఏదోపని చేస్తోంది. ఆయన ఏదైనా అవసరంవచ్చి పిలిస్తే ఇబ్బంది కలగకుండావుండేందుకు ఆమె అలా పక్కగదిలో తారట్లాడేది.

సోమా కేకలు వినగానే సిగ్గుపడిపోయింది. ఆయన చొక్కా తొడుక్కుని వున్నారు. ఒకచేతితో గుండీ పెట్టుకోడానికి ప్రయత్నం చేస్తున్నారు. సాయం చేయాలని ఆ పక్కనేవున్న మరోగుండీ తీసి, ఆయన చొక్కాచేతికి పెట్టడం మొదలుపెట్టింది. ఆయనకి ఎంతో దగ్గరగా మంచోవడంవల్ల ఆమెచేతులు వణకసాగాయి.

జగదీశ్ కోపాగ్ని కర్పూరంలా హరించిపోయింది. ఆయన తన కోపానికి కించపడ్డారు. సోమావనను తేలికపరిచేందుకు చిరునవ్వు నవ్వారు. తన రెండవ చేతిని ఆమె నడుముమీద వేశారు. సోమా చేతినుంచి చాక్కూ క్రిందపడిపోయింది. ఆమె తొట్రుపాటు పడింది. జగదీశ్ ఆమె భుజం పట్టుకున్నారు. సోమా తల ఆయన వక్షస్థలంమీద వాలిపోయింది.

జగదీశ్ ఆమె గడ్డాన్ని వేలితో పైకెత్తి 'ఏమయింది?' అని అడిగాడు.

సోమాకళ్లు మూసుకుపోయాయి. నుదుటిమీద చెమటబిందువులు నిలిచాయి.

'పిచ్చిదానివి. గాభరా పడవలసిన పనేముంది?' జగదీశ్ నెమ్మదిగా అడిగాడు.

జగదీశ్ దీర్ఘంగా నిట్టూర్చారు. గొంతు బరువెక్కింది. సోమా ఇది గమనించింది ఆమె వణుకు దానంతట అదే తగ్గిపోయింది. కళ్లు తెరిచింది. జగదీశ్ ఆమెకు కొత్తవ్యక్తిలా కనిపించారు. ఆమె ఇంతసమీపంగా ఆయన్ని ఎన్నడూ చూడలేదు. ఆయన మైమరచి, ఆమె పెదిమలకి తన పెదిమల్ని కలిపారు.

సోమా కళ్లు మళ్ళీ మూసుకుపోయాయి. ఆమె జగదీశ్ మెడమీద చేతులు వేసింది. తలను ఆయన వక్షస్థలంమీద వుంచి, దీర్ఘంగా నిట్టూర్చింది.

ఆ సంఘటన జరిగాక సోమా రెండురోజులు దిగులుగా ఆలోచనలో గడిపింది. 'అరె. నువ్వు ఏం చేశావు?' అని మనసులోనే తననుతాను తిట్టుకోసాగింది. ఆమెకు ధనసింగ్ జ్ఞప్తికి వచ్చేవాడు. ధనసింగ్ వైజ్‌నాధ్ పోలీసు ఠాణాలో జరిగిన మాటలువిని ఠాణా అధికారిని హత్యచేయడానికి సిద్ధమయ్యాడన్న విషయం ముఖ్యంగా గుర్తొచ్చేది. సోమా అతనికళ్ళకు బంధమయింది. అప్పుడు ధనసింగ్ తన తలను గోడకేసి బాదుకున్నాడు. సోమాని చావగొట్టాడు. ధనసింగ్ చేతుల్లో తిన్న ఆ దెబ్బలు జ్ఞప్తికివస్తే ఆమెకు గర్వం కలిగేది. ఆ స్మృతి ఎంత మధురమైనది! జగదీశ్‌గారి ఒక్క ఆలింగనం స్వీకరించి ఆమె ఆ జ్ఞాపకాలమీద నల్లటిమసి పూసేసింది. కాని ఆయనకుమటుకు ఎలా ఆగ్రహం కలిగిస్తుంది? ఆయన ఆమెకోసం ఎంత చేయలేదు! వాటికి ప్రతిఫలంగా తను ఏమి ఇవ్వగలదు? తను వారి ఇంటిపని చేస్తోంది కాని ఆ పనయితే నౌకర్లందరూ చేస్తారు.

సోమా తన మనసుకు ఊరట కలిగించింది. ఆయన చూపించేదయకు ప్రతిఫలంగా, తిరస్కరించకుండా వుండటం, కోపంరాకుండా చేయటంకన్నా తా నింకేమీ చేయలేదు. పోగొట్టుకున్నదానికోసం ఎంతవరకని దుఃఖించటం! ఏడుస్తూవుండటంవల్ల వచ్చే ప్రయోజనమేమిటి?

• • •

కొండప్రాంతానికి వెళ్ళటంగురించిన ప్రస్తావన మాటిమాటికి వస్తూవుండేది. కానీ బాటిస్టమగాటికి వ్యాపారంవల్ల, వర్షంలా కురుస్తున్నడబ్బు తెచ్చే ఆనందంవల్ల ప్రయాణం కట్టడానికి వీలు కావడంలేదు. పిల్లలనైనా పంపించమని ధర్మశాల నుంచి తల్లిగారు తరుచు వ్రాస్తున్నారు. జగదీశ్ కొత్తగా ప్రారంభించిన వ్యాపారాన్ని ఎలా వదిలివెళ్ళగలడు. సోమాని వెంటతీసుకుని వెళ్తారా అంటే, తల్లిగారి చూపులనుంచి, లాలాగారి చూపులనుంచి తప్పించుకోలేక ప్రాణాలు ఇరుకున పడుతున్నాయి. మనోరమకుకూడా ఆ సంవత్సరం కొండప్రాంతం వెళ్ళడానికి అంత ఉత్సాహం లేదు.

మిసెస్ సరోలాకు ఎండలు చాలా దుర్భరంగావున్నాయి. కానీ ఆమె ఒంటరిగా ఏం చేస్తుంది? అయిదోనెల వచ్చింది. ఆవిడపరిస్థితి ఎలా అయిందంటే మంచంమీదనుంచి లేవడమే కష్టమనిపిస్తోంది. ఇంటిభారమంతా సోమామీదనే వుంది. ఇంటిపనయితే సోమా చాలారోజులనుంచి చూసుకుంటోంది. కానీ ఇప్పుడు ఆమెప్రవర్తనవల్ల నౌకర్లమీదవుండే జాలి క్రమంగా తగ్గిపోవడం మొదలుపెట్టింది.

సోమా మొదట పనిచేసేది, ఇప్పుడు తరుచు ఇతర్లచేత చేయించడం మొదలుపెట్టింది. ఇతరనౌకర్లను పనిచేయమని బ్రతిమలాడకుండా ఆజ్ఞాపించడం మొదలుపెట్టింది. వాళ్ళుకూడా, అమ్మగారిమాట అయితే ఒకసారయినా నిర్లక్ష్యం చేయొచ్చు కానీ సోమా అమ్మగారిమాటనుమాత్రం ధిక్కరించలేమని తెలుసుకున్నారు.

మనోరమ ధర్మశాలలో సోమాని చదవటం-వ్రాయటం నేర్చుకోమని ప్రోత్సాహించింది. దగ్గరకూర్చుని కొద్దిగా నేర్పించికూడా. సోమాకు అలా నేర్చుకోవటం సిగ్గు అనిపించేది. ఇప్పుడయితే సోమాకు ఇంటిపనులలో ఉదమ్‌సింగ్‌ను పిలిచి చాకలిపద్దులు, ఇతరపద్దులు వ్రాయమని కోరటం అవమానకరంగా వుంది.

జగదీశ్‌గారు ఆమెను ఎలా తీర్చిదిద్దాలని కోరుతుండేవారో అలా అవటంకోసం కూడా చదవటం, వ్రాయడం నేర్చుకోవటం ఎంతో అవసరం.

సోమా ఓ ఉపాయంగూడా వెతికి తెలుసుకుంది. దీపా, భూపీ ఇంగ్లీషు కాన్వెంటుస్కూల్లో చదువుతూ వుండేవారు. సోమా పిల్లలకోసం ఇంటివగ్గరకూడా ఒక మాస్టర్‌ని పెట్టించింది. మాస్టరు సరిగా చదివిస్తాడో లేదోనని ఆమె దగ్గిర కూర్చుని చూస్తుండేది. ఒకనెల అవగానే ఎలాగో - అలా చాకలి పద్దులు, ఇతర లెక్కలు స్వయంగా వ్రాయటం ఆమె మొదలుపెట్టింది.

రోజులు గడుస్తున్నాయి.

జగదీశ్ అలవాటుప్రకారం సోమాని మిసెస్ సింగ్ అని సంబోధించారు. సోమా నాలుగువైపులా చూసింది. ఎవరూ తనని చూడటంలేదు. ఆమె నవ్వి తన మృదువైన ఎర్రటిపెదవులమీద వేలుపెట్టుకుని 'నో డియర్, సోమా!' అంది ఆమె నవ్వు సిగ్గుపడుతూ. సోమా పలికే ఇటువంటిమాటలతోనే జగదీశ్ తనని తాను పూర్తిగా మరచిపోయేవాడు. మిసెస్ సరోలా బంగళాలో వుండటమే జగదీశ్ చికాకుకు కారణం అవుతోంది. సోమాకు ఆయన పరిస్థితిచూసి జాలి కలిగేది. సోమాకు ఎలాగో విడిగా ఒక గదివుంది. కాని జగదీశ్ ఆమెను తన గదినుంచి రాత్రి ఎంతో పొద్దుపోయేవరకు వెళ్ళనిచ్చేవాడుకాదు.

జగదీశ్‌గారి నోటంట తన శరీరపుకాంతినిగురించి తన సౌందర్యాన్నిగురించిన పొగడ్త వింటే సోమా ఎంతో మధురానుభూతి పొందేది. యజమాని నోటి నుంచి అటువంటి పొగడ్త వినటంకన్నా మరో ఆనందం ఇంకేముంది! ఈ మత్తు మద్యంవల్లకలిగే ఆనందంలా కొన్నిగంటలే కాదు. ఎనిమిదియామములూ అలానే వుండేది. సోమా ఇప్పుడు ఏలాగో అలా తన శరీరాన్ని దాచుకోవటంకోసం తొందరగా బట్టలు చుట్టుకోవటం లేదు. ఆమె శరీరసౌందర్యాన్ని ఆ బట్టలు స్పష్టం చేస్తున్నాయి కూడా. తన శరీరపుఒంపుల్ని బహిర్గతంచేసేందుకు చీరకొంగుని, 'దుపట్టా'ని తేలికగా మీద వేసుకునేది. తన అందంగురించి ఆమె ఎంతో గర్వపడసాగింది. కార్లలో తిరుగుతూ ఖరీదైనబట్టలు ధరించి సోమరిపోతులుగా తయారైన డబ్బుగలస్త్రీల రూపాలతో తనరూపాన్ని పోల్చిచూసుకునేది. జగదీశ్‌గారిమాట

గుర్తుకొచ్చేది—'అవి పరిమళాలతో నిండి, తళతళలాడే బట్టల్లో చుట్టిన పెంట కుప్పలు, అదృష్టంచేసిన పొరపాటువల్ల ధనవంతులయిళ్ళలో వాళ్ళు పుట్టారు. మరో ధనవంతులదగ్గిర వాళ్ళకు అత్తవారిల్లు దొరికింది. జగదీశ్ పొగడ్తలతో సోమా మాట్లాడేతీరులోనూ, ప్రవర్తనలోనూ అధికారం వచ్చేసింది. ఆమె మనోరమతో కలిసి సినిమాకో, బజారుకో వెళితే నౌకరుగా కాకుండా సోదరిగానో, వదినగానో ప్రవర్తించేది.

సోమాను వదినగారుమాత్రమే పేరుపెట్టి పిలిచేవారు. జగదీశ్ ఆమెను అసలు పిలవనే పిలిచేవాడుకాదు. నౌకర్లు ఆమెను 'సోమా అమ్మగారు' అని పిలిచే వారు. మనోరమ సోమాని 'అక్కా' అని పిలిచేది. పిల్లలు 'పిన్నీ' అని పిలిచే వాళ్ళు. నౌకర్లుగూడా 'సోమా అమ్మగారు' అనిగాని, 'పిన్నిగారూ' అనిగాని పిలవ సాగారు.

సోమా ఇంటిపని భయపడి, శ్రమించి చేసేదికాదు. మమకారంతోనూ, అధికారంతోనూ చేస్తోంది. ఇప్పుడు నౌకర్లను తిడుతోందికూడా. ఇంటినౌకర్లు సుమారు అందరూ పాతవాళ్ళే. తల్లిగారు నియమించినవాళ్లు. వాళ్ళు సోమానికూడా నౌకరుగానే భావించేవాళ్లు ఆమె జీతం తీసుకోకపోతేమాత్రం ఏం! నౌకర్లు ఆమెను అయ్యగారి ఉంపుడుకత్తెగా భావించేవాళ్ళు. యజమాని మేలు కోరటంవల్ల వాళ్ళకి సోమా తిట్లు చీదరింపులు సహింపరానివిగా వుండేవికావి వాళ్లకేమీ గత్యంతరం లేదు. వదినగారికి ఫిర్యాదుచేస్తే ఆమె నౌకర్లనే దుర్మార్గులుగా తలుస్తారు. పూర్వం ఇంట్లో జరిగిన మంచీ - మర్యాద వాళ్ళకళ్ళముందు మెదులుతూంది.

ఇంట్లో కావలసినసామాను నౌకర్లు తెచ్చేవాళ్ళు. అందులో సోమాకు అనేక పొరపాట్లు కనిపించేవి. నమ్మకద్రోహం చేస్తున్నారన్న అనుమానంకూడా కలిగేది. సోమా మొదట రెండుమూడుసార్లు మనోరమను కారులో వెంటతీసుకుని ఇంట్లోకి కావలసినసామాను తీసుకురావటానికి వెళ్ళింది. మనోరమకు ఈ జంజాటనం ఇష్టం లేదు. సోమా ఒంటరిగానే పర్సుతీసుకుని కారులో బజారుకివెళ్ళటం మొదలు పెట్టింది. ఆమె పర్సు ఇంటికి సంబంధించిన పర్సు ఒకటే. చాలా బరువుగా వుండేది. మొదట్లో వదినగారు మిగిలిన తాళంచెవులు అన్నీ సోమాకు అప్పచెప్పి, డబ్బు, ఉగ్రాణం, తాళంచెవులు తనచేతిలో వుంచుకునేవారు. కాని ఈ ఏర్పాటు

గూడా ఇప్పుడు ఆమెకు అనవసరమనిపించింది. ఇంటిడబ్బుకూడా సోమా చేతిలోకి వెళ్ళటం ప్రారంభమయింది.

సోమా డ్రైవరు బరకత్ ఎదురుపడింది. బరకత్ చురుకైనవాడు. అందగాడు. రసజ్ఞుడు, యువకుడు. సినిమాలన్నా, శృంగారనృత్యాలన్నా అభిరుచి ఎక్కువ. ఎంత రసికుడంటే, ఎప్పుడయినా అయ్యగారినిగాని, ఇంటిలోని స్త్రీలనుగాని, సినిమాకు తీసుకువెడితే వాళ్ళు ప్రదర్శనశాలలోకి వెళ్ళిపోయాక, కారుకి తాళంవేసి, తనుకూడా ఎనిమిదణాల టిక్కెట్టుకొనుకుని లోపలికివెళ్ళి కూర్చునేవాడు. ఆట అయిపోగానే వాళ్ళకన్నా ముందుగా కారుదగ్గరకువచ్చి నిలబడేవాడు. తుమ్మెదరెక్కల్లా వుండే మీసాలు, సినిమానటులవంటి శిరోజాలంకరణ, కణతల వరకు వత్తుగా పెరిగిన జుత్తు. డ్రైవరుదుస్తులు ధరించటం అతనికి నచ్చేదికాదు. కారుకూడా తనే యజమాని అయినట్లు డాంబికంగా నడిపేవాడు. సిగరెట్టు త్రాగటంలో, నడకలో, ప్రతి చేష్టలోనూ, అతనిలో ఒక ఠీవి కనిపిస్తూ వుండేది.

సోమా రూపంలోనూ, రంగులోనూ, ప్రవర్తనలోనూ, స్థితిలోనూ వచ్చిన మార్పు బరకత్ గమనించాడు. ఆ కారణంగానే బజారునుంచి వస్తువులు తెచ్చే లాభదాయకమైన పని బరకత్ చేతులనుంచి జారిపోయింది. అయ్యగారి ఉంపుడుకత్తె అయినంతమాత్రాన ఏమయింది? ఆమెకూడా పనిచేసే మనిషే అని మనసులో అనుకునేవాడు. ఆమెతో నవ్వుతూ మాట్లాడేందుకు ప్రయత్నం చేసేవాడు. ఆమెను కారులో తీసుకువెళ్ళేటప్పుడు అయితే నిస్సంకోచంగా తనమనసు తెలిపేందుకు ఏదోపాట అస్పష్టంగా గొణుగుతూ వుండేవాడు. సోమాకు ఇది సబబుగా తోచలేదు కాని ఉపేక్షించటంతప్ప వేరే ఉపాయంలేదు. అవమానాన్ని గుర్తించటం ఆ అవమానాన్ని స్వీకరించటమే అవుతుంది.

ఇంట్లో సోమామాటకి వున్న విలువగురించి బరకత్‌కు తెలుసు. చంచల స్వభావంగల స్త్రీగా ఆమెను భావించేవాడు. బహుశః ఆమె తనవైపు ఆకర్షితమవచ్చు....ప్రపంచం (సినిమా)లో ఏం కలా జరగటంలేదా? అంతిమవిజయం తన సామర్థ్యంమీదే ఆధారపడివుంది. అయ్యగారి ఉంపుడుకత్తెగానే వుంటోంది కదా! ఏదో ఒకవిధంగా ఆమెను లొంగదీసుకోవచ్చు. ఒకసారి నవ్వి ఆమె ముఖంలోకి సూటిగా చూసినట్లయితే తర్వాత దానంతట అదే దారి ఏర్పడుతుంది.

ఒకరోజు సోమా బజారులో ఒక దుకాణందగ్గర పని పూర్తిచేసుకుని కారు దగ్గరకు తిరిగిరాగానే బరకత్ కారుతలుపుతెరిచి వెకిలిగానవ్వి, వంగి నమస్కారం చేసి— 'అమ్మగారూ, కొంచం బీదవాళ్ళనిగూడా దృష్టిలో పెట్టుకోండి' అన్నాడు.

బరకత్ రెండు మూడు రూపాయలు బక్షీసు అడిగినట్లయితే సోమా ఇవ్వగలదు. నౌకర్లకు కానుకలు ఇస్తూవుంటేనే గౌరవం అని తెలుసుకుంది. ఆమె పూర్వం ఆ గౌరవంవల్ల కలిగే ఆనందాన్ని పొందింది. కాని బరకత్ ప్రవర్తనలో గౌరవఛాయలు లేవు. దుర్మార్గం కనిపిస్తోంది. సోమా నుదుటిమీద కోపపుఛాయలు వ్యాపించాయి— 'ఏమిటి వాగుతున్నావ్। ఏదన్నా చెప్పాలనుకుంటే అయ్యగారితో చెప్పుకో!' అని కోప్పడింది.

బరకత్ భయపడ్డాడు. పళ్ళునూరుతూ 'నీ పని పడతాను' అనుకున్నాడు.

• • •

క్రితం సంవత్సరం శీతాకాలంలో మనోరమ పరివారంతోసహా ధర్మశాల నుంచి లాహోర్ వచ్చిన కొద్దిరోజులకే భూషణ్, తోటి ఖైదీలతోకలిసి జైలు నుంచి విడుదలయ్యాడు. రెండున్నర సంవత్సరాలక్రితం కమ్యూనిస్టుయుద్ధంలో కలవడానికి తిరస్కరించటంకారణంగా ఇంగ్లీషుప్రభుత్వం ఆగ్రహానికి పాత్రుడయాడు. జ్యూన్ 1941 లో జర్మనీ రష్యామీద దాడి జరిపింది. జపాను భారతదేశంవైపు ముందుకు సాగింది. కమ్యూనిస్టులు ఇంగ్లీషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకులు కాని జర్మనీ జపానుల సిద్ధాంతాలను అంతకన్నాకూడా శత్రుభావంతో చూసేవాళ్ళు. జర్మనీకి పరాజయం, రష్యాకి విజయం కలగటంవల్ల వాళ్ళకు అంతర్రాష్ట్రీయరంగంలో సమాజవాదాన్ని బలపరిచే ప్రజాతంత్రశక్తి ఇంకా పటిష్ఠం కాగలదన్న ఆశ కలిగింది.

నిరుత్సాహంతో శక్తిహీనమైన ఇంగ్లీషుసామ్రాజ్యం స్థానంలో ముందుకు సాగుతున్న జపాను ఎక్కువ ప్రమాదకారిగా కమ్యూనిస్టులు తలచేవాళ్లు. జపాను బాంబులకు భారతదేశప్రజలు ఎరకావటానికి వాళ్ళు ఏమాత్రం ఇష్టపడేవాళ్లు కాదు. అంతర్రాష్ట్రీయరంగంలో మార్పు రావటంచేత తమ ఆదర్శాలనికూడా మలుచుకున్నారు. తమదేశాన్ని, సమాజాన్ని రక్షించటంకోసం ఆ యుద్ధాన్ని ప్రజా

యుద్ధంగాతలచి ఆత్మరక్షణకోసం యుద్ధంలో పాల్గొనాలని సలహా ఇవ్వసాగారు. ప్రభుత్వం అనేకమంది కమ్యూనిస్టులను జైలునుంచి విడుదల చేసేసింది. అందు చేత ఇంగ్లీషువాళ్ళని ద్వేషించేవాళ్ళు ఇంగ్లీషువాళ్ళకి హానిజరిగితే తృప్తిపడేవాళ్ళు కమ్యూనిస్టులను ద్వేషించటం మొదలుపెట్టారు.

భూషణ్ మనోరమావాళ్ళ బంగళాకు రాలేదు. మనోరమ మనసులో మథన పడింది. జైలునుంచి విడుదలయినవ్యక్తికి సానుభూతి తెల్పటంకోసం తనే స్వయంగా భూషణ్‌ను కలవటం ఎక్కువ సమంజసంగా వుంటుంది అనుకుంది. ఈవిషయంలో ఆమె అతన్ని తొందరపెడుతోందని అతను అపార్థం చేసుకోలేదు. ఆమె పార్టీ ఆఫీసుకు చేరగానే భూషణ్ తన మిత్రులకు పార్టీకి సంబంధించిన కొత్తసూత్రాలని. అంశాలని. నిర్ణయించి చెపుతున్నాడు. అతనికి మనోరమతో మాట్లాడేందుకు తీరుబడి దొరకలేదు. నవ్వుతూ పలకరించాడు. 'మీరెలావున్నారు? జగదీశ్ ఎలా వున్నాడు? సోమా పరిస్థితి ఏమయింది?' అని అడిగి 'నేనివాళ బొంబాయి వెళుతున్నాను. తిరిగివచ్చాక మీ ఇంటికి వస్తాను' అన్నాడు.

భూషణ్ తనమాట వద్దాలుగునెలలతర్వాత నిలబెట్టుకున్నాడు. వస్తూనే అతను అభివందనలు తెలిపాడు—'నేను పత్రికలలో నువ్వు వ్రాసిన రెండుమూడు వ్యాసాలు చూశాను. నీ కలంలో వేగంవుంది కాని నీ ఆలోచనల్లో వేగం లేదు. చిక్కుముళ్ళున్నాయి. భావాలు స్పష్టంగా లేవు. నువ్వు పార్టీపేపరు రోజూ వేళ ప్రకారం చదువుతావుకదా? రాయ్‌గారి డెమోక్రటిక్ లయన్‌లోనూ, మా లయిన్‌లోనూ వున్నభేదం నీవ్యాసాలలో స్పష్టంగా కనిపించటంలేదు. చర్చిల్‌గుట్ సమాజవాదులం అనటంలో మాకు నమ్మకంలేదు. పరిస్థితులే స్వయంగా విప్లవాన్ని లేపుతాయి అనేది కమ్యూనిస్టులు నమ్మరు. అలా ఎన్నడూ జరగదు. మనుష్యుల ప్రయత్నాలకలయికయే ఒక ఆవశ్యకమైన పరిస్థితిని కలుగచేస్తుంది. మేము ఇప్పుడు ఫాసిజమ్‌ను ఎదుర్కోవాల్సివుంది. రాష్ట్రీయ ఆత్మ-నిర్ణయానికి సంబంధించిన అధికారంకూడా మేము తీసుకోవాల్సివుంది. మా పని చాలా ఇక్కట్లతో కూడుకుని వుంది.'

రెండున్నర సంవత్సరాలతర్వాత భూషణ్ కలసిన ఆసమయంలో పార్టీ ఆశయాలనుగురించిన ఉపదేశం వినాలని మనోరమ ఆశించడంలేదు. ఆమె ఒక

రచయిత్రి అన్న విషయంమీదకూడా భూషణ్ దెబ్బకొట్టాడు. ఒకవిధంగా ఇది కృతఘ్నతకూడా. ఎప్పుడయితే ఆమె భూషణ్‌ను కలుసుకోవటానికి పార్టీ ఆఫీసుకు వెళ్ళిందో అప్పుడు భూషణ్ మిత్రులకు 'కొత్త థీసిస్ (వాదం) తెలియచెబు తున్నారు. మనోరమ కొద్దో గొప్పో వినగలిగింది. దాని ఆధారంమీదే కమ్యూనిస్టులను నిందలనుంచి, తిట్లనుంచి తప్పించేందుకు ఆమె ఈ వ్యాసాలు వ్రాసింది. ఈ వ్యాసాలు సరిగాలేవని ఇప్పుడే భూషణ్ అంటున్నాడు.

మనోరమ తన రుమాలు వేళ్ళకు చుట్టుకుంటూ, పెదిమలు బిగించి 'నేను మీ పార్టీ ఆదేశానుసారం వ్రాయలేదు. నాకు సరైనదని తోచింది, వ్రాశాను. ఇంతకన్నా ఎక్కువగానే కాంగ్రెసువాళ్ళు కోపగిస్తున్నారు. మీ పార్టీవాళ్ళుగూడా కోపగించవచ్చు. వుండు టీ తెప్పిస్తాను' అంది.

'అవును, సోమా ఎలా వుంది. ధనసింగ్‌గురించి ఏమైనా తెలిసిందా?' భూషణ్ మనోరమ సమాధానం వినన‌ట్లుగానే అడిగాడు.

మనోరమ ఆలోచించి 'వుండు, పిలుస్తాను' అని లోపలికివెళ్ళి కొద్దిసేపట్లో తిరిగివచ్చింది.

'ఈ సంవత్సరం మీరు కొండప్రాంతం వెళ్ళలేదా? బొంబాయిలో ఈ కాలం చాలా ఇబ్బందిగా వుంటుంది. ధర్మశాల ఎంతగానో గుర్తుకు వచ్చేది' అన్నాడు భూషణ్.

రెండు మూడు నిముషాలతర్వాత అందంగా అలంకరించుకుని, నాగరికురాలులాగున్న ఒక స్త్రీ సూదులతో ఊలు అల్లుతూ గదిలోకి ప్రవేశించింది. ఆమె గంజిపెట్టి ఇస్త్రీచేసిన చీర కట్టుకుంది. ముఖాకృతి అధికారయుతంగానూ, ఆత్మ విశ్వాసంతోనూ నిండివుంది. ఆమెకు నమస్కరించి భూషణ్ తన చేతిలోవున్న వార్తాపత్రిక చూడసాగాడు. 'గుర్తుపట్టలా, ఈయన కామ్రేడ్ భూషణ్' అంది మనోరమ.

భూషణ్ దృష్టిని అటువైపు తిప్పాడు. ఆమె మనసు ఎంతో సంకోచంతోనూ, వ్యాకులతతోనూ నిండిపోయింది. ఆమె తత్తరపాటుతో భూషణ్‌కు నమస్కారం చేసింది.

ప్రతినమస్కారం చేసి భూషణ్ మనోరమవైపు చూశాడు. మనోరమ నవ్వి 'మీరుకూడా గుర్తుపట్టలేదా?' అన్నది.

'సోమాయేనా?' భూషణ్ ఆశ్చర్యంగా అడిగాడు.

సోమా ముఖం వాలిపోయింది. ఆమె లేచి వెళ్ళిపోయింది. భూషణ్ కొద్ది నిముషాలు మౌనంగా ఆశ్చర్యంతో చూస్తూవుండిపోయాడు. 'ధనసింగ్ ఎక్కడున్నాడు?' అని అతను అడిగాడు.

మనోరమ క్లుప్తంగా ధనసింగ్ పరారీకి సంబంధించిన కథ వినిపించింది.

భూషణ్ కొద్దినిముషాలు మౌనంగావుండి—'ఒకప్పుడు ఈమె జీవితం అతను లేకపోతే అసంభవం అన్నట్లుగా వుండేది. ఇప్పుడు ఈమె మరో ప్రపంచంలో వుంది. బహుశా నీకు గుర్తుండేవుంటుంది. ప్రేమ కేవలం జీవితానికి తృప్తి కలగచేసేది అని నేను ఓమాటు చెప్పాను' అన్నాడు.

మనోరమకు గుర్తుంది—ఆకాశంలో మేఘాలు ఆవరించి వున్నాయి. వేగంగా వీచే చల్లటిగాలి ఊపుకల్ల బట్టలు పైకెగిరిపోతున్నాయి. చెట్ల ఆకుల రాపిడివల్ల వచ్చే సర్‌సర్‌మనేమోత వినడం కష్టంగా వుంది. అయినప్పటికీ ఆ మాటలవల్ల హృదయం తూట్లు పడిపోయింది. ఆమె తూటపడినట్లుగా అలసటచే రాతిబండమీద ఒరిగిపోయింది. అందువల్లే భూషణ్‌కు ఇంత అహంకారం. మనోరమ ఏం మాట్లాడలేదు.

భూషణ్ తనమనసు తెలియపరిచాడు—'ధనసింగ్ ఎప్పటికీ రాకపోవచ్చు. ప్రాణభయం చాలా పెద్దది. లేకపోతే అతనిజీవితంలో తోడ్పడే మరోస్త్రీ తటస్థపడి వుండవచ్చు.'

మనోరమ ఒక పెద్దదెబ్బ తగిలినట్లుగా అనుభూతిచెంది మౌనంగా వుండిపోయింది.

భూషణ్ చెపుతూనేవున్నాడు—'ఒకవేళ ధనసింగ్ ఈరోజు తిరిగివచ్చినా, ఈమె అతన్ని స్వీకరించనుకూడా లేకపోవచ్చు. ఈమెకు అతనిమీద విరక్తి కలగడం మొదలయింది. పాపం ఏంచేస్తుంది?' భూషణ్ ఏ ఫలితాన్ని పొందటం కోసం ఈ చర్చ సాగిస్తున్నాడో, ఆ చర్చ మనోరమకు రుచించలేదు.

'మంచిది. తన కాళ్ళమీద తాను నిలబడనీ' మనోరమ ఆ ప్రసంగం ఆప టానికి ప్రయత్నించింది.

భూషణ్ ఆమె విరక్తిని లక్ష్యపెట్టకుండా—'ఒకదశలోకి వచ్చినతర్వాత స్త్రీకి ఎవరో ఒకరిని వివాహంచేసుకుని జీవితం గడపటం సాధ్యంకాదు. పెళ్ళి చేసుకోకుండా వుండేటట్లయితే తనజీవితం జరుగుబాటయ్యేందుకుకూడా ఏదో ఒక పని చేయాల్సివస్తుంది. ప్రస్తుతం మన సమాజంలో స్త్రీలు చేయదగినవి రెండే పనులున్నాయి. అధ్యాపకురాలు అవటం. లేకపోతే డాక్టరుగా కావటం. ఈమెకు వర్ప్రనికి సంబంధించిన శిక్షణ ఇప్పించు. తన కాళ్ళమీద తాను నిలబడగలుగు తుంది. తర్వాత కావాలనుకుంటే వివాహంకూడా చేసుకుంటుంది.'

ధర్మశాలలో భూషణ్ 'సాంగత్యంతోకూడిన ప్రేమ'ను గురించి ఉపదేశం ఇవ్వటం మొదలుపెట్టాడు. అతని ప్రసంగం ప్రారంభమయినతర్వాత సోమా ఒంటిన ఈ ఉపదేశమంతా తనకే ఇస్తున్నాడని తెలుసుకుంది. ఆమె భూషణ్ వైపు చూడకుండానే, 'ఎందుకు బాధపడతావు. స్వానుభవం ఏవో దారి చూపిస్తుంది' అని సమాధానం చెప్పింది.

భూషణ్ సిగరెట్టు అంటించాడు—'నేనుమాత్రం ఒక ముఖ్యవిషయాన్ని గురించి మాట్లాడుతున్నాను' అన్నాడు.

మనోరమకు అది మరింత అనుచితంగా కనిపించింది. 'అయితే నీ గొంతు మీద ఎవరూ కూర్చోటంలేదు కదా!' అనేసింది మనోరమ.

భూషణ్ మౌనంగా వుండిపోయాడు. అభిమానం దాచుకోవటంకోసం నవ్వ టానికి ప్రయత్నించి, సిగరెట్టునుంచి రెండుదమ్ములు లాగి లేచి నిలబడ్డాడు— 'ఇంకా మూడువారాలు ఇక్కడే వుంటాను. మళ్ళీ కలుస్తాను' అన్నాడు. భూషణ్ వెళ్ళిపోతూ చేసిన నమస్కారానికి ప్రతిగా మనోరమ చిరునవ్వుకూడా నవ్వలేక పోయింది. కేవలం చేతులు జోడించింది అంతే!

మనోరమ మనస్సు అంతులేని నిరుత్సాహంతో నిండిపోయింది. పుస్తకం వెతికి చదవటానికి కూర్చోలేదు. సోమానుకూడా మాట్లాడటానికి పిలవలేదు. సోమాతో ఏం మాట్లాడుతుంది? సోమానిగురించి విన్నమాటలనుగురించి ఆలో

చిస్తోంది. ఏమిటి. సోమా విలంగానే అన్నయ్యను ప్రేమిస్తోందా? అన్నయ్య సోమాను ప్రేమిస్తున్నాడా? వదినతో అన్నగారివివాహం ఒక సామాజిక దుర న్యాయమనే ఆమెకు తోచింది కాని నాలుగునెలలనుంచి మిసెస్ బాసూవైపు జగదీశ్ అనురక్తిగా వుండటంచూపి. మనోరమ మనస్సు బాధతో నిండిపోయింది. అన్నయ్య ప్రేమని ఒక ఆటగా భావిస్తున్నాడు అనుకుంది. అన్నగారి ఈ బలహీన తకు బాధ్యత. అతనిపట్ల పక్షపాతం చూపిస్తున్న తమ తల్లి-దండ్రులమీదనే వుంచింది. వాళ్లు జగదీశ్ వివాహం గాయత్రితో చేయలేదు. ఈ విషయంలో అత నికి తీరని అన్యాయం చేశారు.

కానీ సోమా?....సోమా ధనసింగ్‌ని ప్రేమిస్తూవుండేది. ఇప్పుడు అన్న య్యతోగూడా అదేవిధంగా వ్యవహరించటం మొదలుపెట్టిందా?....లేకపోతే సోమాకు ఆశ్రయం ఇచ్చినందుకు, దయ చూపించినందుకు ప్రతిఫలం ఇచ్చుకో వలసి వస్తోందా? సోమా తనని తాను సమర్పించుకుని ఆశ్రయం ఇచ్చినందుకు ఋణాన్ని తీరుస్తోందా. లేకుంటే ప్రేమకి ధర కడుతోందా?

మనోరమకు ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. స్త్రీలందరూ ఆశ్రయం విలువను, ప్రేమవిలువను తమని అర్పించుకుని తీరుస్తారు. ప్రేమవిలువలో జీవి తాంతం ఆశ్రయం పొందింది దబ్బు! ఆశ్రయం కోరనివాళ్ళకే ప్రేమించే అధికార ముంది. తమ కాళ్ళమీద నిలబడివుండగలిగినవాళ్ళకే ప్రేమించే హక్కుంది. భూషణ్ 'తమకాళ్ళమీదనిలబడి వుండగలిగే' మాట సరిగానే చెప్పాడు. మనోరమ తనవిషయంలో ఆలోచించసాగింది. ఇరవై రెండేళ్ళవయసులో ఎమ్. ఏ. ప్యాసై కూడా తనకాళ్లమీద తాను నిలబడలేకపోయింది. వాస్తవానికి ఏ మాటఅయితే సోమాకు వర్తిస్తుందో అదేమాట తనకుకూడా వర్తిస్తుంది.

కేవలం ఆశ్రయంకోసం వివాహం చేసుకోకూడదని మనోరమ నిశ్చయం చేసుకుంది. సోమా ఉదాహరణ తన ఎదుట వుంది. తెలిసో, తెలియకో సోమా ఏం చేస్తోంది? కానీ దాన్ని అత్యాచారంకిందమాత్రం సోమా భావించడంలేదు. చట్ట సమ్మతంగానూ, సామాజిక అధికారరూపంగాను, ఆమె కోరుకునేది పొందలేదు. కానీ వదినకన్నా అన్నయ్యకు సోమా ఎక్కువ సంతోషాన్ని ఇస్తూంది. మనోరమ మనసులో సోమామీదవున్న గౌరవంపోయి, కేవలం దయ కలిగింది. ఆమె ఆ చర్చ

తనలో తాను చర్చించసాగింది. సమాజం ఏమనాలనుకుంటే అది అంటుంది కానీ సోమా స్థితికి సమాజం ఏ సమాధానం ఇవ్వగలదు? ఏం సోమాకు ఎవరూ మిత్రుడు వుండకూడదా? అన్నయ్యతో ఆమెకు వున్న సంబంధం ఇంకేమిటి? కానీ అన్నయ్య పెట్టే రొట్టెముక్కమీద సోమా ఆధారపడివుంది. అలా కాకపోయినట్లయితే సోమా ఈ సమాజాన్ని ఎదిరించి సమాధానం చెప్పగలిగివుండేది.

మనోరమ సాయం సమయంలో సోమాని తన గదిలోకి పిలిచింది. భూషణ్ ని అకస్మాత్తుగా కలుసుకున్నాక సోమా పాతస్మృతులకు తీవ్రమైన మానసికగాయం తగిలింది. ఇద్దరూకూడా బాధలో వున్నారు. సోమా ఇప్పుడు సంకోచంవల్ల కొంచం వెనక్కుజరిగి కూర్చోవటమూలేదు, మౌనంగా వుండిపోయి వినటమూలేదు. తనకు నచ్చినవిధంగా మనోరమ అడిగినదానికి సమాధానమిస్తూంది.

'ధనసింగ్ విగురించి ఏమీ తెలియలేదు. అతను రావచ్చు, రాకపోవచ్చు. జీవితం ఎవర్ని ఎక్కడికి తీసుకు వెడుతుందో ఏం తెలుస్తుంది!' అన్నది మనోరమ.

సోమా దీర్ఘంగా నిట్టూర్చింది. మనోరమ చెపుతూనేవుంది - 'కానీ జీవితాన్ని గడుపుకోవటంకోసం మనిషిదగ్గర ఏదో ఒక సాధనం వుండటం అవసరం.'

మనోరమ నచ్చజెప్పింది. తను స్వతంత్రంగా జీవించటంకోసం తనను తాను కాపాడుకోవాలని కోరుతోంది. తండ్రిగారు ఆమెను బాధల్లో ముంచాలనుకుంటున్నారు కానీ తన కాళ్ళమీద తాను నిలబడాలని నిశ్చయించుకుంది. ఆమె సోమాకు సలహా ఇచ్చి 'నువ్వు నర్సుపని ఎందుకు నేర్చుకోకూడదు! నీకు తెలుసా, విద్యాకౌల్ అనే ఒకమ్మాయి నర్సుగా పనిచేస్తోంది. నెలకు మూడువందలు సంపాదిస్తోంది' అని చెప్పింది.

'సరే అక్కగారూ, కానీ స్త్రీ ఉద్యోగంచేసి పొట్ట పోషించుకునేటట్లయితే ఆమెజీవితం ఏముంది? స్త్రీకి ఇల్లు చక్కబెట్టటంలోనే శోభవుంది' అన్నది సోమా.

మనోరమ మౌనంగా వుండిపోయింది. ఈ ఇంటిని చక్కబెట్టేహక్కు నీకులేదని ఆమె ఎలా చెప్పగలదు! ఇదేమాట సోమా మనోరమ ఉద్యోగం చేయటంగురించి వివరిస్తూ చెప్పింది. ఇప్పుడు మనోరమకోసం, తనకోసం ఒకేనీతి.

ఒకే నియమం వున్నాయని సోమా తెలుసుకోసాగింది. ఆత్మక్షోభతో కృశించిపోయే భావం సోమా మనసునుంచి దూరం చేసుకుంది. ఇక మనోరమ ఏమనగలదు?

మనోరమకు రచనలమీద అభిరుచి వుండేది. ఆమె కొన్ని కథలూ, వ్యాసాలు వ్రాసిందికూడా. ఆమె ఊహలో రచయిత్రి అవాలన్న అభిలాష వుండేది. రచయిత్రిగా అయితే కీర్తి, ఆత్మసంతృప్తి కలుగుతాయని ఆమె నమ్మకం. రచయిత్రి అవాలనే మనోరమకోరిక వినగానే జగదీశ్ నవ్వుతూ 'ఒకవేళ నువ్వు ఈదేశంలో రచనలుచేసి బ్రతుకుతెరువు సంపాదించుకోగలిగితే రవి ఠాకుర్‌వి అయిపోతావు' అని అన్నాడు. మనోరమ ఈ ఎగతాళితో నిరుత్సాహపడలేదు.

భూషణ్ మాట ఆమె హృదయాన్ని బాగా గాయపరిచింది—ఏం తను అంత అర్థం చేసుకోలేదా? ప్రజలుచేసే తిరస్కారాన్ని లక్ష్యపెట్టకుండా సమర్థిస్తూ వ్రాసినమాటకే అపకీర్తి కలిగిస్తుందా? దీనికన్నా వ్రాయకుండావుండటం మంచిది. అంతే చేయవలసింది. తను వాళ్ళతరఫున ఎందుకు వ్రాయాలి? ఇలాంటి అన్యాయం జరగటంతో మనోరమ మనసు తూల్లుపడింది. రచయిత్రి అవాలన్న బలమైన కోర్కెను వదలిపెట్టి తన మనుగడకోసం అధ్యాపకురాలివృత్తి స్వీకరించాలనుకుంది. ఎవరి అభిప్రాయం తీసుకోకుండానే ఆమె రెండు స్థానిక స్త్రీలకళాశాలలకు ఉద్యోగంకోసం దరఖాస్తులు పెట్టింది.

చందాలమీద నడిచే ఏ కాలేజీకైనా లాలా జ్వాలాసహాయ్‌గారి కుమార్తెతో వ్యవహారం ఏర్పరచుకోవటం ఉపయోగకరం. మనోరమకు రూ. 150 నెల జీతం మీద చదువు చెప్పడానికి పిలుపు వచ్చింది.

జగదీశ్ అడ్డు తగిలాడు.–'నీకు చదువుచెప్పాలన్న అభిరుచివుంటేనూ, ఇంట్లో ఏమీ తోచకపోతేనూ, జీతం తీసుకోకుండా పనిచెయ్యి. ఇలా ఉద్యోగం చెయ్యటం లాలాగారు ఎన్నడూ సహించరు' అన్నాడు.

మనోరమ సమాధానంగా—'ఇది ధనవంతులమన్న మీ అహంకారం మాత్రమే. చదువుచెప్పి బ్రతుకుతెరువు ఏర్పరచుకోవటం ఏమీ సిగ్గుపడాల్సిన పని కాదు' అని చెప్పింది.

బారిస్టరుగారు అంగీకరించారు. 'ధనవంతులమన్న వర్గమూలక అహంకారం

వుంటే దానికి కొన్ని ప్రభావాలుకూడా వున్నాయి. ఈ స్త్రీలకళాశాలలనుంచి నువ్వు నెలకు 150 చొప్పున ఏడాదికి రూ. 1500 జీతం సంపాయిస్తావు. లాలాగారు ఆ సంస్థకి రూ. 5000 సాంవత్సరీక చందాక్రింద ఇస్తారు. ఇది హాస్యాస్పదం కాకపోతే ఏమిటి? నువ్వు నీ తండ్రిగారి ఆత్మగౌరవాన్ని గాయపరచి నీ ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలని కోరుకుంటున్నావా?'

జగదీశ్ మనోరమ ఉద్యోగవిషయంగురించి లాలాగారికి తెలియపరిచాడు. లాలాగారు, తల్లిగారు నిరసిస్తూ ఉత్తరం వ్రాశారు. మనోరమ కోపంతో పళ్ళు కొరికింది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. కానీ ఆమె కన్నీళ్ళు కింద రాలనీయలేదు.

మేజర్ బాసూ, మిసెస్ బాసూ మసూరీ వెళ్లారు. ఇక మిలటరీ కాంట్రాక్టుకు సంబంధించినపనిలో మేజర్ బాసూని కలవడం జగదీశ్‌కు తప్పనిసరి అయింది—'దసరా శెలవుల్లో ఈ సంవత్సరం మనం కొండప్రాంతానికి వెళ్ళలేదు. ఒక వారంపాటు మసూరీ వెడదాంపద' అని జగదీశ్ మనోరమతో అన్నాడు.

మనోరమకు లాహోర్‌లో విరక్తితప్ప ఆసక్తిని కలిగించేది ఏమీ లేదు. సోమాతోమటుకూ ఆమె నిత్యం ఏం మాట్లాడుతుంది? అదీకాకుండా ఇప్పుడు సోమా ఇంటినంతటిని నిర్వహించే అధికారాన్ని, ఆనందాన్నిపొంది తృప్తి చెందుతూంది. మాట్లాడటానికి కానీ, మాట్లాడే అవసరంకానీ ఆమెకు అసలే తక్కువ. వదినకు నలువైపులా నర్సులు, లేడీడాక్టర్ల హడావిడి ఎక్కువయింది. ఒక కొత్త ప్రాణి జన్మించడానికి జరిగే ఏర్పాటులలో ఉత్సాహంకన్నా కష్టమూ, బాధే ఎక్కువ వున్నట్లుగా అనిపించాయి.

మనోరమకు తోటి స్నేహితురాండ్రపట్ల అంత ఆసక్తిలేదు. ఇప్పుడామెకు వాళ్ళను కలుసుకోవటానికే సంకోచం కలుగుతోంది. ఆమె సమవయస్కులందరికీ వివాహాలు అయిపోయాయి. వాళ్ళు వయసుమళ్ళిన వాళ్ళకిమల్లే మనోరమతో మాట్లాడుతూవుంటారు. మనోరమ ఇంకా వివాహం చేసుకోనందుకు సానుభూతి చూపిస్తుండేవాళ్లు. మనోరమ ఏదో పరీక్ష పోగొట్టుకున్నట్లు ప్రవర్తించేవాళ్లు. లాహోర్‌నుంచి కొద్దిరోజులపాటు ప్రయాణం అవటం గురించిన ప్రసంగం ఆమెకు చాలా ఆనందాన్ని కలిగించేది.

విదేశాలనుంచి తిరిగివచ్చేటప్పుడు బొంబాయిలో హైదర్అలీ సుతలీవాలాకి బారిస్టర్ జగదీశ్‌గారితో పరిచయం జరిగింది. ఇది జరిగిన కొద్దిరోజులకే సుతలీ వాలా షేర్ల వ్యాపారానికి సంబంధించినవిషయంలో ఒక వారంరోజులు గడప టానికి లాహోర్ వచ్చారు. బారిస్టరుగారి అతిథిగా అయారు. బొంబాయి తిరిగి వెళ్ళినతర్వాత బారిస్టరుగారికి మనోరమకు ధన్యవాదాలు తెల్పుతూ ఆయన సహృద యతాపూర్వకంగా ఉత్తరాలు వ్రాశారు. జగదీశ్‌కు సుతలీవాలాతో బాగా ఆత్మీయత పెరిగింది. మనోరమకూడా సుతలీవాలాను సజ్జనుడుగానూ, సహృదయుడుగానూ తలచేది. ఆతర్వాత కొంతకాలం ఉత్తరప్రత్యుత్తరాలు జరగలేదు. కాని మసూ రీలో అనుకోకుండా ఒకళ్ళనొకళ్లు ఒకే హోటల్లో కలుసుకోవటం జరిగింది. ముగ్గురూ ఎంతో ఆనందించారు.

మేజర్, మిసెస్ బాసూ సవాయ్ హోటల్లో వుండేవాళ్లు. జగదీశ్ మనో రమలుకూడా అక్కడే వుండటానికి నిశ్చయించారు. హైదర్ జీ సుతలీవాలాకూడా అక్కడే దిగారు. మేజర్‌బాసూ సమయం దాదాపు ఇంగ్లీషు ఆఫీసర్ల సాంగత్యం లోనే గడిచిపోయేది. జగదీశ్ సమయం మిసెస్ బాసూ సాంగత్యంలోనూ, మనో రమకు సుతలీవాలా సాన్నిహిత్యంలోనూ గడిచిపోతూవుండేది. కేవలం వినో దమూ, విశ్రాంతికోసం మసూరీవచ్చే సామాన్యప్రజలమాదిరి కాకుండా సుతలీ వాలా నిత్యం అక్కడికివచ్చిన ధనవంతులతో తన షేర్ల విక్రయం, (షేర్లు అమ్మే దలారి) వ్యాపారం చేయటానికి వచ్చాడు.

అవి కొనగలశక్తివున్న ధనవంతులకు విందుకు ఆహ్వానం పంపడం, వాళ్ళ ఆహ్వానాన్ని స్వీకరించడం, సుతలీవాలా చేసేవ్యాపారంలో ఒక అంశం. సుతలీవాలా ఈవిధంగా పనిలో నిమగ్నుడై వుండటం, కష్టపడి పనిచేయటం చూసి మనోరమకు అతనిపట్ల గౌరవభావం కలిగింది. సుతలీవాలా మనోరమతో కలిసి తిరగడం, ఆమెతో కలిసి భోజనం చేయడంవంటి అవకాశాలుగూడా పొందు తుండేవాడు.

జగదీశ్ సుతలీవాలాతో ఆత్మీయతతో మాట్లాడేవాడు. అతనిఎదుట మనో రమతో కలసి సమాజవాదంగురించో, కమ్యూనిజంగురించో మాట్లాడక తప్పేది కాదు. సుతలీవాలా ఎరిగిన కమ్యూనిజం చిక్కులతో నిండినది కాదు. ఆయన

పోషలిజంపట్ల మాత్రం సానుభూతి తెల్పేవారు. తనకు సంబంధించినదే ఒక ఉదాహరణ ఇచ్చి చెప్పారు—'నేను పెట్టుబడి క్షీణతకు సంబంధించిన అత్యాచారాన్ని ఎలా నిరసించగలుగుతాను! పెట్టుబడి ప్రోగుచేసి ధనవంతులకు ఇస్తున్నాను. ధనవంతులకు వచ్చే ఈ లాభంలో నా కష్టానికి ప్రతిఫలంగా నా భాగం ఎంత వస్తుంది! పెట్టుబడివాదానికి అన్నిటికన్నా మించిన పెద్దశత్రువు పెట్టుబడివాదమే. డబ్బు ప్రోగుచేసిన వాళ్ళదగ్గరకు అధికారంకూడా ప్రోగయేపద్ధతియే పెట్టుబడిదార్లను. వాళ్ళసంఖ్యను తగ్గిస్తూపోతోంది. పెద్ద పెట్టుబడివార్లపోటీవల్ల చిన్న పెట్టుబడిదార్లు తగ్గిపోతున్నారు. పెట్టుబడివాదాన్ని నిరసించే వాళ్ళసంఖ్య పెరుగుతూ పోతోంది.'

సుతలీవాలా మనోరమకు తేలికగా అర్థమయేవిషయాలమీద, ఆమెకు ఇష్టమైనవిషయాలమీద ధ్యాస వుంచేవారు. ఆమె ఎదురుగా వున్నప్పుడు అలవాటు ప్రకారం ఎప్పుడైనా సిగరెట్టు నోట్లో పెట్టుకున్నట్లయితే దాన్ని అంటించేవారు కాదు. 'పొగాకు పొగపీల్చటం నాకు చాలా అలవాటు. దానివల్ల నాకేమీ ఇబ్బంది కలగదు. మీరు సిగరెట్టు అంటించుకోండి' అని మనోరమ చాలాసార్లు చెప్పింది.

'ఎక్కువగా కాకపోయినా, నేను చెయ్యాల్సిందేమిటంటే, ఏ వస్తువు అవసరం లేదో, దాన్ని మీ అంగీకారం తీసుకున్నాక వాడుతాను' అనేవాడు సుతలీవాలా.

ఒకసారి సుతలీవాలా పొరపాటున సిగరెట్టు పెదిమలమధ్య పెట్టుకుని మళ్ళీ దాన్ని కేసులో తిరిగి పెట్టేయబోతుండగా మనోరమ స్వయంగా అగ్గిపుల్ల వెలిగించి అంటించింది. 'నేను చెపుతున్నాను. మీరు సిగరెట్టు కాల్చండి. నేను చెప్పానుగా మరి!' అంది.

జగదీశ్ సుతలీవాలా మంచితనం, సత్ప్రవర్తన, చాకచక్యంగురించి పొగడుతూవుండేవాడు. మనోరమ జగదీశ్ మనోభావాన్నిగ్రహించి అనుమానించేది. మసూరీనుంచి వెళ్ళటానికి ఒకరోజు ముందుగా జగదీశ్ స్పష్టంగానే ఆమెను అడిగాడు. 'సుతలీవాలాగురించి నీ అభిప్రాయమేమిటి? అతను నాతో స్పష్టంగా మాత్రం చెప్పలేదు. కానీ తనభావాల్ని వ్యక్తంచేశాడు. నాకు అలా జరిగితే బాగుంటుందని తోస్తోంది. నాన్నగారు, అమ్మగారు కులం, గోత్రం నెపంమీద తిరస్క

రిస్తారని నాకు తెలుసు కానీ నీ భవిష్యత్తుతో చెలగాటమాడటం భావ్యంకాదు. బాగా ఆలోచించుకో' అన్నాడు.

మనోరమ ఆ సమయంలోమటుకూ తన అనంగీకారం తెలుపుతూ తల అడ్డంగా తిప్పింది. ఆ విషయం ఆలోచించిందికూడా. భూషణ్, సుతలీవాలా ఇద్దరూ రెండు భిన్నమైన ప్రపంచాలకి చెందిన మనుష్యులు. సుతలీవాలా సజ్జనుడు, నాగరికుడు, చక్కని రూపురేఖలు కలవాడు కానీ భూషణ్‌లో సామాన్యమనుష్యునికి సంబంధించిన గుణాలు కాకుండా మరికొన్ని గుణాలుకూడా వున్నాయి. ఈ ఆలోచన వస్తూనే ఆమె నిస్పృహ చెందేది. జగదీశ్, మనోరమ లాహోర్ తిరిగి వెళ్ళిపోయారు, సుతలీవాలాకు మసూరిలో ఇంకా వారంరోజులు వుండాల్సినపని వుంది. మనోరమ సుతలీవాలాల వీడ్కోలు ఏ ఆర్భాటం లేకుండానే జరిగిపోయింది.

* * *

మనోరమ ఉదయమే మసూరినుంచి తిరిగివచ్చింది. సాయంసమయం బయటగదిలో కూర్చుని తన స్వెటర్‌ను సరిచేసుకుంటోంది. వసారాలో అలికిడి విని తల పైకెత్తి చూసింది, భూషణ్‌తోపాటు ఒకస్త్రీ అతనివెంట వుంది. ఆమె మహిళాకళాశాల అధ్యాపకురాలు, సుభదా. ఖద్దరుచీర కట్టుకుంది. మనోరమ క్రితం సారి కలిసినప్పుడు భూషణ్‌తో ఆమె వ్యవహరించినరీతిని మరచిపోయేందుకు వాళ్ళని ప్రత్యేకంగా స్వాగతంపలికి కూర్చోబెట్టింది. భూషణ్ గంభీరంగా వున్నాడు.

'నువ్వు నా ఆశయాన్ని వేరేవిధంగా తలంచవని నాకు నమ్మకం వుంది' భూషణ్ కూర్చుంటూ అన్నాడు. సుభదా ఎదుట ఈవిధంగా సంభాషణ ప్రారంభం కావటంతో మనోరమ త్రుళ్ళిపడింది. 'నువ్వు కాలేజీలో ఊరికేనే పని చేస్తున్నావా?' భూషణ్ అడిగాడు.

మనోరమ అవునని తల వూపింది. 'నువ్వు కాలేజీలో జీతం తీసుకోకుండా పనిచేయడం మొదలుపెట్టావు. దానికి ఫలితం ఏం జరిగిందంటే దసరా శెలవులు ప్రారంభమయేరోజున కాలేజీ కమిటీ సుభదాను ఉద్యోగంలోంచి తొలగించి ఒకనెల

నోటీసు ఇచ్చింది. వాళ్ళపని వుచితంగా జరిగిపోతుంటే ఎవరికైనా అనవసరంగా జీతమెందుకు ఇస్తారు?'

మనోరమ అసంతోషాన్ని ప్రకటిద్దామనుకుంది కానీ భూషణ్ చెబుతూనే వున్నాడు—'నీ కోరికమాత్రం పూర్తి అవుతోంది. ఈ అమాయకురాలి బ్రతుకు తెరువు పాడవుతోంది. ఈమె 'పైకాయి'లో కూడా ఉద్యోగం చేయలేదు. ఎందుకంటే ఈమె ఇద్దరు సోదరులూ పార్టీ మెంబర్లు. వాళ్ళకాలమంతా పార్టీ పనికోసమే వినియోగిస్తారని పోలీసులకు తెలుసు.'

'మీరు బాధపడకండి. ఇటువంటి అన్యాయం జరగనివ్వను. నేను ఈ రోజే కాలేజీ సెక్రటరీకి నా అంతట నేను ఉద్యోగానికి రాజీనామా ఇస్తున్నట్లుగా ఉత్తరం పంపిస్తాను. మీకు జరిగిన అన్యాయానికి నిరసనగా ఈ పని వదిలిపెడుతున్నానని కూడా వ్రాస్తాను' అని మనోరమ సుఖదాతో అన్నది.

'సరే ఇప్పుడిక నువ్వు వెళ్ళు' అని భూషణ్ సుఖదాతో చెప్పాడు.

'అరే ఇంతతొందరేముంది? కూర్చోండి! టీ తెప్పిస్తాను' అని మనోరమ ఆపింది.

'వెళ్ళనీ, ఈమెకు ఒక అవసరమైన పనుంది' అని భూషణ్ సుఖదా తరఫున సమాధానం ఇచ్చాడు. సుఖదా వెళ్ళిపోయింది.

భూషణ్ సంతోషంతోనూ, ఉత్సాహంగానూ అన్నాడు—'నువ్వు జీతం లేకుండా పూరికెనే పని చేయాలనుకుంటే ఇంతకన్నా ఎక్కువ వుపయోగకరమైన పని చెయ్యి. విద్యార్థినులకు చదువు ఎవరైనా బి.ఏ. ప్యాసైన అమ్మాయిగానీ, మరెవరైనాగానీ చెప్పగలరు. నువ్వు ఎంతో చదువుకున్నావు. నీకు యోగ్యత వుంది.'

'చెప్పండి ఏం చేయమంటారు?' మనోరమ తన బలహీనతను స్పష్టం చేసింది.

'నా దృష్టిలో నువ్వు రచనావ్యాసంగం చేయటంకన్నా మరో మంచిపని లేదు.

'ఏం రాయనా? రోజూ ఏం రాయను?'

'ప్రాంతీయ పార్టీవాళ్లు ఒక పత్రికను ప్రారంభిస్తున్నారు. దానికి నీ సమయం కొంత వ్యయం చెయ్యి.' భూషణ్ ఆత్మీయతతో నిండిన అధికారంతో చెప్పాడు.

'నాకు పార్టీ విధానాన్ని గురించి సరిగా తెలియదు' మనోరమ గత్యంతరం లేక చెప్పేసింది.

'ముఖ్యమైన విషయాలు నీకు తెలుసు. కాని రోజూ వుండే సమస్యలతో నువ్వు సంపర్కం వుంచుకోకపోతే నీ దృష్టినుంచి అనేక విషయాలు దాటిపోవచ్చు గూడా లేకుంటే విషయస్వరూపాలే మారిపోవచ్చుగూడా. ఇటుకరాయి, సిమెంటు వల్ల పెద్ద స్తంభం తయారవుతుంది. వాటితో నుయ్యిగూడా తయారవుతుంది. మమ్మల్ని కలుసుకుంటూ వుండు. సమస్యలనుగురించి పూర్తి అవగాహనవుంటే అలా జరగదు. పేపరుకోసం పనిచేసేవాళ్ళల్లో కామ్రేడ్ జావేద్ కూడా వున్నారు' అన్నాడు భూషణ్.

'సరే, ఎప్పటినుంచీ రాను?' మనోరమ తహతహలాడుతూ అడిగింది.

'రేపు ఉదయం తొమ్మిదిగంటలకు రా. ఈ వారపు అంకంలోని భాగం తయారవుతోంది. కొంత అయింది కూడా.' భూషణ్ సమాధానం ఇచ్చాడు.

మనోరమ కాలేజీ వదిలిపెట్టి పార్టీ ఆఫీసుకు వెళ్ళటం మొదలుపెట్టింది. ఆమె ఇంటిదగ్గరనుంచి మైక్లోడ్ రోడ్ చాలాదూరం వుండేది. అందుచేత ఇంటి నుంచి అన్నగారితోపాటు కారులో వెళ్ళేది. బారిస్టరుగారు తమ న్యాయస్థానం దగ్గరో, వ్యాపారానికి సంబంధించిన ఆఫీసుదగ్గరో దిగేవారు. డ్రైవరు బరకత్ మనోరమను మైక్లోడ్ రోడ్‌కు తీసుకువెళ్ళేవాడు. మనోరమ తరుచుగా కారునుంచి నాలుగుమార్గములూ కలిసేచోటునే దిగేది. మిగిలిన నలభై-ఏభై అడుగులూ నడిచి వెళ్ళేది. తిరిగి వచ్చేటప్పుడు గుర్రపుబండిలో వచ్చేది. కారును ఆమె పార్టీ ఆఫీసు వరకు తీసుకువెళ్ళేదికాదు. మాసిపోయిన చిరిగినదుస్తులతోవున్న నవయువకుల మధ్యకి తళతళలాడే పెద్దకారు తీసుకువెళ్ళడానికి ఆమె సంకోచించేది.

ఒక్కొక్క వ్యాసం వ్రాయడానికి పేపరు-కమిటీలో పెద్దపెద్దచర్చలు జరుగుతూవుండేవి. కామ్రేడ్ జావేద్ పార్టీనిర్ణయాలను అనుసరించి వ్రాసేవాడు.

మనోరమనికూడా అలానే వ్రాయమని చెప్పేవాడు. మనోరమ అతనితో చర్చించటం మొదలుపెట్టేది. జావేద్ సమాధానం చెపుతూనేవుండేవాడు. 'కామ్రేడ్ నువ్వు ఇప్పటివరకూ 1939-1940 ల లైనుమీదే ఆలోచిస్తున్నావు. ఇది 1944' అనేవాడు. ఈవిధంగా వ్రాయటం మనోరమకు నచ్చేదికాదు. దీనివలన మనం ఇష్టం వచ్చినట్లు ఊపిరి పీల్చుకోవడానికి వీలుండదు. వాళ్ళఆజ్ఞను పాలించడమే అనుకునేది.

అయిదవఅంకం ప్రచురితమయ్యేసమయంలో పత్రికలో పేజీలు పెంచాలన్న ప్రసంగం వచ్చింది. డబ్బుసమస్య ఎదురయింది. పార్టీ ఎకౌంటెంటు విపత్తును ఊహించారు. క్రిందటినెల పత్రిక మూడువేలప్రతులు ప్రచురించడానికి అయిదువందల ఏభై రూపాయలకన్నా ఎక్కువఖర్చు అయింది. అతను లెక్క చూపించాడు. 130 రూ. ప్రచురణఖర్చు. 120 రూ. బ్లాకులు తయారుచేయించినందుకు, 250 రూ. కాగితాలు, 80 రూ. తపాలాఖర్చు, 45 రూ. కామ్రేడ్ జావేద్, జగ్‌రామ్, నరసింగ్‌ల కూలి. కామ్రేడ్ మనోరమ డబ్బులు తీసుకోరు. రెండు వందలకాపీలు ప్రచారానికి వుచితంగా ఇవ్వబడ్డాయి. ఏర్పాటుప్రకారం 40 రూ. లు మిగలాల్సివుంది. కాని జిల్లాలలోకి వెళ్ళిన కాపీలడబ్బు ఇంకా రాలేదు. అమ్ముడుపోయినవి అంతాకలిపి 200 రూ. వచ్చింది. మీరు ఖర్చు ఇంకా పెంచాలనుకుంటున్నారు. డబ్బు ఎక్కడనుంచి ఇవ్వను? నాకు పత్రిక ఫండ్‌గా 1000 రూ. ఇవ్వబడింది. ఈ లెక్కప్రకారం ఇంకొకనెలమాత్రమే పత్రిక వెలువడుతుంది. వెల పెంచకుండా చందా ప్రోగుచేయాలని జిల్లాలలోనుంచి డబ్బు వెంటనే పంపడంకోసం సర్క్యులర్లు పంపించాలని నిశ్చయించారు.

జగ్‌రామ్ లెక్కలో 45 రూ.ల ఖర్చుగురించి ఆక్షేపణ చేశాడు. జావేద్, నరసింగ్‌ల ఖర్చు పత్రికపేరున ఎందుకు వెయ్యబడింది? వాళ్ళు ఇంకొక ఫ్రంట్ దగ్గరకూడా పని చేస్తుండేవారు. మనోరమకు అన్నింటికన్నా బాధను కలిగించిన మాట సంపాదకుని జీతం, మేనేజరు నెలసరిజీతం పదిహేనేసి రూపాయిలు. వాళ్ళు నెలంతా పనిచేసినందుకు కూలి పదిహేనురూపాయలు. సమాజంలోని చట్టాన్ని, దేశంలోని చట్టాన్ని మార్చటంకోసం చేస్తున్న పని కూలి పదిహేనురూపాయలు. ఆ పత్రికకు ప్రతిపక్షులైనవారి పత్రికలలో అటునుంచి పనికోసం నూటయాభై

మంచి పదిహేనువందల రూపాయలవరకూ సంపాదిస్తున్నారు. వాళ్ళు సమయమంతా వ్యయంచేసి, అంతశ్రమపడి పని చేయలేరు. గర్వంతో ఆమె ఉప్పొంగిపోయింది.

మనోరమకు పండుగలప్పుడు సోదరులనుంచి చాలా డబ్బు అందుతుంది. అవసరమైనప్పుడు ఇంకా ఎక్కువగా అందుతుంది. ఆమె ఆ డబ్బంతా ఖర్చు పెట్టేది. క్రిందటి సంవత్సరంనుంచి మనస్థితి గంభీరంగా వుండటంచేత ఆమె కొత్త బట్టలుగాని, వస్తువులుగాని కొనుక్కోలేదు. ఇదివరకటివే చాలావున్నాయి. 'అక్కా, నీకు చాలా ఇష్టం, నువ్వే కట్టుకో, నాకు ఇప్పుడివి నచ్చటంలేదు' అనిచెప్పి చాలా చీరలు ఆమె సోమా కిచ్చింది. ఆమెదగ్గర రెండొందల రూపాయలున్నాయి. ఈ డబ్బును ఆమె పత్రికవిధికి ఇచ్చేసింది.

మనోరమ తన బల్లమీద ఒక ఉత్తరం తెరచి పడివుండగా చూసింది. ఉత్తరం అన్నయ్యపేరుమీద వుంది. కానీ ఆ ఉత్తరం తన బల్లమీద పెట్టివుండటంలో అభిప్రాయం తనవిగూడా చదవమని. ఉత్తరం సుతలీవాలాదగ్గరనుంచి వచ్చింది. చాలా శ్రమబద్ధమైనభాషలో మిత్రుని సోదరితో వివాహప్రసంగం. ఉత్తరం చదివినతర్వాత మనోరమహృదయం వేగంగా కొట్టుకోవటం మొదలు పెట్టింది. ఆమె కళ్ళుమూసుకుని మంచంమీద పడుకుంది. ఊహాగానంలో సుతలీవాలా, అన్నగారిద్వారా విన్న బొంబాయివర్ణన, సినిమాలోచూసిన బొంబాయి చిత్రాలు, మనసులో కదల నారంభించాయి. అన్నగారితో ఆమె ఏమీ చెప్పలేదు. కాని ఆ మాట ప్రతిక్షణం మనసులోనూ, ఊహలోనూ, మెదలుతూనే వుంది. మనోరమ పార్టీపత్రికలో పనిచేయడానికి వెళ్ళేది. ఈ పనికీ, జీవితానికీ సంబంధం ఏమిటి? అని ఆలోచిస్తూవుండేది. కానీ పార్టీపత్రిక పనయితే జీవితాంతంవుండే స్థిరమైన పనికాదు. బారిస్టరు సోదరుడుమాత్రం పరంపర, కులగౌరవంను ఏమాత్రం పట్టించుకోరు. కాని తండ్రిగారు, తల్లిగారు, మిగతా ఇద్దరు సోదరులు దీనికి ఒప్పుకుంటారా? ఆమెకు జీవితంలో ఏ మార్గం కనిపిస్తుందో, దానికే అవరోధ మేర్పడుతోంది.

• • •

బారిస్టరు జగదీశ్ సహాయ్‌గారికి మూడవసంతానం కలిగినప్పుడు తల్లిగారు

ధర్మశాలనుంచి రాలేకపోయారు. కలకత్తా, కరాచీలనుంచి ఇద్దరు వదినలుగూడా రాలేకపోయారు. యుద్ధంవల్ల వ్యాపారపరిస్థితి ఎలావుందంటే ఎవరైనాకూడా వ్యాపారాన్నివదిలి ఒక్కరోజు కదిలినాగూడా వేలకు - లక్షలకు నీళ్లు వదులు కున్నట్లే. కానీ పిల్లవాని నామకరణ సందర్భంలోమాత్రం అందరూ వచ్చారు. అందరికన్నాముందు తల్లిగారే వచ్చారు.

తల్లిగారు ఇంటికిరాగానే సోమాకూడా ఆమె కాళ్లకు నమస్కరించింది. తల్లిగారు ఆశీర్వదించారుగాని 'ఈమె ఎవరే మన్నూ? ధనసింగ్ భార్య సోమా ఎక్కడుంది?' అని నెమ్మదిగా అడిగారు. లాహోర్‌నుంచి కోడలూ, మన్నూ వ్రాసిన ఉత్తరాలలో మాటిమాటికీ సోమా ప్రశంస చదివి, లాహోర్ వెళ్ళినప్పుడు ఆమెకు బహుమతి ఇవ్వాలని మనసులోనే నిశ్చయించుకున్నారు.

మనోరమ నవ్వేసింది—'భలే, అమ్మా గుర్తుపెట్టలేదా? ఈమె సోమాయే!' ఇంటిలో సోమా అధికారం చలాయించడం, శాసించడంచూసి తల్లిగారిమనసు వ్యాకులతతో నిండిపోయింది. కానీ ఆమె మౌనంగా వుండిపోయారు. మూడవ రోజున మిగతావాళ్ళుకూడా వచ్చిచేరారు. బంగళాఅంతా కిటకిటలాడుతోంది. సోమానిచూసి అందరూ ఈమెవరు? అని అడిగేవాళ్ళు. చెప్పింది విని 'ఇంటి నౌకరా లేకపోతే యజమానా?' అని ఆశ్చర్యాన్ని ప్రకటించేవాళ్ళు.

సోమాకికూడా ఇది ఇబ్బందిగానే వుండేది. ఈమె ఇదివరకటిలానే నిదానంగా వుండేది కాని మళ్ళీ పాతసోమాలా ఎలా మారకబడుగుతుంది? జగదీశ్‌తో మాట్లాడేందుకు సమయమే దొరకటంలేదు. ఒకసారి ఆయనను కలుసుకోగలిగినప్పుడుమాత్రం 'వీళ్ళు నన్ను సహించలేకుండా వున్నారు. కొద్దిరోజులపాటు నన్నెక్కడికైనా పంపించేయండి' అని అడిగింది.

జగదీశ్ పెదవులు బిగించి 'అబ్బా, డామిట్' అన్నాడు.

జగదీశ్‌కు కొడుకు పుట్టాడన్న ఆనందంలో వదినగార్లకు, భార్యకు, చెల్లెలికి, అందరికీ కానుకగా ఇవ్వడంకోసం చీరలు కొనాలని నిశ్చయించుకొన్నాడు. ఈపని మనోరమకే అప్పగించాడు. ముఖ్యంగా పెద్దవదినగారిస్వభావం మనోరమకు వచ్చదు. పక్షపాతమనీ, స్వార్థమనీ తనపై ఏ ఆరోపణా రాకుండా వుండటంకోసం

అందరికీ ఒకేరంగు, ఒకేవిధమైన అంచు, ఒకే ఖరీదుగలచీరలు కొన్నది. 'అందరూ ఒకేవిధమైనచీరలు కట్టుకుంటే బాగుంటుందికూడా. అందరూ ఒకటిలా అనిపిస్తారు' అని మనసులో అనుకుంది.

చీరలు అందరికన్నాముందు పెద్దవదిన (మిసెస్ కృష్ణసహాయ్)కి చూపించారు. మనోరమ, మిసెస్ జగదీశ్ కూడా అక్కడే వున్నారు. అన్నిచీరలూ ఒకటేలా వుండటం పెద్దవదినకు నచ్చలేదు. 'మీరు మీ కోరిక తీర్చుకోండి. మేము చాలాచీరలు కట్టుకున్నాం. ఇప్పుడేముంది, ఈ వయసులో!' అన్నారు. తర్వాత చీరలరంగు, అంచు చూస్తూ చీరలను లెక్కపెట్టింది. 'ఇవి అయిదుచీరలున్నాయి. ఎవరెవరికి?' అని అడిగారు.

'సోమాకోసంగూడా ఒకటి వుంటుందికదా!' మిసెస్ జగదీశ్ నెమ్మదిగా చెప్పారు.

పెద్దకోడలి నుదుటిమీద ముడుతలు పడ్డాయి. కోపంతో శ్వాస వేగంగా రాసాగింది. దగ్గరగా నిలబడివున్న తన చిన్నకూతుర్ని పిల్చి 'జగదీశ్‌ను పిలు!' అని ఆజ్ఞాపించింది.

బారిస్టరువచ్చి 'ఏమిటి వదినా!' అని అడిగాడు.

మిసెస్ కృష్ణసహాయ్ అయిదుచీరలు ఎత్తి ఆయనమీద కొట్టింది. 'నేనేం నీ నౌకర్ననుకున్నావా? నాకోసం, నీ పనిమనిషికోసం ఒకేరకమైనచీరలు తెచ్చావు. నీ కింతధైర్యం ఎక్కడనుంచి వచ్చింది?' అని మండిపడింది.

పెద్దకోడలు కోపంలో ఉచితానుచితాలు మరచిపోయి వదరుతూనేవుంది—
'సొంత సంపాదనంటూ ఒక్క పైసాగూడా సంపాదించటం చేతకాదు. ఇతరుల సంపాదనమీద అన్నిరకాలభోగాలు అనుభవించడం, వాళ్ళనే అగౌరవం చేయడం!'

జగదీశ్ రక్తంగూడా వేడెక్కిపోయింది. పెద్దవదిన ఇటువంటి అమర్యాదకరమైనపనులు ఇంతకుముందుగూడా అనేకసార్లు చేసివుంది. అప్పుడు జగదీశ్ మౌనంగా వుండాల్సివచ్చింది. కానీ ఇప్పుడు పరిస్థితి అటువంటిది కాదు. అతను వదినగారివైపు కోపంతోనిండిన దృష్టిసారించి 'వళ్లు దగ్గరపెట్టుకుని మాట్లాడండి!

ఎవడూ నాకు పెట్టడంలేదు. నా ఇంట్లో ఎట్లా కావాలనుకుంటే అట్లా ఇస్తాను. తీసుకుంటాను. నే నెవరికీ నౌకర్ని కాదు!' సవాలు చేశాడు.

బంగళాలో అలజడి వ్యాపించింది. తల్లిగారు, రెండవకోడలూ పరుగెత్తుకు వచ్చారు. నాగరికస్త్రీలు చేతులుతిప్పుతూ, అరుస్తూ చెప్పసాగారు. నౌకర్లు తలుపుల చాటునవిలబడి వినసాగారు. సోమామాత్రం రాలేదు. ఆమె పోట్లాట మొదలవం గానే వెళ్ళి తనగదిలో దాక్కుండిపోయింది.

అవకాశంచూసి నౌకర్ల నోళ్లుగూడా తెరుచుకోసాగాయి. వాళ్ళమంచిగూడా వాఙ్మూలం తీసుకోబడింది. ఆ సమయంలో నోరెత్తనివాళ్ళే మంచివాళ్ళు. మేలు చేసేమనుషులు. పెద్దకోడలిగొంతు మాటిమాటికి కఠోరంగా వినిపిస్తోంది—'ఈ అగౌరవం చేయడంకోసమేనా మమ్మల్ని పిలిచింది! చాలా చదువు, సంస్కారం వున్నవాళ్ళు!'

తల్లిగారి కంఠంగూడా వినిపించింది—'అయ్యో నేను అక్కడ దూరంగా వున్నాను. నాకేం తెలుసు ఇదంతా జరుగుతోందని!' అని ఆమె ఆశ్చర్యాన్ని ప్రకటించారు.

'అయ్యో నాకేం తెలుసు. నా వేళ్ళమీదే గొడ్డలిదెబ్బలు పడుతున్నాయని!' చిన్నకోడలి గొంతునుంచి బయటకువచ్చే సన్నని ధ్వనిగూడా వినిపించింది.

మనోరమ ఒకటి రెండుసార్లు అందరికీ నచ్చజెప్పటానికి ప్రయత్నించింది. చీరలుకొనే జవాబుదారీ తనమీద వేసుకుంది. పెద్దకోడలు ఆమెను చివాట్లు పెట్టింది— 'అవటానికి నడివయస్సువరకు కన్యగానేవుంది కానీ ప్రపంచంలోవున్న విషయా లన్నింటిలోనూ జోక్యం కలిగించుకుంటుంది. సిగ్గులేమా, అన్నయ్యదగ్గర రాయ బారిగా కూర్చున్నావ్! ఒకళ్ళద్దరి అదృష్టాలమీద ముసుగు వేసెయ్....నీ ఇష్టం వచ్చినట్లు చెయ్, మా ఇంటిని ఎందుకు నాశనం చేస్తావ్!'

మనోరమ పక్కబంగళాలో ఒక స్నేహితురాలిదగ్గరకెళ్ళి కూర్చుంది. రెండుగంటల తర్వాతకూడా యుద్ధం శాంతించలేదని చూసి తనగదిలోకివెళ్ళి తలుపుమూసుకుని పుస్తకం చదవటం మొదలుపెట్టింది. పోట్లాట చాలా పెద్ద దయింది. కృష్ణసహాయ్ లాలాగారిదగ్గరకు వెళ్లారు. జగదీశ్‌సహాయ్‌ని పిలిపించారు.

ఊథమ్‌సింగ్ ఆయన్ని పిలవడానికి వెళ్లాడు. బారిస్టరుగారు కారులో బంగళానుంచి బయటకు వెళ్ళిపోవటం చూశారు.

జగదీశ్ బంగళానుంచి బయట రోడ్డుమీదకువచ్చి ఆలోచించాడు—'ఎక్కడికి వెళ్ళటం. క్లబ్బు! ఇటువంటి మనస్థితిలో సరిగా మాట్లాడగలగడం సంభవం కాదు. ఆయన మాల్‌రోడ్‌కు వెళ్లారు. ఒక విర్మానుష్యమైన బార్‌లో కూర్చున్నారు. ఎదురుగా బల్లమీద గ్లాసులో సోడాకలిపిన విస్కీ బుసబుస పొంగుతోంది. అటువంటి బుదగలే అతని మనసులోగూడా లేస్తున్నాయి—'ఎటువంటిమూర్ఖులతో కల్పించుకోవాల్సివచ్చింది! మంచిచీరలు వీళ్ళదృష్టిలో ఎందుకు పడ్డాయంటే పని చేసే మనిషికిగూడా వాటితోపాటే చీరకొనడం జరిగింది. అరే, అహంకారం!'

జగదీశ్ డబల్ పెగ్‌కు ఆర్డరిచ్చారు. కోపంవల్ల గొంతు ఎండిపోయినట్లనిపించింది. గాసుని షోడాతో పూర్తిగా నింపాడు. మూడునాలుగు గుక్కల్లోనే గ్లాసులోని విస్కీ సగమైపోయింది. తల కొంచం తిరుగుతున్నట్లయింది. జగదీశ్‌కు పెద్దవదిన ఎదురుగా నుంచునివున్నట్లనిపించింది. బంగళాలో అతను ఏమీ చెప్పలేకపోయాడు. ఇప్పుడు పరిణామం ఏం జరుగుతుందో అన్నభయం లేకపోవడంవల్ల, తనలో తాను చెప్పుకోసాగాడు—'పనిచేసే అమ్మాయా! ఏం నీ ఇంట్లో పనిచేసే అమ్మాయా?....ఆ అమ్మాయిముందు నిలబడి నీ తెలివి ఎంతుందో చూసుకో! అద్దం తీసుకుని ఆ అమ్మాయితో సాటిగా నీ ఆకారం వుందేమో చూసుకో! నీ దగ్గర చెప్పుకోతగిన మంచిగుణం ఏముంది? నీ అమ్మా-నాన్నా నీ కోసం ఒక మగాణ్ణి చిక్కుల్లో ఇరికించారు, లేకపోతే నిన్ను అంట్లు తోమేందుకుగూడా ఎవరూ పెట్టుకోరు, డబ్బు వుందన్న అహంవల్ల దుర్మార్గం కదా? ఇలా ఇంకెవరూ డబ్బు సంపాదించటం ఎరగరు! ఎప్పటిదాకా నేను లెక్కచెయ్యలేదో, చెయ్యలేదు. ఇప్పుడు చూస్తాను. ఇది నా ఇల్లు. ఇక్కడ నిర్ణయించడానికి, ఆజ్ఞాపించడానికి నువ్వెవరు? నెత్తి కెక్కించుకోవాలనుకుంటే నీ మనిషిని నెత్తికెక్కించుకో! నిన్ను ఆదరించాల్సింది వాళ్ళు. సోమాతో పోల్చుకోవడం మొదలుపెట్టింది. పిడక ఎక్కడ, ఏనుగుదంతపు బొమ్మెక్కడ! పెద్ద పతివ్రత తయారయింది....అరే, నిన్ను అడిగేవా డెవడున్నాడు!....ధనవంతులన్న అహంకారం.

మనోరమ ఉద్యోగం చేసేవిషయంమీద ఇంట్లో ఎంత పోట్లాటయిందో గుర్తుకొచ్చింది. ఆ సమయంలో అతను వర్గమూలకమైనభావాల్ని సమర్థించాడు. ఎంత అన్యాయం చేస్తున్నారు వీళ్ళు నన్ను! నేను నా భావాలకి విరుద్ధంగా ఆచరించాల్సి వస్తోంది. సమాజంనుంచి దొంగతనంచేసి ప్రోగుచేసిన డబ్బువల్ల వీళ్ళ దుర్మార్గం హెచ్చయింది. బీదవాళ్లు వీళ్ళకి అణిగిమణిగివుంటారు కానీ నేనెందుకు అణిగివుండాలి! వీళ్ళకి ఎంత నేర్పరితనంవుందో అంత నాకూ వుంది. వీళ్ళకన్నా ఎక్కువే చేసి చూపించగలను. వీళ్ళకు బుద్ధి లేనేలేదు.'

జగదీశ్ మిగిలిన సగంగ్లాసు పూర్తిచేసి గడియారంవైపు చూశాడు. ఏడు గంటలే అయింది. ఆ ప్రదేశంలో ఒంటరిగా ఇంకా కూర్చునివుండటం నచ్చలేదు. అతను కాలువవేపునుంచి మోడల్‌టౌన్‌వైపు తిరుగుతూ చల్లగాలిలో పదిమైళ్లు తిరిగి రెండవసారి వలేరియా రెస్టారెంటులోకివెళ్ళి కూర్చున్నాడు. విస్కీ పెగ్గుకు ఆర్డరిచ్చాడు. ఇంటికి వెళ్లాలన్నకోరిక అతనికి లేదు వెళ్ళటానికి ధైర్యంకూడా లేదు. అక్కడే భోజనం చేశాడు. భోజనం చేసినతర్వాత వలేరియాలో నాట్యం మొదలయింది. ఆ రాత్రి 'లేట్‌నైట్ డాన్సు' (అర్ధరాత్రినుంచి తర్వాత) వుంది.

జగదీశ్ విదేశాలలో నాట్యం నేర్చుకున్నాడు. నాట్యంలో ఆసక్తికూడా వుండేది కాని ఆ సమయంలో అతను ఒకవైపు కూర్చుని వుండిపోయాడు. అతని చూపులు నాట్యంమీద వున్నాయి కాని మనస్సు సమస్యలలో మునిగివుంది. ఆర్కెస్ట్రా మ్రోగుతోంది. నాట్యం చేసేటప్పుడు హాలులో ఎర్రనిదీపాలు వెలుగుతాయి. ఒకనాట్యం పూర్తయిపోయినమీదట, రెండవనాట్యం ప్రారంభించడానికి ముందు రెండునిముషాలు తెల్లలైటు వుంటుంది. దాదాపు అంతా నాట్యపుదుస్తులలో వున్నారు. పురుషులు నల్లటికోట్లు ధరించారు. స్త్రీలు రంగురంగులదుస్తులలో మెరుస్తున్నారు. ఇంగ్లీషు దొరసానులు మోకాళ్ళపైకి గౌనులు ధరించారు. భారతదేశ స్త్రీలు చీరలు, పొట్టిచేతుల బ్లౌజులు ధరించారు. వాళ్ళవీపులు, సన్నని నడుములూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. శరీరపు ఒంపులు, సొంపులు స్పష్టమవుతున్నాయి.

భారతదేశపుస్త్రీలు ఆకర్షణీయంగా కనబడుతున్నారు. యూరపియన్‌స్త్రీల వేషధారణ, శరీరం కళ్ళకి మిరమిట్లు గొలుపుతున్నాయి. దాదాపు అందరూ అతిగా అలంకరించుకున్నారు. ముఖానికి ఎత్తుగా పౌడర్లు పూసుకున్నారు. పెదిమలకి రంగు

వేసుకున్నారు. అన్నీ నకిలీవి. విదేశాలనుంచి వచ్చిన పీసాలు, పదార్థాలతో బల్లలు అలంకరింపబడివున్నాయి. ఇటువంటిదృశ్యం తరుచుగా జగదీశ్‌ని నాట్యానికి ప్రేరేపిస్తుంది. కానీ ఆ సమయంలో అతనికి మనసు కలగలేదు. వాళ్లవైపుచూసి ఆలోచిస్తున్నారు—సోమా వీళ్ళందరికన్నా ఎంతమంచిది. అవకాశంవుంటే ఆమెను ఇక్కడకు తీసుకువచ్చి వీళ్ళని చూపించేవాణ్ణి.

జగదీశ్ ఒంటరిగా కూర్చోవడంచూసి, 'ఏం జరిగింది' అని మిసెస్ గుర్తా అడిగింది. మిసెస్ వాయిలీగూడా ఆయన్ని నాట్యం చేయడానికి ఆహ్వానించింది. కానీ జగదీశ్ తనదుస్తులు బాగాలేవని, ఆరోగ్యం సరిగాలేదని క్షమార్పణ కోరాడు. జగదీశ్ చుట్ట అంటించాడు. ఒక పెగ్గు విస్కీ తెప్పించుకుని ఎదురుగా పెట్టుకున్నారు. తన మనఃక్షోభ, చిక్కులనుంచి విడుదల పొందలేకపోతున్నారు. ఎటువంటివ్యక్తితో తన వివాహం జరిగింది? అటువంటిస్త్రీని వెంటబెట్టుకుని మంచి సొసైటీలోకి వెళ్లలేదుకూడా. అదవా లేక గేదా? సోమా అయినట్లయితే అందరికన్నా అందంగా దర్బారులో రాణిలా వుంటుంది....వీళ్ళు ఎన్నిరోజులుంటారో, ఆమెను ఎంతబాధ పెడతారో ఏం తెలుసు? నేను వీళ్ళని లక్ష్యపెడతానా? అనుకున్నారు కాని జగదీశ్‌కు ఇంటికి వెళ్ళేందుకు ధైర్యం కలగటంలేదు. ఇప్పుడు ఇంకా పదే అయింది.

జగదీశ్‌కు విషావల్ల పడుకోవాలని కోరిక కలిగింది. నిషాకి లోబడిపోయిన సోమా అతనిశరీరానికి ఆప్యాయతతో ఏసుఖాన్ని ఇచ్చేదో, ఆ సుఖం లేనిలోటు బాధపెడుతోంది. కాని బంగళాకు తిరిగి వెళ్ళటానికిమాత్రం ధైర్యం కలగటం లేదు. ఆయనకి తనమీద తనకే ఏవగింపుకలగటం మొదలుపెట్టింది—నేను మూర్ఖుల వలన, ఇహలోకబద్ధమైన అహంకారం పొందేవాళ్ళవలన దడుస్తాను....సోమా వీళ్ళ అత్యాచారంవలన నలిగిపోతోంది...సమాజం అంతా నలిగిపోతోంది ... బాహ్యంగా స్వతంత్రుడనై వుండికూడా నేను నలిగిపోతున్నాను. ఈ వ్యవస్థ ఆచరించే అనుచితపద్ధతి, ఆశక్తత నాకు తెలుసు. దీనికి వ్యతిరేకంగా....కానీ అసమర్థుణ్ణి, బలహీనుణ్ణి. నేను అర్థం చేసుకోగలిగినా లాభమేముంది? 'ఆచరణ లేకుండా సిద్ధాంతాలు అసత్యాలు' అని లెనిన్ సరిగా చెప్పారు. నేను విచారణ చేసేవాణ్ణి మాత్రమే. ఆచరించేవాణ్ణి కాదు. లేకపోతే సమాజాన్ని మార్చేస్తాను....నేను

ఎంత బలహీనత్ణి! విప్లవ్రియోజకత్ణికూడా. బాధ ఏమిటంటే ఇదంతా నాకు తెలుసు.

జగదీశ్ రాత్రి రెండుగంటలకు నాట్యం పూర్తయినతర్వాత ఇంటికి తిరిగి వచ్చారు. ముఖద్వారందగ్గర కూర్చునివున్న పహరా జవానుతప్ప అందరూ ఆవేళ టికి నిద్రపోయారు. నలువైపులా నిశ్శబ్దం వ్యాపించివుంది. సోమా గదివరకూ వెళ్ళేందుకు ఆయనకు ధైర్యం కలగలేదు. నోరుమూసుకుని పక్కమీద పడుకుండి పోయారు. ఉదయం సోమా కప్పు, చమ్చాతో ఆయన్ని లేపలేదు. ఊథమ్‌సింగ్ తన డ్యూటీ మళ్ళీ వచ్చిందని తెలుసుకుని టీ తయారుచేసి తీసుకొచ్చారు. జగదీశ్ గడ్డం చేసుకోవడానికి వేడినీళ్ళు తెమ్మని అతనికి చెప్పారు. ఇంకొకమాట ఏం మాట్లాడలేదు. ఆయన ఉదయమే బట్టలు మార్చుకుని ఇంట్లోనుంచి బయటకు వెళ్ళిపోయారు.

సోమా రాత్రంతా తనగదిలో ముడుచుకు కూర్చునుంది. బంగళాలో వ్యాపించిన అలజడి వింటూ ఏడుస్తూవుండిపోయింది. ఆమె ఏమిచేయగలుగుతుంది? జగదీశ్‌తప్ప ఆమెకింకెవరున్నారు? ఆయన్ని అడగకుండా, ఆయనతో మాట్లాడకుండా ఆమె ఏమీ చేయలేదు. కానీ ఆయన్ని కలుసుకోవాలన్నా, మాట్లాడాలన్నా ఎలా? ఆలోచిస్తోంది. ఆయన ఎక్కడవుంటారో తెలీదు. లేచి కొంచం జాడ తెలుసుకోవచ్చు కానీ గదినుంచి ఎలా బయటపడుతుంది?

అర్ధరాత్రప్పుడు పోట్లాట తగ్గగానే సోమాకి డ్రాయింగురూములోవున్న గోడ గడియారంనుంచి టంగ్‌టంగ్‌మని పన్నెండుగంటలు కొట్టినశబ్దం వినిపించింది. ఒంటిగంటకూడా వినిపించింది. కాని ఇంట్లోవాళ్ళు నెమ్మదినెమ్మదిగా మాట్లాడుకోవటంగూడా వినిపించింది. 'ఆయన బయటకువెళ్ళినా తిరిగి వచ్చి వుంటారు. ఆయన నన్ను పిలిపించలేదు. నన్నుగురించి ఏమీ అడగలేదు. ఆయన దగ్గరకు వెళ్ళేసాహసం ఎలా చేయగలను, ఎవరన్నా చూడచ్చు!' అని అనుకుంది.

సోమాకి రాత్రి కళ్ళమీద కొంగువేసుకుని గడపాల్సివచ్చింది. తెల్లవారి పొద్దెక్కింది. ఎంత బాగా వచ్చింది కానీ సోమాకు తన గదినుంచి బయటకు రావటానికి ధైర్యం కలగలేదు. అంతా అదేప్రదేశం, అదే బంగళా, అదే మనుష్యులు.

కాని కొద్దిగంటలలో అంతా ఎంకమారిపోయింది! జగదీశ్‌కు ఆఫీసుకుకాపీ న్యాయ స్థానానికిగాని వెళ్ళే వేళ అయింది. ఆమె అతన్ని కలుసుకోలేకపోయింది.

నౌకరు బసంతా సోమా గదిలోకివచ్చి—'మీ బట్టలు సర్దుకుని కారులో వెళ్ళిపొమ్మని అమ్మగారు చెప్పమన్నారు. కారు బయట ఆగివుంది' అని కఠినంగా చెప్పాడు.

సోమా ఏడ్చి ఏడ్చి కన్నీళ్లతో నిండినచూపులు బసంతావైపుతిప్పి 'ఎక్కడకు వెళ్ళిపోనూ' అని అడిగింది.

'నాకేం తెలుసు!' అని బసంతా వెళ్ళిపోయాడు.

సోమా వెక్కి వెక్కి ఏడ్చింది. 'అయ్యో! ఎక్కడికి వెళ్ళిపోనూ! ఏమిటి ఇందుకే నన్ను కొండప్రాంతంనుంచి తీసుకువచ్చారా! ఎక్కడకు వెళ్లను! నావి ఏ బట్టలు తీసుకోనూ! నాకు నాది అన్నది ఏముంది తీసుకోవడానికి!' పర్సుమీద దృష్టిపడింది. దాంట్లో ఇంటికి సంబంధించినవి సుమారు 300 రూ. వున్నాయి. అవికూడా ఆమెవి కావు. ....'అయన్ని పిలిపిస్తే. కాని ఎలా! ఆయన న్యాయ స్థానానికి వెళ్ళివుంటారు. ఆయన ఒకసారిగూడా నా క్షేమం తెలుసుకోలేదు.

బసంతా మళ్ళీ వచ్చాడు. 'తొందరగా కానివ్వమని అంటున్నారు.'

సోమా నెమ్మదిగా వినయంగా 'తమ్ముడూ, కొంచం అయ్యగార్ని పిలు' అని చెప్పింది.

'అయ్యగారు ఎప్పుడో వెళ్ళిపోయారు.' బసంతా ఆగలేదు.

బయటనుంచి హారన్‌శబ్దం మాటిమాటికీ వినిపిస్తూంది. ఆమెను తొందర చేస్తూ, 'ఏం ఇంకా వెళ్లలా!' అని పెద్దకోడలు అరవటం వినిపించింది.

దాది జీవా వచ్చి 'తొందరగా కానియ్యి. పెద్దక్కగారు కోప్పడుతున్నారు' అని చెప్పింది.

సోమా భయపడింది. పెద్దకోడలు చెయ్యిపట్టుకుని బయటకు ఈడిస్తే ఏం జరుగుతుంది! నాలుగురోజుల్లో ఆమెను చాలా అర్థం చేసుకుంది. ఏడుపు వేగాన్ని పెదవులు పళ్ళతో నొక్కిపట్టి ఆపుకుంటూ ఎలా కూర్చుందో అలాగే లేచినిలబడి బయట కారువైపు వెళ్ళిపోయింది.

సోమా ఇంటి ముఖద్వారంనుంచి వస్తుండగా చూసి బరకత్ తన స్థానంలో కూర్చునివుండి వెనకసీటు తలుపు తెరిచాడు. అలవాటుప్రకారం కారుమంచి దిగలేదు.

సోమా కూర్చోగానే అతను అలాగే నిర్లక్ష్యంగా తలుపువేశాడు. కారు వెళ్ళిపోయింది.

కారు బంగళానుంచి కొద్ది అడుగులు ముందుకువెళ్ళింది. సోమా ఏడుపు గొంతుతో 'అన్నా' అని పిలిచింది.

బరకత్ తిరిగిచూశాడు. అతని నుదుటిమీద ముడుతలుపడ్డాయి. 'ఏమిటి?' అన్నాడు.

సోమా కళ్ళనుంచి కన్నీళ్ళబొట్లు జారిపడ్డాయి. 'ఎక్కడికి తీసుకెళు తున్నావ్?' అని అడిగింది.

'స్టేషనుకు.'

'ఎక్కడకు వెళ్ళడానికి?'

'ఎక్కడికో చెప్పు' అని కారువేగం తగ్గించి చెప్పాడు. 'అమ్మగారు యాభై రూపాయలు ఇచ్చారు. ఎక్కడికో చెప్పు. టిక్కెట్టుతీసుకుని ఇస్తాను. మిగతా డబ్బులు నీవి. నీ ఇష్టంవచ్చినట్లు వాడుకో.' బరకత్ కారువేగం పెంచుతున్నాడు.

'విను అన్నా.' సోమా వెక్కుతూ చెప్పింది.

'ఏమిటి?' బరకత్ వెనక్కితిరిగి చూశాడు.

'కొంచం అయ్యగారి ఆఫీసుకు తీసుకెళ్ళు.'

బరకత్ స్వరంనుంచి కాఠిన్యం దూరమైపోయింది. 'అమ్మగారు నిన్ను స్టేషనుదగ్గర వదిలిపెట్టిరమ్మని చెప్పారు. నువ్వు బాగా ఇబ్బంది పెడుతున్నావ్' అన్నాడు కొంచం పరాధీనంగా.

'చేతులు జోడిస్తున్నాను.'

'నిన్ను ఆఫీసుకు తీసుకువెడతాను. అయ్యగారేమో నామీదే మండిపడతారు.'

'నాకోసం ఒక్కసారి' సోమా బ్రతిమలాడింది. 'నీ కాళ్ళు పట్టుకుంటాను.'

బరకత్ ముందుమలుపునుంచి తిప్పి ఒక ఇంటిదగ్గర కారు ఆపి, 'నేను వెళ్ళి అయ్యగారికి సమాచారం అందిస్తాను' అని చెప్పాడు.

బరకత్ తిరిగివచ్చి 'అయ్యగారు ఆఫీసులో లేరు. కచ్చేరికి వెళ్ళారు' అన్నాడు.

'అయ్యో, రెండునిముషాలు ఆగు.'

'ఎవరో దస్తుకు కూర్చునివున్నారు. అయ్యగారు లేరని చెప్పమన్నారు.' బరకత్ మండిపడ్డాడు.

సోమా వెక్కివెక్కి ఏడ్చింది. కారు వేగంగా స్టేషనువైపు వెళ్ళిపోయింది. స్టేషనుదగ్గరకువెళ్ళి బరకత్ మళ్ళీ అడిగాడు. 'సరే, ఎక్కడికి టిక్కట్టు తీసుకోనూ?'

సోమా ఏడుస్తూ వుండిపోయింది. ఏం చెప్పలేదు. బరకత్ కారు ఆపి, 'చెపుతావా ఏమన్నా, ఏడుస్తూనే వుంటావా?' అని అడిగాడు.

'ఎక్కడకూ లేదు.' సోమా ముఖం కప్పుకుని వెక్కివెక్కి ఏడుస్తూ చెప్పింది.

'అయితే కారులోనే వుంటావా? ఎక్కడ దింపను? ఎక్కడికి కెళ్ళాలనుకుంటున్నావు?'

'ఎక్కడికీ లేదు.'

'చివరకు నేను కారుని బంగళాకు చేర్చాలి.'

'నన్ను ఏ నదిదగ్గరకన్నా, అడవిదగ్గరకన్నా తీసుకెళ్ళు.'

'అక్కడ ఏం చేస్తావు?'

'చస్తాను.'

బరకత్ ఒక్కక్షణం ఆలోచించి కారుని కదిలించి ఒకవైపు తిప్పాడు. ఒక నిర్జనమైన ప్రదేశంలో ఆపి, 'విను' అని సోమాని పిలిచాడు.

'ఏమిటి?' సోమా వెక్కివెక్కి ఏడుస్తూ అడిగింది.

'నాతో వస్తావా?'

సోమా క్షణం ఆలోచించి, తల ఆడించి అంగీకరించింది.

'ఎక్కడికైనా వస్తావా' అనడిగాడు బరకత్.

సోమా మెడ ఊపుతూ అంగీకారం తెలిపింది.

'అయితే చచ్చిపోవాల్సిన అవసరమేముంది? ప్రపంచంలో చాలా చోటుంది, చాలా అవకాశాలున్నాయి. సరే, ఏమన్నా డబ్బు తెచ్చావా?'

'లేదు.'

'ఎందుకని? నీ దగ్గరేగా డబ్బుండేది?'

సోమా చీరకొంగుతో ముఖం కప్పుకునే 'డబ్బు నాది కాదుగా, వాళ్ళ డబ్బు తీసుకోను' అని చెప్పింది.

'నిన్ను ఒకచోట కొంచంసేపు వుంచుతాను' అని చెప్పి బరకత్ కారులో ఆమెను ఢిల్లీ గేటువైపు పట్టణం లోపలికి తీసుకువెళ్లాడు. ఒక చిన్న ఇంటి ఎదురుగా ఆపాడు. 'నువ్వు ఇక్కడ వుండు. నేను రెండుగంటలలో తిరిగివస్తాను. బండిని బంగళాకుచేర్చి డబ్బు తీసుకుని వస్తాను. ఆనమ్మకద్రోహంగా కాదు దొంగ తనంచేసి తీసుకెళ్లానని నా పేరుమీద వారంటు పెట్టించినా పెట్టించవచ్చు' అని చెప్పాడు.

'వస్తావుగదా?....ఎంతసేపట్లో?' సోమా భయపడుతున్నట్లుగా అడిగింది.

బరకత్ రొమ్ము చరుచుకుంటూ, 'ఇది బీదవాడిమాట. ధనవంతుడిమాట కాదు. ప్రమాదం, నష్టం, వుంటుందేమోనని ఆలోచించక్కర్లేదు. వస్తానని చెపితే తప్పకుండా వస్తాం. ఏ పరిస్థితిలోనైనా 'ఇదే షరతుమీద జీవించడం, అల్లామీదే నమ్మకం' అన్నాడు.

# వైవాహికజీవితంలో ఎండమావులు

బారిస్టర్ జగదీశ్, మనోరమ వదినగార్లని అవమానపరచటంకోసం కుట్ర పన్ని వాళ్ళకీ పనిమనిషిగా వుంటున్న సోమాకి ఒకేరకమైన చీరలుకొని తెచ్చారు. ఆ సంఘటనకు పరిణామంగా చెలరేగిన అలజడి కేవలం సోమాని ఇంట్లోనుంచి బయటకు వెళ్ళగొట్టి ఆగిపోలేదు.

భార్యలలో అభిప్రాయభేదాలు రావటంవల్ల అన్నగార్ల హృదయాలు వ్యాకులపడ్డాయి. తండ్రిగారు పైనవుండగాగూడా వాళ్ళు ఆస్తి పంపకాలగురించి ఆరగపోగారు. ఈ ప్రసంగంగురించి పోట్లాటలు చెలరేగాయి. మనోరమ నోరు తెరిస్తే చాలు పెద్దవదినా, చిన్నవదినా ఇద్దరూకూడా విరుచుకుపడేవాళ్ళు. ఇంటి ఆడపడుచు అన్న గౌరవం, ఆ ఆలోచనగూడా వాళ్ళ వాగ్ధోరణిని అరికట్టలేకపోయాయి. ఆమె వయసు ఇంతగా పెరగటం ఒకతప్పు. ఆమె ఒంటరిగా తిరుగుతుందన్నది ఒక కళంకం, ఏదో ఎక్కడెక్కడో వ్యాసాలు వ్రాయటం అన్నది ఒక అపరాధం. పెద్ద వదినా, చిన్నవదినా, తలలు ఆడిస్తూ, చేతులు తిప్పుతూ ఏ గౌరవమర్యాదలున్న ఇంట్లోనూ ఇంత వయసువచ్చిన ఆడపిల్లని కన్యగా చూడలేదని చెప్తూ వుండే వాళ్ళు.

మనోరమకు ఇటువంటి వాతావరణంలో ఇంట్లో వుండటం అసంభవంగా వుండేది. పత్రిక పనికోసం పార్టీ ఆఫీసుకి వెడితేవరి. ఆమె తిరుగులోతు. శీలం లేనిది అనడానికి అవకాశం చిక్కేది. మనోరమ రెండుసార్లు జవాబివ్వాలని పొరపాటు చేసింది. కాని వాక్యుద్ధంలో ఓడిపోయి ఆ విషయమై గంటలతరబడి ఏడుస్తూ వుండిపోయింది. తన గదినుంచి బయటకువచ్చే ధైర్యంకూడా ఆమెకు లేకపోయింది. ఆమె పత్రిక పనికోసం పార్టీ ఆఫీసుకుకూడా వెళ్ళలేకపోయేది. మనోరమకు ఆలోచించగా - ఆలోచించగా ఒక ఉపాయం తట్టింది. 'మీరు చెప్పిన మాట నచ్చింది. వివాహం రెండువారాలలోపల జరగాలి' అని ఆమె సుశీలాబాకు వ్రైటిచ్చింది.

మనోరమ ఈ ప్రసంగంగురించిన వివరాలన్నీ ఒక వుత్తరంలో వ్రాసి

అన్నగారికి ఇచ్చింది. ఆ ఇంట్లో వుండటం ఇక అసంభవమని నిశ్చయించి, ఆ ఇంట్లోనుంచి విముక్తి పొందేందుకు, సివిల్ మేరేజ్ ఏర్పాటు మొదటనుంచే చేయ వలసింది. ఎందుకంటే సుశీలీవాలా తనను వెంటనే బొంబాయి తీసుకువెళ్లటానికి వీలుగా వుంటుందని అన్నగారికి వ్రాసింది.

జగదీశ్ ఇంటిపరిస్థితిచూసి బాధపడుతున్నారు. ఆయన మనోరమతో మాట్లాడారు. 'నువ్వు ఇంతవరకువుండి ఇప్పుడు చాలా తొందర పడుతున్నావు. మొదట నాన్నగారి అభిప్రాయం, మిగతావాళ్ళ అభిప్రాయం తెలుసుకోవలసింది' అని అన్నారు.

మనోరమ బాధనిండిన గొంతుతో తలవంచుకుని, 'మీరు వాళ్ళకోచెప్పండి, నాకు ఈ ఇంట్లో స్థానంలేదని. అభిప్రాయం తీసుకునే ప్రశ్నేముంది? న్యాయ స్థానానికి వారంరోజులు ముందుగా సూచన ఇవ్వడం అవసరం. ఆ సూచన మీరు ఇవ్వండి. మీవల్ల కాకపోతే నేనే స్వయంగా ఆ పని చేస్తాను' అంది.

ఇంట్లో ఒకసారి మళ్ళీ అలజడి ప్రారంభమయింది. మేఘనాధుని దెబ్బవల్ల లక్ష్మణుని స్థితి ఏవిధంగా అయిందో అదేవిధంగా అయింది లాలాగారి పరిస్థితి. తల్లిగారు వేరుగా దుఃఖిస్తున్నారు. ఆమెను ఓదార్చేవా రెవ్వరూ లేరు.

తల్లిగారిమనసులో ముగ్గురు సోదరుల ఏకైకసోదరి వివాహంగురించి అనేక కోరికలున్నాయి. ఆమె అనేకసంవత్సరాలనుంచి ఎన్నో నగల్ని, ఇతర వస్తువుల్ని దాచిపుంచుతూ వచ్చారు. మన్నో వివాహానికి కట్నంగా పనికివస్తాయనికదా అవి. మన్నో పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించేది కాదు. ఇప్పుడేమో ఈ వుపద్రవం తెచ్చిపెట్టింది. ఆమె కడుపు చించుకుని విలపించసాగారు. ఆమె తనపితానే నిందించు కోవటం ప్రారంభించారు.

రెండవవడిన ఇంతకుముం దెన్నడూ జరగని దురాచారంవల్ల బాధపడుతూ రెండుచేతులూ బుగ్గలమీదవేసుకుని, 'అయ్యో నేను చచ్చాను, ఈ దుండగం చూడు! నా కిప్పటికి ముగ్గురుపిల్లలు పుట్టారు. అయినా ఇప్పుడు బాదా మొగాళ్లతో మాట్లాడా లంటే శరీరం వణికిపోతుంది. మా పెళ్ళి అయిందంటే పల్లకీలో ఎక్కేవరకూ ఎక్కడికి వెడుతున్నామో తెలీదు. ఈ కాలపు ఆడపిల్లల్ని చూడు. వైరిచ్చి పెళ్ళి చేసుకుంటున్నారు' అంది.

లాలా జ్వాలాసహాయ్ విధిలేనివారై పోయారు. ఈ అవకాశాన్ని పిల్లి పెళ్ళికి సంబంధించిన శుభసమయం అనుకుంటారా. పిల్ల లేచిపోతోందన్నకళంకం ఆపాదించేసమయం అనుకుంటారా। ఇటువంటిపరిస్థితిలో ఎవరిని ఆహ్వానిస్తారు? ఎవరికి ముఖం చూపిస్తారు? కూతురు ఇతరమతస్థుడైన ఒక పాంథికునితో వెళ్ళి పోతోంది.

ఆ రాత్రి పెద్దకోడలు, రెండవకోడలు సలహా ఇచ్చారు.

'మాటను పెంచుకుని ఇంకా ఎక్కువ దుర్దశ కల్గించటంవల్ల లాభం లేదు. అడగకుండా మన అభిప్రాయం చెప్పటంలో అర్థమేముంది? ఆడపిల్ల పెళ్ళి ఏవిధంగా అవుతుందో మనోరమ పెళ్ళికూడా అలాగే జరిగితే లాలాగారు ఏభై అరవై వేలు ఎలాగో ఇస్తారు. ఇరవై పాతికవేలు పైఖర్చు అవుతుంది. అన్న య్యలుగూడా అయిదారువేలు ఇవ్వాల్సి వస్తుంది. అమ్మ ఫ్రేయర్‌రోడ్‌లో వున్న బంగళా మనోర్మకు కట్నంలో ఇవ్వటానికి నిశ్చయం చేసుకునివున్నారు. ఆ బంగళా అద్దె విడిగానే అట్టే బెట్టేవారు. ఇదంతా ఈ ఇంటి సంపదనుంచేకదా పోయేది. ఇప్పుడు అమ్మాయి తన ఇష్టప్రకారం తనకు నచ్చినవాణ్ణి చేసుకుంటోంది. ఏమీ చిన్నపిల్లకాదు, వయసువచ్చిన పిల్ల. ఇలాగే సూట్‌కేస్ తీసుకుని వెళ్ళిపోతుంది. దాపికన్నా ఇదే మంచిది. గౌరవం ఎంతైనా కాపాడుకోవటం మంచిది' అని మిగతా ఇద్దరు అన్నలూ అనుకున్నారు.

'ఇప్పుడు పెళ్ళి జరిగేదేముంది? పెళ్ళి అయిపోయింది. మనందరికి చెప్ప టమే మిగిలింది. ఆ మొగాడు ఈ ఇంటికివచ్చి దీనితో కలిసివున్నాడు. మసూరీలో వీళ్ళిద్దరూకలిసి షికార్లు చేస్తుండేవాళ్ళు. ఇప్పుడు జరగబోయేదేమిటంటే వాట జల్లెడపైన కప్పటం. జల్లెడ చాటపైన ముసుగు వేయటం। మనమేమో దూర దేశాల్లోవుండి సంపాదించి పంపించడానికే వున్నది. అన్నగారేమో ఇంట్లో తెచ్చి పెట్టాడు, ఈ చెల్లెలేమో అట్టె పెట్టుకుంది. మనంగాని రాకపోతే ఈ వ్యవహారం జరుగుతూనే వుండేది. పెళ్ళి అయితే అయిపోయింది' అని మర్నాడు రెండవ కోడలు చాటింపువేయడం మొదలుపెట్టింది.

ఇటువంటి బంధువులని, పరిచితులని ఆహ్వానించినా లాభమేముంది? వచ్చి దువనిగురించే విమర్శ మొదలుపెడతారు. మనోరమ ఇచ్చిన టెలిగ్రాంకు సమా

ధానంగా సుతలీవాలా తారీఖు నిర్ణయించి పంపారు. రెండువారాలే మధ్యలో వుంది. అన్నలు, వదినలు, ఆ సమయం రాకముందే వెళ్ళిపోవటం మంచిదనుకున్నారు. అమ్మాయికి ఏమిచ్చారని అందరూ అడుగుతారు. కాని సంపత్తిని, వ్యాపారాన్ని విభజించాల్సిన ప్రశ్న వుంది. దాన్ని తృణీకారం చేయగలగడం వాళ్లకి సంభవం కాదు.

సుతలీవాలా నిశ్చయించినతేదీకి తన ఇద్దరు మిత్రులతోసహా బొంబాయి నుంచి వచ్చారు. మేజిస్ట్రేట్‌ని బంగళాకు పిలిపించారు. పదిహేనునిముషాలలో పదిహేనురూపాయల ఖర్చుతో లక్షాధికారి కూతురి వివాహం అయిపోయింది. గౌరవప్రతిష్ఠలున్న హిందూమతంవాళ్ళకి ఇంతకన్నా అవమానం ఇంకేముంటుంది!

మనోరమని అప్పగించేసమయంలో వదినగార్లకి, అన్నగార్లకీకూడా కన్నీళ్లు వచ్చాయి. కట్నం ఏమీ ఇవ్వలేదు. కేవలం మనోరమ వస్తువులున్న ఎనిమిది పెట్టెలున్నాయి. ఆ పెట్టెలని స్టేషన్‌కు పంపించి బుక్ చేయించటం జరిగింది. అయిదు పెట్టెలలో మనోరమ బట్టలు, మిగిలిన మూడుపెట్టెలలో పుస్తకాలు వున్నాయి.

వెళ్ళేటప్పుడు ఆమె తండ్రిగారు పదకొండువేల చెక్కు, అన్నలందరూ కలిపి పదకొండువేలవంద చెక్కు ఆమెకు ఇచ్చారు. ఇదే కట్నం. మనోరమ చెక్కులవంక చూడకుండానే వాటిని తీసుకుని పర్సులో పెట్టుకుంది. ఆమె గంభీరంగానూ, నిరుత్సాహంగానూ వుంది. ఆమెకళ్ళు నీరసంగా వున్నాయి. లోపలకు వెళ్ళి తల్లిని కలుసుకుంది. భూపీని, దీపాను, కొత్తపాపను ముద్దుపెట్టుకుంది. కన్నీళ్లు నిండిన అన్నల కళ్ళవంక, వదినల కళ్లవంక ఆమె చూడలేదు.

సుతలీవాలా బొంబాయిమెయిల్ కదిలేవరకు తన కొత్తబంధువులతోపాటు ప్లాట్‌ఫారంమీదనే నిలబడివున్నారు. ఆయన వినయం, అణకువలకు ప్రతిరూపం. ఇంతపెద్ద గౌరవప్రతిష్ఠలుగల పరివారంతో తనకు సంబంధం కలవటంవల్ల ఆయన మాటిమాటికీ కృతజ్ఞత తెలియచెప్పారు. వాళ్లఅమ్మాయికి గౌరవం, విశ్రాంతి ఇస్తానని పదేపదే చెప్పారు. ప్రతిఒక్క బంధువుని పేరుపేరున బొంబాయి రమ్మని ఆహ్వానించారు. ఆయన పచ్చని శరీరచ్ఛాయ, రూపం, వినయం చూసినతర్వాత, అమ్మాయికి వరుడు మంచివాడే దొరికాడని అందరికీ నమ్మకం ఏర్పడింది.

మనోరమ బండిలో మౌనంగా కూర్చుండిపోయింది. బండి కదిలినమీదట చేతులు జోడించి అందరికీ నమస్కారం చేసింది.

సుతలీవాలాతో వచ్చిన ఇద్దరు మిత్రులు వధూవరులు ఒంటరిగా వుండాలన్న ఆలోచనతో తమకోసం మరొక ఫస్టుక్లాసు కంపార్టుమెంటును రిజర్వు చేయించు కున్నారు. కాని ఇంత సభ్యత చూపించగలగడం ఇతరప్రయాణీకులకు సంభవం కాదు.

రాత్రి పదిగంటలయింది. బండి లాహోర్ పొలిమేరలు దాటగానే పై బర్తుల ఇద్దరు ప్రయాణీకులు నిద్రపోవడానికి ఏర్పాట్లు చేసుకోసాగారు. సుతలీవాలా మనో రమకు దగ్గరగాకూర్చుని ప్రేమగా ఆమె వీపుపైన చేయివేసి నవ్వి, ఆమె విశ్రాంతి తీసుకోవడంగురించి అడిగారు.

నిస్సంకోచం, అధికారంతో నిండిన పురుషుని స్పర్శవల్ల మనోరమ కళ్ళు మత్తుతో వాలిపోయాయి. ఆమె నవ్వి ధన్యవాదా లర్పించింది ప్రణయానికి ఆతుర పడే సుతలీవాలా ఆమెవైపుకి చేతులు చాచారు. మనోరమ పక్క సర్దటంలోనూ, పెట్టెతెరచి రాత్రి వేసుకునేదుస్తులు తీయడంలోనూ సహాయం చేశారు. సుతలీ వాలా చేతులు మాటిమాటికీ ఆమెను తాకుతుండటంచేత మనోరమ మధురమైన అనుభూతిని పొందుతోంది. ఆయన ఉచ్ఛ్వాసస్పర్శ భుజాలమీద, మెడమీద తగ లటంచేత మనోరమకు శరీరంలో విద్యుత్తు ప్రవహిస్తున్నట్లుగా వుంది. సుతలీ వాలా ముందుకువెళ్ళి ఆమెకోసం స్నానాలగది తలుపు తెరిచారు.

మనోరమదగ్గర రాత్రిపూట కట్టుకుని పడుకునేందుకు గౌను, పైజామా వున్నాయి కానీ ఆమె వాటిని ఎన్నడూ ధరించేదికాదు. ఎప్పుడో మొదట్లో సరదా కొద్దీ కొనుక్కుంది. సుతలీవాలాతోకలిసి మొదటిసారి ప్రయాణంచేస్తూ ఆ దుస్తు లను కట్టుకోగానే ఈ బట్టలలో ఎలా వుంటాను? అని ఆమెకు అనిపించింది. స్నానాలగదిలోవున్న అద్దంలో, ఆ దుస్తులలో తనశరీరం ఆమెకు చాలా అందంగా కనిపించింది. దువ్వెనతో జుట్టుగూడా సరిచేసుకుంది. ముఖంమీద చేత్తో పౌడరు గూడా అద్దుకుంది. ఇప్పుడు తప్పకుండా అందంగా కనిపిస్తాను అనుకుంది. ఆమె అక్కడనుంచి బయటకు రాగానే సంకోచంవల్ల మెడ వాలిపోయింది.

సుతలీవాలా తనపక్కమీదకూర్చుని పరీక్షిస్తున్నారు. మనోరమ పక్కమీద పడుకుంది. సుతలీవాలా నవ్వి 'లైటు ఆర్పేయనా, వుంచనా?' అని అడిగారు.

మనోరమ తల అడ్డంగా తిప్పింది. లైటు ఆరిపోయింది.

మనోరమకు తన నుదుటిమీద సుతలీవాలా చేతుస్పర్శ. పెదిమలమీద ఆయన పెదిమలు తాకిన అనుభూతి కలిగింది. తర్వాత 'గుడ్‌నయిట్' అని ఆయన చెవులదగ్గర చెప్పటం వినిపించింది.

నిర్భయంగా, అధికారంతోనిండిన ఆయనస్పర్శ అనుభవంలేని మనోరమకు ఏదో కొత్తగా వుంది. ఆహా ఎంత మధురమైన అనుభూతి! మనోరమ చేతులు కదిలించటానికి ప్రయత్నించి విఫలురాలయింది. వీపు బలంగా నొక్కబడటంచేత కదలలేక అలానే వుండిపోయింది.

రైలుబండిలో చీకటి వ్యాపించింది. స్నానాలగదికివున్న తలుపుమీదమాత్రం లోపలివెలుగువల్ల ప్రకాశించే ఉజ్వలమైన నీలపురంగు ఆకారం కనిపిస్తోంది. ప్రయాణంచేసే ఆ చిన్న ప్రపంచానికి రాత్రికోసం చంద్రుని ఆటబొమ్మ తయారు చేసినట్లుగా వుంది ఆ నీలాకారం. మనోరమ కళ్ళుమూసుకుని తన పక్కమీద పడుకునివుంది. ఫస్టుక్లాసు బర్తుస్ప్రింగు వేగమైన బండినడకతో కలిసి వూయలలూపుతూ ఆమెను 'నిదురపో, నిదురపో, రాజకుమారీ నిదురపో' అని పాడుతున్నట్లుంది.

మనోరమ నిద్రపోవటంలేదు. నిద్రపోవాలని అనుకోవడంకూడా లేదు కాని ఎప్పుడు నిద్రపోయిందో ఆమెకే తెలీదు.

రైలు వేగంగా వెడుతోంది. మనోరమ నిద్రలేచింది. వేగంగా వెళ్ళే రైలులో పక్కమీద నిద్ర మెలకువవచ్చే అనుభవం. వైవాహికజీవితంలో మొదటి ప్రభాతం. ఆమె సుతలీవాలా బర్తువైపు సిగ్గుపడుతూ చూసింది. ఆయన గాఢ నిద్రలో వున్నారు. పచ్చని నుదుటిమీద ముంగురులు కోమలంగా నాట్యంచేస్తూ కనిపించాయి. ఎంత అందంగా కనిపిస్తున్నారు, తను ఆయన స్వంతం అనుకుంది. పైన ప్రయాణీకులు గాఢనిద్ర పోతున్నారు. మిగతావాళ్ళు లేవకముందే బట్టలు మార్చుకుందామని మనోరమ అనుకుంది. ఆమె తొందరగాలేచి పక్కమీదనుంచి కిందికి దిగింది. అవసరమైన వస్తువులు, బట్టలుతీసుకుని స్నానాలగదిలోకి వెళ్ళి

పోయింది. ఏ బట్టలు కట్టుకోవాలో నిశ్చయించుకోవడంలో చాలాసేపు పట్టింది. జుట్టుని అతిప్రయత్నంతో సర్దుకోవడంలో కూడా చాలాసేపు పట్టింది.

మనోరమ ముస్తాబై వచ్చి తనసీట్లో కూర్చుంది. ఆయన 'గుడ్ మార్నింగ్' చెప్పి నవ్వినవవ్వు ఎంతో మధురంగా అనిపించింది. భర్తకు అవసరమైనవస్తువులు బయటకుతీయడంలో సహాయం చేద్దామనుకుంది కానీ భర్త పెట్టెలో ఏమేమి ఎక్కడున్నాయో ఆమెకు తెలీదు. ఆమె ఇటువంటిపని ఎప్పుడూ చేయలేదు. ఎవరైనా జబ్బుపడితే తప్ప ఎవరికీ సేవ చేయలేదు.

రైలుబండిలో రెండవ ప్రపంచయుద్ధంతాలూకు గుంపువుంది. ఫస్టుక్లాసులో గూడా నిర్మానుష్యత. ఏకాంతం దొరకటం అసంభవంగా వుంది. వాళ్ళిద్దరూతప్ప బండిలో ఇంకెవరూ లేకపోతే.........అనుకుంది మనోరమ. ఈ పెద్దప్రయాణం ఎప్పుడు పూర్తవుతుందో, ఎప్పుడు బొంబాయి చేరతామో, అని ఆలోచిస్తుంది.

సుతలీవాలా ఆమెకు దగ్గరగాకూర్చుని మాట్లాడసాగారు. 'నిన్ను మొదటి సారి కలుసుకున్నప్పుడే, నా వివాహం నీతో అవుతుందని నా మనసు చెప్పింది' అన్నారు.

లాహోర్‌లో తాము మొదటిసారి కలుసుకున్నవిషయం సుతలీవాలా మనోరమకు గుర్తుచేయడం మొదలుపెట్టారు. 'మీ పరివారంవాళ్ళకి ప్రాచీనపరంపర. ప్రాచీనసంస్కృతిమీద నమ్మకం వుండటంచేత మన పెళ్ళివల్ల వాళ్ళకి ఎక్కువ సంతోషం కలగలేదు. కాని కాలక్రమాన వాళ్ళప్రవర్తన మారిపోతుంది. తర్వాత వాళ్ళు మనకి సహాయం చేయగలుగుతారు' అన్నారు గంభీరంగా.

వాళ్ళు ఇంగ్లీషులో మాట్లాడుకుంటున్నారు. 'ఆ విషయం వదిలిపెట్టేయండి' అని మనోరమ పర్సుతీసి పెన్ను, నాలుగుచెక్కులు బయటకు తీసింది. 'హైవర్ జీ సుతలీవాలాకు చెల్లించాల్సింది' అని చెక్కులవెనుక వ్రాసింది. 'మనోరమ' అని సంతకం చేసింది.

మనోరమ నాలుగుచెక్కులూ సుతలీవాలాచేతుల్లో పెట్టింది. సుతలీవాలా నవ్వి 'దీనికి తొందరేముంది?' అన్నారు.

'అంతా మీదేగా' అన్నది మనోరమ.

సుతలీవాలా పరివారమంతా బరోడ్‌లో వున్నారు. బొంబాయిలో వ్యాపారం చూసుకునేందుకు ఆయన ఒంటరిగా వుంటున్నారు. ఇంట్లో పనులు చేయడంకోసం నౌకరున్నాడు. బొంబాయి పారిశ్రామిక పట్టణం. అక్కడ సుమారుగా ప్రజలంతా ఇరుకుప్రదేశాలలో కాలం వెళ్ళబుచ్చుతూ వుంటారు. లాహోర్‌లో మనోరమ వుండే బంగళాలా బొంబాయిలో ఎనిమిది-పదిగదులు తీసుకుని వుండటం సంభవం కాదు. ఆయన మలబార్‌హిల్‌మీద ఒక చిన్నబంగళాలోని పై అంతస్థులో వుంటు న్నారు. ఆయన అద్దెకు తీసుకున్నవి కేవలం మూడుగదులు. దీనికే అద్దె వంద రూపాయలు ఇస్తున్నారు. ఇదంతా మనోరమకు తెలియజెప్పారు.

మనోరమకు మూడుగదులు ఏమీ తక్కువ అనిపించలేదు. చిన్నచోటుని సర్ది, అలంకరించి వుంచకలుగుతుంది. పరివారంవాళ్ళెవరూ లేకపోతేమాత్రమేం, వాళ్ళిద్దరూ తమ ప్రేమగూటిలో నిర్విఘ్నంగా, నిస్సంకోచంగా వుంటారు అని అనుకుంది.

• • •

సుతలీవాలా మనోరమని ఇంటిదగ్గరదింపి కొంచంసేపట్లో వస్తానని బయ టకు వెళ్లారు. వరండాకు ఎదురుగా అనంతమైన సముద్రం పెద్దపెద్ద కెరటాలతో హోరున ప్రవహిస్తోంది. మేఘాలతో ఆచ్ఛాదించబడి, ఎర్రరంగువాల్చిన మబ్బు తునకలవెనక అణిగివున్న ఎర్రనిసూర్యుడు సముద్రంలో సమాధిలోకి వెళ్ళిపో తున్నాడు. ఇంటిగదులు గులాబీరంగులో వున్నాయి. ఆ ఇంట్లో, భర్తతో కలిసివుండే మొదటిరాత్రి వస్తోంది. వంటఇంట్లో వంటవాడు ఆమె సలహాప్రకారం వంట చేస్తు న్నాడు. ఆమె మూడుగదుల్నిసర్ది అలంకరించింది. ప్రతిగదిలోకి చాలాసార్లు వెళ్ళి తిరిగిచూసి వచ్చింది. పడకగదిని అలంకరించేటప్పుడు ఆమె శరీరం సిగ్గుతో పుల కించిపోయింది. గదిలో రెండు పెద్దపెద్ద మంచాలున్నాయి....

ఉదయం నిద్రలేచేటప్పటికి మనోరమకు రాత్రి నిద్ర లేకపోవటంచేత అలసటగానూ, శరీరం బరువుగానూ వుంది. తనమీద తనకే జాలి కలుగుతున్న ట్లుగా అనిపించింది. పవిత్రమైన తన శరీరానికి అనవసరంగా మచ్చ ఏర్పడిందేమో అనుకుంది. సుతలీవాలా సిగ్గుపడుతూ 'కొద్దిరోజులనుంచి నా ఆరోగ్యం బాగుం డటంలేదు. మందు తీసుకుంటాను' అన్నారు.

మనోరమకు సుతలీవాలా అన్నమాట అనుచితంగా తోచింది. ఆ ఆలోచనను దూరమయేందుకు, అలంకరించుకునేందుకు మనసు కలగలేదు.

సుతలీవాలా చాలా అడకువగా ప్రవర్తించేవాడు. మనోరమ అలా ప్రవర్తించలేకపోవటంవల్ల సోమరితనాన్ని, బిడియాన్ని అనుభవిస్తూ వుండేది. ఏం చేయలేక ఆలోచిస్తూ కూర్చునేది. ఇదేమిమాట, మాటిమాటికి ఆ మాటలు ఆలోచిస్తూ కూర్చోవలసిన అవసరమేముంది? ఇంట్లోనిపనిలో మనసు లగ్నం చేద్దామనుకుంది కానీ చేయటానికిమటుకు ఏముంది? నౌకర్లు పనంతా చేస్తారు. చేస్తూనే వున్నారు. ఆమె ఏదో పత్రికో, పుస్తకమో తీసుకుని చదవటానికి కూర్చునేది.

సుతలీవాలా ఉదయం టిఫెన్ చేసి వెళ్ళిపోయేవారు. ఒంటిగంటన్నరకు భోజనానికి వచ్చేవారు. ఒక్కొక్కప్పుడు వచ్చేవారుకూడా కాదు. మనోరమ మనసు పుస్తకాలు చదవటంలోకూడా లగ్నమయేదికాదు. పగలు నిద్రపోయే అలవాటు వుంది. సుతలీవాలా సాయంకాలం తిరిగివచ్చి టీ త్రాగినతర్వాత మనోరమను కారులో బయటకు తీసుకువెళ్ళేవారు. క్రికెట్ క్లబ్బుకో, సినిమాకో తీసుకెళ్ళేవారు. అప్పుడప్పుడూ డాన్సుకుకూడా తీసుకువెళ్ళేవారు. అప్పుడు భోజనంగూడా బయట హోటల్లో చేసేవాళ్ళు. అర్ధరాత్రి సమయానికి ఇంటికి తిరిగివచ్చేవాళ్ళు.

మనోరమకు చదవటానికి చాలా సమయంవుంది కానీ మనసు కేంద్రీకృతమయేది కాదు. కొత్తప్రదేశంలో ఎవరూ పరిచయం లేకపోవటంవల్ల ఆమె ఎక్కడికీ వెళ్ళలేదు. బజారుపనులు చూస్తూవుండు అని సుతలీవాలా సలహా ఇచ్చాడు. బజారువెళ్ళి ఏ వస్తువులు కొనాలి అని ఆలోచించేది. ఆమెకు సమయం గడవటం కష్టమవుతూ వచ్చింది. పెళ్ళికాకముందు ఏం లోటువుంది కనుక ఇప్పుడు తీరుతోందనుకోవడానికి! సుతలీవాలా పెళ్ళిప్రస్తావన ఎందుకు చేశాడు? మిగతా ఆడపిల్లలు పెళ్ళయినతర్వాత ఎంతో ఆనందంగా, ఉల్లాసంగా వున్నట్లుగా కనిపిస్తారు...! ఏదో రహస్యం వాళ్ళ పెదిమలవరకూవచ్చి చెప్పటానికి ప్రయత్నిస్తున్నట్లుగా చంచలంగా వుంటారు. కానీ తను కేవలం మోసపోయినట్లుగా అనుకోసాగింది. కన్యగా వుండటంచేత తన స్థితి దయనీయమైనదిగా వుందని ఎందుకు అనుకుంది. ఎందుకు....ఎలా....? భర్తసేవలల్లో భాగం పంచుకుంటే కొంతసమయం గడుస్తుంది అనుకుంది.

సుతలీవాలా నవ్వుతూ అన్నారు—'నాపని నేనే చేయగలను. నువ్వు ఫలానాపనిలో పెట్టుబడి పెట్టు అని పెట్టుబడివాళ్లని బ్రతిమలాడాల్సి వస్తుంది. ఇంకొకళ్ళప్రమేయం వుండదు. మనిషిలోతు తెలుసుకోవాల్సి వుంటుంది. వాళ్ళస్వభావం కనిపెట్టాల్సి వుంటుంది. పిన్న క్లబ్బుకి వెంటతీసుకెళ్ళనతనినుంచి ఒకఫిల్ములో రెండులక్షల పెట్టుబడి లాగటానికి చూస్తున్నాను. ఇప్పటివరకూ ఇతరులఫిల్ములు అమ్ముతున్నాను. ఇప్పుడు నేనే స్వయంగా ఫిల్ము తయారుచేసి అమ్మాలనుకుంటున్నాను. పెట్టుబడి వాళ్ళది. బుద్ధి మనది.'

సుతలీవాలా అనుకున్నాడు. రైలులో ప్రయాణం చేసేటప్పుడు మనోరమ అతనికి దగ్గరగావచ్చి తన స్పర్శపొందుతూ కూర్చోవడానికి ఆతృతపడింది. కానీ ఇప్పుడు ఆమెకు ఆ ఆలోచన లేదు. కారణం తెలుసుకున్నాడు. పంజాబులోని చల్లటిగాలిలో, భిన్నమైన వాతావరణంలో పెరిగిన ఆ అమ్మాయి తనకన్నా చాలా ఆరోగ్యంగా వుంది. ఆమె వైవాహికజీవితంలోకి అడుగుపెట్టేనాటికి వింకు అవ్వని. సుతలీవాలా వైవాహికజీవితం గడపకుండా, వైవాహికజీవితం అనుభవించాలన్న ప్రయత్నంలో శారీరకంగా నీరసంగా వుంది, కేవలం కోరికను, అభిలాషను కలిగి వున్నాడు. ముసలితనమనే పెరుగుతూవచ్చే సంధ్యాకాలంలో వివాహాన్ని ఆధారంగా నిర్మించుకున్నాడు.

మనోరమని సుతలీవాలా అనేకరకాలచోట్లకి తీసుకువెళ్ళేవాడు. అనేకమంది యువకులని, యువతులని పరిచయం చేసేవాడు. అతను మనోరమ మనసుకు ఆనందాన్ని కలిగించాలని తహతహలాడేవాడు. కాని మనోరమకు అలవాటైన వాతావరణం లభించేదికాదు. పార్టీలలోనూ, క్లబ్బులలోనూ, షికార్లగురించి, గుర్రపుపందాలగురించి సంభాషణలు జరుగుతూవుండేవి. స్త్రీల సమావేశాలలో తనకు పరిచయంలేని స్త్రీలగురించిన చర్చ జరుగుతూవుండేది.

సుతలీవాలా మొదటిరాత్రి తన పరిస్థితికారణంగా మనోరమఎదుట సిగ్గుతో కూడిన నిరుత్సాహాన్ని పొందేవాడు. మనోరమని సంతృప్తిపరచాలని చేసిన ప్రయత్నాలకు ఏవిధమైన సంతోషకరమైన ఫలితం కలగలేదు. వివాహంజరిగి మూడు వారాలయింది. సాయంకాలం అతను మనోరమను సినిమాకు తీసుకువెళ్లాడు. ఆ తర్వాత డాన్సుకు తీసుకువెళ్లాడు. ఆ సాయంత్రం సుతలీవాలా నవ్వుతూ కవిపి

స్తున్నారు. ఇంటికి తిరిగివచ్చి మనోరమ బట్టలు మార్చుకుని విశ్రపోయే ప్రయత్నంలో వుంది.

మనోరమ తన మంచంమీద పడుకునేందుకు ఏర్పాటు చేస్తుండగాచూసి సుతలీవాలా ఆమెదగ్గరకు వచ్చాడు. 'ఆ రోజు నా ఆరోగ్యం బాగాలేదు. ఆ విషయాన్ని మర్చిపో' అన్నాడు సంకోచపడుతూ. అతను ఆమె మంచంమీద కూర్చున్నాడు. మనోరమకు ఆ అవమానం దెబ్బలా తగిలింది. ఆమె బయట వసారాలోకి వెళ్ళి కూర్చుంది.

సుతలీవాలా అవమానం పొందాడు. కానీ ధైర్యంచేసి మనోరమకు నచ్చజెప్పాలనుకున్నాడు. మనోరమ ఏడవసాగింది. విష్ఫలుడై సుతలీవాలా మెదలకుండా పడుకున్నాడు. మనోరమ ప్రవర్తన అతనికి సహించరాని అవమానంగా అనిపించింది. అతను కొంచం కఠినంగా మాట్లాడాడు. మనసులో భార్యవల్ల పొందిన అవమానపు మంట, శరీరంలో మందులవల్ల కలిగిన ప్రేరణ అతన్ని వ్యాకులపెట్టసాగాయి. అతను అతి కష్టంమీద చాలాసేపటితర్వాత నిద్రపోగలిగాడు. ఉదయంలేచి మనోరమతో ఏమీ మాట్లాడలేదు. ఏడుగంటలకే తయారై పోయి నౌకరుని మెట్లదగ్గరకుపిల్చి 'మాకు అవసరమైన పనివుంది. భోజనం ఆఫీసులోనే చేస్తాము. సాయంత్రానికి వస్తామని అమ్మగారితో చెప్పు' అని చెప్పి వెళ్ళిపోయాడు.

మనోరమ నిరుత్సాహంగానూ, నీరసంగానూ వుంది. వివాహం చేసుకుని పొందిందేముంది? ఎంతపెద్ద పొరపాటు....ఎంతమోసం....! ఆమె టీ మాత్రం త్రాగింది. ఏమీ తినలేదు. స్నానంచేసి బట్టలు మార్చుకోవడానికికూడా ఉత్సాహం లేదు. ఇంట్లో ఏపనీ లేకుండా కూర్చోవడంకూడా బాధగా వుంది. ఇల్లు ఆమెని బంధించివేసే పంజరంలా అనిపించేది. అలాగే లేచి బట్టలు మార్చుకుంది. రోడ్డు మీదకువెళ్ళి సముద్రంవైపు బయలుదేరింది. మలబార్ హిల్ మీద ధనవంతులబంగళాలున్నాయి. పిల్లలు ఇళ్ళనుంచి స్కూలుకు వెళ్ళడానికి బయటకు వస్తున్నారు. ఎంతో ఆరోగ్యంగానూ, ఆనందంగానూ వున్నారు. ఇది గృహస్థజీవితం కానీ నేను అడుగుపెట్టిన వైవాహికజీవితం మోసం అని అనుకుంది వాళ్ళను చూసి.

మనోరమ కైడీ బీచ్ దగ్గరకు చేరింది. కొందరు వయసుమళ్ళినవాళ్ళు

సముద్రపుఒడ్డున తిన్నెమీద కూర్చునివున్నారు. శీతాకాలపు ఎండలో పడమటివైపు మంచి వచ్చే ఆరోగ్యకరమైన గాలిని సేవిస్తున్నారు. ఆమెకూడా సముద్రపు ఒడ్డున తిన్నెమీద కూర్చుంది. 'ఏమిటి చేయటం? వైవాహికజీవితంవల్ల కలిగేమాధుర్యం తనకు లేనేలేదు. అనవసరంగా వంచనలో చిక్కుకుపోయింది. కాలేజీలో టీచరు పని చేయటం మంచిది. లాహోర్‌లో కొద్దిరోజులు పత్రికలో పనిచేసింది. అప్పుడు ఎంత బాగుండేది! పదిహేనురూపాయల నెలసరిజీతంమీద పనిచేస్తుండేవాళ్ళు. భూషణ్ కఠినంగా మాట్లాడేవారు. కాని ఆయన హృదయంలో మనిషిమీద నమ్మకం, గౌరవం వున్నాయి. ఆయనతో కలిసి ధూళిలోనూ, ఎండలోనూ కాలి నడకన తిరిగినా, పోట్లాడుకున్నా, అవమానంగానూ, హీనంగానూ వున్నట్లు అని పించదు. భూషణ్ నన్ను మోసంచేయాలని అనుకునేవారు కాదు. అందుకే దగ్గర దగ్గరకు వస్తూకూడా మేము దూరమైపోయాము' అని ఆలోచించసాగింది.

మనోరమ ఎండలో తళుక్కుమనే నీలిసముద్రంవైపు రెప్ప వాల్చకుండా చూస్తూ ఆలోచిస్తోంది—భూషణ్‌కు తను కష్టపడేవాడని, అన్నిటినీ ఓర్పుతో భరించేవాడనే గర్వం వుంది. ఒక లక్ష్యంకోసం ఆయన పోరాడుతున్నారు. నేను కేవలం డబ్బు, బంగళా, బట్టలు, కార్లు కోరుతానని ఆయన అనుకున్నారు. ఒకవేళ ఆయనదగ్గర ఈ వస్తువులుంటే ఇందులోనే చిక్కుకుంటారా? నన్ను ఎన్నిసార్లు దెబ్బకొట్టారు! ఎన్నిసార్లు అవమానించారు! ఆ రోజు ధర్మశాలలో సోమావిషయం తీసుకుని ...కానీ ఆయన కాఠిన్యంలోనూ, దెబ్బ కొట్టడంలోనూకూడా విశ్వాసం తొణికిసలాడేది. కఠినంగా కనపడే భూషణ్ ముఖం, సన్నవిదైన శరీరం దారుఢ్య మైనవి. పచ్చని సుస్నితమైన సుతలీవాలా ముఖం మృదువుగా వుంటుంది. తన శరీరంలో కలిగిన బాధ, అసహ్యంవల్ల అతన్ని తిరస్కరించేద్దామని ఆమెకి అనిపిం చింది. భూషణ్‌కు నామీద నమ్మకమేలేదు. నేను ఈ వస్తువులని కాలితో తన్ని పారవేయగలనని ఎప్పుడో భూషణ్‌కు నిరూపిస్తాను అనుకుంది.

భూషణ్ బొంబాయిలోనే వున్నాడని మనోరమకు జ్ఞప్తికి వచ్చింది. 'పీపుల్స్ వార్', 'లోకయుద్ధ్' ఇక్కడే ప్రచురించబడతాయి. ఖేత్‌వాడీ మెయిన్‌రోడ్ ఆమెకు జ్ఞాపకమొచ్చింది. ఇద్దరూ పత్రికచందా ఇదే చిరునామాకు పంపేవాళ్ళు. లాహోర్ పత్రికలో పనిచేసేటప్పుడు ఈ ఆఫీసుతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూ

వుండేవి. సుశీలవాలా సాయంకాలానికి వస్తానని చెప్పివెళ్లారు. ఎప్పుడైనా తిరిగి రావీ. ఇక్కడ కూర్చుని తన గత జీవితాన్నిగురించి ఆలోచించి ఏడుస్తూకూర్చుంటే లాభమేముంది? అని అనుకుని ఆమె సముద్రపు తిన్నెమీదనుంచి లేచింది. కమ్యూనిస్టు కార్యాలయందగ్గరకు వెళ్ళడానికి దోవ ఆమెకు తెలియదు. టాక్సీవాళ్ళయితే అన్నిదోవలూ తెలుసుకునివుంటారు. మెయిన్‌రోడ్డుమీదకు రాగానే ఒక ఖాళీటాక్సీ కనిపించింది. సైగచూడగానే టాక్సీ దగ్గరకు వచ్చింది. టాక్సీలో కూర్చుని 'ఖేత్‌వాడీ మెయిన్‌రోడ్' అని చెప్పింది.

ఒకవేళ భూషణ్ ఈవేళప్పుడు కార్యాలయంలో లేకపోతే, ఆమె కార్యాలయంలో పనిచేసే అనేకమంది పేర్లు ఎరుగుందివుంది. ఆ పేర్లు తరుచుగా పత్రికలలో ప్రచురితమవుతూ వుంటాయి. కనీసం ఆ ప్రదేశమైనా చూసిరావచ్చు, అని ఆలోచించింది.

టాక్సీడ్రైవరు మలబార్‌హిల్‌కు పూర్తిగా భిన్నంగావున్నప్రదేశంలో ఒక బజారులోకి వచ్చి 'ఇదే ఖేత్‌వాడీ, ఎక్కడికి వెడతారు?' అని అడిగాడు. మనోరమ చుట్టుపక్కల అంతా అపరిచితంగా వుండటంచూసి 'రామభవన్, కమ్యూనిస్టు పార్టీ' అని చెప్పింది.

'లాత్ దావటా వెళ్లాలా?' టాక్సీడ్రైవరు అడిగాడు. కొంచం ముందుకు తీసుకువెళ్ళి ఒక పెద్ద తెల్లని ఇంటిఎదుట టాక్సీ ఆపాడు. ఇంటిముఖద్వారంపక్క వంకరలుగాతిరిగిన మెట్లున్నాయి. మెట్లకుదగ్గరగా ఒక యువకుడు బెంచీమీద కూర్చునివున్నాడు. కొందరు మెట్లెక్కి పైకి వెళుతున్నారు. కొందరు కిందికి దిగుతున్నారు. మౌనంగా ఎవరిపనిలో వాళ్లు నిమగ్నులై వున్నట్లున్నారు. మనోరమ ఆ యువకుని దగ్గరకెళ్ళి - 'ఆఫీసు పైనవుందా?' అని అడిగింది.

'మీరు ఎవర్ని కలుసుకోవాలి?' యువకుడు అడిగాడు.

'కామ్రేడ్ భూషణ్‌ను.'

'ఏపని చేస్తుంటారు?'

'పత్రికలో....'

'ఏ పత్రికలో, ఏ డిపార్ట్‌లో....?' యువకుడు దారానికి వేళ్ళాడదీసివున్న కాగితాలనుంచి ఒక కాగితం చించి మనోరమకు ఇచ్చాడు.

'వ్రాసి ఇవ్వండి.'

అంత పెద్ద కార్యాలయంచూసి మనోరమకు ఆశ్చర్యం కలిగింది. భూషణ్‌ని అందరూ ఎరుగుండివుంటారా? భూషణ్ ఏపనిచేస్తాడో ఆమెకు తెలీదు. కొంచెం ఆలోచించి 'లాహోర్‌లో పనిచేసే కామ్రేడ్ భూషణ్‌ని కలుసుకో కోరుతాను. మనోరమ' అని కాగితంమీద ఇంగ్లీషులో వ్రాసింది.

బెంచీమీద కూర్చునివున్న యువకుడు పక్కనే కాగితాలకలిపికట్టి ఇంకొక యువకుణ్ణిపిల్చి మరాఠీలో ఏకో చెప్పి ఆ కాగితం ఇచ్చాడు. అతను పక్కనేవున్న మెట్లెక్కి పైకి వెళ్ళాడు. మనోరమ తనపర్సు చేతులతో నొక్కిపట్టుకుని వీక్షిస్తూ నిలబడింది.

యువకుడు బెంచీమీదనుంచిలేచి కొంచం సంకోచించి 'మీరు ఇక్కడ కూర్చోండి, పైకి మనిషిని పంపాను' అన్నాడు.

'ఫరవాలేదు, మీరే కూర్చోండి. నాకేమీ ఇబ్బందిగా లేదు' అంది మనోరమ. పైనుంచి చాలామంది కిందికి వచ్చారు. ఎందరో పైకి వెళ్లారు. ఆ యువకుడు ఇద్దరినిమాత్రమే ఆపాడు. వచ్చేపోయేవాళ్ళు యువకులు, కామ్రేడ్‌లు కాని లాహోర్ కామ్రేడ్‌లకన్నా ఎక్కువమంది వున్నారు. ఆరోగ్యంగా, అందంగా వున్నారు. మనోరమ రోడ్డువైపుచూస్తూ వీక్షిస్తోంది. ఇంతలో 'హలో కామ్రేడ్!' అన్న పరిచితమైనగొంతు వినిపించింది. అది భూషణ్ గొంతు. భూషణ్ నవ్వుతూ మెట్లమీంచి దిగుతున్నాడు. ఇప్పుడుకూడా కలం అతనివేళ్ళమధ్య వుంది. 'ఎప్పుడు వచ్చావు?' అని అతను ఆశ్చర్యంగా అడిగాడు.

మనోరమ నవ్వడానికి ప్రయత్నించింది.

'నువ్వు ఫోను చేయాల్సింది. ఎప్పుడు వచ్చావు; ఎలా వచ్చావు? మిగతా వాళ్ళుగూడా వచ్చారా? జగదీశ్ వచ్చాడా?' అని భూషణ్ ఆదుర్దాగా అడిగాడు.

'మీ రెలా వున్నారు?' మనోరమ నవ్వుతూ అడిగింది.

భూషణ్ కొంచం అలసివున్నట్లు, నీరసంగానూ కనిపిస్తున్నాడు. మనోరమకు ఈర్ష్య కలిగింది. 'ఇంతపని చేయాల్సిన అవసరమేముంది ఇతనికి!' అనుకుంది.

'రా పైకి రా!' భూషణ్ మనోరమని తనతోపాటు పైకి తీసుకెళ్లాడు. మొదటి అంతస్థు, రెండవ అంతస్థు, మూడవ అంతస్థులలో అన్నిగదులలోనూ బల్లలముందు కూర్చుని అందరూ పనిచేస్తున్నారు. టైపురైటరు టకటకమని శబ్దం చేస్తోంది.

'రా, మా గదిలోకివెళ్లాం' అని భూషణ్ అన్నాడు కానీ మళ్ళీ ఆలోచించి 'అతిథులు కూర్చునే గదికి వెళ్దాంపద' అన్నాడు.

ఆ గది బాగుంది. బాగా పెద్దది. ఎర్రటిదారంతో కొడవళ్ళచిహ్నాలు, సమ్మెటలచిహ్నాలు అల్లిన తెల్లనితెర గోడకి వేళ్ళాడుతోంది. మార్క్స్, లెనిన్‌ల పటాలున్నాయి. ఒకమూల పెద్ద రేడియో నెమ్మదిగా మోగుతోంది. ఆ రేడియోదగ్గర కూర్చుని ఒకవ్యక్తి పెన్నూ, కాగితాలు తీసుకుని ఏదో రాసుకుంటున్నాడు. ఇంకొకవైపున ఓ యువకుడు వార్తాపత్రిక చదువుతున్నాడు. భూషణ్, మనోరమలవైపు ఎవరూ పరీక్షగా చూడలేదు. భూషణ్ మనోరమని ఓ కుర్చీలో కూర్చోమనిచెబుతూ 'ఎప్పుడు వచ్చావు?' అని తనప్రశ్న రెట్టించాడు.'

'నెలవుతోంది.'

'అయితే ఇంతవరకూ కలవలేదేం?'

'కలుసుకోవటానికే వచ్చాను.'

'ఒకనెలతర్వాతా! ఫోనుగూడా చేయలేదు. చాలాపనిలో వున్నావా? ఎక్కడ వుంటున్నావు?'

'మల్‌బార్‌హిల్.'

'అడ్రసు చెప్పు. నేను వస్తాను.'

'నేపియర్ రోడ్‌లో, లక్‌మాన్‌జీ స్ట్రీట్, 17 వ నం. ఫ్లాటు.'

'ఇక్కడికి ఎలా వచ్చావో చెప్పలేదు.'

'ఇక్కడ ఏం చాలా ఆఫీసులున్నాయా?' మనోరమ మాట మార్చేసింది. 'మీ అడ్రసు కనుక్కోవడం కష్టమైపోయింది.'

'రా నీకు చూపిస్తాను' అని అంటూ భూషణ్ ఉత్సాహంగా లేచినిలబడ్డాడు. అదేసమయంలో ఒక అమ్మాయి ఫైలు చేతులోపట్టుకుని వచ్చింది. ఆ ఫైలుతో

భూషణ్ వీపుమీదచరుస్తూ 'ఇది తీసుకో' అని ఇంగ్లీషులో చెప్పటం మొదలు పెట్టింది. 'విన్నుగురించి నువ్వు గొప్పగా చెప్పుకుంటావు. విన్నరాత్రి ఎనిమిది గంటలకు మిషనుమీద కూర్చున్నాను తెలుసా! ఇప్పుడు లేచాను. ఒక్కసారిలో 170 పేజీలు. రెండురోజులు ముందే ఇస్తే నీ సొమ్మేం పోయింది?'

'నువ్వు నిజంగా ఆడదెయ్యానివి! నాకు ఇది వ్రాయడానికి నాలుగుపగళ్ళు, నాలుగురాత్రులు పట్టింది తెలుసా? ఇప్పుడు ఒంటిగంటకు ఈ రిపోర్టు పి. బి. కి ఇవ్వాలి' అన్నాడు భూషణ్ ఆమెతో.

మనోరమ ఆ యువతివైపు చూస్తోంది. నల్లనిరంగు, ముఖంమీద అలసట వలన నీరసం, పెద్దపెద్ద కళ్ళల్లో నిద్రలేమివలన ఎర్రటిచారలూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఉంగరాలుతిరిగిన వత్తైన జుట్టు చిక్కుపడి చింపిరిగా వుంది. చీరకొంగు ఎక్కడ క్రింద పడిపోతుందోనన్న ఆలోచనే లేదు ఆమెకు. ఆ అమ్మాయి మనోరమవైపు పరిశీలనగా చూడలేదు.

'ఈమె మన లాహోర్ కామ్రేడ్, మనోరమ. ఈమె మద్రాసు సముద్రపు ఒడ్డున వుండే చేప, పారో' అని భూషణ్ పరిచయం చేశాడు.

పారో చేతులు జోడించి మనోరమవైపు స్నేహపూర్వకంగా చూసి నవ్వింది. మనోరమ ప్రతినమస్కారం చేసింది.

'పారో, చూశావా, మా పంజాబు అమ్మాయిలు ఎంత అందంగావుంటారో!' అన్నాడు భూషణ్.

'పర్లే' పారో మనోరమవైపుచూసి 'పదిహేనుగంటలు ఎడతెరిపి లేకుండా టైపు చేయగలదా?' అని భూషణ్ అడిగింది.

'పదిహేను గంటలేనా! ఆమె ముప్పైగంటలవరకు చేస్తుంది' భూషణ్ సమాధానం చెప్పాడు.

'నేను దెబ్బైరెండుగంటలు చేస్తాను. నేను 'స్టాకోన్ వియట్'ని తెలుసా! మంచి కామ్రేడ్ని' పారో నవ్వి 'మీరు దూరంనుంచి వచ్చారు. మీ ప్రాంతం వాళ్ళతో మాట్లాడండి' అని వెళ్ళిపోయింది.

భూషణ్ మనోరమని వరండాలోకి తీసుకువచ్చాడు—"ఇది 'పీపుల్స్ వార్' గది. అది మరాఠీ 'లోకయుద్ధ్', అది 'కౌమీజంగ్'. గుజరాతీ 'లోకయుద్ధ్'గది క్రిందవుంది. అర్గనైజేషను ఆఫీసు పైనవుంది. మా రీసర్చిబ్యూరో కూడా పైనే వుంది. ఆ ఫోటో డిపార్టుమెంటు. ఈ గది సెక్రటరీది. అక్కడ ఇతర కామ్రేడ్ల గదులున్నాయి. వాళ్ళు దగ్గరగా వుండటం అవసరం. వివాహమై, భార్యలుకూడా పనిచేస్తున్నవాళ్ళకి ఒక్కొక్కగది ఇవ్వటం జరిగింది. మిగతావాళ్ళంతా ఒకచోట కలిపివుంటారు. చాలామంది దగ్గరలోనే 'రెడ్‌ఫ్లాగ్' హాలులో వుంటారు. కొందరు స్నేహితులు అంధేరీలో వుంటారు. కొందరు తమ మిత్రులదగ్గర ఏర్పాటుచేసుకుని వుంటున్నారు" అంటూ నలువైపులా చూపించాడు.

'కామ్రేడ్ భూషణ్, నిన్ను కామ్రేడ్ బీ. టీ. పిలుస్తున్నారు.' అన్న కేక వినిపించింది.

భూషణ్ మనోరమని క్షమార్పణ కోరాడు—'కొంచంసేపు కూర్చో. నే నిప్పుడే వస్తాను. ఇవ్వాళ పి. బి. మీటింగులో ఈ రిపోర్టు ఇవ్వాలి. ఒకవేళ అందుకే పిలిచివుంటారు. నేను ఇది ఇచ్చివస్తాను. నువ్వు ఈపత్రిక చూస్తూవుండు. ఇప్పుడే వస్తాను.'

రేడియోదగ్గర కూర్చున్నవ్యక్తి తన కాగితాలు ముడిచి భద్రపరుచుకుని లేచి నిలబడ్డాడు. 'ముఖ్యమైన వార్తలేమైనా వున్నాయా?' అని అతన్ని అడిగాడు భూషణ్.

'అలానే నడుస్తోంది. ముఖ్యమైన వార్తలేమీ లేవు.'

మనోరమ వార్తాపత్రిక ఇటూ అటూ తిప్పసాగింది. పార్టీ కార్యాలయం వాతావరణం ఆమెకు సజీవంగానూ, విందుగానూ వున్నట్లు అనిపిస్తోంది. బల్లల ముందు కూర్చుని పనిచేసేవాళ్లు తమ ఇష్టంప్రకారం, ఉత్సాహంగా పనిచేస్తున్నట్లుగా కనిపించారు. భూషణ్ వెళ్ళి పదినిముషాలయింది. మళ్ళీ గడియారం చూసింది. పదిహేను నిముషాలయింది. మనోరమ తన అంతరాంతరాల్లోంచి వెలువడే దీర్ఘ శ్వాసని బిగపట్టి ఆలోచిస్తోంది—'ఒకవేళ లాహోర్ పత్రికలో పనిచేస్తూ పని చేస్తూ ఇక్కడకు వచ్చివుంటే ఎంత బాగుండేది? ఇక్కడవాళ్లు ఎంతో సంతో

షంగా వున్నారు. పారో విభ్రమంగానూ, సంతోషంగానూ వుంది. ఇతరగదులలో పనిచేస్తూ మిగతా అమ్మాయిలు కనిపిస్తున్నారు....ఒకవేళ భూషణ్ తనకు సహాయం చేస్తే....కాని ఈమాట తన నోటితో ఎలా చెపుతుంది?'

మనోరమ మళ్ళీ గడియారం చూసింది. ఇరవై నిముషాలు గడిచిపోయాయి. 'వీళ్ళకి తీరుబడి ఎక్కడిది నేను వెళతాను....వస్తే చెప్పివెళతాను....ఇక్కడికివచ్చి ఏదైనా పనిచేయడం మొదలుపెడతాను....సాయంకాలం వేళటికి తిరిగి వెడుతూ వుంటాను....అతను ఏమంటాడు, మేము విడివిడిగా వున్నట్లు అనిపిస్తాం' అనుకుంది.

సాయంకాలం సుతలీవాలాతో కలిపివెళ్ళే క్లబ్బు, పార్టీ, హోటలు, మద్యపానం చేసేచోటు, రేస్‌నుగురించిన సంభాషణ, తళతళమెరిసే చీరలు, ఒత్తుగా మేకప్ గుర్తుకొచ్చాయి. ఇక్కడ పగలు గడిపినతర్వాత అటువంటి సాయంకాలం ఎలా అనిపిస్తుంది, ఎలా సాటి అవుతుంది? సుతలీవాలా అభ్యంతరపెడతాడు. అయినా అతనివల్ల నాకు జరిగే లాభంగాని, అతనికీ నాకూ సమానత్వంగానీ ఎక్కడుంది....'సమానత్వం' మాట ఆలోచించగానే ఆమెమనసు అసహ్యంతో నిండిపోయింది.

భూషణ్ నలభై నిమిషాలతర్వాత వచ్చారు. అనేకవిధాలుగా క్షమార్పణ కోరసాగాడు—'హిందూదేశం మొత్తంలోవున్న యూనిట్స్‌ల రిపోర్టు....'

భూషణ్ తన గడియారంవంక చూశాడు—'పన్నెండు నలభై అయిదు అయింది. నువ్వు భోజనం చేశావా? రా, మాతోపాటు భోజనం చేద్దువుగాని. మా క్యాంటీన్‌లో ఎంత తక్కువఖర్చుమీద ఎంతమంచి భోజనం దొరుకుతుందో చూడు. అలా బొంబాయిలో ఇంకెక్కడా దొరకదు. నువ్వు తినిచూడు, పంజాబీవంటకన్నా కొంచం తేడాగా వుంటుంది—కానీ నీకు నచ్చుతుంది. ఉండు. నేను మాయీకి చెప్పి వస్తాను. లేకపోతే నన్ను తిడుతుంది. ఒకనిముషం.'

భూషణ్ మళ్ళీ వెళ్ళిపోయాడు. మనోరమ మార్క్సు గడ్డంవైపుచూస్తూ మళ్ళీ ఆలోచించసాగింది. భూషణ్ తిరిగివచ్చారు—'పదినిముషాలలో గంట మోగుతుంది' అతను ఉత్సాహంగా అన్నాడు—'ఒకవేళ కామ్రేడ్ జోషి భోజనం చేయ

టానికివస్తే నీకు ఆయన్ని పరిచయం చేస్తాను. కానీ ఆయన గదిమంచి అప్పు డప్పుడూ బయటకు వస్తారు. ఆయనకు భోజనం అక్కడికే పంపిస్తాము. మిగతా వాళ్ళందరూ భోజనాలగదికి వస్తారు.'

గంట మ్రోగింది. భూషణ్ మనోరమని అక్కడికి తీసుకువెళ్ళాడు. పెద్ద గది. ఎర్రనేలమీద గోనెపట్టాలు పరిచివున్నాయి. ఒకవైపు అల్యూమినియం పళ్లాలు, గిన్నెలు, మగ్గులు, గ్లాసులు దుకాణంలోలాగా అమర్చివున్నాయి. అందరూ ఒక్కొక్కపళ్ళెం, గిన్నె, గ్లాసు, మగ్గు తీసుకునివెళ్ళి కూర్చుంటున్నారు. వాళ్ళలో వాళ్లు మాట్లాడుకోవడం, నవ్వు - పరిహాసాలవల్ల వచ్చేధ్వని కాలేజీలో మధ్య వచ్చే శలవులలో విద్యార్థులు స్వేచ్ఛగా తిరుగుతున్నట్లుగా వుంది. అన్నిస్థానాలు నిండి పోయాయి. ఇంకా చాలామంది మిగిలివున్నారు, 'మాయా' తనిఖీ చేసేవానిలా నిల బడివుంది. 'ఇప్పుడు ఇంకా మిగిలివున్నవాళ్లు రెండవపారి' అని చెప్పింది మాయా. ముప్పై నలభైమంది యువకులలో ఆరుగురు-ఏడుగురు యువతులుగూడా వున్నారు. కానీ ఎవరూ సంకోచంగానూ, బాధపడుతున్నట్లుగానూ లేరు.

భూషణ్, మనోరమా జోషీకోసం నిరీక్షిస్తూ చోటు దొరికినాగూడా వేచి వున్నారు. పారో తొందరతొందరగా వచ్చింది. భూషణ్‌నుచూసి, 'నాకు చాలా ఆకలిగా వుంది' అంది. 'యూ మిస్‌డ్ ది బస్ (ఇప్పుడు బస్సు వెళ్ళిపోయింది) ఇప్పుడు లోపలికెళ్ళావంటే మాయా చంపుతుంది' అన్నాడు భూషణ్.

పారో గదిలోకి తొంగిచూపింది. ముఖంతిప్పి 'మీకుమటుకూ ఏం చోటు దొరికింది!' అంది.

'అందుకే అందరం కలిసే వెళదాం.'

'మీతోపాటు ఎప్పుడూ రాను, వదిసార్లు వెనకపడినా సరే.'

'నాకూ ఏం తొందర లేదు, చూద్దాం' భూషణ్ నవ్వి అన్నాడు,

'చూడు' పారో బొటనవేలు చూపించింది. ఆ సంభాషణతో విచారగ్రస్తురాలైన మనోరమహృదయం సంతోషంతో పులకరించింది.

పారో మనోరమని సంబోధించి భూషణ్‌వైపు చూపించి సౌంజ్ఞచేసింది— 'శాంగ్రమేద్, ఈ మనిషి చాలా విసుగుపుట్టిస్తాడు. ఒకటేమిటంటే ఇతనిగ్రాత ఎలా

వుంటుందని అడగకు. మళ్ళీ కాంగ్రెస్, కాన్ఫరెన్స్, కమిటీ, కంపెనీ అన్నచోట 'క' అనిమాత్రం వ్రాస్తాడు. దీన్ని అర్థంచేసుకుని టైపు చేయాలి। రిపోర్టు మహా భారతం వ్రాసినట్లుగా వ్రాస్తాడు. ఒక్కతప్పు దొర్లితే అంతా మళ్ళీ టైపు చేయిస్తాడు. జోషి మాట్లాడడం. ఇతను వ్రాయడం ఒకేలావుంటాయి. వీళ్ళు సంకేతాలు చేస్తారు. అరే। జోషి వస్తున్నారు।'

భూషణ్, మనోరమా తిరిగిచూశారు. పొట్టిగా, వదులుగావున్న ఖాకీ నిక్కరు. చొక్కా తొడుక్కునివున్నారు ఆ వ్యక్తి. మందంగావున్న కళ్ళజోడులో రెపరెపలాడుతున్న కళ్ళు. రెండురోజులనుంచి పెరిగిన గడ్డం. అంత విరుద్ధ హంలోవున్న మనోరమకుగూడా దేశంలోవున్న పార్టీ అంతటికి నాయకుడైన ఆ వ్యక్తిని చూడాలన్న కుతూహలం కలిగింది.

భూషణ్‌నుచూసి జోషి ఏదో అన్నారు. మనోరమ అర్థం చేసుకోలేక పోయింది.

'నేనంతా పూర్తిచేసి ఇచ్చేశాను' అని భూషణ్ సమాధానమిచ్చాడు.

భూషణ్ మనోరమని పరిచయం చేశాడు. 'ఈమె కామ్రేడ్ మనోరమ. లాహోర్‌లోని మన పత్రికలో చాలాకాలం పనిచేసింది.

'ఇప్పు డెందుకు చేయటంలేదు?' జోషి నవ్వి అడిగాడు.

మనోరమ సమాధానం చెప్పలేకపోయింది.

'బొంబాయి ఎప్పుడు వచ్చారు?' జోషి ఆమెని సంబోధించారు.

'దాదాపు నెల అయింది' అన్నది మనోరమ.

'ఇక్కడ మీరేం చేస్తున్నారు?' జోషి మళ్ళీ ప్రశ్నించారు.

'నా భర్తతో కలిసి వచ్చాను.' మనోరమ పెదిమలు కొరుక్కుంటూ నవ్వటానికి ప్రయత్నించింది.

'ఏమిటి?' భూషణ్ కళ్ళు ఆశ్చర్యంతో ప్రకాశించాయి, 'ఎప్పుడు?'

'నెలరోజులయింది' మనోరమ జోషికి సమాధానం ఇచ్చింది.

'నువ్వు కొత్త పెళ్ళికూతురిలా అనిపించటంలేదు'. జోషి మనోరమ వీపు మీద వృద్ధునిలా చేయివేసి నవ్వారు.

'నువ్వు ఆ విషయమే చెప్పలేదు' భూషణ్ని నిందించారు.

మనోరమ నవ్వేందుకు చేసినప్రయత్నం విఫలమయింది.

జోషి మళ్ళీ నవ్వి. 'మీరు ఎరగరు. పార్టీ మెంబర్ల వివాహంలోకూడా మా అధికారం వుంటుంది' అని చెప్పారు.

'ఈమె మెంబరు కాదు. కాని మెంబరుతో సమానమే' భూషణ్ ఆమె నిర్దోషిత్వాన్నిగురించి చెప్పారు.

'అలాగా' జోషి క్షమార్పణ కోరుకున్నారు. 'అయితే మీరు బొంబాయిలో మాతోకలిసి పనిచేస్తారా? సమయం వచ్చినప్పుడు మెంబరుగాకూడా అవుతారు. మీ వివాహం ఎవరితో జరిగింది?' అని అడిగారు.

'హెచ్. బి. సుతలీవాలా.'

'పారశీదేశపు వ్యక్తా? ఎవరు ఈ సుతలీవాలా?' జోషి భూషణ్వైపు చూశారు.

'నాకు తెలీదు.'

భోజనం చేసేటప్పుడు జోషి మనోరమని తనపక్కన కూర్చోమని అడిగారు. లాహోర్గురించి, లాహోర్లోని ఇతర వ్యక్తులనిగురించి ఆమె వ్యక్తిగతమైన అభిప్రాయాన్ని అడిగారు. మనోరమ పరివారంగురించిగూడా ప్రశ్నించారు. తన ఇంటివిషయం వదిలిపెట్టి మిగతా ఏ విషయాలు మాట్లాడినా మనోరమకు ఏమీ అభ్యంతరం లేదు. జోషి ఆమెనిగురించి, ఆమె పరివారంగురించి అడగటం మొదలుపెట్టేసరికి మనోరమ చేతులు భోజనందగ్గర ఆగిపోయాయి.

'ఈ భోజనం మీకు నచ్చకపోవచ్చు. పంజాబీని కదా!' అని జోషి మాయీని పిలిచారు. 'మాయీ అతిథికోసం కొద్దిగా పెరుగు లేదా?'

మనోరమ వారిస్తూవున్నప్పటికీకూడా ఆమె ముందున్న గిన్నెలో పెరుగు తీసుకువచ్చారు. భోజనం బాగున్నాకూడా ఆమె తినలేకపోతోంది. వదిలిపెట్టడం వుచితం కాదు. ఎలాగో అలా తినేసింది.

'మా పళ్ళాలని మేమే కడుక్కుంటాం.' జోషి తన పళ్ళెం ఎత్తుతూ

చెప్పారు. 'కాపీ అతిథులకు ఈ నియమం లేదు. ఇలాతే. నీ పళ్ళెం నేను కడుగు తాను.'

మనోరమ సిగ్గుపడింది. 'ఒద్దు. ఒద్దు' అంటూ వారించింది.

భూషణ్ ఆమెచేతినుంచి పళ్ళెం లాక్కొనేందుకు ప్రయత్నించాడు. ఇబ్బం దిగా సంకోచంతో ఆమె పళ్ళాన్ని వెనక దాచసాగింది. ఆమె వెనుకనుంచి పారో పళ్ళెం లాక్కొంది. ఎంతో ప్రార్థించినప్పటికీ పారో పళ్ళెం ఇవ్వలేదు. 'ఒకరోజు మీ ఇంటికి భోజనానికి వస్తాను. అప్పుడు నీ వంతు వస్తుంది' అంది.

భోజనం చేసినతర్వాత భూషణ్ మనోరమని మళ్ళీ అతిథులగదికి తీసుకు వెళ్ళారు. మిగతావాళ్ళపనికి ఆటంకం కలగకుండా ఆమెను కూర్చోబెట్టతగినది అదొక్కటే గది. మనోరమ ఇక వెళ్ళిపోదామని అనుకుంది.

'పి. టీ. ఎదుట నేను రిపోర్టు ప్రవేశపెట్టాల్సివుంది. రెండుగంటలు పడు తుంది' అన్నాడు భూషణ్.

'ఇక నేను వెళతాను' అంది మనోరమ.

'అవసరమైనపని వుందా?'

'ఏం లేదు.' మనోరమ నిరుత్సాహంగా అంది.

'ఒకవేళ నువ్వు ఆగితే నేను నిన్ను మీ ఇంటిదాకా దిగబెట్టివస్తాను. ఈ రోజు నాకు మూడు-నాలుగు గంటల ఖాళీ వుంది. పెళ్ళిమిఠాయి తినిపించవా?' భూషణ్ మొహమాటపెట్టాడు.

తన పెళ్ళిమిఠాయి కాదు. చావుమిఠాయి! మనోరమ మనసులో అనుకుంది. కాపీ భూషణ్ ఉత్సాహంలో చెపుతూనేవున్నాడు—'నువ్వు మా లైబ్రరీ చూడ లేదు. రెండుగంటలు అక్కడ గడిపినట్లుగాకూడా అనిపించదు నీకు. అక్కడ కూర్చో. తర్వాత కలిసివెడదాం.'

భూషణ్ లైబ్రరీ అధ్యక్షురాలైన మిసెస్ ఆప్టేకు మనోరమని పరిచయం చేశాడు.

'మీరు పుస్తకాల జాబితాలు చూస్తారా లేకపోతే ఏదైనా పుస్తకం తీసివ్వనా? ఏదైనా విషయంమీద కావాలంటే చదవటానికి తీసి ఇస్తాను' అన్నారు మిసెస్ ఆప్టే.

మనోరమ జాబితాల రిజిస్టరు తీసుకుని ఇటూ అటూ తిప్పసాగింది కానీ తన విషయంగురించి ఆలోచిస్తోంది. 'పెళ్ళి మిథాయి. తన చావుకి సంబంధించిన మిథాయి। చచ్చిపోయిగూడా జీవించివుండటం అంతకన్నా ఇంకేమవుతుంది? ఇక్కడ కూర్చునివున్నాను కానీ సుతలీవాలా భార్యనన్న వైజ్ఞానికమైనా, సామాజికమైన పంజరం ఇక్కడకూడా నన్ను బంధించేసింది. మనమధ్య ఒక్కటైన విషయం ఏముంది? నేను ఆయన భార్యనే. కాని ఏ విషయంకోసం?' ఆమె మనస్సు అసహ్యంతో నిండిపోయింది.

'భూషణ్ ఈరోజు ఏ ఆత్మీయతవల్ల కలిశాడు? అప్పుడప్పుడూ కాలేజీలో మాత్రం మాట్లాడేవాడు....ఎలా విరిగిపోయింది....నా అదృష్టం. లేకపోతే ఈ రోజు నేను అక్కడ వుండేదాన్నికదా? పారో అతని స్నేహితురాలు. అతనికి పారోమీద నమ్మకముంది, నామీద లేదు. అనవసరంగా వాగుతాను - మా పంజాబీ అమ్మాయిలు చూశావా ఎంత అందంగా వుంటారో....నీకు ఆ పారోయే అందంగా వుంది. ఈమె చేస్తున్నపని నేను చేయలేనా? నా మనసుకేదో సంతోషం కలిగించడంకోసం నేను ముప్పైగంటలు పని చేయగలనని చెప్పాడు. ఎప్పుడన్నా నువ్వు నాకు ఆ అవకాశం ఇచ్చావా? నేను ధనవంతులకుటుంబంలో పుట్టాను. అందుకే నువ్వు నన్ను నీ శత్రువుగా భావించావు. నా దగ్గర పదిహేనువేలే వుంది. అయినా కూడా నువ్వు వాటితో పదిహేనుసంవత్సరాలు గడపగలవు. అక్కడ, ఆయనదగ్గరైతే విస్కీ, క్లబ్బు, రేసులు, పెట్రోలులో ఒక సంవత్సరంకూడా గడవదు ఆ డబ్బు అనవసరంగా ఖర్చయిపోతుంది. అవసీ। నూతిలో పడిపోయాను, అంతకన్నా మార్గంలేదు. పెళ్ళి మిథాయి, ఈ పెళ్ళి అర్థం తెలిసివుంటే।' అని తనలో తాను అనుకుంది.

మూడుగంటలు గడిచిపోయాయి. భూషణ్‌కు ఒకవేళ ఇంకా తీరుబడి అయివుండదు, వెడదాం అనుకుంది. అలసటగావున్నట్లు అనిపించసాగింది. చెక్క బెంచీమీద, వెనక ఏమీ ఆనుకోవటానికి ఆధారంలేకుండా కూర్చుని కూర్చుని ఆమె అలసిపోయింది. ఏ వ్యాసాలమీదా, పత్రికలమీదా ఆమె మనస్సు లగ్నం కావటం లేదు. మిసెస్ ఆప్టేకుచెప్పి వెళ్ళిపోదాం అనుకుంది కానీ మిసెస్ ఆప్టే కళ్ళు రిజిస్టరులమీదనుంచి పైకి లేవటమే లేదు. మళ్ళీ గంట మ్రోగింది. అక్కడున్న

వాళ్ళంతా నవ్వుతూ మాట్లాడుతు నేమాటలు నెమ్మది నెమ్మదిగా వినిపించసాగాయి. మిసెస్ ఆప్టే ఏమీ మాట్లాడకుండా నే వెళ్ళిపోయింది.

'మీరేనా కామ్రేడ్ మనోరమ?' ఎవరో పిలిచారు.

మనోరమ వెనక్కి తిరిగిచూసింది. 'అవునండీ' అంది.

నడివయస్సులోవున్న ఒక లావుపాటివ్యక్తి పంజాబీలో 'మీకోసం టీ తీసుకొచ్చాను' అన్నాడు. అతను అల్యూమినియం మగ్గును మనోరమముందు పెట్టాడు. 'భూషణ్‌కు ఇంకొంచెంసేపు ఆలస్యమవుతుంది. అంతే, ఒక అరగంట. లాహోర్‌లో మీ ఇల్లు ఎక్కడ వుంది? నేను లాహోర్ చాలాసార్లు వెళ్లాను. మీరు అక్కడ మా పత్రికలో పనిచేసేవారా? బొంబాయిలో ఎవరైనా పంజాబీవాళ్ళని చూస్తే చాలా సంతోషం కలుగుతుంది. ఇక్కడ నీళ్ళు మంచివికాదు. తినడానికి మాత్రం ఏం దొరుకుతుంది! పాలు పేరు పన్నెండు అణాలు, అవికూడా నీళ్ళు. పట్టి నీళ్లు. మనవైపయితే నీళ్ళుకూడా పాలే, ఇక్కడ పాలుకూడా నీళ్లు. భూషణ్ కూడా ఎప్పుడూ అనారోగ్యంగానే వుంటాడు. చూస్తున్నారా! ఇక్కడ అంతా పొట్టివాళ్లు, కానీ చాలా తెలివైనవాళ్లు.'

పంజాబీవ్యక్తి ఆనందంతో మెరిసేకళ్ళతో ఎన్నోమాటలు ఒక్క గుక్కలో సొంతభాషలో చెప్పేశాడు—'మంచిది, ఇక నేను వెళతాను, మళ్లీ కలుసుకుంటాం కదా. నేను ఇక్కడ ఉర్దూ ఎడిషన్‌లో పని చేస్తున్నాను' అనిచెప్పి వెళ్లిపోయాడు.

భూషణ్ అరగంటలో వచ్చేశాడు. 'ఏం చెప్పను, చాలా ఆలస్యమయింది. రిపోర్టులో చాలావిషయాలు వుండిపోయాయి. కానీ బి.టీ ని ఎరుగుదువుకదా, ఆయన కార్మిక ఆందోళన జాతకం తీసుకుని కూర్చున్నారు. ఇక వెళదాంపద, నువ్వు కాలినడకన బాగా నడవగలవు. ధర్మశాలలో నడుస్తూ వుండేదానివి' అని భూషణ్ నవ్వాడు. మనోరమ సరేనని మౌనంగా వుండిపోయింది.

జనంతో కిటకిటలాడుతున్న బస్సులో ఆమె భూషణ్‌తోకలిసి కూర్చుంది. దోవ గుర్తుపట్టింది. చాలాసార్లు సుతలీవాలాతోకలిసి కారులో అటునుంచి వెళ్ళింది. భూషణ్ మాటిమాటికీ అడుగుతున్నాడు—'సరే చెప్పు, పెళ్లి ఎలా జరిగింది? బారిస్టరు ఎలా వున్నాడు? అవును, ఆ సోమా ఎలా వుంది? ధనసింగ్ తిరిగి వచ్చాడా?'

మనోరమ కేవలం చివరిమాటకు సమాధానం ఇచ్చింది—'ధనసింగ్ తిరిగి రాలేదు.' బస్సు రణగొణధ్వనిలో ఏమీ వినిపించటం లేదని చెప్పింది.

'నీకు బస్సులో కూర్చునే అలవాటు లేదా, ఇక్కడ అలవాటవుతుంది' అన్నాడు భూషణ్.

కాలినడకన నడిచేటప్పుడు మనోరమ సోమానుగురించి జరిగిన సంఘటన క్లుప్తంగా వినిపించింది. భూషణ్ సానుభూతితో నవ్వి, 'ఆమె జీవితంకూడా సమస్యలతో నిండినదే' అని మళ్ళీ గంభీరంగా చెప్పాడు. 'మన సామాజికసమస్యకు ఇది ఒక ఉదాహరణ ఒకవేళ బరకత్ ఆమెను తీసుకెళ్ళివుంటాడు కానీ బరకత్ ఆమెను ఏం చేస్తాడు? బరకత్‌కు ఆమె చాలా భారంగా అనిపిస్తుంది. ఒకసారి పై అంతస్థుకు చేరుకున్నతర్వాత మళ్లీ క్రిందకు ఎలా దిగగలుగుతుంది? ఆమె మరోవైపు పడిపోయే అవకాశం వుంది. కానీ మొదటిదోవలోకిమాత్రం తిరిగి రాలేదు. ఇక్కడే బొంబాయిలోనే ఎక్కడో వుండచ్చు। పారిపోయేవాళ్ళకి రెండేప్రదేశా లున్నాయి. బొంబాయి, లేకపోతే కలకత్తా.'

'ఇంట్లో పరిస్థితి నువ్వు వుండటానికి తగినదిగా లేదు' భూషణ్ సమర్థించాడు.

'అవును.'

'ఇటువంటిపరిస్థితిలో నువ్వు పెళ్ళి చేసుకున్నావా?'

మనోరమ మౌనంగా వుండిపోయింది.

'సుతలీవాలాతో ఎక్కడ పరిచయమయింది?....లాహోర్‌లో వుంటూ వుండేవారా?'

మనోరమ తల తిప్పింది.

'మంచివారేనా, నువ్వు సుఖంగా వుంటున్నావా?'

మనోరమ తలవంచుకుని మౌనంగా వుండిపోయింది.

'అనవసరంగా సంకోచపడుతున్నావు. ఇందులో సిగ్గుపడాల్సిన విషయమేముంది?'

మనోరమ ఏం సమాధానం చెప్పలేదు. భూషణ్ లాహోర్‌లోని ఇతర

స్నేహితుల్నిగురించి కుశలప్రశ్నలు అడగసాగాడు. మనోరమ సమాధానం ఇస్తూ పోతోంది.

'అలసిపోయివుంటే బస్సులో వెళదాం' అన్నాడు.

'వద్దు' మనోరమ తలతిప్పి వారించింది.

ఇద్దరూ కాలినడకన వెళుతూ 'తీన్‌బత్తీ' చేరారు. మనోరమ పైన తోట లోకి వెళదామని కోరింది. 'హాంగింగ్ గార్డన్'లోకి వెళ్ళి ఇద్దరూ ఒక బెంచీమీద కూర్చున్నారు. సూర్యాస్తమయం అయిపోయింది. నల్లరంగు ధరించిన సముద్రం మీద పడమటివైపు సూర్యాస్తమయవేళపు ఎర్రటిజీర వ్యాపించింది. వెనుకవైపు కొండక్రింద బొంబాయినగరం పెద్ద బొమ్మరిల్లులా కనపడుతోంది. 'హాంగింగ్ గార్డన్' అంతా దాదాపు ఖాళీ అయిపోయింది.

'నువ్వు నీ వివాహంగురించి, నీ భర్తనుగురించి ఏమీ చెప్పలేదు....' అడిగాడు భూషణ్.

మనోరమకు కన్నీళ్లు పొంగివచ్చాయి. చీరకొంగుతో నోరు నొక్కుకుంది.

భూషణ్ విభ్రాంతుడైపోయాడు. 'నాకు చాలా బాధగావుంది మన్నూ!' అన్నాడు ఇంగ్లీషులో—'పోనీలే నేనేమీ అడగను.'

మనోరమకు ఇంకా ఏడుపు వచ్చింది. భూషణ్ మూడుసంవత్సరాలతర్వాత ఆమెను 'మన్నో' అని పిలిచాడు. అతను ఆమెను మిస్ సరోలా అనిగాని, మనోరమగారూ అనిగానీ పిలిచేవాడు. మనోరమకు అలాపిలవడం తిట్టినట్లుగా అనిపించేది.

'గార్డెన్ మూసేసే సమయమవుతున్నట్లుంది, పద వెళదాం.' భూషణ్ ఆమె ధ్యాస మరల్చటానికి అన్నాడు.

మనోరమ కన్నీళ్ళు తుడుచుకుంది. కన్నీళ్లతో తడిసిన రుమాలను దాచేసింది. తిరిగివెళుతూ ఆమె సంకోచంగా అడిగింది. 'మీకు బాధ అనిపించలేదుగదా?'

'ఎందుకు?'

'నాకు ఏడుపొచ్చింది' మనోరమ నవ్వడానికి ప్రయత్నించింది.

'అది నా తప్పు. పద. మీ ఇంటిదగ్గర దింపివస్తాను. నేనుగూడా తిరిగి వెళ్ళాలి.'

'పాలో నీకోసం ఎదురుచూస్తూ వుండివుండచ్చు' మనోరమ అతన్ని రెచ్చగొట్టడానికి అంది.

'ఆ పిశాచి తన ప్రియుడు వెంకటాకు ఉత్తరంవ్రాస్తూ వుండివుంటుంది. రెండుసార్లు ఆమె వివాహంతేదీ నిర్ణయించబడింది. కానీ వెంకటాకు శెలవే దొరకదు. అతను తిరువాన్కూరులో చిక్కుపడిపోయాడు.'

'ఏమిటీ?' మనోరమ ఆశ్చర్యాన్ని ప్రకటించింది. 'కమ్యూనిస్టులుకూడా పెళ్ళి చేసుకుంటారా?'

'ఎందుకు చేసుకోరూ?' అలాగే భూషణ్‌గూడా సమాధానమిచ్చాడు. 'కమ్యూనిస్టులుమాత్రం మనుష్యులు కారా?'

'సరే, ఇదేమైనా కొత్తపార్టీలైనా?'

భూషణ్ నవ్వాడు. 'నువ్వు పరిహాసం చేస్తున్నావా ఏమిటి? కాంగ్రెసు వాళ్ళు స్వరాజ్యంకోసం చేసేసంఘర్షణలాగా, స్వరాజ్యం వచ్చేనతర్వాతగాని వివాహం చేసుకోమని ప్రతిజ్ఞ చేయడానికి, స్వరాజ్యం వచ్చేంతవరకు ఉప్పు తినము అనిగాని చెప్పులు వేసుకోము అనిగానీ అనడానికి మాదేం ఒకటి రెండు సంవత్సరాల కార్యక్రమం కాదు. సంఘర్షణని, విప్లవాన్ని, జీవితాంతం నిర్వహించడానికి ఎంతవరకూ సంభవమవుతుందో, జీవితాన్ని వీలయినంతవరకు ఆరోగ్యకరంగానూ, ప్రాకృతికంగానూ చేసుకోవడం అవసరం.'

'ఇదెప్పుడు తెలిసింది?' మనోరమ గొంతు కఠినంగా వుంది.

'అంతా తెలుసుకుని ఎవడూ పుట్టడు. పరిపూర్ణమైన జ్ఞానవంతుడు భగవంతుడు ఒక్కడే, ఆయనతో కమ్యూనిస్టులకు పరిచయం లేదు.' భూషణ్ ఎగతాళిగా అదేధోరణిలో సమాధానమిచ్చాడు

వాళ్ళు తీన్‌బత్తీదగ్గర తిరిగి నేపియర్ రోడ్డునుంచి రహీమ్‌తుల్లా స్ట్రీటువైపు వెళ్ళారు. సుతలీవాలా వచ్చేసివుంటారు. ఒకవేళ భోజనంకోసం నిరీక్షిస్తూ విస్కీ

తాగుతూవుండివుంటారు. ఏమని చెప్పి పరిచయం చేయగలను? అనుకుంది మనో రమ.

నౌకరు వసారాలో కుర్చీలు వేశాడు. 'అయ్యగారు రాలేదా?' అని మనోరమ అడిగింది. రాలేదని విని ఆమె మనసు కుదుటపడింది.

భూషణ్ వరండాలో కుర్చీలో కూర్చుని, 'చాలా అందమైనప్రదేశం, ఎంతమంచి దృశ్యం! నీకు చాలా వదవాల్సివచ్చింది. అలసిపోయివుంటావు' అన్నాడు.

'లేదు. భోజనం తెప్పిస్తాను, భోజనం చెయ్.'

'ఇక్కడే తిననా? కాని కమ్యూన్‌లో మాయాకి చెప్పరాలేదు. ఆమె తిడు తుంది. సరేలే వెళ్ళి తిల్లే తింటాను. ఆమె తిడుతూనే వుంటుంది' భూషణ్ నవ్వాడు.

మనోరమ నౌకర్ని పిలిచి, 'భోజనం వడ్డించు. అయ్యగారుకూడా తింటారు' అంది.

నౌకరు నెమ్మదిగా 'డ్రింకా?' అనడిగాడు.

మనోరమ భూషణ్ వైపు ప్రశ్నార్థకంగా చూసింది.

వద్దు వద్దు, నాకు వద్దు. నువ్వు తీసుకోవాలనుకుంటే తీసుకో' అన్నాడు భూషణ్.

'నీకేమయినా మతిపోయిందా' మనోరమ నవ్వింది. 'ఆయన తీసుకొంటారు' అని చెప్పింది.

భోజనాలు పూర్తయినతర్వాత 'మిమ్మల్ని దిగబెట్టిరానా?' అనడిగింది మనో రమ.

'ఏమిటి?' భూషణ్ ఆశ్చర్యంతో అడిగాడు, 'అంతదూరం?'

'ఇక్కడ వుండిమాత్రం ఏం చేస్తాను! నౌకర్, ఒక టాక్సీ పిలు!'

మనోరమ భూషణ్‌ని సైండ్‌హర్ట్స్ రోడ్డుదగ్గర దింపి టాక్సీలో తిరిగి వచ్చింది. గడియారం పదిగంటలు కొడుతోంది. సుశీలీనాలా అప్పటికి తిరిగి

రాలేదు. ఆమె బట్టలు మార్చుకుని పక్కమీద పడుకుంది. బాగాతిరిగి రావటంచేత, మాట్లాడటంచేత మనసు కొంచం తేలికపడింది. వెంటనే కునుకుపట్టింది. అడుగుల దప్పుడువల్ల నిద్ర మెలుకువ వచ్చింది.

సుతలీవాలా నోటితో ఈలవేసి ఏదో పాడుకున్నారు. మనోరమ కళ్లు మూసుకునే పడుకుంది. భర్త బట్టలు మార్చుకుంటున్న అలికిడి వినిపించింది. అతను తర్వాత మంచంమీద పడుకున్నారు. బయట వరండాలోవున్న గడియారం రెండుగంటలు కొట్టినశబ్దం అయింది.

మర్నాడు ఉదయం మనోరమ స్నానం పూర్తిచేసింది. సుతలీవాలా అప్పటికీ గాఢమైన నిద్రలోనే వున్నారు. ఒక కప్పు టీ త్రాగుదామనుకుంది. ఒకచోట వుంటున్నప్పుడు ఒకళ్ళనొకళ్ళు తప్పించుకుని తిరుగుతూ, పారిపోతూవుంటే ఎలా జరుగుతుంది? వందలకొలది ప్రజలలో ఎక్కువభాగం. వారిజీవితాలు ఇలాగే పోట్లాడుకుంటూనే గడచిపోతాయి. మా జీవితంగూడా గడచిపోతుంది అనుకుంది. ఆమె టీ త్రాగటానికి భర్తకోసం నిరీక్షించసాగింది. సుతలీవాలా స్నానాలగదిలో నుంచి బయటకురాగానే 'టిఫిన్ తీసుకుని బయటకు వెడతారుకదా?' అనడిగింది మనోరమ.

'అలాచేస్తే చాలామంచిది.'

టిఫిన్ తీసుకుంటూ సుతలీవాలా మనోరమా ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటున్నారు. 'నాకు బాధగావుంది. నాకు పూర్తిగా నీగురించిన ధ్యాసే లేదు. నీ ఖర్చుకోసం డబ్బు అవసరం వుంటుందని ఆలోచించనేలేదు. ఎక్కడికైనా వెళ్లాలన్నా రావాలన్నా టాక్సీ బాడుగ అవుతుంది. కావాలంటే కారు నువ్వు వుంచుకుంటూ వుండు. నేనైతే కారు స్వయంగా నడుపుతాను. నీకు కావాలంటే డ్రైవర్ని పెట్టుకో' అన్నారు.

'నాకు అవసరమేముంది? నేనెక్కడికి వెళతాను? వెళ్ళాలన్నా టాక్సీ ఎప్పుడూ దొరుకుతూనే వుంటుంది' అన్నది మనోరమ.

'ఇది వుంచుకో' అని సుతలీవాలా పర్సుతీసి నూటయాభై రూపాయలు మనోరమవైపు చాచారు.

'ఇప్పుడు వారగ్గర వున్నాయిగదా' అంటూ మనోరమ ఆ డబ్బుని నిరాకరించింది.

'అయినాకూడా చేతులో కొంచం వుండటం మంచిది' అని అతను అందులో సగం డబ్బుతీసి మనోరమ ముందుంచాడు. 'నేను భయంకరమైన పోట్లాటను ఎదుర్కొంటున్నాను. పెట్టుబడిదార్ల పోట్లాట, బాగా స్థిరపడిపోయిన ఫిల్ము కాంట్రాక్టుదారులు కొత్తగా పైకి వచ్చేవాళ్ళని తమ చెప్పుచేతలలో క్రిందకు అణిచివేద్దామనుకుంటున్నారు. నేను ఇంతకుక్రితం నిర్మించిన ఫిల్ము 'రైన్ బసేరా' మార్కెట్టును చెడగొట్టడానికి శతవిధాలా ప్రయత్నం చేశారు. నేను వీళ్ళ ఫిల్ములకే ఏజంటుగా వుండాలని వీళ్ళు అనుకుంటున్నారు. వీళ్ళకి పెద్దపెద్దలాభాలు సంపాదించిపెట్టాలి కానీ నాదగ్గర డబ్బు పెట్టుబడిపెట్టే పెట్టుబడిదార్లున్నారు. కొనుక్కునేవాళ్ళున్నారు. కళాకారులున్నారు. నేను రూపాయలోనుంచి ఒక అణా వాటా తీసుకోవటం దేనికి? కష్టపడి పని చేస్తాను. ఎంత తక్కువైనా నాలుగణాలు తీసుకుంటాను.

'రైన్ బసేరా ఫిల్ము నేను చూడనేలేదు. ఎలావుంది?' అని మనోరమ అడిగింది.

సుతలీవాలా ఉత్సాహంగా చెప్పాడు—'చాలా కష్టపడి నిర్మించిన ఫిల్ము. బాక్సుపిక్చరు. నువ్వు తప్పకుండా చూడు. బొంబాయినుంచి వెళ్ళిపోయింది. ఇక్కడ మూడునెలలు నడిచింది. అందులో మధు చేసిన నాట్యం చూడతగినది. నవకలీ, శేర్‌జంగ్, నూర్ అహమద్ పనిచేశారు. మూడు జన్నులు, తొమ్మిది పాటలు వున్నాయి. నాట్ బాడ్!'

'కానీ మన ఫిల్ములలో కళ తక్కువగానూ, చెడు అభిరుచి ఎక్కువగానూ వుంటుంది' అంటుతూ మనోరమ చెప్పింది. ఆమెమాటని మధ్యలో ఆపి, 'పుస్తకంలోని ఆర్టుని దృష్టిలో పెట్టుకుంటే బిజినెస్ జరగదు. ఇది బిజినెస్ ఆర్టు' అన్నాడు గంభీరంగా సుతలీవాలా.

'అసలైన ఆర్టుని ప్రజలు మెచ్చుకోరా?' మనోరమ అడిగింది.

'మెచ్చుకోవచ్చు. మెచ్చుకోకపోవచ్చు. ఇంకొకళ్ళ నాలుగులక్షలరూపాయ

లని నేను పందెంలో ఎలా పెట్టగలను, నేనయితే నాణెం ఎగురవేసి చూస్తాను. తెలియనివాటిగురించి కాంట్రాక్టు ఎవరు తీసుకుంటారు? ఇద్దరు, ముగ్గురు తెలిసి వున్న ఏక్టర్లు. రెండుమూడు మంచిపాటలు. అందరూ మెచ్చుకునేవాటినే కొత్త రూపంలో చూపెట్టాలి. అంతే।'

'నేనేమైనా సహాయం చేయగలనా?' మనోరమ అయిష్టంగానే అడిగింది.

'తప్పకుండా. సమయం వచ్చినప్పుడు చెపుతాను. నీ స్వభావం, ప్రవర్తన, వేరుగా వున్నాయి. అయినా తర్వాత ఎంతో సహాయం చేయగలుగుతావు. అవకాశాన్నిబట్టి చెపుతాను. నేను సమానత్వంమీద, స్వాతంత్ర్యంమీద, పరస్పర సహాయంమీద నమ్మకం కలవాణ్ణని నీకు తెలుసు. ఏవిధమైన గత్యంతరంలేక కాదు. ఇవ్వాళ సాయంత్రం క్లబ్బుకు వెళతావా? వెళ్లాలనుకుంటే నాకు ఫోను చెయ్।'

సుతలీవాలా తన పనిమీద వెళ్లిపోయాడు. మనోరమ మళ్ళీ నిరుత్సాహం చెందింది. ఆమెకు కమ్యూన్ గుర్తుకు వచ్చింది. అక్కడ పనిచేసే అవకాశంవస్తే బాగా కష్టపడి పనిచేయవచ్చు అనుకుంది. భూషణ్‌కు ఫోను చేద్దామని అనేకసార్లు అనిపించింది. కమ్యూన్‌లో ఏదైనాపని దొరకవచ్చు కాని సంకోచంతో చెయ్యలేదు.

మనోరమ మనసు చంపుకుని మూడురోజులు అలాగే వుండిపోయింది. నాలుగవరోజు మధ్యాహ్నం రెండుగంటలతర్వాత పార్టీ ఆఫీసుకు భూషణ్‌కోసం ఫోను చేసింది. 'నేను రావాలనుకుంటున్నాను. మీకు సాయంకాలం తీరుబడి అవుతుందా?'

'ఆరుగంటలతర్వాత తీరుబడి అవుతుంది' చెప్పాడు భూషణ్.

తను ఆరుగంటలకు ఫోను చేసేటట్లుగా, ఒకవేళ భూషణ్‌కు తీరుబడి అయితే టాక్సీతీసుకుని భూషణ్‌ను పార్టీ ఆఫీసునుంచి తీసుకువచ్చేటట్లుగా అతనికి చెప్పింది.

మనోరమ పార్టీ ఆఫీసుదగ్గరకు చేరేసరికి భూషణ్ తలుపుదగ్గర నిరీక్షిస్తున్నాడు. 'ఎటువైపు' టాక్సీడ్రైవరు అడిగాడు.

భూషణ్ సమాధానంకోసం మనోరమవైపు చూశాడు.

'నేను ఒక ముఖ్యమైన సలహా అడగాలనుకుంటున్నాను. కూర్చుని మాట్లాడుకోవటానికి వీలుగావుండే ఏదైనా ప్రదేశానికి వెళదాం' అన్నది మనోరమ.

'వాలకేశ్వర్' అన్నాడు భూషణ్ డ్రైవరుతో.

వాలకేశ్వర్ రోడ్డుమీద ఒక ముస్లిం రెస్టారెంటుకు దగ్గరగా మలుపులో భూషణ్ టాక్సీ ఆపించాడు. మలబార్-హిల్ పైకి వెళ్ళే కొండవైపు చేయి చూపించి, 'ఇటు పద' అన్నాడు. కొంచెం దూరం నడిచి దట్టమైన చెట్ల నీడల్లోకి వెళ్ళి ఇద్దరూ మల్లెతీగల పొదల క్రిందవున్న బెంచీమీద కూర్చున్నారు.

'నేనేదన్నా ఉద్యోగం చేద్దామనుకుంటున్నాను. పత్రికలో పని దొరికినా సరే। లేకపోతే ఇంకేదైనా పనిగాని' మనోరమ అన్నది.

'నీ అభిప్రాయం, పార్టీపనా?' భూషణ్ అడిగాడు.

'అవును.'

'చాలా కష్టం. పార్టీమెంబరు, అదికూడా తమప్రాంతంనుంచిగానీ జిల్లానుంచిగానీ పెద్ద సిఫార్సుమీద పంపిన మెంబర్లకుతప్ప కమ్యూన్‌లో చోటు దొరకదు.

'నేను అక్కడ వుంటానని చెప్పడంలేదు.'

'నేను అర్థం చేసుకున్నాను. పని చేయడానికికూడా అదేమాట చెప్తున్నాను.'

'నాకోసం మీరు ఏదో ఒకటి చేయాలిసివుంటుంది' తనవేళ్ళచుట్టూ రుమాల చుట్టుకుంటూ మనోరమ పట్టుదలగా అంది. 'నా పెళ్ళివిషయం అడిగారుకదూ। నేను గోతిలో పడతానేమోనని భయంకొద్దీ పారిపోయి వచ్చాను. నూతిలో పడిపోయాను.'

'ఏం, ఏం జరిగింది?'

'ఏం చెప్పను। నాకు ఈ మనిషినిగురించి తెలిసిందిమాత్రం ఎంత। మా అన్నయ్యకు స్నేహితుడు. ఒకసారి మా ఇంట్లో వున్నాడు. తర్వాత మసూరీలో

మేమందరం ఒకే హోటల్లో వున్నాం. ప్రవర్తన మంచిది. మాటలుగూడా బాగా మాట్లాడతాడు. అన్నయ్యకు ఉత్తరంవ్రాసి వివాహంగురించి ప్రస్తావించాడు. అదే సమయంలో ఇంట్లోపరిస్థితికి చాలా విసుగుచెంది వున్నాను. ఎక్కడికైనా వెళ్ళిపోదామని చాలా తొందరపడ్డాను. నా అదృష్టం దెబ్బకొట్టింది. నేను పెళ్ళికి ఒప్పుకున్నట్లుగా ఇతనికి వైరు ఇప్పించాను. నేనే పదిహేనురోజులలోపున సివిల్ మేరేజ్‌కి ఏర్పాటుచేశాను. కానీ ఇప్పుడుచూస్తే మా ఇద్దరిలో ఏమీ పొత్తు కుదరటంలేదు. ఆ ఇంట్లో వుండటం నాకు అసహ్యం. ఒకవేళ పగలంతా గడిపేందుకు ఏదైనా సంతోషాన్ని కలిగించే పనిదొరికితే రాత్రిపూట హోటల్లో గడుపుతున్నానని అనుకుంటాను' అన్నాడు.

'నా మాటను అన్యథా భావించవు కదా!'

'ఇటువంటి అనుమానమెందుకు?'

'సహించరాని పరిస్థితులనుంచి దూరంగా పోవటంకోసం, మనసుకు ఊరట కలిగించుకోవటంకోసం పార్టీపని చేయాలనుకుంటున్నావా?'

'ఏం లాహోర్‌లో పార్టీపని చేసేదాన్నికాదా? మీరు నా మనసుని బాగా ఎరుగుదురు.'

'కానీ నువ్వు పార్టీ మెంబరువి కాలేదు.'

'మీరు కానివ్వలేదు....మీకు నామీద నమ్మకం లేదు.'

'ఏమిటి నువ్వనేది?' భూషణ్ కంఠం తగ్గించాడు.

'సరిగానే చెప్తున్నాను. ఇప్పుడు పాతవిషయాలు ఎత్తను. లేకపోతే ఇదంతా ఎందుకు జరుగుతుంది?' మనోరమ భూషణ్‌వైపునుంచి దృష్టి మరల్చుకుని చెప్తూపోతోంది. 'నాకు జీవితంలో ఘర్షణతప్ప ఇంకేమీ లేదని అప్పుడు అనేవారు. ఆ రోజున అన్నారుకదా, కమ్యూనిస్టు ఆరోగ్యకరమైన సాధారణజీవితం పొందికూడా జీవితాంతం సంఘర్షణ నిర్వహించగలుగుతాడు, అని అర్థమయింది గదా!'

'నేను వేరే ఇంకొకవిషయంగురించి చెప్తాను.'

'ఏమిటి?'

'ఏమిటంటే. ఏ మనిషీకూడా అన్నివిషయాలూ తెలుసుకునే జన్మించడు.'

మనోరమ కన్నీళ్ళు పెట్టుకుంది.

'నువ్వా ఏం చేస్తున్నావ్?' భూషణ్ ఆమెచేతిని పట్టుకున్నాడు.

'నాకు పార్టీ ఆఫీసులో పనిచేయగలిగే ఏర్పాటుచెయ్యి. అంతే.'

'వెంటనే ఎలా కుదురుతుంది? నేను కావాలనుకున్నాకూడా తొందరగా అవదు.'

'ఎందుకవదు? నువ్వు జోషీతో చెప్పు. నేనుకూడా చెపుతాను. నేను లాహోర్‌లో పార్టీపని చేసేదాన్నని అందరకూ తెలుసు. అక్కడనుంచి అడుగుతారు.'

'జోషీ నియమాలకి విరుద్ధంగా ఏం చేయలేడు.'

'అయితే నేను చచ్చిపోతాను. అవసరమైనవి ఏవీ పొందకుండా కృంగి కృశించిపోతాను. బాధలన్నీ సహిస్తాను.'

'మొదట బొంబాయి సిటీపార్టీలో మూడు నాలుగునెలలు పనిచెయ్యి. అందరూ నిన్నుగురించి తెలుసుకుంటారు.'

'నేను వాళ్ళను ఎరగను కదా!'

'అక్కడ నేను నీ విషయం చెపుతాను. కానీ ఒకవేళ సుతలీవాలా ఏమైనా అభ్యంతర పెడితే!'

'నేనేం చేయను! నేను అతన్నించి రహస్యంగా ఎందుకు దాస్తాను? అంత కన్నా నన్ను నేను చంపుకోవడం మంచిది. నేను ఈ కొండమీదనుంచి దూకి పడతాను. సముద్రంలో కలిసిపోతాను. నన్ను నేనే అసహ్యించుకుంటూ జీవించలేను. ఎవరితో నా భావాలు కలుస్తాయో. వాళ్ళమధ్యలో వుండాలనుకుంటున్నాను.'

'అలానే జరుగుతుంది. ఇదే ఆలోచనతో మంగళమ్. పారోలు తమ సంస్థానం ఉత్తరాధికారిమీద దెబ్బకొట్టి పార్టీపని చేస్తున్నారు. ఇదేసమస్యవల్ల పకీనా భర్తనుంచి విడాకులు తీసుకుంది. న్యాయబద్ధమైన మనిషిబుద్ధి ఈ అర్థంతు అన్నిటికన్నా పెద్దది కానీ నువ్వు నాకు అన్యాయం చేస్తున్నావు.'

'నేను అన్యాయం చేస్తున్నానా ?'

'నాకు నీమీద విశ్వాసం లేదని నువ్వు అన్నావు.'

'1936-38 సం॥లో నీ ప్రవర్తన ఎలా వుండేది ? 38-40 లో ఎలా వుంది? నువ్వు నన్ను శత్రువర్గంలోనిదాన్నిగా భావించావు' అన్నది మనోరమ పగ తీర్చుకున్నట్లుగా. భూషణ్ వైపు చూడకుండా తన చెప్పుక్రిందపడిన రాతిని నొక్కి— 'మనిషి తనవర్గంనుంచి విడిపడలేడా ? ఏం సోమా ....?' అంది.

సోమా బారిస్టరు ఆటబొమ్మలా తయారయ్యింది. అంతకన్నా ఇంకేముంది? నేనటువంటి మూర్ఖత్వపుపని చేయలేను. ఆ పరిస్థితిలో నీ వర్గం నిన్ను తోసిపారేసేది. లేకపోతే నిన్ను కొనేయటానికి ప్రయత్నం చేసేది. లేకపోతే మన ఇద్దరి వ్యవస్థలకు విరుద్ధంగా వ్యక్తిగతరూపంలో పోట్లాడుకుని ప్రాణాలర్పించడానికి తయారయేవాళ్ళు.'

'మీరు మళ్ళీ అదేవిషయాలు మాట్లాడుతున్నారు. నేను ఆ వర్గాన్ని అసహ్యించుకుంటున్నానని మీకు తెలుసు. దాన్నుంచి రక్షణ కోరుతున్నాను. నేనేమి బాధపడటం లేదంటారా ?' మనోరమ మండిపడింది.

భూషణ్ నవ్వాడు—'అది చిన్నతనం. ఉత్తచాపల్యం. ఏదైనా అందమైన బొమ్మనిచూసి దానికోసం మారాం చేయడం.'

'వాట్ డూ యూ మీన్ ! మీరు నన్ను ఆటబొమ్మగానే అనుకున్నారా ?' మనోరమ దెబ్బతిని అడిగింది.

'లేదు బాబూ, ఆ సమయంలో నేను గాలిమేడలలోనూ, ఊహాలోకాలలోనూ వున్నాను జీవితానుభవంద్వారా వాస్తవికతని అర్థం చేసుకున్నాను. మనం రెండు విడివిడివర్గాలకు చెందిన మనుష్యులం. చాలామందికి ధనవంతుల పిల్లని ప్రేమించాలన్న కాంక్ష తరుచు కలుగుతుంది. దీన్ని వాళ్లు తమ అభివృద్ధికి తరుణోపాయంగా భావిస్తున్నారు.

ఇప్పుడుకూడా ఆ ద్వేషం పోలేదా ?' మనోరమ విరాళగా అడిగి 'ఇప్పుడు నేను ధనవంతురాలిని కాదు' అంది.

'ద్వేషం కలిగిన కారణాన్ని నిర్మూలించాలంటే దానికోసం ఉపేక్షించ కూడదు. ఆ కారణాన్ని దూరం చేసెయ్యాలి.' భూషణ్ చాలా ఓదార్పుస్వరంలో అన్నాడు.

• • •

'ఏదైనా సార్వజనిక కార్యక్రమంలో పాల్గొనాలనివుంది. లాహోర్‌లో గూడా ఏదో ఒకటి చేస్తూనే వుండేదాన్ని.' ఉదయం ఫలహారం తీసుకునేసమయంలో సుతలీవాలాతో అన్నది మనోరమ.

సుతలీవాలా ఆమెని సమర్థించాడు—'నేనే ఈ విషయమై ఆలోచించి నీకు చెప్పాలనుకుంటున్నాను. బొంబాయి సమాజంతో నీకు పరిచయం అవాలని ఆలోచిస్తున్నాను. సామాజికపరిస్థితికి ఇది చాలా అవసరం. వ్యక్తి, పరివారపు సామాజికస్థితి, సార్వజనికస్థితుల ప్రభావం వ్యాపారంలోనూ, వ్యక్తిలోనూకూడా చాలా పడుతుంది. రకరకాల పరిచయాలున్న వ్యక్తికిమటుకు చాలా విలువ వుంటుంది. పరిచయంకోసం ఎప్పుడైనా క్లబ్బుకు వెడుతూవుండు. ఏవైనా సభలు, సమావేశాలు జరిగితే వాటికి వెళ్ళటానికి నీకు ఆహ్వానం పంపించే ఏర్పాటు చేస్తాను.'

మనోరమ ఆవారంలో రెండుసార్లు క్లబ్బుకు వెళ్ళింది. సుతలీవాలా ఆమెను బీదపిల్లలకు పాలు ఏర్పాటుచేసే ఒక గౌరవనీయమైన స్త్రీల కమిటీలో సభ్యురాల్ని చేశాడు. ఆ కమిటీకికూడా వెళుతూవుండేది. కాని నియమం తప్పకుండా భూషణ్ పరిచయాన్ని ఆధారంచేసుకుని చర్నీరోడ్‌కు దగ్గరగావున్న గిరగాంవ్‌లో పత్రిక సమూహంలో పనిచేయటానికి ఎఫ్. ఎస్. యూ. (సోవియట్ మిత్రసంఘం) కార్యాలయానికి వెళుతూవుండేది.

సంఘ పక్షపత్రిక ప్రచురణసమయం దగ్గరకు రావటంచేత పని ఎక్కువగా వుంది. ఆ రోజు మధ్యాహ్నం మనోరమ భోజనానికి ఇంటికి వెళ్ళలేదు. సాయంకాలం అధ్యక్షురాలు కామ్రేడ్ గీతాను ఒక గంటకుమాత్రం సెలవు అడిగి ఇంటికి తిరిగి వచ్చింది. భూషణ్ వస్తానని చెప్పారు. మనోరమ పనివల్ల, ఆకలివల్ల నీరసించివుంది. ఆమె ఇంటికి చేరినవెంటనే భూషణ్ వచ్చాడు. 'అయ్యగారు చాలాసార్లు ఫోను చేశారు. అమ్మగారువస్తే ఆఫీసుకు ఫోను చెయ్యమని చెప్పమన్నారు' అని నౌకరు చెప్పారు.

మనోరమ ఫోను తీసి సుతలీవాలాతో మాట్లాడింది. 'భగవంతుని దయవలన నువ్వు ఇంటికి తొందరగా వచ్చావు. ఈరోజు నేను అయిదుగంటలకి తార మధుని, సేఠ్ వదానియాని టీ కోసం 'తాజ్'కు ఆహ్వానించాను. వాళ్లకు నిన్ను పరిచయం చేద్దామనుకుంటున్నాను. ఇంకా నలభై అయిదు నిముషాలు వుంది. నువ్వు టాక్సీమీద ఇక్కడకు వచ్చేయ్' అన్నాడు సుతలీవాలా.

ఫోను చెవుదగ్గర పెట్టుకునివున్న మనోరమ ముఖంమీద ఆదుర్దా తొంగి చూసింది. అది భూషణ్ గమనించాడు. 'నేను తప్పక వచ్చేదాన్నే కానీ ఒక అవసరమైన పనికోసం కొంతమందికి మాట ఇచ్చివచ్చాను. నేను అక్కడకు వెళ్లక పోతే పని చాలా పాడవుతుంది. నేను వాళ్లకు ఏం సమాధానం ఇవ్వగలను? నాకు చాలా బాధగా వుంది' ఆమె తల గోక్కుంటూ ఫోనులో చెప్పింది.

సుతలీవాలా పట్టుదలగా అన్నాడు. 'నాకు నీ అపాయింట్‌మెంట్ గురించి ఏమీ తెలీదు. నువ్వు వస్తావని వాళ్ళతో చెప్పేశాను. ఆలోచించు. నా స్థితి ఏమవుతుంది? దీని ప్రభావం మిగతా విషయాలమీద పడుతుంది.' మనోరమ ఏం సమాధానం చెప్పలేక ఫోను పెట్టేసింది. భూషణ్ టీ కప్పును పెదిమలదగ్గర పెట్టుకుని ఆమెవంక కుతూహలంగా చూస్తున్నాడు.

'ఏం చెయ్యాలో చెప్పు? ఏవిధంగానూ ఒప్పుకోవటం లేదు. ఆ పార్టీలో నా అవసరం ఏముంది? అభినేత్రి మధుని, సేఠ్ వదానియాని నేను ఎరుగనే ఎరుగను. ఇది ఏమాత్రం భరించలేను. కామ్రేడ్ సీతా ఏమంటారు?' మనోరమ ఏడుపు గొంతుతో అడిగింది.

'సీతా సందరపతి నిన్ను పొగడదు. కానీ నువ్వేం చేయగలవు? ఆ భర్త తన అధికారాన్ని ఉపయోగిస్తున్నాడు.'

మనోరమ బాధపడింది. ఆమె బట్టలు మార్చుకోవడానికి మరో గదిలోకి వెళ్ళబోతూ భూషణ్ మాటలువిని తిరస్కారంతో మళ్ళీ కుర్చీమీద కూర్చుండి పోయింది. 'ఎందుకు నన్ను బాధపెడతావు? అవమానం చేస్తావెందుకు?' ఆమె చీరకొంగుతో ముఖం కప్పుకుంది.

'ఇందులో అవమానమేముంది?' భూషణ్ కనుబొమ్మలు ఎత్తి అన్నాడు.

మనోరమ సమాధానం ఇవ్వకుండా లేచి కళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

భూషణ్ చల్లారిపోయిన టీ వి ఒక్కగుక్కలో తాగేశాడు.

మనోరమ గదిలోనుంచి బయటకు వచ్చింది. చాలా సాదాగావున్న ఖద్దరు చీర, ముదురు ఎర్రరంగు బ్లౌజు-బట్టలు వేసుకోవడంలో ఉత్సాహంలేమి, అయిష్టం, నిర్లక్ష్యం స్పష్టమవుతున్నాయి. జుత్తుకూడా అక్కడక్కడా రేగివుంది. ముఖంమీద కన్నీటిచారలు కనిపించకుండా వుండేందుకు ముఖం కడుక్కుని పౌడరు వ్రాసుకుని కళ్ళకు కాటుక పెట్టుకుంది. అదిచూసి భూషణ్ నవ్వాడు.

'ఎందుకు నవ్వుతున్నావ్?' మనోరమ అడిగింది.

'మా దగ్గరకు వచ్చేటప్పుడయితే ఒక యోగినిలా వచ్చేదానివి.'

'అయితే?'

'ఇప్పుడు అప్సరసలా తయారై వెడుతున్నావ్. డబ్బుకు ఇచ్చే గౌరవం కదా!'

'మీ దగ్గరకు ఇలావస్తే కళ్ళు ఎత్తుకు తిరగడానికే కష్టమవుతుంది ...ఏం అతిగా అలంకరించుకున్నానా?'

'అదేంమాట! ఎంతో ఆకర్షణీయంగా వున్నావు.'

'నీకు మతిపోతోంది.... టాక్సీవరకూ నాతోపాటు రా.'

టాక్సీలో కూర్చుని, 'పోర్టువరకూ నాతోపాటు రా, అక్కడినుంచి ఇదే టాక్సీలో నువ్వు కమ్యూన్‌కు వెళ్ళిపోదువుగాని. ఇది తీసుకో' అన్నది మనోరమ. పదిరూపాయలనోటు భూషణ్ చొక్కా జేబులో నొక్కిపెట్టింది. మళ్ళీ అనుమానంగా అడిగింది. 'నిజం చెప్పు. నేను విసుగులో వున్నాను. అసహ్యంగా కనిపించటంలేదు కదా ఈ బట్టల్లో!'

'నేను ఇంతకన్నా మంచిదుస్తులను ఊహించలేను. చాలా జాగ్రత్తగా వుండు ఈ షాహుకారులనుంచి!'

'ఛీ! నీకు తెలియదు. పశువుని బలి ఇవ్వడానికి బాగా అలంకరించే తీసుకు వెళతారు.'

'పశువుని బలి ఇవ్వడానికి తీసుకువెళుతుండగా కనపడితే దాన్ని కాపాడాలి.'

'ఎవరైనా అలా చేశారా సమాజంలోవున్న ధర్మం. నీతి. ఆచారం. సంస్కారం. చట్టం విరుచుకుపడతాయి.'

తాజ్ హోటల్లో టీ త్రాగుతూ మాట్లాడుతుండగా ఆరున్నర అయింది. టీ త్రాగేటప్పుడు సుతలీవాలా మధుకు. సదానియాకు తన కొత్త ఫిల్మ్‌కంపెనీ కార్యక్రమాన్నిగురించి చెపుతున్నాడు. కంపెనీలో అభినేత్రి మధుకు, నాయకుడు శేర్ జంగ్‌కు, నూరుల్‌కు భాగం ఇద్దామనుకుంటున్నాడు. సదానియా రెండులక్షలు పెట్టేటట్లు, మధు ఏభై వేలు, శేర్‌జంగ్ నూరుల్‌లు పాతిక-పాతికవేలు భాగంగా పెట్టేటట్లు సుతలీవాలా పథకం వేశాడు. మొదటిఫిల్మ్‌లో డబ్బు తీసుకోకుండా పనిచేసి కాంట్రాక్టునుంచి రొక్కం తగ్గించుకోవాలి. శేర్‌జంగ్, నూరుల్‌లుకూడా ఇలాగే చేయాలి. ఈవిధంగా కంపెనీ పెట్టుబడి దానంతటది నాలుగులక్షలు అవుతుంది. సుతలీవాలా మేనేజింగ్ డైరెక్టరుగా పని చేస్తాడు. తనపని వాటా ఏభై వేలు తీసుకుంటాడు. టీ త్రాగినతర్వాత సేఠ్ సదానియా, సుతలీవాలా దీర్ఘంగా మాట్లాడుకున్నారు. ఆ అలసట దూరమయేందుకు విస్కీ తీసుకున్నారు. మనోరమకు, మధూకు షేంపేను తెప్పించారు. సేఠ్‌గారు, సుతలీవాలా, మధు బాగా బలవంత పెట్టినమీదట మనోరమ రెండుగుక్కలు త్రాగింది. రుచి ఫరవాలేదనిపించినా ఎక్కువగా తీసుకోలేదు

'డిన్నర్‌కూడా కలిపి తిందాం' అన్నారు సేఠ్‌జీ.

'అది ఎలా? నాకు ఎనిమిదిగంటలనుంచి షూటింగు వుంది' అని గాభరా పడుతూ మధు లేచి నిలబడింది.

'మేము మిమ్మల్ని స్టూడియోదగ్గర దిగబెట్టివస్తాము' అన్నాడు సుతలీవాలా.

'అయితే మేము ఒక్కళ్ళం వుండిపోవాలా?' సేఠ్‌జీ భయాన్ని వ్యక్తపరిచాడు.

'సేఠ్‌జీ, అలా ఎలా జరుగుతుంది' అని సుతలీవాలా మనోరమవైపు చూసి, 'నువ్వు సేఠ్‌జీతో కూర్చో, మేము మధూని వదిలిపెట్టి వస్తాం' అని చెప్పి సుతలీవాలా మనోరమ సమాధానంకోసం ఎదురుచూడకుండానే జేబులోంచి కారు తాళంచెవులుతీసి వేలికి చుట్టుకుంటూ లేచి నిలబడ్డాడు.

'అయితే డిన్నర్ ఎక్కడ?' సేఠ్‌జీ సుతలీవాలాని అడిగారు. మెరీన్ డ్రైవ్‌లో మా ఇంటిదగ్గర ఎలా వుంటుంది?' అని ఆయన మనోరమవైపు చూశాడు. 'మీరు మా ఇల్లుగూడా చూడచ్చు' అని సేఠ్‌జీ సుతలీవాలావైపు చూసి. 'మీరు అక్కడికే తిరిగిరండి' అన్నాడు.

'చాలా బాగా చెప్పారు సేఠ్‌జీ!' సుతలీవాలా సమర్థించాడు.

మనోరమ సేఠ్‌జీతో కలిసి ఆయనకారులో మెరీన్‌డ్రైవ్ చేరింది. మూడవ అంతస్థుకు వెళ్ళడానికి లిఫ్టు వుంది. సేఠ్‌జీ ఇంటిదగ్గర నౌకర్లెవరూ యజమాని కోసం నిరీక్షించటంలేదని అనిపించింది. సేఠ్‌జీ రాగానే వాళ్ళకి హెచ్చరికలుచేసి ఆజ్ఞాపించారు. మనోరమ డ్రాయింగురూములో సోఫామీద కూర్చుంటూ. 'సేఠ్ గారిభార్యను మాకు పరిచయం చేయరా?' అని అడిగింది.

'వాళ్ళు. పిల్లలయితే కాల్బాదేవిలో వుంటారు.' అని చెప్పి సేఠ్‌జీ మనోరమకు దగ్గరగా సోఫామీద కూర్చుండిపోయారు.

మనోరమ సేఠ్‌జీకి చోటివ్వడానికి ఇంకొకవైపు జరిగింది. ఆమెకు ఈ చొరవ నచ్చలేదు. 'మీరు ఇక్కడ ఒంటరిగా వుంటున్నారా?' అని అడిగింది.

'ఒంటరిగా ఏమిటి? మీ రున్నారుగా. మీతోపాటు ఇక్కడికి ఆ గుంపుని వెంట తీసుకువస్తే లాభమేముంది?' సేఠ్‌జీ నవ్వారు.

మనోరమ మౌనంగా వుండిపోయింది. గదినుంచి బయటకువచ్చి. లిఫ్టును చేరి. బటన్ నొక్కి. క్రిందకుదిగి వెళ్ళిపోయింది.

సేఠ్‌జీ అలా చూస్తూ వుండిపోయారు.

* * *

మనోరమ ఇంటికి తిరిగివచ్చిచేరి రెండుగంటలవరకు వసారాలో కూర్చుని సుతలీవాలాకోసం ఎదురుచూసింది. సుతలీవాలా వచ్చినతర్వాతకూడా ఎవరు ముందు పలకరించాలన్నట్లు ఒక క్షణంపాటు గడిపారు. మనోరమ ఇక వుండలేక పోయింది—'ఎవరైనా డబ్బుకోసం ఇంత దిగజారిపోతారని నాకు ఇంతవరకూ తెలియదు.'

'అంటే నీ అభిప్రాయం ఏమిటి?' సుతలీవాలా కఠినంగా అడిగాడు.

మనోరమ అతనివైపు ఉరిమిచూసి, 'ఆ అభిప్రాయం తెలీదా! నన్ను ఒంటరిగా ఆయన ఇంటికి పంపటంలో మీ అభిప్రాయం ఏమైవుంటుంది? అక్కడ ఆయన భార్యకూడాలేదు. మీరు టీ కోసం నన్ను వెంటతీసుకువెళ్ళారు. ఆయన తన భార్యను ఎందుకు వెంట తీసుకురాలేదు?'

'ఒంటరిగా అనటంలో అర్థం ఏమిటి? నీకు తెలీదా నేను అయిదు-పది నిముషాలలో తిరిగివస్తానని? దోవలో చక్రంలో గాలి పోతుందని నాకేంతెలుసు?' సుతలీవాలా బిగ్గరగా అన్నాడు—'నువ్వు ఇప్పటివరకూ ముసుగువేసుకుని వుంటూ వచ్చావా? నువ్వు ఇతరులతోకలిసి ఎప్పుడూ తిరగలేదా? నిన్ను కలుసుకోవటానికి ఇక్కడకు ఎవరూ మొగాళ్ళు రావటంలేదా? రోజంతా నువ్వు నీ మిత్రులతోకలిసి వుంటున్నావు. ఇవాళ నేను ఒక మిత్రుణ్ణి ఆహ్వానిస్తే అతనిమీద తుఫాను లేపుతున్నావ్. ఏం చేశాడు ఆయన, చెప్పు! నేను అక్కడినుంచే వస్తున్నాను. నువ్వు అలా తిరుగుతుంటేనూ, వాళ్ళని కలుసుకుంటూవుంటేనూ నేను ఎప్పుడూ ఆపలేదు. నువ్వు నా వ్యవహారాలని సహించలేకపోతే కలిసివుండటంవల్ల ప్రయోజనమేముంది?' అతనిస్వరం బాగా కఠినంగా వుంది. 'లేకపోతే, నీ మిత్రులను కలుసుకోవడంకోసం, బొంబాయి రావడానికి, నన్ను పెళ్ళి చేసుకోవటం ఒక వన్నాగమా?'

మనోరమ చాలా అడగాలని ఆలోచించి వుంచుకుంది కానీ భర్త అన్న చివరిమాటలు విన్నతర్వాత నోటినుంచి ఏ మాటలూ బయటకు రాలేదు. ఆమె వరండా కటకటాలకు తల ఆనించి కళ్ళు వంచేసింది. సుతలీవాలా కోపంలో మెట్లు దిగి క్రిందకు వెళ్ళిపోయాడు. క్రింద కారు కదిలినచప్పుడు వినిపించింది. కారు బంగళానుంచి బయటకు వెళ్ళిపోయింది

మనోరమ వసారాలో కూర్చుండిపోయింది. రాత్రి రెండుగంటలయింది. ఆమె లేచింది, బట్ట మార్చుకోకుండా, ఏమీ కప్పుకోకుండానే కళ్ళు మూసుకుని పడుకుంది. సుతలీవాలా ఎప్పుడు వచ్చాడో ఆమెకు తెలియలేదు. ఉదయం ఆమెకు నిద్ర మెలుకువ వచ్చేసరికి సుతలీవాలా గాఢమైననిద్రలో అతని మంచంమీద నిద్రపోతున్నాడు.

మనోరమ స్నానంచేసి బయట వరండాలోకూర్చుని తన అదృష్టంగురించి,

రతణగురించి ఆలోచిస్తోంది. సుతలీవాలా లేచి ఆమెనుగురించి పట్టించుకోకుండా, టిఫిన్ చేయకుండానే కిందకుదిగి వెళ్ళిపోయాడు. నౌకరు మనోరమకు టిఫిన్ సిద్ధం చేశాడు. రాత్రి ఆమె ఏమీ తినలేదు. శరీరం బలహీనంగా వున్నట్లనిపించింది. ఆమె కొంచంతిని టీ త్రాగింది. 'నేను ఇక్కడ ఎందుకు తినడం? నేను మిత్రులను కలుసుకోవడానికి పెళ్ళి అనే వలపన్ని బొంబాయి వచ్చానని అతను అంటున్నాడు.'

మనోరమ ఆలోచిస్తోంది. 'నాన్నగారూ అన్నలూ వింటే ఏమంటారు? నేను నా ఇష్టప్రకారం పెళ్ళిచేసుకుని వచ్చాను. వైరిచ్చి పెళ్ళిచేసుకుని వచ్చాను. వాళ్ళు నన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టి, నా అంతట నేనే పెళ్ళి చేసుకున్నానన్న అపరాధాన్ని నా నెత్తిమీద వేశారు. ఇప్పుడు ఈ మనిషికూడా తన ప్రయోజనానికి పనికిరానిదాన్నిగా తలచి ఇంటినుంచి వెళ్ళగొట్టి కులటఅన్న కళంకాన్ని అంటగట్టడానికి ఉపాయం ఆలోచిస్తున్నాడు. ఆహా! ఎటువంటిది ఈ సమాజపు దుర్మార్గమైన చక్రం!....నావల్ల ఏదైనా పొరపాటయినాకూడా ఇక్కడనుంచి బయటపడటం నాకు ముక్తి దొరికినట్లే....కానీ ఎక్కడికని వెళతాను? కమ్యూన్‌లోకూడా నాకు చోటులేదు. మూర్ఖత్వంవల్ల దెబ్బలు తినేవాళ్ళని వాళ్లు ఎలా వుంచుకుంటారు? అర్థం చేసుకోగలిగిన తెలివైనవాళ్ళకే అక్కడ చోటువుంది.'

ఆ క్రితంరోజుసాయంత్రం ఆమె ఎఫ్. ఎస్. యూ. ఆఫీసుకు తిరిగి వెళ్ళలేకపోవటంచేత పని చాలా పేరుకునివుంటుంది కామ్రేడ్ సీతా ఏమంటుందో? సీతా కట్టుకున్న ముదురు సిలంరంగుచీర, ఎగురుతూవుండే ఒత్తైన జుత్తు, భుజాలకు వేలాడే సంచి, నల్లటి కోలముఖంలో తనవైపు తిరిగే కళ్లు మనోరమ ఊహించుకుంది. సర్కస్‌లో ఏనుగులను నాట్యంచేయించే హంటర్ మాస్టర్ ప్రవర్తనలా వుండే సీతాప్రవర్తన, సరిగానూ పద్ధతిప్రకారం చేసినా గురివిందగింజంత తప్పు చేస్తే మ్రోగే హంటర్‌లా వుంటుంది!....సీతా ఏమంటుంది?'

ఇంట్లోకూర్చుంటే దుఃఖించటంకన్నా ఇంకేమి చేయగలుగుతుంది? చాలా రోజులనుంచి ఆమె ఇంటిదగ్గరనుంచి జౌపేరావరకు నడిచే వెళుతూవుంది. ట్రాములమీద, బస్సులమీదగానీ, నడిచిగానీ వెళ్ళే తోటి స్నేహితులదగ్గరకు టాక్సీమీద వెళ్ళటంలో ఆమెకు సంకోచం కలిగేది కానీ చాలా బలహీనంగావున్నట్లు

లనిపిస్తోంది. ఆమె టాక్సీలో వెళ్ళి ఆఫీసుకు ఏబై అడుగులు ఇవతలే దిగిపోయింది. ఆఫీసులో ప్రవేశించగానే సీతా కనిపించింది. నిర్దయతోకూడిన ఆమెకంఠం విని పించింది. 'ఇప్పుడు కనిపించింది ఈదీ తర్వాత చంద్రునిలా? ఈమెకోసం హెడ్డాఫీసునుంచి చాలా పెద్దవాళ్ళ సిఫార్సులు, పొగడ్తలు విన్నాం. మీ దయవల్ల పత్రిక ఇరవై నాలుగుగంటలు ఆలస్యం అయింది.'

సీతా చెపుతూనేవుంది—'నిన్న మదన్‌పురాలో మీటింగ్‌తర్వాత ఎనిమిది గంటలకు ఇంటికి చేరగానే గుర్తుకువచ్చింది, అమాయకురాలు ఒంటరిగా ప్రూఫ్ చూస్తూ వుండివుంటుందేమోనని వచ్చి చూస్తినిగదా ఇక్కడ ఎవరూ లేరు. జయ రామ్‌దగ్గరకువెళ్ళి అమ్మగారింటికి ఫోన్ చేశాను. అమ్మగారు అయిదుగంటలకే ఇంట్లోనుంచి వెళ్ళిపోయారని తెలిసింది. ఏ దుర్ఘటనా దోవలో జరగలేదు కదా అని నాకు భయమేసింది. కమ్యూన్‌కు భూషణ్‌కోసం ఫోను చేశాను. బేగంసాహిబా తన శాహన్‌శాహ్ ఖావింద్‌పార్టీని కాంతివంతం చేయడానికి వెళ్ళారని తెలిసింది. ఖావింద్ పార్టీలో కాంతి ఏమీ తగ్గకూడదు. వేలకొలది పబ్లిక్ పత్రికలు నిరీక్షిస్తూ వుండిపోయినా సరే! ఈ ఆలస్యానికి కారణమేమిటని ఎవరైనా అడిగితే నేను ఈ ఈదీ ఎండగ చంద్రుణ్ణి చూపించి నేను ఈమె సహాయంతోనే పని చేయాల్సివుందని చెపుతాను. మనసు కలిగినప్పుడు వచ్చి పనిచేసేవాళ్ళతో ఇక్కడ పని జరగదు. ఇదుగోనమ్మా, ఇది డ్యూటీ, స్వయంగా స్వీకరించిన డ్యూటీకి బాధ్యత మీరు తీసుకోలేరా!' సీతా చెపుతూనేవుంది. అసలువిషయ మేమిటంటే తోటివాళ్ళు శెలవు రోజన్నవిశ్వాసంలో ఆఫీసుకు రాలేదు. సీతా స్వయంగా ప్రూఫ్ చూస్తోంది.

స్కూలులో నిర్దయుడైన అధ్యాపకునిముందు అపరాధంచేసిన కుర్రాడు నిలబడినట్లుగా మనోరమ సీతాముందు మెదలకుండా నిలబడివుంది. సీతా కాగితాల మీద కళ్ళు వంచేసుకుంది. మనోరమ నిలబడేవుంది. ఎదుట ఎవరూ లేనట్లుగానే సీతా కాగితాలలో కళ్లుదూర్చి పని చేసుకుంటోంది. కొద్దినిముషాలతర్వాత ఆమె మనోరమవంక చూసింది. 'మీరు నిలబడివుండటానికే వచ్చారా? నేను మిమ్మల్ని కూర్చోమని బ్రతిమాలి క్షమార్పణ కోరుకుంటానని ఎదురుచూస్తున్నారేమో, అది జరగదు. నాకు పైవాళ్లిచ్చిన ఆజ్ఞప్రకారం నేను నడుస్తాను.'

మనోరమ చీరకొంగుతో ముఖం కప్పుకుంది. లోపలినుంచి పొంగివచ్చే

దుఃఖంవల్ల ఆమె శరీరం కంపించిపోతోంది. సీతా మేజాల్లకు అటువైపునవున్న కుర్చీలోంచి లేచి మనోరమదగ్గరకు వచ్చింది. ఆమె రెండుచేతులూ నడుంమీద పెట్టుకుని ముష్టియుద్ధానికి సిద్ధమౌతున్నట్లుగా వుంది—'మీరేం మాట్లాడరేమండీ, ఏం జరిగింది? ఎవరైనా మిమ్మల్ని బాధపెట్టారా?' ఆమె ఇప్పుడుకూడా అదే స్వరంలో మాట్లాడుతోంది. 'మీరు నాకేం చెప్పరేమిటండీ!' అంది.

సీతా మనోరమచేతిని పట్టుకుని బాత్‌రూంలోకి లాక్కెళ్ళింది. మనోరమ చేతిలోంచి పర్సు తీసుకుని 'ముఖం కడుక్కో!' అంది అధికారపూర్వకంగా.

మనోరమ తప్పించుకోలేకపోతోంది. సీతా ఆమెను గోడకున్న వాష్‌బేసిన్ వైపు తీసుకెళ్ళి ముఖం కడగటానికి ప్రయత్నించింది.

'వుండండి' అని మనోరమ ముఖం కడుక్కోసాగింది. మనోరమ బాత్ రూంనుంచి బయటకువచ్చి చూసేసరికి సీతా మేజాబల్లమీద ప్రూఫ్ చూస్తోంది.

'ఇక్కడకు రండి' సీతాస్వరం మారిపోయింది. 'ఇంకా కొద్దికాగితాలు మిగిలిపోయాయి. వీటిని వెంటనే పూర్తిచేసేయాలి. చాలా కష్టపడి ప్రెస్ తెరిపించాను. లేకపోతే ఇవ్వాళ ఆదివారం. మిగతా ప్రూఫంతా నేను పంపేశాను.'

సీతా నౌకరువైపుచూసి 'అబ్బాయ్, టీ తీసుకురా' అని చెప్పింది.

టీ వచ్చేసరికి ప్రూఫ్‌పని పూర్తి అయిపోయింది. 'ఈ ప్రూఫ్ ప్రెస్‌కు తీసుకెళ్ళి ఇవ్వు. ఎంతవరకు అయిందో అడుగు' అంది సీతా నౌకరుతో.

మనోరమ టీ కప్పువైపుచూస్తూ గడచినరాత్రి సంఘటనంతా వివరంగా సీతాకు వినిపించింది.

సీతా ఇంగ్లీషులో తిట్టింది. 'ఆ దబ్బుకి గడ్డితినే మనిషి ఎవరు, నీమీద కళంకం వేయడానికి?' అంది.

మనోరమ దీర్ఘంగా నిట్టూర్పువిడిచి 'నా అభిప్రాయం ఏమిటంటే, నా భావాలు అతని భావాలు వేరువేరు కావటంవల్ల అతను నన్ను వదిలించుకోవాలనుకుంటున్నాడు' అంది.

'నిన్ను వదిలించుకోవాలనుకోవడంలో అర్థం?' సీతా కోపంగా అంది—

చూస్తాను ఈ వదిలించుకునేవాణ్ణి. నీకు మనువృత్తి ఇవాల్సి వుంటుంది. కట్నం రూపంలో కొంత అంది వుంటుంది. అదికూడా తిరిగి ఇవ్వాల్సి వుంటుంది। మీ నాన్నగారి ఆర్థికస్థితి ఎటువంటిది?' అని అడిగింది.

'కట్నం ఏమీ ఇవ్వ లేదు. పదిహేనువేల చెక్కు మాత్రం ఇచ్చారు. ఆ డబ్బును స్వయంగా నేనే సుతలీవాలాకు ఇచ్చాను' అంది మనోరమ.

సీతాకు ఇంకా కోపం రెచ్చింది—'చూస్తాను. ఆ వదిలించుకునేవాణ్ణి। పోషణభారం భరించాల్సి వుంటుంది'.

సీతా మనసులో మనోరమపట్ల ఎంతో మమకారం, ఆసక్తి కలిగాయి. మనోరమ ఇంటి పరిస్థితికి దుఃఖించి, విసుగుచెంది ఆ తొందరపాటులో సుతలీ వాలాను పెళ్ళిచేసుకున్నా తన తప్పుని ఒప్పుకుంది.

సీతా సానుభూతిచెంది. 'నీలాంటి పిటికి అమ్మాయిలకి ఇలానే కావాలి. ఇంట్లోవాళ్ళ అన్యాయానికి ఎదురుతిరిగి వుండవలసింది. ఇటువంటివ్యక్తితో కలిసి వుండటంలో అర్థమేమిటి? విడాకులు తీసుకోవడం, గౌరవంగా జీవితం గడపటం నీకు అవసరం. నువ్వు నాతోపాటు ఇదే ఇంట్లో వుండు. విన్నెవరు ఇబ్బంది పెడతారో చూస్తాను।' అని సలహా ఇచ్చింది.

సీతా మనోరమ ఎదుటనే, ఆమె కరుణగాధని తన క్లామేట్ భర్త వాసే కర్‌కు వినిపించి నిర్ణయంకూడా చెప్పేసింది—'ఈమె భర్త కావాలంటే విడాకులు తీసుకోవటమే ఈమెకు గౌరవపూరితమైన మార్గం. అంగీకారమేనా?'

వాసేకర్ బాధగా చేతివేళ్ళ మెటికలు విరుచుకుంటూ అన్నాడు—'విడాకుల దావాలలో ఎప్పుడూ ఇబ్బంది వుంటుంది. విడాకులకోసం కారణం ఏం చెపుతుంది? విడాకులు కావలసిన మూడు కారణాలలో ఏదో ఒకటి వుండాలి. అవి భర్త మరో స్త్రీతో సంబంధం కలిగివున్నాడనిగాని, అతను నపుంసకుడనిగాని, లేకపోతే భార్యను హింసపెడుతూ వుండేవాడుగాని అవాలి।'

సీతా మనోరమవైపు చూపింది.

మనోరమ కళ్ళు దించుకుని 'నా దృష్టిలో చివరిమాట వదిలిపెట్టి మిగతా వన్నీ వున్నాయి' అన్నది ఇంగ్లీషులో.

'ఏమిటి?' ఆశ్చర్యాన్ని, భయాన్ని వెలిబుచ్చుతూ సీతాపెద్దగా నిట్టూర్చి వాపేకర్ వైపుచూసి, 'అత్యాచారం ఉంది కదా! సహింపరాని అత్యాచారం. మనో రమా, నువ్వు ఎలాగైనా ఈ అవమానాన్ని, ఈ మురికినీ వదిలించేసుకోవడం చాలా అవసరం. ఇప్పుడు అన్నీ నిజకారకాలు మన ఎదుట వున్నాయి' అని ఆమె ఈ నిజాలన్నీ తనచేతిలో పట్టుకున్నట్లు చేతులు చాచింది.

'నిజం తెలియటంవల్ల పని జరగదు. న్యాయస్థానంలో ఈ నిజాలన్నీ ఋజువు చేయాల్సివుంటుంది. ఋజువు, సాక్ష్యం కావాలి మనోరమా! న్యాయస్థానంలోకి వెళ్ళి ఇదంతా చెపుతావా?' అనడిగాడు వాపేకర్.

'ఎందుకు చెప్పదు!' సీతా వేగంగా బల్లమీద చేత్తో గుద్దింది.

మనోరమ తల అడ్డంగా తిప్పింది.

సీతా కోపం పెరిగిపోయింది. 'అయితే నిన్ను కష్టాల్లోంచి ఎవడు కాపాడు తాడు? నువ్వు స్వయంగా కష్టాలని మెడకు చుట్టుకుంటూవుంటే ఎవరు కాపాడ గలరు!' అంది.

సీతా కోపం కారణంగా మనోరమ అసంతృప్త జీవితపుచర్చ పార్టీ ఆఫీసులో వ్యాపించింది. మనోరమ ఈ అపకీర్తివల్ల సంకోచంతో కుంచించుకు పోయింది. సీతా దృష్టిలో ఈ సంకోచం పూంజీవాదపు సంస్కృతి బూటకం మాత్రమే. ఆమె మనోరమని ఈ మురికినుంచి బయటపడమని తొందరపెడుతూ వుండేది.

మనోరమ తొందరపడకూడదు. న్యాయస్థానంలో ఏ దుర్దశ కలగకుండానే ఈ పోట్లాట పరిష్కారం అయేపరిస్థితి రావచ్చు అని భూషణ్ అభిప్రాయం.

'నేను ఒప్పుకోను' అన్నాడు భూషణ్. 'పత్రికలలో పెద్దపెద్ద అక్షరాలలో కమ్యూనిస్టు యువతినుంచి నపుంసకుడైన భర్తకు విడాకులు అని ప్రచురింప బడటం! తర్వాత సీతావగ్గర ఏ డాక్టరున్నాడు, అవసరమైన సర్టిఫికెట్టు ఇవ్వ డానికి?'

సుతలీవాలా, మనోరమలు మాట్లాడుకోవటం లేదు. భోజనంచేసే ఖర్చు కూడా విడివిడి అయిపోయింది. సుతలీవాలా పదిహేనురోజుల కొకసారి మనో

రమకోసం ఒక కవరు నౌకరుకిచ్చి పంపేవాడు. ఆ కవరులో వందరూపాయలుండేవి. ఇదేవిధంగా నెలలు గడిచిపోయాయి. ఒక సంవత్సరం గడిచిపోయింది. రెండో సంవత్సరం గడుస్తోంది. మనోరమ పార్టీ మెంబరు అయిపోయింది కానీ ఆమె పనంతా సీతాతో కలిసే చేసేది. సీతాతో తప్ప మరేదైనా పనిలో చేయి చేసుకోవాలన్న కోరికగూడా ఆమెకు లేదు.

# ఆశ్రయం విలువ

లాహోర్ స్టేషన్‌లో సోమా బురఖా వేసుకుని రైలుబండిలో కూర్చుని కళ్ళు తుడుచుకుంది. ఇక ఏడవకూడదని నిశ్చయించుకుంది. 'బండిలో ఏడుస్తూకూర్చుంటే మిగతా ప్రయాణీకులకు అనుమానం కలుగుతుంది. పోలీసులు మధ్యలో వచ్చిపడితే ఇద్దరూ సంకెళ్ళలో బంధింపబడాల్సి వస్తుంది' అని బరకత్ చెప్పాడు.

సోమా ఇప్పుడు ఏడ్చినా ఏ విషయంగురించి. దేనికోసం ఏడుస్తుంది? ఎవరికోసం ఏడుస్తుంది? ఆ బంగళా వదిలిపెట్టేటప్పుడు ఆమెకు చచ్చిపోవడం కన్నా వేరే ఉపాయం తట్టలేదు. అలా వదిలిపెట్టి వచ్చినచోటికి, వెళ్ళగొట్టబడిన చోటికి, తిరిగివెళ్ళటానికి ఆమె సిద్ధపడలేదు. గడచిపోయిన ఆ భయానకమైన అనుభవాలకన్నా ఈ తెలియని భయం చాలా తక్కువ. ఏవిధమైన ఆశగానీ, భవిష్యత్తుకు సంబంధించిన ఆశగానీ ఆమె మనసులో లేదు. ఆమె కేవలం నెత్తిమీద వచ్చిపడిన ఆపదనుంచి శరణు కోరుతోంది.

వైటీనార్ జిల్లా న్యాయస్థానంలో పోలీసులు ధనసింగ్‌ను జైలులో పడవేయటానికి లాక్కువెడుతుంటే ఆమె రోడ్డుమీదకూర్చుని అందరి ఎదుట వెక్కివెక్కి ఏడ్చింది. అక్కడి ప్రజలంతా ఆమెచుట్టూమూగి ఆ తమాషా చూడసాగారు. ఆ దృశ్యం ఆమెకు జ్ఞప్తికి వచ్చింది. ఇప్పుడు ప్రాణాలు పోయినాసరే, ఆమె అవిధమైన తమాషాను కల్పించలేదు. ఆ పల్లెటూరి సోమా చచ్చిపోయింది. ఇప్పుడు ఈమె మరో సోమా, పెద్దఇంటి గృహస్థురాలు, వంచించబడి, ఇంటి నుంచి వెళ్ళగొట్టబడిన విధవ।

బరకత్ సోమాని తీసుకుని లాహోర్ స్టేషన్‌నుంచి జాగ్రత్తకోసం రాత్రి పూట బయల్దేరాడు. బండిలో కూర్చునేటప్పుడు, ఆ తర్వాత గంటవరకు సోమా బురఖాతోనే వుంది. లాహోర్‌నుంచి బయటపడిన తర్వాత 'మనల్ని ఎవరూ గుర్తు పడతారన్న భయముండదు. నువ్వు బురఖాతీసేసి బట్టలలో చుట్టేసెయ్' అని బరకత్ చెప్పాడు. తపాలా తీసుకువెళ్ళేబండి తన వేగాన్నీ, హడావిడినీ తెలియపరచేందుకు పొగ వదులుతూ వేగంగా అనేకరకాలైన శబ్దాలు చేస్తూ, ఇనుపపట్టాల

మీద ఇటూ అటూ కదులుతూ, వూగుతూ, గాఢమైన అంధకారాన్ని చీలుస్తూ, వెళ్ళిపోతోంది. చిన్నచిన్న స్టేషనులు రెప్పపాటుకాలంలో దాటుతూ వెళ్ళిపోతు న్నాయ్. బండి ఒక్కసారి బయలుదేరి మళ్ళీ ఆగేనరికి అనేకరోజుల ప్రయాణం సాగిపోతోంది. కానీ బండి వెళుతూనేవుంది. బండి ఆగితే స్టేషన్‌లదగ్గర వెలుతు రులో కనిపించేవాళ్ళముఖాలు, పంజాబీభాషకన్నా భిన్నంగావున్న భాష వినిపిస్తోంది. కానీ అంసివున్న సోమా కళ్ళు ఏమీ చూడలేకపోతున్నాయి. నిశ్చేష్ఠత చెందిన ఆమె మస్తిష్కం ఏమీ ఆలోచించడం లేదు.

తా మిద్దరూ బొంబాయి వెళుతున్నారని బరకత్ సోమాతో చెప్పాడు. బొంబాయి ఎక్కడో చాలా దూరమని సోమా విన్నది. ఎంతదూరమో ఆమెకు తెలియదు. ఎంతదూరమైనా కాని. దూరమైనా, దగ్గరైనా ఆమెకేం? మళ్ళీ తిరిగి రావలసిన పనేముంది?

బండిలో చాలా వత్తిడిగానూ, తొక్కిసలాటగానూ, తోపిడిగానూ వుంది. సుమారు రెండు సంవత్సరాలక్రితం సోమా ధర్మశాలనుంచి లాహోర్ వచ్చినప్పుడు అది వేరేరకం బండి, ఆమెను సెకండ్ క్లాసులో తనతోపాటు మనోరమ కూర్చో బెట్టుకుంది. అందరికీ కూర్చోవడానికి, పడుకుని నిద్రపోవడానికి మెత్తటి పరుపు లున్న బల్లలున్నాయి. ఎవరూ ఇంకొకళ్ళని తోయడంలేదు. పెద్దమనిషితనం వుండి. ఈ బండిలో త్రోపుడే-త్రోపుడు, పోట్లాటలు. బరకత్ ఆమెను ఒకమూల, చెక్క బెంచీమీద బట్టపరిచి కూర్చోబెట్టాడు. అతనుగూడా పక్కనే కూర్చున్నాడు. సోమా అతని స్పర్శనుంచి తప్పించుకోవడానికి ముడుచుకు కూర్చుంది. బరకత్ కునికిపాట్లు పడసాగాడు. కానీ సోమా కళ్ళు మూసుకునీ, కళ్ళు తెరుచుకునీ, మెలుకువగా ముడుచుకుని కూర్చుంది.

బరకత్ తన ఎడంవైపు కొంచం ఖాళీచోటు ఏర్పరచాడు. సోమాని పడుకో మని చెప్పాడు. సోమా మోకాళ్ళు ముడుచుకుని పడుకుంది. బరకత్ కూర్చునే వున్నాడు. కొత్త ప్రయాణీకులువచ్చి తోపుతోప కూర్చోవడానికి స్థలం కోరారు. బరకత్ చొక్కాచేతిని మడిచి—'కనిపించటంలేదా! ఆడవాళ్ళు పడుకునివుంటే' అని పోట్లాడడానికి సిద్ధమయ్యాడు. సోమా బరకత్ రక్షణలోకి వెళుతోంది. బర కత్ ఆమెను తీసుకువెళుతున్నాడు.

ఉదయం పొద్దెక్కిండి. ఏదో ఒక పెద్దస్టేషను వచ్చింది. బరకత్ ఢిల్లీ అని చెప్పాడు. సోమా ఏమీ పట్టించుకోలేదు. ఏదో ఒకటి. ప్రజలు ఎక్కి లోపలికి వస్తున్నారు. బరకత్ జాగ్రత్తగా వున్నాడు. ఏదైనా సురక్షితమైన చోటుకారికితే సోమాని కూర్చోబెట్టి బాధనుంచి తప్పించవచ్చునని చూస్తున్నాడు. ఈ పన్నెండు గంటలలో సోమా తను కూర్చున్నచోటునుంచి కదలలేదు. బరకత్ ఏమైనా తింటావా అని అడిగాడు. సోమాకు ఏదైనా కొంచం తిని రెండురాత్రులు, పగళ్లు గడిచిపోయాయి. అయినాకూడా వద్దని తల ఆడించింది. బరకత్ ఆమె చెవిలో ప్రేమగా 'ఏం పిచ్చిదానివా, మనిషి ఏమీ తినకుండా జీవించగలుగుతాడా, చేతులు ముఖం కడుక్కుంటావా?' అన్నాడు.

సోమా సరే నన్నది. బరకత్ సన్నలోటాని తీసుకొచ్చాడు. అది పట్టుకెళ్ళి ప్లాట్‌ఫారంనుంచి నీళ్ళు తీసుకొచ్చాడు. ఆ చెంబును చూడగానే సోమామనను బాధతో కొట్టుకుంది. ఎవరైనా మునల్మానుచేతిలో అమ్ముడు పోతానేమోనన్న ఊహతో ఆమె ప్రాణాలు ఎగిరిపోసాగాయి. ఇప్పుడు ఆమె మునల్మాను చేతినే పట్టుకుని రక్షించమని వేడుకుంటోంది. అతని చెంబుచూసి పట్టింపు ఏం వుంటుంది?

కిటికీలోనుంచి తల బయటకుపెట్టి చేతులు ముఖం కడుక్కుంది. కానీ ఆ లోటాలోని నీళ్ళు నోట్లోపోసుకుని పుక్కిలించలేకపోయింది. బరకత్ ఆమెకోసం మట్టిపిడతలో టీ తీసుకువచ్చాడు. మునల్మాను ముట్టుకున్న పిడత అది. మనస్సులో చాలా బాధ అనిపించింది. కానీ టీ త్రాగేసింది. మయొకాలో ఆమెకు మునల్మాను లంటే అంతులేని భయం, అసహ్యం కలిగేవి. ఆమె మునల్మానులను ఒక నీచ జాతివాళ్ళుగా చూచేది. వాళ్ళని తాకితే ధర్మం చెడిపోతుందని, వాళ్లు అన్ని చెడు పనులూ చేస్తారని ఆమె విన్నది. కానీ లాహోర్‌లో బంగళాకు ఆయన స్నేహితులు అనేకమంది మునల్మానులు వచ్చేవాళ్ళు. వాళ్ళకి ఏ నియమమూ, పట్టింపూ వుండేవికావు. వాళ్ళు ఇంట్లోని పళ్ళాలలోనే తినేవాళ్లు. అమ్మగారికి, వదినగారికీ మాత్రం ఇది నచ్చేది కాదు. సోమా గుంపులో నొక్కిడిచేత, తోపుళ్ళవల్ల దెబ్బలు తింటూ వెళుతోంది. ఇంకా కొన్ని స్టేషనులుదాటి వెళ్ళిపోయాయి. బరకత్ హిందూ మతస్థుడయిన ఒక పూరీలు అమ్మేవాణ్ణి పిలిచాడు. సోమా పూరీలు తిన్నది. మళ్ళీ అదేచెంబుతో నీళ్ళు. ఆమెగొంతు ఎండిపోతోంది. నాదేం పోతుంది అనుకుని పరాజయాన్ని లక్ష్యపెట్టక నీళ్లు తాగేసింది.

చెక్కతో చేసిన రైలుపెట్టి ఇనుపపట్టాలమీద వేగంగా పరుగెత్తుతూ వెళ్ళి పోతోంది. పొలాలు, పల్లెటూళ్ళు, అడవులు, పర్వతాలు వెనక్కి పరుగెత్తుతూ పోతున్నాయి. బొంబాయి ఎప్పుడు చేరతామనిగాని, బొంబాయి ఎంతదూర ముం దనిగాని సోమా ఒక్కసారిగూడా అడగలేదు. ఇరుకైన చెక్కబల్లమీద ముడుచు కుని కూర్చుంది. మళ్లీ రాత్రి వచ్చింది. సోమా మోకాళ్ళు ముడుచుకుని నిద్ర పోయింది. మళ్ళీ తెల్లవారింది. చెక్కపెట్టి వెళుతూనేవుంది. ఇప్పుడు సోమా కొద్దిగా ఆలోచించడం మొదలుపెట్టింది. ఏం చేస్తుంది? సమాధానం సూటిగా వుంది. ఏది చేయాల్సివస్తే అది చేస్తుంది. బరకత్ ఆమెకు దగ్గరగా కూర్చుని వున్నాడు. అతనికి ఇంత దగ్గరగా కూర్చోవడం ఆమెకు నచ్చడం లేదు. కానీ ప్రపంచంలో మిగతా అందరిలో అతను ఒక్కడే పరిచయంవున్న వ్యక్తి. తనకి ప్రపంచమంటే భయం. దానిమధ్యలో అతను ఒక్కడే తనకి ఆధారం, కావలసిన వాడు.

బరకత్ లాహోర్‌లో ఎంత అమర్యాదగా ప్రవర్తించేవాడో, అలా రైలు బండిలో ప్రవర్తించలేదు. సోమాతో అవసరమైన మాటలుమాత్రమే మాట్లాడు తున్నాడు. అప్పుడప్పుడూ కిటికీలోంచి తల బయటకుపెట్టి రైలుమోతలో కలిసి కూనీరాగం తీస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు పూర్తిమౌనంగా, గంభీరంగా కూర్చో సాగాడు. బొంబాయి చేరినతర్వాత ఏం చేయాలా అని ఒకవేళ అతనుగూడా ఆలో చిస్తూ వుండివుండచ్చు.

మరోయానుంచి ధర్మశాలవచ్చి ఆ మనుష్యులగుంపు చూడగానే సోమాకు ఆశ్చర్యం కలిగింది. లాహోర్‌లో ఆ ఆశ్చర్యం అపదరూపంలో ఎదురయింది. బొంబాయిలో 'విక్టోరియా' బండిలో ఎక్కి బజారులలో తిరుగుతూ రెండువైపులా చాలా ఎత్తుగావున్న ఇళ్ళు, ప్రజలతో కిటకిటలాడుతున్న రోడ్లు, వందలు, అసం ఖ్యాకరూపంలో స్త్రీ పురుషులను చూసి ఆమె ఆలోచనలు, కల్పనాశక్తి స్తంభించి పోయాయి. ఈ క్రిక్కిరిసిన జనులగుంపులో ఆమె బరకత్‌ను తప్ప ఇంకెవరినీ ఎరగదు, గుర్తు పట్టలేదు. ఆ ప్రజల తోపిడిలో తప్పిపోగలనన్న అనుమానంతో ఆమె మోటుగావున్న అతనిచేతిని పట్టుకోవడం తప్ప ఇంకేం చేయగలదు?

బరకత్ సోమాని నల్-బజారుదగ్గర ఒక చిన్న హిందువులహోటల్లో

దింపాడు. ఎవరైనా అడిగితే బర్కత్‌రామ్ భార్యనని చెప్పమనీ, జ్వరంగా వుండటం చేత మందుకోసం పంజాబునుంచి వచ్చామనీ చెప్పమన్నాడు. దొంగలవిషయంలో జాగ్రత్తగా వుండమని హెచ్చరించి, వివాసానికి వేరేచోటు ఏర్పాటుచేయడానికి వెళ్ళిపోయాడు. ఇరుకుగా ఇబ్బందిగావున్న ఆ హోటల్ గదిలో సోమాకు రెండు రాత్రులు వుండాల్సి వచ్చింది. బరకత్ పగటిపూట రెండుసార్లువచ్చి గంట వుండే వాడు. రాత్రిపూటకూడా చాలా ఆలస్యంగా వచ్చేవాడు. సోమా ఏం జరుగుతుందా అవి వీక్షిస్తోంది. బరకత్ ఆమెకోసం తళతళ మెరిసే మూడు చౌకబారుచీరలు తీసుకొచ్చాడు. సోమాకు సినిమా ఉద్యోగం చూస్తున్నానని రాత్రి చెప్పాడు. 'ఇటు వంటి ఉద్యోగం దొరికితే వందలకొలది రూపాయలజీతం వస్తుంది. ఇల్లు, బంగళా, కారు, నౌకర్లు-చాకర్లు, అన్నీ ఏర్పడుతాయి. రాణివాసం ఏర్పడుతుంది. గాభరా పడకు, ఇంకా మూడు నాలుగురోజులు పడుతుంది' అన్నాడు. సోమాతో విన యంగా, గౌరవంగా వ్యవహరిస్తూ వస్తున్నాడు.

• • •

బరకత్ బొంబాయిలో ఇంతకుముందు మూడుసంవత్సరాలు వున్నాడు. ఆ నగరంతో అతనికి బాగా పరిచయముంది.

స్కూలు చదివేటప్పుడే అతనొక నటుడు అవుదామని నిశ్చయించుకున్నాడు. అందుకు కావలసిన ముఖ్యగుణాలు - రూపం, దృఢమైనశరీరం, పొడవు, చురుకు దనం, హావభావాలు, యోగ్యత - అన్నీ తనలో వున్నాయని అతని నమ్మకం. సినిమాపాటలు అదేపద్ధతిలో పాడుతూవుంటే పిల్లలు అతన్ని వెంటాడేవాళ్ళు. ఇంటిదగ్గర తనగదిలో పాటపాడటం ప్రారంభించేసరికి, ఇరుగుపొరుగుల ఆడ పిల్లలు, స్త్రీలు తడికల కిటికీల చాటునవుండి గానం వింటూవుండేవాళ్ళు. వివిధ నటుల రూపాల్ని అనుసరించడంకోసం జుట్టుగూడా బాగా పెంచాడు. చంపలమీద జుట్టుగూడా కణతలక్రిందవరకు పొడుగ్గా కత్తిరించాడు. మీసాలు సన్నగా సన్నని గీతలా చేసుకున్నాడు. ముహర్రమ్ చనిపోయిన విచారకరమైన సందర్భంలో నల్లటిచొక్కా కుట్టించుకున్నాడు. ఆ చొక్కాని సమయం - సందర్భం వచ్చి నప్పుడు తెల్లపాంటుతోపాటు వేసుకునేవాడు. అతని రూపంగూడా ఆకర్షణీయ మైంది. అందుకని రొమ్ము విరుచుకుని ఠీవిగా నడిచేవాడు. మణికట్టుమీద రుమాలు

కట్టుకుని, మూరపొడుగున్న ఒక కర్రని చేతులోపట్టుకుని షికార్లకు వెళ్ళేవాడు. మాట్లాడేటప్పుడు మెడ కొంచం వంకరగా పెట్టేవాడు. తలని కొద్దిగా విదిల్చి ముంగురుల్ని నుదుటిమీద పడేసుకునేవాడు.

బరకత్ తండ్రి విద్యుత్‌శాఖలో నౌకరు. కొద్దికొద్దిగా పెరుగుతూ రోజు గడవడానికి సరిపోయే జీతం, ముప్పైఅయిదురూపాయలు నెలసరి దొరకసాగింది. కొడుకు నియమంగా చదివి, ఎంట్రన్స్ పాసైతే పెద్దపెద్ద ఆఫీసర్ల దయవల్ల మంచి ఉద్యోగంలో వేయించవచ్చని అతను ఆశించేవాడు.

బరకత్ శరీరదారుఢ్యం, చక్కని రూపం కారకాలుగా ఎనిమిదవక్లాసు చదువుతుండగానే వివాహం అయిపోయింది. ఆ వివాహంవల్ల బరకత్ తృప్తి చెందలేదు. సినిమాలో శాహ్‌జాదీని పెళ్ళిచేసుకునే కట్టెలుకొట్టేవాని పెళ్ళిలా తన పెళ్ళి జరగాలని అతను ఊహించేవాడు. ఎవరైనా లక్షాధికారి కూతురికి తనపై వ్యామోహం కలగాలని కోరుకునేవాడు. అతను ఆ అమ్మాయిని మోటర్ సైకిల్ మీద కూర్చోబెట్టుకుని ఫట్-ఫట్ మని ధ్వనిచేస్తూ పారిపోతాడు. ప్రజలంతా వెనక పడతారు. కొట్లాకోవడం జరుగుతుంది. లక్షాధికారికూతురు తననితప్ప వేరొకరిని పెళ్ళి చేసుకోవడానికి నిరాకరించేస్తుంది. అప్పుడు లక్షాధికారి ఒక బంగళాను కట్నం రూపంలో ఇచ్చి అతని కుమార్తెపెళ్ళి తనతో చేసేస్తాడు - ఇలా ఉండేది అతని ఊహాస్వప్నం.

బరకత్ వివాహం అతని ఇష్టప్రకారం కాకుండా - తల్లిదండ్రుల నిర్ణయం మీద జరిగింది. అప్పటికి బరకత్ పంధొమ్మిది సంవత్సరాల వయసువాడు. అతనికి ఒక చెల్లెలు, ఇద్దరు తమ్ముళ్ళూ వున్నారు. తల్లి ఆరోగ్యం సరిగా వుండేదికాదు. బరకత్ చెల్లెలు జోహరా ఇంట్లో పనంతా చేస్తూవుండేది. పదిహేను సంవత్సరాల వయసులో జోహరా అత్తవారింటికి వెళ్ళిపోయేసరికి ఇంట్లో పనిచేయడానికి కోడలిని ఇంటికి తీసుకురావాలన్న ఆలోచన బరకత్ తల్లిని బాధించసాగింది. ఇంటిపని చక్కగా చేయగల అమ్మాయినే కోడలిగా ఎన్నుకుంది.

సకీనా తండ్రి అహ్మద్ అలీ నాలుగుసంవత్సరాలక్రితం బ్రతుకు తెరువు కోసం ఆఫ్రికా వెళ్ళిపోయాడు. గ్రామం తిరిగివచ్చాక కూతురు తల్లికన్నా పొడుగ్గా ఎదిగి కనపడింది. కూతురుగురించి ఎన్నోవిషయాలు చూచాయగా అతని చెవిన

వచ్చాయి. కూతురిపెళ్ళి చేయాలని తొందర కలిగింది. అహమద్ కు అమృతసర్ లో వున్న తన బావమరిది పినతండ్రికొడుకైన మియాఁ లియాకత్ పుత్రుడు బరకత్ వచ్చాడు. పెళ్లి అయిపోయింది. అహమద్ తను విదేశంలో సంపాదించినదాంట్లో పిల్లవారికి బాగా కట్నంకూడా ఇచ్చాడు.

బరకత్ మొదటిరాత్రి సకీనాను కలిశాక ఆమె హృదయంలో చాలా కోరిక లున్నాయని తెలిసింది. సకీనాముఖం కాంతిహీనంగానూ, నిరుత్సాహంగానూ వుంది. బరకత్ ఆమెను తాకి రెచ్చగొట్టడానికి సకీనా ఇష్టపడలేదు. తొణికే యౌవనంతో నిండిన అమ్మాయిని మొదటిసారి కలిసినప్పుడు అలా మనసు చంపుకుని కూర్చుని వుండటం బరకత్ కు నిరాశ కలిగించింది. అతను పినిమాపద్ధతిలో తన అధి కారాన్ని వినియోగించాలనుకున్నాడు. చిటికవేసి పిలిచి సకీనావంకచూసి నవ్వేసరికి, వుంగరాలతోనిండిన సకీనాచెయ్యి అతని బుగ్గమీద ఛెళ్లున తగిలింది. ఆ తర్వాత తిట్లుగూడా వినిపించాయి.

బరకత్, సకీనా ఇద్దరూ యౌవనంలో వున్నవాళ్ళే. సకీనా పల్లెటూరితో పెరిగిన పదిహేడుసంవత్సరాల పిల్ల, బరకత్ పట్నంలో పెరిగిన పంధొమ్మిది సంవత్సరాల యువకుడు. అదీకాక బరకత్ మొగవాడు, సకీనా ఆడది. బరకత్ ఆమెను బాగా తిట్టి కొట్టాడు. సకీనాకూడా నెమ్మదిగా ఏడుస్తూ సమాధానమిచ్చింది. బరకత్ బుగ్గమీద వుంగరం దెబ్బవల్ల మచ్చపడింది. అతను చాలారోజులవరకూ తలపాగా చుట్టుకుని చంప కప్పుకుని తిరిగేవాడు. తన స్నేహితులకు కథ అల్లి, చీకటిలో ఒక దొంగతో పోట్లాడటంచేత దెబ్బ తగిలిందని చెప్పాడు.

సకీనాపట్ల బరకత్ మనసు విరిగిపోయింది. 'దుర్మార్గురాలు. చెడుమార్గంలో వుంది' అనుకున్నాడు. ఆమెను హత్యచేయడానికి నిశ్చయించుకున్నాడు. మరో భార్యని తీసుకొచ్చి నెత్తిన పెడతారు అని మళ్లీ ఆలోచించాడు. అందుకని సకీనాని జీవితాంతం దాసీదానిలా వుంచడం మంచిదనుకున్నాడు. బరకత్ మనసులో స్త్రీ సంబంధమైన ఏ మధురభావాలున్నాయో అవన్నీ వికృతరూపాన్ని ధరించాయి. స్త్రీలనుగురించి దురభిప్రాయంలోనే వుండిపోయాడు. అతనిదృష్టిలో స్త్రీ పాముతో సమానం. స్త్రీని ముట్టుకోవడంలోకన్నా దూరంలోనుంచే చూసి ఆనందించటం. అభినందించటంలో అతను ఎక్కువ తృప్తిని పొందేవాడు.

1939 వ సంవత్సరంలో అతనితండ్రి కాలం చేశాడు. ఎంట్రన్సు పాసవ డానికి ఇంకా ఒకసంవత్సరం మిగిలింది. స్కూలుమాస్టర్లకు అతనంటే విరోధ భావం ఏర్పడింది. బరకత్‌కు ప్యాసవుతానన్న నమ్మకం పోయింది. ప్యాసైపె గుమాస్తా అయినతర్వాత రోజంతా ఆఫీసులోగడిపి సాయంత్రం రుమాలలో కూరలు పట్టుకుని, తల వేళ్ళాడేసుకుని, తడికల తలుపుదగ్గరకు తిరిగి చేరే విస్తార మైన జీవితం గడపడం బరకత్‌కు ఇష్టంలేదు.

తను క్లర్కు అవడంకోసం కాదు, ఫిల్ము ప్రపంచంలో 'మజానూ', 'దేవ దాసు' అవడానికి జన్మించాడు. ప్రపంచంలో రాజాగారిలా ఆనందాన్ని అనుభవించ గలుగుతాడు నటుడు. గడ్డి అమ్మేవాడి జీవితపు ఆనందాన్నిగూడా. ఒక్క జీవి తంలో పాతికరకాల జీవితాలు। ఈ ప్రపంచాన్ని వెంటతీసుకుని ఎవరూ పోరు; మనం తినేది, తాగేది, అనుభవించగలిగేదే మన సొంతం. నా వెనుక వందభవనాలు వదిలిపెట్టినా అవి ఎందుకు పనికొస్తాయి? పెద్దపెద్ద భవంతులు, అందమైన స్త్రీలు, రకరకాల దుస్తులూ నటులకి దక్కుతాయి. ఎంతో అందమైనయువతులు వాళ్ళ పక్కన నటించవలసివస్తుంది. వారి హావభావాలు, ప్రతిభ, పరదావేసుకునే స్త్రీల హృదయాలుకూడా ఆపహరిస్తాయి. బంగళాలలోనుండే డబ్బుగల స్త్రీల హృదయా లనుకూడా ఆకర్షిస్తాయి. బరకత్‌కు ప్రసిద్ధులైన నటుల, నటీమణుల అందరిపేర్లు గుర్తుండేవి. వాళ్ళ డబ్బువివరాలు, ఇతరవుకార్లు కూడా। ఏదో ఒకవిధంగా బొంబాయి చేరుదామని అతనికి తొందరకలిగేది. ఆతర్వాత అదృష్టం అదే వరి స్తుంది.

బరకత్‌కు అందరికన్నా పెద్దవాడు, నమ్మదగిన మిత్రుడు, రైల్వే మేస్త్రీ నాసీరుద్దీన్ కొడుకు జమీల్. బరకత్ తన సుఖస్వప్నంగురించి జమీల్‌కు చెప్పాడు. జమీల్‌కూడా ఆ స్వప్నలోకంలోకి చేరడానికి ఆతురత పడుతున్నాడు. అతని ఆర్థిక స్థితిగూడా అంత బాగాలేదు. బరకత్ తల్లిని బ్రతిమాలి, వేలకొలదిరూపాయలు సంపాదించి ఇంటికి పంపుతానని ఆశచూపి, అలిగి, ఇంట్లోనుంచి పారిపోతానని బెదిరించి, 105 రూపాయలు తీసుకున్నాడు. తనభార్య నగలుకూడా కొన్ని రహ స్యంగా తీసుకుని జమీల్‌తోకలసి బొంబాయి చేరాడు. ఇద్దరూ మలాడ్, శాంతా క్రూజ్, దాదర్‌లలో సినిమా స్టూడియోలచుట్టూ తిరగసాగారు. కాపీ స్టూడియో

పఠాను, ద్వారందగ్గరవుండే గూర్ఖా, స్వర్గానికి కాపలాదార్లయిన ఇజ్రాయల్, జిబ్రా యల్ కన్నాకూడా ఎక్కువ జాగ్రత్తగా నిర్మొహమాటంగా అడ్డగించారు. తమ దగ్గరవున్న డబ్బంతా ఖర్చుపెట్టికూడా వాళ్ళు స్టూడియోలోపలికి అడుగు పెట్టలేక పోయారు. కానీ ఇద్దరూ యువకులు, గాఢతపస్సులో వున్నారు. చివరికి ఓరోజు వాళ్ళకి లోపలికివెళ్ళే అవకాశం లభించింది. ఇద్దరికీ సినిమా రెస్టారెంటులో చోటు దొరికింది. నెలంతరబడి విస్కీ-సోడాగ్లాసులు, టీ కప్పులూ, ప్లేట్లు కడిగిన తర్వాత తాము బొత్తిగా అనుభవశూన్యులమని వారికి అవగాహనమయింది. సినిమారంగంలో ప్రవేశించటానికి ఒక అందమైన అప్సరస పక్కన వుండటం చాలా అవసరం. ఆ ప్రపంచంలో అందమైన స్త్రీలవిలువ దేవదూతల విలువకన్నా కొంచం ఎక్కువ గానే వుంటుంది.

సినిమాకంపెనీ యజమానిగారి కారుడ్రైవర్ మురీద్‌ఖాన్ పంజాబీ రాజపుత్ర ముసల్మాను. అతను ఒకరోజు బరకత్‌ని, జమీల్‌ని బాగా చివాట్లు పెట్టాడు. 'పఠాన్ కొడుకులై ఇక్కడ ఈ వేశ్యలు తాగిపడేసిన ఎంగిలికప్పులు కడుగు తున్నారా!' అని కోప్పడ్డాడు. ఇద్దరికీ ఒక మోటర్ మరమ్మత్తుచేసే కార్ఖానాలో అతను ఉద్యోగం ఇప్పించాడు. జమీల్ మేస్త్రీపని నేర్చుకోసాగాడు. కాని బరకత్‌కు ఆపని నచ్చలేదు. కొద్దిరోజులు అతను కార్ఖానాలో కూలిపని చేశాడు. ఒక టాక్సీ వానికి క్లీనరుగా కుదిరి డ్రైవరుపనిగూడా నేర్చుకున్నాడు. బరకత్‌కు బస్సు కంపె నీలో ఉద్యోగం దొరికింది కానీ అతను ఆ పని చేయలేకపోయాడు.

బరకత్‌కు టాక్సీ నడపటం అంటే చాలా ఇష్టం. అందులో స్వాతంత్ర్యత వుంది. మిత్రులలో కూర్చుని గొప్పగా చెప్పేవాడు—'అరేయ్, ఇవ్వాళ ఒక అంద మైన లేడీ కిరాయి దొరికింది. నన్ను ఎంతగా మోహించిందంటే టాక్సీనుంచి దిగ డానికే ఒప్పుకోలేదు. బాడుగ ఇవ్వబోయేసరికి నేను తన్నుకొట్టి నవ్వాను. పది- పదిని రెండునోట్లు ఇచ్చింది. తన బంగళాకు రమ్మనిచెప్పింది....' ఇటువంటి కథలు వినిపించేవాడు. నిజంగానే అటువంటి సుఖాన్నిపొందిన ఆనందం అతనికి కలిగేది. సినిమాతో సంబంధం వుండేవాళ్ళనిగూడా ఎక్కించుకుని తిరిగేవాడు. అప్పుడప్పుడూ ఎక్స్‌ట్రాలను డబ్బు తీసుకోకుండానే ఎక్కించుకునేవాడు.

బరకత్ జబ్బుపడి పంజాబు తిరిగివచ్చాడు. ఇంట్లో పరిస్థితి బాగాలేదు.

ఒక తమ్ముడు మిల్లులో 'గేట్-కీపర్'గా చేరాడు. చిన్నతమ్ముడు బంధువుల మగ్గాల కార్ఖానాలో తరిఫీదవుతూ పదిహేనురూపాయలు సంపాదిస్తున్నాడు. తల్లికి ఇదివర కటికన్నా జబ్బు ఎక్కువయింది. అతని భార్యవల్ల పోట్లాటలు ఎక్కువ అయాయి. 'అల్లుడు చెడుమార్గంలోపడిన దేశద్రిమ్మరి. అమ్మాయిని అత్తవారింట్లో వాళ్ళు బాధపెడుతున్నారు।' అని సకీనా తల్లి తండ్రి అంటున్నారు.

సకీనా తన పినతండ్రిగారి కుమారుని వివాహానికి గ్రామం వెళ్ళింది. మళ్ళీ తిరిగి రాలేదు. ఆమె అన్న ఆమెను ఇంట్లోనే వుంచేశాడు. 'ఎవరికైనా ధైర్యం వుంటే వచ్చి తీసుకెళ్ళమను।' అన్నాడని వదంతి. బరకత్‌కు గ్రామంలో వుండటం నచ్చలేదు. లాహోర్‌వెళ్ళి ఉద్యోగం అన్వేషిస్తూ బారిస్టర్ సరోలాకు చాలా సర్టిఫికెట్లు చూపించాడు. ఆయన అతన్ని డ్రైవరుగా పెట్టుకున్నారు. బొంబాయి తిరిగి వెళ్ళి సినిమాలో పనిచేయాలన్నకోరిక బరకత్ మనసులో అలాగే వుండిపోయింది.

హోటల్లో రెండురోజులుండి బరకత్ సోమాని 'మహిమా' తీసుకెళ్లాడు. జమీల్ అతనికి తనపక్కన ఖాళీగావున్న ఖోలీ (గది) ఇప్పించాడు. రేషన్‌కార్డు గూడా తయారుచేయించాడు. యుద్ధపురోజులు. బొంబాయిలో రేషన్‌కార్డు లేకుండా పిండి పప్పుకూడా దొరకటం దుర్లభంగా వుంది. ఆ పేటలో అనేకమైన ఎత్తైన మూడంతస్థుల ఇళ్లు, భవనాలు ఎదురుబదురుగా వున్నాయి. క్రింద అంతస్థులలో సుమారు అందరూ నాగరా చెప్పులు కుట్టేవాళ్లు వుండేవాళ్ళు. ఒక్కొక్క వాటాలో చాలా పరివారాలు వుండేవి. సూర్యునివెలుగు వున్నంతవరకూ మాదిగవాళ్ళు, వాళ్ళ భార్యలు వసారాల్లో కూర్చుని చెప్పులు కుడుతూ వుండేవాళ్లు. సాయంకాలం అవగానే మొగవాళ్ళు చెప్పులు అమ్మడానికి వెళ్లిపోయేవాళ్ళు. స్త్రీలు వంట వండటంలో నిమగ్నులైపోయేవాళ్లు. ఒక్కొక్కగదిలో రెండు మూడు పొయ్యిలు మండుతూ వుండేవి. గదులన్నీ పొగవల్ల నల్లబడిపోయాయి. స్నానం చేయడం, బట్టలు వుతకడంవల్ల, అంట్లగిన్నెలు తోమడంవల్ల మురదనీళ్ళు ఎప్పుడూ ప్రవహిస్తూవుండేవి. ప్రతి అంతస్థులోనూ విడివిడిగా స్నానపుగదులు, మరుగుదొడ్లు వున్నాయి. ఎదురుగా చెప్పులు కుట్టేవాళ్ళ బట్టలు పశువులచర్మం మాదిరిగానూ, వాళ్ళభార్యల ఎరుపు-నలుపు రంగులలోవున్న పెద్దలంగాలు గొడుగుగుడ్డలమాదిరిగా ఎండుతూ వుండేవి. ఈ బట్టలవల్ల, చర్మంనుంచివచ్చే దుర్గంధంవల్ల భవంతి అంతా వాసన కొడుతూ వుండేది.

క్రిందగదులకు పై అంతస్థులో ఈ చెప్పులకుట్టేవాళ్ళకన్నా మంచి ఆర్థిక స్థితిలోనూ, సామాజికస్థితిలోనూవున్న - కార్ఖానాలలో పనిచేసే కూలివాళ్లు, పీద క్లర్కులు, డ్రైవర్లు మొదలైనవాళ్ళు వుండేవాళ్లు. ఈ గదులలోకూడా చాలామంది మనుషులు, పరివారాలు కలిసివుండేవాళ్లు. అక్కడే మనుష్యులు జన్మిస్తూవుంటారు, జబ్బుపడినవాళ్లు. ముసలివాళ్లు పుట్టేవాళ్ళకోసం చోటు వదిలిపెట్టి చచ్చిపోతూ వుంటారు.

జమీల్ బరకత్‌కోసం మూడుకుటుంబాలు వుండదగిన గదిలో చౌకలో ఏర్పాటు చేయగలిగేవాడు. కానీ బరకత్ సోమాకు వీలుగా వుండాలన్న ఆలోచనతో ఎక్కువ అద్దె ఇచ్చి గదంతా తీసేసుకున్నాడు.

సోమా మహీమ్‌లోని ఈ గదిలోకివచ్చి చాలా భయంచెందింది. మొదటి రోజయితే బరకత్ పంపునుంచి నీళ్ళు, దగ్గరలోవున్న దుకాణంనుంచి భోజనం తీసుకొచ్చి ఇచ్చాడు. కానీ రోజూ ఇదంతా చేయడం అతనికి కుదరదు. 'గోధుమ పిండి, పప్పు, బియ్యం, పంచదార తెచ్చుకోవడంకోసం పచారీదుకాణం ఎదురుగా రేషన్‌కార్డు తీసుకుని గంటలతరబడి నిలబడాల్సి వస్తుంది. నేను ఉద్యోగాన్వేషణ కోసం వెళ్ళనా లేకపోతే దుకాణం ఎదురుగా 'క్యూ' లో నిలబడనా? పక్కనే దుకాణం వుంది. స్త్రీలకు తొందరగా దొరుకుతుంది. నువ్వే వెళ్ళి తీసుకువస్తూ వుండు' అని బరకత్ సోమాతో చెప్పాడు.

లాహోర్‌లో ఇంట్లోకి కావలసిన సామాను తేవడానికి సోమా కారులో వెడుతూవుండేది. బొంబాయిలో రేషన్ దుకాణం ఎదురుగా ఫర్లాంగు ఫర్లాంగు పొడవైన క్యూలు వుంటాయి. ఒక్కొక్క అడుగూ జరుగుతూ సోమాకి గంటల తరబడి గడచిపోయేవి. 'ఈ రేషన్‌కన్నా ఎక్కువధరకి కొనడం మంచిది, లేక పోతే తినకుండా పడుకోవడం మంచిది' అనుకునేది సోమా. వంటచేసి బరకత్‌కోసం నిరీక్షిస్తూ వుండేది. 'గాభరాపడకు, నేను తొందరలోనే నీకు సినిమాలో పనిచేసే ఏర్పాటు చేస్తాను. నేను అవసరమైనవాళ్ళని కలుసుకుంటున్నాను' అని బరకత్ వచ్చి ధైర్యం చెప్పేవాడు.

పక్కగదులలో వున్నస్త్రీలు సోమాతో మాట్లాడాలని ఉబలాటపడ్డారు. రెండు మూడు పరివారాలుకలసి ఒక్కొక్కగదిలో వుంటూవుండేవాళ్లు. వాళ్ల

సోమాని తమవద్ద కూర్చునేందుకు, తమతో మాట్లాడేందుకు పిలిచారు. కాని ఆమె వాళ్ళదగ్గర ఒక్క క్షణంకన్నా ఎక్కువసేపు వుండలేకపోయింది. ఎడమవైపున గది లోనివాళ్లు దక్షిణప్రాంతంవాళ్ళు. సోమా వాళ్ళభాషనికూడా అర్థం చేసుకోలేక పోయింది. పక్కగదిలోవున్న ఆమెభర్త డ్రైవరు. మంచి ఉద్యోగం వెతుక్కుం టున్నాడు. పక్కవాళ్ళుగూడా సోమాని గదంతా తీసుకుని డబ్బుని అనవసరంగా ఖర్చుపెట్టేవాళ్లుగా తలచి ఎక్కువగా మాట్లాడలేదు.

సినిమాపని నే నెలా చేస్తాను? అనుకుంది సోమా. బారిష్టర్ జగదీశ్‌మీద మనసులో ద్వేషం కలిగినాకూడా అతని సంపర్కంవల్ల పొందిన తన ఆకర్షణపట్ల ఆమెకు విశ్వాసం వుంది. తన కంఠమాధుర్యంమీదకూడా నమ్మకం వుంది. కానీ అటువంటిపని అందరిఎదుట ఎలా చేయగలుగుతుంది అని ఆమెకు సందేహం కలిగేది. ఆమె చాలాసార్లు సినిమా చూసింది. చూడటానికి బాగావున్నట్లు అనిపిం చింది కానీ తను స్వయంగా అందరిఎదుటకు వెళ్ళటం, పాడటం, ఆమెకు అవమాన కరంగానూ, సిగ్గుగానూ అనిపించేది. బరకత్ సంపాదించాలనీ, తను ఇల్లు చక్క బెట్టాలనీ అనుకునేది కానీ ఈ మాట ఏ అధికారంతో అతనితో అనగలదు?

మహీమ్ వచ్చినతర్వాత బరకత్ బెరుకులేకుండా సోమాతో అధికార యుతంగా మాట్లాడసాగాడు. పరిహాసం, వేళాకోళంకూడా చేయడం మొదలు పెట్టాడు. ఆమె మెదలకుండా వుండిపోయేది. ఒకసారి లాహోర్‌లో బరకత్ ధైర్యంచేసి పరిహాసం చేశాడు—'అమ్మగారూ, కొంచెం బీదవాళ్ళనిగూడా దృష్టిలో పెట్టుకోండి!' అన్నప్పుడు, అది విని సోమా నుదుటిమీద ముడుతలు పడ్డాయి. 'ఏంటి వాగుతున్నావ్! ఏదన్నా చెప్పాలనుకుంటే అయ్యగారితో చెప్పుకో!' అన్నప్పటి సోమా ముఖాకృతి మాటిమాటికీ గుర్తుకు రాసాగింది. బరకత్ ఇప్పుడు కూడా సోమా మౌనంగా వుండటంచూసి జంకేవాడు, ఏం తిట్టకుండావుంటే ఫరవా లేదు అనుకున్నాడు.

సోమా ఏమీ విసుక్కునేది కాదు, సంతోషించేదీ కాదు. టీ గానీ భోజనం గానీ తయారుచేయాలని ఒంకపెట్టి తప్పించుకుపోయేది. ఏదైనా మాటనుగురించి బరకత్‌ను పిలవాల్సివస్తే అనునయంగా 'అన్నా' అని పిలచేది. విసుక్కోవడం, తిరస్కరించాల్సిన పరిస్థితి సోమాకు ఎప్పుడూ కలిగేదికాదు. తనంతట తానే అన్నిం

టికి ఒప్పుకుని బరకత్‌తోపాటు, అతని ఆశ్రయంలోకి వచ్చింది. ఆమె అన్ని విధాలుగానూ అతని దయకోసం ఎదురుచూస్తూ వుండేది. బరకతే ఆమెకోసం అన్నీ చేస్తున్నాడు. అటువంటప్పుడు బరకత్‌ని ఏ ముఖంతో ఎదిరించటం, తిరస్కరించటం చేయగలుగుతుంది? మొగాడు స్త్రీని తన ఆనందంకోసమే పోషిస్తాడు, సహిస్తాడు. కేవలం ఒక్క ఉపాయం ఆమెదగ్గర వుంది. బరకత్‌ని అన్నా అని పిలిచి, అతని హృదయంలో ఏవిధమైన కోరిక కలగకుండా సహృదయతతోకూడిన భావాల్ని లేపడానికి ప్రయత్నించేది. సోమా పనీ-పాటలను గురించినమాటలు మాట్లాడేది. 'అన్నా, పనిమానని నావల్ల ఎలా అవుతుంది? నాకు అంత నేర్పు ఎక్కడుంది? అన్నా, నువ్వు రోజంతా బాధపడి అలసిపోతున్నావ్. అది దొరక్కపోతే నాకు ఎవరిఇంట్లోనైనా పనిచేసే ఉద్యోగం ఇప్పించు. అన్నా, ఇది చాలా పెద్దనగరం, ఇక్కడ నీకు మంచి ఉద్యోగం దొరకవచ్చు' అని చెపుతూవుండేది.

బరకత్ రాత్రికి తిరిగివచ్చేసరికి సారాత్రాగి వుండేవాడు. ఆ సారా దుర్గంధం సోమా హృదయాన్ని వికారపెట్టసాగేది. బారిస్టర్ అప్పుడప్పుడూ త్రాగేవారు. అయినా ఆ పానీయంవల్ల అంత చెడువాసన వచ్చేదికాదు. చాలాసార్లు ఆయన సోమానిగూడా తన గ్లాసులోంచి గుక్క నింపుకోమని బలవంతం చేశారు. త్రాగి ఆయన రకరకాలమాటలు మాట్లాడుతూ గొడవ చేసేవారు. ఆ సమయంలో ఆయన మంచి మత్తువల్లకలిగే సుఖం కలిగేది. సోమాకు ఇప్పుడు ఆ స్మృతి చాలా అయిష్టంగానూ, అవమానకరంగానూ తోచింది. అదంతా మళ్ళీ జరుగుతుందా? లేదు, ఇప్పుడయితే గాలిపటంతెగి క్రింద మురికిగుంటలో పడిపోయింది. ఇంకా ఏం నాశనం అవుతుంది? అప్పుడు గాలిపటం ఎంత ఎత్తున ఎగిరింది—అని తనలో తాను అనుకునేది.

సోమా బరకత్‌కు భోజనంపెట్టి, తను తిని పళ్ళాలు, గిన్నెలు తొలవడానికి కూర్చునేది. ఇంతలో బరకత్ నిద్రపోయేవాడు. సోమా దీపం ఆర్పేసి చీకటిలో కళ్ళు తెరుచుకునే పడుకునేది. 'ఇలా ఎన్నాళ్ళు సాగుతుంది? నా విషయం ఏమవుతుంది?' అని ఆలోచిస్తూవుండేది. సోమాకు స్టూడియోలో చోటు వెతుకుతూ బరకత్‌కు మూడువారాలు గడచిపోయాయి. అతను జమీల్ దగ్గరనుంచి నలభై అప్పు

తీసుకుని వాదేశాడు. ఎక్కడికి వెళ్ళినాకూడా 'ఏక్స్ట్రా ఏజన్సీతో మాట్లాడు' అనే సమాధానం వినిపించేది. అతను నిరాశ పడేవాడు.

బన్‌వారీ బరకత్‌కు పాత పరిచయస్తుడు. కష్టకాలంలో 'ఎక్‌స్ట్రా ఏజన్సీ' పనిచేసేటప్పటినుంచి బరకత్‌కి పరిచితుడు. బరకత్ అతన్నిచూసి, 'అరే! మేము అన్నంతినేది కష్టపడి పనిచేసిరా!' అని నవ్వేవాడు.

బన్‌వారీ ఇప్పుడు 'దారేఫౌజ్' కంపెనీలో సంభాషణలు వ్రాసేపని చేస్తున్నాడు. అతను చదువుకున్నవాడని బరకత్‌కు తెలీదు. బరకత్ బన్‌వారీతో సోమా అందంగురించి, ఆకర్షణంగురించి పొగిడి చెప్పాడు—'మిత్రుడా, ఒక రత్నాన్ని పట్టుకొచ్చాను. పంజాబు కొండప్రాంతంనుంచి! ఆమెకు స్టూడియోలో ఎక్కడైనా చోటు చూపించు.'

'తమ్ముడూ, ఏజెన్సీవాళ్ళతో చెప్పు. లేకపోతే వాళ్ళకు కోపమొస్తుంది. నువ్వు ఇవ్వాళ ఒకదాన్ని తీసుకొచ్చి ఇస్తావు. రేపు పాతికమంది అవసరమైతే ఎవరు సమకూరుస్తారు? ఈ తలనొప్పి ఎవరు భరిస్తారు' అన్నాడు బన్‌వారీ.

బరకత్ ఎక్‌స్ట్రా ఏజన్సీవాళ్ళంటే భయపడేవాడు. వాళ్ళవశంలో ఎవరైనా పడితే జీవితాంతం ఎక్‌స్ట్రాలుగా వుండాల్సిందే. రక్తం తాగుతారు. కంపెనీనుంచి ఒక్కొక అమ్మాయికి పదిరూపాయలచొప్పున తీసుకుంటారు. వీదవాళ్ళకేమో అయిదురూపాయలు ముట్టచెపుతారు. ఫ్రీమీద ఒక్కసారి వాళ్ళ ముద్రపడితే ఏ కంపెనీగూడా ఆ ఫ్రీని తిన్నగా తమ స్టూడియోలోకి తీసుకోదు. ఈ ఏజన్సీవాళ్ళు బాగా నాట్యంచేసే ఆడవాళ్ళని పది - పదిహేనురూపాయలలో కొట్టుకొస్తారు. సోమాకి ఇంతవరకూ ఏమీ రాదు. వీళ్లు స్టూడియోగేటుకి అడ్డంగా నిలబడతారు. అది చాలా ఇబ్బంది. కమిషన్ తీసుకోకుండా ఎవరినీ లోపలికి వెళ్ళనివ్వరు. డైరెక్టరుగారి పలుకుబడివున్న మనిషయితే ఎవరికైనా చోటు ఇప్పించగలుగుతాడు.

బరకత్ నిరాశచెంది దారేఫౌజ్ స్టూడియో రెస్టారెంటునడిపే జీవాదగ్గరకు చేరాడు. అయిదుసంవత్సరాలక్రితం అతనిదగ్గర ప్లేట్లు కడిగేపని చేశాడు. ఆ సమయంలో రెస్టారెంటుపరిస్థితి అదోలా వుండేది. ఇప్పుడు రెండు సొంతఇళ్లు, ఒక టాక్సీ వున్నాయి. స్టూడియోలో రెస్టారెంటు నడుస్తూనే వుంది. దీనితోబాటు

అతను ఎక్స్ట్రా ఏజెన్సీగూడా చేస్తున్నాడు. బరకత్ జీవాకు తన పాతస్థితిని జ్ఞాపకం చేయకూడదని అనుకున్నాడు కానీ చురుకైన జీవాదృష్టి, అధికారయుత మైన ప్రశ్నలముందు అతను ఏమీ దాచలేకపోయాడు.

'....ఎక్కడినుంచి తీసుకొచ్చావ్?' జీవా అడిగాడు.

'షాహుకారుగారూ, పంజాబు కొండప్రాంతంలో వుండే రత్నం. చూడ గానే తెలుసుకుంటారు!' అన్నాడు బరకత్ హుషారుగా.

'వయసు ఎంత వుంటుంది?'

బరకత్ వయసు బాగా తగ్గించి 'వుంటాయి, పంధొమ్మిది ఇరవై సంవత్స రాలు!' అన్నాడు.

'ఏమన్నా కొద్దిగా నేర్చుకుందా?'

'మీరు ఆమెను చూడండి! అన్నీ వెంటనే నేర్చుకుంటుంది.'

'మంచిది చూద్దాం.' జీవా అడ్రసు అడిగాడు కానీ ఎక్కువశ్రద్ధ తీసుకో లేదు.

బరకత్ జీవాదగ్గర మధ్యాహ్నం రెండుగంటలవరకూ వేచివుండి రెండు గంటలతర్వాత అతన్ని తమ ఇంటివైపు తీసుకువెళ్ళడంలో సఫలుడయ్యాడు. సిగ్గుపడుతూ తనగదికి తీసుకువెళ్లాడు.

సోమాకు అతన్ని పరిచయం చేశాడు. 'ఈయన మనల్ని కలుసుకోవాలని వచ్చిన షాహుకారుగారు' అని చెప్పాడు.

సోమా ఒకవైపున ముడుచుకుని కూర్చుంది. జీవా క్రీగంటితో ఆమె ముఖం వైపు, శరీరంవైపుచూస్తూ అంచనా వేసుకుంటున్నాడు. తిరిగి వెళ్ళేటప్పుడు బరకత్ జీవాకు మళ్ళీ హామీ ఇచ్చాడు—'ఈమె బంగళాలలో పెద్దపెద్దవాళ్ళలో కలిసివుంది. ఇప్పుడు సిగ్గుతో ముడుచుకునివుంది, సమయం వచ్చినప్పుడు విచ్చు కుంటుంది. అప్పుడు చూడండి! స్టేజిమీద వెలుగు, మధువి, చంద్రాని తల దన్నక పోతే మాత్రంతో మీసం గొరిగించుకుంటాను' అన్నాడు.

జీవా బరకత్ని సోదరభావంతో కారులో పక్కన కూర్చోబెట్టుకుని ఒక సిగరెట్టుఇచ్చి నచ్చజెప్పాడు—'చూడు బాబూ, బరువులుమోసే గుర్రం రేసులలో

పరుగెత్తలేదు. ఈ అమ్మాయి స్టూడియోలో గుంపులో కలిపి వుండటంకన్నా ఇంకేమి చేయగలదు? ఆమెకు ఇంతవరకూ ఏమీ రాదు. ఆమెకు ఏదైనా నేర్ప డానికే రెండుసంవత్సరాలు పడుతుంది. అప్పటివరకూ మవ్వు ఈమెని సంపా దించనీ. మళ్ళీ ఇంకెవరినన్నా తీసుకురా. ఈమెకు స్టూడియోవాళ్ళు అయిదు కాక పోతే పది ఇస్తారు. మేము నీకు ఈమెకోసం ఇరవై పాతిక ఇప్పించగలం.'

బరకత్‌కి వేరే గత్యంతరం తోచలేదు. జీవా నిర్ణయానికి తల ఒగ్గవలసి వచ్చింది. జీవా అతనికి 'ఇవా-పారసీ' దగ్గర ఒక బంగళా చూపించి, రాత్రి పది గంటలకు అక్కడికి తీసుకురమ్మని చెప్పారు. ఒక పదిరూపాయలనోటుకూడా బరకత్‌కి అద్వాన్సుగా ఇచ్చారు. సాయంత్రం కారు పంపిస్తానన్నారు.

బరకత్ తరచు ఉదయంవెళ్లి అర్ధరాత్రి ఇంటికి తిరిగివచ్చేవాడు. ఆరోజు అతను సూర్యాస్తమయం వేళకే వచ్చేశాడు. అతనిచేతిలో బాదంరంగులో కాగితం నంచి వుంది. ఆ నంచిని సోమాచేతికి ఇచ్చి 'వంట త్వరగా చెయ్. భోజనంచేసి తొమ్మిదింటికి ఒకచోటికి వెళ్లాలి. షాహూకారుగారి కారువస్తుంది. సినిమాసని గురించి నీకు ఇద్దరు ముగ్గురు మనుషుల్ని పరిచయం చేయాల్సివుంది. వాళ్ళు చాలా పెద్దమనుషులు. అతి కష్టంమీద ఈ ఏర్పాటు చేశాము. ఎంతో బతిమాలి, ముఖ స్తుతి చేస్తేగానీ వాళ్లు ఒప్పుకోలేదు. వాళ్ళతో చాలాగౌరవంగా, సమయం సందర్భం తెలుసుకుని మాట్లాడు. సినిమాలో ఉద్యోగం అంత తేలికగా దొరకదు' అన్నాడు.

ఆ కాగితపుసంచీలో ముఖానికి పూసుకునే పౌడరు, పెదిమలకు వేసుకునే ఎర్రరంగు వున్నాయి. ధర్మశాలలో ధనసింగ్‌గూడా ఆమెకు పౌడరు, క్రీము తెచ్చిఇచ్చారు. లాహోర్‌లోకూడా ఆమె పౌడరు, కాటుకా పెట్టుకోసాగింది. మనో రమ, తదితరస్త్రీలను చూసి జుట్టుగూడా కొత్తవిధంగా అలంకరించుకోసాగింది. కానీ ఆమె కృత్రిమమైన అలంకారం చేసుకున్నట్లుగా అనిపించేదికాదు. రాత్రిపూట బారిస్టరుగారిదగ్గరకు వెళ్ళేటప్పుడు ఆమె కుంకంకూడా పెట్టుకునేది. ఆ బొట్టుచూసి ఆయన ముఖంమీద సంతోషం నాట్యం చేసేది. ఈరోజు ఆమెకోసం అలంకరణకు ఆ వస్తువులను బరకత్ ఈ పద్ధతిగా తెచ్చాడు.

సోమా మోకాళ్ళమీద గడ్డం ఆనించుకుని చాలాసేపటివరకూ ఏదో పోగొట్టు కున్నదానిలా కూర్చుంది. సుమారు తొమ్మిదిగంటలప్పుడు బరకత్ గుర్తుచేసేసరికి

లేచి చీర మార్చుకుంది. బరకత్ తెచ్చిన చమ్కీ అద్దినచీరలు ఆమె ఇంట్లో నిత్యం వాడుకునేందుకు ఉపయోగించుకుంటోంది. లాహోర్‌నుంచి కట్టుకువచ్చిన తెల్ల చీరని ఆమె వృత్తికి అవసరం ఆయినప్పుడు కట్టుకోవడానికి అట్టే బెట్టింది. పెద్ద వాళ్ళదగ్గరకు వెళ్ళేందుకు అదేచీర సరైనదనుకుని కట్టుకుంది. ఆమె హృదయం ఎందుకో వణికిపోతోంది. కానీ ఇంకొకమార్గం లేదు. జీపు కారు వచ్చింది. బర కత్ కారులో ఆమెపక్కనకూర్చుని అన్నీ తెలుసుకుని సమయానుకూలంగా ప్రవ ర్తించమని ఆమెను హెచ్చరించాడు.

ధనవంతులు, పెద్దవాళ్ళు వుండతగిన పెద్దదైన ఇల్లు. నౌకర్లు ఒకేవిధమైన దుస్తులు ధరించివున్నారు. షాహుంకారుగూడా కనిపించాడు. షాహుంకారు బరకత్‌ని చూసి 'వచ్చారా!' అని మెట్లదగ్గరవున్న చిన్నగదివైపు చేత్తో సౌంజ్ఞచేసి 'రండి' అన్నారు. షాహుంకారుతోబాటు ఇంకొకవ్యక్తిగూడా వాళ్ళతోబాటు గదిలోకి వచ్చాడు. సోమా అర్థం చేసుకోలేకపోయింది. ఆ వచ్చినవ్యక్తి గోడలో ఏదో తిప్పాడు. గదికివున్న చెక్కతలుపు మోతచేస్తూ మూసుకుపోయింది. వాళ్ళ కాళ్ళ క్రింద తివాచీ పైకి లేవసాగింది. నాలుగువైపులా గోడలు వేగంగా క్రిందకు జరు గుతూ వెళ్ళిపోసాగాయి. సోమా పక్కన నిలబడివున్న షాహుంకారు విశ్రాంతిగా చుట్ట కాలుస్తున్నాడు. సోమా భయపడి బిగ్గరగా కేకలేద్దామనుకుంది. ఇంతలో పంజరంలావున్న గది ఆగిపోయింది. ఎదురుగా వరండా కనిపించింది. పక్కనే వున్నవ్యక్తి గోడను తాకాడు. తలుపు శబ్దంచేస్తూ తెరుచుకుంది. షాహుంకారు బయటకురమ్మని సౌంజ్ఞచేసి 'రండి' అన్నారు.

షాహుంకారు సోమాని సోఫాకుర్చీలతో అలంకరించబడిన ఒక గదిలో కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు. ఆమె భయపడసాగింది. ఇదేమిటి! ఉచ్చులో పడ్డానా! అక్కడినుంచి తప్పించుకుని బయటపడటం కష్టం. భూమిమీదనుంచి ఎంత ఎత్తుకు వచ్చిందోకూడా తెలియదు. పిలిస్తే బరకత్ వినిపించుకోనుగూడా లేదు.

....ఇది వైజ్‌నాథ్ పోలీసుఠాణాకన్నాకూడా భయంకరమైన ప్రదేశం. గదిబయట మాటలు, నవ్వులు వినిపించాయి. ఎవరో ఒకవ్యక్తి తలుపులాగి తొంగిచూసి వెనక్కు వెళ్ళిపోయాడు. రెండునిముషాలతర్వాత షాహుంకారులా దుస్తులు ధరించిన ఒకవ్యక్తి లోపలికి వచ్చాడు. సోఫామీద సోమాని అనుకుంటూ

కూర్చున్నాడు. సోమా గాభరాపడి పక్కకి జరిగింది. 'అరే అలా సిగ్గుపడతా వెందుకు!' అని నవ్వాడు.

షాహుకారు ముఖంమీద మత్తువల్ల విందుదనం, ఎర్రదనం కనిపిస్తున్నాయి. సోమా అతనివైపు చూడలేకపోయింది. షాహుకారు వదిలే శ్వాసలో విదేశీమద్యం వాసన వస్తోంది. సేఠ్ తనచేతిని సోమా నడుంమీద వేయడానికి ఆమె వీపు వెనుకగా పోనిచ్చాడు. సోమా ఆ చేయి వున్నంతదూరంవరకూ అవతలికి జరిగింది. 'అరే ఏమీ మాట్లాడవేం, మేము నిన్నుగురించి చాలా విన్నాం!' సేఠ్ నవ్వాడు.

సోమా తల వంచేసుకుంది. ఆమెకు ఒళ్ళంతా చెమటతో తడిసిపోతోంది. సేఠ్ జేబులో చెయ్యిపెట్టి వందరూపాయలనోటు బయటకుతీసి సోమావడిలో పడేశాడు—'తీసుకో, ఇప్పుడు సరిపోయింది కదా!' అన్నాడు.

సోమా వణుకుతూ చీర కొననుంచి దారంపోగు లాగుతూ 'నేను ఉద్యోగం విషయం మాట్లాడడానికి వచ్చాను' అన్నది చాలా నెమ్మదిగా.

సేఠ్ సోమామాటని అర్థం చేసుకోలేదు. అతను ఉత్సాహంతో సోమాదగ్గరకువచ్చి ఆమెని గట్టిగా పట్టుకున్నాడు.

సోమా విలవిలా తన్నుకుని లేచి నిలబడింది.

మూసివున్న గది తలుపుమీద బలంగా తోసినచప్పుడు వినిపించింది. తర్వాత కోపంగా పోట్లాట—'మేముగూడా డబ్బు దాచిపెట్టాం, మా డబ్బు దొంగతనంగా సంపాదించినదా?' అన్న కేకలు వినిపించాయి.

సేఠ్ లేచినిలబడ్డాడు. సోమాగూడా వెంటనే లేచి నిలబడటంచేత నోటు క్రింద పరచివున్న తివాసీమీద పడింది. సేఠ్ నోటుతీసి తలుపుదగ్గరకెళ్ళి 'ఎవరూ' అని అడిగాడు బొంగురుగొంతుతో.

'ఎవడనేవాడి కొడుకు!' బయటనుంచి చాలాకోపంతో నిండిన కేక వినిపించింది. 'ఈ వంతుకు డబ్బు మే మిచ్చాం. చాలా కొత్తది. మంచిఇంటి ఆడది వచ్చిందని మా దగ్గర డబ్బులు తీసుకున్నాడు. పిలు! మీ షాహుకారుని! మోసం చేస్తాడా, మా డబ్బేం వూరికినే వచ్చిందా!'

సేఠ్ తలుపు గడియతీశాడు—'తీసుకో, తీసుకో, నీ డబ్బు తిరిగి తీసుకో!'

అనిచెప్పి పేత్ బయటకు వెళ్ళిపోయాడు. బయట పోట్లాడుకోవడం బిగ్గరగానూ, స్పష్టంగానూ వినిపించింది....మేము అందరికన్నా ముందు వెళ్ళడంకోసం డబ్బు ఇచ్చాం. ఇప్పుడిదేమిటి! మాకు మోసం ఎదురయింది! షావుకారుని పిలు!'

సోమా లోపలనిలబడి వణికిపోతోంది. లోపలితలుపు తెరుచుకుని ఒక నౌకరు వచ్చాడు. అతను సోమాని 'అమ్మాయి, ఇటునుంచి రా!' అని పిలిచాడు.

నౌకరు సోమాని బాత్ రూంకువెళ్ళే దోవనుంచి వరండావైపు తీసుకెళ్లాడు. ఒకగదినిదాటి సోమాని మెట్లమీదనుంచి క్రిందకు తీసుకెళ్లాడు. సోమా కాళ్ళు వణుకుతున్నాయి. వాళ్ల ఇంకా మెట్లు దిగుతూనేవున్నారు. నౌకరు సోమాని నిర్మానుష్యంగావున్న ఒక చిన్నగదిలో కుర్చీమీద కూర్చోబెట్టాడు. పైన పెద్దపోట్లాట జరుగుతోంది....'డబ్బు-'దొంగతనంగా సంపాదించినడబ్బు....మోసం........నమ్మకద్రోహం మొదలైనమాటలు బిగ్గరగా మాటిమాటికీ వినిపించసాగాయి.

సోమా రెండుచేతులతోనూ తలపట్టుకుని విశ్చేష్టురాలై కూర్చుంది. బరకత్ గొంతుగూడా వినిపిస్తోంది. అతనేం చెపుతున్నాడో సోమా అర్థం చేసుకోలేకపోయింది. కోపంతోనిండిన మరోగొంతుకూడా వినిపించింది—'నువ్వు నన్ను మోసంచేస్తావా!....నీ శవం సముద్రంలో పారేయిస్తాను తెలుసా!' ఆ మాటలు వినగానే సోమా విశ్చేష్టత వణుకుగా మారింది.

'పద అమ్మాయి' అని నౌకరువచ్చి ఆమెను పిలిచాడు.

సోమా బయటకురాగానే బరకత్ కనిపించాడు. బరకత్ ముఖంమీద భయం, కోపం రెండూ కనిపించాయి. అతనితోపాటు సన్నగా పీరనంగావుండి చొక్కా-ధోవతి కట్టుకున్న ఒక అపరిచితవ్యక్తి కనిపించాడు. ఆ మనిషి సోమావంక పరిశీలనగా చూశాడు.

బరకత్ తోపాటువున్న వ్యక్తిగూడా వాళ్ళతో కలిసివచ్చాడు. కొద్దిదూరం నడచినతర్వాత బరకత్ అనుమానంతో 'ఇప్పుడు బస్సు దొరుకుతుందో, దొరకదో కూడా తెలియదు!' అన్నాడు.

'ఇప్పుడు బస్సు ఎలా దొరుకుతుంది; పదకొండు ఎప్పుడో అయింది;

పక్కన ఆవిడకూడా వుంది; ఇది తీసుకో, టాక్సీమీద వెళ్లు. మళ్ళీ కలుసుకుందాం!' అన్నాడు ఆ పక్కనవున్న వ్యక్తి.

యుద్ధపురోజులు. 1944 వ సంవత్సరం. శత్రువుల విమానాలు రాత్రిపూట భూమిమీద వెలుగుచూసి, ప్రదేశంగుర్తించి బాంబులు వేయకుండా వుండటానికి బొంబాయిలో 'బ్లాక్ అవుట్' వుండేది. రోడ్లమీద విద్యుద్దీపాలు వెలగటంలేదు. దుకాణాలలోగూడా దీపాలచుట్టూ కాయితాలు అంటించివుండటంచేత మసకవెలుతురు వస్తోంది. రాత్రిపూట రోడ్లమీద వెలుతురు లేకపోవటంచేత ప్రజలుగూడా ఎక్కువగా బయటకు వచ్చేవాళ్ళు కాదు. కార్ల లైట్లమీదగూడా కాగితాన్ని అంటించి కాంతిని తగ్గించి నడుపుతూవుండేవారు. బరకత్ సోమాని వెంటబెట్టుకుని, చీకటి రోడ్లమీద టాక్సీని వెదుకుతూ ముందుకు నడుస్తున్నాడు. పళ్ళునూరుతూ 'ఇంటికి పద, నిన్ను సరిగా చేస్తాను' అని నెమ్మదిగా అదమాయిస్తున్నాడు. విద్యుద్దీపాలతో మిరమిట్లు గొలుపుతూ, సోఫాలతో అలంకరింపబడిన గదిలో, సేఠ్ ప్రవర్తనతో పోలిస్తే బరకత్ అదమాయింపు సోమాకు ఏమంత భయంకరంగా అనిపించలేదు.

కొద్దిదూరం వెళ్ళినతర్వాత బరకత్‌కు టాక్సీ దొరికింది. టాక్సీలో సోమా కళ్ళుమూసుకుని మౌనంగా కూర్చుండిపోయింది. బరకత్ టాక్సీలో చేతులు కట్టుకుని గంభీరంగా కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ ఆకలితో మాడిపోతున్నారు. సోమా అర్థం చేసుకోగల స్త్రీ అనీ, అవసరాన్నిబట్టి తెలివిగా ప్రవర్తిస్తుందనీ అతనికి నమ్మకం వుండేది. బారిస్టర్‌ని వేళ్లమీద ఆడించేది. కానీ ఇక్కడ ఎదురుతిరిగి ఒయ్యారం చూపించింది. సరిగా మాట్లాడలేదు. నన్ను మూర్ఖుణ్ణి చేస్తుందా! నేనేం దీనికి తాలివాణ్ణా! నమ్మకద్రోహం, మోసం.... అతను తనగదికి ఎప్పుడు చేరుతామా అని ఎదురుచూస్తున్నాడు.

గదికి చేరగానే కొంతసేపూ లోపల దాచుకున్న ధైర్యం బయటకు వచ్చింది. ఆమె వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది. ముఖం చీరకొంగుతో కప్పుకుని గోడకు వీపు ఆనించి కూర్చుంది.

బరకత్ కోపంలో చొక్కాచేయి మడిచాడు. నడుంమీద చేతులుపెట్టుకుని సోమాఎదుట నిలబడి పళ్ళునూరుతూ 'నేను నిన్ను వాళ్లతో గౌరవంగా వుండమని చెప్పిపంపితే నువ్వు వాళ్ళతో సరిగా మాట్లాడలేదా!' అని అడిగాడు.

సోమా ముఖంమీదనుంచి చీరకొంగు తీసేసి తడిసినకళ్లు పైకి ఎత్తింది—'నీకేం తెలుసు, అతను ఏం చేయడం మొదలుపెట్టాడో!' అని మళ్ళీ ముఖాన్ని చీరకొంగుతో కప్పుకుని ఏడవసాగింది.

సోమా పొట్టలో వేగంగా బలంగా ఒకదెబ్బ పడింది. వెంటవెంటనే రెండు మూడుదెబ్బలు ఆమె తలమీద, భుజాలమీద పడ్డాయి.

సోమా గుండె ఆగిపోయినట్లనిపించింది. ఆమె ఏడుపుగూడా ఆగిపోయింది. బరకత్ కోపంతో మండిపడుతూ వాగుతూనేవున్నాడు—'దుర్మార్గురాలా! అక్కడ ఆ అయ్యగారి ఎదురుగా రొట్టెముక్కలమీద కాళ్ళుచాపి పడివుండేదానివి. నీ కక్కడ సిగ్గుండేదికాదు. ఇక్కడ....లో పెరుగు తోడిపెట్టుకుని కూర్చున్నావా! వచ్చింది పెద్ద పతివ్రతలాగా. సిగ్గు చూపించడానికి బాబుకి! వందరూపాయలు నీళ్ళ పాలు చేసింది. నీ....లాంటివాళ్ళని నేను బాగా ఎరుగుదును.

సోమా దెబ్బలుతిని నిశ్చేష్టురాలై మోకాళ్ళమీద తలపెట్టుకుని ఏమీ కదల కుండా కూర్చుంది. మాట్లాడలేదు.

'ఏం మాట్లాడవేం!' బరకత్ ఇంకొకదెబ్బ మళ్ళీ కొట్టాడు.

'ఏం చెప్పను అన్నా!' నెమ్మదిగా ఏడుపుగొంతుతో అన్నది సోమా. ఆమె ఏడుపు ఆగిపోయింది. 'నేను నీ చెయ్యి పట్టుకునే వచ్చానుగదా!' అంది.

బరకత్ ఇంకా మండిపడ్డాడు—'వచ్చింది పెద్ద అన్నగారని చెప్పుకునేది. అక్కడేమో మెడమీద వచ్చిపడింది, నన్ను తినుకెళ్ళమని! ఇక్కడ నా ఎముకలు విరగకొట్టుకుని, నీకు తినిపించడానికి, నిన్ను పోషించడానికి తీసుకువచ్చానా! ఇవ్వాళ....దుర్మార్గం అంతా విరక్కొడతాను. అలా కాకపోతే నువ్వు చెప్పినట్లు చెయ్యను.'

బరకత్ గదితలుపు మూసేసి వెళ్ళిపోయాడు. బయట గొళ్ళానికి తాళం వేసిన చప్పుడుకూడా సోమాకి వినిపించింది. ఆమె శారీరకంగానూ, మానసికం గానూ నిశ్చేష్టురాలై కూర్చునివుంది. అరగంటకన్నా ఎక్కువసేపు అదేవిధంగా కూర్చున్నమీదట ఆమెకు కదిలేశక్తి ఆలోచించేశక్తి తిరిగి వచ్చాయి. ఒక విషయం మాటిమాటికీ మనసులో కదులుతోంది. తను అనవసరంగానే జీవించివుండటానికి

ప్రయత్నిస్తోందా? మధురాలోనే చచ్చిపోవాల్సింది. ధర్మశాలలో చచ్చిపోయేది. లేక పోతే లాహోర్‌లో చచ్చిపోయేది. అందరూ మోనం చేశారు. ఇప్పుడు ఇంకా ఏం జరగాల్సివుందో తెలీదు. మోకాళ్ళమీద గడ్డం ఆనించి కదలలేకుండా కూర్చుని ఆమె కొంత స్పృహలోనూ, కొంత కలలోనూ ఆలోచించసాగింది. సహించడం కన్నా వేరేమార్గం లేదు. తప్పించుకోలేదు. ఆమె కళ్ళనుంచి ఎడతెంపులేని ధారలు ప్రవహిస్తున్నాయి.

తలుపుగడియ తీసినశబ్దం వినిపించింది. సోమా కన్నీళ్ళు తుడుచుకుంది. పక్కగది లోపలితలుపుగడియ తీయడంవల్ల చప్పుడు కలిగిందని తెలుసుకుంది. పక్కగది పురుషుడు రాత్రివంతులో పనిచేసి మిల్లునుంచి తిరిగి వచ్చారు. సోమా బరకత్ వచ్చాడేమో ననుకుంది. పారా ఎక్కడ దొరుకుతుందా అని అతను వెతు కుతూ వుండివుంటాడు.

గోడ అవతలినుంచి పెద్దగా పోట్లాడుతూ తిడుతూ, ధమ్ ధమ్ అని కొట్టే టటువంటి శబ్దాలు వినిపించాయి. ఒకస్త్రీ ఏడవటం వినిపించింది. ఇద్దరుస్త్రీలు వాళ్ళల్లోవాళ్లు తిట్టుకుంటున్నారు. యౌవనంలోవున్న స్త్రీ ముసలిస్త్రీని తప్పుడు చాడీలు చెపుతుందని తిడుతోంది. ముసలావిడ దానికి సమాధానంగా ఆమెమీద వ్యభిచారం చేసిందన్న కళంకం అంటగడుతోంది. పురుషుడు తల నరికేస్తానని బెదిరిస్తున్నాడు.

పక్కగదిలో నిశ్శబ్దం వ్యాపించింది. బరకత్ ఇంకా రాలేదు. సోమా గట్టిగా నిట్టూర్చింది. అక్కడ వ్యభిచారం చేసిందని దెబ్బలు పడుతున్నాయి. ఇక్కడ వ్యభిచారం చేయించడానికి దెబ్బలు పడుతున్నాయి. సోమాకు ధర్మశాలలో ధన సింగ్‌వల్ల తిన్నదెబ్బలు గుర్తుకువచ్చాయి. ఆ దెబ్బలన్నప్రతి చాలా గర్వాన్ని కలి గిస్తుంది. ధనసింగ్ ఆమెని కొట్టాడు....అదేమాటమీద అతడు ఇద్దర్ని హత్య చేశాడు, తన జీవితాన్ని నాశనం చేసుకున్నాడు. మొగాడు ఎవరినైతే తన భార్యగా ఎన్నుకుంటాడో, ఆమెమీద ఇంకొకరి దృష్టిపడితే సహించలేడు. బరకత్ నన్ను వేశ్యగా తయారుచేసి అమ్మడానికి తీసుకొచ్చాడు. అతని భార్యవైపు ఎవరైనా కన్నెత్తిచూస్తే చావడానికికూడా సిద్ధమవుతాడు.

సోమా తనని తాను అవమానించుకుంది. ఏడవడంవేత లాభమేముంది....

ఎవరు వింటారు నీ ఏడుపు? నీ అభిమానాన్ని ఇవ్వాళ విరగకొడతానని అతను చెప్పివెళ్లాడు. సారా తాగడానికే వెళ్ళివుంటాడు. బారిష్టరుగారుకూడా సారాత్రాగి చాలా సుఖంలోకి వచ్చేవారు. ఎటువంటిమాటలు మాట్లాడేవారు! సోమాకు ఆ విషయం జ్ఞాపకం రావడంవల్ల అసహ్యం కలిగింది. సారాత్రాగిన బరకత్ అన్నట్లు గానే చేస్తాడేమో అనే ఆలోచనవల్లకూడా ఆమెకు బాధ, అసహ్యమూ కలిగాయి. ఒకవేళ తనని బరకత్ అతని భార్యగా తలచేవాడైతే, వేశ్యగా తయారుచేసి అమ్మడు! వందలమంది చేతులలో పడటంకంటే ఎంత చెడయినా ఒకనిచేతిలో పడటమే మంచిది! ఒకమనిషి నీడైతే తప్పక అవసరం. మొగాడి నీడలేకుండా ఆడది ఎలా వుండగలుగుతుంది? సోమాకు పక్కగదిలో తన మొగుడిచేతిలో దెబ్బలుతినే స్త్రీమీద ఈర్ష్య కలిగింది.

సోమాకు తనగదికివేసిన తాళం తీస్తున్నచప్పుడు వినిపించింది. బరకత్ వచ్చాడు. అతనితోపాటుగానే మనసును వికారపెట్టే చౌకబారు సారావాసనకూడా వచ్చింది. అతని అడుగులు తడబడుతున్నాయి. సోమాకు అభిమానం విరుస్తానన్న అతని బెదిరింపు గుర్తుకు వచ్చింది. మనసు ద్వేషంతో నిండిపోయింది. కానీ వెంటనే ఆలోచించింది—ఒకవేళ ఇది సహించినాకూడా తను వేశ్యగా తయారవక ఒక ఇంటిదిగా మారగలుగుతుందా?

బరకత్ పెదిమలు నిషావల్ల పరవశత్వం పొందాయి. సోమాపక్కన ఎవరో తోసినట్లుగా పడ్డాడు. 'ఇప్పుడు చెప్పు!' అతి కష్టంమీద అని అతను సోమా భుజాలు పట్టుకున్నాడు.

సోమా మనసులోని అసహ్యాన్ని అణచివేసుకుని ముడుచుకుంటూ నవ్వి, 'నీతోపాటే వచ్చానుకదా!' అన్నది. ఆమె నిరాటంకంగా నవ్వుతూ చచ్చిపోవ డానికి తయారయింది.

బరకత్ వేశ్యతోసహా పెకలించిన చెట్టుమాదిరిగా కూలబడ్డాడు. సోమాకు మురికికాలువలో మునిగిపోతున్నట్లుగా అసహ్యం వేసింది. ఆమెలేచి గోడకు ఆను కుని కూర్చుంది. పెద్దగా నిట్టూర్చింది. ఇదికూడా సహించింది....చివరికి అవాల్సి నంతా అయింది. ఆమె అలాగే కూర్చుండిపోయింది.

ప్రాతఃకాలపు నిశ్శబ్దతని భంగంచేస్తూ ఆ ఇంటి స్నానాలగదిలో పంపు

నీళ్ళధార పడుతూ వినిపించింది. సోమాలేచి స్నానం చేయడానికి వెళ్ళింది. స్నానం చేసివచ్చి మళ్ళీ గోడకు వీపు ఆనించి కూర్చుంది. సారావాసనతో నెమ్మదిగా గురక కొడ్తూ బరకత్ పక్కనే పడివున్నాడు. సోమాకు అతనిమీద అసహ్యం కలుగుతోంది కానీ ఇప్పుడు అతనొక్కడే ఆధారం. అతనే ఇప్పుడు సర్వస్వమూ. సోమాకు చచ్చిపోదామనిపించింది. చచ్చిపోవాల్సినదయితే మొదటే చచ్చిపోయేది, తనసింగ్ పారిపోయినరోజునే.

పగలు చాలా పొద్దెక్కినతర్వాత టీ తయారుచేసి బరకత్‌ను లేపింది. అతనికి నిద్రనుంచి మెళకువ రాకపోయేసరికి ఆమె మళ్లీ గోడని ఆధారంగా చేసుకుని కూర్చుంది. బరకత్ మధ్యాహ్నం రెండుగంటలవేళప్పుడు లేచాడు. లేస్తూనే బాగా తలనొప్పిగావుందని అన్నాడు. సోమా మళ్ళీ టీ వేడిచేసి ఒక కప్పులోపోసి అతనికి ఇచ్చింది. 'తల నొప్పిగావుంటే నాలుగుపైసలు ఇవ్వు. పక్కింటికుర్రాణ్ణి పంపించి తలనొప్పిమాత్ర తెప్పిస్తాను' అంది.

బరకత్ మురికిగుడ్డతో వంటిని కప్పుకుంటూ లేచాడు. 'ఏనాయల....దగ్గర నల్లమందుమాత్రకికూడా నాలుగుపైసలు మిగిలివున్నాయి! నువ్వు నన్ను ఎట్లా తినాలో అట్లా తింటున్నావు. ఎప్పుడూ కుదరనివాడితో విన్న మాట కుదిరింది. నువ్వు కాలితో తన్నివుండకపోతే ఈపూట జేబులో ఇరవై-పాతిక రూపాయలుండేవి. నాకేం తెలుసు నువ్వింత మోసంచేసేదానివని! నీ కంత అభిమానం వుంటే నీ దోవ నువ్వు చూసుకో! మాదేముంది. ఇవ్వాళే వెళ్ళి సైన్యంలో చేరిపోతాం. రొట్టె, బట్ట ప్రభుత్వం ఇస్తుంది. రోడ్డుమీద చేతులు చాచుకుంటూ తిరగడమే. ఆ పాతివ్రత్యంవల్ల కలిగే ఆనందం తెలుస్తుంది.'

సోమా భయంతో వణికిపోయి కళ్ళు మూసుకుంది. ఇంత దిగజారిపోయిన తర్వాత తనకాళ్ళు నేలమీద నిలబడగలిగాయనుకుంది. కానీ అది భ్రమ. బరకత్‌తో కళ్ళుకలిపి 'అయిపోయిందేదో అయిపోయింది. ఇప్పుడు నువ్వు చెప్పినట్లే చేస్తాను' అన్నది సోమా స్పష్టంగా.

బరకత్ మెత్తపడ్డాడు—కావాలనుకుంటే రాణివి అవుతావు. వీళ్ళంతా నీ అడుగులు ముద్దుపెట్టుకుంటారు. నీమీద బంగారునాణాలు కురిపిస్తారు. చివరికి నీ ఈ

అందం రొట్టెముక్కలకోసం అమ్ముడుపోయేటటువంటిదా? నువ్వు మూర్ఖురాలివి. లేకపోతే ఆ బారిస్టర్‌ని వశంచేసుకుని వాడిదగ్గరనుంచి వలభై ఏభై వేలు లాక్కొచ్చే దానివి. విడిగా బంగళా తీసుకుని వుండేదానివి. ఇప్పుడు ఇక్కడగూడా అటువంటి మూర్ఖత్వమేచేస్తే ఏమవుతుంది? కాగితంపువ్వు బల్లమీదపెడితే పూలగుత్తి అవుతుంది. నేలమీద పడేస్తే పెంటపోగు అవుతుంది. నువ్వు చదువుకున్నదానివి కదా! ఇక్కడ వందలకొలది గాడిదలు సంపాదిస్తున్నాయి. ఇప్పుడు కాలమే స్త్రీలకాలం వచ్చేసింది. కాలం కలిసివస్తే నీవల్ల మేముగూడా రోజుకూలి పొందుతూ వుంటాం. ఆ బన్‌వారీ జీవాకి కారుడ్రైవరుగా పనిచేసేవాడు. షాహుకారుగారు డైరెక్టరుతో చెప్పేసరికి ఇప్పుడు సినిమాకి సంభాషణలు వ్రాస్తున్నాడు. పరిహాసాలు చేస్తూవుంటాడు. వెయ్యిరూపాయలు దెబ్బకొట్టి తీసుకుంటాడు. వాడి పక్కన చూడు. ఎప్పుడుచూసినా కొత్త ఆడది. విదేశీ పీసా! డైరెక్టరుకి ముక్కులో వెంట్రుకైపోయాడు. ఏదో ఒకటి వాళ్ళతో వాగుతూ తిరుగుతూ వుంటాడు. అంతే. ఎప్పుడు పిలుచుకురమ్మంటే అప్పుడు పిలుచుకువస్తాను. నాతో పాటేకలిసి త్రాగుతూవుంటాడు!'

• • •

బరకత్ తనకు పరిచయంవున్న వాళ్ళందరిదగ్గరా కొద్దో గొప్పో అప్పు తీసుకుని వాడాడు. ఆ అప్పు తీర్చడానికి ఏవిధమైన ఆదనూ దొరకటంలేదు. సిగ్గు, బిడియం వదిలిపెట్టడమే మార్గమనుకునే పరిస్థితికి వచ్చారు. క్రితంరాత్రి బన్‌వారీ బరకత్‌ని 'ఫుల్ మూన్' హోటల్లో బాధలోవుండగా చూశాడు. బన్‌వారీ ఒకస్త్రీని కాపాడదామనే సద్భావంతో ఇరుకునపడ్డాడు. 'బ్లాక్ అవుట్'లో ఆ స్త్రీని తీసుకుని అరుమైళ్ళు నడిచివెళ్ళడానికి బరకత్ విధిలేక నిలబడివున్నాడు. బన్‌వారీకి ఆ స్త్రీ మీద దయకలిగింది. బరకత్ మొదట తీసుకున్న అప్పు తీర్చలేదు. అయినాకూడా బన్‌వారీ అతనికి పదిరూపాయ లిచ్చాడు.

బరకత్‌కు బన్‌వారీ మంచితనంచూసి ఉత్సాహం కలిగింది. మధ్యాహ్నం రెండుగంటలతర్వాత బన్‌వారీని కలుసుకునేందుకు దాదేఫాల్ స్టూడియోకి అందేరీ వెళ్ళాడు. బన్‌వారీ అతన్ని చూస్తూనే 'ఆ అమ్మాయినేనా ఫిల్ములో పెట్టుకోమని అడిగేవాడివి? అరేయ్, ఆమె ఎక్కడన్నా డైరెక్టర్‌మీద చెప్పులు గిరాటేస్తే?'

అని ఎగతాళి చేశారు. 'అరే అబ్బాయ్, గుర్రానికి కళ్ళెం తగిలించకుండానే బండికి కట్టడానికి తీసుకొచ్చావ్. అంత హడావిడి పడ్డావేం? ఏమీ తెలియని అమాయకు రాలి! ఆ అమ్మాయి ఎవరినీ పట్టుకుని గట్టిగా తన్నలేదు కదా?'

బరకత్ మీసాలు మెలిపెట్టుకుంటూ 'గురూ, ఇదేమీ బరువులు మోయ డానికి గుర్రంపిల్ల కాదు. జాతిగుర్రం అయితే బండివెళ్ళేదోవ అదే తెలుసు కుంటుంది' అన్నాడు.

'మేముగూడా చూడచ్చా?' బన్‌వారీ కన్నుకొట్టి అడిగాడు.

'అన్నా, నీతో నేను ముందేచెప్పాను. నువ్వు అన్నీ తెలిసినవాడివి, చదువు కున్నవాడివి, పెద్దపెద్దవాళ్ళని అంటిపెట్టుకుని తిరిగేవాడివి.'

బరకత్ అడిగినప్రకారం బన్‌వారీ అతనికి అయిదురూపాయలు మళ్లీ ఇచ్చాడు. ఆ రోజు సాయంత్రం దారేఫొకోలో షూటింగ్ లేదు. బన్‌వారీ మర్చి పోవచ్చు. అందుకని సందేహంతో బర్‌కత్ స్టూడియోబయట నిరీక్షిస్తూ వుండి పోయాడు. బన్‌వారీ బయటకురాగానే 'వెళదామా' అని బరకత్ గుర్తుచేశాడు.

చీకటిపడింది. బంగళాలో లైట్లు వెలిగాయి. సోమా వంటచేసి నేలమీద జంపఖానా పరచుకుని పడుకుంది. బరకత్ ఒకవ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చాడు. సోమా వాళ్ళకోసం ఆ జంపఖానా వదిలిపెట్టి ఒకవైపున గోడకు వీపు ఆనించి కూర్చుంది.

'ఇతను మా పంజాబీమిత్రుడు. సినిమా డైలాగులు వ్రాస్తుంటాడు. చాలా చదువుకున్నవాడు. ఇతన్ని ఫిల్ముల డైరెక్టరులు, యజమానులూ చాలా నమ్ము తారు' అని బన్‌వారీని బరకత్ పరిచయం చేశాడు.

బన్‌వారీ నిరుత్సాహకరమైన సోమా ముఖంవైపుచూస్తూ కూర్చున్నాడు. సోమా బరకత్ అభిప్రాయం తెలుసుకుని తెచ్చిపెట్టుకున్న నవ్వుతో తన ఒంక చూడటం గ్రహించాడు.

బన్‌వారీ యోగ్యతగురించి, అతని పలుకుబడిగురించి బరకత్ వర్ణిస్తూనే వున్నాడు. బరకత్‌ని మౌనంగావుండమని చెప్పడానికి బన్‌వారీ నోటిమీద వేలు వేసుకుని 'చాలు, చాలు, చాలా చెప్పావు, ఇక చాల్లే!' అన్నాడు పంజాబీలో.

'ఈయనకు టీ పెట్టు. మా వూరివాడే' అని బరకత్ మళ్ళీ బన్‌వారీని పొగడటం మొదలుపెట్టాడు.

బన్‌వారీ టీ పెట్టవద్దని ఆపి మిగతావిషయాలు మాట్లాడసాగాడు. బరకత్ సోమాని జాగ్రత్తగావుండమని చెప్పటంకోసం 'మంచిది, నేను ఈయనకోసం పళ్ళూ-పాలూ తీసుకొస్తాను. నువ్వు టీ తయారుచెయ్। బాగా అర్థమయ్యిందికదా।' అన్నాడు.

బన్‌వారీ బరకత్ చెయ్యిపట్టుకుని ఆపటానికి ప్రయత్నించాడు కానీ 'అలా ఎలా కుదురుతుంది?' అని బరకత్ వెళ్ళిపోయాడు.

సోమా ముఖంమీద వ్యాపించిన నిరుత్సాహపుఛాయలు బన్‌వారీ కళ్ళల్లో పడకుండా తప్పించుకోలేకపోయాయి. అతను సానుభూతి తెలియపరుస్తూ సోమాని వంజాబీలో పలకరించాడు కానీ మర్యాద లక్ష్యపెట్టనట్లుగానే వున్నాయి ఆ మాటలు.

'మీరు బొంబాయివచ్చి ఎక్కువరోజులు అయినట్లు లేదు?'

'కొద్దిరోజులయింది' సోమా నవ్వడానికి ప్రయత్నించింది.

'మీవైపువాళ్ళకి ఇక్కడి నీళ్ళు-గాలి సరిపడవు. ఇక్కడ భోజనంకూడా అలాంటిదే దొరుకుతుంది. చాలా చిక్కిపోయినట్లున్నారు।' అన్నాడు బన్‌వారీ.

సోమా అతనివైపుచూసి మౌనంగా వుండిపోయింది. బన్‌వారీ గోడకి వీపు ఆనించి, 'ఏమిటి ఈ మనిషి మీ దగ్గర నౌకరా?' అని అడిగాడు.

సోమా బన్‌వారీ ఊహకి భయపడింది. అతనివైపుచూసి ఏమీ చెప్పకుండా మౌనంగా తల వంచేసుకుంది.

'సినిమాలో పని చేయాలనుకుంటున్నారా?'

'అవునండి' అని సోమా నవ్వుతూ సమాధానం చెప్పింది.

ఆ స్త్రీ తనహృదయంలోవున్న బాధని ప్రయత్నపూర్వకంగా దాస్తోందని బన్‌వారీకి అనిపించింది. విశ్రాంతికోసం బన్‌వారీ గోడవారగా బాగా క్రిందకుజారి సిగరెట్టుముంచి ఒక పెద్దదమ్ములాగి 'సినిమా, చాలా మంచివాళ్ళు, గౌరవం గల వాళ్ళు వుండదగినచోటుకాదు. కానీ ఇంకోవిధంగా చెడిపోవటంకన్నా మంచిది, ప్రపంచంలో మంచిగా బతకాలంటే చాలా కష్టం. మనిషి పాడైపోక తప్పదు.'

అని పూర్తయిన సిగరెట్టును విసిరేశాడు. 'నేనిక వెళతాను. బరకత్ ఎప్పుడు వస్తాడో ఏమో!' అన్నాడు.

సోమా తన నిరుత్సాహాన్నుంచి మేల్కొంది. వచ్చిన అతిథిని ఏవిధంగానూ ఆదరించలేదు, అనుకుంది. బరకత్ తన్నా ఆ వ్యక్తి గదిలో వుండటం ఎక్కువ నిరాక్షేపణగానూ, ఓదార్పు కలిగించేదిగానూ ఆమెకి తోచింది. 'కాదు, కొంచెంసేపు కూర్చోండి టీ పెడతాను' అంది.

'వద్దు, వద్దు!' అని బన్‌వారీ చెయ్యితిప్పి నిరాకరించాడు. 'నేను ఈవేళప్పుడు టీ తాగను. ఫరవాలేదు, బాధపడకండి. అవును ఒకమాట, సినిమాలోకి వెళితే మిమ్మల్ని గురించి మీరు ఏమి చెప్పుకుంటారు? ప్రపంచంలో ఒక మనిషి నీడ వుండటం చాలా అవసరం, ఇది ఆలోచించండి' అని బన్‌వారీ లేచి నిలబడ్డాడు.

సోమా భయపడుతూ 'కొంచెంసేపు కూర్చోండి. టీ తాగకుండా వెళ్ళటానికి వీల్లేదు. రెండునిముషాలలో తయారైపోతుంది' అన్నది. మంచివాడని అనుకోదగినవ్యక్తి సోమాకు చాలారోజులతర్వాత దొరికాడు.

సోమా స్వరంలో వున్న భయంవల్ల బన్‌వారీ మళ్ళీ కూర్చున్నాడు. సోమా టీ తయారుచేయసాగింది. టీ కప్పు బన్‌వారీ ముందుపెట్టి ఆమె ఒకవైపున ముడుచుకుని కూర్చుంది. 'నావల్ల సినిమాపని అవుతుందా?' తలవంచుకునే ధైర్యంచేసి అడిగింది.

'చేస్తే అన్నీ అవుతాయి' బన్‌వారీ చెప్పాడు. 'ఏ మనిషి అయితే హృదయం దుఃఖిస్తున్నప్పటికీకూడా నవ్వగలుగుతాడో, ఆ మనిషి సినిమాపని చాలా బాగా చేయగలుగుతాడు.'

బన్‌వారీ టీ తాగి లేవబోతూ, 'మీరు కష్టాల్లో వున్నారు. బరకత్‌ని నేను ఎరుగుదును. మనిషి మంచివాడు కాదు. ఈ రెండునోట్లు మీదగ్గర వుంచుకోండి' అని పదిరూపాయలనోట్లు రెండు జేబులోనుంచి తీసి సోమాముందు వుంచాడు. 'బరకత్ మిమ్మల్ని ఆకలితోమాడ్చి చంపచ్చుగూడా. వాడేదైనా చేయగలడు.

ఏమైనా అవసరం వస్తుంది. ప్రపంచంలో డబ్బు పెద్ద ఆధారం. బరకత్ చూడకుండా అట్టే పెట్టుకోండి. ఇక నేను వెళతాను' అన్నారు.

సోమా నోట్లని తాకలేదు, నిరాకరించనూ లేదు.

బన్‌వారీ వెళ్ళిపోగానే సోమా చీరకొంగులో ముఖం దాచుకుని ఏడిచింది. బాగా ఏడ్చింది. తర్వాత ఆమె నోట్లనితీసి దాచేసింది. ఒకవేళ ఈ మంచిమనిషి నాకు పీడను ఇచ్చేటట్లయితే ఇప్పటికయినా తప్పించుకోగలుగుతాను, అనుకుంది.

బన్‌వారీ వేగంగా కొద్దిదూరం అడుగులు వేశారో లేదో, బరకత్ కలిశాడు. బరకత్ ఆతురతని గ్రహించి బన్‌వారీ అతని చేతిని పట్టుకుని, 'మిత్రుడా, చాలా గొప్ప సరుకు తీసుకొచ్చావు! వెనక వారంటేమీ రావడంలేదు కదా!' అని నవ్వుతూ అడిగాడు.

'గురూ నువ్వు నమ్ము, అదే చాలు!' బరకత్ తల ఆడించి 'ఏదైనా పని ఇప్పిస్తావా!' అని అడిగాడు.

బన్‌వారీ బరకత్‌కి ఒక సిగరెట్టు ఇచ్చి తనొకటి అంటించుకున్నారు. ఆలోచించి, 'రేపు పొద్దున పదకొండుగంటలకి స్టూడియోకి రా, కొంచం ఆలోచిద్దాం' అన్నారు.

• • •

సినిమాప్రపంచంలో బన్‌వారీకి మంచి పలుకుబడి వుంది. పోకిరీగానూ, మంచి చాకచక్యం గలవాడిగానూ, రెండువిధాలుగా అతను పేరు పొందినవాడు. అతనివయసు తక్కువేం కాదు. వయసుకన్నా పెద్దవాడుగా కనిపిస్తారు. అతను జీవితంలోని అనేకరంగాలలోనూ, సినిమాప్రపంచంలోనూ బోలెడంత అనుభవం గడించిఉన్నారు.

బన్‌వారీ 1919 వ సంవత్సరంలో జరిగిన సహాయనిరాకరణోద్యమానికి సంబంధించిన ఆందోళనలో వందలకొలది విద్యార్థులతోసహా కాలేజీ వదిలిపెట్టేశాడు. స్వాతంత్ర్యంకోసం రాజనైతికసంఘర్షణలో స్వయంసేవకుడయాడు. కొద్దిరోజులతర్వాత కాంగ్రెసు నాయకులు ఆవేశంతోకాకుండా శాస్త్రీయపద్ధతిలో ఆందోళనచేయాలని నిశ్చయించారు. జీతంలేని స్వయంసేవకుల అవసరంలేకుండా పోయింది. కాలం, డబ్బు వృధాగా ఖర్చుపెట్టగలిగే నాయకులప్రభావమే బాగా వ్యాపించిపోయింది.

బన్‌వారీ కుటుంబ ఆర్థికపరిస్థితి అంత బాగాలేదు. అతను కొంతకాలం పత్రికలకార్యాలయంలో పనిచేశాడు. కానీ పత్రికలలో తన ఇష్టానుసారం వ్రాయలేకపోయేవాడు. అవసరాన్నిబట్టి డబ్బుకూడా దొరికేదికాదు. అణిగిమణిగివుండే జీవితంతో తృప్తిపడలేకపోయేవాడు. ఆర్థికస్థితినిబట్టి అతను మధ్యతరగ్గానికి చెందినవాడే కానీ అతని భావాలుమటుకూ ఉన్నతవర్గానికి చెందినవై వుండేవి. రచయిత కావడంవల్ల ధనవంతుల ఇళ్లకికూడా వెళుతూవుండేవాడు.

బన్‌వారీ తన సామర్థ్యంపట్ల ఎంతో విశ్వాసంకలిగి చివరికి మోసపోయాడు. ఒక సంపన్నులపరివారంలోని విద్యావతి అయిన విధవను అతను ప్రేమించాడు. ఆమె అతని ప్రేమని అంగీకరించింది కానీ అతన్ని వివాహం చేసుకునేందుకు అంగీకరించలేదు. ఆ ప్రేమ ఒక పోట్లాటరూపాన్ని ధరించింది. మోహమనే పరదా వాస్తవికపరిస్థితిని మరుగుపరిచింది కానీ పోట్లాట ఆ భయంకరమైన విజాన్ని స్పష్టపరిచింది. బన్‌వారీ ఆలోచనలతో, ఊహలతో మానసిక ఆనందాన్ని పొందుతుండేవాడు. కానీ వాస్తవానికి ఏమీ సాధించలేకపోయాడు. జీవితంలో నూతనఅధ్యాయం ప్రారంభించేందుకు లాహోర్ వదిలిపెట్టి అతను బొంబాయి వెళ్ళిపోయాడు.

బన్‌వారీ అదృష్టపు త్రాసుమీద తేలికగా ఉగాడు కానీ అతనికి తన కళాత్మకశక్తిమీద నమ్మకం వుండేది, అందుకని ఆ కళకి క్షేత్రమైన సినిమారంగంలో స్థానం పొందేందుకు ప్రయత్నించాడు. తన కళాత్మకకథలని మోసుకుని సినిమారంగంలోని కాంట్రాక్టర్లచుట్టూ తిరగసాగాడు. ఆ వ్యాపారులు, ఇంజనీర్లు అతని అమాయకత్వంచూసి నవ్వుతూ వుండేవాళ్ళు. ఆ అమాయకుడి తెలివిమీద ఆధారపడి అయిదు పది లక్షలరూపాయలు ఏ మూర్ఖుడు పెట్టుబడి పెడతాడు?

బన్‌వారీకి ఆకలితో మాడాల్సినస్థితి వచ్చింది. కానీ అతని ఆత్మగౌరవం అహంకారంగా మారింది. కళని అమ్మడంకన్నా, శారీరకశ్రమని అమ్మాలని అతను నిశ్చయించుకున్నాడు. తనని తాను నిరక్షరాస్యుడుగా చెప్పుకుని నౌకరు ఉద్యోగంలో చేరాడు. కానీ ఆపని చేయలేకపోయాడు. అతనికి ఎప్పుడూ జ్వరం, దగ్గూ రావడం మొదలుపెట్టాయి. అద్దంలో తన ముఖంచూసుకుని తనమీద తనకే జాలి కలిగింది. అతని తెలివితేటలు, ఊహాశక్తి, మానసికసంతోషం శరీరస్థితిని దాచ

లేవు అని ఒప్పుకోవలసివచ్చింది. జీవితావసరాలైన భోజనం. కొద్దిగా చదువు లేకుండా అతనికి కష్టం.

చివరికి చిల్లరవేషాలు వేసేందుకు సిద్ధపడ్డాడు. అనుభవంవల్ల, సినిమా రంగంలో ముఖస్తుతిని మించిన యోగ్యత ఇంకొకటిలేదని తెలుసుకుని ఆశ్చర్య పోయాడు. ఎక్స్ట్రా ఏజన్సీద్వారా ఒక ఫిల్ములో సైనికులగుంపులో కలసి నటించి స్టూడియోలోకి వెళ్లాడు.

బన్వారీ ఆత్మగౌరవం, అహంకారం వదిలిపెట్టి డైరెక్టరుగారి ఆటబొమ్మ అవడంలోనూ, ఆయన్ని స్తుతించడంలోనూ నైపుణ్యం ప్రదర్శించాడు. అది డైరెక్టరుకు నచ్చింది. బన్వారీ స్టూడియోలో మూర్ఖునిలా నటించడం మొదలు పెట్టాడు. ఇతరుల మూర్ఖత్వంచూసి దర్శకులకు తమ తెలివితేటలపట్ల విశ్వాసం, అహంకారం కలిగి ఆనందిస్తారు. బన్వారీచేసిన ఈపనికి చాలా విలువవుందని రుజా వయింది.

బన్వారీ వృద్ధిలోకివచ్చాడు. సినిమారంగంలో అతనిమంత్రం ఒక్కటే - నీకు ఏం కావాలి?....ఏదైనా చెప్పు, అలా చూపించగలుగుతాను. బన్వారీ వినోదాన్ని కలిగించే నటనతోపాటుగా వినోదాన్నికలిగించే సంభాషణలుగూడా వినిపించ సాగాడు. ఒకవేళ డైరెక్టరు ఏదైనా తప్పుడుమాట చెప్పినాగూడా ఉత్సాహంగా దాన్ని సమర్ధించేవాడు. డైరెక్టర్ మిస్టర్ మహంత్ బన్వారీని తన కుడిభుజంగా ఎంచుకునేవాడు. బన్వారీ కళమీద భక్తి, అహంకారం వదిలిపెట్టేశాడు. ఇప్పు డేదైతే అతనికి బ్రతుకుతెరువు చూపగలుగుతుందో అదే కళ. మొదట తనని తాను కళాకారుడుగా భావించేవాడు. ఇప్పుడు తనని తాను నటుడిగా చెప్పుకోసాగాడు.

దారేఫౌజ్ కంపెనీలో 'జల్తా ఘోంసలా' సినిమా తీస్తున్నారు. డైరెక్టరు గారి తెలివితేటలతో రెండు విజయవంతమైన ఇంగ్లీషుకధలను కలిపి భారతీయ పద్ధతిలో ఒక కధ అల్లబడింది. అందులో నాట్యాలు, పాటలూ చాలా వున్నాయి. డైరెక్టరుగారు 'సోషల్ హిట్' తయారుచేస్తున్నారు. సినిమాలో గృహస్థజీవితానికి సంబంధించిన అనేక అంతరంగికదృశ్యాలుకూడా వున్నాయి. సగం సినిమా షూటింగు అయిపోయింది. మిగతాకథ ఇప్పుడు డైరెక్టరుగారి మనస్సులోనూ, బన్వారీ మనస్సులోనూ అల్లుకుంటోంది.

ఇప్పుడా సినిమాలో నిర్మించబడుతూవున్న దృశ్యం - నాయకుడు తన మరదలిపెళ్లికి అత్తారింటికి వెడతాడు. నాయిక చెలికత్తెలలో ఒకామె అందంచూసి ముగ్ధుడవుతాడు. నాయిక, మణికోసం డైరెక్టర్ మహంత్ అనుభవంవున్న యాక్ట్రెస్ చంద్రాన్ని ఎన్నుకున్నారు. నాయిక అక్క పీను ఎక్కువలేదు. ఈ పార్టు కోసం ఆయన గోమతిని రెండువేల కాంట్రాక్టుమీద తీసుకున్నారు. ఆమె మూడు రోజులు రిహార్సలుచేసి వెళ్ళిందికానీ డ్రెస్ రిహార్సలురోజున రాలేదు. నాయిక చెలికత్తెపార్టు రహీమా చేస్తోంది. గోమతి, రహీమా ఇద్దరూకూడా ఇంకా అనేక చోట్ల పనిచేస్తున్నారు. గోమతి రాకపోవడంవల్ల కంపెనీకి ఎలాగో నష్టం తప్పదు. ఆ పెట్టుకు సంబంధించిన మిగతా యాక్టర్లకి, స్టూడియోకి ఇవ్వాల్సిన అద్దె అనవసరంగా నెత్తిమీద పడుతుంది కానీ రహీమాకుకూడా నష్టం వుంది. ఆమెను 'ఆర్కెట్' కంపెనీవాళ్ళు రెండుపాటలు పాడటంకోసం పిలిచారు. ఆమె దారేఫౌక్‌తో తన కాంట్రాక్టును దృష్టిలోపెట్టుకుని నిరాకరించేసింది. 'గోమతి మీ దగ్గరకు రాలేదు, ఆమె ఆర్కెట్‌కు వెళ్ళింది' అని రహీమా డైరెక్టరుతో చాడీలు చెప్పింది.

డైరెక్టరు మహంత్‌కు యాక్ట్రెస్ చేసిన ఈ నమ్మకద్రోహంచూసి కోపం వచ్చింది. ఆర్కెట్‌వాళ్ళు దారేఫౌక్‌కు నష్టం కలిగించడానికి ఇంకా అనేక దుర్మార్గాలు చేశారు. 'గోమతికి జబ్బు అంటుకుంటవని విన్నాను. డబ్బులేని డాక్టర్లచుట్టూ తిరుగుతోందిట. కానీ రెండురోజుల్లో ఆమె ముఖంమీద పొక్కులులేస్తే ఆ దౌర్భాగ్యురాలికి మేకప్ ఎలా చేసేది అయ్యా. ఆమె కంఠంలోగూడా ఎంతమార్పు వచ్చిందండీ! అయ్యగారు ఏది కోరుకునేవారో అది ఆమెలో అంతరించిపోయింది' అని తెలియజెప్పారు బన్‌వారీ.

మహంత్ తన సిగరెట్టుకేసును బన్‌వారీ ముందుంచి అడిగారు, 'అంటే!'

బన్‌వారీ సిగరెట్టు తీసుకుంటూ, 'అయ్యా, గోమతి మోసంచేసింది - మణి, అంటే చంద్రాకి పోటీగానిలబడి హీరోగారిహృదయాన్ని అపహరించాలి, అంటే పబ్లిక్ హృదయాన్ని ఆకట్టుకోవాలి. మీరు ఆమె మేకప్‌ని ఇంకేవిధంగానన్నా ఆలోచించండి! 'సైలెంటు లార్క్'లో 'ఎవ్‌సన్ తో 'దోరా' చాలా బాగా

అందంగా వుంటుంది. యాక్టింగ్ అంత బాగుండకపోయినా, ఆకారంమటుకూ అతుక్కునేలా వుండాలి!' అని చెప్పారు.

'అవును!' మహంత్ సిగరెట్టుపొగవల్ల మందేకళ్ళను సగంమూసి ఆలోచించసాగారు.

'అయ్యా, విన్న ఒక అమ్మాయిని చూశాను. 'స్టేజిమీదకువచ్చి మీ డైరెక్షను తీసుకుంటే 'జల్తా ఫ్లోంప్లా' మిగతా అన్నిసినిమాలనీ తలదన్నుతుంది. ఆ అమ్మాయి బాగా తెలివికలదికూడా. పూర్తిగా 'పైలెంటు లార్కు' (నెమ్మదిగా వుండే బుల్ బుల్). మీ డైరెక్షనుని బాగా అర్థం చేసుకోగలదు. మీరు సరేనంటే చాలు, పిలిపించి చూడచ్చు. గోమతీ రిహార్సలుగూడా పూర్తి అవలేదు. ఒకటి, రెండు కొత్తముఖాలు రావడంకూడా మంచిది!'

మహంత్ కుర్చీ వెనకబాగాన్ని ఆధారంగాచేసుకుని వాలి, 'ఇప్పుడు రాగలిగితే పిలిపించు, నిర్ణయం చేసెయ్' అన్నారు.

• • •

సోమా సినిమా కంపెనీవాళ్ళకారులో మహిమ్‌నుంచి అంథేరీ వెడుతోంది. బరకత్ ఆమెపక్కనకూర్చుని ప్రార్థిస్తున్నట్లుగా సలహా ఇస్తున్నాడు. 'చాలా కష్టపడినమీదట ఈ అవకాశం మనచేతికి వచ్చింది. ఇప్పుడు జాగ్రత్తగా మసలుకు రాగలిగావంటే జీవితం ఒకదోవన పడుతుంది.'

సోమా పళ్ళుకొరుకుతూ బరకత్‌వైపు చూడకుండా ఆలోచించసాగింది - నీ దగ్గరనుంచి తప్పించుకుపోవడానికి నూతిలో దూకటానికికూడా సిద్ధంగావున్నాను. ఇప్పుడు నాదగ్గర వున్నదేముంది. పోతుందని భయపడడానికి! విన్నవచ్చిన ఆ మంచిమనిషి కొంచం సాయంచేస్తే చాలు. భగవంతునిదయవల్ల ఆయన అక్కడ వుంటే ఎంత బాగుంటుంది! అనుకుంది.

స్టూడియోలో అందరికన్నాముందు బన్‌వారీయే వాళ్ళని కలిశాడు. 'ఏ విషయంలోనూ భయపడద్దు' అని హామీ ఇచ్చాడు.

సోమా నూతిలో దూకటానికికూడా సిద్ధమై, సాహసించి వచ్చింది. ఈ వ్యక్తిచేతిని సాయంగాఇచ్చి నూతిలోనుంచి ఒడ్డుకి దూకడానికి సహాయం చేస్తాడని

ఆమెకి అనిపించింది. డైరెక్టరు ఏ సంకోచమూ లేకుండానే ఆమెముఖాన్ని పరిశీలనగా చూశారు. సోమా ఆ చూపుకి భయపడలేదు. అపరిచితుడైన డాక్టరు ఎదుట బట్ట తొలగించటానికి సంకోచమనిపించదు.

డైరెక్టరు ఆమె నుదుటిని, ముక్కుని, కళ్ళని, పెదిమలని, బుగ్గలనీ, గడ్డాన్నీ, అన్నింటినీ పరిశీలనగాచూసి బన్‌వారీవైపు తిరిగి, 'నాట్ బాడ్' (ఫరవా లేదు) అన్నారు గంభీరంగా. ఏదైనా వనిముట్టుని ఇటూ అటూ తిప్పి పరిశీలనగా చూస్తున్నట్లు వుంది. 'సరిగా మాట్లాడగలుగుతుందా?' అని అడిగారు.

డైరెక్టరు సోమాని చూసి, 'దోవలో మీకేమీ ఇబ్బంది కలగలేదు కదా?' అన్నారు.

సోమా ఏమీ ఇబ్బంది కలగలేదని తలతిప్పి, రెప్పలువాల్చి కృతజ్ఞత వెలిబుచ్చింది.

మహంత్ రహస్యం తెలుసుకున్నట్లు కంఠంమార్చి, బన్‌వారీవైపు చూసి, ఇంగ్లీషులో 'ఈమె కళ్ళతో మాట్లాడుతోంది, కళ్ళు బాగున్నాయి' అన్నారు.

'ఈమె హావభావాలతోపాటు 'చంపా అండ్ పార్టీ' వాళ్ళ బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ కలిస్తే 'జల్‌తా ఘోంసలా' (మండుతున్న గూడు) బొంబాయిలో ఒక ఏడాది నడుస్తుంది,' బన్‌వారీ ఇంగ్లీషులో సమర్థించాడు.

రిహార్సలుకోసం సోమాని స్టూడియోలోపలికి పిలిచారు. అక్కడ ఇంతా ఎనిమిదిమంది స్త్రీలను చూసి సోమాకు నమ్మకం కలిగింది కానీ ఆ స్త్రీలకళ్ళల్లో సానుభూతికంటే ఈర్ష్య ఎక్కువ అని తెలుసుకోవడానికి ఆమెకి ఎక్కువసేపు పట్టలేదు.

మేకప్ రూంలోకి తీసుకువెళ్ళి సోమా దుస్తులుమార్చి, ముఖానికి రంగు పూసి బాగా అలంకరించారు. ఫోటోగ్రాఫర్ లెన్స్ తీసుకుని ఆమె ముఖానికి దగ్గరగాపెట్టి కెమేరాలో ఆమె ఆకారం ఏవిధంగా పడుతుందా అని చూశాడు.

స్టేజీమీద స్త్రీలు పెళ్ళికూతురిచుట్టూరా మూగి పాటపాడటానికి తయారుగా కూర్చునివున్నారు. డైరెక్టరు అడుగుపొడుగువున్న ఒక బెత్తాన్ని చేతిలోపట్టుకుని

దానితో సౌంజ్ఞచేస్తూ అందరినీ ఆజ్ఞాపిస్తున్నారు. సోమాని పెళ్ళికూతురిదగ్గరగా కూర్చోబెట్టారు. నాయకుడు ఒక కిటికీలోనుంచి తొంగిచూస్తున్నాడు.

డైరెక్టరు సోమాని 'చూడండి' అని పిలిచి పెళ్ళికూతురివైపు చేతికర్రతో సౌంజ్ఞచేసి, ఈమె గడ్డంపట్టుకుని, 'అరే. ఇంత నిరుత్సాహంగా వున్నావేం ? అనండి' అని చెప్పారు.

సోమా చెప్పినట్లు చేసింది.

'కొంచం బిగ్గరగా అనండి' అన్నారు డైరెక్టర్.

సోమా బిగ్గరగా మళ్ళీ చెప్పింది.

డైరెక్టరు చేతికర్రతో తొడమీద కొట్టుకుని, 'నవ్వి చెప్పండి' అని ఆజ్ఞాపించారు.

సోమా ప్రయత్నించింది కానీ డైరెక్టరుగారికి సంతృప్తి కలగలేదు. పక్కనే కూర్చున్న స్త్రీలు సోమాప్రయత్నం విఫలమవటంతో గొల్లున నవ్వారు.

'అమ్మా, ఇక్కడ నవ్వటానికి డబ్బులిస్తారు, సిగ్గుపడటానికి కాదు' అన్నారు బన్‌వారీ కోపంగా.

సోమా ఒక్కసారి రెప్పలువాల్చి నవ్వడానికి ప్రయత్నించింది, నవ్వి చూపించింది.

డైరెక్టర్ గుణాన్ని వెంటనే పసిగట్టేతత్వం గలవారు. 'గుడ్ !' అని ఆమెను అభినందిస్తూ చేయెత్తి శభాష్ అని మెచ్చుకున్నారు. కేమేరామెన్‌ని పిల్చి, 'ప్రుర్ ప్రురే, గుర్తుంటుందా, ఇక్కడే క్లోజప్ కొట్టాలి !' అన్నారు.

డైలాగ్ డైరెక్టరు చెప్పినమీదట పెళ్ళికూతురు గాద్గదికస్వరంతో, 'అక్కయ్యా, మీతోకలిసి చిన్నతనమంతా గడిపాను, మిమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళిపోతున్నాను' అంది.

'ఇప్పుడిలా అంటున్నావుగానీ తరువాత నీ ఉత్తరంకోసం రోజూ ఎదురు చూడాల్సి వస్తుంది. నీకు ఉత్తరం రాయడానికికూడా తీరుబడి వుండదు' అని సోమాని చెప్పమన్నారు.

సోమా ప్రయత్నించింది.

'తరువాతకాదు, తర్వాత అని చెప్పండి!' అని బన్‌వారీ అడ్డగించారు. పక్కనేవున్నవాళ్ళు నవ్వారు. సోమాకి మిగతామాటలుగూడా — 'మాటలాడు కి మాట్లాడు' అని, 'చూడాలిసి కి చూడాల్సి' అని, 'రాయడానికి కి వ్రాయడానికి' అని చెప్పాలని తెలియజెప్పారు.

ఈ అమ్మాయి పంజాబు కొండప్రాంతంనుంచి వచ్చిందన్నవార్త మొదటి రోజునే అందరి చెవులకూ పడింది. ఆమెపేరు 'పహాడన్' అని పడిపోయింది.

సోమా మరునటిరోజు బరకత్‌తో కలిసి నిర్ణీతసమయానికి స్టూడియోకి వచ్చింది. జీవా కోపంగా అంటున్నారు. 'ఏక్టర్లని, ఏక్ట్రెస్‌లని తీసుకువచ్చే కాంట్రాక్టు మీరు మా కిచ్చి మీ అంతట మీరు ఏక్ట్రెస్‌ని ఎలా తీసుకురాగలుగుతారు? గోమతీ రాకపోయినట్లయితే మీరు మాకు తెలియపరచాలి. మేము మీ అవసరాన్నిబట్టి ఇంకొక ఏక్ట్రెస్‌ని సప్లై చేసేవాళ్ళం. ఇప్పుడు మీరు పెట్టుకున్న అమ్మాయి కోసం మేము వాళ్ళమనిషికి అడ్వాన్సు ఇచ్చేశాము.'

'నువ్వు చెప్పు, నేను మీకు ఈ అమ్మాయికోసంగా పదిరూపాయలు అడ్వాన్సు ఇచ్చానా లేదా?' అని జీవా బరకత్‌వైపు కోపంగాచూస్తూ అడిగారు.

బరకత్ ఎదురుతిరిగాడు. జీవా ఈ నమ్మకద్రోహంచూసి చాలా తిట్టారు. జీవా బన్‌వారీని సాక్ష్యం అడిగారు. 'మీరు చెప్పండి, మీరు ఆ రోజురాత్రి ఈ స్త్రీని మా హోటల్లో చూశారా లేదా?....ఆమె మా మనిషి. మా మనిషిని మీరు తిన్నగా మీ పనిలో ఎలా పెట్టుకోగలుగుతారు? మా కమీషను ఎక్కడికి పోతుంది? ఇది బిజినెసా లేకపోతే దోపిడీయా!'

బన్‌వారీ చూశాడు. జీవా తన కమీషనుకోసం సోమాని అపకీర్తిపాలు చేసేస్తాడు. బన్‌వారీ జీవా చెయ్యిపట్టుకుని ఒకవైపుకు తీసుకెళ్లాడు. జీవా బాగా ఆవేశంలో వున్నారు. 'మీకు ఏభై మంది ఆడవాళ్ళు కావలసినప్పుడు మేము బాధపడాలి. మీకు ఎవరైనా ఆడది నచ్చితే, మీరు మా మనిషిని ఎగరేసుకుపోతారు! ఇది బిజినెసా! ఆమె మా మనిషి. మేము కావాలనుకుంటే ఆమెను స్టేజీమీదకు పంపిస్తాం. లేకపోతే ఇంకొకపనిలోకి. మీరు మా బిజినెస్ పాడుచేస్తే మేము మీకు సహాయం

ఎలా చేస్తాం? సినిమావాళ్లు ఏజన్సీ అక్కరలేకుండా ఫిల్ము తయారుచేయాలను కుంటే చేసుకోమను। మేము ఏజన్సీ ఆపేస్తాం. యాక్టరు మా దబ్బుపుచ్చుకుని కనిపించకుండా పారిపోయాడని రేపు మీరు అంటే అప్పుడు మా జవాబుదారీ ఏం లేదు; గుర్తుపెట్టుకోండి।'

'షాహూంకారుగారూ, మీరు వ్యాపారం చేసుకునే మనుషులు. మొండివట్టు దల పడతారెందుకు? ఒక పక్షి వలలోనుంచి తప్పించుకుని పోయినంతమాత్రాన వలని తెంపేసి పారేస్తారా? ఒకటిపోతే మాత్రమేం, ఇంకా వందలకొలది చిక్కు తుంటాయి। ఈ అమ్మాయి మీకు సరిపోయేదికాదు ' బన్‌వారీ నచ్చజెప్పాడు.

'ఇటువంటి అమ్మా.... మేము వందలకొలది అమ్మిపారేశాం।' షాహూ కారు మీసాలమీద చేతులు పెట్టుకున్నాడు.

'అమ్మివుండచ్చు' బన్‌వారీ నెమ్మదిగా చెప్పాడు, 'డైరెక్టరు మహంత్ గారికి ఈ అమ్మాయి బాగా నచ్చింది. స్వయంగా ఆయనే పిలిపించారు. దానికోసం అంత పోట్లాటకి దిగుతావెందుకు। ఇంకొకచోట నష్టపడాల్సి వస్తుంది. మా మాట నమ్ము.'

సోమా తెరవెనుకనుంచి ఇదంతా విని వణికిపోతోంది.

డైరెక్టర్ మహంత్ ఆశించినట్లుగా సహోదస్ చాలా తొందరగా పై కొచ్చింది. ఆమె మనస్ఫూర్తిగా అన్నీ సరైనపద్ధతిలో చేయగలగడానికి ప్రయ త్నిస్తోంది. సాయంకాలంపూట తీరుబడి కలిగినప్పుడు బన్‌వారీ బరకత్‌కి సలహా ఇచ్చి సహోదస్‌ని సినిమాకు తీసుకెళ్ళేవాడు. యాక్ట్రెస్‌ల రకరకాల హావభావాలు చూపించి 'అర్థమయిందా?...... ఎలా వుంది? నువ్వు ఇలా చేయలేవా?' అని అడిగేవాడు.

సోమా లాహోర్‌లో మనోరమతోనూ, వదినగారితోనూ కలిసి చాలాసార్లు సినిమాలు చూసింది. సినిమా ఆమెకు బాగా నచ్చేది. కానీ యాక్ట్రెస్‌ల నడవడి చూసి, 'అయ్యో! వీళ్ళు ఎలావున్నారు? అన్నీ చూపిస్తూ ఇలా చేస్తారేమిటి? అలా చేయడానికి వీళ్ళకి సిగ్గు అనిపించదా?' అనుకునేది. ఇప్పుడు నేనుకూడా ఇలా చేయగలను....అనుకుంది. బన్‌వారీ, బరకత్‌కూడా ఆమెకు ధైర్యం కలిగించే

వాళ్ళు. 'నీ కేమీ కష్టమనిపించదు. రెండు సినిమాలలో బాగా పనిచెయ్యి. తర్వాత సినిమావాళ్ళే నీ చుట్టూ బతిమాలుతూ తిరుగుతారు. మధు, చంద్రా, హేమా, వాళ్ళగురించి, ఎన్నివేలు సంపాదిస్తున్నారో వివరించేవాళ్ళు.

బన్‌వారీ ఒక సినిమాలో సహారన్‌కి పల్లెటూరివాళ్ళ నాట్యంచూపించి 'నువ్వు ఇలా నాట్యం చేయలేవా?' అని అడిగాడు.

సహారన్ చేయగలనని చెప్పింది. నేర్పిస్తే నాట్యం చేయగలుగుతుంది. ఆమె పాట పాడటానికిగూడా సిద్ధంగా వుంది. ఏదైనా సరే చేయడానికి ఆత్రంగా వుంది.

సహారన్‌ని కేవలం మూడు సీన్లకి పిలవడం జరిగింది. ప్రారంభంలో కథ ఇలా వుంది - నాయకుడు, రేణు (సహారన్)ని చూసి ముగ్ధుడై, ఆమె ప్రేమలోపడి భార్యని లక్ష్యపెట్టడు. నాయిక తన చెల్లెలు రేణుకి విషం పెట్టి చంపేస్తుంది. తర్వాత ఈ విషయమై పరిశోధన జరిగేప్లాటు విక్కించడానికి ప్రయత్నం జరుగుతోంది. కానీ సహారన్ నటనతో తృప్తిపడి డైరెక్టరు ఆమెని స్క్రీనుమీద మరికొంత సేపు వుంచడం మంచిదని అనుకున్నాడు. ఆమె అందచందాలని పూర్తిగా ఉపయోగించుకోవాలనే ఉద్దేశంతో కథలో మరో రెండు సీనులు సృష్టించారు. బన్‌వారీ యూ. పీ. లో బాగా పేరుపొందిన 'ఖోడియా'నుంచి ఒక పాటని వ్రాసి తీసుకొచ్చారు. 'ఏమండీ, దీనిమీద సహారన్ నాట్యం ఒకటివుంటే బాగుంటుంది' అని డైరెక్టరుతో అన్నాడు. డైరెక్టరు ఈ సలహాని ఆనందంతో ఎగిరి గంతేశాడు.

బాగా అనుభవంవున్న భూరే, సహారన్ పాటకి నేపథ్యసంగీతం కూర్చేలా ఏర్పాటయింది. మొదట ఓ పాటపాడి ఆమెకు వినిపించారు. తర్వాత ఒక్కొక్క పదం పాతికసార్లు అనిపించారు. డైరెక్టరు, సౌండ్ ఇంజనీరు చోఖే, రికార్డింగ్ రూంనుంచి మాటిమాటికీ గొంతు పెంచడానికీ, తగ్గించడానికి ఆదేశాలు ఇస్తున్నారు. సౌండ్ ఇంజనీరు పాటని పాస్ చేయడంలేదు. సహారన్ ముఖంమీద ఎర్రరంగు వ్యాపించింది. చెమట బిందువులతో ముఖం తడిసిపోయింది.

బన్‌వారీ డైరెక్టరు చెవుదగ్గర నోరుపెట్టి, 'అయ్యో, ఈ సమయంలో టెక్నికలర్ కెమేరా వుంటే!' అన్నాడు.

సౌండ్ ఇంజనీరు చోఖే అనేకసార్లు పహాడన్ కళ్ళల్లోకిచూసి నవ్వారు. మాట్లాడడానికికూడా ప్రయత్నించారు. కానీ పహాడన్ కళ్ళుదించుకుని తప్పించు కుంది. బన్‌వారీ పసిగట్టాడు. ఒంటరిగావున్నప్పుడు పహాడన్‌కి తెలియజెప్పాడు. 'పహాడన్, ఇది సినిమా ప్రపంచం. వీళ్ళు కావాలనుకుంటే నీ గొంతు మురళీ వేణు వులా మారుతుంది. వద్దనుకుంటే విరగగొట్టిపడేసిన వానపుల్లలా అయిపోతుంది. ఇది తెలుసుకో. మహంత్ చాలా మంచిమనిషి. కెమేరావని బాగా అర్థం చేసుకుం టాడు. కెమేరామెన్ ఆయన్ని మోసంచేయలేదు. కానీ చోఖే మరోరకం మనిషి. ఇది తెలుసుకుని ప్రవర్తించు.'

పహాడన్ నీరసించిపోవడంచూసి బన్‌వారీ తిట్టాడు. 'అలాంటిదానివైతే ఇక్కడ కాళ్ళు ఎందుకుపెట్టావ్? మేము మొదటనే చెప్పాం. ఇప్పుడు తెలివిగా మసలుకుంటే సరి. మేము నీ చెప్పులు నరికేస్తాం' అన్నాడు.

మరునాడు రిహార్సలుకన్నా ముందు చోఖే పహాడన్ కళ్ళల్లోకి చూడగానే ఆమె సిగ్గుపడి నవ్వింది. 'మీరు నేనంటే కోపంగావుంటారు' అంది.

'లేకపోతే, ఇవ్వాళ సాయంత్రం మాతోకలసి భోజనం చేయండి' అన్నాడు చోఖే.

'మీరు మమ్మల్ని చాలా భయపెడుతున్నారు. మా పాట మీకు నచ్చడం లేదు. భయంవల్ల ఆకలి చచ్చిపోయింది. తినేదేముంటుంది?' అన్నది పహాడన్.

ఆరోజు సాయంత్రం పహాడన్ పాటని అందరూ మెచ్చుకున్నారు. సాయం కాలం ఆమె చోఖేతోకలసి 'గ్రేట్ మొగల్'కు భోజనం చేయడానికి వెళ్ళింది. రాత్రి ఒంటిగంటకి చోఖే ఆమెని టాక్సీలో మహీమ్ తీసుకువెళ్ళి దిగబెట్టాడు. అర్ధరాత్రి ఇంటికి వచ్చిందని బరకత్ పోట్లాడి, తిడతాడేమోనని సోమా భయపడ సాగింది. ఆమె కోపంలో అలాగే అనుకోసీమని నిశ్చయం చేసుకుంది. పక్కన గదిలో కొద్దిరోజులక్రితం దెబ్బలుతినే స్త్రీ గుర్తుకు వచ్చింది.... ఈ దుర్మార్గుడికి నా మీద అధికారమేముంది? అనుకుంది.

సోమా చాలాసార్లు తలుపు తట్టినమీదట బరకత్ నిద్రనుంచి లేచాడు. కానీ అతను ఏమీ మాట్లాడలేదు. మెదలకుండా తన దుప్పటి కప్పుకుని నిద్రపోయాడు.

సోమాకి చాలాసేపటివరకూ నిద్ర రాలేదు....ఇదేమిటి జరుగుతోంది? ఏదైనా కానీ. కాళ్ళు పెట్టడానికి చోటు దొరికింది. నెలా పదిహేనురోజులనుంచి స్థాని యోకి వెడుతోంది. ఎనిమిదవందలరూపాయలు వచ్చాయి. బహుశా కొద్దిరోజుల తర్వాత ఆమె తన ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించగలుగుతుంది. ఈ గదినుంచి బయట పడగలుగుతుంది.

వహీదన్ పాడినపాట రికార్డు చాలా పేరు సంపాయించింది. ఆ పాట రికా ర్డుకి. ఆమె నాట్యానికి రిహార్సల్ జరుగుతోంది. నేలమీద గీతలుగీసి ఏ మాటమీద ఎక్కడ కాలు పెట్టాలో చూపించారు. ఫుల్ డ్రెస్ రిహార్సల్‌లో వహీదన్‌కు లంగా. ఓణీ కట్టారు. లోపలికిపోయివున్న ఆమె పొట్ట స్పష్టంగా కనిపిస్తోంది. మంచి అందమైన ఆమె పచ్చటిశరీరం స్పష్టంగా కనిపిస్తున్నచోట వెంట్రుకలు కెమేరాలో కనిపించకుండా వుండటానికి తెల్లటిరంగును పూశారు. రవిక బాగా బిగుతుగా వుంది. రవిక ముందుభాగం బాగా వెండివుంది. కొద్దిగా మార్చివింపి దాన్ని ఇంకా ఆకర్షణీయంగా చేశారు.

రికార్డు మాటిమాటికీ తిప్పుతున్నారు.-'దోపహరియా కామామ్‌లా, మేరా గోరా బదన్ కుమ్‌హలాయే' (మధ్యాహ్నంవేళలో, నా పచ్చనిశరీరం వడిలిపోయెను గదరా!')

దోపహరియా కా మామ్‌లా (మధ్యాహ్నంవేళలో) అనేటప్పుడు అమాయ కత్వంతో రెండుచేతులూ చాపాలి. 'మేరా గోరా బదన్' (నా పచ్చని శరీరం) అనేటప్పుడు భుజాల్ని తాకి నడుముకి బలాన్ని ఇవ్వాలి. 'కుమ్‌హలాయే' (వడిలి పోయెనుగదరా) అనేటప్పుడు దానితోబాటు చీరకొంగుతో గాలిని తీసుకోవాలి. అని అంతా డైరెక్టరు సోమాకి తెలియజరిచాడు. ఈ పదభావాన్ని పూర్తిగా అభినయించ డానికి రెండున్నరగంటలు పట్టింది. ఒక్కొక్కప్పుడు వహీదన్ కాళ్ళు నేలమీద గీసిన గీట్లుదాటి ముందుకి, వెనక్కి పడుతూవుండేవి. అప్పుడప్పుడూ ఫోటో గ్రాఫరు లైటుకాంతి మార్పించేవాడు. వహీదన్ అలసిపోయింది. ఇరవైసార్లు ఈ పదాన్ని అభినయం చేసినమీదట 'చెక్' తీసుకోబడింది. ఆమెకు టీ ఇచ్చి కొద్ది సేపు విశ్రాంతి తీసుకునేందుకు అవకాశం ఇచ్చారు.

పాట రెండవపదానికి నాట్యం ప్రారంభమయింది — 'పాసురీ, తేరా బేటారీ

తేరా బేటారీ మేరే జోబన్ కో హాథ్ లగాయే। ఈ పదానికి మొదటిదానికన్నా ఎక్కువసేపు పట్టింది. నవ్వి ముసుగు లాక్కునేటప్పుడు కాళ్ళు నేలమీద గిసిన గీట్లకి ముందూ, వెనకా పడుతుండేవి. పహాడన్ ఊపిరి బిగబట్టి కష్టపడింది. డైరెక్టరుగారి ఆదేశానుసారంచేసి చూపించింది. డైరెక్టరు పూర్తి తృప్తిపడ్డారు. సోమా 'క్లోజప్' నాట్యంలోని ఆకారం, ముఖాకృతికి సంబంధించిన 'స్టిల్' తీసుకోబడింది. ఆరోజు దారేఫౌజ్ కంపెనీ ప్రొడ్యూసరు ఎమ్. పాలిత్ తమదగ్గరికి కొత్తగావచ్చిన యాక్ట్రెస్‌ను గురించి విని, ఆమెపని చూడటానికి వచ్చారు. డైరెక్టర్ మహంత్, మిగతావాళ్లు ఆయన ముందూ-వెనకా తిరగడం మొదలుపెట్టారు. పాలిత్ షూటింగ్ అయిపోయినతర్వాత పహాడన్‌కు అభినందనలు తెలిపారు. టీకి ఆహ్వానించారు కూడా.

పహాడన్ తన విలువ తెలుసుకోసాగింది. ఆమె ముఖంలోనూ, ప్రవర్తనలోనూ మార్పు వచ్చేసింది. ఆమె బాగా అలసిపోయివుండటంచేత ప్రొడ్యూసర్‌ని క్షమార్పణ కోరింది. ప్రొడ్యూసర్ కోసం కుర్చీలోనుంచిగూడా లేవలేదు.

పాలిత్ వినయంగా నవ్వి, 'అయితే రేపుతప్పదు' అని వెళ్లిపోయారు.

బన్వారీ వచ్చి, 'పహాడన్, మంచిపనిచేశావు। ఇదే అన్నిటికన్నా పెద్దపాము. ఇతనే యజమాని. అతను అవునన్నాడంటే, డైరక్టరు, మిగతావాళ్ళు పేరుఎత్తుకునే అమ్మాయినిగూడా ఏనుగుదంతంతో చేసిన విగ్రహం అని ఒప్పుకోవాలిసిందే. వీలున్నంతవరకూ, ఈ సినిమా పూర్తి అయ్యేవరకు ఇతన్ని వలలో బంధించి వుంచాలి' అని చెప్పాడు.

మరునాటిరోజు పహాడన్ పాలిత్‌తోకలసి డిన్నర్ తీసుకోవడానికి తాజ్‌కు వెళ్ళి అక్కడినుంచి టాక్సీలో మహీమ్ తిరిగివచ్చింది. ప్రొడ్యూసర్ మూడవ రోజున పహాడన్‌ని మళ్ళీ తాజ్‌లో కలుసుకోవడానికి పిలిపించారు.

'ఈమె మరో ఫిల్మ్‌కంపెనీలోకి వెళ్ళటానికి వీలుండకూడదు. ఇప్పటివరకూ రోజుకు ఏభై రూపాయలవంతున పని చేస్తోంది' అని పాలిత్ డైరెక్టరుకు తన అభిప్రాయం చెప్పారు. పాలిత్ తెలియజెప్పినమీదట మహంత్ ఆమెని ఆరు నెలలకు షరతుపత్రం వ్రాసిమ్మని అడిగాడు. పహాడన్ బన్వారీ సలహాని కోరింది.

'పదిహేనుసందలు నెలకు ఇమ్మని అడుగు. ప్రతినెలా జీతం అడ్వాన్సుగా ముందే ఇమ్మను.' అని బన్‌వారీ సలహా ఇచ్చారు.

పహాదన్‌కి బన్‌వారీ అభిప్రాయం విచిత్రనంగా తోచింది కానీ ఆమె డైరెక్టరుతో ఇదే చెప్పింది. ఆమెకోరిక అంగీకరించబడింది.

పహాదన్ చేతిలోకి చాలాడబ్బు వచ్చింది. ఆమె మహీమ్‌లోని గదిని వదిలిపెట్టేసింది. బన్‌వారీసహాయంతో దాదర్‌లో నెలకు రెండువందలకు ఒక ఫ్లాటు అద్దెకు తీసుకుంది. బరకత్‌తోకలిసి ఒకేగదిలో వుండటం ఆమెకు సహించరాని బాధగా తోచింది. స్టూడియోవల్ల దొరుకుతున్నదాంట్లో ఎక్కువభాగం బరకత్ చేతిలోకి వెళ్ళిపోతోంది. డబ్బురూపంలో తీసుకోవడంగురించి పహాదన్‌ని బన్‌వారీ వారించారు. 'చెక్కు తీసుకో. బాంకులో దాచుకో.' అని చెప్పారు.

సోమాచేసిన ఈ దుర్మార్గానికి బరకత్ చాలా మండిపడ్డాడు. 'ఇప్పటినుంచీ మామీద కళ్ళెర్ర జేస్తున్నావా?' అని సోమాని చాలా తిట్టాడు. కొడతానని బెదిరించాడు.

పహాదన్ బరకత్‌ని చూస్తూ అతని ఎదుట నిలబడివుండిపోయింది. నుదుటిపైన ముడతలుపడ్డాయి. బరకత్‌వైపు కోపంతో చూసి, 'జాగ్రత్త, అనవసరంగా వాగావంటే ఇప్పుడే పోలీసుస్టేషనుకు పంపిస్తాను. వుండాలనివుంటే బైటగదిలో తిన్నగా వుండు.' ఎదురుతిరిగింది.

బరకత్‌కి పహాదన్‌లో మళ్ళీ లాహోర్‌లోవుండే సోమా పదిరెట్లు ఉగ్రరూపంతో కనిపించింది. అతను భయపడ్డాడు. తన అవసరంకోసం అప్పుడప్పుడూ ముఖస్తుతిచేసి, అప్పుడప్పుడూ కోపంచూపించి పహాదన్ దగ్గరనుంచి డబ్బు లాగసాగాడు. అతనిఖర్చు తక్కువకాదు. అతనికి రోజుకు ఎనిమిది - పదిరూపాయలు కావాల్సివుండేది.

గోమతికి రెండురోజులు జ్వర ఎక్కువగా వుండటంచేత దాదేఫాక్‌కు రాలేకపోయింది. మూడవరోజున వచ్చేసరికి తనస్థానంలో ఇంకొకస్త్రీని పెట్టుకున్నారని తెలుసుకుంది.

గోమతి డైరెక్టర్‌ని ముఖస్తుతి చేసింది. '....మనిషికి కష్టాలు, సుఖాలు

కలుగుతూవుంటాయి. ఇంకొకచోట పని చేయడానికిమాత్రం వెళ్ళలేదు. ఎవరినైనా బుజావుచేసి చూపించమనండి!' అని బ్రతిమలాడింది. కానీ దారేఫౌక్‌కి ఆమె అవసరంలేదు. 'అద్వాన్నంగా తీసుకుని నువ్వు వాడుకున్నది ఏది. ఇప్పుడు మాకు సెలవు ఇప్పించు' అని దారేఫౌక్‌వాళ్లు పంపేశారు.

దారేఫౌక్‌నుంచి గోమతిని తీసేశారన్న వార్తతోపాటు ఆమె జబ్బుకు సంబంధించిన అపకీర్తికూడా వ్యాపించసాగింది. ఇంకొకచోట ఆమెకు పని దొరకటం దుర్లభమైపోయింది. చికిత్స జరుగుతూవుండటంవల్ల ఆమె జబ్బుగూడా అణిగివుంది. ఇప్పుడు చికిత్స పొందటానికి డబ్బు లేకపోవడంచేత జబ్బుకూడా ఒక్కసారి ఉధృతమయింది.

పహాడన్‌ని పెట్టుకోవటంకోసమే తనని తీసేయడంవల్ల గోమతికి పహాడన్ మీద కోపం వచ్చింది. 'పహాడన్‌కి ఏం తెలుసు. యాక్టింగ్ ఏం చేస్తుంది? అడవి మేకలాగా కళ్ళుతిప్పి అరుస్తుంది. తెల్లటి రుచిలేని జామపండు రంగుచూసి కంపెనీ వాళ్ళు ముందుకి దూకారు. ఈ దుర్మార్గురాలిని నాలుగురోజుల్లో వదిలేసి అవతల పారేస్తారు' అని గోమతి అందరితోనూ చెప్తూవుండేది.

గోమతి డైరెక్టర్‌ని, ప్రొడ్యూసర్‌ని, కంపెనీని ఏమీ చేయలేదు. గుండె మంటవల్ల ఆమె పోట్లాడటానికి పహాడన్‌ఫ్లాటుకు వెళ్ళింది. ఆమె ఇంటి గుమ్మం దగ్గర నిలబడి, 'నువ్వు మా పొట్టకొడుతున్న దేమిటి కన్నుతున్నావ్. సర్వనాశనం అయిపోతావ్! ఏ అందంచూసుకుని నువ్వు గర్వపడుతున్నావో, ఆ అందాన్ని భగవంతుడు నాశనం చెయ్యాలి! ఎవరి సంపాదనకొట్టి నువ్వు తింటున్నావో. దాంట్లో పురుగులు పడాలి! ఒక సంవత్సరంలోగా నీకు జబ్బు అంటుకోకపోతే రోడ్డుమీద నన్ను చెప్పుతో కొట్టు' అని తిట్టడం మొదలుపెట్టింది.

పహాడన్ భయపడి లోపలిగదిలోకివెళ్ళి దాక్కుంది. తలుపులు మూసేసింది. ఆమె హుందాతనం గోమతి ఎదుటనిలిచి నవ్వసాగింది. గోమతి అలాగే వాగుతూ వుండటంచూసి బరకత్ చెప్పు చేతిలోకితీసుకుని ఆమె ముందుకి వచ్చాడు. గోమతి మెడపట్టుకుని గెంటి ఫ్లాటుకిందికి దించేశాడు. గోమతి తిడుతూనే వెళ్ళిపోయింది.

పహాడన్‌గుండె చాలాసేపటివరకూ వేగంగా కొట్టుకుంటూనేవుంది. ఆమె

తలపులుమూసి, మంచంమీద పడుకుని, కళ్ళు మూసుకుని తన భవిష్యత్తుగురించి ఆలోచిస్తూ వుండిపోయింది.

గోమతీ ఈవిధంగా వ్యతిరేకప్రచారం చేయడంవల్ల ఇతరకంపెనీలలో గూడా సోమానిగురించి చర్చ ప్రారంభమయింది. 'జల్తా ఘోంస్లా' సినిమా పూర్తి అవుతూనే మణిమాలకూడా పహాడన్‌కి వ్యతిరేకంగా ప్రచారం చేయడం మొదలుపెట్టేసింది. పహాడన్‌ని అనవసరంగా హీరోయిన్‌గా చేశారు. సినిమా ప్రచారంలో మణిమాల పేరుంది కానీ సినిమాలో వున్నది పహాడన్. ఇకముందు వచ్చే సినిమా ప్రచారపత్రాలలో పహాడన్ పేరు అన్నింటికన్నా పైన వుంటుందని అందరికీ తెలుసు. డైరెక్టరు, ప్రొడ్యూసరు, ఎవరిని కావాలనుకుంటే వాళ్ళని పైకి ఎత్తుతారు. అక్కరలేదనుకున్నవాళ్ళని కిందకు పడదోస్తారు!

ఒకసంవత్సరం గడుస్తూనే పహాడన్ నటించిన మూడుసినిమాలు బొంబాయిలో ప్రదర్శింపబడుతున్నాయి. 'మాషూమ్ చోర్', 'మన్ కా పౌదా' లలో పహాడన్ నాయికభూమిక ధరించింది. బొంబాయిలోని ఆకాశం పహాడన్‌పేరును ప్రతిధ్వనింపసాగింది. ఆమె ముఖానికన్నా పదిరెట్లు పెద్దవైనబొమ్మలు గోడలమీద అన్నివైపులా కనిపిస్తూవుండేవి. ఇళ్ళల్లోనూ, టీ దుకాణాలలోనూ, కిళ్ళీ-బీడీ కొట్ల మీద, గ్రామ్‌ఫోన్‌లద్వారా, రేడియోలద్వారా ఆమె పాటలరికార్డులు వినిపించసాగాయి. ఆమె ప్రతిబింబము తన ముఖాన్నే చూస్తూవుండేది, తనగొంతే వింటూ వుండేది. 'మేరే జోబన్‌కో హాథ్ లగాయే' (నా యౌవనాన్ని చేత్తో తాకావు) 'మన్ పంఛీ భూల్ నజానా' (మనసనే పక్షి మరచిపోవద్దు)....'బిసాయే ప్రీత్ కా సంసార్' (ప్రేమ ప్రపంచాన్ని సృష్టించావు.)

పహాడన్ నాలుగుసినిమాలలో ఒకేసారి పని చేస్తోంది. ఆమె వీలునుబట్టి కంపెనీవాళ్ళు తమ షూటింగు, రిహార్సలు ఏర్పాటు చేసుకోవలసివచ్చింది. బ్యాంకులో ఆమెపేరున ముప్పైవేలు జమ చేయబడ్డాయి. ఆమె డబ్బు అనవసరంగా ఖర్చు పెట్టేదికాదు. 'అసలైనవిషయం ఇదే. యాక్ట్రెస్‌జీవితం అయిదుసంవత్సరాలు, కాకపోతే ఏడుసంవత్సరాలు. అంతే!' అని బరకత్ ఆమెకి చాలాసార్లు తెలియ జెప్పాడు.

పహాడన్‌కు అభిమానం చాలా ఎక్కువయిపోయింది. ఆమె చాలా తక్కువ

మందితో కలిపి తిరిగేది. ఆమె ప్రేమ అర్థించేవాళ్లు చాలా ఎక్కువమంది అయ్యారు. వాళ్ళని ఆమె దగ్గరకు రానిచ్చేది కాదు. '.... ఈ ఇరకాటంలో చిక్కుకోవద్దు. ప్రేమ నీ ఆయుధం. ఈ బాకుతో నీ పొట్టలో నే పొడుచుకోవద్దు' అని బన్‌వారీ సలహా ఇచ్చాడు.

సహీదన్‌కు విజయంతాలూకు నిషా ఎక్కుతోంది. కానీ గతజీవితంగూడా ఆమెకి గుర్తుంది. ఆ జీవితంతో పోల్చిచూసుకున్నప్పుడు తన ఓర్పు, సామర్థ్యం ఆమెకు సంతోషాన్ని కలిగిస్తూవుండేవి. అప్పుడప్పుడూ ఆలోచించేది — అదంతా సహించకపోయినట్లయితే ఇదికూడా జరిగేదికాదు. జరిగిందేదో మంచే జరిగింది. ఆమె ప్రపంచంకోసం వినోదాన్నీ, ఆనందాన్నీ వెదజల్లుతోంది కానీ ఆమెమాత్రం గంభీరంగా వుండటం మొదలుపెట్టింది.

సహీదన్ బరకత్‌వల్ల చాలా బాధని అనుభవిస్తోంది. బరకత్‌కు చాలాసార్లు ఎక్‌స్ట్రాగా దొరికింది కానీ అతనికి రెండు-మూడు రూపాయలకన్నా ఎవరూ ఎక్కువ ఇచ్చేవాళ్ళు కాదు. సహీదన్ తనతోపాటు అతనికి హీరోపార్టు ఇవ్వడానికి పట్టుదల పట్టాలని అతను కోరుతూవుండేవాడు. సహీదన్ అదెలా చేయగలుగుతుంది? బరకత్ దీన్ని సహీదన్ తనపట్ల చూపే నిర్లక్ష్యంగా భావించేవాడు. ఈ మాటమీద అతను పోట్లాడేవాడు. సహీదన్‌దగ్గర ఒకే ఒక్క సమాధానం వుండేది — 'నన్ను క్షమించు, నా దగ్గరనుంచి నువ్వు ఏమి తీసుకోవాలనుకుంటున్నావో, ఒక్కసారి తీసుకుని ఇక్కడనుంచి వెళ్ళిపో' అనేది.

బరకత్ పేకాట ఆడకుండా వుండేవాడుకాదు. అతను ఆమెదగ్గరనుంచి వెళ్ళిపోయేషరతుమీద సహీదన్ అతనికి రెండుసార్లు పదిహేనువందలరూపాయలు ఇచ్చింది. కానీ బరకత్ డబ్బు తీసుకునిగూడా వెళ్ళలేదు. యాక్టరవాలన్న తీవ్రమైనకోరికని వదిలిపెట్టి నడతలో ఎంతో మార్పుచెందాడు. చొక్కా, పాంటు వదిలిపెట్టి సిల్కుచొక్కా, లుంగీ కట్టుకోసాగాడు. మీసాలుగూడా పెంచేశాడు. వాటిని మెలిదిప్పాడు. ఒక చిన్నకర్ర చేతిలోపట్టుకుని వుండేవాడు. ఎప్పుడూ చప్పట్లుకొట్టి 'చెప్పు, రెండుచేతులూ వేయమంటావా?' అని బెదిరిస్తూండేవాడు. నలుగురయిదుగురు మనుషులని తనవెంట వుంచుకునేవాడు. వాళ్ళకి నిషా ఎక్కించటం, తిండిఖర్చు మొదలైనవాటి బాధ్యతగూడా అతనిదే. ఒకసారి అతను

తాగుడువ్యవహారంలో చిక్కుకున్నాడు. పహాదన్ తనకు అపకీర్తి వస్తుందన్న భయంతో బన్‌వారీనిపంపి, పోలీసులకు రెండువందలరూపాయలిచ్చి, అతన్ని విడిపించింది. ఇది జరిగినతర్వాత పోలీసుస్టేషనువాళ్ళతో బరకత్‌కి స్నేహమయింది.

పహాదన్ కీర్తి రోజురోజుకూ పెరగడం మొదలుపెట్టింది. దానితోబాటే ఆదాయంకూడా. దాదర్‌లో ఫ్లాటు వదిలిపెట్టి ఆమె ఒక బంగళాలో వుండసాగింది. ఒక పెద్ద కారుకొన్నది. ఇదివరకటికన్నా మౌనంగా వుండటం మొదలుపెట్టింది. సంవత్సరమంతా ఆమె పగలు చూడలేదు, రాత్రి చూడలేదు. ఒకేసారి ఆరు కంపెనీలలో పని చేస్తోంది. మిగతాకంపెనీలుగూడా ఆమెని బుక్ చేసుకునేందుకు తొందరపడసాగాయి. ఆమెకు తీరుబడి లేకపోవడంతో నిరాకరించవలసివచ్చింది. అప్పుడప్పుడూ బన్‌వారీ ఇచ్చిన సలహా జ్ఞాపకం వచ్చేది. 'నేను బొంగరంలాగా ఎన్నిరోజులవరకు నాట్యంచేస్తూ వుండగలుగుతాను? చివరకి నాకు లభించేది ఏముంది? చాలినంత డబ్బు వుంది. ఈ పిచ్చిదైన బరకత్‌కోసం సంపాదిస్తూ వుండనా?' అని పహాదన్ ఆలోచించేది. మిగతా యాక్టర్లు, యాక్ట్రెస్‌లు డబ్బు సంపాదిస్తారు. అందులో చాలామటుకూ రేసులకి, తాగుడుకి ఖర్చు పెట్టేస్తారు. పహాదన్ ఇలా చేసేదికాదు. బ్యాంకులో ఆమె డబ్బుకూడా పెరుగుతోంది.

ప్రొడ్యూసర్ సేఠ్‌పాలిత్, ప్రొడ్యూసర్ సుతలీవాలా, డైరెక్టర్ జమాన్, పెళ్ళి చేసుకుంటామని పహాదన్ వెనక పడుతున్నారన్న వదంతి బరకత్ చెవిన పడింది. పహాదన్ ప్రొడ్యూసర్ సుతలీవాలాని, అసిస్టెంట్ డైరెక్టర్ బన్‌వారీని ప్రేమిస్తోంది.... తొందరలోనే ఎవరో ఒకరితో తన వివాహం ఏర్పాటు చేసుకుంటుంది. ఆమెమనసు సినిమాపైన విరిగిపోయింది అనిగూడా విన్నాడు.

బరకత్ వదంతినివిని అనుమానపడ్డాడు. అతనికి బన్‌వారీ నమ్మకస్తుడని విశ్వాసం వుండేది. అతను పహాదన్‌కి ఏ సంబంధమూ లేకపోయినా సహాయం చేశాడు. బరకత్ వాళ్ళని అనుమానించసాగాడు. వాళ్లు పహాదన్ దగ్గరికివస్తే బరకత్ గొడవచేసి, వాళ్ళతో పోట్లాడేవాడు. పహాదన్ బయటకువెడితే కావలాకోసం డ్రైవరుతోపాటు ముందుసీటులో కూర్చుని వెంట వెళ్లాలనుకునేవాడు.

'పహాదన్ నిఖాచేసి పెళ్ళిచేసుకున్న నా భార్య....ఎవరైనా ఆమెవైపు కన్నెత్తిచూస్తే కళ్ళు పీకేస్తాను' అని బరకత్ ప్రచారం చేయటం మొదలుపెట్టాడు.

పహాడన్‌కి బరకత్ ప్రవర్తన సహింపరానిదై పోయింది. ఇతను నన్ను ఎప్పటివరకూ పొడుచుకుని తింటాడు? నేనేం ఇతనికి పాలిచ్చే ఆవునా? నాకేదైనా అయి, నేను సంపాదించటం మానేస్తే, నిప్పంటుకున్న ఇంట్లోనించి ఎలుకలు పారిపోయినట్లుగా ఇక్కడినుంచి పారిపోతాడు. నన్ను కాపలా కాసేందుకు ఇత నెవరు? నేను ఎవరిదగ్గరైనా స్థిరంగా వుండిపోవాలనుకుంటే ఆపటానికి ఇత నెవరు? నేను జీవితాంతం ఏ ఆధారంలేకుండా, మోసపోతానేమో ననేభయంతో ఇలాగే వణికిపోతూ వుండాలా?' అని ఆమె బరకత్ ప్రవర్తనవల్ల భయపడుతూ ఆలోచించింది.

సాయంకాలం స్టూడియోనుంచి తిరిగివచ్చి పహాడన్ అలసిపోయి, బాధతో వరండాలో కూర్చునివుంది. 'నవోదయ' కంపెనీవాళ్ళ కొత్తసినిమా 'రంగేళీ కనకయ్యా'లో ఆమె ఏభైవేల కాంట్రాక్టుమీద హీరోయిన్‌గా పనిచేస్తోంది. ఆరోజు స్టూడియోలో, ఆమె నదిలో స్నానంచేసేదృశ్యానికి సంబంధించిన షూటింగు జరి గింది. డైరెక్టరు చాలా సంతోషించారు. స్నానం చేసేటప్పుడు ఆమెశరీరం చాలా మటుకూ చూపించబడింది. సెన్సారువాళ్ళు అభ్యంతర పెడతారని అనుమానంగా వుంది.

స్టూడియో నియమంవల్ల, సోమా డైరెక్టరు జమానే ఆదేశానుసారం నటిం చింది కానీ కారులో తిరిగి వచ్చేటప్పుడు ఆమెకు అయిదుసంవత్సరాలక్రిందటి సంఘటన గుర్తుకు వచ్చింది....తను బావిదగ్గర గచ్చుమీద పనిలో నిమగ్నురాలై బట్టలు ఉతుకుతూవుండగా ధనసింగ్ వచ్చాడు. తను సిగ్గు, భయంవల్ల ఎలా ముడుచుకుపోయింది! తర్వాత లాహోర్‌లోని బంగళాలో మన్నో, బారిస్టరు, మంచి బట్టలు కట్టుకుని బజారుకు రమ్మని చెప్పినప్పుడు సిగ్గుతో ముడుచుకుపోయింది. రాత్రిపూట అందరూ నిద్రపోయినతర్వాత బారిస్టర్‌గారి గదిలోకివెళ్ళి లైటు ఆర్పేసేముందు అన్ని కిటికీలకి తెరలు వున్నాయో లేదోనని పరిశీలనగా చూసేది. ఎవరూ తనని చూడలేరని గర్వం కలిగేది. ఇప్పుడు ఆమె బట్టలేవీ లేకుండా- నగ్నంగా అందరి ఎదుటికీ వెళుతోంది.

పహాడన్ బంగళాకి కుడివైపున నాలుగురోడ్లు కలిసే సెంటరులో ఎత్తైన గోడమీద, చేతులు పక్కలకిజాపి, వక్షోజాల ఎత్తులను చూపిస్తున్న ఆమె చిత్రం

శవిపిస్తోంది. బిగ్గరగా వినిపించే రేడియోపాట, 'కన్‌గలే దాలో బహియాఁ మోరే పైయాఁ ఇస్‌విధి కరో ప్రీతి'లో తనగొంతే వినిపిస్తోంది. 'నా ప్రేమ ప్రపంచ మంతటికీ బజారువస్తువు అనే ఆలోచన రాగానే సోమా మనసులో ఏదో గుచ్చు కున్నట్లుగా బాధ కలిగింది. బారిస్టరుతో చాటు ప్రేమవిషయం గుర్తుచేసుకుని ఆమె ఒక్కసారి గట్టిగా నిట్టూర్చింది....ఇదికూడా ఎంతకాలం జరుగుతుంది? మళ్ళీ ఆలోచించింది, తనకు ఏమి లభిస్తోంది....డబ్బు! కానీ డబ్బు సంతోషంకోసం సృష్టించబడింది, సంతోషం ఎక్కడ వుంది? అందరినీ వదిలిపెట్టి ఎవరో ఒకళ్ళని అంటిపెట్టుకుని ఎందుకు వుండకూడదు? ఇప్పుడైతే అందరూ ముఖస్తుతిచేస్తూ మెచ్చుకుంటున్నారు. నాలుగేళ్ళతర్వాత ఎవరు అడుగుతారు? కానీ ఇటువంటివాళ్ళు ఎవరున్నారు? ఎవరిని నమ్మకలుగుతుంది? ప్రేమలో తనని తాను ఎవరికైనా అర్పించుకోవాలనేమాట ఆలోచించడంలేదు. జీవితంకోసం ఆధారాన్ని కోరుతోంది. ప్రొడ్యూసర్ పాలిత్, డైరెక్టర్ జమాన్ ఆమెవైపు చేతులు చాపుతున్నారు కానీ వాళ్ళని తాకగానే బల్లిని ముట్టుకున్నట్లుగా కడుపులో తిప్పుతుంది. అటువంటివాళ్ళ చేతులలోకి తనని తాను ఎలా సమర్పించుకుంటుంది! అమ్ముడుపోవలసిన అవసరం ఆమెకి ఇప్పుడు లేదు.

మిగతావాళ్ళు సహాదన్ నైజం ఏమిటాఅని తెలుసుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. కానీ ఎవరినీ నమ్మదనీ. చివరికి తననిగూడా నమ్మదనీ బన్‌వారీ సలహా ఇచ్చేవాడు. ఇందుచేతనే ఆమెకు బన్‌వారీమీదనే విశ్వాసం వుండేది. బన్‌వారీ ఆమెతో తన అవసరం తీర్చుకునేందుకు ఎప్పుడూ ప్రయత్నించలేదు. వీలు వ్నంతమటుకూ ఆమెకి సహాయమే చేశాడు. ఎప్పుడైనా అప్పు తీసుకున్నాగూడా పట్టుదలగా తిరిగి ఇచ్చేసేవాడు. బన్‌వారీని పెళ్ళిచేసుకుంటే ఎలా వుంటుంది? అని సోమా ఊహించింది. ఆ సమయంలో సమాజంలో ఆమెస్థితి బన్‌వారీ స్థితికన్నా గొప్పది. కొందరు నవ్వుతారు. సోమాకి ఎవరైనా నవ్వుతారన్న చింతలేదు. మేము ఎక్కడికైనా దూరపు కొండప్రాంతాలలోకి వెళ్ళివుంటాము. అని అనుకుంది.

బన్‌వారీ సోమాదగ్గరకూర్చుని గంటలతరబడి మాట్లాడుతూవుంటాడు. ఆమెని అడిగి తెప్పించుకుని తాగుతాడు కానీ పురుషునికళ్ళల్లో స్త్రీ తలంపు ఏ విష యంకోసం వస్తుందో, అటువంటిభావాలు అతనిచూపుల్లో ఎప్పుడూ రాలేదు. సహా

దన్ ఆత్మసమర్పణని స్పష్టంగా తెలియపరిచే అనేకమైన సంకేతాలు బన్‌వారీఎదుట చేసింది. అవి గుర్తుకి తెచ్చుకుని పహాడన్‌కి సిగ్గు కలిగేది. బన్‌వారీచేసే ఈ నిర్లక్ష్యం ఆమెను ఇంకా ఎక్కువగా ఆకర్షించేది.

పహాడన్ ఇటువంటి ప్రేమలో చిక్కుకుంది! ఇంతలో ఎదురుగా రోడ్డుమీద బన్‌వారీ నడచివస్తూ కనిపించాడు. పహాడన్ గట్టిగా నిట్టూర్చి, ఈ రోజు ఇతనితో చివరిసారిగా మాట్లాడాలి! అని నిశ్చయించుకుంది.

బన్‌వారీ తన సన్నటిశరీరాన్ని ఒక పెద్దకుర్చీలో సగంకన్నా కూడా తక్కువ భాగంలో వాల్చి కూర్చున్నాడు: 'కొంచం నీరసంగా వున్నావు. ఏమయింది? ఇవ్వాళ మా ఆరోగ్యం తాగాలనుకుంటోంది' అన్నాడు.

'నేనిప్పటికి చాలా విసుగుచెందాను.'

'దేనివల్ల?'

'జీవితంవల్ల. ప్రేమించేవాళ్ళవల్ల. విన్నసాయంత్రం పాలిత్ విసిగించాడు. ఇవ్వాళ జమాన్.'

'అభివందనలు! బాటిల్ బైటికి తియ్యి! ఇప్పుడే నీమీద అందరికీ ప్రేమ పెరుగుతోంది.'

'నేను ప్రేమ-బజారు వస్తువునా?' పహాడన్ అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూసి, 'సిగ్గు కలగడంలేదూ? నువ్వుగూడా ఇలాగే అనుకుంటున్నావా?' అని అడిగింది.

'నువ్వు ఇవ్వాళ కోపంగా వున్నావేమిటి?' బన్‌వారీ సిగ్గుపడ్డాడు.

'నేను చాలా బాధపడుతున్నాను.' పహాడన్ చీరకొంగుతో ముఖం కప్పుకుంది.

'ఏం జరిగింది పహాడన్?' బన్‌వారీ సానుభూతితో అడిగాడు.

'నువ్వు చెప్పు. నేనేం చేయను? ఈ ఆర్భాటం అంతా మహా జరిగినా నాలుగయిదు సంవత్సరాలకన్నా ఎక్కువకాలం జరగదని నువ్వే చెపుతావు.'

'నిజానికి నువ్వు పెళ్ళిమాట ఆలోచిస్తున్నావా? నీకు ఎవరిమీద నమ్మకముంది?'

'నీ మీద' పహాడన్ మళ్ళీ చీరకొంగుతో ముఖం కప్పుకుంది.

'నువ్వు భ్రమపడ్డావు' బన్వారీ నవ్వాడు. 'ఎవరైనా మంచివయసులో వున్న ఆసామిని పట్టుకో. మొదట న్యాయస్థానంలో పెళ్ళిచేసుకో, అప్పుడు ప్రేమః మంచిది. మేము వెళుతున్నాం' బన్వారీ లేచి నిలబడ్డాడు.

'ఆగు, నేను తెప్పిస్తాను' పహాడన్ కళ్ళు తుడుచుకుంది.

'వద్దు ఇప్పుడు తాగను. మేము ఇలా మనసుకు విశ్రాంతి కలిగించడం కోసం సరదాగా వచ్చాం. నువ్వు నీ బాధలు వినిపించడం మొదలు పెట్టావు.' బన్వారీ వెళ్ళిపోయాడు.

పహాడన్ కోపంతో పళ్ళునూరుతూ వుండిపోయింది - నేను నమ్మడానికి తగిన వాడనుకున్నమనిషి ఇతనొక్కడే. ఇతను నమ్మకంగా చెపుతున్నాడు, నావల్ల మనసుకు విశ్రాంతి కలిగించుకోవడానికి సరదాగా వచ్చాడట. ఏది నమ్మకానికి నిప్పంటుకోనూ!' అనుకుంది.

పహాడన్ దృష్టి వెంటరునుంచి వచ్చే తన రికార్డు పాటవైపు వెళ్ళింది—
'తస్గలే డాలో బహియాఁ మోరే సైయాఁ ఇన్ విధి కరో ప్రీతి' (బిగువుగా నా మెడలో చేతులు వెయ్, నా ప్రియా నన్నిలా ప్రేమించు.)

'ప్రపంచం నా మెడలో చేతులు వేసి ఆడుకోవాలని కోరుతోంది కానీ చేయి పట్టుకుని నాకు అండగా వుండటానికి ఎవరూ సిద్ధపడటంలేదు' అనుకుంది పహాడన్.

# యజమానుల మార్పు

ధనసింగ్ ప్రభుత్వంనుంచి ప్రాణాలు కాపాడుకోవడానికి పారిపోతూ, సైనికులదుస్తులు ధరించి ప్రభుత్వపు మనిషైపోయాడు. అన్నిపనులూ నియమానుసారంగా జరిగాయి. మహత్వపూర్ణమైన ప్రభుత్వపుపని చేయడానికి అతని ఆరోగ్యం తగినదా కాదా అని అతనిశరీరం దెబ్బకొట్టి ప్రయోగించి చూశారు. సైన్యకార్యాలయంనుంచి అతను ఊహించిచెప్పిన గ్రామపు విలాసాన్ని విచారించడంకోసం పోలీసుఠాణాకు కాగితం పంపించారు. చట్టము, నియమముల ఆడంబరంక్రింద అన్నిప్రదేశాలూ అచేతనంగా వున్నాయి. ప్రభుత్వానికి ఆ సమయంలో మనుష్యుల అవసరముంది. ఆరోగ్యాన్ని పరీక్షించే డాక్టరు అతను బట్టలు విప్పుతూనే చమట కంపుకొట్టే అతనిశరీరాన్ని తాకకుండానే ముఖం ముడుచుకుని, శత్రువుల తుపాకి గుళ్ళను సహించడానికి తగిన ఆరోగ్యవంతుడుగా తలచారు. అతను నమ్మదగినవాడు అవునా కాదా అన్నప్రశ్ననుగురించి హోషియార్‌పుర్ జిల్లాలోని చింతపుర్ణీ పోలీసుఠాణాను విచారించడం జరిగింది. ఠాణాలోని గుమాస్తా గ్రామంలోకి వెళ్ళి విచారించమని పోలీసులను ఆజ్ఞాపించారు. ఏవిధమైన లాభమూ తమకు కలుగుతుందన్న ఆశలేదని తలచిన పోలీసులు పధ్నాలుగుమైళ్ళు కాళ్ల కొట్టుకుంటూ వెళ్ళకుండానే, అభ్యంతరపెట్టడానికి ఏ కారణమూ లేదని మరునాడువచ్చి సమాధానమిచ్చారు.

ధనసింగ్ ట్రయల్ తీసుకోబడింది. సుమారు ఒక సంవత్సరంతర్వాత ధనసింగ్ మోటర్ స్టీయర్, క్లచ్, బ్రేకులస్పర్శని పొందాడు. టకటకలాడే ఇంజను మోత విన్నాడు. అతనిజీవితం స్వాభావికమైన పరిస్థితిలోకి తిరిగివచ్చినట్లు అనిపించింది. కడుపునిండా తినడం, శిబిరంలో హాయిగా నిద్రపోవడం, మోటరు తోలడం - ఇది అతనిశరీరానికి మళ్ళీ అలవాటు అయిపోయాయి. మరోదేశంలోకి, సమాజంలోకి వచ్చి చేరాడు. అక్కడ అందరూ ఒకేవిధమైన దుస్తులు ధరించేవాళ్లు, ఆజ్ఞ, విందుదనం, హుందాతనం, సైనికులు మాట్లాడుకునేవిషయాలు, సంభాషణ జరుగుతుండేది. అక్కడ అందరూ జవానులే; రా జవాన్ ! వెళ్ళు

జవాన్? తిను జవాన్! చచ్చిపోయిన జవాన్! ఇక్కడ గౌరవం, అగౌరవం, వీటి రూపాలుగూడా వేరేవిధంగా వున్నాయి.

ఖాకీదుస్తుల ధరించిన వీళ్ళందరూ దేశంలో కట్టుకోవడానికి బట్ట, తినడానికి తిండీ లేక సిగ్గుపడుతూ, ముడుచుకుపోయి అణిగిమణిగి బ్రతికేవాళ్ళకన్నా బలం గానూ, గౌరవంగానూ వున్నారు. ఈ సమాజంలో సైనికునితో నాయకుడు, నాయకునితో సైనికాధికారి, సైనికాధికారితో సుబేదారు, తిట్లు, బూటుతో బెదిరింపులు లేకుండా మాట్లాడరు. ఈ తిట్లని, బూటు దెబ్బలనీ ఎవరూ ఎదిరించేవాళ్లుకూడా కాదు. అన్నివైపులా ఆజ్ఞదే పరిపాలన. సేనాశిబిరాల ఈ సమాజంలో అనేకవర్గాలున్నాయి. దుస్తులనుబట్టి ఈ వర్గాలు గుర్తించబడుతూ వుంటాయి. ఎవరిదుస్తుల మీదనైతే ఒక్కొక్క రేపు ముక్కగాని, ఒక్కొక్క ఇత్తడిబిళ్ళగానీ పెరుగుతూ వుంటుందో, వాళ్ళశక్తి, ఆజ్ఞకూడా పెరుగుతూవుంటుంది. మామూలు సైనికునికి భార్యతో కలిసివుండే అధికారంలేదు, కానీ పెద్ద ఆఫీసర్లు ఖరీదైన దుస్తులను ధరించి, నాజూకైన స్త్రీలని వెంటబెట్టుకుని గర్వంగా తిరుగుతూవుంటారు. బంగళాలలో నివసిస్తారు. ధర్మశాలలోగూడా లాలాగారు, బారిస్టరుగారు, మన్నో, వాళ్ల అన్నలు - పరివారాలు. డబ్బున్న పెద్దవాళ్ళు ఇలానే వుండేవాళ్ళు. ఆఫీసరు ఆజ్ఞాపించేవారు. సైనికులు ఆది శిరసావహించేవాళ్ళు.

యుద్ధప్రదేశంలో సైనికజీవితంలో ఒకవిధమైన అస్వాభావికత వుండేది. ఒకవిధమైన కట్టుబడి వుండేది. అక్కడ భావాలు, ఇష్టానికి సంబంధించిన మాట లేదు, ఆజ్ఞమాత్రమే. అక్కడ స్త్రీలు లేరు. పిల్లలు లేరు. స్వరాజ్యంకోసం ఇంగ్లీషువాళ్ళతో పోట్లాడే భారతదేశానికి సంబంధించిన ఏ మాటా లేదు; విప్లవం వర్ధిల్లాలన్న కేకలు లేవు; మహాత్మాగాంధీకి జై అనిగాని, సుభాష్‌బాబుకి జై అన్న అరుపులు లేవు; జైలుకు వెళ్ళడానికి సంబంధించినవిషయాలు అసలే లేవు. సేనాశిబిరంలో గుడారాలతో నిండిన ఈ ప్రపంచం భారతదేశంలోని బయట ప్రపంచంతో పూర్తిగా భిన్నమైనది. ఇక్కడ కాంగ్రెసు, సోషలిస్టు, కమ్యూనిస్టు అనే రాజనీతికి సంబంధించిన ఏ విషయమూ వుండేదికాదు. ఎవరైనా చదువుకున్నవాళ్ళు ఎప్పుడైనా బజారుకివెడితే వార్తాపత్రిక చదివేవాళ్ళు, ఇతరప్రపంచానికి సంబంధించినవిషయాలు తెలుసుకునేవాళ్లు, వచ్చి మిగతావాళ్ళకి చెప్పేవాళ్లు. సాధారణంగా

కాంగ్రెస్‌వాళ్ళ వార్తాపత్రిక చదవడం నిషేధించబడింది. ఇక్కడ పెరేడ్‌గురించి. రేషన్‌గురించి. ఫ్రంట్‌గురించి సంభాషణ జరుగుతుంది. ఎప్పుడైనా స్త్రీ కనిపిస్తే పొలాలనుంచి ముల్లంగిగాని, చెరుకుగాని దొంగతనంగా పీక్కొస్తే ఎలా ప్రవర్తిస్తారో అలా ఆమెనుగురించి చర్చిస్తూ వుండేవాళ్ళు.

ధనసింగ్ బాహ్యరూపం మారిపోయింది కానీ అతనిమనసులోని భావాలు మాత్రం మారలేదు. ఇంగ్లిషు ప్రభుత్వం నాశనమైపోయి స్వరాజ్యం వచ్చినప్పుడే అతను నిజమైన జీవితపుసుఖాన్ని పొందగలుగుతాడు. అప్పుడే తనవూరికివెళ్ళి సోమాని పొందగలుగుతాడు. అతనికి కన్నీళ్ళతోనిండిన సోమాముఖం కనిపిస్తూ వుండేది - దురదృష్టవంతురాలు, నాకోసం ఎదురుచూస్తూ లాలాగారి బంగళాలో సేవకురాలిగా పనిచేస్తూవుండివుంటుంది అనుకునేవాడు. తను ధరించినటువంటి దుస్తులుధరించి, ఇంగ్లిషు ప్రభుత్వాన్ని దేశంలో స్థిరపరచి, దేశమంతటిలోనూ రైలుపట్టాలమీద నిలబడి ఇంగ్లిషు ప్రభుత్వాన్ని రక్షించడంకోసం గస్తీ తిరిగేవాళ్ళందరూ తమ దేశానికి, ప్రజలకి శత్రువులుగా అనిపించేవాళ్ళు అతనికి. ఇంగ్లిషువాళ్ళరాజ్యం ఇక్కడినుంచి ఎలా తొలగిపోతుంది? ఎవరికివడితే వాళ్ళకి తమ తమ పొట్టలగురించిన ఆలోచనే. స్వతంత్రాన్ని ఎవరూ కోరడంలేదు. ప్రజలు స్వయంగా ఇష్టపడే బానిసలయారు.

ధనసింగ్ మంచి డ్రైవరుగా పేరు సంపాదించాడు. అతని డ్యూటీ స్టాఫ్ కారు నడపటం. సాధారణసైనికుడు శిబిరందాటి బయటకు వెళ్ళటానికి వీలులేదు. ఆఫీసర్లకుగూడా ఇది బాధగా అనిపించలేదు. వర్షాకాలపురోజులు. రాత్రిపూట కుండపోతగా వర్షం పడుతున్నాకూడా మేజర్‌గారు అర్ధరాత్రివరకూ క్లబ్బులో నాట్యం చేస్తూవుండేవారు. ధనసింగ్ క్లబ్బు గేటుముందు కారుఆపి, ఆట పూర్తయేవరకూ ఎదురుచూస్తూ అందులో ముడుచుకుని కూర్చునేవాడు. ఆయన అప్పుడప్పుడూ ఒక దొరసానిని, అప్పుడప్పుడూ ఇంకొక దొరసానిని వెంటబెట్టుకుని బజార్లలోనూ, హోటళ్ళలోనూ తిరుగుతూ వుండేవారు. మేజర్‌గారని దొరగారని, ఆయనతో తిరిగేవాళ్ళు హిందూదేశపు స్త్రీలైనా దొరసానులనీ అంటూవుండేవాళ్ళు. ధనసింగ్ ఆలోచించేవాడు, స్వరాజ్యం రావలసినఅవసరం వీళ్ళకేముంది? అని పించేది. కానీ వీళ్ళు దేశాన్ని స్వతంత్రరాజ్యంగా ఎందుకు అవనిస్తారు? వీళ్ళంతా

ఇంగ్లీషువాళ్ళ సోదరులు, బంధువులే। పెద్దమనుషులకి, డబ్బున్నవాళ్ళకి స్వాతంత్ర్యంతో అవసరమేముంది? వాళ్ళకి బాధేముంది? ఇంగ్లీషువాళ్ళు తమ ప్రభుత్వాన్ని నిరాటంకంగా నడపడానికి చాలామందిని తమవైపు తిప్పుకున్నారు.

మేజర్‌గారి బంట్రోతు సైనికుడు యార్ మహమ్మద్‌తో ధనసింగ్‌కి స్నేహం ఏర్పడింది. యార్‌మహమ్మద్ చాలా ఎగతాళిచేసే మనిషి. దొరగారిఎదుట అతను చాలా నెమ్మదిగానూ, వినయంగానూ వుండేవాడుకానీ వెనక ఆయన్ని చాలా ఎగతాళి చేసేవాడు. బంట్రోతుపనికి అతను తగినవాడని అందరూ మెచ్చుకునేవాళ్ళు. ఎవరైనా ఆఫీసరు బదిలీఅయి ఇంకొక ఆఫీసరువచ్చినాకానీ బంట్రోతుగా అతనే వుండేవాడు.

'మూర్ఖులు, గర్వంతో ఎగిరిపడేవాళ్ళు బంట్రోతు పనిచేయడానికి ఒప్పుకోరు. ఇందులో చాలా సుఖం, విశ్రాంతి వున్నాయి. నియమం ప్రకారం పెరేడ్‌కు వెళ్ళక్కరలేదు. ఒళ్ళంతా బిగదీసుకుని సలాంకొట్టడం. అంతే! దొరగారి బూట్లు, పెట్టెలు తుడిస్తేమటుకూ ఏముంది, నాలుగుగంటల పెరేడ్‌లో ఒళ్ళంతా ఎవరు విరక్కొట్టుకుంటారు!' అనేవాడు యార్‌మహమ్మద్ ధనసింగ్‌తో.

యార్‌మహమ్మద్ స్వాతంత్ర్యంకోసం, కాంగ్రెస్ ఆందోళనలో పనిచేసి వున్నాడు. మాకు అందులోకూడా అభిరుచివుందని అతను చెపుతూవుండేవాడు. వాలంటీర్లకి బాగా తృప్తిగా హల్వా-పూరీలు దొరుకుతూవుండేవి. అందులోకూడా మేము లీడర్లకి సేవ చేయడంలోనే డ్యూటీ వేయించుకునేవాళ్ళం ఆ గొడవలలో కాంగ్రెస్ అణిగిపోగానే మేము ఇటు వచ్చేశాం. ఇందులోనే నేర్పరితనముంది. దేముడు నక్కగాచేసి పుట్టించాడు. పులి కాలేము, కాని పులి ఎంగిలిచేసి పారేసిందైనా మనకి చాలా ఎక్కువ అని అతను చెప్పిన మాటలువిని ధనసింగ్ నవ్వేవాడు. కానీ ఏకాంతంగా వున్నప్పుడు యార్‌మహమ్మద్ మాటలు అతనికి నిరాశ కలిగించేది.

ధనసింగ్ కంపెనీని, కొండమార్గంమీద కారునడపడం నేర్చుకునేందుకు రాణీఖేత్ శిబిరానికి మార్చారు. కొండప్రాంతాన్ని, పర్వతాలనిచూసి ధనసింగ్‌కు అతనిదేశం, ఎక్కువగా సోమా గుర్తుకు వస్తూ వుండేది. కుమావూఁ పర్వతాలు చాలామటుకూ కాంగడా పర్వతాలమాదిరిగానే వుండేవి కానీ కొంచం తేడాగాకూడా

వుండేవి. ఈ పర్వతప్రాంతాలలోని పురుషులు, స్త్రీలు తేడాగా వుండేవారు. అన్నింటికన్నా పెద్దభేదం ఏమిటంటే వాళ్ళు కాంగడాప్రాంతపు భాష మాట్లాడేవాళ్ళు కాదు. ధనసింగ్ ఖాకీ ట్రక్కుని రోడ్డుమీద నడిపేటప్పుడు ప్రయాణీకులతో నిండిన లక్నముచూసి అతనికి ఆ డ్రైవర్లమీద ఈర్ష్య కలిగేది. గుడారాలలోకి తరుచుగా ఇంగ్లీషు, అమెరికన్ సైనికులు, ట్రక్కులలో గాయపడి వస్తూవుండేవాళ్లు. అప్పు డప్పుడూ హిందూస్థానీసైనికులుగూడా వస్తూవుండేవాళ్ళు.

రోడ్డుకుపక్కన, కొండలమీద అన్నిచోట్లా సైనికులే ఆక్రమించుకున్నారు. సైనికులు కొండలమీద యుద్ధం ఎలా చేయాలో నేర్చుకుంటున్నారు. ఈ దేశం ఇంత పెద్దదని, ఇంగ్లీషుప్రభుత్వపుశక్తి ఇంత విశాలమైనదని ధనసింగ్ ఎప్పుడూ ఊహించలేదు. వెయ్యిమంది, పదివేలమంది సైనికులు చచ్చిపోయినా ఇంగ్లీషు ప్రభుత్వానికి ఏమీ లెక్కలేదు. ధనసింగ్‌కు తన జీవితం నిరర్థకమనిపించింది. యుద్ధభూమినుంచి వెయ్యిమైళ్ళదూరంకూడా గాయపడిన ఇంగ్లీషు, అమెరికన్ హిందూస్థానీ సైనికులు ట్రక్కులలో నిండి వస్తున్నారు. తొందరలోనే అతనికికూడా యుద్ధభూమికి వెళ్లాల్సి వస్తుంది. సైనిక శిబిరప్రాంతంలో సైనికులకు, వాళ్లకు సంబంధించిన వార్తాపత్రికలు ఇస్తూవుండేవారు. ఆ పత్రికలలో ఇంగ్లీషువాళ్ల విజ యానికి సంబంధించినవార్తలే వుండేవి. రాణీఖేత్ బజారులో ప్రజలు ఇతర వార్తా పత్రికలు చదువుతుండగా అతను చూసేవాడు. ఆ పత్రికలు చదవడానికి సైనికులకి అనుమతిలేదు. కాని ఇంగ్లీషువాళ్ళు ఓడిపోతున్నారన్న వార్తలు వాళ్ళచెవులలో నెమ్మదిగా పడుతూనేవుండేవి.

ధనసింగ్ పనిచేసేకంపెనీ యుద్ధభూమికి వెళ్లటం జరిగింది. మూడురాత్రులు వరుసగా రైలులో గడిపినమీదట ఓడమీద అతను గౌహతీ చేరాడు. గౌహతీనుంచి దీమాపుర్, దీమాపుర్‌స్టేషనుకు ఆనుకుని ఒకపట్నం వుంది. అక్కడ వెడల్పైన రోడ్లు, రెండుపక్కలా వాసపుతడికల ఇళ్ళు వున్నాయి. చూరులు ఎంతో నైపుణ్యం గానూ, ఒకే వరుసలోనూ నిర్మించబడివున్నాయి. ఆ పట్టణం చాలామటుకూ ఖాకీ దుస్తులు ధరించినవాళ్లతో నిండివుంది. పదిమైళ్ళవరకూ సైనికులే సైనికులు వేల కొలది సైనికులు ప్రతిరోజూ వస్తూనేవున్నారు. మోటార్లు, ఫిరంగులు చేరుతూనే వున్నాయి. ధనసింగ్ ఇంత సమూహాన్నీ, ఇన్ని ఆయుధాలనీచూసి నిశ్చేష్టుడై పోయాడు. ఇంత పెద్దశక్తిని ఎవరు ఎదుర్కోగలరు!

ధనసింగ్ లారీ నడుపుతూవుండేవాడు. ఒక్కమాటు నాలుగులారీలు వెళ్ల డానికి వీలుగా వుండేంత వెడల్పయినరోడ్లమీద లారీలు మణిపూర్ వెడుతూ-వస్తూ వుండేవి. ఆకాశంలో ఎగిరే జపానువాళ్ళ విమానాలు కింద ఆ లారీలని చూడటానికి వీలులేకుండా లారీలమీద వలపరచి, ఆ వలలో చెట్ల రెమ్మలు, ముళ్ళపొదలూ గుచ్చే వాళ్ళు. సైనికులతోగానీ, సామానుతోగానీ నిండిన లారీలు ఒకదానివెనుక ఒకటి నెమ్మది నెమ్మదిగా, జాగ్రత్తపడుతూ, ముందు వెనుకలనుంచి సంకేతాలు తీసు కుంటూ వెడుతూవుండేవి. రోడ్డుమీద ఏభై లారీలు ఒక్కసారి వెళ్లటంవల్ల, పైన తిరుగుతూవుండే విమానాలమోతవల్ల, కొండకనుమలు కంపిస్తున్నట్లుగా వుండేది. ప్రళయకాలంలో ఆకాశమూ, భూమి కంపిస్తున్నాయా అన్నట్లుగా అనిపించేది.

ఎత్తైన కోహీమాప్రాంతానికి అవతలవున్న మణిపూర్ పరిసరప్రాంతానికి చేరేసరికి, తుపాకీగుళ్ళవర్షం కురుస్తున్నట్లుగానూ, మేఘాల ఎడతెంపులేని ఉరుము లాగా ఫిరంగులమోతలు, తుపాకులధ్వనులూ వినిపిస్తూవుండేవి. దట్టమైన అడవు లలో అర్ధరాత్రి. చుట్టూ చీకటి. కుంభపోతగా కురిసేవర్షం, సైనికులు యుద్ధ భూమివైపు వెళ్ళటంలోనూ, యుద్ధభూమినుంచి గాయపడినవాళ్లని తిరిగి వెనక్కి తీసుకువచ్చేపనిలోనూ, ఈ వాతావరణం ఆటంకాన్ని కలిగించలేకపోయేది. ఆకాశం నుంచి బాంబులవర్షం పడేటప్పుడుమాత్రం యుద్ధసామగ్రిని మోసుకువెళ్ళే ట్రక్కుకి ముందునుంచిగానీ, వెనుకనుంచిగానీ సందేశం అందినమీదట లారీలు ఆగిపోయేవి. ఆజ్ఞ అందనంతవరకూ డ్రైవర్లు ఆకాశంలో ఎగిరేవిమానాల్ని తమ విమానాలు గానే తలపోసేవాళ్ళు.

ధనసింగ్ ఎప్పుడూ ప్రాణభయంలోవుంటూ, ప్రాణభయాన్ని లెక్క చెయ్యని సైనికులసాంగత్యంలో ఆ భయాన్ని లెక్కచెయ్యటం మానివేశాడు. అనేకసార్లు రోడ్లమీద బాంబులవర్షంవల్ల లారీలు అదిరిపోయేవి. మార్గం చెల్లా చెదరై పోయేది. బాంబులవర్షం ఆగినమీదట మార్గం సరిచేయబడేది. లారీలు మళ్లీ నడవసాగేవి. ఈ ప్రాణభయంలో కలిసివెళ్ళేవ్యక్తులు పరస్పరం, తల్లి-దండ్రులు, సహోదరులకన్నాకూడా ఎక్కువగా సన్నిహితమయేవారు. ప్రాణాలమీదకివచ్చే ఆపదని చూసికూడా, మరొకరిని బాధలో వదిలిపెట్టి పారిపోవడానికి ఆతురతపడే వాళ్లుకాదు. వాళ్ళల్లోవాళ్ళకి భేదభావాలు, అడ్డుతెరలూ లేవు. శారీరికంగానూ, మాన

సికంగానూకూడా ఏవిధమైనభేదాలూ లేవు. ఏవిధమైన సంకోచమూ లేకుండా అన్ని విషయాలూ మాట్లాడుకుంటూ, వింటూవుండేవాళ్ళు. మర్దాన్, బవాహర్, సహ ల్యాన్‌సింగ్, ఖేమ్‌సింగ్, ధనసింగ్ వాళ్ళల్లోవాళ్లు సొంత అన్నదమ్ములమాదిరిగా మసలుకోసాగారు. తమలో పెరుగుతున్న బలాన్నీ, శక్తినీ ఏదోవిధంగా ఉపయోగించటంకోసం నిత్యం తిట్టుకుంటూ మాట్లాడుకునేవాళ్లు. ప్రేమ, కోపం, సుఖం, దుఃఖం అన్నీ తిట్లతోనే వ్యక్తం చేసేవాళ్లు.

ట్రక్కులలో దీమాపూర్‌నుంచి సైనికులను, ఫిరంగిమందును యుద్ధభూమికి తీసుకువెళ్ళేందుకు, భోజనం తీసుకువెళ్ళేందుకు, మణిపూర్‌నుంచి గాయపడిన సైనికులను తీసుకుని తిరిగివచ్చేందుకు, దాదాపు నలభై, నలభై ఎనిమిది గంటలు, ఒక్కొక్కప్పుడు అరవై గంటలుకూడా పడుతూవుండేవి. అంతసేపూకూడా ధన సింగ్, అతని సమూహంవాళ్ళు కత్తుల అంచులమీదనే వుండేవాళ్లు. కానీ తమ వీరత్వంగురించి గర్వపడేందుకుకూడా అవకాశం వుండేదికాదు. ఎవరో ఒకరే ఈ సాహసాన్ని చేయడంలేదు, ప్రతిఒక్కరూ అందులో పాల్గొంటున్నారు. వాళ్ళకి నిద్రపోవడానికి, తినడానికీకూడా తీరుబడి దొరికేదికాదు. వేయించినశనగలు నములుతూ వుండేవాళ్ళు. ఆకాశంనుంచి ఫిరంగిగుళ్లు పడేటప్పుడు లారీలని, ట్రక్కులని ఆపమని ఉత్తర్వు అందినమీదట, ఆకాశంనుంచి వర్షించే మృత్యువు ఛాయలో డ్రైవర్లకు నిద్రపట్టేది. అరవై-డెభ్భైఏరూపాయల నెలసరిజీతంకోసం ఇదంతా సహిస్తున్నామని వాళ్ళెవరికి అనిపించేదికాదు. తమ బాధ్యతని నిర్వహిస్తున్నారంతే.

యుద్ధభూమినుంచి తిరిగివచ్చినతరువాత కంపెనీ-కమాండర్ ఉత్తర్వు ప్రకారం డ్రైవర్లందరికీ సారా దొరికేది. కాంప్‌లో తరుచుగా ఇరవైనాలుగు, ముప్పైరెండుగంటలు విశ్రాంతి తీసుకోవడానికి సమయం దొరికేది. ట్రక్కులని, లారీలని దగ్గరలోవున్న కాలవకు తీసుకువెళ్ళి శుభ్రంగా కడగాల్సివచ్చేది. తీరుబడి కలిగినప్పుడు, అవకాశం దొరికినప్పుడు, క్యాంటీన్‌కువెళ్ళి వాళ్లు చౌకబారు సారా త్రాగేవాళ్లు. దానితో తృప్తిపడకపోతే గ్రామంలోకివెళ్ళి 'కల్లు' తాగేవాళ్ళు. కాంపులోకి అనాస, నారింజ, వుడకేసిన కోడిగ్రుడ్లు కొనుక్కుని తినేవాళ్ళు. అవి అమ్మే స్త్రీలతో పరిహాసాలాడి ఆనందిస్తూ వుండేవాళ్ళు. దొంగతనంగా చుట్టుపక్కల గ్రామాలలో తిరగడానికి వెళ్ళేవాళ్లు.

ప్రతిచోటా వీరులైన హిందూస్థానీసైనికులు జపాను రాక్షసులని మట్టుబెడుతున్న పెద్దపెద్ద బొమ్మలు, చిత్రాలు అంటించివున్నాయి. మలేరియా, ఫిరంగి రోగం, సెగరోగం రాకుండా జాగ్రత్తపడాలని ప్రతిచోటా సూచనలు వ్రాయబడ్డాయి. మానసిక-శారీరక విశ్రాంతికోసం వాళ్లు గ్రామఫోనురికార్డులు పెట్టుకుని వినేవాళ్ళు, సినిమాలుగూడా చూసేవాళ్ళు. అప్పుడప్పుడూ గాయకుల్ని, నటుల్ని, నర్తకులని పిలిపించేవాళ్లు. కానీ వీటన్నిటికన్నా స్వేచ్ఛగా చుట్టుపక్కల గ్రామాలలో తిరగడంలో సైనికులకి ఎక్కువ ఆనందం కలిగేది. కేంపునుంచి బయటకు వెళ్ళడానికి వాళ్లకి ఆటంకం కలిగేది. సైన్యానికి సంబంధించిన పోలీసులు నిత్యం కాపలాకాస్తూ వుండేవాళ్లు. ఆజ్ఞ పాటించకపోయినట్లయితే తుపాకులుగూడా పేలుస్తూవుండేవాళ్ళు. కానీ ఇంత కఠినమైన వాతావరణంలోనూ, ఆపదలోనూ పనిచేయాల్సివుంటే చట్టాన్ని ఎంతవరకూ పాటించడం జరుగుతుంది? సైనికులని ఎక్కువగా భయపెట్టడం, వాళ్ళకి అసంతృప్తి కలిగించడంకూడా ఉచితంకాదని వాళ్లందరికీ తెలుసు.

సైనికులు ఎప్పుడూ భయంలోనే వుండటంవల్ల ఆ భయాన్ని లెక్కచేయకపోవడంకూడా నేర్చుకున్నారు. ఆరోగ్యంగా బయట తిరిగిరావాలనేకోరిక తలెత్తేసరికి, సాయంకాలంకాగానే దొంగతనంగా కాంపునుంచి బయటపడి గ్రామంలోకి వెళ్ళేవాళ్లు. ఇటువంటి అపరాధానికి అప్పుడప్పుడూ ఇద్దరు ముగ్గురికి శిక్షకూడా పడుతూవుండేది. తరుచు నిర్లక్ష్యంచేయడంగూడా జరుగుతూవుండేది. సైనికులు తమలోతాము యుద్ధపుస్వరూపంగురించి, ముందు తరుముకువస్తున్న శత్రుభయం గురించి, జపానువాళ్లనిగురించి, 'ఆజాద్ హింద్ సేన' గురించి మాట్లాడుకునేవాళు కాదు. ఈ అపరాధం క్షమార్హం కాదు. జపానువాళ్లు వేగంగా ఆక్రమణ జరుపుకుంటూ వచ్చేవిషయాలు వాళ్ళకి ఎవరూ చెప్పేవాళ్లు కాదు. ఇటువంటివిషయాలు పెద్ద ఆఫీసర్లుమాత్రమే తెలుసుకునేవాళ్లు.

కాంపులో చర్చ బాగా పెరిగిపోతోంది. గాయపడివచ్చే సైనికులసంఖ్య పెరగసాగింది. సైనికసమూహాలని చిన్నవిగా విభజించారు. శత్రువులు ముందుకి సాగి వస్తున్నారని సైనికులకు అనుమానం కలగసాగింది. ఒకరోజున ధనసింగ్ తనవెనుక లారీలో గాయపడినసైనికులు మాట్లాడుకుంటూవుండగా విన్నాడు.

'... లైనకు ఏభై అడుగులఅవతల గొయ్యి వుంది. గోతికి అవతలినుంచి 'ఆ. హి. పే.' సైనికులు తిట్లు తిడుతూ పోట్లాటకి దిగారు....ఇంగ్లీషువాళ్ళ కుక్కల్లారా, మీ సోదరులమీద తుపాకులు పేల్చి ప్రాణాలు తీస్తారా? అన్నారు. మేము సమాధానంగా ఇంకా వేగంగా తుపాకులు పేల్చాం....అని వాళ్లు తమలో తాము మాట్లాడుకోవటం ధనసింగ్ విన్నాడు. అతని మనసులో దాగివున్నకోరిక తలెత్తింది. కానీ ఈ విషయం అతను ఎవరితోనూ చెప్పలేదు.

ఏప్రెల్‌నెల రెండవవారంలో ధనసింగ్ నలభై ట్రక్కుల సమూహంలో కోహిమానుంచి గాయపడిన సైనికులని తీసుకువస్తున్నారు. శత్రువులవిమానాలు పైన తిరుగుతూ గద్దలమాదిరిగా బాంబులు వేస్తున్నాయి. సంకేతాలు వచ్చాయి. సైనికులదళం దట్టమైన చెట్లచాటున నిలబడిపోయింది. నలువైపులా బాంబులు ప్రేలుతున్న భయంకరశబ్దాలు వాళ్ళకి వినిపించాయి. ఆరుగంటలవరకు అలాగే ఊపిరి బిగబట్టి నిలబడి వుండిపోయారు వాళ్లు. చీకటి దట్టంగా వ్యాపించినమీదట ఆ దళం అక్కడినుంచి కదిలింది. రాత్రంతా లైట్లు వెలిగించకుండానే ట్రక్కులు మెల్లిగా కదిలాయి. తెల్లారుతూనే మళ్ళీ శత్రువులవిమానాలు చుట్టుముట్టాయి. సైనికదళం మళ్ళీ ఆగిపోయింది. మళ్లీ బాంబులు పడసాగాయి. చివరి రెండు ట్రక్కులు నాశనమైపోయాయి. మూడవరోజూమున దళం దీమాపూర్ చేరింది. దీమాపూర్ చేరినతర్వాత డ్రైవర్లు బాంబులుపడిన సంఘటనగురించి చర్చిస్తూ నవ్వడం మొదలుపెట్టారు. మర్దాన్‌సింగ్, హోతూసింగ్ చివరి రెండుట్రక్కులతో వున్నారు.

గాయపడినవాళ్ళని హాస్పిటల్‌లో దించి, ట్రక్కులని లైనులో నిలబెట్టారు. కెప్టెన్ సైనికులందరి వీపులుచరిచి శభాష్ అని మెచ్చుకున్నారు. పెద్ద ఇంగ్లీషు ఆఫీసరుకూడా డ్రైవర్లవైపుచూసి వాళ్ళని మెచ్చుకుంటూ తలవూపి నవ్వారు. సైనికులందరికీ గోదామునుంచి ఒక్కొక్క చటాకు రమ్, బిస్కట్లు, మిఠాయి రేషన్ ఇచ్చారు. ట్రక్కులు కదిలేసని మరుసటిరోజుకి వాయిదా వేశారు.

ధనసింగ్, తోతాసింగ్ సిగరెట్లు అంటించుకుని ఇటూ అటూ పచార్లు చేస్తున్నారు. 'పద క్యాంటీన్‌లో ఇంకా తాగుదాము' అన్నాడు తోతాసింగ్.

ధనసింగ్ అయిష్టాన్ని తెలియపరిచాడు. తోతాసింగ్ తిట్టాడు. 'దబ్బాని

వెంటబెట్టుకుని పోతావురా పిచ్చివాడా? మొన్న మర్డాన్, హోతూలమాదిరిగా రోడ్డు మీద వుండిపోతే డబ్బు....ఏమవుతుంది?'

'పద....' ధనసింగ్ అంగీకరించాడు. ఇద్దరూ క్యాంటీనుకువెళ్ళి ఒక్కొక్క చటాకు సారా మళ్ళీ తాగారు. వాళ్ళింకా తాగాలనుకున్నారు కాని ఇంతకన్నా ఎక్కువ ఇవ్వడానికి క్యాంటీనువాళ్లకి ఒక్కొక్కప్పుడు అనుమతి వుండేదికాదు. గ్రామాల నుంచివచ్చి అనాస, నారింజ, ఇతరవస్తువులు అమ్మే స్త్రీలదగ్గరకి నెమ్మదిగా వచ్చి చేరారు. తోతాసింగ్ ధనసింగ్ భుజంమీద చెయ్యివేసి, పచార్లుచేస్తూ యువతుల దగ్గరికిచేరి, వాళ్ళనిచూసి, తన అభిప్రాయం తెలియపరిచాడు. అతను థోంగ్‌మాని వెతుకుతున్నాడు, 'అచ్చం టపాకాయ' అన్నాడు ధనసింగ్‌తో.

థోంగ్‌మా అనాసముక్కలలో ఉప్పూ కారం చల్లి, అరటి ఆకులమీద పెట్టి అమ్ముతోంది. రెండణాలకు ఒక్కొక్క ఆకులోనిముక్కలను ఇస్తోంది. వికసించిన పువ్వులా మృదువైన ఆమె పెదిమలు తమలపాకులు నమలడంచేత ఎర్రబడ్డాయి. వెడల్పయిన గుండ్రనిముఖంమీద పెద్ద పెద్ద కళ్లు మెరుస్తున్నాయి. ఆమె వయసు ఎంతో తెలుసుకోవడం ధనసింగ్‌కు కష్టమనిపించింది. దృఢమైన ఆమె శరీరాన్నిబట్టి ఇరవై - పాతిక వుండచ్చని అనిపించింది. థోంగ్‌మా ఎర్రరంగు దుప్పటి కప్పుకుని, ముడుచుకుని కూర్చునివుంది. తోతాసింగ్, ధనసింగ్ భుజాల మీద చేతులువేసి, థోంగ్‌మా ఎదురుగా కింద కూర్చున్నాడు. తనకీ, ధనసింగ్‌కీ విడివిడిగా అనాసముక్కలతోనిండిన ఆకులు తీసుకున్నాడు.

తోతాసింగ్ ఒక రూపాయనోటు ఇచ్చాడు. థోంగ్‌మా పన్నెండణాలు అతనివైపు చాచింది. తోతాసింగ్ డబ్బులు తీసుకోవడానికి చేతినిచాచి థోంగ్‌మా చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

థోంగ్‌మా నవ్వింది. తనచేతిని డబ్బులతోపాటు లాక్కుంది.

'కల్లు వుందా?' తోతాసింగ్ అడిగాడు.

'గ్రామంలో వుంది'. థోంగ్‌మా సమాధానం ఇచ్చింది.

తోతాసింగ్ ఇంకొకరూపాయి థోంగ్‌మా కిచ్చాడు. థోంగ్‌మా తనదగ్గిర మిగిలిన అయిదారు ఆకులని బుట్టలో జాగ్రత్తగా పెట్టుకుని లేచి నిలబడింది.

ఆమెకు ఇరవై అడుగుల వెనుకగా తోతాసింగ్, ధనసింగ్‌లు పచార్లుచేస్తూ వెళ్ళసాగారు. థోంగ్‌మా నివసించేగ్రామం కేంప్‌కి రెండున్నరమైళ్ళ దూరానవుంది. తోతాసింగ్ రెండుగ్లాసుల కల్లు తాగాడు. ధనసింగ్‌చేతకూడా తాగించాడు. తోతాసింగ్ ధనసింగ్‌చేతగూడా ఒకరూపాయి ఇప్పించాడు. తోతాసింగ్ థోంగ్‌మాని సరసాలాడుతూ పరిహాసం చేయటం మొదలుపెట్టాడు.

థోంగ్‌మా నవ్వి, 'మేము పంచదార తీసుకుంటాము, బట్టలు తీసుకుంటాము' అంది.

తోతాసింగ్ రెండుచేతులూ చాపి, 'ఇంత పంచదార తెచ్చిస్తాను. కంబళీ ఇస్తాను' అని మాటిచ్చాడు.

సూర్యాస్తమయం అవుతోంది. '....హాజరు తీసుకునేవేళ అవుతోంది' అని తోతాసింగ్ ధనసింగ్‌కు గుర్తుచేశాడు. ఇద్దరూ వెనుదిరిగారు. దోవలో ఆలస్యం అవుతుందేమోనన్న భయంవల్ల వాళ్ళు పరుగెత్తాల్సి వచ్చింది.

'ఆమెకి శేరు పంచదార, ఒక కంబళీ ఇచ్చేస్తాను. ఇద్దరం సరదాగా వెళ్ళివద్దాం.' మరునాడు ట్రక్కులు కడిగేటప్పుడు తోతాసింగ్ ధనసింగ్‌తో అన్నాడు.

ధనసింగ్‌కి ఈ మాట నచ్చలేదు. పంచదార-కంబళీ ఇవ్వడంలో కష్టమేమీ లేదు. కోహిమాలో అతను రోడ్డుపక్కనవున్న చిల్లరకొట్లో నాలుగు సిగరెట్టు పాకెట్లు తీసుకుని డబ్బుకి బదులుగా ఒక సైన్యపుకంబళీని లారీనుంచితీసి ఇచ్చేశాడు. ప్రభుత్వపుసరుకుదేముంది? 'తోతా చాలా దుర్మార్గుడు. వేశ్యలవెంబడి తిరుగుతాడు. ఇటువంటి పోట్లాటలోనే నేను ఇద్దరిప్రాణాలు తీశాను. ఇక్కడ ప్రపంచమే అటువంటిది' అనుకున్నాడు ధనసింగ్.

రెండురోజుల శెలవుతర్వాత మూడురోజులవరకూ ధనసింగ్, అతని తోటివాళ్ళ డ్యూటీ ట్రక్కులు తోలడానికి ఉపక్రమించలేదు. డ్రైవర్లు తమలో తాము పైకి తెలియనీయకుండా అనుకున్నారు—బహుశా మార్గాన్ని జపానువాళ్ళు ఆక్రమించి వుండివుంటారు. ఆ విషయంవల్ల వాళ్ళకేమీ విచారంలేదు, భయం లేదు. ధనసింగ్ పగటిపూట బాగా నిద్రపోయేవాడు, పచార్లుచేస్తూ తిరుగుతూ వుండేవాడు. అందుచేత రాత్రిపూట అతనికి నిద్ర వచ్చేదికాదు. పడుకుని ఆలో

చించేవాడు. జపానువాళ్లు విజయంపొందితే మంచిదా? ఎన్నిరోజులు పడుతుందో ఏమో!.... థోంగ్‌మా!

మూడువారాలు పూర్తిగా గడచిపోయాయి. ట్రక్కులు కోహిమా. మణిపూర్‌లవైపు వెళ్ళలేదు. కానీ దీమాపూర్‌నుంచి డ్రైవర్లు గౌహతీవైపు గాయపడిన వాళ్ళని తీసుకుని వెళ్లేవాళ్ళు. కొత్తసైనికులని తీసుకువస్తూవుండేవాళ్ళు. అనేకమంది సైనికులు రైలుమీద, మోటార్లమీద వస్తూండేవాళ్లు. యుద్ధం బాగా జోరుగా జరుగుతోంది. వర్షాకాలం అంతా ధనసింగ్ గౌహతీవైపు ట్రక్కులు నడుపుతూ వెళ్తూనేవున్నాడు. వర్షంవల్ల మార్గం ధ్వంసమయితే ట్రక్కులసమూహం దోవలోనే రెండు రెండురోజులు ఆగి వుండిపోయేవి.

సెప్టెంబరులో జపాను, ఆజాద్ హింద్ సేన వెనక్కి తప్పుకున్నాయి. ట్రక్కులసమూహం మళ్ళీ మణిపూర్‌వైపు వెళ్ళసాగింది. దీమాపూర్‌వైపు తిరిగి వస్తోంది. ధనసింగ్ ట్రక్కు అన్నిటికన్నా ముందు వుంది. అతనితోపాటు వైర్‌లెస్ పంపేమనిషి కూర్చునివున్నాడు. ట్రక్కులు పల్లంవైపు బ్రేకులు వేసుకుంటూ నెమ్మదిగా దిగుతున్నాయి. వెంటనే ధనసింగ్ ట్రక్కు బోనెట్‌మీద తుపాకీగుండు వచ్చిపడింది. ఇంకొకగుండు అతనిభుజంలో దూసుకుపోయింది. పక్కనే కూర్చున్న వైర్‌లెస్‌మనిషి కణతమీద గుండువచ్చి తగిలింది. అతను కిక్కురుమనకుండా కూలబడిపోయాడు. ట్రక్కుటైరు గుండు తగలడంతో చిల్లిపడి కదలలేకపోయింది. ట్రక్కు రోడ్డుపక్కనవున్న కందకంలో పడిపోతోంది. ధనసింగ్ ఒకచేతితో అతికష్టంమీద దాన్ని కాపాడాడు.

రోడ్డు పక్కనుంచి అనేక తుపాకీగొట్టాలు అతనివైపు తిరిగాయి. బురదతో నిండిన హిందూస్థానీ సైనికులముఖాలు ఎదురుపడ్డాయి. 'మా రాజ్యంకోసం, మీ జాతికోసం మా వైపు వస్తున్నట్లయితే ట్రక్కులు ఆపండి!' అని వాళ్ళు కేకలు పెట్టారు.

ఆజాద్ హింద్ సేనకు సంబంధించిన సైనికులని ధనసింగ్ అర్థం చేసుకున్నాడు. ఆత్మసమర్పణకోసం అతను చేతులు పైకెత్తాడు. అతనివెనుక వస్తున్న ట్రక్కులుగూడా ఆగిపోయాయి. డ్రైవర్లందరూ చేతులు పైకెత్తి ట్రక్కులనుంచి

కిందకు దిగారు. ట్రక్కులవిండా గాయపడిన ఇంగ్లీషు సైనికులున్నారు. ఆ.హి.పే. ఆఫీసరు ఇచ్చిన ఉత్తర్వునుపాటించి డ్రైవర్లు పుట్‌బోర్డుమీద నిలబడి ట్రక్కులని కదిలించి కందకంలోకి దొర్లించేశారు. ట్రక్కులు దొర్లుకుంటూ కిందికి పడి పోయాయి. వాటిలోని గాయపడిన ఇంగ్లీషు సైనికులు, అమెరికన్ సైనికులూ చెల్లా చెదరుగా పడిపోయారు. డ్రైవర్లు రైఫిల్‌లు తీసుకున్నారు. ఆ. హి. పే. తో పాటు 'జయ్ హింద్' అని కేకలు వేసుకుంటూ క్రిందకుదిగి అడవులలో తూర్పువైపుకు వెళ్ళిపోయారు.

* * *

ఆ దళానికి సంబంధించిన ఇరవైమంది డ్రైవర్లు, ఇరవైమంది కావలా కాసే సైనికులు, ఆ. హి. పే. కి సంబంధించిన పన్నెండుమందితో కలిసి దట్టమైన అడవిలో వెడుతున్నారు. ఎనిమిదిమైళ్ళునడిచి ఒక చిన్నకేంపుని చేరుకున్నారు. కేంపులో రెల్లుగడ్డిచూరులతో నిర్మించబడిన ఇళ్లు వున్నాయి. ఆ-హి-పే ఆఫీసరు బ్రిటిష్-భారతీయసైన్యానికి సంబంధించిన డ్రైవర్లనుండి తుపాకులు తీసుకుని వాటిలోనుంచి గుళ్ళు బయటకుతీసి ఇలా హెచ్చరిక చేశారు - 'మీరు మన దేశ శత్రువుల జట్టువదిలి జాతీయసైన్యదళంలో అడుగు పెట్టబోతున్నారు. మీకందరికీ సుస్వాగతం. మీరు ఇక్కడనుంచి పారిపోవడానికి ప్రయత్నం చేయరని నమ్ముతున్నాము. పారిపోవడానికి ప్రయత్నించేటట్లయితే మిమ్మల్ని విధిగా తుపాకులతో కాల్చాల్సి వస్తుంది.'

ధనసింగ్ గాయపడినచేతిని బాధనుంచి నివారణ పొందేందుకు గుడ్డపేలికతో కట్టి ఎత్తి మెడకు చుట్టుకుని కొంత విశ్రాంతిని పొందాడు. ఒకచేతితో రైఫిల్‌ని భుజంమీద పట్టుకున్నాడు. మరుసటిరోజు ధనసింగ్‌కు, అతని తోటివాళ్ళకు పెద్ద కాంపుకు వెళ్లాల్సివచ్చింది. ఒక హిందూస్థానీ ఆఫీసరు, చప్పిడిముక్కు - బోడి గుండుతోవున్న జపాను ఆఫీసరు ఒక్కొక్కసైనికుణ్ణి విడివిడిగా పిలచి, బ్రిటిష్-భారతీయసైన్యం వాళ్ళ పరిస్థితినిగురించినవిషయాలు అడిగారు. డ్రైవర్లు ఎంత మటుకూ తెలుసో, అంతా వాళ్ళకి చెప్పడానికి ఏమీ సందేహించలేదు. తమ శత్రువులదగ్గర ఉద్యోగం వదిలిపెట్టి జాతీయసైన్యంలోనికి చేరడం వాళ్ళ కెంతో సంతోషం అనిపించింది. ఆ-హి-పే లో చేరి ఇంగ్లీషువాళ్లతో పోట్లాడడానికి సిద్ధమయ్యారు.

ఆ-హి-పే కి సంబంధించిన హిందూస్థానీ డాక్టరు ధనసింగ్ భుజానికి తగిలిన గాయానికి మందువేసి కట్టుకట్టాడు. ఆ తర్వాత ధనసింగ్ మూడవకాంప్‌వైపు వెళ్లాడు. అక్కడ ఎందరో గాయపడిన సైనికులను కంచరగాడిదలమీద, బర్మా కూలీలు భుజాలమీద స్ట్రెచర్‌లపై మోసుకుపోతున్నారు. బ్రిటిష్‌సైన్యంలో గాయపడిన సైనికులకి లభించేటంత మందుసామగ్రి, వున్నవిన్ని విశ్రాంతిస్థలాలు, ఇతర వసతులు ఇక్కడ లేవు. కానీ ధనసింగ్‌కు అది లోటుగా అనిపించలేదు. అది పరదేశీ ప్రభుత్వపునౌకరీ, ఇది స్వదేశీనౌకరీ. పెద్ద విశాలమైన చెట్లనీడల్లో, రాతిగుట్టల నీడల్లో, ఓ చిన్నహాస్పిటలు వుంది. గడ్డిపరచి, పక్కలుగాచేసి, గాయపడినవాళ్ళని అక్కడ పడుకోబెట్టారు. జపానుసైనికులు, హిందూస్థానీసైనికులూ విడివిడిగా వున్నారు. ధనసింగ్ తనచేతిని జాగ్రత్తగా ఎత్తిపట్టుకుని తిరగగలిగాడు. మందులు వాడటానికి సామగ్రి తక్కువగావుందని అతను వెంటనే పసిగట్టాడు. జపాను సైనికులనిగురించి ఎక్కువగా జాగ్రత్తపడేవాళ్ళు. హిందూస్థానీ సైనికులస్థితి అంత బాగాలేదు.

హిందూస్థానీ డాక్టరు చాలా చికాకుగా వుండేవాడు. సైనికుల శరీరాలనుంచి గుళ్ళు బయటకు తీయడానికి, నొప్పిని ఆపే ఇంజక్షనుమందు చాలా తక్కువగా వుంది. ఈ మందు జపాను సైనికులకుమాత్రమే ఇవ్వటం జరుగుతూంది. 'నువ్వు గొప్ప వీరుడివి, ఉత్సాహంగా వుండు!' అని డాక్టరు ధనసింగ్‌కు ధైర్యం చెప్పాడు. కాంపౌండరు, హిందూస్థానీ బంట్రోతు ధనసింగ్‌చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. ధనసింగ్ పళ్ళు బిగపట్టాడు. గుండు బయటకు లాగేశారు. ధనసింగ్ చెయ్యి సరిగ్గా అవడానికి పూర్తిగా ఒకనెల పట్టింది.

నేతాజీనిగురించి మాట్లాడుకుంటూ వుండేటప్పుడు కాంపౌండర్ నేతారామ్ కళ్ళు ఉత్సాహంతోనూ, ఆశతోనూ మెరుస్తూ వుండేవి - జపానువాళ్లసహాయం వుంది కానీ మనం మనదేశంనుంచి ఇంగ్లీషువాళ్ళని వెళ్ళగొట్టి స్వరాజ్యం స్థాపించుకోవాలి అనేవాడు. అతను కొంతజాతిభాషలో జపానువాళ్ళనిగూడా తిడుతూ వుండేవాడు.... ఈ మనుషులు పొట్టివాళ్ళయినా మొనగాళ్ళు. క్రూరమైన రాక్షసులు. ఇంగ్లీషువాళ్లు ఎంతయినా మానవత్వంగలవాళ్ళు. వాళ్ళకి పరిపాలనచేయడం తెలుసు. వాళ్ళదగ్గర పనిచేసేవాళ్లకి కడుపునిండా తిండిపెట్టి, తియ్యటి మాటలు

చెప్పి, సంతోషపెట్టి, మరీ పని చేయించుకుంటారు. జపానువాళ్ళయితే తుపాకీ కత్తులతో పొడుస్తూ పని చేయించుకుంటారు. జపానువాళ్ళసహాయం మనకువున్నా లేకపోయినా సరే. మనప్రాణాల్ని ఇచ్చయినాసరే మనదేశాన్ని లాక్కోవాలి అని నేతాజీ ఉద్ఘాటించారు.

ధనసింగ్ ఆలోచించేవాడు - హిందూదేశంలోకూడా బర్మామాదిరిగా ఇంగ్లీషువాళ్ళకి వ్యతిరేకంగా తిరుగుబాటుజరిగితే నెల తిరిగేలోగా మనం కాంగడా కోటవరకూ చేరిపోతాం. యుద్ధభూమికివెళ్ళి పోట్లాడుతాము. నేను పంజాబువైపు అన్నిటికన్నా ముందుకువెళ్ళేసైన్యంతోకలిపి వెళ్ళిపోతాను' అనుకునేవాడు.

ధనసింగ్ చెయ్యి మామూలుగా ఇటూ అటూ తిరగడానికి వీలుగా బాగు పడగానే అతన్ని డ్యూటీమీద పంపించారు. ఆజాద్ హింద్ సేనలో మోటార్ల దళాలు వెళ్ళేవి కాదు. సైన్యానికి కావలసిన రేషనుగానీ, సామానుగానీ చేర్చడం, గాయపడిన సైనికులని వెనక్కి తీసుకువచ్చేపని, తరుచుగా కంచరగాడిదల ద్వారానూ, కూలీలద్వారాను జరుగుతూవుండేది. ధనసింగ్‌కు రెండు గాడిదలమీద ఫిరంగులు కాల్చేదళానికి రేషను తీసుకువెళ్ళి ఇవ్వడం, రేషను తీసుకురావడానికి సంబంధించినపని తగిలింది.

రేషను చాలా తక్కువగా వుండేవి. ఇంగ్లీషువాళ్ల శిబిరాలలోలాగా పంచదార బస్తాలు, బిస్కెట్లడబ్బాలు, ఎక్కడపడితే అక్కడ పడివుండేవికాదు. దీమాపూర్, కోహిమా కాంపులలో సైనికులు రేషన్‌బస్తాలని బూట్లకాళ్ళతో తన్నుకుంటూ వెళ్ళిపోయేవాళ్ళు. రోడ్డుపక్కన స్త్రీలు, ఆడపిల్లలు నిలబడి తమపొట్టని, శరీరాన్ని చూపించి పిడికెడు పంచదార, ఉప్పు, కంబళీకోసం తమ శరీరాన్ని అప్ప జెప్పడానికికూడా సిద్ధపడేవాళ్ళు. ఈ విషయాలన్నీ ధనసింగ్‌కి గుర్తుకు వస్తూ వుండేది. ఆ-హి-సేనలో అతను అర్ధాకలి నింపుకునికూడా శత్రువులతో పోట్లాడడంలో గర్వాన్ని పొందేవాడు. ఇప్పు డతను ప్రజలని అణచడానికి ప్రయత్నించే ప్రభుత్వపు ఉద్యోగికాదు, ప్రజాసైనికుడు. జీతం ఎంత దొరుకుతుందో, ఎప్పుడు దొరుకుతుందో, అసలు దొరుకుతుందో లేదోకూడా అతనికి తెలీదు. అతనిలా ఆలోచించేవాడు - ఒక్కసారి ఆ-హి-సేన దీమాపూర్‌లోని హిందూస్థానీ సైనికులని

కలుసుకునివస్తే। అందరూ ఇంగ్లీషువాళ్లమీద పగ దీర్చుకోవడానికి సిద్ధంగా వున్నారు. అలాచేస్తే ఇంగ్లీషువాళ్ళకి అంతిమదినాలు వస్తాయి.

నవంబరు ఏడవతారీఖున రేషను పూర్తి అయిపోయింది. సాయంత్రం వరకూ రేషను రాకపోవడంవల్ల కాంపు కమాండరు ధనసింగ్‌ని, బంత్రోతు సైనికుడు కాలేఖాంని బేస్‌కాంపునుంచి రేషన్ తీసుకురమ్మని ఆదేశించాడు. ధనసింగ్ ఎనిమిదిమైళ్లు వెనక్కి వెళ్లాడు. అతను గోదాముకు సంబంధించిన జపాను ఆఫీసరుకు ఉత్తరం ఇచ్చాడు. ఆ ఆఫీసరు ఉత్తరంచూసి తనవెంటవున్న మిగతా ఇద్దరు ఆఫీసర్లతో చిటపటలాడుతూ మాట్లాడుతూ వుండిపోయాడు. వీళ్లకన్నా ముందు వచ్చిన బంత్రోతుకూడా సమీపంలో నిలబడివున్నారు. అతను ధనసింగ్, బంత్రోతు కాలేఖాంల చెవులదగ్గర నోరుపెట్టి—'అయిదుగంటలనుంచి నిలబడివున్నాను. జపానువాళ్ళకు రేషన్ ఇస్తున్నారు. నేనిచ్చిన ఉత్తరం చింపి అవతల పారేశాడు' అని చెప్పాడు.

జపానీ ఆఫీసరుదృష్టిని ఆకర్షించడంకోసం ధనసింగ్‌కన్నా ముందువచ్చిన బంత్రోతు మళ్ళీ నమస్కారం చేశాడు. అతని నుదుటిమీద ముడుతలు పడ్డాయి. ధనసింగ్‌ని, కాలేఖాంని తనవెనక రమ్మని సౌంజ్ఞచేసి పిలిచాడు. ఆఫీసరు ఒక గోదాములోకి దిగాడు. గోదాములో ఇరవై పాతిక బస్తాలు ఒకదానిపైన ఒకటి వున్నాయి. ఈ బస్తాలు భారతీయసైనికులనుంచి లాక్కున్నవి. వాటిమీద భారతీయ సైన్యపుగురుతులు వున్నాయి. ఆఫీసరు సౌంజ్ఞచేసినమీదట ధనసింగ్, కాలేఖాంలు ఒక్కొక్కబస్తాఎత్తి ఆఫీసరుముందు పెడుతున్నారు. ఆఫీసరు బస్తాలలో చేతులు పెట్టి చూస్తూపోతున్నాడు, అందులో ఏమున్నాయోనని. బియ్యము, గోధుమపిండితో నిండిన బస్తాలను అతను ఒకవైపున పెట్టించాడు. ఒకబస్తాలో మిరియాలున్నాయి.

ఆఫీసరు మిరియాలు అరచేతిలోకితీసుకుని సౌంజ్ఞచేస్తూ, 'ఇవి ఏమిటి?' అని అడిగాడు.

'మిరియాలు' అని కాలేఖాం చెప్పాడు. ఆఫీసరు సౌంజ్ఞచేస్తూ 'ఇది ఎందుకు వాడతారు?' అని అడిగాడు.

కాలేఖాం నోటివైపు చెయ్యిపెట్టుకుని 'తింటాము' అని చెప్పాడు.

ఆఫీసరు బూటుతో తంతూ 'బస్తా తీసుకువెళ్లు' అని సౌంజ్ఞ చేశాడు.

ధనసింగ్, కాలేఖాంలు ఆ ఆఫీసరుకు ఇటువంటివి పొట్ట నింపుకోవడానికి తినరని తెలియచెప్పదామనుకున్నారు. ఆఫీసరు కోపంతో కసురుకున్నాడు. మిరియాలబస్తాని వదిలిపెట్టి వెళ్లడానికి వీలులేదు. తీసుకువెళ్లడంవల్ల ఏమీ ప్రయోజనంలేదు. వాళ్ళు మిరియాలబస్తాని కంచరగాడిదమీద వేసుకుని నిరుత్సాహంగా వెనుదిరిగారు.

కాలేఖాం ధనసింగ్‌ని చివాట్లు పెట్టాడు. 'అరేయ్, గాబరా పడతావెందుకు? మనం గాడిదలవంటి సైనికులం. మొదట మనల్ని ఇంగ్లీషువాళ్ళు మేపేవాళ్ళు. వాళ్లదగ్గర మంచి దాణావుండేది. వాళ్లు బాగా పనిచేయడానికి పచ్చగడ్డి, పప్పు గింజలుపెట్టి బాగా మేపేవాళ్లు. ఇప్పుడు జపానువాళ్ళచేతుల్లో వున్నాం. ఎప్పుడైనా నేతాజీదయవల్ల ఇది రష్యాలాంటిరాజ్యం అయితే మనకికూడా రోజులు వస్తాయి. దేశస్వాతంత్ర్యంకోసం అన్నీ సహించమని నేతాజీ చెప్పారు. నేతాజీవస్తే వీళ్ళు మనతో నవ్వుతూ మాట్లాడతారు. లేకపోతే బర్మావాళ్ళపరిస్థితి ఎలాగయిందో మనదీ అలాగే అవుతుంది. వీళ్లు మన పచ్చిమాంసం తింటారు.'

రెండుగంటలక్రింద రెండు ఇంగ్లీషువాళ్ళ విమానాలు బాంబులువేసి వెళ్లాయి. కాలిబాటలు విరిగి ముక్కలై, చెల్లాచెదరైపోయాయి. దోవ గుర్తుపట్టడానికి వీలులేకుండాపోయింది. ఛత్తర్‌సింగ్, ధనసింగ్, కాలేఖాంలు దక్షిణ-పడమర దిక్కువైపు వెడుతున్నారు. దోవ మర్చిపోయాము. చీకటిపడితే ఇంకా ఇరకాటంలో పడతాము అని కాలేఖాం మాటిమాటికీ చెపుతున్నాడు. తెల్లారేవరకూ ఎక్కడైనా ఆగుదాము. మిరియాలబస్తాని తొందరగా చేర్చినా కలిగేలాభ మేముంది? అన్నాడు కాలేఖాం. ఛత్తర్‌సింగ్, ధనసింగ్‌లు తుపాకులుపేలే చప్పుడు వచ్చేవైపు వెళ్ళడానికి నిశ్చయించుకుని దక్షిణ-పడమరదిక్కుగా వెళ్లారు. తూర్పుదిక్కున ఏదో కాంతితో నిండిన బింబం కనిపించింది. అప్పుడుకూడా దోవని నిశ్చయించుకోలేకపోయారు. అలసిపోయిన కంచరగాడిద మాటిమాటికీ కింద కూలబడటం మొదలుపెట్టింది. ముగ్గురూ ఒక దట్టమైన చెట్టుక్రింద, రాతిగుట్టచాటున కూర్చుండిపోయారు. కూర్చున్నతర్వాత నడుము వాల్చడానికి పడుకున్నారు. నిద్రపోయారు.

ధనసింగ్ ఊపిరి ఆగిపోవడంవల్ల బాధతో విలవిలా తన్నుకుని లేవడానికి

ప్రయత్నించేశాడు కానీ కదలలేకపోయాడు. కళ్లు తెరవడానికి ప్రయత్నించాడు కానీ కళ్ళకిగూడా గట్టిగా గంతలు కట్టబడివున్నాయి. అతనిచేతులు వీపువెనుకకు విరిచి కట్టబడివున్నాయి. తర్వాత కళ్లకు కట్టినగుడ్డ ఊడదీయబడింది. అతను చూశాడు. అతనితోటివచ్చిన మిగతా ఇద్దరిపరిస్థితిగూడా అలానే వుంది.

పిస్తోళ్ళు చూపించి, 'అరిస్తే కాల్చి చంపుతాము!' అనే హెచ్చరిక వినబడింది. నోటికి కట్టినగుడ్డ వూడదీసి, 'మీ మిగతాసైన్యం ఎక్కడ దాక్కుంది?' అని అడిగారు.

ధనసింగ్, అతని తోటివాళ్ళు ఇంగ్లీషు సైన్యానికి సంబంధించిన స్కౌటుల చేతుల్లో ఖైదు అయారు. వాళ్లు ఏ విషయమూ చెప్పడానికి అంగీకరించలేదు. అందుకని కాంపుకి తీసుకువెళ్ళి వాళ్లని విడివిడిగా ఖైదుచేయడం జరిగింది. ఆలోచించి ఏదీ నిశ్చయించుకోవడానికి ఆరుగంటలసమయం ఇచ్చారు. శత్రువుల వివరాలన్నీ చెప్పాలి. లేకపోతే తుపాకితో కాల్చి చంపేయడం జరుగుతుంది. ఆరు గంటలతర్వాత ధనసింగ్‌ని ఒక హిందూస్థానీ ఆఫీసరు, ఒక ఇంగ్లీషు ఆఫీసరు కూర్చున్నచోట నిలబెట్టారు. అతను భయంతో వణికిపోతున్నాడు కానీ అతని సమాధానం. 'నాకేం తెలీదు.'

ధనసింగ్‌ని తుపాకితో కాల్చకుండా మిగతా సైనికఖైదీలతోపాటు ఖైదు చేశారు. మరునాడు కాలేఖాం గూడా వచ్చేశాడు. ఛత్తర్‌సింగ్ మూడురోజులతర్వాత వచ్చాడు. అతని శరీరంమీద దెబ్బలుపడిన గుర్తులున్నాయి. ఛత్తర్‌సింగ్‌ని బాగా కొట్టారు. ఆ-హి-సేన బలవంతంగా సైన్యంలో చేర్పించిందని అతను భయపడి అబద్ధం చెప్పాడు. తను ఇంగ్లీషువాళ్ళసైన్యంలో కలవడానికి పారిపోయి వస్తున్నాననికూడా చెప్పాడు. ఆఫీసరు అతని రాజభక్తిని మెచ్చుకున్నాడు. వెంటవచ్చి ఆ-హి-సేన నివసించేప్రాంతం, వాళ్ల కేంపుకు దోవ చూపించమని అతన్ని అడిగాడు. అతను స్కౌటుపార్టీని ఇరవైనాలుగు గంటలవరకూ మభ్యపెడుతూ వచ్చాడు. మాటిమాటికీ అతన్ని తుపాకితో కాలుస్తామని బెదిరించారు అతను బతిమాలుతూ, అయ్యా, దోవ తెలియటంలేదండి అని చెప్పటం మొదలుపెట్టాడు. అతన్ని కొట్టి మళ్ళీ ఆఫీసర్లఎదుట నిలబెట్టారు. 'అడ్డు తొలగించండి. పిరికివాడు,

బహుశా మర్చిపోయివుండచ్చు. ఈ సైనికులబుర్రలలో పేదవుంటే మర్చిపోక ఏమవుతారు?' అన్నాడు ఆఫీసరు.

ధనసింగ్‌ని, అతని తోటివాళ్ళని పదిహేనురోజులవరకు సుమారు వంద మంది సైనికులతోకలిపి కాంపులో వుంచారు. తర్వాత ఈ సైనికఖైదీలని, గూర్ఖాల కాపలావుంచి, జాగ్రత్తగా దీమాపుర్‌వెళ్ళే దోవలోవున్న సిల్‌గుడీ కాంపుకు పంపించడం జరిగింది. ఆ-హి-సేన సైనికులు భారతీయులు. భారతీయ సైనికులే బాకులు తగిలించివున్న తుపాకులు పట్టుకుని వాళ్ళని కాపలా కాస్తున్నారు. కాపలాకాసే సైనికులు, ఖైదుచేయబడిన సైనికులు తమలోతాము మాట్లాడుకోవటం పూర్తిగా నిషేధించబడింది. కాపలాకాసేసైనికులు తమ రాజభక్తి, స్వామిభక్తి తెలియపరచటానికి అహంకారంతో ఆ-హి-సేన సైనికులను కృతఘ్నులుగాతలచి ద్వేషించేవాళ్లు. ఆ-హి-సేన సైనికులు కాపలాకాసే సైనికుల్ని ఇంగ్లీషువాళ్ళ రొట్టెముక్కకోసం ఎగబడే కుక్కలుగానూ, రొట్టెముక్కకోసం దేశాన్ని అమ్మే అవినీతిపరులుగానూ తలచేవాళ్లు. తొందరలోనే వాళ్ళకి విజయం ప్రాప్తిస్తుంది, వాళ్లు స్వతంత్రదేశంలోని తమ సోదరులను కౌగలించుకోగలుగుతారు అని ఆ-హి-సేన సైనికులకు ఆశగా వుండేది.

నెమ్మదిగా కాపలాకాసే సైనికులలోనూ, ఖైదీ సైనికులలోనూ జాతిభాషల సామరస్యం స్పష్టమవడం మొదలుపెట్టింది. కఠినమైన నియమం వున్నప్పటికీ బయటనుంచి కాంపులోకి వార్తలు రావడం మొదలుపెట్టాయి. ఎవరికీ కనిపించకుండా వార్తాపత్రికలుగూడా వస్తూవుండేవి. ఇంగ్లీషువాళ్ల రాజనీతివల్ల సైనికుల హృదయాలు కృంగిపోవటం మొదలుపెట్టాయి. ఆ-హి-సేన సైనికులు తమ అంధకారమయమైన భవిష్యత్తుకోసం సిద్ధమవసాగారు. వాళ్ళకి ఒకే ఓదార్పు వుండేది, వాళ్ళు తమదేశంకోసం పోట్లాడారు, దాని పరిణామం ఏదైనా కానీ....

• • •

యుద్ధంలో బ్రిటన్‌కు విజయం లభించింది. జైలు కాంపులో బంధించిన సైనికులు నిరాశాపూరితులై పోయారు కానీ దేశంలోని ప్రజలు వాళ్ళని విడుదల చేయడంకోసం ఆందోళనలు చేస్తున్నారని వార్తలు అందసాగాయి. కాంపులో పరి-

కోధన ప్రారంభమయింది. సైనికులు ఏ పరిస్థితిలో ఆ-హి-సేనలో వెళ్ళి చేరారు; విధిలేక చేరారా లేకపోతే మనస్ఫూర్తిగా చేరారా అన్నవిషయం తెలుసుకోవడానికి వాళ్ల పాతఉత్తరాలు, పుస్తకాలు, డైరీలు పరిశీలించబడ్డాయి. ఎవరైతే భయం తోనూ, గత్యంతరంలేక ఆ-హి-సేనలో చేరారో వాళ్ళని నిర్దోషులుగా అంగీక రించారు. ఎవరైతే మనస్ఫూర్తిగా, కర్తవ్యపాలనగా ఆ-హి-సేనలో వెళ్లి చేరారో వాళ్ళు అవిశ్వాసయోగ్యులుగానూ, అపరాధులుగానూ ఎన్నుకోవడం జరిగింది. పిరికివాడు కానందున, అవిశ్వాసయోగ్యుడుగా భావించబడి, ధనసింగ్‌కు విడుద లయేవంతు రాలేదు.

ఢిల్లీలో ఆ-హి-సేన నాయకులకు సంబంధించిన దావా జరుగుతోంది. సంపూర్ణదేశమూ, ఆ-హి-సేనకు సంబంధించిన ఖైదీలూ, ఈ దావాపరిణామం ఎలా వుంటుందా అని ఆదుర్దాతో ఎదురుచూస్తున్నారు. ప్రజలకోరికముందు ఇంగ్లీషు ప్రభుత్వం తల వంచాల్సి వచ్చింది. ఆ-హి-సే నాయకులు విడుదలయిన మూడు నెలలతర్వాత ధనసింగ్‌కూడా బాంకీపూర్ సైనిక జైలు కాంపునుంచి విడుద లయ్యాడు.

# విభిన్న మార్గాలు

ప్రొడ్యూసరు సుతలీవాలా 'గరీబ్‌కే ఆహ్' (బీదల నిట్టూర్పులు) సిని మాలో నాయిక భూమికని ధరించమని పహాడన్‌ని బ్రతిమలాడసాగాడు. ఆ సమ యంలో పహాడన్ మూడుసినిమాలలో పనిచేస్తోంది. నాకు తీరుబడి ఎక్కడుంది? అన్నది. ఆమె వీలునుబట్టే ఏర్పాటులన్నీ చేసుకుంటామని సుతలీవాలా చెప్పేసరికి పహాడన్ దెబ్బైఅయిదువేలు అడిగింది.

'భలే, బీదవాళ్ళనిట్టూర్పులకి ఇంత విలువవుంటే ఇక దారిద్ర్యం అనేది వుండదా ఏమిటి?' అని సుతలీవాలా నవ్వాడు.

ఆ పరిహాసానికి పహాడన్ చిరునవ్వుతో మౌనంగా వుండిపోయింది.

'వాస్తవానికి జరుగుతున్నది ఏమిటంటే 'బీదవాళ్ళ నిట్టూర్పులు' అసలు వినిపించడమే లేదు. ఆ నిట్టూర్పులలో ఎంత బలంవుందంటే ఇప్పుడున్న సమాజ మంతటిలోని చట్టం భస్మమైపోతుంది.' సుతలీవాలా సమాజంమీద తన కున్న కోపాన్ని వ్యక్తంచేసేందుకు చుట్టపొగని దీర్ఘంగా వదిలాడు. చేతిలోని గ్లాసుని తిప్పాడు. ప్రబలమైనక్షోభ బద్దలయిందేమో అన్నట్లుగా విస్కీ కలిపిన సోడాలో నుంచి వందలకొలది బుడగలు పైకి వచ్చాయి.

సుతలీవాలా పహాడన్‌తో కళ్ళుకలిపి మాట్లాడుతూనేవున్నాడు—'మీకు తెలుసా, ఈ యుద్ధంలో రోజుకి పదిలక్షలరూపాయలు ఖర్చు అవుతున్నాయి. అందుచేతనే ప్రతిరాష్ట్రం మిగతా రాష్ట్రాలని పీడించడానికి అధికారాన్ని కోరు తోంది. కానీ ప్రపంచంలోని బీదల నిట్టూర్పులు అచేతనంగా ఒక్కచోట ప్రో గయితే ఈ సమస్య ఒకరోజులో, ఒకేరోజులో తేలికగా పరిష్కారమవుతుంది.

సుతలీవాలా చురుకైన సంభాషణలకి పహాడన్ సమాధానం ఇచ్చేటంత విద్యావతి కాదు. అందుకనే తన అంగీకారం తెలుపుతూ వూరుకుంది.

సుతలీవాలా తనమాట నెగ్గటంచూసి ఉత్సాహంగా చేతిలోవున్న గ్లాసుని గూడా లక్ష్యపెట్టకుండా, 'బీదవాళ్ళెవరు? బీదవాడు తను నష్టపోతున్నట్లు స్వయం

గ్రహించలేదు'. సహారన్ కళ్ళల్లోకి సూటిగాచూస్తూ అన్నాడు. 'మీరు ఈ సినిమాకు డెబ్బైఅయిదువేలు కోరుతున్నారు. మీరు అడిగితే నే నిస్తాను. చాలా తీసుకున్నామని మీరు అనుకుంటారు కానీ నేను ఇచ్చేది ఎక్కడినుంచి? డబ్బు పెట్టుబడి పెట్టేవాళ్ళది. కొంత మీ కిస్తాను, కొంత మిగతా యాక్టర్లకు ఇస్తాను. నేను పగలు రాత్రి ఒళ్ళు ఒంచి పనిచేసి సినిమా విక్రిస్తాను. దాన్ని అమ్మేకష్టంగూడా పడతాను. కొద్దిగా నేను తీసుకుంటాను. ఇందులో బాంకులో పడివున్న నాలుగు లక్షలూ పెట్టుబడిగా పెట్టడం జరుగుతుంది. మీకు తెలుసా, ఈ సినిమాతీసి ఎంత డబ్బు సంపాదించాల్సి వుందో!'

'పన్నెండు పద్నాలుగులక్షలు! అదంతా పెట్టుబడిదారులదగ్గర చేరుతుంది. నేనూ, మీరూ, మన శక్తిసామర్థ్యాలతోనూ, మన పరిశ్రమవల్ల పెట్టుబడిదారులకు సంపాదించి ఇస్తున్నాం. వాళ్ళదగ్గర మన పరిశ్రమరూపంలో ఇంకా ఎక్కువ పెట్టుబడి కూడుకుంటుంది. మనమీద వాళ్ళఅధికారం ఇంకా ఎక్కువ బలిష్ఠ మవుతుంది.'

సుతలీవాలా రహస్యం చెప్పినట్లుగా ఒంగి, 'నేను సోషలిస్టుని, అందుకనే ఈ భేదాలన్నీ మీకు తెలియచెప్తున్నాను. మనలాంటి తెలివిగలవాళ్ళనుంచి దోపిడీ జరగకూడదని నేను కోరుతుంటాను. మీరు కంపెనీని డెబ్బైఅయిదువేలు కాదు, ఒకలక్ష అడగండి. ఇప్పించడం నా పని' అని అంటూ తనచేతిని గుండెలమీద పెట్టుకున్నాడు. 'మీకు డబ్బుబాధ లేనేలేదు. మిగతా కంపెనీలలో మీరు పని చేస్తూనే వున్నారు. మీకు అవసరమైతే ఆ ఏర్పాటు చేయిస్తాము. ఈ సినిమాలో పార్టు తీసుకోవడానికి కంపెనీలో మీది ఒక లక్ష 'షేర్' వుంటుందని మీరు కంపెనీ వాళ్ళతో చెప్పండి. లాభంల్లో మీకు మూడులక్షలు వస్తాయి' అని నెమ్మదిగా చెప్పాడు.

సహారన్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. 'కంపెనీ ఆధ్వర్యంలో మీ చెయ్యి వుండాలి. డెబ్బైఅయిదువేలకి కూలిపనిచేసి మిమ్మల్ని మీరు హీనపరుచుకోవడం ఎందుకు? కష్టపడి పనిచేస్తారు, కనుక మీరు యజమాని అవ్వాలి. కష్టపడి పనిచేసేవాళ్ళే యజమానులు కావాలి' అన్నాడు సుతలీవాలా. అతని చేతిలోవున్న

చుట్ట ఆరిపోయింది. చేతిని బల్లమీద జరిపేసరికి నిర్లక్ష్యంతోపడివున్న విస్కీగ్లాసు లోంచి సన్నని బురగల సుడిగుండం లేవసాగింది.

'ఇదేపద్ధతిలో సమాజంలో శాంతిపూర్వమైన విప్లవాన్ని తీసుకురాగలుగుతాము. కమ్యూనిస్టులయితే కూలివాళ్ళని రెచ్చగొట్టి గల్లంతులు చేస్తుంటారు. కూలివాళ్ళు దెబ్బలుతిని మౌనంగా వుండిపోతారు. విప్లవమనేది కూలివాళ్ళచేతిలో మాటగాదు. మీకు ఎకనామిక్సు, పాలిటిక్సులలోకి లోతుగాపోయి చూసినట్లయితే విప్లవం మిడిల్‌క్లాసువాళ్ళయిన తెలివిగలవాళ్ళపనే అని తెలుస్తుంది. వాళ్ళే సమాజాన్ని నడుపుతున్నారు. ఈ రోజు వాళ్ళు సమాజాన్ని పెట్టుబడిదారులకోసం నడుపుతున్నారు. వాళ్లు జాగ్రత్తపడితే, వాళ్ళల్లో చైతన్యంకలిగితే, వాళ్ళకి లాభం కలిగేలా సమాజాన్ని నడుపుకోగలుగుతారు.'

ఆశ్చర్యంతో విప్పారి విశాలమైన కళ్ళల్లోకిచూస్తూ సుతలీవాలా అన్నాడు. 'మీరు ఆలోచించండి, మీకు ఎలా వీలుంటే అలా మూడు-నాలుగు ఇలైనా, అలైనా ఖాయమైపోతుంది. ఈ విషయమంతా మీ చేతుల్లోనే వుంది. అసలువిషయాన్ని మీ ముందు వుంచాను.'

పహాడన్ సుతలీవాలా సలహాప్రకారం 'గరీబ్‌కీ ఆహ్' (బీదల నిట్టూర్పులు) లో పనిచేసేవిషయం చాలా రోజులవరకూ ఆలోచించింది. బన్‌వారీనిపిలిచి అతని అభిప్రాయంగూడా తీసుకుందామనుకుంది. కానీ బన్‌వారీ ప్రవర్తనకి కోపంతో మండిపోయివుంది. స్వయంగా ఎంత ఆలోచించినా ఏం తెలుస్తుంది? అతను లేకుండా నా పని జరగదా ఏమిటి? అనుకుంది.

సుతలీవాలా పహాడన్‌ని తరుచు కలుసుకుంటూవుండేవాడు. అతనిప్రభావం ఆమెమీద హెచ్చవుతోంది. సుతలీవాలా ఆమె భవిష్యత్తుకు సంబంధించిన సమస్యమగురించి మాట్లాడుతూవుండేవాడు. పహాడన్ అతని అభిప్రాయాలతో ఏకీభవించింది. బన్‌వారీని తన తరపున ఆ సినిమాకు అసిస్టెంటు డైరెక్టరుగా తీసుకోవడానికి నిరాకరించింది.

'గరీబ్ కీ ఆహ్' సినిమాప్రచారం చాలాజోరుగా సాగుతోంది. ప్రొడ్యూసరు సుతలీవాలా ప్రఖ్యాతనటుడు మునవ్వర్‌నుకూడా యాభైవేలకి నాయకుని

పాత్రకి బుక్ చేశారు. అతనుకూడా పాతికవేల షేరు. పాతికవేల రొఖ్ఖం తీసుకునే ఒప్పందం జరిగింది. ప్రముఖులైన నటీనటులు ఆ సినిమాలో పనిచేస్తున్నారు. అందుచేత మిగతా యాక్టర్లు, యాక్ట్రెస్‌లు సుతలీవాలాకు చౌకలోనూ, ముందే డబ్బు తీసుకోకుండానూ లభించారు. ప్రసిద్ధ నటీనటులతో కలిసి పనిచేయడం ఉపయోగకరమైనదిగా ఎంచి వాళ్లు అందుకు ఒప్పుకున్నారు.

సినిమా షూటింగు వేగంగా జరుగుతోంది. బొంబాయిలోని 'మధువన్' సినిమా, లాహోర్, ఢిల్లీ, కలకత్తా మొదలైన నగరాల్లో సినిమాప్రదర్శనశాలల్లో సినిమా బుకింగుకోసం అయిదులక్షలు ఎడ్వాన్సు పోగుచేశారు. సహోదన్ తను ఏ పొరపాటూ చేయలేదని తృప్తిచెందింది. సుతలీవాలా ఆమెదగ్గరకు వస్తూ వుండేవాడు. అప్పుడప్పుడూ సాయంత్రంపూట సహోదన్‌ని తన కారులో షికారుకి తీసుకు వెడుతూవుండేవాడు. వాళ్ళసంభాషణ కంపెనీకి సంబంధించినంతవరకే. సుతలీవాలా మంచితనం, తెలివితేటలపట్ల ప్రభావితురాలై సహోదన్ బ్యాంకులో దాచిన తన డబ్బునిగురించిగూడా అతనిసలహా అడిగింది. సుతలీవాలా ఆమెచేత స్టీలు, ఇతరవస్తువులకు సంబంధించిన షేర్లు కొనిపించాడు.

ఒకరోజున సుతలీవాలా పదివేలరూపాయలు సహోదన్ ముందుంచాడు.

సహోదన్ ఆశ్చర్యంతో 'ఇదేమిటి?' అనడిగింది.

'మీరు ఇంకొకవ్యక్తిద్వారా షేర్ కొనుక్కునేటట్లయితే ఇది దానికి కమీషను అవుతుంది. నాకు కంపెనీవాళ్ళు కమీషను ఇచ్చారు. కానీ మీ పనిమీద నేను కమీషను తీసుకోను. ఈ పనిని నేను నా స్వంతపనిగా తలచి చేశాను' అన్నాడు సుతలీవాలా.

సహోదన్ కళ్లు కృతజ్ఞతతో మెరిసిపోయాయి. 'వద్దు, ఇది మీది, మీరు వుంచుకోండి. నామీద మీ అనుగ్రహం చాలా వుంది' అంటూ వారించింది.

సుతలీవాలా నిరుత్సాహపడి, 'నేను డబ్బునేం చేసుకుంటాను? నా జీవితం చాలా నిరాశాపూరితమైనది. ఇంకొకళ్ళకి అన్యాయం జరుగకూడదనే నా కోరిక. నా జీవితానికి కావలసినంత సంపాదించుకుంటాను. అనవసరంగా దాచుకోవటమెందుకు?' అంటూ అతను తన బాధనంతా వినిపించాడు. 'వివాహంచేసుకుని

సంవత్సరన్నర అయింది. కానీ ఒక్కరోజుకూడా భర్తగా నన్ను స్వీకరించలేదు. నా భార్య ఆలోచనలు, స్వభావం, నడవడి, అదో తరహాకి చెందినవి. మేము ఒకే ఇంటో వుంటాము కానీ పరస్పరం కలుసుకుని వారాలు గడచిపోతాయి. కర్తవ్యానుగతుడనై ఏదో కాలక్షేపం చేస్తున్నాను. ఒకవేళ మీరు మా ఇంటికి వచ్చారంటే అక్కడ స్త్రీవున్న ఛాయలు ఏవీ కనిపించవు. ఆమె ఒక్కొక్కప్పుడు మధ్యాహ్నం రెండుగంటలప్పుడు, ఒంటరిగావచ్చి కాస్సేపు కూర్చుంటుంది. ఒక్కొక్కప్పుడు రాత్రంతా అసలు రానేరాదు. ఆమెకు తన సొసైటీ వుంది, తన మిత్రులున్నారు. నేను ఆమెకి తగినవాణ్ణి కాదని అనుకుంటుంది. నాకుకూడా ఆమె తీక్షమైన స్వభావం, అహంకారం సహించడం కష్టంగా వుంది.'

సహాదన్‌కి చాలా ఆశ్చర్యం కలిగింది. ఇంతమంచి పురుషునితోకలిసి ఏ స్త్రీకి జీవించటం దుర్భరంగా వుంది! ఆమె ఎలా వుండివుంటుంది? తానుకూడా ఇంచుమించు అలాటి మనస్థితిలో వుండటంవల్ల ఎన్నో ప్రశ్నలు ఆతురతగా అడిగింది. సుతలీవాలా ఏమీ సంకోచంలేకుండా చెప్పాడు — రెండుసంవత్సరాలక్రితం తాను మసూరీ కొండమీద వుండేవాడు. అదేసమయంలో పంజాబీ మిత్రుడొకడు తన చెల్లెలితోబాటు అదే హోటల్లో వుండటం జరిగింది. అక్కడే మిసెస్ సుతలీవాలాతో పరిచయం ఏర్పడింది. అప్పుడు ఆమె సజ్జనురాలిలా కనిపించింది. ఒక వారంలో ఎవరైనా మరొకరిని ఏం తెలుసుకోగలుగుతాడు? ఇద్దరూ పరస్పరం ఇష్టపడ్డారు. మిత్రుడు లాహోర్ తిరిగి వెళ్ళిపోయినా ఆయన చెల్లెలితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వుండేవి. ఆయన్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటోందని ఒకరోజు ఆమె దగ్గరనుంచి అనుకోకుండా ఉత్తరం వచ్చింది. వివాహానికి తారీఖు నిశ్చయించబడిందని వైరు వచ్చింది. పెళ్లి అయిన మూడవరోజుననే వాళ్ళమధ్య పోట్లాట జరిగింది.

సహాదన్ సుతలీవాలాపట్ల సానుభూతి తెలుపుతూ ఒక్కసారి గట్టిగా నిట్టూర్చి, 'ఆమెని చూడాలనివుంది. కానీ మీ ఇంటికివస్తే నాతో పోట్లాడదు కదా?' అని అడిగింది.

'పోట్లాడదు. ఎప్పటికీ పోట్లాడదు. నాకు విడాకులు ఇవ్వడానికి వంక దొరికిందని బహుశా సంతోషిస్తుంది' సుతలీవాలా నవ్వాడు.

షహాదన్ సిగ్గుపడింది. 'మీరే విడాకులు ఎందు కివ్వకూడదూ!' అనడిగింది.

'అనవసరంగా ఒక స్త్రీ జీవితం పాడైపోతుంది' సుతలీవాలా స్వరం దయాపూరితమైంది.

'భలే!' అంటూ షహాదన్ సుతలీవాలాని ఎగతాళి చేసింది.

• • •

షహాదన్ వ్యాకులతచెందిన మనస్థితిలో, ఆధారంకోసం బన్‌వారీవైపు మొగ్గింది. బన్‌వారీ విజాయతీవల్ల నైతేనేం, పిరికితనంవల్ల నైతేనేం వెనక్కి తప్పుకున్నాడు. షహాదన్ అవమానంపొంది ఆశ్రయాన్ని వెతుకుతూ తిరుగుతున్న సమయంలో ఉదారహృదయం, సూరాలోచనాపరుడు అయిన సుతలీవాలా ఆమె ఎదుటికి వచ్చాడు. నిస్వార్థతగా నిత్యం షహాదన్‌కు మంచిచేసే ఆలోచనే వ్యక్తం చేసేవాడు. ఇటువంటి పరోపకారస్వభావంగల వ్యక్తికి తాను ఏమీ ప్రత్యుపకారం చేయలేనుకదా అని వాపోయేది.

సుతలీవాలా షహాదన్ భవిష్యత్తుగురించి మాట్లాడేటప్పుడు, 'మనం ఇలా చేయగలం, అలా చేయగలం' అని చెప్పేవాడు. మంచిదే జరిగింది, బన్‌వారీ నుంచి తాను తప్పించుకుంది అని షహాదన్ మురిసిపోయేది.

బన్‌వారీ వచ్చినా ఇప్పుడు షహాదన్ అతనితో అంత మనసిచ్చి మాట్లాడటం లేదు. ఒకవేళ అతను ఇదివరకటిలాగానే 'షహాదన్, మేము త్రాగుతాము' అని అన్నప్పుడు షహాదన్‌కు అసభ్యతగా తోస్తోంది. విననట్లుగానే మెదలకుండా వుండిపోతుంది. ఇప్పుడు నిద్రపోయేందుకు తాగాలనే అవసరం ఆమెకి స్వయంగా కలగటంలేదు. నిద్ర రావడానికి ముందు సుతలీవాలానిగురించి ఆలోచిస్తుంది. మధురభావాలతో తాగాలనేవాంఛ కలిగేదికాదు. బన్‌వారీ రావటం తగ్గించేశాడు. తాను వద్దన్నా అతన్ని అసిస్టెంటు డైరెక్టరుగా చేశారు, ఇతనికి గర్వ మెక్కిపోయింది అని షహాదన్ మనసులో కుమిలిపోయేది.

ఒకరోజు సుతలీవాలా చేస్తున్న ఉపకారాన్ని తలచుకుని షహాదన్‌కు బన్‌వారీమీద కోపం వచ్చేసింది—ఇతను నన్ను నిరాదరం చేశాడు. నా గొప్పదనం.

సామర్థ్యంగురించి ఎన్నడూ పొగడలేదు. నన్నొక వేశ్య అనుకున్నాడు. ఆ రోజు మంచి జన్‌వారీ ఎదురయితే పహాడన్‌కు ద్వేషం కలగటం ప్రారంభించింది. ఒక గౌరవనీయురాలైన స్త్రీతో ప్రవర్తించినట్లుగా సుతలీవాలా ఆమెతో ప్రవర్తించే వాడు—జన్‌వారీ తనని అన్ని ప్రశ్నలు గుచ్చిగుచ్చి అడిగి తెలుసుకున్నాడు కానీ పహాడన్ గడిపిన ఆ దౌర్భాగ్యపు రోజులగురించి సుతలీవాలా ఎన్నడూ ప్రశ్నించ లేదు. ఎప్పుడూ ఆమెతో గౌరవంగా ప్రవర్తించేవాడు.

పహాడన్ శనివారంరాత్రి రెండుగంటలవరకూ స్టూడియోలో పనిచేసింది. ఆదివారం పగలు పదకొండుగంటలవరకు ఆమె గాఢనిద్రలో మునిగిపోయింది. హడావిడిగాలేచి స్నానంచేసి బట్టలు మార్చుకుంది. పదకొండున్నరకు వస్తానని. శెలవురోజుకనుక ఎక్కడికైనా వెళదామని, మధ్యాహ్నం భోజనం బయట చేద్దా మని సుతలీవాలా అన్నాడు. కానీ పన్నెండుగంటలవరకూ ఆయన రాలేదు. పహా డన్ ఆయనకి ఎప్పుడూ ఫోన్ చేసేదికాదు, ఆయన ఇంటికి ఎప్పుడూ వెళ్ళేది కాదు. సుతలీవాలా భార్య ఆయన్ని ఏం బాధ పెడుతుందోనని భయపడేది.

పహాడన్ చికాకుపడుతూ బాధతో ఈ గదిలోంచి ఆ గదిలోకి పచార్లు చేస్తోంది, ఆమెదృష్టి రోడ్డుమీద వుంది, చెవులు సుతలీవాలా కారుహారన్‌కోసం కాచుకునివున్నాయి. సుతలీవాలా ఒంటిగంటంబావుకు వచ్చాడు. నిరుత్సాహంగా వున్నాడు. ఆ నిరుత్సాహాన్ని చిరునవ్వుతో దాచడానికి ప్రయత్నిస్తున్నారని ఆమెకు అనిపించింది. పహాడన్ కారులో కూర్చుంటూ, 'ఏం జరిగింది, అలా వున్నారు' అని అడిగింది.

రోడ్డుమీద చాలామంది జనం తిరుగుతున్నారు. సుతలీవాలా నగరం పొలి మేరలు దాటేందుకు కారుని జాగ్రత్తగానూ, వేగంగానూ నడుపుతున్నాడు. పహా డన్‌కూడా ఊపిరి బిగబట్టి నిర్జనప్రదేశం చేరటానికి వేచివుంది.

'ఆమె నా జీవితాన్ని చాలా దుర్భరం చేసింది' పహాడన్ వత్తిడిచేయటం వల్ల సుతలీవాలా చెప్పాడు.

'ఎందుకని, ఏమంటుంది?' పహాడన్ అనుమానంగా అడిగింది.

'విడాకులు కావాలంటోంది.'

'అయితే చావనీ ఆ రాక్షసిని!' వహీదన్ కోపంలో గట్టిగా నిట్టూర్చింది.

'ఆలోచించు' అన్నాడు సుతలీవాలా.

'ఎందుకని?' వహీదన్ ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసి అడిగింది.

'నేను వహీదన్ని పెళ్ళి చేసుకోవటంకోసం విడాకులు ఇస్తున్నానని ఈ లోకమంతా అంటుంది.'

వహీదన్ కళ్లు కిందికి వాలిపోయాయి. ఒకక్షణం ఆలోచించి ఆమె సుతలీవాలావైపు చూసింది. 'ఇది అవమానంగా భావిస్తున్నారా?' అనడిగింది బాధగా.

'నేనా? నే నెప్పుడూ నీ గౌరవంగురించిమాత్రమే ఆలోచిస్తూవుంటాను.'

వహీదన్ చీరకొంగుతో ముఖాన్ని కప్పుకుని దుఃఖించింది.

సుతలీవాలా ఆవేళ మొదటిసారిగా ధైర్యం చేశాడు. వహీదన్ని తన చేతుల్లోకి తీసుకుని 'ఏడుస్తావెందుకు; నే నన్నమాట బాధను కలిగించిందా?' అని అడిగాడు.

'నన్ను ఏడవనివ్వండి. ఇవ్వాళ మనస్ఫూర్తిగా ఏడవనివ్వండి' అంది.

వహీదన్ కొద్దినిముషాలు అలా ఏడుస్తూనేవుంది. సుతలీవాలా ఆమెతలని తన వక్షస్థలంమీద పెట్టుకున్నాడు. వహీదన్ కళ్ళు తుడుచుకోకుండానే, ముఖాన్ని సుతలీవాలావైపు ఎత్తి, ఆయన మెడచుట్టూ చేతులువేసి, 'ఇవ్వాళ నేను జీవితంలో....నిజం చెప్పండి, మీరు నన్ను ఎప్పటికీ వదిలిపెట్టరుకదూ!' అంది.

సుతలీవాలా ఆమెని గాఢంగా ఆలింగనంచేసుకుని, మరి మాట్లాడనివ్వలేదు.

* * *

మనోరమకు పదిహేనురోజుల కొకసారి నౌకరుద్వారా వందరూపాయలున్న కవరు అందుతూ వుండేది. ఈ డబ్బు తీసుకోవడానికి ఆమె చాలా బాధపడేది. ఈ మాట ఆమె భూషణ్‌తోతప్ప మరెవరితోనూ చెప్పలేదు. 'అందులో సిగ్గుగానీ, బాధపడాల్సిన మాటగానీ ఏముంది? నువ్వు పదిహేనువేలరూపాయల కట్నం ఇచ్చావు. అతని ఇంట్లో భోజనమేగదా చేస్తున్నావు' అన్నాడు భూషణ్.

సుతలీవాలానుంచి డబ్బు అందుతూ వుండటంచేత బస్సు టిక్కెట్టుగానీ, ట్రాం టిక్కెట్టుగానీ కొనడానికి మనోరమకు కష్టమయ్యేది కాదు. అవసరమైనప్పుడు - టాక్సీమీదకూడా వెడుతూవుండేది. భోజనంకోసం మల్‌బార్‌హిల్ తిరిగి రావాల్సిన అవసరంలేదు. ఆమె భూషణ్‌కు చౌకబారు చార్మినార్ సిగరెట్లకు బదులుగా మంచి ఖరీదైన సిగరెట్లుకొని ఇస్తూవుండేది. అప్పుడప్పుడూ వాళ్ళిద్దరూ లేక కామ్రేడ్‌లతోకలసి సినిమాలుకూడా చూసేవారు. భూషణ్‌కు మనదేశపు సినిమాలు చూడటంలో అభిరుచి వుండేదికాదు. మనోరమకు ఆ సినిమాలంటేనే ఒళ్లు మంట. అంతవరకూ సుతలీవాలా నిర్మించిన సినిమా 'దిన్ ఔర్ రాత్' (పగలు రాత్రి) కూడా ఆమె చూడటానికి వెళ్ళలేదు.

సోమవారంనాడు మనోరమ ఇంట్లోనించి బయటకు వెళ్ళబోతుండగా నౌకరు ఆమెకు డబ్బుకవరు ఇచ్చాడు. మనోరమ కవరుతెరచి చూసింది. పది పదివి పది నోట్లతోబాటు సైపు చేయబడివున్న ఒక ఉత్తరం వుంది లోపల. మనోరమ రోడ్డు మీద నడుస్తూ ఉత్తరం చదవసాగింది. ఉత్తరం చదవడం మొదలుపెట్టినకొద్దీ ఆమెనడక వేగం తగ్గుతోంది. రోడ్డుమీద ఒకవైపు నిలబడి, ఆ ఉత్తరం మరోసారి చదివింది. ఆశ్చర్యంతోనూ, నిరాశతోనూ ఆమె హృదయం నిండిపోయింది. ఒక్కక్షణం ఆలోచిస్తూ నిల్చుంది. ఇక ముందుకి నడిచివెళ్ళటం ఆమెకు కష్టమైపోయింది. ఒక టాక్సీని ఆపి ఎక్కింది.

మనోరమ పార్టీ కార్యాలయంముందు టాక్సీ దిగింది. చేతిగడియారం చూసింది, రెండుగంటలయింది. భోజనసమయం పూర్తి అయిపోయింది. అటువంటిసమయంలో భూషణ్‌ను పిలిపించటం ఉచితం కాదు. 'సోవియట్ మిత్ర సంఘం' కార్యాలయంవైపు నడుచుకుంటూ వెళ్ళింది.

ఆఫీసులో వారపత్రిక ప్రూఫు మనోరమకోసం ఎదురుచూస్తోంది. ఆమె పనిలో మనసు లగ్నం చేయలేకపోయింది. భర్త ఉత్తరంలోని వాక్యాలు మాటి మాటికీ జ్ఞప్తికి వస్తున్నాయి. అతను చేసినపనికి అర్థమేమిటి? అని ఆలోచించ సాగింది. కామ్రేడ్ మిసెస్ సీతా కార్యాలయంలో లేకపోవడం మంచిదయింది. కామ్రేడ్ అవరే రాబోయే ప్రచురణకు మేటర్ తయారుచేస్తున్నాడు.

'కామ్రేడ్ ఇది చూస్తారా? పండర్‌పుల్, పనిచేయడానికి మంచివిషయం దొరికింది!' అని అతను మాటిమాటికీ పిలవటం మొదలుపెట్టాడు.

మనోరమ విసుక్కుంది—'ప్లీజ్, డోంట్ డిస్టర్బ్!' ఆమెలేచి భూషణ్‌కి ఫోను చేసింది. 'చాలా ముఖ్యమైనపనుంది, ఆరుగంటలకి తిన్నగా ఇక్కడకు వచ్చేయాలి' అని చెప్పింది.

మనోరమ మాటల్లో హడావిడి కనిపెట్టి 'ఏమైనా ముఖ్యమైనవిషయం వుందా?' అని అడిగాడు భూషణ్.

'లేదు, నువ్వు ఇక్కడికి వచ్చేసెయ్, అంతే' అంది మనోరమ.

'ఒకవేళ ముఖ్యమైనవిషయ మేదీ లేకపోతే ఏడున్నరగంటలు చెయ్యి. పని పూర్తిచేసి, భోజనంచేసి వస్తాను' అన్నాడు భూషణ్.

మనోరమకి కోపం వచ్చింది—'భోజనం చేయకముందే రావాలి' అన్నది.

ఆరుగంటలకుకూడా ప్రూపు పూర్తి చెయ్యలేకపోయింది మనోరమ, ఆవరే సహాయం కోరింది.

ఆవరే ఆ పనిచేసినందుకు బదులుగా, ఒకకప్పు టీ, ఒక చార్మినార్ పేకెట్టు ఇవ్వాల్సివుంటుంది అని అడిగాడు.

మనోరమ విసుక్కుని ఒక రూపాయి అతనివైపు విసిరేసింది. ఆ రూపాయి తీసుకుని ఆవరే సలాం చేశాడు, ప్రూపు మనోరమ ముందునుంచి తీసుకు పోయాడు.

మనోరమ నవ్వి, 'థాంక్యూ, గుడ్ కామ్రేడ్!' అంది.

ఆమె మళ్ళీ పార్టీ కార్యాలయం చేరింది. భూషణ్ గదిలోకివెళ్ళి అతన్ని పిలవాల్సి వచ్చింది. అతను క్రింద రోడ్డుమీదకు వచ్చాక, 'గాభరా పడ్డావు, ఏం జరిగింది?' అనడిగాడు.

'చెపుతాను' అంటూ మనోరమ ఒక టాక్సీని పిలిచింది. భూషణ్ టాక్సీలో కూర్చుని తన ప్రశ్నని రెట్టించాడు. మనోరమ తన పర్సుని రెండుచేతులతోనూ నొక్కిపట్టుకుని మౌనంగా వుండిపోయింది. 'ఆగు' అని బాలకేశ్వర్‌దగ్గర టాక్సీని

ఆపింది. టాక్సి దిగారు. తీగపొదల క్రింద యెత్తుగావున్న ఓ చోట కూర్చున్నారు. రెండుసంవత్సరాల క్రితం సరిగ్గా అదేచోట మనోరమ తన వివాహం విషయంలో చేసిన పొరపాటునుగురించి భూషణ్‌కు చెప్పింది. మనోరమ ఉత్తరంతీసి భూషణ్‌కు ఇచ్చి 'చదువు' అంది.

'వెలుతురు వున్నచోటికి వెళ్ళాల్సి వుంటుంది' అన్నాడు భూషణ్.

'ఇక్కడే కూర్చో నేను చెపుతాను....'

భూషణ్ ఉత్తరం చదివి తిరిగివచ్చాడు. 'అయితే ఇప్పుడేం చేయటం?' అనడిగాడు.

'నువ్వే చెప్పు ఏం చేయాలో' మనోరమ వణికిపోతున్న గొంతుతో అడిగింది.

'ఉపాయమేముంది? ఒకవేళ విడాకులకోసం నువ్వు దరఖాస్తు పెట్టకపోతే అతనే ఇచ్చేస్తాడు. నువ్వు విడాకులు కోరటం లేదా?'

'అయ్యో, ఎందుకు కోరటంలేదు. కానీ కారణం ఏమి చెపుతాను?'

'చట్టప్రకారమయితే కారణాలు మూడే వున్నాయి. వేరే ఇంకొకరితో శారీరిక సంబంధం, దెబ్బలుకొట్టి హింసించటం, లేకపోతే నపుంసకత్వం. కానీ న్యాయస్థానంలో ఋజువు కావాలి. ఏ విషయాన్ని ఋజువు చెయ్యగలవు?'

'ఇటువంటివిషయాన్ని నేను న్యాయస్థానంలో ఎలా చెప్పగలను? మొదటి రెండు విషయాలలో ఏదీ లేదు, కొద్దిగాకూడా నాకు తెలీదు. ఋజువు ఏముంది?' అనడిగింది బాధగా.

'అవును. అతను న్యాయస్థానంలో వాఙ్మూలం ఏమీ ఇవ్వడు. అప్పుడు తీర్పు ఒకేపక్షానికి చెందినది అవుతుంది.' కానీ దురాచారానికి, క్రూరత్వానికీ సంబంధించినంతవరకు అతను నీ ఆరోపణలని సహించగలుగుతాడు. నువ్వు దరఖాస్తు పెట్టకపోతే అతను పెట్టుకుంటాడు. సాక్ష్యం తీసుకువచ్చేందుకు అతనికి ఏమాత్రం కష్టంగూడా కలగదు. నీ ప్రవర్తన మంచిదికాదనీ, పది తప్పుడు సాక్ష్యాలని సృష్టించగలడు. కానీ ఇలా చేయటంవల్ల అతనికే అపకీర్తి కలుగుతుంది. అతను నపుంసకుడని అనిపించుకోవటంకన్నా పదిమందితో తిరిగేవాడుగా అనిపించుకుని

తన మొగతనంగురించి చెప్పించుకోవడానికి ఎక్కువ ఇష్టపడతాడు. ఇప్పుడు తను చేస్తున్న పనేమిటి?'

'బహుశా సినిమా ప్రొడ్యూసర్‌గా పని చేస్తున్నాడు. నటి సహోదస్ సహాయంతో ఏదో సినిమా నిర్మిస్తున్నాడని వార్తాపత్రికల్లో ప్రచురితమైంది.'

'ఏ నటినీ చిక్కులలో పడేయటం లేదుకదా?'

'ఏదైనా జరగచ్చు.'

'ఇదే అసలువిషయం. తనదారికి ఏ అడ్డంకీ లేకుండా చేసుకోవాలనుకుంటాడు. అతను విడాకులు కోరేటట్లయితే ఈ ఏర్పాటులన్నీ అతనే చేయాల్సి వుంటుంది. 'ఈ జీవితం నీకు సహింపరానిదిగా వుంది, నాకూ సహింపరానిదిగా వుంది. మనం భార్యా-భర్తలలాగా జీవితాన్ని గడపటంలేదు. నీమీద కట్టుబాటు ఎందుకుండాలి?' అని అతను వ్రాశాడు. కానీ ఇందులో అతని స్వప్రయోజనం, ఏదో పన్నాగం తప్పకుండా వున్నాయి. అతను స్వయంగా నీ దరఖాస్తు పెట్టాలనీ, అందుకు కావలసిన సాక్ష్యాలపేర్లు వ్రాయాలనీ నువ్వు కోరు. జాగ్రత్త! నువ్వు నీ చేత్తో వ్రాసిమటుకూ ఏదీ ఇవ్వొద్దు. చూడు, అతనుగూడా ఉత్తరంమీద సంతకం చెయ్యలేదు.'

'అవును.'

'దీనితర్వాత?' భూషణ్ గొంతు మారిపోయింది. అతను మనోరమమీద చెయ్యి వేశాడు

మనోరమ గట్టిగా నిట్టూర్చింది. ఆమె కళ్ళు మూసుకుపోయాయి. ఆమె తల భూషణ్ భుజాలమీదకి వాలిపోయింది.

'మాట్లాడవేం?' భూషణ్ అధైర్యంగా అడిగాడు.

'ఎందుకు? ఇప్పుడేం తక్కువగా బాధపెట్టావా?'

భూషణ్ ఆమెముఖాన్ని తనవైపు తిప్పుకోవడానికి ప్రయత్నించాడు.

'ఇంత వేగిరపడుతున్నావేం?' మనోరమ నవ్వింది.

భూషణ్ సిగ్గుపడ్డాడు.

సుతలీవాలా కేవలం తన జీవితంనుంచి, మనోరమ జీవితంనుంచి కృతక

వైవాహికబంధాన్ని దూరం చేయడంకోసం విడాకులు కోరుతున్నాడని భూషణ్‌కు నమ్మకం కలగలేదు. సుతలీవాలా ఇంకో పెద్ద నాటకాన్ని సృష్టించబోతున్నాడని అతనికి అనుమానంగా వుంది. సినిమాప్రపంచంతో సంబంధంవున్న వాళ్ళతో మాట్లాడినమీదట, సుతలీవాలా పహాడన్‌పట్ల ఎక్కువ అనురక్తి చూపుతున్నాడని తెలిసింది. పహాడన్‌తోబాటు సార్థులో సినిమా నిర్మిస్తున్నాడు. ప్రముఖులైన ఇద్దరు యాక్టర్లను తీసుకుని తన కంపెనీ నిర్మిస్తున్నాడనికూడా తెలిసింది. సుతలీవాలా మనోరమకు వైవాహికబంధనంనుంచి విముక్తి కలిగించడానికి ఎందుకు తొందర పడుతున్నాడో భూషణ్‌కు అర్థమయింది.

సుతలీవాలా వ్రాసిన ఉత్తరం చదివినతర్వాత, వేవ్స్‌క్రెడిల్‌లోవున్న తన ఇంట్లో కాలుపెట్టడంకూడా మనోరమకు అసహ్యమనిపించింది. ఆమె భోజనం చేయడానికి ఇంటికి తిరిగి వచ్చేదికాదు కాని రాత్రి గడపటంకోసం ఆమె ఇంటికి రాక తప్పలేదు. రాత్రిపూట మరోచోట ఎలా వుండిపోతుంది? ఎవరైనా మంచి నడవడిగలస్త్రీ రాత్రిపూట తన ఇంట్లోతప్ప వేరొకచోట ఎలా గడపగలుగుతుంది? ఆ ఇల్లు ఆమెది కాకపోవచ్చు కానీ ఆమె ఇల్లు ఇంకెక్కడ వుంది? సమాజం దృష్టిలో అదే ఆమె ఇల్లు. విడాకులు తీసుకోవాలి అన్నభావంతో ఆమెకు అవమానం కలిగింది. అది వంశపారంపర్యంగా వచ్చే సంస్కారప్రభావమని ఆమె తనకు తాను నచ్చచెప్పుకునేది. చెడు సంస్కారములనుంచి విముక్తిపొందటం ఎంతైనా అవసరం కానీ ఇతరస్త్రీలతో పోల్చిచూస్తే తనస్థితి దిగజారిపోయిన దవటంచేత ఆమెకు అవమానంగా తోచింది. 'నా అంతట నేనే వదిలిపెట్టేస్తున్నాను। అని తనతో తాను నచ్చచెప్పుకునేది. కానీ రెండవమాటనికూడా అలా నిర్లక్ష్యంగా వదిలిపెట్టలేకపోయేది.

ఈ పహాడన్ ఎవరు? సుతలీవాలా నిజస్వరూపంగురించి తెలుసుకుని వుందదు....నటి కదా, ఇద్దరూకూడా పరస్పరం తమ ప్రయోజనాలని పొందాలని తలపోసివుండచ్చు. భార్యా-భర్తలలాగా వుండాలని ఉద్దేశపడితేమాత్రం ఇతనికి ఏమీ లాభం కలగదు, ఆమె సుఖం పొందదు, అనుకుంది మనోరమ.

పహాడన్ బొమ్మలతోకూడిన పెద్దచిత్రాలు నగరమంతటిలోనూ అంటించబడివున్నాయి. శృంగారంతోనిండిన ఆమె పాటలుకూడా రికార్డులమీద అక్క-

తక్కడా వినిపిస్తున్నాయి. కానీ మనోరమ ఆమెను సినిమాలో ఒక్కసారికూడా చూడలేదు. ఆమె బొమ్మలనుగూడా అంత పరిశీలనగా చూడలేదు. భూషణ్ ఎగ తాళిగా అన్నాడుకూడా, 'చూస్తే సరి. మన వంశాబులోని ఏ కొండప్రాంతంనుంచి వచ్చిందో, ఎలా వుంటుందో।'

'చావనీ, మనం చూడటందేనికి?' అని మనోరమ మందిపడింది. 'కొండ ప్రాంతంనుంచి వచ్చిన నీ అక్కయ్య అయ్యుండచ్చు. నువ్వు కొండప్రాంతం వాడివి। వెళ్ళు, ఆమెను చూడు। నీ కొండప్రాంతంవాళ్లు చాలా అందంగావుంటారు కదా. చాలా తెలివిగలవాళ్ళు కూడా। ఆ సోమామాత్రం ఏం తక్కువ।' అని నవ్వేది.

దోవలో రాక్షసాకారంలో వున్న సోమా బొమ్మ గోడమీద కనిపించగానే మనోరమ కళ్లు ఆ బొమ్మవైపు తిరిగేవి. 'ఆమెకోసం నువ్వే సరిపోయినవాడివి। నువ్వు 'ఆమె' చెప్పు కోయటం, ఆమె నీ చెప్పు కోస్తుంది. దీనితోనాచే నీకు తెలిసివస్తుంది. పేవ్మెంటుల్ మీద రెయిల్ను వదిలిపెట్టి ఆమె ఎక్కడికి వెడుతుంది?' అని మనోరమ మనసులోనే అనుకునేది.

మనోరమ నిరుత్సాహపడేది. అవమానం, బహిష్కారంలో నిండిన విముక్తి హృదయంలో బాధను కలిగించకుండా వుండలేకపోయేది.....నేను ఎక్కడికి వెడతాను అనుకునేది. పార్టీ ఆఫీసుకు వెడతాను; ఫుట్పాత్ మీద పడుకుని నిద్ర పోతాను; లేకపోతే నన్ను పాదాలదగ్గరనుంచి లేవనివ్వద్దని, ఎలా కావాలంటే అలా చేసుకోమని సుతలీవాలాతో చెపుతాను। నేను నీ దాసిని, పతివ్రతయైన దాసిని। ఆ ఆలోచన రాగానే రోడ్డుమీద ఉమ్మేద్దామన్నంతగా ఆమె హృదయం కరుడుగట్టేది.

సుతలీవాలా మనోరమవైపునుంచి ప్లీడరుద్వారా దరఖాస్తు తయారుచేయించాడు. సాక్షిగా ఇంటినౌకరు పేరు ఇచ్చాడు. దరఖాస్తులో సుతలీవాలామీద దురాచారం, దుర్మార్గం ఆరోపించబడ్డాయి. న్యాయస్థానంలో కేసు ఒకనెల వాయిదా పడింది. సుతలీవాలా తన నిర్దోషిత్వం నిరూపించుకునేందుకు అంగీకరించకపోయే సరికి న్యాయస్థానం పదిహేనురోజులు మళ్ళీ వాయిదా వేసింది.

మనోరమకు న్యాయస్థానానికి వెళ్ళడానికి చచ్చేంత సిగ్గనిపించింది. కానీ వేరే గత్యంతరంలేదు. న్యాయస్థానంలో తన దరఖాస్తుగురించి ఆమె రెండవసారి చెప్పాల్సి వచ్చింది. నౌకరు సులేమాన్ సాక్షిగా ప్రవేశపెట్టబడ్డాడు. అతను వకీలు అడిగినదానికి మనోరమ చెప్పినమాటలనే కొంచం ఇటూ-అటూ మార్చి చెప్పేడు. స్థిరపడిపోయిన కుటుంబం విడిపడటం జడ్జిగారికి ఇష్టం లేదు. మరోసారి సుతలీవాలాకి సమన్స్ పంపించారు. సుతలీవాలా తన సాక్ష్యం పంపించాడు. అందులో అతను ఏవిధమైన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోవాలనుకోవటంలేదని వుంది. విడాకులు మంజూరు చేయబడింది.

మనోరమ న్యాయస్థానంలో సుతలీవాలానుంచి భరణంగా ఏదైనా ఇప్పించాలని ప్రార్థించలేదు. న్యాయస్థానమే ఆమెకు మూడువందలరూపాయలు నెలసరిగా ఇవ్వాలని సుతలీవాలాని ఆదేశించింది. మనోరమ మళ్ళీ వివాహం చేసుకోకపోయి నట్లయితే సుతలీవాలా ఆమెకు జీవితాంతం ప్రతినెలా మూడువందలరూపాయలు ఇవ్వాల్సి వుంటుంది.

కామ్రేడ్ సీతా మనోరమతోబాటు న్యాయస్థానానికి వెళ్ళింది. న్యాయస్థానం తీర్పువిని మనోరమకు దురాచారంనుంచి విముక్తి లభించినందుకు సీతా న్యాయస్థానంలోనే అభివందనలు తెలిపింది. మనోరమ సంకోచంతో మెదలకుండా వుండిపోయింది కానీ సీతా ఉత్సాహంగా హడావిడి చేసింది. సిగ్గుపడుతున్న మనోరమ చెయ్యిపట్టుకుని సరాసరి పార్టీ ఆఫీసులోకి తీసుకువెళ్ళి మనోరమకు విముక్తి లభించిందని అందరికీ తెలియపరిచింది. సీతా మనోరమని పట్టుకుని హడావిడిచేస్తుంటే కొత్తకోడలిచేత గృహప్రవేశం చేయిస్తున్నట్లుగా వుంది. మనోరమకూడా సంకోచంవల్ల కొత్తకోడలిగా సిగ్గుతో ముడుచుకుపోయింది.

చాలామంది కామ్రేడ్‌లు తమపని వదిలిపెట్టి సిగ్గువల్ల ముడుచుకుపోయి వున్న మనోరమ చుట్టూచేరి నిలబడ్డారు. ఉమేష్ మెడ బాగా సాగదీసి. 'అయితే తర్వాత ... ఇప్పుడు!' అన్నాడు బిగ్గరగా అతను ప్రేమతో దహించుకుపోతున్న వాడిలా ముఖంపెట్టి గుండెలమీద చేతులు వేసుకున్నాడు

పారో ఉమేష్ భుజాన్ని గట్టిగా తోసి 'తప్పుకో, పిచ్చాడా!' అని తిట్టింది.

'చివరికి ఎవరైనా ఆశపడచ్చు, ఎవరికైనా అవసరమవచ్చు!' అన్నాడు ముగల్.

'కాదు కాదు, ఈ తిరకాసేమీ కుదరదు. నియమం ప్రకారం స్వయంవరం జరుగుతుంది. మేం కూడా ధనుస్సు ఎత్తుతాం. వయసుమళ్లుతున్న ఈ సమయంలో ఒక్కసారి మా అదృష్టాన్ని పరీక్షించుకుంటాం' అంటూ కాస్మేద్ టకో తన పరిహాసానికి నవ్వుకుంటూ రంగురంగులజుట్టుని చేత్తో సవరించుకున్నాడు

మిసెస్ గోగరే ఈ కోలాహలానికి చికాకు పడింది. తనచోటులో కూర్చుని వుండే కళ్ళజోడు పైనుంచి ఉరిమి ఉరిమిచూస్తూ 'పని చేసుకునే వేళలో ఏమిటీ గల్లంతు!' అని అరిచింది.

భూషణ్, సీతా మనోరమని సెక్రటరీదగ్గరకు తీసుకువెళ్లారు. సెక్రటరీ కాగితాలపైనుంచి కళ్ళు పైకెత్తాడు. ముఖంమీద చిరునవ్వు వ్యాపించింది. సీతా చెప్పేది వింటూ ఆయన అరచేతిలో పొగాకుముక్కలు సిద్ధం చేసుకుంటున్నారు.

'మనోరమ ప్రజా-నాట్య-సంఘంలో పనిచేసే అమ్మాయిలతోపాటుగాకలిసి అంధేరీలో వుండచ్చు. మిగిలిన అమ్మాయిలతోపాటు రోజూ ట్రెయిన్ ఎక్కి తన పనిమీద రావచ్చు' అన్నారు సెక్రటరీ.

'కాస్మేద్ చూడు ఈ పిచ్చివాళ్ని! న్యాయస్థానం ఈమెకు ప్రతినెలా మూడువందలరూపాయలు భరణంగా ఇప్పించింది. అది నేను తీసుకోనని అంటుంది. ఎందుకు తీసుకోదూ....అడగకపోయినా కోర్టు ఇస్తుంటే ఎందుకు తీసుకోదు! ఆ దుర్మార్గుడిమీద ఇంకా ప్రేమ పోలేదా ఏమిటి?' అన్నది సీతా నిగ్గరగా.

సెక్రటరీ పొగాకుపొడిని చిటికతో పట్టుకొని క్రింద పెదవి క్రింద నొక్కుతుని 'అంటేమాత్రం ఏమవుతుంది? ఈమెకు పార్టీ నెలకు 40 రూ. జీతం ఇవ్వాల్సి వుంది. ఈమె కయ్యేఖర్చులు, ఈమె ఆదాయంకూడా పార్టీదే అవుతుంది' అని ఆయన మళ్లీ దృష్టిని పనిమీద నిమగ్నం చేశారు.

మనోరమ ఈ కోలాహలంనుంచి బైటపడి తన సామాను తెచ్చుకునేందుకు టాక్సీమీద పేవ్స్రైడిల్ వెళ్ళింది. సామాను తీసుకునివచ్చినతర్వాత గుర్తుకు వచ్చింది, భూషణ్ పార్టీకి సంబంధించిన కొన్ని రహస్యమైన కాగితాలని జాగ్ర-

త్తగా దాచమని ఆమెకు ఇచ్చారు. వాటిని ఒక పెద్ద అల్మారా వెనక దాచివుంచింది. వాటిని మరచిపోయి వచ్చింది. వెంటనే తిరిగి మళ్ళీ వెళ్ళింది.

పహాడన్ మనసులో మిసెస్ సుతలీవాలాని ఒకసారి చూడాలని కుతూహలంగా వుంది. కానీ ఇంత సత్పురుషునితో పోట్లాడుతూవుండే ఆ స్త్రీ తనని చూడగానే ఏం తిడుతుందో, ఏం చేస్తుందోనన్న అనుమానంకూడా కలుగుతూ వుండేది. ఈ అనుమానంవల్ల పహాడన్ సుతలీవాలా ఇల్లు చూడాలన్న కోరికను గూడా చంపుకుంది. తనకు, మనోరమకు విడాకులు మంజూరయిందన్న వార్త సుతలీవాలాకు అందింది. అమ్మగారు తన సామాను తీసుకుని వెళ్ళిపోయారా లేదా అని సుతలీవాలా ఇంటికి ఫోన్‌చేసి నౌకరును అడిగాడు. అతను పహాడన్‌ని తన ఇంటికి రమ్మని, తనతోకలిసి భోజనం చెయ్యమనీ బ్రతిమలాడాడు. పహాడన్ ఎప్పటినుంచో ఈ రోజుకోసం ఎదురుచూస్తోంది. ఆ సంతోషంలో ఆరోజు రిహార్సల్‌ని సగంలో వదిలిపెట్టి సుతలీవాలాతోపాటు మలబార్‌హిల్‌కు వెళ్ళింది.

సుతలీవాలా కారుని ఇంటివసారాలో ఆపి పహాడన్‌కు చేయూతనిచ్చి కారులోంచి దింపి వసారాలోపలికి తీసుకువెడుతూవుండగా మనోరమ కొన్ని కాగితాలు, పుస్తకాలు తీసుకుని ముందుగదిలోంచి వస్తూ కనిపించింది. ఇదేమిటి మళ్ళీ వచ్చిందా? అనుకున్నాడు సుతలీవాలా. మనోరమనుచూసికూడా చూడనట్లు వుండిపోయాడు.

ఆ జగడాలమారి ఇప్పుడుకూడా అక్కడే వుందనిచూసి పహాడన్ అనుమానంతో భయపడి, ఏమి చేయడానికీతోచక అలాగే నిలబడిపోయింది. తనచేతిని సుతలీవాలా చేతినుంచి విడిపించుకుని ఆ స్త్రీనుంచి కళ్ళను తప్పించుకుంది. మనోరమకూడా వున్నచోట స్తబ్ధురాలై నిలబడిపోయింది. పహాడన్‌వైపు చూడగానే ఆశ్చర్యపడి ఒక్కసారిగా 'సోమా!' అంది.

పహాడన్ అకస్మాత్తుగా విద్యుత్తుస్పర్శవల్ల ఉలిక్కిపడింది. మనోరమ వైపు చూసింది. మనోరమ సుతలీవాలాని లక్ష్యపెట్టకుండా ఆమెదగ్గరకు వచ్చింది.

పహాడన్ మనోరమని గుర్తుపట్టి వణికిపోయింది. మనోరమ ఇంకొక అడుగు ముందుకువేసి, పహాడన్ మెడనిచుట్టుకుని 'సోమా అక్కా!' అని పిలిచింది.

పహాడన్ కాళ్ళు తొట్రుపడ్డాయి. మనోరమ ఆమెను ఊరడించడానికి ప్రయత్నించింది కానీ ఆమె గచ్చుమీద కూర్చుండిపోయింది, మూర్ఛపోయింది. మనోరమ గాభరాపడింది. తన చేతిలోవున్న కాగితాలనీ, పుస్తకాలనీ క్రింద ఒక వైపునపెట్టి పహాడన్‌ని లేవదీయడానికి ప్రయత్నించింది. సుతలీవాలా ముందుకు వచ్చాడు. అతను పహాడన్‌ని భుజాలదగ్గర, మనోరమ మోకాళ్ళదగ్గర పట్టుకున్నారు. ఇద్దరూ ఆమెను లేవనెత్తి లోపల మంచంమీద పడుకోబెట్టారు.

మనోరమ నౌకరుతోచెప్పి నీళ్ళు తెప్పించింది. పహాడన్ ముఖంమీద చల్లింది. వార్తాపత్రికతో విసరసాగింది. రెండు నిముషాలు గడిచిపోయాయి. పహాడన్‌కు తెలివిరాలేదు. మనోరమ ఆలోచిస్తూ మంచంమీద ఒంగి కూర్చుంది. ఆమెకు సుతలీవాలా గొంతు వినిపించింది—'నువ్వు వెళ్ళు, నేను డాక్టరుని పిలిపిస్తాను' అన్నాడు సుతలీవాలా.

మనోరమ సుతలీవాలావైపు చూడకుండా మంచంమీదనుంచి తప్పుకుంది. తన కాగితాలని, పుస్తకాలనీ తీసుకుని ఇంట్లోనుంచి వెళ్ళిపోయింది. 'సోమాయే పహాడనా....ఇంతమార్పు జరగటం సంభవమా? మనిషి ఏమిటి. మనిషికి ఎన్ని రూపాలైనా వుండవచ్చు! ఒకరోజున భూషణ్ తుపాకికి భయపడి పారిపోయి వణికిపోతున్న స్థితిలో సోమాని తనదగ్గరికి తీసుకువచ్చాడు. ఆమె ధనసింగ్‌కోసం తనప్రాణం ఇచ్చేయడానికి సిద్ధపడేది. పోలీసు భయంతో ఆమె గచ్చువిచ్చినం. బజారుకు వెళ్ళడానికి ఆమె భయపడటం! అన్నయ్య ఆమెకు చేసినఅన్యాయం. పెద్దవదినచేసిన దుండగం! ఇప్పుడు ఆమె ప్రపంచాన్నిచూసి నవ్వుతోంది! తన కసి తీర్చుకుంటోంది....ఆమెకు సుతలీవాలావల్ల సుఖం కలుగుతుందా? ఇంత తెలివితేటలు గంది అయిందా?' ఆలోచిస్తూ మనోరమ తలవంచుకుని నడుస్తోంది.

మనోరమ అడుగులు అలవాటుప్రకారం రోడ్డుమీద పడుతున్నాయి. కానీ అలా నడుస్తూ ఆమె బీచ్‌వైపు తిరిగింది; సముద్రపుఒడ్డున కూర్చుని ఆలోచించసాగింది—సోమాయే పహాడన్! మనిషిని ఎవరన్నా అర్థం చేసుకోగలరా! గుర్తుపట్టగలరా?....సూర్యాస్తమయం అయిపోయి చీకటి వ్యాపించింది. కానీ మనోరమ కూర్చునేవుంది.

ఈల శబ్దాన్నివిని మనోరమ వెనక్కి తిరిగిచూసింది. ఎవరో ఒక ఆకతాయి ఆమెనుచూసి ఈల వేస్తున్నాడు. తన గడియారం చూసుకుంది. ఎనిమిదిన్నర అవుతోంది. లేచి వేగంగా ప్లైండ్‌హర్ట్స్ రోడ్డువైపు వెళ్ళిపోయింది.

• • •

సహాదన్ స్పృహతప్పి పడిపోయిన అరగంటతర్వాత డాక్టరు వచ్చారు. పదిహేను నిముషాలు ఉపచారం చేసినమీదట సహాదన్ కళ్లు తెరిచింది. ఆమె ముఖం వాడిపోయి ఎండిపోయిన ఆకులా పచ్చగా వుంది. చంచలమైన కళ్ళని తిప్పి నాలుగువైపులా చూసింది. డాక్టరువైపు తిరిగింది. ప్రశ్నార్థకమైనదృష్టితో సుతలీవాలావైపు చూసింది.

సుతలీవాలా నవ్వి, 'గాభరాపడకండి, ఈయన మన స్నేహితుడు. ఇప్పుడు మీరు పూర్తిగా కులాసాగా వున్నారు' అన్నాడు.

డాక్టరు సహాదన్‌కు వేడిపాలుగాని, టీ గాని ఇమ్మని, పూర్తిగా విశ్రాంతి నిమ్మని సలహా ఇచ్చి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే 'ఆమె ఎక్కడుంది?' అని సహాదన్ అడిగింది.

'ఆమె అప్పుడే వెళ్ళిపోయింది' అని సుతలీవాలా సహాదన్ తలమీద చెయ్యివేసి 'మీరు మాట్లాడకుండా పడుకోండి' అని చెప్పాడు.

'ఎక్కడికి వెళ్ళింది?'

డాక్టరు సహాదన్‌కోసం నిద్రమాత్రలు ఇచ్చివెళ్ళారు. 'ఇప్పుడు వేడిపాలతో ఈ మందు తీసుకోండి. ఏమీ బాధపడకండి. బాధపడాల్సినంతవిషయం ఏమీ లేదు.' అన్నాడు సుతలీవాలా. సహాదన్ ఎక్కువ ఏమీ మాట్లాడలేదు. అందుచేత సుతలీవాలా మంచందగ్గరనుంచి తప్పుకున్నాడు. అతనికి రెండుసార్లు సహాదన్ నెమ్మదిగా 'వినండి! వినండి! అని పిలవటం వినిపించింది.

సుతలీవాలా సహాదన్‌ను మాట్లాడేశ్రమనుంచి కాపాడడానికి లోపలకు రాలేదు. కాని అతనుకూడా బాధతో నిండిన ఆరాటంవల్ల జేబులో చేతులు పెట్టుకుని బాల్కనీలో ఇటూ అటూ పచార్లు చేస్తున్నాడు. పరిస్థితిని ఊహించడానికి ప్రయత్నం చేయసాగాడు....వీళ్ళు ఇంతకుముందే, ఒకరికొకరు పరిచితులా?

బహుశా చిన్ననాటి స్నేహితురాళ్లు అయుండచ్చు. లేకపోతే బంధువులై వుండచ్చు ....షహీదన్ చాటుగా ఇంటోనుంచి పారిపోయి వుండివుండచ్చు। ఏమైనా కానీ। ....ఇద్దరూ కలుసుకుంటే మనోరమ నన్నుగురించి ఏమని చెపుతుంది? షహీదన్ ఆమె చెప్పింది నమ్ముతుందా, నేను చెప్పినది నమ్ముతుందా? ఈమెకోసం ఇంత వరకూ నేను చాలా చేశాను. ఈ సినిమావల్ల ఈమెకు చాలా డబ్బు వస్తుంది. ఒక్క నెలరోజులలోనే ఆ విషయం తేలుతుంది....నేను అంతా సర్దుకోగలను. నా పరిస్థితిగూడా ఇప్పుడు బాగానే వుంది. ఈమెలోనూ, ఆవిడలోనూ తేడాకూడా వుంది.

సుతలీవాలా ఆలోచిస్తూ ఇటూ అటూ తిరిగి లోపలికివెళ్లి చూశాడు. షహీదన్ మందుప్రభావంవల్ల నిద్రపోయింది. ఆమె నుదురు తాకిచూశాడు. జ్వరం వున్నట్లుగా అనిపించింది. షహీదన్‌కు రెండుగంటలతర్వాత మెళకువ వచ్చింది. ఆమె సుతలీవాలాని 'ఇప్పుడు ఎన్నిగంటలయింది?' అనడిగింది.

'తొమ్మిదిగంట లవుతోంది. గాభరాపడకండి. మీకు జ్వరంగావుందని ఆర్కెట్ స్టూడియోకి ఫోను చేశాను. రాలేరనిగూడా చెప్పాను.'

'నేను మా యింటికి వెడతాను' అన్నది షహీదన్.

'ఇదికూడా మీ ఇల్లే. మీ ఒళ్ళు కొంచం వేడిగా వుంది. ఈ పరిస్థితిలో గాలి తగులుతుందేమోనని భయపడుతున్నాను. మీ కోసం నర్సుని పిలిపించనా?'

'వద్దు, నాకు బాగానే వుంది....మీరు విడాకులు తీసుకుంది ఈమెనుంచేనా?' షహీదన్ సుతలీవాలా కళ్ళల్లోకిచూసి అడిగింది.

'అవును. ఆమె మీకెలా తెలుసు?'

షహీదన్ సుతలీవాలాప్రశ్నకు సమాధానం చెప్పకుండా 'పెళ్ళి ఎప్పుడు జరిగింది?' అనడిగింది.

'మీకు ఇదివరకే చెప్పానుగదా, రెండు సంవత్సరా లయింది.'

'రెండు సంవత్సరాలక్రిందట జరిగిందా?' షహీదన్ ఆలోచించి, 'ఈవిడ మీతో పోట్లాడుతూ వుండేదా?' అని అడిగింది.

'మీరేం బాధపడకండి' సుతలీవాలా షహీదన్ తలని చేత్తో నిమిరాడు.

'ఇప్పు డావిడ ఇక్కడకు వస్తుందా?'

'ఎప్పటికీ రాదు. ఏం అట్లా అడిగారు? మీరు ఆవిడని కలుసుకోవాలను కుంటున్నారా?'

పహాడన్ తలతిప్పి కాదంది.

పహాడన్ అంధేరీలోవున్న తన ఇంటికి వెళ్ళిపోదామనుకుంది. కానీ జ్వరం ఎక్కువగా వుండటంచేత పక్కమీదనుంచి లేవడానికి డాక్టరు అనుమతించలేదు. సుతలీవాలా ఆమెను వెళ్లనివ్వలేదు. ఏమీ బాధపడద్దని మాటిమాటికీ ధైర్యం చెప్పాడు. 'కాదు, నేను రోమాని కాదు....నన్నిలా వుండనివ్వండి....నన్నిలా వుండనివ్వండి!....బరకత్ అనేవాళ్ళెవరూ నాకు లేరు!' అని పహాడన్ జ్వరం ఉధృతలో కలవరిస్తుండగా విన్నాడు సుతలీవాలా.

పహాడన్ తన గతజీవితాన్ని మళ్ళీ స్మరించటానికి ఇష్టపడటంలేదని అతను గ్రహించాడు. వాటినిగురించి తెలుసుకునేందుకుకూడా అతను కోరికను వెల్లడించ లేదు. ఒకవేళ అవసరమైతే పహాడన్ నౌకరు బరకత్‌ని అడిగి అన్నివిషయాలూ తెలుసుకోవచ్చునని మనసులో అనుకున్నాడు.

* * *

పహాడన్ రాత్రంతా స్టూడియోనించి ఇంటికి తిరిగి రాకపోయేసరికి ఆమె ఇంట్లోని దాది, వంటమనిషి భయపడ్డారు. వాళ్లు తమ భయాన్ని బరకత్‌కు చెప్పారు. బరకత్‌కూడా అనుమానపడ్డాడు. రాత్రిపూట ఎంత ఆలస్యమైనా మూడుగంట లయినా, నాలుగు గంటలయినా, పహాడన్ తప్పకుండా ఇంటికి తిరిగివచ్చేది. పహాడన్‌గురించి తెలుసుకునేందుకు బరకత్ ఆర్కెట్ స్టూడియోకి వెళ్ళాడు. రాత్రి పహాడన్ అసలు రానేలేదని అక్కడ తెలిసింది. జ్వరంగా వుందనిమాత్రం ఫోను వచ్చింది. స్టూడియోకి రాలేదు. అంతకు క్రితంరాత్రి పహాడన్ పని సగంలో వదిలేసి సుతలీవాలాతోబాటు వెళ్లిపోయిందని అక్కడివాళ్లు చెప్పారు. బరకత్‌కు అనుమానం కలిగింది. 'ఇద్దరికీ బాగా స్నేహం కలిసింది, పెళ్ళి చేసుకుంటారా....' అని అందరూ అంటూవుండేవాళ్లు. బరకత్ ఆలోచించాడు, ఒకవేళ సుతలీవాలా పహాడన్‌ని లేపుకుపోతే తనగతి ఏమిటి? 'మేము ఆ అమ్మ....కోసం ప్రాణాలకు తెగించాం. ప్రమాదాలని నెత్తిమీదకి తెచ్చుకున్నాం' అనుకున్నాడు.

బరకత్ సుతలీవాలా కార్యాలయం జాడతెలుసుకుని 'ఫోర్టు' వెళ్ళాడు. కార్యాలయం తలుపుదగ్గర ఆ-హి-సేవకు సంబంధించిన కాపలాకాసే పహరా జవాను బరకత్ దుస్తులుచూసి లోపలికి వెళ్ళనీయలేదు. 'అయ్యగారు ఇంకా ఇంటి నుంచి రాలేదు' అన్నాడు.

బరకత్ తన ఓర్పు కోల్పోయి విసుగ్గా కార్యాలయంముందు ఇటూ అటూ తిరగటం మొదలుపెట్టాడు. సుమారు ఒకగంటతర్వాత సుతలీవాలా నల్లరంగు కారు వచ్చింది.

'పహాదన్ ఎక్కడుంది?' బరకత్ తత్తరపాటుతో సుతలీవాలాని పలకరించాడు.

కోపంతో నిండిన అతని ముఖాన్ని చూసి సుతలీవాలా, 'అమ్మగారి ఆరోగ్యం బాగాలేదు' అన్నాడు.

బరకత్ రెండుచేతులు నడుంమీద పెట్టుకుని 'మేము ఆమెను ఇంటికి తీసుకు వెడతాం' అన్నాడు.

'ఇప్పుడు కాదు. డాక్టరుగారు ఎక్కడికీ కదలద్దని చెప్పారు. మేము ఆమెను ఇంటిదగ్గర దిగబెడతాము. ఏమీ భయపడకు.'

బరకత్ సుతలీవాలా దోవకి అడ్డునిలబడి మీసం మెలేస్తూ 'మమ్మల్ని మోసం చెయ్యాలని చూడకు. మా కంతా తెలుసు. ఇంకొక ఉద్దేశంలో ఎప్పుడూ వుండద్దు. పహాదన్‌ని నేను నికాచేసి పెళ్ళి చేసుకున్నాను. మేము మీ గొప్పతనాన్నంతా చీపురుతో తుడిచి పారేస్తాం!' అన్నాడు. బరకత్ నోట్లోంచి సారావాసన వస్తోంది. కళ్లుగూడా ఎర్రగా వున్నాయి.

సుతలీవాలా తన పహరా జవానువంక చూశాడు. పహరాజవాను ముందుకి వచ్చి బరకత్‌ని రెండుచేతులతో పట్టుకుని 'వెనక్కి తప్పుకో!' అని ఒకవైపుకి తోశాడు.

సుతలీవాలా కార్యాలయంలోకివెళ్ళి దాక్కున్నాడు. బరకత్ మీసాలు మెలేసుకుంటూ, '....చూస్తాను?' అని తిడుతూ వెళ్ళిపోయాడు.

పహాదన్‌కు అకస్మాత్తుగా స్టూడియోలోనే చాలా జ్వరం వచ్చిందని, నాలు

గయిదు రోజులలో ఇంటికి వస్తుందని, ఏమీ బెంగారు పడవద్దని, సుతలీవాలా వహీదన్ ఇంటిదాదికి, వంటమనిషికి కబురు పంపించాడు. వాళ్లు ఆతురతతో వహీదన్‌కోసం ఎదురుచూస్తున్నారు. వహీదన్‌కు జ్వరం వచ్చిందన్నవార్త బరకత్‌కు చెప్పి ధైర్యం కలిగించారు. కానీ బరకత్‌కు నమ్మకం కలగలేదు. సుతలీవాలా వహీదన్‌ని లేపుకుపోయాడనీ, ఆమెను దాచేశాడని, అతనికి అనుమానం. అతని ఊహ ఏమిటంటే - బహూశా వీళ్ళు ఆమె లేవటానికికూడా వీలు కలగకుండా వుండేలా ఆమెను బాధించివుంటారు.

దాదికి, వంటమనిషికి తమ యజమానురాలి జ్వరంగురించి బాధగా వుంది. బరకత్‌కు తనకున్న ఒకే ఒక్క ఆధారాన్ని ఎగరేసుకుపోయారని కోపంగా వుంది.

• • •

మనోరమ కాండీ - బీచ్‌నుంచి తిరిగి వచ్చేసరికి పార్టీ ఆఫీసునుంచి అందరికీ వెళ్ళేవాళ్ళందరూ ఏడుగంటలబండి ఎక్కి వెళ్ళిపోయారని తెలిసింది. ఆమె ఒంటరిగా ఎక్కడికి వెడుతుంది? 'రెడ్-ప్లాగ్ హాల్'లో పారోదగ్గరే వుండిపోయింది. కొంచం ఏదన్నా తిందామా అన్నధ్యాసగూడా ఆమెకు లేదు. పారో అడిగినమీదట గుర్తుకు వచ్చింది. పారో ఆమెను ఒక ఇరానీ హోటల్‌కు తీసుకువెళ్ళి కొంచం తినిపించింది. మనోరమ ఇంకా సోమానిగురించి ఆలోచిస్తూనే వుంది.

మనోరమ విడాకులు తీసుకోవడంచేత తగిలినబాధవల్ల అలా వుందని పారో అనుకుంది. ఆమెను ఓదార్చింది. కొంత చివాట్లు పెట్టింది.

మనోరమకు రాత్రంతా నిద్ర రాలేదు. ఆమె మెదలకుండా పడుకుంది. సోమా ధర్మశాలలో వాళ్ళబంగళాకు రావటం దగ్గరనుంచి లాహోర్‌లో పెద్దవదిన, తల్లిగారు ఇంటినుంచి వెళ్ళగొట్టడంవరకు సోమాజీవితం. సోమాజీవితంలో మెల్లిగా వచ్చిన మార్పులు ఆమె స్మృతిలో తిరుగుతున్నాయి. ఇంతకుముందు ఆ మార్పులను స్పష్టంగా చూడలేకపోయింది. భూషణ్ చివరిసారిగా లాహోర్ వచ్చినప్పుడు మనోరమ సోమాని అతని ఎదుటికి పిలిపించి కూర్చోబెట్టింది. అతను సోమాని గుర్తుపట్టలేకపోయాడు. వెళ్ళేటప్పుడు అన్నాడుకూడా, ఇప్పుడు ధనసింగ్ వచ్చినా కూడా ఈమె అతనితో కలిసి వుండగలుగుతుందా? ఇప్పుడు మనోరమే స్వయంగా ఎంతమార్పు చూస్తోంది! ఆమెను వెంటనే గుర్తుపట్టలేకపోయింది. ఆనాటి సోమా

ఈనాడు గోడలమీద చిరునవ్వు నవ్వే పహాడన్! రికార్డులమీద మధురంగా పాడే పహాడన్!

మనోరమ ఉదయం ఎనిమిదిగంటలకు పార్టీ ఆఫీసుకు చేరింది. గతరాత్రి జరిగిన సంఘటనగురించి భూషణ్‌కు చెప్పింది.

భూషణ్ ఆశ్చర్యంతో కనుబొమ్మలుముడిచి 'నిజమా! పహాడనే సోమా యా?' అని అడిగాడు.

మనోరమ, భూషణ్ ఆ సాయంత్రం 'మన్ కా చోర్' సినిమా చూశారు. పహాడన్ పేరుతో నటిస్తుండగా సోమాని చూసి ఆశ్చర్యపోయారు. భూషణ్ తరుచు అంటూవుండేవారు—'మనిషికి ఎన్ని రూపాలైనా వుండచ్చు. ఎవరూ చెప్పలేరు.'

మనోరమ, భూషణ్ సినిమానుంచి తిరిగివస్తున్నారు. మనోరమ సుతలీ వాలా ఇంటిదగ్గర సోమాని కలుసుకున్న సంఘటనగురించి మళ్ళీ చెప్పటం మొదలు పెట్టింది. భూషణ్ మధ్యలో ఆపి, 'నువ్వు ఇది ఆలోచించు. ఒకవేళ ఇప్పుడు ధనసింగ్ తిరిగివచ్చి ఆమెనుపట్టి నిలబడితే ఏం జరుగుతుంది?'

మనోరమ గట్టిగా నిట్టూర్చి, 'ఆ అమాయకురాలి తప్పేముంది?' అంది.

'తప్పు నెవరూ సహించరు. కానీ ఏం జరుగుతుంది?' అడిగాడు భూషణ్.

'అతను రానేరాడు!' మనోరమ మళ్ళీ నిట్టూర్చింది.

సోమా తన కూతురైనట్లుగానో, చెల్లెలైనట్లుగానో మనోరమ బాధపడ సాగింది. సోమా జీవితానికి స్వయంగా తనదే జవాబుదారీ అయినట్లుగా తోచింది. ఆమె ఎందుకు వృత్తిహతప్పి పడిపోయింది? సోమాని కౌగలించుకుని ఓదార్చుదా మని అనుకుంది. ఆమె మాటలు వినాలని కోరికగా వుంది. లాహోర్‌లో ఇంట్లో నించి వెళ్ళగొట్టినతర్వాత ఏం జరిగింది? ఇప్పుడు ఎలా గడుపుతోంది? దురదృష్ట వంతురాలు! చాలారకాలుగా మోసగింపబడింది. ఇప్పుడు రక్షింపబడింది. సుతలీ వాలా ఎటువంటిమనిషో ఆమెకు నేను చెప్పేస్తాను, అనుకుంది.

వేప్స్ క్రెడిల్‌కువెళ్ళి ఇదంతా తెలుసుకుందామని మనోరమ అనుకుంది. కానీ 'ఇక మీరు వెళ్ళండి!' అన్న సుతలీవాలామాటలు గుర్తుకు వచ్చాయి. అటు

వంటప్పుడు ఆమె అక్కడికి ఎలా వెళ్ళగలుగుతుంది! మనోరమ రెండుసార్లు వేవ్స్ క్రెడిల్‌కు ఫోను చేయడానికి ప్రయత్నించింది కానీ సుతలీవాలా ఫోనుని ఏం చేశాడో ఏమో గంట మ్రోగేదికాదు. సోమాని కలుసుకోవాలన్న ఆదుర్దాలో మనోరమ బొంబాయిలో ఆ సమయంలో నడుస్తున్న పహాడన్ నటించిన సినిమాలన్నీ చూసేసింది. మనోరమ వివశురాలై సుతలీవాలాకు ఇంగ్లీషులో ఒక ఉత్తరం వ్రాసింది—

'ప్రియమైన మిస్టర్ సుతలీవాలా,

పహాడన్ పరిస్థితి ఎలావుందా అని తెలుసుకోవాలని నాకు చాలా ఆదుర్దాగా వుంది. ఆమెకు ఎక్కువ కష్టం కలిగివుండదని ఆశిస్తున్నాను. నేను ఆమెను కలుసుకోవడానికి చాలా తహతహ లాడుతున్నానని ఆమెకు చెప్పండి. ఒకవేళ సంభవమైతే నేనామెకు సహాయం చేద్దామనుకుంటున్నాను.'

మూడవరోజున సమాధానం వచ్చింది.

ప్రియమైన మనోరమా,

మీరు వ్రాసిన ఉత్తరానికి చాలా ధన్యవాదాలు. మిస్ పహాడన్ కులాసాగా వున్నారు. మీరు ఆమెనుగురించి ఏమీ బాధపడద్దు అని మీ ఉత్తరానికి ఆమె నివేదన. ఆమె దీనినే అమితమైన దయగా తలుస్తున్నారు. ధన్యవాదాలు.'

మనోరమ మనసుకు దెబ్బ తగిలింది. ఇది సుతలీవాలా పన్నాగమే. కానీ సోమా ఇప్పుడు నన్ను కలుసుకోవటానికి ఇష్టపడివుండకపోవచ్చు. ఆమె పరిస్థితిలో ఎంత మార్పువచ్చింది....స్పృహతప్పి ఎందుకు పడిపోయింది? ఏదైనా కానీ, ఆమె సుఖంగా, సంతోషంగా వుండాలి అనుకుంది. మనోరమకు సుతలీవాలా సమాధానంవల్ల ఎంత అవమానం కలిగిందంటే ఆమె భూషణ్‌తోగూడా ఈ విషయంగురించి చెప్పలేదు, చర్చించలేదు.

పహాడన్ అంధేరీలోనే వుంటోందని మనోరమకు తెలిసింది. కానీ సుతలీవాలా వ్రాసిన ఆ ఉత్తరం చదివిన ఆమెకు పహాడన్ ఇంటికి వెళదామని అనిపించలేదు. సోమాయే ఇలా ఉత్తరం వ్రాయించి వుండవచ్చు. దుఃఖపూరితమైన ఆ గడచిన స్మృతులనుంచి ఆమె దూరంగా వుండాలని అనుకుంటోందేమో! ఇందులో ఆమె

దోష మేముంది? నేను ఆమెను ఎప్పుడూ ఏమాత్రం బాధపెట్టలేదు కానీ సమాజం ఎదుట ఆమె భయపడిపోయింది. తన కొత్తజీవితాన్ని ప్రాణాలు ఒడ్డి అయినా కాపాడుకోవాలని అనుకుంటూ వుండివుండచ్చు. ఆమెకు గడచిపోయినదానివల్ల అనుమానం, భయం వుండివుండచ్చు.

ఉదయం అంధేరీలో టీ త్రాగి కార్యాలయానికి వెళ్ళడం. మధ్యాహ్నపు భోజనం కమ్యూన్‌లో, సాయంకాలంపూట ఏడుగంటల బండిఎక్కి అందరితో బాటు అంధేరీ రావడం - మనోరమ దినచర్య ఇలా వుండేది. భూషణ్‌ని కలుసుకోవడానికికూడా చాలా తక్కువసమయమే దొరుకుతూవుండేది. కానీ ఇద్దరూ దగ్గరగానే వుండేవాళ్ళు. సాయంకాలంపూట ఒకవేళ ఇద్దరూ గంటా, రెండుగంటలు కలిసివుండాలనుకునేటటయితే మనోరమ తన బృందంనుంచి వెనుకపడేది. ఎవరూ ఏమనేవారుకాదు కానీ తోటివాళ్ళధ్యాన అటువైపు తిరిగేసరికి మనోరమకు సంకోచం కలిగేది.

పార్టీకి సంబంధించిన స్త్రీ పురుషులలో పరస్పరప్రణయం నడవడం లేదన్న మాట లేదు. మిత్రులందరూ వెంకటూ, పారోల వివాహపు మిఠాయి తినడానికి ఆతురతలో కాచుకునివున్నారు. రమేష్, సుమతి మధ్యగూడా ప్రేమ నడుస్తూ వుండేది. ఇదికూడా అందరికీ తెలుసు. భూషణ్, మనోరమలగురించికూడా తమలో తాము మాట్లాడుకుని సంతోషపడేవాళ్ళు. కానీ యౌవనంలోవున్న స్త్రీ పురుషుల విషయం వేరు. మనోరమ తమ పత్రికకు సహాయక అధ్యక్షురాలు. భూషణ్‌గూడా అనుభవజ్ఞుడైన కామ్రేడ్‌గా ఎంచబడేవాడు. ఒకవేళ జరిగితే నియమానుసారంగా పార్టీకి తెలియపరచి వివాహం జరుగుతుంది. విడాకులు తీసుకున్న వెంటనే వివాహం కూడా మంచిదిగా అనిపించదు. ఇంత తొందరగా మనోరమ హృదయంనుంచి ఆ సంఘటన దూరం కాలేకపోయింది. అప్పుడప్పుడూ ఆమె ఆలోచించేది. ఎంత యాతన అనుభవించి భూషణ్ సమీపాన్ని పొందగలిగింది, ఇప్పుడుకూడా హడావిడి పడటం దేనికి? మళ్ళీ ఆ సుఖస్వప్నాన్ని ఊహించుకుని వణికిపోయేది.... అయ్యో, ఇంత తొందరగా ఎలా జరుగుతుంది! అనుకునేది.

• • •

సహోదన్ జ్వరం మూడవరోజు సాయంకాలానికి తగ్గిపోయింది. కానీ

సుతలీవాలా ఆమెను రెండురోజులు ఇంకా తనదగ్గరే వుంచమని అపాడు. బరకత్ తత్తరపాటు, కోపంవల్ల ఆమెకు ఇంకొక మానసికమైనదెబ్బ తగులుతుందేమో నని అతను భయపడ్డాడు. పహాడన్‌ను నెమ్మది పరచటంకోసం బరకత్ తన కార్యాలయందగ్గరకు వచ్చిన సంఘటనగురించి చెప్పాడు. పహాడన్‌కు దానివల్ల ఏమీ ఆశ్చర్యం కలగలేదు.

'అతను చాలా నీచుడు. ఏదైనా చేయగలడు. మీరు అతనినుంచి తప్పించుకుని వుండటం మంచిది' అని పహాడన్ సుతలీవాలాతో చెప్పింది. 'నువ్వేమీ బాధపడకు. అతను మనల్ని ఏమీ చెయ్యలేడు. దానికి ఏర్పాటు చేస్తాను' అని సుతలీవాలా ధైర్యం చెప్పాడు.

పహాడన్ అంధేరీ తిరిగివచ్చి స్టూడియోకి వెళ్ళటం మొదలుపెట్టింది. సుతలీవాలాని స్టూడియోలోనే కలుసుకుంటూవుండేది. లేకపోతే వేప్స్ క్రెడిల్‌కువెళ్ళి తిరిగి ఇంటికి వెళ్ళేది. సుతలీవాలాని తనఇంటికి రావద్దని చెప్పింది. అవసరమైతే ఫోనుచేసి మాట్లాడేవాడు.

పహాడన్, సుతలీవాలాలకు మధ్య బరకతే అడ్డుగా నిలబడ్డాడు. ఇద్దరూ అతన్ని ఎలా తొలగించాలా అని ఆలోచిస్తూ వుండేవాళ్ళు. పహాడన్ ఆ దుర్మార్గుణ్ణి సహించలేకపోతోంది. 'గాభరాపడకు ! కావాలనుకుంటే ఇతను జీవితాంతం జైలుకు వెళ్ళిపోతాడు. లేకపోతే అనంతమైన సముద్రం వుంది. ఇందులో బొంబాయికిచెందిన లక్షలకొలది మనుషులశవాలు అంతరించిపోయాయి' అన్నాడు.

పహాడన్ ఒణికిపోయింది—'వద్దు, ఎప్పుడూ ఇలా చెయ్యద్దు. తీసుకోవాల్సిందిపోయి ఇవ్వాల్సి వస్తుంది. మీమీదకి ఏవిధమైనప్రమాదమూ రాకూడదు. నే విలాగే బాగున్నాను' అంది.

బరకత్ కోపం, తత్తరపాటు పెరుగుతూనే పోతున్నాయి. అతను ఇంకొక మిత్రుణ్ణిపిలచి తనవెంట వుంచుకున్నాడు. కొత్తగా వచ్చేవాళ్ళని, వెళ్ళేవాళ్ళని 'ఎవరు నువ్వు ? ఎక్కడినుంచి వచ్చావ్ ?' అని అపుతాడు. సుతలీవాలా ఇంకెవరిచేతైనా సందేశం పంపిస్తాడని అతనికి అనుమానం. పహాడన్‌కు ఈ అవమానం, వేరే గత్యంతరం లేకపోవడం అన్నివిధాలా సహింపరానివైపోయాయి.

## పునః పరిచయం

ధనసింగ్ ఆజాద్ హింద్ సేనకు సంబంధించిన అరవై అయిదుగురు సైనికులతోబాటు బాంకీపుర్ జైలునుంచి విడుదలయాడు. అతను క్షమార్పణ కోరలేదు. బలవంతంగా ఆజాద్ హింద్ సేనలో చేర్చారని ఫిర్యాదు చేయలేదు. అతనికి జీతం ఇవ్వటం నిలిపివేశారు. విడుదలయానతర్వాత పాతికరూపాయలు మాత్రం రోజుఖర్చుకి దొరికాయి.

పాట్నా చేరినతర్వాత ప్రజలు ఆజాద్ హింద్ సేనకు సంబంధించినవాళ్ళకి పూలదండలువేసి స్వాగతం ఇచ్చారు. సభలో వాళ్ల వీరత్వంగురించి, త్యాగం గురించి పొగిడారు. సాయంకాలం కాంగ్రెసుతరఫున ఆజాద్ హింద్ సైనికులకు విందు ఏర్పాటు చేశారు. మరునాడుకూడా రెండుపూటలా, ఇద్దరు పెద్దమనుషులు విందు ఏర్పాటు చేశారు. సభలలో ఆజాద్ హింద్ సేనకు సంబంధించిన వీరులను స్వాతంత్ర్యానికి మార్గదర్శకులుగా కొనియాడి ప్రశంసించారు.

ఆ ఆదరాన్నీ, పొగడ్తలనీ వింటూ ధనసింగ్ వీలున్నంతతొందరగా పంజాబు, ధర్మశాలవెళ్ళి సోమాని వెతకాలని ఆలోచించాడు. ఇప్పుడుకూడా ఇంగ్లీషురాజ్యమే. ఇంగ్లీషురాజ్యానికి సంబంధించిన పోలీసులరాజ్యమే. అతను పేరు, వేషం మార్చుకుంటేనే పంజాబు, ధర్మశాల వెళ్ళగలుగుతాడు. ధనసింగ్ ముందు పాట్నాలోనే తనకోసం ఒక సురక్షితమైన స్థానాన్ని ఏర్పాటు చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. తర్వాత మెల్లిగా కాంగడావెళ్ళి సోమాని తీసుకు రావచ్చును. కాంగ్రెసువాళ్ళ పరిపాలన వచ్చేసిందని ప్రజలంతా అంటూవుండేవాళ్లు. కానీ అతనికి ఏమీ తేడా కనిపించలేదు. అతను నిరుత్సాహంగా, ఎటువంటి స్వాతంత్ర్యం దేశమంతటికీ లభించిందో, అటువంటిదే మనకూ లభించింది. అందరూ ఎలా కాలం గడుపుతారో, అలాగే మనంకూడా కాలం గడుపుదాము, అనుకున్నాడు.

ఆహ్వానాలు, ఉత్సవాల సుడిగాలి తొందరగానే సమాప్తమయిపోయింది. తనని గౌరవించేవాళ్ళని, తనమీద శ్రద్ధచూపేవాళ్ళని సహాయం కోరుదామని ధనసింగ్ బయల్దేరాడు. దానంరూపంలో తను సహాయం కోరటంలేదు. తనకి ఉద్యోగ

మేదైనా ఇప్పించమని కోరసాగాడు. గౌరవాన్ని, శ్రద్ధని చూపేవాళ్ళు ఉద్యోగం కాని రోజుకూలి గానీ చూపించే జంజాటం కోరితెచ్చుకునేందుకు ఎవరూ సిద్ధపడ లేదు. 'నీ వూళ్ళోకి, నీ వూరి ప్రజలమధ్యకి వెళ్ళి, ఉద్యోగం వెతుక్కోవటం మంచిది. ఉద్యోగంలో ఎరుగున్నవాళ్ళు ఇచ్చే జామీను అవసరం ఉంటుంది. ఇక్కడ నీ ఇల్లూ, వాకిలీగురించి ఎవరెరుగుదురు?' అని వాళ్ళన్నారు.

ధనసింగ్ వారి ఆదరం, సత్కారాలు ఎంత నిష్ప్రయోజనమో గ్రహించి విరాళ చెందాడు. తనిప్పుడేం చేయాలి? ఎరుగున్నవాళ్ళు కాంగడాలోనూ, ధర్మశాల లోనే వున్నారు కానీ అక్కడకు వెళ్ళేంతధైర్యం అతనికి లేదు. ఆ కష్టసమ యంలో అర్జునలాల్ జ్ఞప్తికి వచ్చాడు.

ధనసింగ్ కాన్పూరు చేరాడు. కాన్పూరులో ఆ-హి-సేన సైనికులకు గౌరవం, సత్కారం, వాళ్ళు వుండటానికి ఒక కేంపు ఏర్పాటుచేయటం జరిగింది. ధనసింగ్ అక్కడకు వెళ్ళకుండా అర్జునలాల్ జాడ తెలుసుకునేందుకు పరేడ్ దగ్గర కమ్యూనిస్టుపార్టీ కార్యాలయానికివెళ్ళి, గణేష్ని కలిశాడు. గణేష్ అర్జునలాల్ గురించి చెప్పాడు. అర్జునలాల్ కాంగ్రెసుకు సంబంధించిన కొత్త ఎన్నికలలో నిమగ్నుడై గ్రామాలలో తిరుగుతున్నాడు. ధనసింగ్ గణేష్దగ్గరకు తిరిగివచ్చి ఉద్యోగంగురించి మాట్లాడసాగాడు. సాయంకాలం గణేష్ అతనికి సినిమా చూపి స్తానని తీసుకువెళ్ళాడు.

కాన్పూరులో 'జల్తా ఘోంసలా' సినిమా ప్రదర్శింపబడుతోంది. ధనసింగ్ దీమాపూర్ కేంపులో రెండు మూడుసార్లు సైనికుల సినిమాలు చూశాడు. ఆ-హి- సేనలో వున్నప్పుడూ, తర్వాత సుమారు ఒక సంవత్సరంవరకు జైలుకాంపులో అతనికి సినిమాలుచూసే అవకాశం లభించలేదు. అతను ఎంతో హుషారుగా సినిమా చూస్తున్నాడు. తెరమీద పహాడన్ని చూడగానే అతనికి షాకు తగిలినట్లుగా అనిపించింది. సందేహంతో కళ్ళు పెద్దవిచేసి మరీ చూశాడు. తర్వాత ఇంకా పరి శీలనగా చూశాడు. ఎడమవైపున బుగ్గక్రింద దవడమీద పుట్టుమచ్చగూడా స్పష్టంగా కనిపించింది. కంఠంగూడా పూర్తిగా అదే.

సినిమాలో పహాడన్ పాడింది—'సాసురీ తేరా బేటారీ, మేరే జోబన్కో హాథ్ లగాయే.'

ఆ కంఠం సోమాదే అని స్పష్టమయింది. ప్రశాంతంగా కూర్చుని సినిమా చూడగలగడం ధనసింగ్‌కు సంభవం కాలేదు. తెరమీద గాయకుడు ఏకాంతంగా వున్నప్పుడు సహాదన్‌ని తన చేతులలోకి తీసుకుంటున్నాడు. సహాదన్ సిగ్గుపడి నవ్వుతుంది.

ధనసింగ్ తల తిరిగిపోయింది. ఒళ్ళంతా చెమట పట్టింది.

ధనసింగ్ వ్యాకులపాటుచూసి, 'ఏం జరిగింది? ఆరోగ్యం బాగాలేదా?' అనడిగాడు గణేష్.

ధనసింగ్ గట్టిగా నిట్టూర్చి, 'చాలా తలనొప్పిగావుంది' అన్నాడు.

సినిమా సగంలోవుండగానే గణేష్ అతన్ని లేపి తీసుకువచ్చేశాడు. ధనసింగ్ ఆ రాత్రి భోజనంగూడా చేయలేకపోయాడు. పార్టీ కార్యాలయానికివచ్చి చాపమీద పడుకున్నాడు.

'ఈ సినిమాలు ఎక్కడ తయారవుతాయి?' ధనసింగ్ గణేష్‌ని అడిగాడు.

'ఈ సినిమా బొంబాయిలో నిర్మించబడింది. ఎందుకు....?' గణేష్ అడిగాడు. ధనసింగ్ ఏమీ సమాధానం చెప్పకుండా మౌనంగా వుండిపోయాడు.

గణేష్ తనప్రశ్న రెట్టించేసరికి ధనసింగ్, 'బొంబాయి వెళ్ళేబండి ఎన్ని గంటలకు బయల్దేరుతుంది' అనడిగాడు.

'ఉదయం పదకొండు, పదకొండున్నరగంటలకు. ఏం, బొంబాయి వెళదామనుకుంటున్నావా? ఎందుకు?'

'ఆలోచిస్తున్నాను. బొంబాయి వెళ్ళడానికి ఎంతవుతుంది?' ధనసింగ్ అడిగాడు.

గణేష్ ఎంత ఖర్చు అవుతుందో చెప్పి, 'బొంబాయిలో మీవాళ్ళెవరైనా వున్నారా?' అనడిగాడు.

ధనసింగ్ ఏమీ మాట్లాడలేదు. గణేష్ మళ్ళీ ప్రశ్నించాడు. 'ఏమీ మాట్లాడవేం.'

'తల నొప్పిగావుంది. నిద్రవస్తోంది' అనిచెప్పి మౌనంగా వుండిపోయాడు

కానీ ఆలోచిస్తున్నారు. ఒకే రంగు, ఒకే ఆకారం గలిగిన ఇద్దరు స్త్రీలు వుండటం జరుగుతుందా? ఇదంతా చూడటానికేనా నేను హత్యలుచేసి నా జీవితాన్ని నాశనం చేసుకుంది!

ఒక నీటిబిందువు అగాధమైన ప్రవాహంలోకివచ్చి కలిసి, తనదోవ వెతుక్కోవడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా ధనసింగ్ బొంబాయి ప్రజా-సముద్రంలోకివచ్చి కలిశాడు. బొంబాయిలో అతనికి కాలుపెట్టుకునేందుకు సరిపోయేంత చోటుకూడా లేదు. ఎవరూకూడా అతన్నిగురించి పట్టించుకోలేదు. ఖాకీదుస్తులు ధరించి, పక్కచుట్టని చంకలో పెట్టుకుని, విశాలమైన భవనాలక్రింద, పెడల్పయిన రోడ్లమీద, ఎడతెంపులేని కార్లప్రవాహంలోనూ, ఫుట్‌పాత్‌మీద తోసుకునే ప్రజలలోనూ, సోమాని, పహాడన్‌ని వెతుకుతూ తిరుగుతున్నాడు.

పహాడన్‌ని ఎక్కడ వెతకాలి? ఎలా వెతకాలి? గోడలమీద సోమా నాట్యం చేస్తున్న బొమ్మలు, నవ్వుతున్న బొమ్మలు అన్నిచోట్లా అతన్ని హేళన చేస్తున్నాయి. చూడు, నేనిక్కడ వున్నాను! నేనిక్కడున్నాను! నన్ను పట్టుకో! అని వెక్కిరిస్తున్నట్లుగా వున్నాయి. టీ దుకాణాలదగ్గర అనేకచోట్ల గ్రామఫోనులలో సోమా కంఠం వినిపిస్తోంది. 'కస్ గలే డాలో బహియాఁ మోరే సైయాఁ ఇన్ విధి కరియే ప్రీతి' ఆమె అన్నివైపులనుంచి ధనసింగ్‌ని పిలిచి 'నేనిక్కడ వున్నాను, నేనిక్కడున్నాను, పట్టుకో నన్ను!' అని సవాలు చేస్తున్నట్లుగా వుంది.

ధనసింగ్ దోవలో కొంతమంది పెద్దమనుషుల్ని ఆపి 'అన్నా, పహాడన్ ఎక్కడ వుంటుంది?' అని అడిగాడు.

ధనసింగ్ ప్రశ్నకు కొందరిదగ్గరనుంచి సమాధానమే దొరకలేదు. కొందరు తమకు తెలీదంటూ చేతులు తిప్పారు. ఎంతోమంది నవ్వి హేళనచేశారు. చివరికి అతను ఖేల్‌వాడీలోవున్న సినిమాహాలుదగ్గరకు చేరుకున్నాడు. సాయంత్రం ఆట ప్రారంభం అవబోతోంది. గోడలమీద, పెద్దపెద్ద చెక్కలమీద ఓరచూపులు చూస్తున్న పహాడన్ బొమ్మలు అంటించివున్నాయి. లౌడుస్పీకర్లలో ఆమె పాటలు వినిపిస్తున్నాయి. వీళ్ళు సోమా నటించిన సినిమా చూపిస్తారు. వీళ్ళకి ఆమె వుండే చోటు తప్పకుండా తెలిసివుంటుంది అనుకున్నాడు ధనసింగ్. ఆ విషయం చాలా మందిని అడిగాడు, కొందరు నవ్వారు, కొందరు విసుక్కున్నారు.

'అరేయ్, పహారన్ ఇల్లు కనుక్కొని ఏం చేస్తావు। ఇక్కడ అయిదణాల టిక్కెట్టు కొనుక్కొని రెండుగంటలు పహారన్‌తో ఆనందించి ఇంటికి వెళ్ళు' అన్నా డొకవ్యక్తి ధనసింగ్‌తో. ఈ అవమానంతో ధనసింగ్ శరీరంలో షాకు తగిలినట్లుగా అనిపించలేదు. పెదిమలు నొక్కుకుని మెదలకుండా నిలబడి వుండి పోయాడు. అంతకన్నా ఇంకే ఉపాయం లేదు.

చివరికి ధనసింగ్‌కు ఒక మంచిమనిషి కనిపించాడు. 'పహారన్ అంధేరీలో వుంటుంది' అని చెప్పాడు. 'చర్నీరోడ్ స్టేషనునుంచి బండి పట్టుకో. నాలుగు పైసలలో అంధేరీ చేరగలుగుతావు.' అని ఆ మనిషి అతనికి అంధేరీకి వెళ్ళాల్సిన దోవగూడా చెప్పాడు.

ధనసింగ్ తన నిశ్చయాన్ని వదిలిపెట్టలేదు. స్టేషనుకు వెళ్ళేదోవ అడిగి రైలులో కూర్చున్నాడు. అది సరసరమనేవేగంతో వస్తుంది. ఆగి నిలబడకముందే వెళ్ళిపోతుందికూడా. అంధేరీదాటి వెళ్ళిపోవచ్చని అతను ప్రతి స్టేషన్‌ని పరిశీలనగా చూస్తున్నాడు. పక్కస్టేషనులోనే అయిదారుగురు యువతులు, ముగ్గురు పురుషులు మామూలు దుస్తులుధరించి తమలో తాము మాట్లాడుకుంటూవచ్చి ధనసింగ్ ఎక్కిన పెట్టెలోనే ఎక్కారు.

ధనసింగ్‌కు అందులో ఒక యువతిముఖం ఇంతకుముం దెక్కడో చూసిన ట్లనిపించింది. పరిశీలనగా చూశాడు. ముఖం చాలా మారిపోయింది. కానీ నిశ్చయంగా మనోరమే. లాలాగారి కూతురు. బాగా సన్నబడిపోయింది. ముఖంమీద అలసట, నీరసం కనిపిస్తున్నాయి. బహుశా జ్వరపడి వుండచ్చు కానీ నిరుత్సాహంగామాత్రం లేదు. ధనసింగ్ ధర్మశాలలో సోమాని వాళ్ళఇంట్లోనే వదిలి వచ్చాడు. బహుశా వీళ్ళంతా బొంబాయి వచ్చేశారేమో అనుకున్నాడు. సోమా వీళ్ళ దగ్గరే సినిమాపని చేస్తూ వుండివుండచ్చు. అతనిహృదయం దడదడ లాడింది. మనోరమతో కలిసి తను సోమాదగ్గరకు వెళ్ళచ్చు. మనోరమవైపునుంచి అతను కళ్ళు తప్పించలేదు. ఎక్కడైనా దిగిపోవచ్చు. అంధేరీలో మనోరమ మిగతా మిత్రులతోబాటు బండి దిగిపోయింది. ధనసింగ్‌గూడా దిగిపోయాడు. మనోరమని పిలవడానికి అతనికి ధైర్యం కలగలేదు. మిగతా ఆడపిల్లలతో మాట్లాడుతూ వెడు

తున్న మనోరమవెనకే అతను నడవసాగారు. ధనసింగ్ వాళ్ళవెనుకనే స్టేషను వంతెనగూడా దాటాడు. స్టేషనుకు దగ్గరగావున్న బస్తీనిదాటి వాళ్ళు ఓ బంగళా లోకి వెళ్లారు. మనోరమ లోపలకు వెళ్ళిపోయింది. ధనసింగ్ బంగళా వసారా అరుగుక్రింద నిలబడి నాలుగువైపులా సోమాకోసం వెతుకుతూ వుండిపోయాడు. ఎవరూ అతన్ని అడ్డగించలేదు, కానీ సోమా ఎక్కడా అతనికి కనిపించలేదు.

ధనసింగ్ వసారాలో ఒక వ్యక్తినిచూసి పిలిచాడు, 'కొంచం సోమాని పంపించండి' అన్నాడు.

'ఏ సోమా ?' ఆ వ్యక్తి ఆశ్చర్యంగా అడిగారు.

'సోమా, పహాడన్.'

'పహాడన్ ? ఇక్కడ పహాడన్ లేదు, అటు రెండోవైపుకి వెళ్ళు' అని ఆ వ్యక్తి లోపలకు వెళ్ళిపోబోతూవుండగా ధనసింగ్ మళ్ళీ పిలిచాడు, 'మనోరమ అక్కగారిని పిలు !' అన్నాడు.

'మనోరమనా.... నీ పేరేమని చెప్పను ?'

ధనసింగ్ జంకుతూ తనపేరు చెప్పాడు.

మనోరమ వచ్చింది. గాభరాపడినట్లుగా వుంది. విశ్లేషణాలయింది ! బాగా పరిశీలనగా ధనసింగ్‌వైపుచూసి గుర్తు పట్టింది. కానీ ఏమీ మాట్లాడలేకపోతోంది.

ధనసింగ్ నెమ్మదిగా అనుమానంగా 'సోమా....' అన్నాడు.

మనోరమ చేత్తో సౌంజ్ఞచేసి అతన్ని లోపలికి తీసుకువెళ్ళింది. గచ్చుమీద పరచిన జంపఖానామీద ధనసింగ్‌ని కూర్చోబెట్టి, అతనికి దగ్గరగా కూర్చుంది. 'నువ్వు ఇప్పటిదాకా ఎక్కడున్నావు ?' అనడిగింది.

ధనసింగ్ విస్పంకోచంగా క్లుప్తంగా అంతాచెప్పి, 'సోమా ఎక్కడుంది ?' అని మళ్ళీ అడిగారు.

మనోరమ అతనిప్రశ్నకు సమాధానం చెప్పకుండా 'కొండప్రాంతం వెళ్ళావా ?' అని అడిగింది.

ధనసింగ్ తలతిప్పి వెళ్ళలేదని చెప్పాడు.

'లాహోర్ వెళ్లావా?'

ధనసింగ్ తలతిప్పి వెళ్ళలేదని చెప్పాడు.

మనోరమ ఆలోచించి 'సినిమాచూసి ఆమెకాడ కవిపెట్టావా?' అంది.

'అవును....ఆమెకు కొంచం తెలియపరచండి' ధనసింగ్ ధైర్యంగా గాలి పీల్చాడు.

మనోరమ అతనడిగినప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా, 'విను ధనసింగ్, అప్పటినుంచి చాలావిషయాలు జరిగాయి. నేనిప్పుడు కమ్యూనిస్టుపార్టీలో ఒక పత్రికలో పని చేస్తున్నాను. నేను లాహోర్ వెళ్ళి చాలాకాలమయింది. అక్కడి విషయాలేమీ నాకు తెలీదు' అని చెప్పింది. ధనసింగ్‌కు ఈ మాటలన్నీ అనవసరం అని ఆమెకు తెలుసు.

'సోమా లాహోర్‌లో మాదగ్గరే వుండేది. ఇప్పుడు ఇక్కడే బొంబాయిలో వుంది. కామ్రేడ్ భూషణ్‌ని ఎరుగుదువుకదా. నిన్ను ఆయనే ధర్మశాల తీసుకు వచ్చారు.'

'అవునండి.'

భూషణ్ ఇప్పుడు ఇక్కడే వున్నారు. సోమా ఇల్లు బహుశా ఆయనకు తెలిసివుండవచ్చు. ఈరోజు ఇక్కడ వుండు. రేపు నిన్ను ఆయనదగ్గరకు తీసుక వెడతాను. నువ్వు భోజనం చేశావా?'

ధనసింగ్ తినలేదని తలతిప్పాడు.

'వుండు' అని మనోరమ లోపలికి వెళ్ళిపోయింది. తిరిగివచ్చి ధనసింగ్‌ని లోపలికి తీసుకువెళ్ళింది. చాలామంది మగవాళ్లు, ఆడవాళ్ళు చాపలమీదకూర్చుని భోజనం చేస్తున్నారు. ధనసింగ్‌ను వాళ్ళతోబాటు కూర్చోబెట్టింది.

మనోరమ ధనసింగ్ పడుకోవటానికి ఒక జంపఖానా, దుప్పటి ఇచ్చింది. రోజంతా అలసిపోయివున్న ధనసింగ్ వసారాలో పడుకోగానే నిద్రపోయాడు. మనోరమ మిగతా ఆడవాళ్లతోబాటు లోపల పడుకుంది. గదిలో దీపం ఆర్పేసిన తర్వాతగూడా తన దోమతెరలోపల చాలాసేపటివరకూ కళ్ళు తెరుచుకునే పడుకుంది.

మనోరమ మరునటిరోజు ధనసింగ్‌ని వెంటబెట్టుకుని పార్టీ కార్యాలయంలో భూషణ్ దగ్గరకు వెళ్ళింది. సోమాకోసం ధనసింగ్‌పడే తీవ్రమైన ఆవేదన స్పష్టంగా కనిపిస్తోంది. ఇద్దరూ బాధపడుతూనే వున్నారు. కానీ ఏం చేయగలరు?

భూషణ్, మనోరమా ఇద్దరూ ఇంగ్లీషులో మాట్లాడుకున్నారు. ధనసింగ్ అనుమానంగా కాస్సేపు ఒకళ్ళవైపు, కాస్సేపు ఇంకొకళ్ళవైపూ చూస్తూ వుండి పోయాడు. ధనసింగ్‌ని సోమాదగ్గరకు తీసుకువెళ్ళటం మంచిదికాదని ఇద్దరి అభిప్రాయమూ. కానీ అతనికోరిక నిరాకరించడానికి వాళ్ల మనసు ఒప్పుకోవడం లేదు. ధనసింగ్‌తో ఏం చెబుతారు? 'ఆమె నన్నుచూసి స్పృహతప్పిపోయింది కదా. ఇతన్నిచూస్తే ఆమె పరిస్థితి ఏమవుతుంది?' అన్నది మనోరమ భూషణ్‌తో.

భూషణ్ ధనసింగ్‌కు తెలియజెప్పాడు—'నువ్వు ఆమెను వదిలిపెట్టి వెళ్ళి పోయేసరికి ఆమెకు ఏమీ ఆధారంలేకుండాపోయింది. వాళ్ళేమో ఆమెను అపకీర్తి పాలుచేసి ఇంట్లోంచి వెళ్ళగొట్టేశారు. నీకు తెలుసు, యౌవనంలోవున్న స్త్రీకి ఎవరి ఆధారం లేకపోతే ప్రపంచం ఆమెవెనుక పడుతుంది. నువ్వు వున్నప్పుడే ఆమెను చాలామంది బాధపెడుతూ వుండేవాళ్ళు. నువ్వు వెళ్ళిపోయినతర్వాత ఆమె పరిస్థితి ఎలా అయివుంటుంది? తిండి-బట్టకోసం ఇబ్బందిపడింది. వుండటానికి చోటులేదు, అందరిచేత ఎదురుదెబ్బలు తింటూవుండేది. ప్రతివాడిచేతిలోకి అమ్ముడు పోతూవుండేది. ఆమె ఇప్పుడు ఈపని చేసింది. ఆమెకు ఇప్పుడు చాలా పేరుంది. ఒక లక్షాధికారితో ఆమెపెళ్ళి జరగబోతోందని విన్నాను. ఆలోచించు. నువ్వు వెడితే ఆమెపరిస్థితి ఏమవుతుంది? ఆ అమాయకురాలు ఇప్పుడు ఏం చెయ్యగలుగుతుంది? ఆమెకు నీగురించి ఏమీ తెలియలేదు. ఆమెకు కొంచం ఆశ కలిగించడానికి నువ్వు కనీసం ఒక్క ఉత్తరంగూడా ఎప్పుడూ వ్రాయలేదు. ఆమె ఏం చేస్తుంది? ఆమె దేమన్నా దోషముందని చెప్పగలమా?' అన్నాడు భూషణ్.

ధనసింగ్ కళ్ళు ఎర్రబడ్డాయి—'ఆమె వుండేదెక్కడో మీరు నాకు చెప్పండి, నేనొక్కసారి ఆమెదగ్గరకు వెడతాను. ఆమెను ఒకసారి తప్పకుండా కలుసుకుంటాను.'

'లాభమేముంది? నీకు బాధగా వుంటుంది, ఆమెకు బాధ అనిపిస్తుంది. ఆమె దిగులుతో విషం తీసుకుంటుంది, నువ్వు ఇలాగే జరగాలని కోరుకుంటున్నావా?'

ధనసింగ్ ఎంతో తత్తరపాటు పడ్డాడు. 'మీకు తెలుసు. నేనామెకోసం ఏమి చెయ్యలేమా? ఉద్యోగంమంచి వెళ్ళిపోయాను. జైలులో గడిపాను. హత్య చేశాను. మళ్ళీ జైలుజీవితం గడిపాను. అర్థమైన గడ్డి తిన్నాను. మళ్ళీ జైల్లో పడ్డాను. ఆమె నాకు ఏం జవాబు చెపుతుందో చూస్తాను!'

మనోరమ భూషణ్‌కు ఇంగ్లీషులో ఏదో చెప్పింది—'ఈ మనిషి ఇప్పుడు కూడా ఆమెను ఎంత ప్రేమిస్తున్నాడు! ఒకరోజున సోమాకూడా ఇతనికోసం ప్రాణాలివ్వడానికి సిద్ధపడేది. వేరేగత్యంతరంలేక ఆమె ఇదంతాచేస్తూ వుండివుండవచ్చు. ఆమెమనసులో ఇతనిమీద ప్రేమ ఇంకా మిగిలివుంటే ఇతనికోసం అన్నీ వదిలిపెట్టగలుగుతుంది. ఇతను మళ్ళీ కొరకటం సోమా అన్నింటికన్నా గొప్ప సౌభాగ్యమని తలచగలుగుతుంది. నువ్వు వీళ్ళమార్గంలో అడ్డుగా ఎందుకు నిలబడు తున్నావ్?' మనోరమ గుక్క తిప్పుకోకుండా చెప్పేసింది.

భూషణ్ పెదవులకొరికి విరసనభావంతో తల ఊపారు.

'చివరికి ఈ మనిషికి నువ్వు ఇంత ఘోరమైన అన్యాయం ఎందుకు చేస్తున్నావు? ఇతనికి ఒక అవకాశం ఇవ్వు!' అన్నది మనోరమ బాధపడుతూ పట్టుదలగా.

భూషణ్ మనోరమచూపుల్ని తప్పించుకుని, 'చివరకు జరిగేఫలితానికి నువ్వు బాధ్యత వహిస్తావా?' అన్నాడు.

'అలాగే' మనోరమ అంగీకరించింది. 'కానీ నేను చెప్పేది. నువ్వు ఇతనితోబాటు వెళ్ళు. ఏదైనా జరిగితే నువ్వు పరిస్థితి సరిదిద్దగలుగుతావు. నువ్వే 1941వ సం॥ లో వీళ్ళని కలిపావు.'

భూషణ్‌కు ఇష్టం లేకపోయినాకూడా మధ్యాహ్నం రెండుగంటలతర్వాత ధనసింగ్‌ని తీసుకుని అంధేరీ వెళ్లాడు.

• • •

మతలీవాలా పహారన్‌ని లేపుకుపోవడానికి ప్రయత్నం చేస్తున్నారని, ఆజాద్ హింద్ సేనకు సంబంధించిన తన పహారాజవాన్లతోచెప్పి తనని కొట్టించడానికి పన్నాగం పన్నుతున్నాడని, బరకత్‌కి అనుమానంగా వుంది. అంచేత

బరకత్ అమీన్‌ని పిలిచి అంధేరీలోని బంగళాలో తనతోబాటు వుండేలా ఏర్పాటు చేశాడు. తనకి విషం పెట్టకుండా వుండటానికి వహీదన్ ఇంట్లో భోజనం చేయటం గూడా మానేశాడు. బరకత్‌గాని, అమీన్‌గాని, ఎవరో ఒకళ్ళు ఎప్పుడూ ఇల్లు కాపలా కాస్తున్నారు.

అమీన్ జాగ్రత్తకోసం, వసారాలో ఒకమూల మంచంమీద కూర్చుని వున్నాడు. సైనికులదుస్తులలో ఒకవ్యక్తి, మామూలు ఖద్దరుదుస్తులలో ఒకవ్యక్తి బంగళాలోపలికి వస్తుండగాచూసి ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

భూషణ్ అమీన్‌ని పిలిచి, 'తమ్ముడూ, మిస్ వహీదన్‌ని కలుసుకోవాలి' అనడిగాడు.

'వచ్చావులే పెద్ద గొప్పవాడివి కలుసుకోవటానికి. జాగ్రత్త. వెనక్కితిరిగి వెళ్ళిపో!' అని హెచ్చరించాడు అమీన్.

ఒక అనాగరికుడైన మనిషి భూషణ్‌ని అమర్యాద చేయడంచూసి ధనసింగ్ ముందుకువెళ్ళి 'నోరు జాగ్రత్తగా పెట్టుకుని మాట్లాడు!' అని గద్దించి వసారా ఎక్కాడు.

అమీన్ దగ్గరే పడేసివున్న కర్రతీసుకుని మంచంమీదనుంచిలేచి నిలబడ్డాడు. 'బరకత్, తొందరగా రా!' అని పిలిచాడు. ముందుకువచ్చి తన చేతిలోనికర్రని ధనసింగ్ వక్షస్థలంమీదపెట్టి తోసి, 'వెనక్కి తప్పుకో!' అన్నాడు.

ధనసింగ్ ఒకచేత్తో కర్రలాక్కుని, రెండోచేత్తో కోపంగా అతని కణత మీద గట్టిగా కొట్టాడు. అమీన్ శరీరం తిరిగి, కాళ్లు తడబడ్డాయి. ఆ దెబ్బతో కుప్పలా కూలిపోయాడు. తల గచ్చుకి తగలడంతో 'చంపేశాడు, చంపేశాడు!' అని బిగ్గరగా అరిచాడు.

భూషణ్ రెండు మూడడుగులు వెనకాల వున్నాడు. అతను ధనసింగ్, అమీన్‌లను కాపాడడానికి ముందుకు దూకగానే ఎడమవైపునుంచి బరకత్ బయటకు వచ్చాడు. తన మిత్రుణ్ణి కొట్టిపడేయటంచూసి అతను తన లుంగీలోంచి ఒక పిడికత్తి బయటకుతీసి ధనసింగ్‌మీద విరుచుకుపడ్డాడు. ధనసింగ్ అతనిచేతిని

ఆపడానికి గచ్చుమీద జారాడు. బరకత్ ధనసింగ్‌మీద కత్తితో దెబ్బతీశాడు. భూషణ్ మధ్యలో రావడంవల్ల ఆ కత్తి భూషణ్ భుజానికి తగిలింది.

ధనసింగ్ తప్పించుకుని లేచినిలబడి కర్రతీసుకుని బరకత్‌మీదకు దూకాడు కానీ భూషణ్ భుజంనుంచి రక్తం కారుతుండగాచూసి పట్టుబడిపోతానేమోనని భయపడి బరకత్ పారిపోయాడు.

ధనసింగ్ భూషణ్‌కు సహాయం చేయడంకోసం ఒంగాడు. కత్తి గుండెకు పైభాగాన భుజంమీద నాలుగు అంగుళాలలోతుకు దిగబడింది. చాలారక్తం కారి పోయింది. సహాదన్ దాది పోట్లాటవిని బయటకు వచ్చింది. రక్తంచూసి ఆమె బిగ్గరగా అరిచింది. దాది కేకలువిని సహాదన్ బయటకువచ్చింది. ఒకవ్యక్తిని పైపికదుస్తులలో చూసి, ఇంకొకవ్యక్తి రక్తంలోపడి తన్నుకోవడంచూసి ఆమె రంగు మారిపోయింది.

ధనసింగ్ భూషణ్ గాయంమీద చేతినిపెట్టి రక్తం ఆపడానికి ప్రయత్నం చేస్తున్నాడు. రక్తం బాగాకారి ప్రవహించడంచేత భూషణ్ తల తిరిగిపోతోంది. అతను స్తంభాన్ని ఆధారంగా చేసుకుని కూర్చున్నాడు.

భూషణ్ సహాదన్ కంగారుచూసి, 'సోమా, కంగారుపడకు, నువ్వు గుర్తు పట్టలేదా?.... నేను భూషణ్‌ని, ఇతను ధనసింగ్' అన్నాడు.

సహాదన్ ఆధారంకోసం రెండుచేతులతోనూ తలుపును గట్టిగా పట్టుకుంది. ఊపిరి వేగంగా పీల్చడంవల్ల హృదయం వేగంగా కొట్టుకుంటోంది.

లోపలిగదిలో టెలిఫోను మ్రోగుతున్నధ్వని వినిపించింది. గంటమ్రోగటం ఆగిపోయినతర్వాత, దాది సహాదన్‌ని పిలిచి, 'అమ్మగారూ, అయ్యగారు పిలుస్తున్నారు' అంది.

సహాదన్ కంగారువల్ల స్తబ్దురాలై వుండటంచూసి దాది ఫోనులో 'అయ్యగారూ, బరకత్ బంగళాదగ్గర ఎవర్నో హత్యచేసి పారిపోయాడు. అమ్మగారు చాలా కంగారుపడుతున్నారు' అని చెప్పింది.

'ఇతను ధనసింగ్, సోమా!' భూషణ్ బాధగా వున్నప్పటికీ నవ్వడానికి ప్రయత్నించాడు.

ధనసింగ్ కళ్ళు బాగా పెద్దవిచేసి సోమావైపు చూస్తున్నాడు.

సోమాచూపు నేలమీద వుంది. ఆమెహృదయం ఇంకా వేగంగా కొట్టుకుంటోంది. తలుపును ఇంకా గట్టిగా పట్టుకుంది.

'గుర్తు పట్టలేదా సోమా?' భూషణ్ మళ్ళీ అడిగాడు.

సోమా భూషణ్‌వైపు తిరిగి, 'మీరు నా వెనక ఎందుకు వచ్చారు? నేను సోమాని కాదు! నేను సోమాని కాదు!' అంది. ఆమెకళ్ళు ఎర్రబడ్డాయి. బుగ్గల మీదకు రెండు కన్నీటిబొట్లు జారాయి.

'అవును, నిజం చెప్తున్నావు. నువ్వు సోమావి కాదు!' భూషణ్ స్వరంలో బాధ నిండివుంది.

పహాడన్ లోపలికి వెళ్ళడానికి వెనక్కి తిరిగింది.

'మిస్ పహాడన్!' భూషణ్ మళ్ళీ పిలిచాడు. 'ఈ దుర్ఘటన నీ ఇంటిదగ్గర జరిగింది. నువ్వు అనవసరంగా కష్టాల్లో పడతావు. నువ్వు కారు ఇచ్చేటట్లయితే ఈ మనిషి నన్ను హాస్పిటల్‌కు చేరుస్తాడు' అన్నాడు.

'కారు తీసుకువెళ్ళండి' అనిచెప్పి పహాడన్ గోడని ఆధారంగా తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

ధనసింగ్ దాదిని, 'కారు ఎక్కడుంది?' అనడిగాడు.

దాది డ్రైవర్ని కారు తీసుకురావడంకోసం పిలిచింది.

ధనసింగ్ భూషణ్‌ని పట్టుకుని కారుకోసం ఎదురుచూస్తూ నిలబడివున్నాడు. అదేసమయంలో ఒక పెద్ద నల్లరంగుకారు బంగళాలోకి వచ్చింది.

మకలీవాలా కారుదిగి వెంటనే ఆ సంఘటన జరిగినవైపుచూసి లోపలికి వెళ్ళిపోయాడు. అతను ముందు ఆయాతో మాట్లాడాడు. పహాడన్‌ని అంతా వివరంగా అడిగాడు. పాంటుజేబుల్లో చేతులుపెట్టుకుని ఆలోచిస్తూ కాస్సేపు ఇటూ అటూ తిరిగాడు. పహాడన్ కారు ఇవ్వడని దాదిని మందలించాడు. పోలీసులకు ఫోనుచేసి, 'మిస్ పహాడన్ ఇంటిదగ్గర గూండాలమధ్య కొట్లాట జరిగింది. కత్తి దెబ్బతగిలి ఒకవ్యక్తి గాయపడ్డాడు. దయచేసి తొందరగా రండి' అని చెప్పాడు.

కొద్దినిముషాలలో పోలీసులు వచ్చారు. ఇనస్పెక్టరు దాదిని అడిగి అన్ని విషయాలు వివరంగా వ్రాసుకున్నారు. పహాదన్‌నికూడా అడిగి వివరాలు తీసుకున్నారు. సుతలీవాలా ఇనస్పెక్టరుకు అన్నివిషయాలు ఇంగ్లీషులో తెలియ చెప్పాడు.

భూషణ్ ఇంగ్లీషులోనే అతనిమాటల్ని ఖండించి 'ఇదంతా వట్టిది, అబద్ధం' అన్నాడు.

'నేను మీనుంచిగూడా వాఙ్మూలం తీసుకుంటాను. వుంతండి' అన్నాడు ఇనస్పెక్టర్ అమనయంగా.

పోలీసులు భూషణ్‌ని కారులో హాస్పిటల్‌కు చేర్చారు. ధనసింగ్‌ని కస్టడిలోకి తీసుకున్నారు.

మనోరమ, ఇతరులు ఫోనుద్వారా విషయం తెలుసుకుని హాస్పిటల్‌కు చేరారు. దెబ్బ తగిలినతర్వాత రక్తం చాలాసేపటివరకూ కారుతూవుండటంచేత భూషణ్ పరిస్థితి అంతబాగా లేదన్నారు డాక్టర్లు. మనోరమ తన ఇద్దరు స్నేహితులతో భూషణ్ మంచానికిదగ్గరగా కూర్చునివుంది. భూషణ్ స్పృహకోల్పోయి మాటిమాటికి 'నేను ముందే చెప్పాను' అంటున్నాడు. అతనిమాటలు మిగతావాళ్ళకేమీ అర్థం కావటంలేదు కానీ మనోరమకు గుర్తుంది. 'చివరికి జరిగేఫలితానికి నువ్వు బాధ్యురాలి వవుతావు' అని చెప్పాడు భూషణ్.

డాక్టర్లు భూషణ్‌శరీరంలో రక్తం ఎక్కించాలన్నారు. కామ్రేడ్, మనోరమ తమర క్తాన్ని ఇవ్వడానికి సిద్ధమయ్యారు. డాక్టరు ఒక మిత్రునినుంచి రక్తం తీసుకున్నాడు. కానీ రక్తం శరీరంలో ఎక్కించకముందే, హటాత్తుగా అతని పరిస్థితి విషమించింది. డాక్టర్లు రక్తం ఎక్కించడం అనవసరం అనుకున్నారు. కానీ మిత్రులబలవంతంతో రక్తం ఎక్కించారు.

పార్టీమంత్రి జోషీ, టీ. టీ. ఈ విషయంతెలుసుకుని కార్యాలయంనుంచి హాస్పిటల్‌కు వచ్చారు. ఈ సంఘటన జరగడానికి కారణాన్ని, మనోరమని అడిగి తెలుసుకుందామనుకున్నారు కానీ మనోరమ మాట్లాడేస్థితిలో లేదు.

భూషణ్‌కు ఆక్సిజన్‌గాస్ ఎక్కిస్తున్నారు. కమ్యూనిస్టులపట్ల సానుభూతి

వున్న ఒక డాక్టరు భూషణ్ నాడి చూస్తున్నాడు. ఆయన భూషణ్ చేతిని మంచం మీదపెట్టి తలవంచుకుని 'అయిపోయింది!' అని నెమ్మదిగా అన్నారు.

మనోరమ భూషణ్ మంచానికి కాళ్ళవైపు కూర్చునివుంది. లేచి వార్డు వసారావైపు పరుగెత్తింది. వార్డు రెండవఅంతస్థులో వుంది. జోషీ ఆమెకన్నా వేగంగా పరుగెత్తి కటకటాలవైపు వెడుతూవున్న మనోరమ చెయ్యిపట్టుకుని వెనక్కులాగారు. 'ఇంతకన్నా పెద్దపనులు చేయడంకోసం నువ్వు బతికివుండాలి' అన్నారు జోషీ.

మనోరమ స్పృహతప్పి పడిపోయింది.

స్పృహ వచ్చినతర్వాత ఆమె ధనసింగ్‌గురించి ఆలోచించసాగింది. పార్టీ ప్లీడరుద్వారా జామీనుమీద ధనసింగ్‌ను విడిపించడానికి ప్రయత్నంచేసింది. భూషణ్ మీద ఏవిధమైన ఆరోపణ వుండకుండా ధనసింగ్ జరిగినదంతా వున్న దున్నట్లుగా చెప్పేశాడు అని ప్లీడర్లకు పోలీసులద్వారా తెలిసింది. బొంబాయి పోలీసులు బరకత్‌ని వెతుకుతున్నారు. ధనసింగ్ అయిదుసంవత్సరాలక్రిందట పంజాబు ధర్మశాలలో హత్యచేసిన అపరాధం అంగీకరించినకారణంగా ఖైదుచేయబడ్డాడు.

మానసికస్థితి, శారీరకస్థితి బాగుండనందుకు, మనోరమను పార్టీ క్వార్టర్‌లో ఒకగదిలో మంచంమీద పడుకోబెట్టారు. ఆమెకు సేవచేసేభారం సుమతి తీసుకుంది. పార్టీడాక్టరు ఆమెకు మాటిమాటికి మందులు ఇస్తున్నాడు. ఆరోగ్యం కుదుటపడిన మీదట, ఆమెను కలుసుకుని ఈ సంఘటనగురించిన పూర్తివివరాలు తెలుసుకోవాలనుకుంటున్నారని మంత్రిగారు కబురుపెట్టారు.

మనోరమ ఎలాగో అలాగా వీలుచేసుకుని భూషణ్‌ని ధనసింగ్‌తోబాటు పహాడన్‌దగ్గరకు పంపడం, పహాడన్, ధనసింగ్‌ల పూర్వకథకూడా, పార్టీ మంత్రిగారికి తెలియపరచింది. మనోరమఎదుట ఎవరూ ఏమీ అనేవారుకాదు కానీ, వసారాలో వాళ్ళమాటలు ఆమెచెవిన పడ్డాయి. 'పార్టీనాయకులు చాలా దుఃఖిస్తున్నారు. పార్టీకి సంబంధించిన భూషణ్‌వంటి బాధ్యతాయుతమైనవ్యక్తి పార్టీని సంప్రదించకుండా ఇటువంటిపనిలో చిక్కుకోవడం ఉచితంకాదు. పార్టీవిరోధులు పార్టీ మెంబరు జీవితానికి సంబంధించిన ఎటువంటి సంఘటననైనా ఉపయోగించి పార్టీమీద

కళంకం ఆపాదించే అవకాశాన్ని వదులుకోరు. నవంబరునెలలో పార్టీ వి కార్యాలయంమీద దాడి జరిగినప్పటినుంచి కమ్యూనిస్టువిరోధుల పత్రికలలో ఎటువంటి విషయాలు రాయలేదూ! ఒక మెంబరుకు సంబంధించిన నడవడి పార్టీ అంతటిమీదా ప్రకాశితమైయుంటుంది.' అలాంటి మాటలువిని మనోరమ మౌనంగా వుండి పోయేది.

ఉదయం దినపత్రికలని వివిధభాగాలకు పంపేపని భోంసలే చేసేవారు. భోంసలే మనోరమకు సానుభూతి తెల్పడంకోసం ఓ పత్రికని అందరికన్నాముందు ఆమెకి ఇచ్చారు. కమ్యూనిస్టు విరోధులపత్రిక, మొదటిపేజీలో ఇలా ఒకవార్త వుంది——

'ప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు, కామ్రేడ్ భూషణ్ ఒక గూండాతో పోట్లాడి గాయపడి ఆస్పత్రిలో వున్నాడు.'

మాకు అందిన సమాచారాన్నిబట్టి యాక్ట్రెస్ మిస్ పహాడన్‌కోసం స్థానీయ గూండాలు, కామ్రేడ్ భూషణ్‌లమధ్య చాలాకాలంనుంచి పోట్లాట జరుగుతోంది. కామ్రేడ్ భూషణ్ తనమిత్రుడు ఓ గూండాని పంజాబునుంచి పిలిపించి స్థానీయ గూండాలమీద దాడి జరిపారు. స్వయంగా గాయపడ్డారు. ప్రొడ్యూసర్ శ్రీ సుఖలీవాలా ఈ సంఘటననుగురించి తెలుసుకుని పోలీసులను పిలవడంలోనూ, పరిస్థితిని పరిదిద్దటంలోనూ చాలా చాకచక్యాన్ని, ధైర్యాన్ని ప్రదర్శించారు. భూషణ్ ఆస్పత్రిలో వున్నాడు. స్థానీయగూండాలు పారిపోయారు. భూషణ్ మిత్రుడు ఖైదు అయాడు. కమ్యూనిస్టులు భూషణ్ మిత్రుని జామీనుమీద విడిపించుదామనుకున్నారు కానీ జామీను అంగీకరింపబడలేదు.' ఆ వార్త చదివినతర్వాత పత్రిక మనోరమ చేతినుంచి క్రింద పడిపోయింది.

సుమతి వచ్చిచూ సే మనోరమ స్పృహతప్పి పడివుంది. వెంటనే డాక్టర్ని పిలిచింది. క్రింద పత్రికచూసి, మనోరమ స్పృహతప్పి పడిపోవడానికి గల కారణం తెలుసుకున్నారు. గంటన్నరతర్వాత మనోరమ కళ్ళు తెరిచింది. మొదటి మాట ఆమెచెవిలో పడింది, బయట వసారాలో భోంసలేని ఎవరో కోప్పడుతున్నారు.

'నువ్వు ఆమెకు పత్రిక ఎందుకిచ్చావు ?'

'మనతోటి పనిచేసే ఆమె జ్వరపడివుంది. ఆమె మనసుకు తేలిక కలిగించడంకోసం పత్రిక ఇచ్చాను.' అన్నాడు భోంసలే భయపడుతూ.

మనోరమ మళ్ళీ తెలివితప్పి పడిపోయింది. డాక్టరు ఆదుర్దాగా వున్నాడు. ఆమెకు స్పృహ ఎప్పుడు వస్తుంది ? అసలు వస్తుందో రాదో ? జ్వరపడివున్నప్పుడు మనసుకు తగిలేగాయం చాలా ప్రమాదకరమైనదిగా పరిణమిస్తుంది.

